అంఆ

# అమ్మ సచ్చరిత్ర

ద్వితీయ భాగం



అమ్మ, జిల్లెళ్ళమూడి.

ఎ. కుసుమా చక్రవర్తి, ఎమ్.ఎ.,బి.ఇడి.
ఆంధ్రా యూనివర్శిటీ హైస్కూల్, విశాఖపట్టణం.




# AMMA SACHARITRA

జిల్లెళ్ళమూడి నాశ్రితుల సేవలు గైకొనుచుం బ్రశాంతి సం
ధిల్ల గఁజేయ లోకమున దివ్య శుభాకృతిఁ దాల్చినీవు రం
జిల్లుచునుండ, రూపగుణ చేష్టలు లింగము లేకయే విరా
జిల్లును బ్రహ్మమంచును వచించెదరేటికో! పండితోత్తముల్.

ఆచార్య దివాకర్ల వేంకటావధాని

Writer

AYYAGARI KUSUMA CHAKRAVARTHY

VISAKHAPATNAM

ప్రథమముద్రణ

వేయిప్రతులు

2001 జూన్ 12

అమ్మ ఆరాధనోత్సవం, జిల్లెళ్ళమూడి



వెల రూ॥ 100/-

ప్రతులకు

ఎ.ఎస్. చక్రవర్తి

అశోక్ హౌస్,

4-45-1, పెదవాల్తేరు

విశాఖపట్నం - 530 017

ఫోన్ : 0891 - 530346

కవర్‌పేజి

గణేష్ గ్రాఫిక్సు, గుంటూరు, ఫోన్ : 0863-321573.

D.T.P. & Text Printing :

సత్యం ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్,

46-18-10, మండావారిపేట,

దొండపర్తి, విశాఖపట్నం - 16.

ఫోన్ : 0891 - 735878, 745925.



శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్,

విశ్వగురు పీఠాధిపతులు - గుంటూరు

## దివ్యాశీస్సులు

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్,
విశ్వగురు పీఠాధిపతులు - గుంటూరు

సృష్టికి మూలమైన శక్తి అమ్మ. త్రిమూర్తులను సైతం పసిపిల్లలను చేసి ఆడించింది అనసూయా మాత. ముగ్గురమ్మలకు పతిబిక్ష పెట్టింది ఆమే. అమ్మ అన్నపదంలోనే తీయదనం ఉన్నది. భగవంతుడు లేడనేవారు ఉండవచ్చు కానీ అమ్మ లేదనేవారు ఉండరు, ఉండలేరు. అమ్మ అనురాగ స్పందనలో అనురాగ వార్ధిలో తడిసిపోని వారు ఉండరు. అనంత తేజో విరాజితమైన అమ్మ పెట్టే అమృతపు ముద్దలు ఆరగించిన ఎవ్వరైనా ఆనందపు లోతులను, జ్ఞానరోచిస్సులను చూడకుండా ఉండరు. "నేను నేనైన నేను" "అన్ని నేనులు నేనైన నేను" అనగల శక్తి అనుభవ వేదాంతం పలికే అమ్మకు, విశ్వజననికి మాత్రమే ఉంటుంది. అందుకే అమ్మ విశ్వజనీనమైన, విశ్వజనీన భావనను, విశ్వ ప్రేమను పంచిపెట్టింది.

మానవ రూపంలో అవతరించిన ఒక అఖండ దివ్య తేజస్సు అమ్మ. విశ్వజనని తప్ప తన ఇంటికి 'అందరిల్లు' అని పేరు ఎవరుంచగలరు. తాను తినకపోయినా ఇతరులకు కడుపునిండా తృప్తిగా ఇంకెవరు పెట్టగలరు? అందరినీ తను కని ఇతర తల్లులకు పెంపుడిచ్చానని ఎవరు చెప్పగలరు? అలాంటి జగజ్జనని యొక్క చరిత్ర 'అమ్మ సచ్చరిత్ర' గా రావటం నిజంగా ఆనందింపదగిన విషయం. రచయిత కుసుమ ధన్యురాలు. మహనీయుల జీవిత చరిత్రలు జగతికి మార్గదర్శకాలు. ఇలాంటి రచనలు ఎన్నో రావాలి. సమాజాన్ని రాగ రంజితం చేయాలి.

చిరంజీవి కుసుమ అమ్మను గురించిన గ్రంధాలు చాలా ప్రచురించింది. ఆమె రచించిన దివ్యానుభూతులు, మధురస్మృతులు, అనసూయా వ్రతకల్పం వంటి గ్రంధాలు అమ్మ బిడ్డలకు హృదయ స్పందన కలిగించాయనడం సత్యం.

ఇంతకు ముందే 'అమ్మ సచ్చరిత్ర' ప్రథమభాగం వచ్చింది. ఇది ద్వితీయ భాగం. ఈవిధంగా ఎన్ని భాగాలు ప్రచురింపబడతవో? అమ్మ అనుగ్రహం, కరుణ కుసుమపైన ఇంకా ప్రసరించాలని కోరుతూ దివ్యాశీస్సులు అందచేస్తున్నాను.

ఓం తత్సత్

## ○ అమ్మ వద్ద కుసుమ స్థానం కుసుమదే ○

పురుషోత్తమ పుత్ర భార్గవ పి.ఎస్.ఆర్. ఆంజనేయప్రసాద్

"ఈ అవతారం చుట్టూ మీరు, మీకోసం ఈ అవతారం. నా ఒడి విడిచి ఎవరూ లేరు - నా దగ్గర ఎవరి స్థానం వారిదే - తరిగేది పెరిగేది లేదు - ఒకరు వచ్చి ఇంకొకరిది తీయలేరు - నాది అనాది కనుక నా ఆది అందదు" అన్నారు అమ్మ.

అర్కపురికి అపరవ్యాసుడు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు "అమ్మ చరిత్ర వ్రాయటం అంటే బాపట్లలో ఇసుక పాతర తవ్వటమే" అన్నారు. బాపట్లలో ఇసుక ఎంత త్రవ్వినా వస్తూనే ఉంటుంది. అలాగే అమ్మ చరిత్ర ఒక మహోదధి. అందులో లేచే ఏ తరంగాన్నని పట్టుకోగలం. ఒక తరంగాన్ని పట్టుకొంటుండగానే మరెన్నో తరంగాలను మన మీదుగా మనల్ని మించి వెల్తుంటాయి. మన కంటికి కనిపించని ఎన్నో తరంగాలుంటాయి. ఆ మహోదధిలో కొన్ని జల బిందువులను మనకందిన చెంబుతో మనం తీసుకోగలం. ఎవరైనా చేయగలిగింది, చేస్తున్నది అదే.

సోదరి కుసుమా చక్రవర్తి కూడా ఆ పనే చేసింది. చేస్తున్నది. అయితే అభినందించదగిన విషయమేమిటంటే వ్రాయసకారులు కారణమేదైనా చేతులు ముడుచుకు కూర్చున్న రోజుల్లో అమ్మ కుసుమను అనుగ్రహించిన ప్రేరణ విశిష్టమైనది. కుసుమ మాతృశ్రీలో వ్యాసాలు వ్రాసే రోజుల్లో ఇంతటి ఉద్గ్రంధాలు వ్రాస్తుందనుకోలేదు. ఈనాడు పుంఖానుపుంఖంగా ఆమె లేఖిని నుండి గ్రంధజాలాలు వస్తున్నాయి. అమ్మ అనుగ్రహం ఎవరికి ఏ రూపాన వస్తుందో చెప్పలేము. కుసుమను ఇలా అనుగ్రహించింది.

కుసుమ ఈ గ్రంథం తయారు చేయటానికి పడిన శ్రమ సామాన్యమైనది కాదు. అమ్మతో సంబంధం ఉన్న ప్రతి వ్యక్తినీ కలసి వారి అనుభవాలను తన

హృదయగతం చేసుకొని రచనలో పెట్టగలగటం తేలికైన విషయం కాదు. అనుభవించిన వాని అనుభవం వారి మాటలలోకి రావటమే కష్టం. వారి అనుభవాన్ని ఇంకొకరు మాటల్లోకి తేవటం ఇంకా కష్టం. రచనలో ఉన్న కష్టం, బాధ్యత నాకు తెలుసు కనుక ఇంతగా చెప్పాను. ఆ కృషిలో కుసుమ ఎన్నదగినది. రాజుల చరిత్ర భారతదేశ చరిత్ర కాకపోవచ్చు కానీ భక్తులతో అమ్మ అనుబంధం అమ్మ చరిత్రే. ఎందుకంటే భక్తుల ప్రతి అడుగులో, ప్రతి కదలికలో అమ్మ తడిగుడ్డలో నీరులా అంటి పెట్టుకొని ఉంటుంది కనుక.

"కాలువ నిండా నీరు ఉన్నా త్రాగటానికి రేవు ఎట్లా అవసరమో సర్వత్రా ఉన్న దేవుడిని తెలుసుకోవటానికి దేవాలయం అవసరమైంది" అన్న అమ్మ మాటల ప్రకారం అమ్మను తెలుసుకోవటానికి ఇలాంటి గ్రంధాలే ఆధారం.

అమ్మా "నేను దేవుడ్ని చూడలేదు" అని అమ్మతో అన్నప్పుడు, నాకూ మీకూ తేడా, రెండుగా కనపడటమే" అన్నది. అవును తానే దేవుడైనప్పుడు ఎవరిని చూస్తుంది. సృష్టి అనే అద్దంలో తనను తానే చూచుకుంటున్నది అందుకే "మీరు నేను కాకపోతేగా, యధార్థమే నా స్థితి" అన్నది.

కుసుమ అమ్మ యధార్ధ గాధను గ్రంధస్థం చేసింది. మహోదధిలో కొత్త తరంగాలను బయటపెట్టింది. పూర్వం ఒక సోదరి అమ్మతో "నీకెట్లాగైనా కొడుకులంటేనే ఇష్టమమ్మా" అన్నది. దానికి అమ్మ "ఆ బిడ్డలనడుగు, ఆడపిల్లలు అదృష్టవంతులు. అమ్మ దగ్గర వాళ్ళకు ఎక్కువ చనువు అంటారు. నాకందరూ ఇష్టమే. వాళ్ళ అవసరమే వాళ్ళను నా వద్దకు చేరుస్తుంది" అన్నారు. అవును ఎవరి స్థానం వారిదే అమ్మ దగ్గర కుసుమ స్థానం కుసుమదే. అమ్మ సచ్చరిత్ర రచనతో ఆ స్థానం ఇంకా స్థిరపడింది.

- భవతు -

# పారాయణ గ్రంథం 

హైదరాబాదు　　　　　　　　　　　　　　పాతూరి వెంకటేశ్వర రావు

జిల్లెళ్ళమూడి అమ్మను గురించి ఇరవయ్యో శతాబ్ది చివరి నాలుగు దశకాలలో వేలకొలది పుటల సాహిత్యం వెలువడింది. అందులో పద్యకావ్యాలు ఉన్నాయి. స్తోత్రాలు ఉన్నాయి. గద్యరచనలు చాలాచాలా ఉన్నాయి. ఇంగ్లీషులో, తెలుగులో అమ్మజీవిత విశేషాల రచనలు ఉన్నాయి. లౌకిక, పారలౌకిక విషయాలపై అమ్మతో సంభాషణలు ఉన్నాయి. "మాతృశ్రీ" మాసపత్రికలో అసంఖ్యాకంగా వ్యాసాలు వచ్చాయి. ఎంత సాహిత్యం వెలువడినప్పటికి, ఎన్ని పుస్తకాలు ప్రచురణ జరిగినప్పటికీ చెప్పవలసినదీ, చెప్పదగినదీ ఇంకా ఎంతో ఉంటూనే ఉంది. ఇకముందు కూడా ఉంటుంది. సోదరులు కొండముది రామకృష్ణ అన్నట్టు అమ్మ జీవితం మహాసముద్రం. అందులో తరంగాలన్నింటిని ఎలా గమనించడం? అది అసాధ్యం. ఇంతవరకు వెలువడిన రచనలన్నీ అమ్మ కలిగించిన స్ఫూర్తితో జరిగినవే. ప్రచురించిన పుస్తకాలన్నీ ఆమె అనుగ్రహంతో వెలుగుచూసినవే.

సోదరి శ్రీమతి కుసుమ చక్రవర్తి మనకు అందించిన ఈ పుస్తకం "అమ్మసచ్చరిత్ర" కూడా అమ్మదయే. సంకల్పమూ ఆమెదే. ఆచరణా ఆమెదే. పుస్తక రచన అనే అదృష్టాన్ని అమ్మ ఈసోదరి శ్రీమతి కుసుమకు కలిగిస్తే, దానికి ముందుమాట రాసే మహద్భాగ్యాన్ని సోదరి నాకు ప్రాప్తింపజేసింది. అమ్మకు అభివందనలు, సోదరికి అభినందనలు.

"అమ్మసచ్చరిత్ర" ఇంతకు ముందు వెలువడిన పుస్తకాలకు భిన్నమైనది. నాలుగువందల పేజీలు దాటిన ఈపుస్తకం అనేకమంది సోదరీ సోదరుల అనుభవాల సర్వస్వం. ఇంతమంది అనుభవాలు చేర్చి, కూర్చి చేసిన రచన గనుక "సర్వస్వం" అంటున్నానే గాని, ఇందులో చేర్చని అనుభవాలు లేవని కాదు. తమ అనుభవాలను లోకానికి వెల్లడి చేయని వారెందరో ఉన్నారు. కాగితంపై

పెట్టడం అంతమంచిదికాదనిపించే కొన్ని అనుభవాలు ఉన్నాయి-కొందరికి. అవి వెల్లడి కావడం కొందరికి కష్టం కలిగించవచ్చు. అవి ఎప్పటికైనా గ్రంథస్థమౌతాయో లేదో చెప్పలేము. అమ్మ బాల్యంలో ఎందరికో చిత్ర విచిత్రమైన సంఘటనలు అనుభవమైనాయి. తొలుదొలుత అవి ఏవో యాదృచ్ఛిక సంఘటనలనుకొన్నారు కొందరు. గాలిచేష్టలు కావచ్చుననుకొన్నారు మరికొందరు. ఏవో వింత సంఘటనలు లెమ్మనుకొన్నారు ఇంకా కొందరు. రోజుల తరబడి ఏమీ తినకపోయినా, అమ్మ అందరి వలె తిన్నట్టుగానే ఉంటే అది ఏదో ఒక వింత జబ్బు అనుకొన్నారు ఆమె సన్నిహిత బంధువులు. అమ్మ ఉన్న పూరి ఇంట్లో ఉన్నట్టుండి అద్భుతవాసనలు వస్తుంటే "దేవతా సర్పాలు తిరుగుతుంటే అలాంటి వాసనలు వస్తాయిట" అని గ్రామస్థులు అనుకొన్నారు. హైమకు ఒకసారి అలాంటి వాసనల అనుభవం కలిగింది. అమ్మ తన పూరింటి వెనుక రోటివద్ద ఏదో పనిచేసుకొంటూ కూర్చున్నది. వింత వాసనలను గురించి అంతా చెప్పుకొంటున్నరోజులవి. "అమ్మా! నాకు కూడా ఏదైనా వాసన చేసిపెట్టవూ!" అని హైమ అడిగింది. హైమకు అప్పటికి పదేళ్లు కూడా ఉండి ఉండవు. అమ్మ హైమవంక చూసి నవ్వి, తన పని తను చేసుకుంటూనే రుబ్బురోలును చేతితో అవతలకి తోసి "దీనితో ఆడుకో" అన్నది. రుబ్బురోలు ఆ క్షణం నుంచి కొన్ని రోజులపాటు సువాసనలు వెదజల్లిందట. హైమ నాకు స్వయంగా చెప్పిన సంఘటన ఇది. ఇంకా ఇలాంటివి ఎన్నో ఆలయ గర్భంలోకి హైమ తనతో తీసుకొని వెళ్లింది. తను ఇప్పుడు "దేవత".

హైమ "దేవత" కావడమేమిటి? రవి (బ్రహ్మాండం రవీంద్రనాథ్) చిన్నపిల్లవాడిగా ఉన్నప్పుడు, రవిని, హైమని దగ్గర కూర్చున బెట్టుకొని నేను ఎన్నిసార్లు కబుర్లాడలేదు? అలాంటి హైమను "దేవత" అని ఎలా అనుకోవడం? కాని, హైమ మనందరి మధ్య ఉన్నప్పుడు నానోటితోనే "దేవత" అనే మాటను అమ్మ పలికించిన సందర్భమొకటి నాకు జ్ఞాపకం ఉంది.

అమ్మ ఆలయం పునాదుల వరకు మాత్రమే నిర్మాణం జరిగిన ఒకప్పటి మాట. అది వెన్నెల రాత్రి. సుమారు పదిగంటల వేళ. అమ్మ పునాదుల

మధ్య మంచం మీద కూర్చుని ఉంది. నేనూ, మరెవరో ఒకరిద్దరు అమ్మ మంచం దగ్గరే కూర్చుని ఉన్నాము. హైమ మందిరం ఇప్పుడు ఉన్నచోటు అప్పుడు ఖాళీ స్థలం. అటునుంచి హైమ నడిచి వస్తున్నది. హైమకు గజ్జెల పట్టాలు ఉండేవి. తెల్లని పరికిణీ, వోణీ వేసుకొని, మృదువుగా నడచి వస్తున్నట్లు కనిపిస్తే అప్రయత్నంగా నేను అమ్మతో అన్నాను "దేవతలు ఎలా ఉంటారో నాకు తెలియదు. ఇప్పుడు హైమను చూస్తే అలా ఉంటారేమో అనిపిస్తోంది" అని. అక్కడున్న సోదరులు "అవును" అన్నట్టు హైమ పట్ల ఆప్యాయతతో తలలూపారు. హైమ దగ్గరకు వచ్చాక అమ్మ తనతో అంది " అన్నయ్య నిన్ను దేవత అంటున్నాడు" అని. హైమ మా మధ్యనే కూర్చున్నది. మా సంభాషణలో గొంతు కలిపింది. అది ఏదో లోకాభిరామాయణం. "సుడిగాలిలో సాక్కి సోలి... జడిలేని నీ ఒడిలో వ్రాలి..." అని అప్పుడు తను "రాజు" పాట పాడినట్టు జ్ఞాపకం.

అమ్మను మొదటిసారి చూసినప్పటికి నాకు దేవుడిలోగాని, మనుషుల దివ్యత్వంలోగాని విశ్వాసంలేదు. ఇప్పుడు ఉన్నదా అంటే ఏమని సమాధానం చెప్పాలో తెలియదు. ప్రసాదరాయ కులపతి, మరికొందరు మిత్రులతో కలసి తొలిసారి అమ్మదర్శనం చేసుకొన్నప్పుడు అమ్మను గురించి నాకు కుతూహలం మాత్రమే ఉండేది. ఎవరో కన్నబిడ్డలను ఆమె తన బిడ్డలవలెనే చూడటం ఆశ్చర్యం కలిగించింది. మన ఆలోచనలను మనం చెప్పకుండానే అమ్మ గ్రహించ గలదన్నది నాకు మొదట కలిగిన అనుభవం. కాని, అలా తెలుసుకోవడానికి "దైవత్వం" అవసరంలేదు. మనుషులను అర్థం చేసుకొనే ప్రతిభ ఉంటే చాలు, అని నాకు నేను అప్పట్లో సమాధానం చెప్పుకున్నాను. "నాకు ఇలాంటి నమ్మకాలు లేవు" అని నిర్మొగమాటంగా అమ్మకు చెప్పినట్టు కూడా గుర్తు. "ప్రేమ, వాత్సల్యం, మనుషుల మధ్య అనుబంధాలు-ఇవన్నీ నీకు "ఇష్టమైనవే కదా!" అని కాబోలు అన్నది అమ్మ. అమ్మ మాట్లాడే తెలుగు చాలా బాగుంటుంది. అప్పటికే పత్రికలలో పనిచేస్తున్న నాకు అమ్మ బాష ఎంతో అద్భుతంగా ఉందనిపించేది. అమ్మ మాట్లాడుతుంటే ఇంకా ఇంకా వినాలనిపించేది. అమ్మ చాలా తార్కికంగా మాట్లాడేది కూడా. అలా మాట్లాడితే నాకు ఇష్టమని కూడా అమ్మ మొదటే

గ్రహించినట్లుంది. గంటలు, రోజులు, వారాలు తనతో ఏకాంతంగా మాట్లాడే అవకాశాన్ని అమ్మ నాకు కలిగించింది. తాత్త్విక విషయాలలో నాకున్నది పరిమితజ్ఞానం. కాని, దానితోనే అమ్మతో మొగమాటం లేకుండా, సంకోచంలేకుండా మాట్లాడాను. నేను ఇంగ్లీషు పదాలు వాడితే అమ్మ అభ్యంతరంపెట్టలేదు. (నాకు ఇంగ్లీషు వచ్చునని కాదు, అలా మాట్లాడటం అలవాటైంది. అంతే.) అమ్మ సరళమైన తెలుగులో సమాధానాలు చెప్పేది. అలా మట్లాడగా, వినగా చాలా కాలానికి సమస్త విశ్వాన్ని నిండిన శక్తి ఏదో ఒకటి ఉన్నదనే అభిప్రాయం నాలో ఏర్పడి, బలపడింది. అది అమ్మ చలవ. అతీంద్రియ శక్తులు తనకు ఉన్నాయని అమ్మ ఎప్పుడూ చెప్పలేదు. "మీరు కానిది నేను ఏదీ కాను" అని పదేపదే స్పష్టం చేస్తుండేది. కాని ఒక మహనీయుడు అద్భుత శక్తులు ప్రదర్శించడం గురించి ప్రస్తావన వచ్చినప్పుడు నేను విమర్శిస్తే "నీకు సాధ్యం కానిది ఇతరులకు కూడా సాధ్యం కాదనుకోవడం సరికాదు" అనే అభిప్రాయాన్ని అమ్మ నాకు కలిగించింది. అద్భుతాలు అనిపించే సంఘటనలు జరిగినా వాటిని పట్టించుకోవటం మానేశాను. డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారికి తన అనుభవాలను బట్టి అమ్మ పట్ల గౌరవం, అభిమానం అమితంగా కలిగాయి. తరువాత అది విశ్వాసంగా స్థిరపడింది. "మీరు సైంటిస్టులు కదా, మీకు ఎలా నమ్మకం కలిగింది?" అని ఒకసారి ఆయనను ప్రశ్నించాను. "సైంటిస్టు తన అబ్జర్వేషన్లను బట్టే తార్కికంగా ఆలోచించి నిర్ణయాలకు వస్తాడు గదా! నేను అలాగే చేశాను" అన్నారాయన.

అమ్మతో సంభాషణలలో ఒకసారి "పురుష ప్రయత్నం-విధి" ప్రసక్తి వచ్చింది. "మానవ ప్రయత్నంలో లోపం లేకపోతే కార్యసిద్ధి తప్పక కలుగుతుంది. మనిషే తనను తాను తీర్చిదిద్దుకొనగలడు. ఇందులో విధి ప్రమేయం లేదు" అని నా వాదన. మరైతే కొందరే ఎందుకు విజయం సాధిస్తారు? కొందరు మంచి పనులు కొందరు చెడ్డ పనులు ఎందుకు చేస్తారు? అనే ప్రశ్నలు నా మనస్సులో ఒకమూల ఉన్నాయి. మనో విజ్ఞాన శాస్త్రంలోని కొన్ని మౌలికాంశాలను గురించి, ముఖ్యంగా ఆలోచనలు కలిగే క్రమం గురించి కూడా నాకు ప్రశ్నలు

ఉన్నాయి. ఏదైనా ఒక ఆలోచన మనస్సులో మెదిలినదంటే దానికి కారణమైన పరిస్థితులు ఏవో ఉంటాయని అనుకునే వాణ్ణి. "నీ ఆలోచనలను నీవే గమనించు. నీవు ఉన్న పరిస్థితులతో ఏవిధంగానూ సంబంధంలేని, నిమిత్తం లేని ఆలోచనలు వస్తాయో రావో చూడు" అని అమ్మ సలహా ఇచ్చింది. చాలాకాలం అదే ప్రయత్నంచేశాను. అమ్మ అటు తరువాత నా ఆలోచన కోసం ఒక ప్రశ్న వేశారు- "ఆలోచనలు ఎక్కడినుంచి వస్తున్నాయి? వాటి వెనుక ప్రేరణ ఏది? తెలుసుకొన గలిగావా?" పురుషకారం, విధి మొదలైన అనేక విషయాలకు సంబంధించిన నా ప్రశ్నలకు సమాధానం దొరికినట్లయింది. ఏ విధమైన కారణం గాని, ప్రేరణ గాని లేకుండా కొన్ని ఆలోచనలు వస్తాయని నాకు అనుభవమైంది. సమస్తమూ, అక్షరాలా సమస్తమూ, మంచీ చెడూ, ఈ రెండూ కానిదీ కూడా విధి నిర్ణయం ప్రకారమే జరుగుతుందనీ, అంటే సమస్తమూ విధేనని అమ్మ చెప్పింది. నేను అమ్మతో వాదించలేదు. అమ్మ చెప్పినది యదార్థమే అనిపించింది. కాని, అదెలా అనికూడా అప్పుడప్పుడు అనిపిస్తుంది. పోతన అంతటి వాడికి "కలడు, కలండనెడు వాడు కలడో లేడో?" అనిపించలేదా? అంతే! సడలే విశ్వాసాలను ఎప్పటికప్పుడు గట్టిపరుచుకోవడమే ఎవరైనా చేయవలసింది.

లోకంలో దృఢమైన విశ్వాసాలు కలిగిన వారు అనుభవించే హాయిని, తృప్తిని ఇతరులు అనుభవించలేరు. కనుక ఏదో ఒక విశ్వాసం ఉండవలసిందే. క్రైస్తవులైనా, మహమ్మదీయులైనా, బౌద్ధమతస్థులైనా, వైదిక మతస్థులైనా విశ్వాసాన్ని బలంగా ఉంచుకోవడం తమకే శ్రేయస్కరం.

ఇంతకూ విశ్వాసాలు అంటే ఏమిటి? అందులో మంచివి, చెడ్డవి ఉంటాయా, మూఢమైనవి, కానివి అంటూ విభజించవచ్చునా? ఇవన్నీ కొన్నాళ్లకు నాలో కలిగిన ఆలోచనలు, మనస్సులో కదిలిన ప్రశ్నలు.

విశ్వాసాలు వేరు, మూఢవిశ్వాసాలు వేరు. ఇతరులకు గాని, తనకు గాని హాని కలిగించేది మూఢవిశ్వాసం. సమాజానికి చెరుపుచేసేది మూఢవిశ్వాసం. మనిషికి, సమాజానికి ఏదో ఒకవిధంగా మేలు చేసేది మంచి విశ్వాసం.

దైవంపట్ల, దైవశక్తిపట్ల, ప్రేమ కరుణకలిగి, సమాజశ్రేయస్సును త్రికరణ శుద్ధిగా కోరే, ప్రబోధించే ఆధ్యాత్మిక బోధకుల పట్ల విశ్వాసం ఉండవలసిందే. విశ్వాసాన్ని పెంపొందించే ప్రయత్నంలో ఉన్నసాధకుల పట్ల సైతం సదవగాహన, సానుభూతి ఉండవలసిందే.

సోదరి శ్రీమతి కుసుమ సంకలనం చేసిన అనుభవాలను చదివితే అమ్మ విషయంలో ఎవరికైనా ఇదివరకే ఉన్న కొన్ని అభిప్రాయాలు బలపడతాయి. విశ్వాసాలు దృఢతరమౌతాయి.

''ఇదివరకే ఉన్న'' అని ఎందుకు అంటున్నానంటే ఇలాంటివి నమ్మకూడదని దృఢంగా సంకల్పించిన వాళ్లకు ఇవన్నీ నిజమో కాదో అని అనుమానించడానికి, "ఇవన్నీ మీ బలహీనతలు'' అని కొట్టి పారేయడానికి ఎప్పుడూ అవకాశం ఉంటుంది. మొదటి నుంచి చివరిదాకా ఈ పుస్తకాన్ని చదివాక కూడా. కనుక, నమ్మాలనుకొన్నవాళ్లకే ఇది ఉపయోగకరం. "ఇవన్నీ ఎందుకు నిజం కాకూడదు'' అనుకొనేవాళ్లకు అంతవరకు లేని నమ్మకం ఏర్పడవచ్చు కూడా. ముందే కాస్తంత సదభిప్రాయం ఉన్నవాళ్లకు అప్పటికే ఉన్న అభిప్రాయం నమ్మకంగా మారి దృఢతరం కావచ్చు. "ఇవన్నీ మేము నమ్మం'' అనుకొనేవాళ్లు ఈపుస్తకం జోలికిపోకుండా ఉండటం మంచిది.

"అమ్మసచ్చరిత్ర'' ను సదుద్దేశంతో చదివితే కలిగే అభిప్రాయాలుగాని, ఆలోచనలు గాని ఇలా ఉండవచ్చు.

1. అమ్మ అపార కరుణామయి. ప్రేమ స్వరూపిణి. కీర్తిశేషుడు బ్రహ్మాండం సుబ్బారావు అన్నట్లు అమ్మ "మమతల గర్భగుడి''. ప్రేమ, వాత్సల్యాలు మాటలలోగాక, బాల్యం నుంచి సిద్ధి పొందేవరకు అమ్మ చేతలలో వ్యక్తమవుతూనే ఉన్నాయి.

2. అమ్మ ఎక్కడ ఏమి జరుగుతున్నదో తను తలచుకొంటే చూడగలదు. సుదూర ప్రాంతాలలో మనం మాట్లాడుకొన్న మాటల్ని వినగలదు.

3. అమ్మకు భూత, భవిష్యత్, వర్తమానాలనే తేడాలు లేవు. అన్ని కాలాలూ ఆమెకు వర్తమానమే.

4. అందరింటి అన్నపూర్ణాలయం నిర్వహణ కోసం తన నగలను మరో ఆలోచన లేకుండా తీసి ఇచ్చిన అమ్మ, తను కావాలనుకొంటే, సంభారాలను వెతుక్కుంటూ వచ్చేలా చేయగలదు. పదార్థాలను సృష్టించనూగలదు. ఇది ఎందరికో అనుభవం.

5. ఏ మందులూ లేకుండా కొందరికి వ్యాధి నయం చేసిన సంఘటనలూ, అకాల మరణం నుంచి కొందరిని కాపాడిన సంఘటనలూ ఉన్నాయి. మరణాన్ని కొద్దికాలం తప్పించిన ఉదంతాలు కూడా ఉన్నాయి. (కాని, కడుపున పుట్టిన బిడ్డల మరణాన్ని, భర్త మరణాన్ని అమ్మ నివారించలేదు. తాను సిద్ధిపొందడాన్ని వాయిదా వేసుకొనను కూడా లేదు.)

నాకు సైతం సొంత అనుభవలు కొన్ని ఉన్నాయి. హైదరాబాద్ పర్యటన సమయంలో అమ్మ కొన్ని పేదల వాడలను దర్శించింది. ఎక్కడకు వెళ్లినా పులిహోర లాంటి పదార్థాలను వెంట తీసుకొనివెళ్లి పంచే ఏర్పాట్లను అమ్మచేసింది. ఒకచోట నేను పులిహోర పంచుతున్నాను. గరిటెతో వడ్డన చేస్తున్నాను. చిన్న దోప్పలలో ప్రసాదం అందిస్తున్నాను. పదార్థం యాభైకంటె ఎక్కువ మందికి సరిపోదనిపించింది. అక్కడ జనం రెండువందల మందికిపైనే ఉంటారు. సరిపోకపోతే ఎలాగని మనస్సులో ఒకింత ఆందోళన కలిగిచింది. ఇంతలో అమ్మ నన్ను పిలిచింది. "పులిహోర ఎంతెంత పెడుతున్నావు నాన్నా?" అని అడిగింది. నేను గరిట చూపించి "దీనితో రెండు మూడు గరిటెలు" అని కాబోలు చెప్పాను. సరిగా గుర్తులేదు. పరిస్థితి అర్థం చేసుకొని అమ్మ అందరికీ సర్ది పెట్టమని చెబుతుందనుకొన్నాను. కాని, అమ్మ "అదేమి సరిపోతుంది, బాగా పెట్టు" అన్నారు. నేను సందేహిస్తుంటే "చాలుతుందిలే నాన్నా పెట్టు" అన్నారు. నేను తిరిగివెళ్ళి, ఏమవుతుందో చూద్దామని పట్టుదలగా అంతకు ముందు పెట్టిన దానికంటె రెండింతలు, మూడింతలె ఎక్కువపెట్టాను. చిన్న వాళ్లకైతే అది భోజన సమానం అనుకొన్నాను. ఎంత మందికి పెట్టానో గుర్తులేదు, నేను అలసి పోయాక మరొక సోదరుడు అందుకొని పెట్టాడు. పులిహోర గంగాళంలో తగ్గుతున్నట్లే ఉంది గాని, పూర్తిగా అయిపోవడంలేదు. మేము పేదలవాడ నుంచి తిరిగి

వెళ్లేటప్పటికి ఇంకా అందులో కనీసం పదిహేను మందికి సరిపడే పదార్థం ఉంది. ఇది నా కళ్లెదుటే జరిగిన సంఘటన. ఇది మహత్తు అనుకోవడానికి మనస్సు అంగీకరించలేదు. కాని, వాస్తవంగా జరిగింది. ఉన్న పదార్థాన్ని గురించి నా అంచనా తప్పేమో లెమ్మనుకొన్నాను. తరువాత అమ్మ అడిగింది, "నాన్నా! పులిహోర సరిపోయిందా, ఇంకా మిగుల్చుకొచ్చినట్టున్నావే!" అని. తరువాత సోదరులు చెప్పారు తమకు ఇలాంటి సంఘటనలు చాలా జరిగాయని. "పదార్థాన్ని ఇలా సృష్టించగలిగే మహనీయులు లోకంలో ఆకలి బాధలు లేకుండా ఎందుకు చేయరు?" అనే ప్రశ్న అప్పటికీ ఇప్పటికీ నా మనస్సులో నుంచి తొలగిపోలేదు. అనుభవాలను అసత్యమని అనుకొననూ లేను. మహనీయుల మహత్తులకు తృప్తికరమైన వ్యాఖ్యానం చెప్పుకొననూలేను.

దైవంలో గాని, మహనీయులలోగాని విశ్వాసం బలంగా ఉండటం మనిషికి మేలు చేస్తుందని నా జీవితానుభవం నాకు బోధించింది. పవిత్ర మత గ్రంధాల పఠనం, మహనీయుల చరిత్ర పఠనం విశ్వాసాన్ని బలపరుస్తుంది. మనస్సుకు హాయిని కలిగిస్తుంది. జీవితంలో కష్టాలను తట్టుకొనే మానసిక ధైర్యం, స్థైర్యం ఏర్పడతాయి. ఫలసిద్ధి అందరికీ ఒకే విధంగా ఉండకపోవచ్చు. అందరి విశ్వాసాలు ఒకే స్థాయిలో ఉండవు మరి.

మహత్తులతో సంబంధం లేకుండా, కేవలం ప్రేమ, వాత్సల్యం, మమత లాంటి అత్యున్నత మానవీయ విలువల ఆధారంగా మహనీయుల పట్ల అభిమానాన్ని, గౌరవాన్ని, విశ్వాసాన్ని పెంపొందించుకొన గలిగితే మంచిదే. అలాగాక, మహత్తుల వల్లనే సాధారణ వ్యక్తులు మహనీయులవుతారనే భావం ఉంటే అప్పుడు ఈ అనుభవాలు తప్పక విశ్వాసం ఏర్పరచుకోవడానికి, బలపరచుకోవడానికి దోహదం చేస్తాయి.

నా మటుకు నాకు అమ్మ మహిమాన్విత అనే విశ్వాసం చాలా కాలానికి కలిగింది. కాని, మహత్తులను మించి అమ్మ మహోన్నత మానవీయ లక్షణాలకే నేను ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాను. వాటివల్లనే నాకు అమ్మ ఆరాధ్య అయింది. అమ్మ అంటుండేది - "మీరు నాలో మానవత్వాన్ని చూస్తారు, నేను మీలో దైవత్వాన్ని

# అమృతాశీస్సులు

బాపట్ల    బెండపూడి అక్కిరాజు

మొదటి నుంచీ శ్రీకృష్ణ భగవానుడు నా ఆరాధ్యదైవం. అజ్ఞానము వల్ల మనశ్శాంతికి నాకు అందుబాటులో వున్నవారిని దర్శించేవాడను. చిట్టచివరకు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించిన నాటి నుంచీ అమ్మ యొక్క సర్వాంతర్యామిత్వం మీద గాఢ నమ్మకం కుదిరింది. తరుచూ అమ్మను దర్శించుకునేవాడిని. నాపిల్లల పెండ్లి శుభలేఖలో "శ్రీమాత్రే అనసూయా దేవ్యైనమః" అని ముద్రించి మొదటి శుభలేఖను అమ్మకు స్వయంగా ఇచ్చేవాడిని. వయోవృద్ధుడనగుట వలన, శరీరం బలహీనపడటం వల్ల జిల్లెళ్ళమూడికి వెళ్ళలేకపోవుచున్నాను.

అమ్మ సచ్చరిత్ర మొదటి భాగం ఆద్యంతం ఎంతో శ్రద్ధతో చదివాను. అమ్మ జననము మొదలు వివాహం వరకూ మీరు చక్కగా వివరించినారు. అమ్మ వివరించిన ప్రతి విషయం, భిన్నత్వంలోని ఏకత్వాన్ని కూలంకషంగా అందరికీ అర్థమగురీతిలో వున్నది. అమ్మ అనేకమంది కష్టాలలో వున్నవారిని ఆదుకొన్నది. వారి కష్టములే తనవిగా భావించి వారికి అనేకసేవలు చేసి, వారిని కష్టముల నుండి కాపాడి, వారి జీవితములను సుఖప్రదంకావించింది. అందువల్ల తాను ఎన్నో కష్టములు పడవలసి వచ్చింది. అమ్మ చేసిన పనులన్నీ భగవంతుని క్రీడలే. శ్రీకృష్ణ భగవానుడు చేసిన లీలనే అమ్మ మరొక రకంగా చేసింది. వాటి వల్ల అమ్మ అద్వైతవాదే అనిపిస్తుంది.

అమ్మ అంటే ఆ నాలుగు గోడల మధ్యేవున్న అమ్మకాదని, అమ్మ సర్వాంతర్యామి అని, సర్వవ్యాపి అని చాటి చెప్పింది. అమ్మరూపం కూడా ముఖ్యమే. ఎందుకంటే అమ్మ రూపాన్నే ఆధారం చేసుకొని, దాని ద్వారా అమ్మ నిర్గుణత్వము, సర్వాంతర్యము అయిన పరబ్రహ్మరూపాన్ని తెలుసుకొనుటకు ఉపయోగపడుతుంది.

మీ రచనల ద్వారా అమ్మ యొక్క స్వరూపమును ఆధారం చేసుకొని ఆ బ్రహ్మతత్వాన్ని తెలుసుకొనుటకు సాధన చేయుటకు ఉపయుక్తంగా వున్నది. ఇంతకు పూర్వమే సాధనామార్గమును ఎన్నుకున్నాను. మీరచనల ద్వారా నాసాధన సరియైన మార్గంలోనే పయనిస్తున్నానన్న నమ్మకం ఏర్పడింది. నాకు నిత్యం భగవద్గీత చదవటం అలవాటు. బ్రహ్మత్వమును పొందవలెనన్న త్యాగము అవసరమని భగవద్గీత బోధించుచున్నది. త్యాగము చేయవలసినది కామ, క్రోధ, మద మాత్సర్యాలనే కదా!

మొదట పోవలసినది కామము. దానికి నిష్కామ కర్మయే ముఖ్యం. మొదట కామ్యకర్మలను మొదలు పెడితే తరువాత కాలక్రమేణా కామ్య కర్మలతో విసిగి నిష్కామ కార్యం బలపడుతుంది. అమ్మ యొక్క నిజస్వరూపం అనగా బ్రహ్మ స్వరూపం మీ రచనల ద్వారా అర్థం చేసుకున్నాను. గోపికలు శ్రీకృష్ణుని ఆరాధించునప్పుడు కృష్ణుడు అదృశ్యమయ్యేవాడు. మీకు దూరంగా వుండి మీకు భక్తి విశ్వాసములు ఎక్కువ చేసి నా తత్వమును బోధించుటకే అన్నాడు. అలాగే అమ్మ భౌతిక శరీరం అమ్మ యొక్క నిజస్వరూపం తెలుసుకొనుటకే. కొంతమంది అమ్మను మామూలు మనిషిగానే భావిస్తారు. ఏకొద్దిమందో ఆమె అసలు తత్వాన్ని గుర్తిస్తారు.

మీవి, ఇతరుల అనుభవాలను కూడా చాలా చక్కగా దివ్యానుభూతులలో మధురస్మృతులలో వివరించారు. అనసూయావ్రత కల్పం చాలా బాగుంది. మీ ఐదవ పుస్తకమైన అమ్మసచ్చరిత్ర ద్వితీయ భాగం సర్వాంగ సుందరంగా తయారై మాకరములనలంకరించాలి. అమ్మ మీకు ఆయురారోగ్యఐశ్వర్యాలను ఇస్తూ మీరు ఉపకారము చేయుటకు నూరు సంవత్సరాలు ఇవ్వవలసినదిగా సర్వత్రావున్న అమ్మను ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
మీశ్రేయోభిలాషి
బెండపూడి అక్కిరాజు
బాపట్ల

జిల్లెళ్ళమూడి

డా॥ పి. ఝాన్సీ లక్ష్మీబాయి

అనుభవాలకి మాత్రమే అంది మాటల మూటలతో ఎంత దింప ప్రయత్నించినా అర్థం కాని అమృతతత్వం ప్రేమ. అది సూక్ష్మంలో అతి సూక్ష్మం. మహత్తులో మహత్యంగా దర్శనమిస్తుంది. సూక్ష్మతమమైన అనుభూతిని అందించే పాత్రలు అనేకమున్నా, దాన్ని ప్రకటించగలిగినది అమ్మే. వేదాలకు ఓంకారం మొదలైనట్లు ప్రేమకు శ్రీకారం అమ్మతోనే!

ఈ అనిర్వచనీయ ప్రేమ తరంగాలను ఎలా కొలుస్తాం? ఎన్నని గణిస్తాం? అమ్మతో జీవించిన ప్రాణుల ప్రేమాంబుధిలోని అనుభూతి తరంగాలకు ఒక విచిత్ర చిత్రకల్పనే ఈ **"అమ్మసచ్చరిత్ర"** అనిపిస్తుంది. తరంగాలలో మునిగిన వాని అనుభూతి, ప్రేమ సముద్రం ఒడ్డున కూర్చున్న ప్రేక్షకులకు దర్శింప చేయాలనే తపన, తపస్సు ఈ అమ్మ సచ్చరిత్ర అనే ఉషస్సు.

శ్రీమతి కుసుమక్కయ్యతో ఒకనాడు ఒక గంట సమయం నేను మాట్లాడాను. ఆమె చేస్తున్న సేవకి అమ్మ పరమానందం పొంది ఆమె జీవితంలో ప్రతి కదలికని, ప్రతిక్షణాన్ని, అమ్మ మహిమల అనుభూతి పంటను అందిస్తోందా! అని నేను ఆగంట సంభాషణ కాలంలో ప్రతిక్షణం స్పందిస్తూ అనుకున్నాను. "నలుగురికి నువ్వు దేన్ని పంచుతావో అదే నువ్వు పొందుతావు".

"నువ్వు విత్తుకున్న దాన్నే నీవు కోసుకుంటావు" అనే మాట ఈమె పట్ల నూటికి నూరుపాళ్ళు సత్యమయిందని చాలా ఆనందించాను.

ఒక చరిత్ర వ్రాసే వాళ్ళ చరిత్రకి కూడా ఇంత మార్పు మన ముందు జరగటం చూస్తే చాలా ఆనందం కదా! మనకి.

లోగడ వ్రాసిన గ్రంథాలు చదివినాను. కానీ ఈ గ్రంథం శైలిలో ఎంతో ప్రత్యేకతను నేను చాలా పేరాల్లో గమనించాను. కవితా ధోరణి ఆమె కలాన్ని

రచనా కళని స్థిరంగా ఉంచే స్థితికి తెస్తోంది. అక్కయ్య జిల్లెళ్ళమూడి వస్తే ఇది వరకు గుళ్ళో, లేకపోతే సభల్లోనో కనిపించేది. ఇప్పుడు అలా కాదు. అమ్మ సమకాలంలో సహానుభూతి గల సోదర సోదరీమణుల హృదయ కుహరాలలో జిజ్ఞాసా మార్గ మధ్యమంలో కనిపిస్తోంది. ఎంత అదృష్టం! ఒకే పనిలో కొన్నాళ్ళు నిర్విరామంగా వుండటం. ప్రచురించటం, పంచటం, అంతేకాదు. ఆ మహిమలతో జీవితం పండించుకోవటం. ఒకరి పుట్టుక ఒకందుకునే దాన్నే కారణ జన్మ అని కూడా అంటారు.

అమంత్ర మక్షరం నాస్తి
నాస్తి మూల మనౌషధం
అయోగ్యః పురుషో నాస్తి.

అంటారు. భాషలో మంత్రంగా పనికి రాని అక్షరమే లేదు. సృష్టిలో కనిపించే చెట్లు, మొక్కలు, లతలూ, ఆకులు, వేళ్ళు ఔషధానికి పనికిరానివంటూ లేవు. "యోగానికి పనికి రాని, ఏదో యోగ్యత లేని మనుష్యుడు లేడు అన్నట్లు అమ్మ వద్ద ఒక్క క్షణమున్నా, కొన్ని రోజులున్నా, సంవత్సరాలున్నా, అమ్మ ప్రేమని, ప్రేమకోణమయిన మహిమానుభూతిని పొందనివాడు ఒకడు కూడా వుండడు అంటే అతిశయోక్తి కాదు. ఆ ప్రేమ మహిమ అలాంటిది పంచకపోతే పెంపొందించకపోతే, అది ప్రేమ కాలేదు.

మరి ఈ రచయిత్రి ఆ అమ్మ అమృత మహోదధిలోని ఉత్తుంగ ప్రేమ తరంగాలని చూపించటానికి ఎన్ని గ్రంథాలు రావాలో! రచయిత్రికి ఎంత బాధ్యతో, పాఠకులకు ఎంత భాగ్యమో!

ఒక విధంగా ఈ ప్రయత్నం జిల్లెళ్ళమూడిలో అమ్మ ఉన్న కాలానికి కళాస్పందన, బిడ్డల హృదయ స్పందన కలగలసిన రూపంలో ఉన్నది. అందుకే ద్వితీయ, తృతీయ చరిత్రలు కూడ వెలువడాల్సి వచ్చింది.

మరుపనేది మానవ మనస్సుకు సహజ లక్షణం. అమ్మ వద్ద ఉంటే

సమున్నత సమగ్ర జీవితంలో గడిపిన గొప్ప గొప్ప సోదరుల జీవితాలు, అమ్మ జీవితంతో కలసి అధ్యయనం చేస్తూ ఉంటే భాగవతం. భగవద్భక్తుల అనుభూతుల సంపుటి చదివితే కలిగే అనుభూతితో సమానానుభూతి కల్గుతోంది. భాగవతం అంటే భగవద్భక్తుల హృదయం. అదే భగవంతుని నివాస స్థానం.

"మద్భక్తాః యత్ర గాయంతి
తత్రైవ నివసామ్యహం.

..........................................

హృద్దేశే అర్జున తిష్ఠతి.

అని శ్రీకృష్ణుడు స్వీయ కంఠ స్వరంతో చెప్పాడు.

అమ్మ "నాన్నా! బాధలు పెట్టి నన్ను ఎవరూ ఏడ్పించలేరు. కానీ, మంచి వాళ్ళ మంచితనం ఏడ్పిస్తుంది. వాళ్ళ మౌనం మరీ ఏడ్పిస్తుంది" అని అంటుంది. దాదాపుగా ఈ గ్రంథంలో అమ్మని మంచితనంతో ఏడ్పించిన హృదయ భాషే కనిపిస్తుంది. అమ్మని అంతగా స్పందిప చేసిన వారి స్పందన మనలో మరొక ప్రతిస్పందన కల్గించదా మరి! హృదయ ధర్మమే స్పందన కదా! మెల్లగా ఈ అక్కయ్య మనని 1975 సం॥ నుండి 1940 సం॥ ఇంకా ఇంకా వెనక్కి తీసుకెళ్తూ హృదయ గ్రంథులను భేదింప చేస్తూ, సంశయాలను ఛేదింప చేస్తూ "భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వ సంశ్రయాః" అని భాగవతంలో వ్యాసుడు అందించే భావం అందించాలని తపన పడుతున్నట్లు కనిపిస్తోంది. ఒక యుగానికి మరొక యుగ ధర్మాలు, ఆహ్లాదమయినట్లు ఈ దశాబ్దంలో ఉన్న మనకి అమ్మ సమకాలీనుల అనుభూతి ఆనంద సందాయకమే అవుతుంది కదా!

ఒకసారి నేను కుసుమక్కయ్యతో అక్కయ్యా! నీ అనుభూతి చక్కగా వ్రాసి వివరించావు. బాగుంది. మన వైజాగ్ సోదరులు చాలా మంది అమ్మ ప్రేమానుభూతులు చెప్తున్నారు. వాటినీ, అలాగే అమ్మ బిడ్డల అందరి అనుభూతులను ప్రచురించి, అందిస్తే నీ ప్రయత్నం ఇంకా సమగ్రమవుతుంది, సఫలమవుతుంది. కదా! అన్నాను.

ఆ వాక్యం అక్కయ్య గ్రంథాలకు నాందీ అయిందని అక్కయ్య సభల్లో చెప్తుంటే ఇంత మంది హృదయ స్పందనలు, సహాను భూతులు లోకానికి అందించాలనే ప్రయత్నంలో అమ్మని తన హృదయంలో పదిలపరచుకోవటానికి ప్రయత్నించే అక్కయ్య హృదయంలో నాకు రవ్వంత చోటు దక్కినందుకు నాకు పరమానందంగా వుంది.

అక్కయ్య ఈ గ్రంథాలు వ్రాయటం అనేది ఎలా అమ్మ మహిమకు పరమోదాహరణో, అట్లాగే ఆమె విద్యాధ్యయనం అంతకంటే మహా మహిమాన్వితం. అక్కయ్య ఒక విధంగా ఏకలవ్యుడులాగా పరోక్షంగా ఈ కళాశాల విద్యార్థిని. ఎంతో మందిని ఆంధ్రదేశంలో ఇతర రాష్ట్రాలలో గుర్తింపు పొందిన మంచి ఉపాధ్యాయులుగా తయారు చేసిన జిల్లెళ్ళమూడిలో అమ్మ దయతో స్థాపించిన మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల ఒక సమున్నత స్థానాన్ని సాధించింది. ఆ కళాశాల ప్రప్రధమ ప్రిన్సిపాల్ పూజ్యులు డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారు అక్కయ్య గారింట్లో ఉన్న చాలా స్వల్ప కాలంలో అక్కయ్యకు 35సం॥ వయస్సులో తెలుగు ఎమ్.ఎ. లో పట్ట భద్రురాలని చేశారు. ఆ గురువు చలువ, అమ్మ అనితర సాధారణ ప్రేమ ఇవన్నీ ఈమె జీవితానికి వన్నె తెచ్చాయి.

అక్కయ్య చేసే ప్రేమానుభవాల సేకరణ చూస్తుంటే అమ్మ పట్ల వాళ్ళను వశీకరణ చేయించే మహా మంత్రంలా అనిపిస్తోంది ఈ గ్రంథం.

ఇట్లు,
బుధజనవిధేయురాలు,
**పి. ఝాన్సీ,**



# నివేదన

అమ్మ సాన్నిధ్యంలో గంటలు, రోజులు దొర్లిపోయేవి. జిల్లెళ్ళమూడిలో, వుండగలగటమనేది మన ఉనికితో మనం తాదాత్మ్యం చెందటమే. కొందరిలో అహం తలఎత్తి అమ్మనే అంచనా వేయ ప్రయత్నిస్తారు. మన అహంకారాన్ని తుత్తునీయలు చేసే అనుగ్రహం అమ్మ ప్రసాదిస్తే తప్ప మన అవగాహనలకు అందదు. మరికొందరికి విచారస దృశ్యమైన భావనగా మారి వారిలో భక్తిప్రపత్తులు ప్రకటితమవుతాయి. కొందరికి అమ్మ సామాన్య మానవాంగనవలే అనిపించేది. మరికొందరికి మాత్రం సౌభాగ్యవశాన సంపూర్ణమైన అమనస్కస్థితి లభిస్తుంది. సామాన్యులు అమ్మ దర్శనానంతరం వారి బాధలు చిక్కులు మటుమాయం అయి శాంతి, సంతృప్తులను అనుభవిస్తారు.

అమ్మ సాన్నిధ్యంలో అహంకారంతో చేసే వాదోపవాదనలు, అమ్మతర్కంతో నశించి అమ్మ వేసే ఎదురు ప్రశ్నలకు నిలువలేక మన ఊహాపరిధులు పటాపంచలైపోయి నిస్సహాయులమవుతాము. అవ్యాజమైన అమ్మ ప్రేమ వాహినిలో శిష్టులు, దుష్టులు స్నానం చేసారు. చేస్తున్నారు. అమ్మ భౌతికంగా మన మధ్యలేకపోయినా మనకు అనుభవాలు అవగతమవుతూనే ఉన్నాయి. అందరి అనుభవాలు ఒకటే. ఒకే రంగు నీరు. ఒకే రకమైన చల్లదనం అందుకే ప్రేమకు నిర్వచన రూపం జిల్లెళ్ళమూడి అమ్మనే చెప్తాను. ఆ ప్రేమ కిరణాలు అన్నివేళల యందు, అన్నింటియందు, అందరియందు, అంతటా ఒకే విధంగా ప్రసరిస్తున్నప్పటికీ మన మనస్తత్వాలను బట్టి మాత్రమే ఆ ప్రేమ అనుభవంలోకి వస్తుంది. అమ్మ ప్రేమకు అవధులు లేవు. అది అపరిమితమైనది కనుకనే అమ్మ ప్రేమ ఝరి ఏ ఆటంకం లేకుండా, ఏ హద్దులు లేకుండా అన్ని వైపులా, అన్నివేళలా ప్రవహిస్తున్నది.

అట్టి అమ్మను తలుచుకుంటేనే మనమానస మెటుపోతుందో ఎవరికెరుక. ఈ ప్రేమాంభోనిది సర్వత్రా నిండినా స్నానం చేయాలంటే సరియైన రేవు కావాలి.

ఆ రేవే జిల్లెళ్ళమూడి. మన ఇంట్లో మనం అర్చించుకుంటున్నా మూల స్వరూపానికి నెలవైన జిల్లెళ్ళమూడికి ప్రతిఒక్కరూ వచ్చి, ఆనంద పరవశులవ్వాలనే కోరికే నా చేత ఈ విధంగా రాయిస్తున్నది. అక్కడ అందుకున్న మధుర భక్ష్యాలను నేనొక్కతినే కాక ప్రపంచ ప్రజలందరూ తనివి తీరా అందుకోవాలన్న తపనే ఇందుకు కారణం.

అమ్మతో కూడిన అనుభవాలు, సంఘటనలే ఈ ద్వితీయ భాగంలో చోటు చేసుకున్నాయి. "సంఘటనల కూర్పే జీవితం" అని అమ్మ నిర్వచనం కదా! భీష్ముడి లాంటి బెండపూడి అక్కిరాజుగారిని కోరిన వెంటనే ఆయన అనుభవాలను తెలియచేసి వారి అమృతాశీస్సులను కూడా అందించారు. ముంబాయి నుంచి అడిగినదే తడవుగా రాచర్ల కృష్ణమూర్తి అన్నయ్య గారు వారి అనుభూతులను పంపించటం ముదావహం. ఇంకా అనేక మంది అక్కయ్యలు, అన్నయ్యలు వారివారి అనుభవాలను తెలియచేసారు. శ్రీపాత్తూరి వెంకటేశ్వరరావుగారు ముందుమాటగా రాసిన "పారాయణ గ్రంథము" ఈ పుస్తకంకు వన్నె తెచ్చిందనటంలో ఎటువంటి సందేహం లేదు. వారందరికీ నాకృతజ్ఞతలు.

స్వయంగా వారిని కలిసి సేకరించిన సమాచారం, మాతృశ్రీలో ప్రచురితమైనవి, రామకృష్ణ అన్నయ్య రాసిన మాతృసంహితలోనివి, ఇందులో చోటు చేసుకున్నాయి. వసుంధరక్కయ్య మాతృశ్రీలో రాసిన రవ్వలూ-రత్నాలులోని అమ్మ రాజమ్మగారి సంభాషణ ఆధారంగా రాయటం జరిగింది. మన్నవదత్తు రాసిన అనుభవజ్ఞాన కణికలు (అముద్రితం) ఎంతో ఉపయుక్తమైనది. కాకినాడ బి.ఎల్. సత్యనారాయణ శాస్త్రి అన్నయ్య వ్రాసిన "తెలుగులో మహావాక్యం" అన్న గ్రంథము నుండి కొంత స్వీకరించటం జరిగింది. కొన్నిచోట్ల రామకృష్ణ అన్నయ్యరాసినది మారిస్తే దాని సొగసు మారిపోతుందని వాటిని యథాతథంగా ఉంచటం జరిగింది. వారందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు.

అనఘా - అద్భుత చారిత్ర-వాంఛితార్థ ప్రదాయినీ అని తన అభిప్రాయాన్ని

తెలియచేసినందులకు ఝాన్సీకి ధన్యవాదాలు, మొదటిభాగంలో అమ్మ పుట్టుక నుంచీ వివాహం వరకూ అమ్మ రాయించింది. ఈ పుస్తకంలో వివాహానంతరం అమ్మ జిల్లెళ్ళమూడిలో వున్నప్పుడు అమ్మ బిడ్డలకు ప్రసాదించిన అనుభవాలు, స్వర్ణోత్సవాలు, వాత్సల్యయాత్రతో ముగించటం జరిగింది. దాదాపు 35 సం॥ల కాలము ఇందులో చోటు చేసుకుంది. ఇంకా అనేకమంది అనుభవాలు రావాల్సివున్నది. ఇది చదివిన తరువాతనైనా వారివారి అనుభవాలను తెలియచేయాలని అక్కయ్యలను, అన్నయ్యలను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. 1975 అనంతరము అమ్మ సిద్ధిపొందేవరకూ ఆ తరువాత అమ్మ మనందరికీ ఇచ్చిన అనుభూతులను, అనుభవాలను కలిపి తృతీయ భాగంగా రాయించాలని ఆ జగదీశ్వరిని వేడుకుంటున్నాను.

ఈ ముద్రణకు ఎవరినీ అడగటానికి మనసొప్పలేదు. అమ్మనే మనస్ఫూర్తిగా అర్థించాను. దానికి అమ్మే ఏర్పాటు చేసింది. అడగకుండానే అతివిశాల హృదయంతో ముద్రణకు ఇతోధికంగా తోడ్పడిన J. Ramesh Kumar (Ashok Pharmaceuticals - Chennai) బెండపూడి అక్కిరాజుగారు, జి.రామలింగేశ్వరరావు గారికి టి.టి. అప్పారావన్నయ్యకు, ధనుంజయ (కామయ్యపాలెం) వారి సత్సంగంలో వచ్చిన డబ్బును ఈ పుస్తక ముద్రణకు పంపించారు. వారందరికీ నా హృదయపూర్వక నమస్కృతులు.

కవర్‌పేజీని సర్వాంగ సుందరంగా అందించిన గణేష్ గ్రాఫిక్సు గుంటూరు వారికి, సకాలంలో అతి ఆకర్షణీయంగా ముద్రించి ఇచ్చిన **సత్యం** ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్ అధినేత, ఎమ్.కె. కుమార్ గారికి, వారి సిబ్బందికి ప్రత్యేక ధన్యవాదాలు.

ఇట్లు,
అమ్మ చరణ సేవలో,
అయ్యగారి కుసుమా చక్రవర్తి.





అమ్మతో ఎ.ఎస్. చక్రవర్తి
ఎ. కుసుమా చక్రవర్తి

# అమ్మ కుటుంబం



శ్రీ నాన్నగారు (బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు), బామ్మ (కనకమ్మ గారు), అమ్మ,
శ్రీ సుబ్బారావు, హైమవతి, రవీంద్రరావు.

# అమ్మ సచ్చరిత్ర

అమ్మ వివాహమై రేటూరు వెళ్తుండగా నాన్నగారు "జిల్లెళ్ళమూడిలో ఉండవలసి వస్తుందేమో ఉండగలవా ?" అని అమ్మను అడిగారు. దానికి అమ్మ "మీరు ఎక్కడ ఉంటే అక్కడే నేనూ ఉంటాను, అదే నాకు ఇష్టమైన ప్రదేశమని" తన అంగీకారాన్ని తెలియజేసింది. "పచ్చి దోసకాయలు, మొక్కజొన్న కండెలు, పాలు, పెరుగు, కూరలు సమృద్ధిగా దొరుకుతాయి. చెరువుకు వెళ్ళి నీళ్ళుతెచ్చుకోవాలి. బస్తీలో కన్నా ఇక్కడ చాలా తక్కువ ఖర్చుతో జీవనం చెయ్యవచ్చు" అని జిల్లెళ్ళమూడిలో ఉండే కష్ట సుఖాలను నాన్నగారు అమ్మకు విశదీకరించారు. "జిల్లెళ్ళమూడిలో పాలూరి శేషయ్యగారి భార్య పొలానికి వెళ్ళి మగవాడిలా పొలం పనులన్నీ చేసుకుంటుంది. ఆ ఊరిలో వుంటే నీవు కూడా ఆ పనులన్నీ చేసుకోవాలని" చెప్పారు. అమ్మ "సరే" అన్నది.

పెళ్లి అయిన రెండు సంవత్సరాలకు అమ్మ కాపురానికి బాపట్ల వెళ్లింది. అమ్మకి తరుచూ గర్భస్రావం జరగటం వలన ఆరోగ్యం క్షీణించింది. అందుకని అమ్మ చీరాల బేర్ ఆస్పత్రిలో 8 నెలలు ఉంది. ఆ సమయంలో పెళ్ళికి వచ్చిన బంగారం, డబ్బు అంతా ఖర్చు అయిపోయింది. "ఆ ఆస్పత్రి వాళ్ళు నన్ను ఎంతో ప్రేమగా చూశారు. అందరినీ అలా చూస్తారనీ కాదు. నా మీద అంత ప్రేమ ఎలా ఏర్పడిందో తెలీదు", "ఆ పిండం పోయినపుడు నేనే గుంట తీసి కప్పి పెట్టాను. ఆ కాన్పు సమయంలో కనకమ్మ బామ్మ తప్పించి ఎవరూ లేరు. ఆడ మగ అన్నీ తానే అయి బామ్మే చేసింది" అని అమ్మ చెప్పింది.

ఆస్పత్రిలో ఉన్నప్పుడు అమ్మ రోజూ చర్చికి వెళ్ళేది. బైబిల్ని చదివేది. చర్చులకు వెళ్లలేదు కానీ చర్చీలకు వెళ్ళింది. ధర్మామీటరు పెట్టి జ్వరం కొలవటం, ఇంజక్షన్లు చెయ్యటం అన్నీ అమ్మ అక్కడే నేర్చుకుంది. అందరికీ ఆరు నెలలు పట్టే నర్సు ట్రైనింగు అమ్మ రెండు నెలల్లో పూర్తి చేసింది.

అమ్మ మొదటి సంతానమైన సుబ్బారావు అన్నయ్య 23-10-1939 లో

గుంటూరు కుగ్లర్ ఆస్పత్రిలో జన్మించాడు. నాన్నగారు ఉద్యోగ ప్రయత చేసినా ఏమీ కలిసి రానందున కరణీకం చేసుకోవటానికి జిల్లెళ్ళమూడిలో కా పెట్టారు. 1940 సం॥లో అమ్మ జిల్లెళ్లమూడి వెళ్లింది. ఆ గడ్డ మీద వె నుండీ ఏదో ఒక రకంగా అన్నదానం జరిగేది. ఖగ్గా పున్నయ్య అనే భూస్వా మంచి మనసు, దాతృత్వం కలవాడు. ఆ ఊరికి ఏ పండితులు వచ్చినా వా పండిన ధాన్యాన్నిచ్చి ఘనంగా సత్కరించేవాడు. ఏ ఒక్కరూ జిల్లెళ్లమూడి నుం ఆకలితో వెళ్ళటానికి వీల్లేదు. ఎవరు వచ్చినా వారింట భోజనం చేయవలసిందే. ఎంతోమంది పేద పిల్లలు ఆ ఇంట పెరిగారు. అలా పెరిగిన వారిలో రెడ్డి సుబ్బయ్య ఒకడు. "కరణం గారికి కాఫీ ఇచ్చేందుకు ఈ గేదెను ఉంచుకోమని" నాన్నగారి ఇంటికి గేదెను తోలించాడు ఖగ్గా పున్నయ్య. ఆయన భార్య ఇంటింటికి వెళ్ళి అందరూ భోజనం చేసారని చెప్పిన తరువాతే భోజనం చేసేది. ఎవరు భోజనం చేయలేదన్నా తృణమో, ఫణమో వారికి ఇచ్చేది.

విధి వశాత్తు క్రమేపి ఆయన ఆస్తి తరిగిపోయింది. దయా, దాన గుణాలతో జీవనయాత్ర సాగించిన వ్యక్తికి జీవిత చరమాంకంలో ఆర్థిక ఇబ్బందులు ఎదురయ్యాయి. ఆ సమయంలో రెడ్డి సుబ్బయ్య అమ్మ దగ్గర ఉన్నాడు. ఒకమారు పున్నయ్య గారి ఇంటి ముందు నుంచి అమ్మ దగ్గరకు వస్తున్నాడు. ఖగ్గాపున్నయ్య గారు, రెడ్డి సుబ్బయ్యను పిలిచి "ఒక అర్ధ రూపాయి ఇవ్వరా?" అని అడిగారు. రెడ్డి సుబ్బయ్య దుఃఖ విహ్వాలుడై ఆ విషయం అమ్మకు నివేదించాడు. వెంటనే అమ్మ రెండు రూపాయలు ఆయనకు పంపింది. అమ్మ కాపురానికి వచ్చిన అప్పుడున్న "వారి పరిస్థితులు చూచిన వారికెవరికైనా ఇప్పుడు ఆయన పిల్లలు ఆర్థిక స్థితి చూస్తే బాధతో మనసు వేయి ముక్కలవుతుంది. కానీ వారి పిల్లలకా బాధ లేదు ఈ గడ్డమీద ఎక్కడో అక్కడ భోజన కార్యక్రమాలు కుంటుపడకుండా జరుగుతున్నాయని ఎంతో ఆనందిస్తున్నారు. ఆ సంగతి విన్న ఒక అన్నయ్య "అంత దానాలు చేసినవారికి అటువంటి పరిస్థితులు ఎందుకు వచ్చాయని" అడిగాడు. దానికి అమ్మ "ప్రాప్తాన్ని బట్టి దానం జరుగుతుంది కానీ పాత్రతను బట్టి దానం జరగదని" చెప్పింది.

అమ్మా వాళ్ళింట్లో మంత్రాయి జీతగాడుగా ఉన్నాడు. బాల్యంలోనే అతనికి అమ్మ అన్నం కలిపి పెట్టింది. అమ్మ వాళ్ళు జిల్లెళ్ళమూడి వచ్చాక 15సం॥లు అమ్మ దగ్గర పనిచేశాడు. అతను నాగలి పట్టి దున్నుతున్నప్పుడు అమ్మ ఆ నాగలి మీదే దర్శనం ఇచ్చేది. అతను ఏ పనిచేస్తున్నా అమ్మ ధ్యాస తప్పించి మరోధ్యాస ఉండేది కాదు.

మంత్రాయి ఇంట్లో అన్నం వండుకుంటే కూరల కోసం అమ్మ దగ్గరకు వచ్చేవాడు. ఒక రోజు రాలేదు. అమ్మ ఎన్ని కబుర్లు పెట్టినా, నాన్నగారు వెళ్ళి చెప్పినా కూడా రాలేదు. అమ్మ వాకిట్లోకి వెళ్ళి చూస్తే ఒక ప్రక్కన కూర్చుని కనిపించాడు. అమ్మ "ఎందుకు రాలేదురా? నాతో కూడా చెప్పకూడదా'' అని బలవంతం చేసింది. "నా సంగతి సరేనమ్మా ఎంత మంది ఊళ్ళో అన్నం తినకుండా ఉన్నారో'' అని బాధ పడ్డాడు. మన అనుకునే స్వభావం కలవాడు కాబట్టే అమ్మ అనుంగు బిడ్డడు అయినాడు. మంత్రాయికి గ్లాసులో నీళ్ళు పోసినా ఆ రోజుల్లో స్నానం చేయాల్సిందే. ఆ రోజుల్లో మడి, ఆచారం ఉధృతంగా వుండేవి. కానీ తరువాత తరువాత అతనికి ఏమైనా పెట్టినా స్నానం చేయకుండా ఉండేందుకు బామ్మా వాళ్ళు ఒప్పుకున్నారు. "దానితోనే రివల్యూషన్ మొదలైంది" అన్నది అమ్మ.

అమ్మ రవ్వ జల్లిస్తోంది. మంత్రాయి మొక్కజొన్నలు దంచుతున్నాడు. గాదె చాటున రెడ్డి సుబ్బయ్య అనుమానంతో నించున్నాడు. మంత్రాయి ఏడుస్తున్నాడు. జాలితో అమ్మకు కన్నీరు వచ్చింది. ఆ చాటుగా నిలుచుని వింటున్న రెడ్డి సుబ్బయ్యకు కందిరీగ కుట్టింది. సాక్షాత్తు రాజరాజేశ్వరినే అనుమానించినవాడు శిక్షార్హుడే. కానీ అమ్మ దయామయి కాబట్టి అంతటితో వదిలి పెట్టింది. కాఫీ కలిపి మంత్రాయిని రమ్మని అమ్మ సంజ్ఞ చేసింది. ఆ వూరిలో అది తప్పు.

పెద్ద వేదాంతి అయిన తిరువేంగళాచార్యులు మంత్రాయి గురించి, అమ్మ గురించి అనేక అపోహలు లేవదీసారు. నాన్నగారు మంత్రాయిని ప్రేమగా

చూడమన్నారు. "ఊరివాళ్ళు అనుమానపడ్తున్నారని" అమ్మ చెప్పింది. నాన్నగారు "అవి ఏమీ పట్టించుకోవద్దని" తోసిపుచ్చారు. "మనిషి, మనిషితో మాట్లాడితే తప్పు. రెండోది లేదు. ఆ రకమైన విషయాల్లో ఆ ఊరు అంతగా బూజు పట్టింది. రెడ్డి సుబ్బయ్య వెళ్ళి ఊరు ఊరంతా తాను నిజం గ్రహించానని చెప్పుకున్నాడు. ఎవరైతే నా గురించి అనుమానపడ్డారో వాళ్ళు అందరూ దెబ్బతిన్నారు. వాళ్ళకి తినాలని లేక పోయినా దెబ్బతిన్నారు. వాళ్ళు దెబ్బ తినాలన్న కోరిక నాకు ఎప్పుడూ లేదు. ఎట్లా తిన్నారంటే బంతి గోడకు విసిరితే ఎంత వేగంగా వస్తుందో అంత గట్టిగా దెబ్బతిన్నారు. నాకు చాలా బాధ అనిపించింది.

చిన్న కోటయ్య, రెడ్డి సుబ్బయ్య నాకు తోడుగా ఉండటం గురించి అనుమానపడి". "నువ్వు చేస్తున్న పని ఏమిటి? అని నన్ను రెట్టించి" అడిగారు. "నేనేమీ మాట్లాడలేదు. అందులో నేను భాగం పంచుకుంటేగా సమాధానం చెప్పటానికి. ~~ఈ~~ ఊరు లంక. లంకలో సీతాదేవి ఉన్న మాదిరిగానే గడిపాను. ఒంటరిగా ఉండటం తరుచూ జరిగేది. కొన్నాళ్ళు మంత్రాయి, కొన్నాళ్ళు రెడ్డి సుబ్బయ్య వస్తుండేవారు. విద్యావంతులు, శాస్త్రవేత్తలు, ధన సంపన్నులు వంకరగా ఆలోచించేవారు. అలాంటిది ఏ విద్యా గంధం లేని వాళ్ళకు అనుమానం రావటంలో విశేషమేమున్నది అనిపించేది కానీ ఆ ఊరి వాళ్ళ మీద నాకెప్పుడు కోపం రాలేదు."

ఆవూళ్ళో రెండు పార్టీలుండేవి. పార్టీకక్షలతో ఎప్పుడూ వూరు కుతకుత ఉడుకుతుండేది. ఏ క్షణాన ఏమి వినవలసి వస్తుందోనని అందరూ ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకొని కాలం గడుపుతున్న రోజులు. శ్రీ నాన్నగారు గ్రామంలో ఒక పక్షానికి చేరటానికి కారణం అమ్మే అనుకున్నారు. అందుకు అమ్మను చంపటానికి, ఘోరనేరాలు చేయటానికి, కూడా విఫలయత్నం చేసారు. ఆ రోజుల్లో అమ్మకు రక్షణగా మంత్రాయి నిలిచాడు. అతను చేసిన సేవలు, మరవలేనివి ఆశ్చర్యం కలిగించేవి. తమ ఉదరపోషణ తప్ప మరో ధ్యాసలేని గ్రామస్థులు కొందరు 'అమ్మ' పై అభూతకల్పనలు చేసి అనేక రకాల నిందలు మోపారు. గ్రామకక్షలు ఆనిందలకు ఆజ్యం పోసాయి.

"మన్నవ భూషణం గారి తండ్రి మన్నవ కృష్ణశర్మగారి దృష్టిలో నేను చెడిన దాన్ని. చెడ్డదాన్నని కూడా అన్నాడు. మా ఆడ బిడ్డ పెళ్ళిలో నేను తాకిన అరిసెలు తినలేదు. నేను వంట గదిలోకి వస్తే భోజనం చేయనన్నారు మళ్ళీ అటువంటి ఆయనే మాల వాళ్ళు కూడా ఇంట్లోకి రావటానికి ఇష్టపడ్డారు. ఆయన్ని మౌనస్వామిగారు నా దగ్గర మంత్రం పుచ్చుకోమని కలలో చెప్పారని ఉపదేశం కూడా తీసుకున్నారు. నేను వస్తే చాలని నమస్కారం చేశారు. "నా గురించి ఇటు బంధువులు కానీ, అటు బంధువులు కానీ, పెళ్ళిళ్ళకు శుభలేఖలు కూడా పంపించేవారు కాదు." నాన్నగారి తమ్ముడు లోకనాథం పెళ్ళి తరువాత బంధువులలో కొంచెం మార్పు వచ్చింది. మరిది పెళ్ళిలో అమ్మ పెద్దకొడుకు సుబ్బారావును తీసుకు వెళ్ళి పులిపాక మామయ్యకు ఇస్తే పిల్లలను ఎత్తుకోవడం అలవాటు లేదన్నాడు. పెళ్ళిలో నేను పసుపు రాస్తుంటే ఈ అమ్మాయి ఎవరు ? పసుపు రాయటానికి తీసుకు వచ్చారా ? అని ఒకరు అడిగారు. దానికి మా అమ్మ చెల్లెలైన, వరాలు పిన్ని నా అక్క కూతురు అని అనలేక పోయింది. ఎందుకంటే అప్పుడు నా మెడలో ఒక్క నల్ల పూసలే ఉండేవి" అని అమ్మ తెలియచేసింది.

1940 లో అమ్మ జిల్లెళ్ళమూడి వచ్చినా 1947 సెప్టెంబరు 17 వరకు ఆ ఊరి వారెవరితోనూ మాట్లాడలేదు. ఆ ఊరిలో ఒక పార్టీవారు మహిళా సంఘాన్ని ఏర్పాటు చేయాలనుకున్నారు. మంత్రాయి వచ్చి కొన్ని సలహాలు అడిగాడు. అమ్మ ఆ గ్రామ ప్రజల కోసం కోఆపరేటివ్ సొసైటీని, సర్వోదయ విధానాన్ని ఏర్పాటు చేసింది. కానీ వాటిని వారు సరిగ్గా నిర్వర్తించలేక మూసివేసారు. క్షయవ్యాధితో మంత్రాయి మరణించాడు. అమ్మలోని అలౌకికతను, దివ్యత్వాన్ని గమనించిన మంత్రాయి ఆ కుటుంబంలో పాలేరుగా వుండి తనవంతు సేవలను అమ్మకు అందించి అమరుడైనాడు. మంత్రాయి అమ్మ సన్నిధికి రాకపూర్వం యజమానులు చెప్పిన అనేక దుష్టకార్యాలను చేసాడు. దుష్టులను సంహరించడం కాక మనిషిలోని దుష్టత్వాన్ని మాత్రమే సంహరించి వారిని రక్షించాలంటుంది అమ్మ.

అమ్మ సామాన్య గృహిణిగా వుంటూనే మధ్యమధ్య తన దివ్యత్వాన్ని ప్రదర్శించేది. అందులో భాగంగానే ఒకమారు 3 సోలల బియ్యం వండి 60,70 మందికి భోజనాలు పెట్టింది. సుబ్బారెడ్డి గొడ్లను తోలుకు వచ్చాక "కాళ్ళుకడుక్కురారా! అన్నం పెడ్తానన్నది", "ఇంత మందికి పెట్టావు ఇంకా అన్నం ఎక్కడది?" అని అడిగాడు. "పోరా ! కాళ్ళుకడుక్కొచ్చి గిన్నె చూసుకో అన్నది అమ్మ. తీరా సుబ్బారెడ్డి మూత తీసి చూస్తే గిన్నె నిండుగా అన్నం వుండటంతో ఆశ్చర్యచకితుడై అమ్మకు అంజలి ఘటించాడు.

అమ్మకు పెళ్ళి తరువాత హిస్టీరియా వచ్చింది. బామ్మకు దయ్యాలు, భూతాలు మీద నమ్మకం ఎక్కువ. దానితో అమ్మకు వచ్చిన ఫిట్సు దయ్యం పట్టినందువల్లే వస్తున్నాయని అనుకుంది. 1942లో శ్రీరంగం నుంచి దయ్యాల రంగాచారిగారు అమ్మకు పట్టిన దయ్యాన్ని వదలగొట్టాలని వచ్చారు. వారితో పాటూ వచ్చిన పిడుగు లక్ష్మీనారాయణ రుద్రాక్ష మాల తీసుకుని పలుకు పలుకు అని అమ్మ వీపు మీద కొట్టారు. అలా అమ్మ అనేక ఆరళ్ళకు గురి అయింది.

భగవంతుడికి ప్రత్యామ్నాయం దేవాలయాలు. అమ్మవారు కోరికలు తీర్చేటప్పుడు కామేశ్వరి అయింది. లాలించేటప్పుడు లలిత అయింది. ఆడుకునేటప్పుడు బాల అయింది. అసలు ఇన్ని రూపాలు ఎక్కడివి. అన్నీ ఆ దేవతేగా. "అన్నం ఆరోగ్యవంతుడు తింటే ఒంటికి పడుతుంది. అనారోగ్యవంతుడు తింటే విషమౌతుంది. చూస్తే కనపడను, కనపడితే చూస్తారు" అని అమ్మ తన గురించి తెలియజేసింది. బ్రహ్మచర్యమంటే కేవలం పెండ్లి చేసుకోకపోవటం కాదు. బ్రహ్మచర్యమంటే లింగభేదమూ, రూప భేదమూ, స్పర్శభేదమూ లేకుండా ఉండటం.

అమ్మ వల్ల సిద్ధపురుషులైన వారిలో రహి, శ్యామలలు ముఖ్యులు. ఒక సందర్భంలో ఒకరు అమ్మను చెట్టు కిందపడవేసి కత్తి తీసుకుని పొడవాలనుకుంటే సరిగా అదే సమయంలో రహి చెట్టు మీద నుంచి దూకి ఆ వ్యక్తి చేతిలో కత్తిని లాక్కుని "మహాసాధ్విని ఈ విధంగా బాధలు పెట్టవచ్చా ? ఇంత దారుణానికి

ఒడికట్టావా?" అని గద్దించి ఆ కత్తిని తీసుకుని అదృశ్యమయినాడు. ఎన్నిమార్లో అమ్మను ఎప్పటికప్పుడు కాపాడుతూ, కంటికి రెప్పలా చూచుకునేవాడు రహి. ఇంక అమ్మను రక్షించవలసిన అవసరం లేదు కాబట్టి తాను శరీరం చాలిస్తానని, తను వచ్చిన పని అయిపోయిందని యార్లగడ్డ రాఘవయ్యగారికి రక్తాక్షరాలతో ఉత్తరం రాశాడు రహి.

రహికి దూరశ్రవణం, దూరదర్శనం, అదృశ్యం మొ॥ అనేక సిద్ధులు వున్నాయి. తన మరణం సంగతి ముందుగానే తెలుసుకోగలిగిన సిద్ధ పురుషుడు. రహి చాలా సంవత్సరాల అనంతరం అమ్మ పైకి ఎవరైతే పూర్వం కత్తి ఎత్తారో, ఆ కత్తినే అతని వద్దకు తీసుకు వచ్చి "ఇకనేను శరీరం చాలిస్తున్నాను. అమ్మకు సేవ చేయవలసిన అవసరం తీరిపోయిందని" ఆ కత్తితో తన్ను తాను పొడుచుకున్నాడు. అతని రక్తంతో అక్కడ మట్టి తడిసిపోయింది. అక్కడే శరీరాన్ని పరిత్యజించాడు. అతనిని అక్కడికక్కడే భూస్థాపితం చేసారు.

"17-11-1943వ సం॥లో బాపట్లలో చిదంబర తాతాగారి మాతృశ్రీ సదనంలో హైమ జన్మించింది. షేక్‌మస్తానువాళ్ళు నాలుగు తరాలనుంచీ మోతాదులు చిన్నతనంలో వేరుశెనగకాయలు, ఏవైనా తినుబండారాలు పెట్టి అమ్మ వాళ్ళచేత హరేరామ, హరేకృష్ణ నామాన్ని ప్రతి సాయంత్రం చేయించేది. 10 మంది పిల్లల దాకా వచ్చేవారు. గ్రామం మొత్తం అందరిళ్ళలో ఎసట్లో బియ్యం పోసేప్పుడు అందరినీ తలా ఒక గుప్పెడు బియ్యం వేరే ఉంచమన్నది అమ్మ. నెల అయ్యాక అవన్నీ అమ్మకు ఇచ్చేవారు. లేని వాళ్ళకు అమ్మ ఆ బియ్యాన్ని పంచుతుండేది. అమ్మ రెండు శేర్లు అన్నం వండేది. ఆ రెండు శేర్లు అన్నమే 50 మందికి సరిపోయేది. 1954వ సం॥ నుంచి బయట ఊళ్ళ జనం ఎక్కువగా రాసాగారు. రేటూరు, పూళ్ళ, సింగుపాలెం నుంచి వచ్చేవారు.

చిన సుబ్బయ్య, మరకా నాగేశ్వరరావు, రామయ్య, ముగ్గురు కూర్చుని ఉండగా అమ్మ సోలెడు బియ్యం కడుగుతుంటే ఎనిమిది మందికి అది ఎలా సరిపోతుందని అడిగారు. "తల్లికైనా, బిడ్డకైనా తెరగుడ్డ అడ్డుండాలని" కూర,

పప్పు పచ్చడి, చారు అన్నీ తయారు చేసి వాళ్ళ ముగ్గురుకీ అన్నం పెట్టింది. గిన్నెలో సగం అన్నం మొదటే వాళ్ళ విస్తళ్ళలో వడ్డించింది. మళ్లీ మళ్లీ అడిగి పెట్టుంచుకున్నారు. మొదట పెట్టినంత మళ్లీ పెట్టినా గిన్నెలో అన్నం మిగిలే ఉంది. అమ్మ ఎంత కొంచెం అన్నం వండినా అందరికీ సరిపోతుందని ఊళ్లో జనం అనుకునేవారు.

షేక్ మస్తాన్ ఇంటి శంఖుస్థాపనకు ఖగ్గా సుబ్బయ్యగారు, నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు, చలమయ్య గారు వెళ్ళారు. నాన్నగారు లోపలికి దిగి కొబ్బరికాయ కొడితే సరిగ్గా మధ్యకు పగిలింది. అది చూచి మస్తాను "నాన్నగారు కొడితేనే ఇంత బాగా పగిలింది. అమ్మగారే కొడితే నాపని దేదీప్యమానంగా ఉంటుందని" మనసులో అనుకున్నాడు. వెంటనే నాన్నగారు "ఏమిట్రా మీ అమ్మగారు కొడితేనే దేదీప్యమానంగా ఉంటుందా ? మరి నేనెవర్ని?" అని అన్నారు. దానితో తెల్లబోవడం మస్తాను వంతు అయ్యింది. "ఇల్లు కట్టేటప్పుడు నన్ను పిలవమని" నాన్నగారు చెప్పారు.

ఇల్లు కట్టేటప్పుడు నాన్నగారు వచ్చి "ఆరు నూరైనా, నూరు ఆరైనా దీనికి తిరుగు లేదురా" అని చెప్పారు. షేక్ మస్తాన్‌కు నలుగురు ఆడ పిల్లలు, నలుగురు మగ పిల్లలు. ఒకమారు ఉప్పెన వచ్చింది. ఎక్కడెక్కడి ఇళ్ళు, చెట్లు అన్నీ కూలిపోయి ఎంతోమంది మరణించారు. అటువంటి పరిస్థితుల్లో వీళ్ళ ఇంట్లో **10** మంది మనుషులతో పాటూ గొడ్డు, గోద మొత్తం **48** జీవాలున్నాయి. **30** బస్తాల మినుములున్నా ఒక్క గింజ తడవడం గానీ, ఏ ఒక్క జీవి మరణించడం గాని జరగలేదు. నాన్నగారు దీవించిన ఇల్లు కాబట్టి వాళ్ళ ఇల్లు కూలిపోకుండా ఉండటమే కాక కనీసం ఏ ఒక్కరూ తడవను కూడా తడవలేదని వాళ్ళ విశ్వాసం.

నాన్నగారు, మస్తానుచేను కొలిచి కొత్త చెరువు దాకా వచ్చాక కాళ్ళకు బురద అయితే నాన్నగారిని నిలబెట్టి దోసిళ్ళతో నీళ్ళు పోస్తూ "చిన్నప్పటి కురుపుల మచ్చలు అయి వుంటాయని" మస్తాన్ మనసులో అనుకున్నాడు. "ఏమిట్రా అవి కురుపుల మచ్చలు కాదురా ! నాగేంద్రుని మచ్చలు" అని నాన్నగారు అన్నారు.

మాతృశ్రీ నాట్యమండలి అని పేరుతో ఒక డ్రామా కంపెనీ పెట్టారు. అందులో పాండవ ఉద్యోగ విజయాలు అన్న నాటకం అమ్మ నేర్పితే వేసారు. పెద్ద గుడి అనగా అనసూయేశ్వరాలయం ఉన్న చోటు ఎత్తుగా ఉండేది. అదే డ్రామా స్టేజ్, ఆ స్టేజ్ దగ్గర చాలా ఆకర్షణ ఉందని పెద్ద డాబా వస్తుందేమో అని మస్తాన్ అనుకున్నాడు. ఇప్పుడు అక్కడే దేదీవ్యమానంగా వెలిగే అనసూయేశ్వరాలయం వచ్చింది.

రెడ్డి సుబ్బయ్య మొదట్లో టీలు పెడ్తుండేవాడు. అమ్మను కనిపెట్టుకొని అమ్మ చెప్పిన పనల్లా చేసేవాడు. నాన్నగారు జమాబందీ కోసం బాపట్ల వెళ్ళినపుడు సాయంత్రం **6** గం॥లకు నాన్నగారి కోసం అమ్మ అన్నం పట్టుకుని డ్రైన్ కాలువ పక్కగా మూల పాలెం మీదుగా బాపట్లకు నడిచి వెళ్ళేది. రెడ్డి సుబ్బయ్య అమ్మకు సాయంగా వస్తానంటే "నీవు పిల్లల దగ్గర ఉండు నేను వెళ్ళి వస్తానని" చెప్పేది. కానీ అతనికే ప్రాణం ఒప్పక అమ్మ వెనకాల వెళ్ళేవాడు. అతనెంత స్పీడుగా నడిచినా అమ్మను అందుకోలేకపోయేవాడు. అమ్మ కనిపించే వరకు వెళ్ళి తిరిగి వచ్చేవాడు. అమ్మ బాపట్ల నుంచి ఏడున్నర గంటల కల్లా తిరిగి వచ్చేది.

అమ్మ చెరువుకి నీళ్ళ కోసం వెళ్ళేది. అమ్మను అల్లరి చేయబోయిన వాళ్ళని అమ్మా వాళ్ళింట్లో ఉన్న గుడ్డి గేదె తన కొమ్ములతో పొడిచి, అమ్మ దరిదాపులకు కూడా ఎవరినీ రానిచ్చేది కాదు. మొదట్లో అమ్మను అల్లరి పెట్టాలని చూచిన వాళ్ళే కాలక్రమేణ వారిలో మార్పు వచ్చి అమ్మ దగ్గరకు వచ్చారు. రామకృష్ణ అన్నయ్య వాళ్ళు "ఎందుకమ్మా వాళ్ళను రానిస్తావు" అన్నారు. దానికి అమ్మ "వాళ్ళు పశ్చాత్తాపంతో నా దగ్గరకు వచ్చారని" చెప్పి వారికి అన్నం కలిపి ముద్దలు పెట్టటమే కాక బట్టలు కూడా పెట్టింది. అటువంటి జగన్మాతృత్వం చరిత్రలో మనకు ఎక్కడా కనిపించదు.

రెడ్డి సుబ్బయ్యతో అమ్మ "ఎప్పుడు ఎవరు వచ్చినా అన్నం పెడతానురా" అన్నది. సంస్థలో బియ్యం లేనపుడు రెడ్డి సుబ్బయ్య ఆరుగురు మనుషుల్ని

పిలిచి "అమ్మని అన్నం అడగమని" చెప్పాడు. అమ్మ పనివాడితో ఆ డబ్బాలో బియ్యం కడిగి తీసుకురమ్మంది. అందులో సోలెడు బియ్యం మాత్రమే ఉన్నాయి. ఆ బియ్యం అన్నం వండి ఆ ఆరుగురికి విస్తళ్ళు వేసి పప్పు, కూర, పచ్చడి, చారు వేసి మళ్ళీమళ్ళీ మారు అడుగుతూ వారికి కొసరి కొసరి తినిపించింది. సుబ్బయ్య "ఇంకా తినండిరా తినండి అన్నాడు. మా కడుపులు నిండాయి ఇంక మేము తినలేమని" అమ్మ కాళ్ళ మీదపడి నమస్కారం చేసారు వాళ్ళు.

రెడ్డి సుబ్బయ్య నాగలితో పొలం దున్నుతుంటే అమ్మ దానిమీద కూర్చుంది. "నీవు నాగలి మీద కూర్చుంటే నేను చేను ఎలా దున్నుకోను"? అన్నాడు. వెంటనే అమ్మ ఆకాశంలో చాలా పెద్దగా, శ్రీకృష్ణుడు తన ఆకారాన్ని పెంచి కురు సభలో విశ్వరూప సందర్శనం ఇచ్చినట్లు అమ్మ అతనికి దర్శనం ఇచ్చింది.

మళ్ళా అంజయ్య జిల్లెళ్ళమూడి నివాసి, అతను 15 సంవత్సరాల వయస్సు నుంచీ పొలం పనులకు వెళ్ళేవాడు. అమ్మ అతన్ని పిలిచి "జీతగాడు రానప్పుడు నాలుగు రోజులు నీళ్ళు పోయమని" అడిగేది. అమ్మ ఏం చేసుకున్నా ఊళ్ళో పిల్లలను పిలిచి పెట్టేది. "ఏమిటి? ~~ఈ~~ అమ్మ ఇలా పెడుతుంది" అనుకున్నాడు. కొన్నాళ్ళు గడిచేక అమ్మ తత్త్వమే అంత అని తెలుసుకున్నాడు. ఎవరికి ఒంట్లో బాగుండక పోయిన వాళ్ళను పిలిచి పాయసమో, పాలో ప్రసాదంగా ఇచ్చేది.

రామయ్య, కిష్టయ్య, జీతగాడు సుబ్బారెడ్డి, రెడ్డి సుబ్బయ్య వెళ్ళి అమ్మ దగ్గర కూర్చున్నారు. అమ్మ "ఏమిరా! ఇంత మంది వచ్చారు?" అని అడిగింది. దానికి "వాళ్ళు ఏమీ లేదమ్మగారు" అన్నారు. "అమ్మగారు కాదురా మా అమ్మను" అని చెప్పింది. అప్పటి నుంచీ అడపాదడపా వెళ్తుండేవారు. భాస్కరరావు అన్నయ్య అప్పుడప్పుడు వచ్చి వెళ్తుండేవాడు. సుబ్బయ్య రామయ్య, కిష్టయ్యలను "ఎన్ని బియ్యం తింటారు నాన్నా?" అని అమ్మ అడిగింది. దానికి వాళ్ళు ఒక్కొక్కరం శేరున్నర బియ్యం తింటాం అమ్మ" అని చెప్పారు. అమ్మ సోలెడు బియ్యం కొలిచి పొయ్యి మీద పెట్టింది. ముగ్గురుకీ విస్తళ్ళు వేసి అన్నం వడ్డించింది. గిన్నెలో కొంచెం అన్నమే ఉంది. "వాళ్ళు అమ్మను ఇంకొంచెం అన్నం పెట్టమని"

అడిగారు. అమ్మ గిన్నె తీసుకువచ్చి పెట్టబోతే గిన్నె నిండా అన్నం ఉంది. అన్నం అక్షయం అవటం చూచిన ముగ్గురూ అంజయ్యకు ఈ విషయం చెప్పారు. అప్పటి నుంచీ అమ్మ అవతార మూర్తి అనీ, సర్వదేవతా స్వరూపిణి అని వారి విశ్వాసం మరింత ధృఢమైంది. అంజయ్య, మస్తాన్ అమ్మ సన్నిధిలో ఎనలేని ఆనందాన్ని పొందేవారు.

మస్తాన్ "ఇంత మహిమ ఉంది కదా ! అందరికీ ఈ విషయం ఎప్పుడు అవగతమౌతుందమ్మా?" అని అడిగాడు. దానికి అమ్మ "జామ చెట్టు ఉంది దాని నిండా కాయలు ఉన్నా కనిపించకుండా ఆకులు కప్పేస్తాయి. కాయ పండి పక్వానికి వచ్చినపుడు ఎంత దూరంగా ఉన్నా ఆ వాసన ఎలా తెలుస్తుందో అలాగే జనం వస్తారు" అని చెప్పింది.

అమ్మ ఉండే పాకలో పాము పుట్ట ఉండేది. ఆ పుట్ట మన్ను తెచ్చి వాళ్ళకు ప్రసాదంగా పెట్టింది. అది సువాసనలు వెదజల్లుతున్నది. "అమ్మా మంచి వాసనలు వస్తున్నాయమ్మా" అన్నారు వాళ్ళు. "అందులో సెంటు కలిపాను నాన్నా!" అన్నది.

అంజయ్యకు చదువుకోవాలన్న తపన ఎక్కువగా వుంది. వాళ్ళపెద్దవాళ్ళు గొడ్ల కాచుకురమ్మనే వాళ్ళు. వాళ్ళ మామను బ్రతిమాలుకొని "నీ గొడ్లతో పాటు నా గొడ్లను కూడా చూడమని నాకు బడికి వెళ్ళి చదువుకోవాలని ఉంది" అని చెప్పాడు. అలాగే రోజూ ఇతర పిల్లలతో కలిసి బడికి వెళ్ళేవాడు. అంత చదువుకోవాలనే తపన అంజయ్యకు ఉందని తెలుసుకొని వాళ్ళవాళ్ళు అతనికి పలక బలపం కొని ఇచ్చారు. బడిలో అందరికంటే ముందుగా వ్రాయటం, చదవటం నేర్చుకున్నాడు. అందరూ రెండో ఎక్కంలో ఉంటే తాను ముందుగా **3,4** ఎక్కాలు చెప్పేవాడు. లెక్కల్లో ఎప్పుడూ ఫస్టు వచ్చేవాడు. ఆ విధంగా ఐదో తరగతి వరకు చదువు కున్నాడు. ఆ తరువాత చదువుకుందామనుకున్నా కుదరలేదు. ఆ మాత్రమైనా చదువుకోబట్టే అమ్మ సంధ్యావందనం, మంత్రపుష్పం చదవగలుతున్నానని ఎంతో ఆనందంతో తెలియపరిచాడు.

"నాన్నగారు ఎంత మహానుభావులు కాకపోతే అమ్మకు భర్త అయ్యారని అనుకుంటున్నారమ్మా" అని అంజయ్య అమ్మతో చెప్పాడు. దానికి అమ్మ "ఆయన మహర్షి" అని ధృవపరిచింది. "పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము", "పరివర్తనమే మార్పు", "దేహాన్ని కాదు గుణాలను శిక్షించటమే" అంటుంది అమ్మ. అందుకే ప్రేమ స్వరూపిణి అయిన అమ్మ మాతృదేవిగా ప్రేమను పంచి ఇచ్చి ధర్మసంస్థాపన చేయుటకు ఈ ధరణి మీద అవతరించింది.

మూడు కాలాలూ అమ్మకి ఏక కాలమే. దీనికి నిదర్శనగా పెద్ద అగ్ని ప్రమాదాన్ని, ప్రముఖులైన నెహ్రూ, కెనడీల వంటి వాళ్ళ మరణాన్ని అమ్మ కొన్ని గంటల ముందు సూచించింది. దేనికైనా తరుణం రావాలి నాన్నా! తరుణం లేకపోతే దగ్గర వున్నారాలేరు. చీరాల నుంచి మొదట్లో జట్టుగా వచ్చే అన్నయ్యలతో అమ్మ "కొద్ది నెలల తరువాత వాళ్ళు తరుచుగా వద్దామనుకున్నా రాలేరని" చెప్పింది. అక్షరాలా అలాగే జరుగుతోంది కూడా !

"కాలమే తానైనపుడు మూడు కాలాలు లేవు. కాలమంటే దైవమని, కాలమన్నా, దైవమన్నా ప్రేరణని, అదే సంకల్పమని, సంకల్పమే భగవంతుడని, వికల్పాలు కూడా సంకల్పంలోనివేననీ, దేవులాడినా దొరకనివాడే దైవమనీ, అంతా అయినదీ, అర్థం కానిదీ "అమ్మ" అని చెప్పటంలో "ధియోయోనః ప్రచోదయాత్" అని గాయిత్రీ మంత్రంలో చెప్పబడేది, "కాలోస్మి" అని భగవద్గీతలో చెప్పినదీ అమ్మే కదా!

చీరాల వాడరేవులో కొన్ని రోజులుండి రోజుకొక పేటకు వెళ్ళి శ్రామికులకు ప్రసాదం స్వయంగా పంచిపెట్టేది. ఒకరోజు కుష్టు ఆస్పత్రికి వెళ్ళి అక్కడున్న కుష్టు వారిని యోగక్షేమాలడిగి వారికి ప్రసాదం పెట్టి ఆదరించింది. అక్కడే 15 సం॥ నుండీ మంచంలో కుష్టువ్యాధి పీడితయై దయనీయ స్థితిలో ఉన్న ఒక స్త్రీని చూచింది అమ్మ. ఆమె మంచం మీద కూర్చుని ఆప్యాయంగా పలకరించింది. ఆ స్త్రీ సంతోషంతో "ఏసయ్యా! నాకోసం ఇట్లా వచ్చావా?" అని ఆనందభాష్పాలు రాలుస్తూ అన్నది.

ఆమెను కదిలించి ఇటు తిప్పుకోవటంలో అమ్మ చేతికి మలం అంటుకున్నది. అయినా అమ్మ అసహ్యించుకోలేదు. ఆమెకు కాస్త నీళ్ళు పోసి, ప్రసాదం ఇచ్చి, ధైర్యం చెప్పి అమ్మ ప్రయాణమయింది. ఆమె ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమైనాయి. ఆ ఇల్లాలు ఏసు నామస్మరణ చేస్తూ ఎన్నోఏళ్ళ నుండి ఆ తండ్రి దర్శనం కోసం పరితపిస్తోంది. ఆమె అదృష్టవశాత్తు అమ్మే ఆమె మనో నేత్రానికి యేసుగా సాక్షాత్కరించింది. నామమేదైనా విశ్వాసమే భక్తునకు జీవగర్ర. ఏ నామంతో ఆరాధించే వారికి ఆ రూపం అమ్మలో గోచరిస్తుందనటానికి నిదర్శనమే ఈ సంఘటన.

అమ్మ పూరిపాకలో ఉండగా చిన్న జల్లుపడుతోంది. ఈదురు గాలి, చేనుకు నీళ్ళు పెట్టుకుందామని అంజయ్య వెళ్తుండగా మహాలక్ష్మిగారు, జిడ్డు ప్రసాద్ "అమ్మ" ఆ చీకట్లో రోడ్డు మీద నించున్నారు. అంజయ్యతో పాటు వాళ్ళూ పొలానికి నడిచి వెళ్ళారు. పొలంలో ఉన్న తుమ్మ మొక్కలను చూచి "ఇవి ఎవరివిరా?" అంటూ "ఈ జిల్లెళ్ళమూడి ప్రపంచానికే ఆధారమౌతుంది. ఈ తుమ్మ మొక్కలు పెద్దవయ్యాక అన్నపూర్ణాలయంకివ్వండిరా?" అని చెప్పింది. డ్రైన్ వెంబడి చాలా దూరం నడిచి "దేవుడి మాన్యం ఎంత దూరం ఉంది?" అని అడిగింది. అక్కడికి రెండు ఫర్లాంగులు ఉంటుందని అంజయ్య చెప్పాడు. "నన్ను ఎత్తుకు తీసుకు వెళ్లండిరా" అని అమ్మ చెప్పింది. వారు అలాగే చేసారు. అక్కడ డ్రైన్‌లో నీళ్ళు చెంబుతో తీసుకొని అందరికీ తీర్థంలా ఇచ్చింది. ఆ చెంబులోని తీర్థంలో ఏం మహత్యం వుందో, ఎవరెవరి పాపాలను ప్రక్షాళనం చేయుటానికి ఆ రాత్రి సమయంలో అమ్మ తీర్థం ఇవ్వటం చూస్తేదాని యొక్క పరమార్ధం అమ్మకే ఎరుక వారి వారి పూర్వజన్మ సుకృతంకాక మరి ఏమిటి?.

అంజయ్యను ఇటుకల బట్టీ దగ్గరకు వెళ్ళిరారా ! అన్నది అమ్మ. అక్కడకు వెళ్ళేటప్పటికి గుంటూరు నుంచి వచ్చిన పున్నయ్యగారు ఆ చీకట్లో అమ్మా అమ్మా అంటూ కనిపించారు. అంజయ్య ఆయనను అమ్మ దగ్గరకు తీసుకు వచ్చాడు. ఆవరణలోని గజేంద్రమక్కయ్య కృష్ణవేణి అక్కయ్య మిగిలిన వారంతా అమ్మ కోసం డ్రైన్ దగ్గరకు వచ్చారు. ఆ చెంబులో నీరు అందరికీ తీర్థంగా ఇచ్చింది.

తంగిరాల శాస్త్రిగారు మంత్రాలు చదువుతూ అమ్మకు పూజ చేయించారు. ఆ సమయంలో శాస్త్రిగారి అమ్మాయి బయట చేరినందున దూరంగా నుంచొని కళ్ల నీళ్ళు పెట్టుకుంది. అమ్మే ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి "రక్తం అంతా ఈశ్వర తత్త్వమే" అని ఆమెకు తీర్ధ ప్రసాదాలు ఇచ్చింది. సాక్షాత్తు రాజరాజేశ్వరి అయిన అమ్మకు పాపపుణ్యాలతో కానీ, మడీమైలలతో కాని పని ఏముంది. ఆమే సృష్టి కర్తకదా! సృష్టి కర్త బ్రహ్మరూపా, గోప్త్రీగోవిందరూపిణి. కొన్ని సం॥ల అనంతరం అదే ప్రదేశంలో అమ్మ ఆలయ నిర్మాణం జరగటం గొప్ప విశేషం.

ఐ.ఎల్.టి.డి. లో పనిచేసే లింగేశ్వరరావు గారు అమ్మ దర్శనానంతరం శనివారం రాత్రి వెళ్తామని అమ్మను అడిగారు. "ఈరోజు ఉండి రేపు వెళ్లండి నాన్నా" అన్నది అమ్మ. వారు ఆ పూట ఉండి ఆదివారం రాత్రి బయలుదేరుతుంటే అమ్మ ఎవరినో తోడు ఇచ్చి పంపించింది. అమావాస్య రోజు కావటంతో చిమ్మ చీకటి దారి, డొంక ఏమీ తెలియడం లేదు. ఏ విధంగా వెళ్లాలమ్మా అని అమ్మను ప్రార్థించారు. వెంటనే ముందుగా ఒక జ్యోతి కనిపించింది. దాని వెనుకనే వీరు వెళ్ళారు. ఆ జ్యోతి బాపట్ల దాకా వచ్చి అదృశ్యమైపోయింది. రైల్వేస్టేషన్ వెళ్ళేటప్పటికి వారి ఊరికి వెళ్ళవలసిన రైలూ రెడీగా ఉంది. అమ్మ ఎప్పుడూ మన వేనకాలే వుంటుంది కదా!.

రమణ మహర్షిని భగవాన్ అన్నారు. రామకృష్ణ పరమహంసను అవతారమూర్తి అన్నారు. వారిని సామాన్యులు గుర్తించక పోయినా వారు భగవత్ స్వరూపులే. ఎవరి సన్నిధిలో అఖండ శాంతి, ఆనందం అనుభవంలోనికి వస్తే వారిని దైవమని భక్తుల హృదయాలు కీర్తిస్తాయి. అలాగే జిల్లెళ్ళమూడి అమ్మ ఉఛ్వాస, నిశ్వాసాలతో ఉద్భవించిన ఆవరణకు కూడా చాలా ప్రత్యేకత ఉంది. ఏ కొండల్లోకో, అడవుల్లోకో పారిపోయి అక్కడ కళ్ళు మూసుకుని ఏకాగ్రత కోసం విఫల ప్రయత్నం చేయటం సృష్టిలో సర్వ జీవకోటిలోనూ ఏర్పడిన స్త్రీ, పురుష భేదాలను తప్పించుకో చూచి సహజోద్రేకాలను అణచకోలేక తపోభంగం పొందే కంటే ఈ ఆవరణలో ఎప్పుడూ అమ్మను ప్రేమిస్తూ, అమ్మనామాన్ని స్మరిస్తూ

సోదర ప్రేమలోనూ, సేవలోనూ సంపూర్ణ మానవత్వంలోని మాధుర్యాన్ని ఆశ్వాదిస్తూ నిత్య కార్యకలాపాల్లో ఎప్పుడూ వాళ్ళ దేహాలను నిమగ్నం చేసే వీరి తపస్సు చాలా సుగమం, సులభం, పతనానికి తావు లేనిది. సరియైన దృక్పథంతో చూస్తే సర్వత్రా విజ్ఞానాన్ని పొందవచ్చున్నది అమ్మ విధానం. దానికి ప్రత్యక్షతార్కాణమే జిల్లెళ్ళమూడి ఆవరణ.

అక్కడ ఉండే ప్రతి వారిలోని లోటుపాట్లు మిగిలిన వారికి సక్రమంగా ఉండేలా మెరుగు పెట్టేందుకు ఒరిపిడిగా ఉపయోగించబడతాయి. పనికి రానిదంటూ సృష్టిలో లేదంటుంది అమ్మ. తమ మీద తమకు నిగ్రహం లేనిచో ఆవరణలో ఎవరూ ప్రశాంతంగా ఎక్కువగా కాలం ఉండలేరు. ఇది అగ్ని పరీక్ష, క్లుప్తంగా చెప్పాలంటే జగత్తు, ఆవరణ, మన వ్యక్తిత్వం ఈ మూడింటికీ బ్రహ్మాండ, అండాండ, పిండాండాలకు ఉండే సంబంధమే ఉన్నది. ఒకదాని రహస్యం తెలిస్తే మరోదాని రహస్యం తెలుస్తుంది. ఒకదాన్ని సక్రమంగా సాధిస్తే సర్వాన్నీ సాధించవచ్చు. ఏకట్టుబాట్లూ లేని అమ్మ దగ్గర ఎవరి లోట్లు వారినే కట్టడిచేస్తాయి.

కళ్యాణానికి అమ్మ ఇచ్చిన నిర్వచనం "కళంక రహితమైన మనస్సును కళంక రహితంగా అర్పించటమే కళ్యాణం. సర్వాన్నీ అనుభవిస్తూ, సర్వాన్నీ వదలివేయటమే వివాహం" ఈ వివరణతో నిష్కామకర్మాచరణకు గృహస్థ జీవితమే తగింది. కానీ అమ్మ చెప్పిన నిర్వచనానుసారం గృహస్థ జీవితం గడపటం అసిధార వ్రతమే అవుతుంది. ఇటువంటి వివాహానికి, సన్యాసానికి ఏమీ తేడా లేదు. ఏ విషయాన్నైనా ముక్తకంఠంగా ఇలా చేయమని ఎవరితోనూ చెప్పదు. సర్వానికీ సాక్షిమాత్రంగా ఉన్న భగవంతుని తత్త్వమే అది. అట్టి భగవత్తత్వాన్ని అమ్మే తెలియజేయాలి. అందుకే

న కర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభు :।<br>
న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పాడు. అమ్మ కూడా ఏ విషయంలోనైనా "ఇలా చేశాను లేక ఇలా చేయించాను" అనే వాక్యాలకు తావివ్వదు. ఇది ఇలా జరిగిందని మాత్రమే అంటుంది.

గురువైతే గుణభేద, కులభేద ప్రసక్తి వస్తుంది. యోగ్యతా యోగ్యత విచక్షణ ఉంటుంది. అమ్మ కావటంతో సర్వత్రా మమకారమే గానీ ఆ వీక్షణలో విచక్షణ ఉండదు. రాజుపాలెం రామచంద్రరావు అన్నయ్యతో "నాదంతా రాశిబేరం" అని అన్నది అమ్మ. అంటే పుచ్చులు అవీ చూడటం ఉండదు. అందరినీ దగ్గరకు తీసుకోవటమే గానీ గుణదోష విచారణ లేదు. అందుకే తప్పు చేశానమ్మా! అంటూ బాధతో తన దగ్గరకు వచ్చిన బిడ్డను "తల్లికి తప్పేకనపడదు" అని అమ్మ ఓదార్చి శాంతిని ప్రసాదించింది.

"తలవంచి కట్టించుకుంది భార్య నడుం వంచి కట్టినవాడు భర్త కాబట్టి ఇద్దరికీ బాధ్యతలు ఉన్నాయి. జీవన యాత్రలో భాగం ఉంది. త్యాగం అన్నప్పుడు భార్య మాదిరిగా భర్త చెయ్యలేడేమో. ఆ విషయంలో పాతివ్రత్యానికి దీటురాయిగా నిలిచేది, కష్టాలను ఓర్పుగా భరించేదిభార్యే. భర్త త్రాగుబోతు అయితే ఆ త్రాగుబోతు కోరితే ఒక గ్లాసు ఇవ్వగలిగే సహనం ఉండాలి" అన్నది అమ్మ. భర్తకు చెప్పకుండా ఎంతోదూరం నుండి ఒక సోదరి వస్తే నిర్దాక్షిణ్యంగా ఆ సోదరిని మనిషి తోడిచ్చి పంపించేసింది. ఆ దైవం తరువాతనే ఏ దైవం అయినా, విడాకులు తీసుకునే పరిస్థితిలో ఉన్న ఒకరు వచ్చి అమ్మను ప్రాధేయ పడితే, విడాకులు ఎవరికి ? నీ విశ్వాసం దృఢమైనపుడు ఎవరూ నీ భర్తను నీ నుండి విడదీయలేరు. పెళ్ళినాడు నీ మెడలో కట్టింది అతని రెండు పాదాలు ఆ పాదాలను నువ్వు వదలనపుడు అతను ఎక్కడికి వెళ్తాడు? ఆ పాదాలు నీ దగ్గరే ఉన్నాయి. భర్త కావాలి, ఇంట్లో ఉండాలి అనుకుంటావా, ! బాధలు పెట్టినా, అతను ఎన్ని కష్టాలు పెట్టినా భరించి ఉండు, ఉండలేనంటావా ఎక్కడున్నా భర్త నీవాడన్న దృఢభావం నీలో ఉన్నపుడు ఇక ఏడవటానికి ఆస్కారం లేదు. దీనిలో అపూర్వమైన భావ సంపద, ఉన్నత సంప్రదాయం, ధర్మ నిరతి ఉన్నాయి" అన్నది అమ్మ.

"నేనుగురువునూ కాను, మీరు శిష్యులూ కారు. నాకు శిశువులే కాని శిష్యులు లేరు. నేను అమ్మను, మీరు బిడ్డలు" అని అమ్మ నిర్వచనం. అంతేకాదు "మీరు నా అవయవాలని" అమ్మ నిర్ధారించింది. గురువు లోపలా, బయటా కూడా ఉన్నాడు. మనసును అంతర్ముఖం చేసినపుడు స్థూల రూపంతో దర్శనమిచ్చి

ఆ అంతర్ముఖమైన మనసును హృదయంలో ఉన్న తనవైపు లాక్కుంటాడు. ఈ హృదయంలో ఉన్న గురువును అమ్మ 'గుర్తు' అంటుంది.

మేము అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాము. మా అజ్ఞానాన్ని తొలిగించమ్మా అని అడిగిన వారితో "నాకలా తోచడం లేదు నాన్నా. నాకు మీరంతా జ్ఞాన స్వరూపులుగానే కనిపిస్తున్నారు" అన్నది. తల్లికి తప్పే కనిపించదు. తల్లి అంటే తొలి అన్న వాక్యాలలో కూడా అమ్మ సద్గురువు అన్న స్ఫురణ ఉంది. "అహమాదిర్హి భూతానాం" కృష్ణుడు గీతలో చెప్పిన భావమూ ఇదే. ఒక రోజు అమ్మ చాలా సేపు మాట్లాడి "ఏదో మీ తృప్తి కోసం మాట్లాడుకోవటమే గానీ మౌనమే నాకిష్టం" అన్నది. **12-9-1946**లో అమ్మ మూడవ సంతానమయిన రవీంద్రరావు ప్రకాశం జిల్లా వేటపాలెంలో జన్మించాడు.

అమ్మ ఆవిర్భవించిన **26** సంవత్సరాల తరువాత అమ్మ పిన్నత్తగారైన అనసూయమ్మగారు అమ్మలోని అసాధారణ శక్తిని గమనించింది. కానీ అమ్మ మాయతెర కప్పింది. ఎవరైనా పెద్దల దగ్గరకు అమ్మను తీసుకువెళ్ళి ఉపదేశం చేయిస్తే ఉన్నతిని పొందగలదని భ్రమ పడ్డది. ఆచారం, సాంప్రదాయం అనే రెండు రేఖల మధ్య ముక్కు సూటిగా చీకటిలో నడిచేటువంటి దేశిరాజు రాజమ్మ గారి వద్దకు అమ్మను తీసుకువెళ్ళింది. సాంప్రదాయ ముసుగులో ప్రక్కల గల వెలుతురును చూడటానికి గానీ, గాలిని పీల్చటానికి గానీ అంగీకరించని ఆమె అనేకులకు మంత్రోపదేశం చేసి గురుత్వం వహించింది.

కార్యాకారణాలను మనం ఊహించలేము. అమ్మ సంకల్పం వేరు, అమ్మ పిన్నత్తగారి ఉద్దేశం వేరు. రాజమ్మ గారికి తరుణం ఆసన్నమయింది. అమ్మ అవ్యాజకరుణావారాసిలో తల మునకలుగా స్నానం చేసే సమయం వచ్చింది కనుకనే అమ్మ, రాజమ్మగార్ల కలయిక జరిగింది.

అమ్మ దృష్టిలో వేదాంతమంటే అదేదో అంతుపట్టని విద్య కాదు. అందని సిద్ధాంతాల సముదాయం కాదు. "నాలుగు వేదాల సంపుటియే జీవితమని, అనుభవసారమే శాస్త్రమని" అమ్మ అభిప్రాయం. అమ్మ జీవితానికి, అనుభవానికి,

వేదాంతానికి, శాస్త్రాలకు భేదం లేదు, కానీ రాజమ్మ గారి లాంటి వాళ్ళకి వేదాంతం వేరు, జీవితం వేరు. శాస్త్రం, అనుభవం విభిన్నం. వారు వేదాంతం పఠించేవారు, ప్రవచనాలు చేసేవారు మాత్రమే. వారి మాటల్లోని అద్వైతము ఆచరణకు అందదు, మాటలకు మాత్రమే పరిమితం.

అమ్మ దైవం అన్న సంగతి అటు ఉంచి ఆలోచిస్తే అమ్మ వేదాలు, వేదాంగాలు, అధ్యయనం చేయలేదు. శాస్త్రాలు అభ్యసించ లేదు. కానీ జీవితంలో మనం అనుకునే కష్టసుఖాలను అనుభవించింది. ఆ అనుభవాన్ని జీర్ణించుకుంది. జీవితంలో శిఖరాగ్రానికి ఎలా వెళ్ళిందో అలాగే అఖాతాలను చూసింది. దిక్కులను, మూలలను అవగాహన చేసుకుంది. అందుకనే సర్వ శాస్త్రాలూ ఆమె పాదాల మ్రోల తల వంచాయి. లోకంలోని సమస్త వస్తువులను, ప్రాణకోటిని జడ చైతన్య భేదరహితంగా ఒకటిగానే గుర్తించింది. అదే ఏకాగ్రత అని చెప్పింది. "సర్వకాల సర్వావస్థలయందు ఒకటిగానే ఉండటం సమాధి" అన్నది. అమ్మ ఎప్పుడూ సమాధిలోనే ఉండేది. కనుకనే అమ్మ పలికిన ప్రతి మాట శాస్త్రబద్ధంగాను, వేద సమ్మతంగా ఉండి అద్వైత శిఖరాగ్రాన నిలిచి ఉండేది. అమ్మ రాజమ్మగార్ల అద్భుత సమావేశంలో అమ్మకు, రాజమ్మగారికి జరిగిన సంభాషణ అనుభవానికి, ఆచారానికి సంఘర్షణగా చెప్పవచ్చు.

బాపట్లలో దేశిరాజు బాపారావు గారింట్లో 1949 ఆగష్టు 23వ తేదీ సాయంత్రం గం॥ 5.30 ని॥లకు అమ్మ రాజమ్మగారిని దర్శించి పటికబెల్లం ఆమె చేతిలో వుంచబోగా రాజమ్మగారు తీసుకోక క్రిందపెట్టమన్నది. అమ్మ నమస్కరించబోగా పాదములను వెనక్కు తీసుకున్నది. ఇతరుల దోషములు, పాపములు తన పాదములు ముట్టుకున్నప్పుడు ఆమెకు తగులుతాయని చెప్పింది. "దాని వల్ల బాధయేమీలేదమ్మా" అన్నది అమ్మ.

అమ్మ దగ్గరకు 1956 నుంచీ అనేక మంది దర్శనార్థం వచ్చేవారు. అమ్మ పాదాలకు నమస్కారం చేసుకునేవారు. పాదాలు తాకినంత మాత్రానే వారి పాపాలు అంటుకుంటాయంటే, మరి దైవం ఎందుకు ? అందుకే అమ్మ "మీరు బురద పూసుకువచ్చినా కడగవలసిన బాధ్యత నాదే" అన్నది.

రాజమ్మగారు అమ్మను "ఎందుకు వచ్చావు?" అని అడిగింది. "మీ దర్శనం చేసుకోవటానికే, నాకు వేరే పనేమీ లేదంది" అమ్మ. "సత్కాలక్షేపం చేస్తుంటావా? అడిగింది ఆమె. "అంటే" అన్నది అమ్మ "భగవంతుడ్ని గురించిన మాటలు, సద్గోష్ఠి" అన్నది రాజమ్మగారు. "మామూలుగా చేస్తున్న పనుల్లో, మాటల్లో అర్థమయ్యేటట్లు చెప్పండి. నేనేమీ చదువుకోలేదు" అన్నది అమ్మ. "భారతి మేనమామ కూతిరివైన నీకు చదువురాక పోవటమేమిటి?" అన్నది ఆమె. "భారతి మేనమామ కూతురైనంత మాత్రాన చదువు వస్తుందా?" అన్నది అమ్మ "కాలాన్ని బట్టి, కుటుంబాన్ని బట్టి విద్య లేకపోటమేమిటి? అన్నది రాజమ్మ. "కాలం ఒకటైనా అనుభవాలు వేరుగా ఉంటాయి కదా !" అన్నది అమ్మ.

మర్నాడు ఉదయం ఏడు గంటలకు రమ్మని రాత్రి ఏమి కల వస్తుందో చెప్పమంది రాజమ్మ గారు. "మీ అనుగ్రహం వల్ల కలలన్నా వస్తే, ఏమి కల వచ్చినా సరే చెప్పమంటారా. అసలు కల వస్తుందంటారా" అన్నది అమ్మ. ఏ కల అయినా సరే చెప్పమంది ఆమె. "నాకు కలలు రావని కలలు రావాలన్న ఆశ చాలా ఉందని, లేనిదాని కోసమేగా ఆశ పడటం" అన్నది అమ్మ. 'నీకు కలలు రావా ?' "కల కాదు ఏదీ కలగా లేదు". "బొట్టు పెట్టుకు వెళ్ళమంది" రాజమ్మ గారు. "మీరు పెట్టండమ్మా" అన్నది అమ్మ. "నాకు ఆ అర్హత లేదుగా" అన్నది ఆమె. "మీకు మనస్ఫూర్తిగా అర్హత లేదని తోస్తోందా? ప్రపంచమేమైనా అంటుందనా!" అని అమ్మ ప్రశ్నించింది. అనాదిగా వస్తున్న ఆచారం. అయితే "పెట్టినా, పెట్టుకోకపోయినా ఏమీ ప్రమాదం లేదంటారు కాబట్టి బొట్టుపెట్ట"మని అడిగింది. "ఎందుకు లేమ్మా! కీడు, మేలు ఆలోచిస్తుంటార"న్నది. "మీరు పెడితే కీడనేనా? ప్రథమంగా బొట్టు ముత్తైదువల చేతనే పెట్టిస్తారు కదా! వైధవ్యం ఎందుకు వస్తున్నది?" అన్నది అమ్మ. "అది వారి యోగ్యత" అన్నది ఆమె. "అయితే మీ బొట్టు కారణం కాదు" అని తనకు అటువంటి మూఢాచారాల మీద నమ్మకం లేదని అమ్మ తెలియజేసింది.

1949 ఆగష్టు 24వ తేదీ తెల్లవారు జామున 4 గంటలకు అమ్మ రాజమ్మగారి ఇంటి దగ్గరకు వెళ్ళి తలుపు దగ్గర నిలుచుంది. ఈలోగా ఆమె

తలుపుతీసి "పిలిచావా అమ్మా!" అని అడిగింది. "పిలుద్దామనుకున్న సంకల్ప మాత్రం చేతనే మీకు వినిపించింది ఎవరి సంకల్పమో" అన్నది అమ్మ. "దైవ సంకల్పం కాదా!" అన్నది ఆమె. "దైవ సంకల్పం కాదు, సంకల్పమే దైవమని" అమ్మ ఉద్ఘాటించింది.

సంకల్ప వికల్పాలకు గల తేడా వివరించమని రాజమ్మగారిని అమ్మ కోరింది. "సంకల్పమంటే మనస్సుకు తోచే ఊహ, వికల్పాలు కూడా మనస్సుకు కలిగేవే. అది అనుభవ రూపంగా కావాలంది" రాజమ్మ గారు. "మీరు అమ్మ అంటే అంతులేనిది, అడ్డులేనిది, అడ్డలేనిది అనీ నా సందేహాలను తీర్చుకోవాలని వచ్చానంది" అమ్మ. "ముందురోజు వచ్చినపుడు దర్శనానికి వచ్చానన్నావుగా!" అన్నది ఆమె. "దర్శనం కొరకు వచ్చిన మాట నిజమేనని, దర్శనం యొక్క అర్థమే ఈ సంభాషణ" అన్నది అమ్మ.

మీ పిన్నత్తగారు నీకు కావలసిన సంగతి చెప్పమన్నారు అన్నది రాజమ్మగారు. "నా సంగతి ఆమె చెప్పమనటమేమిటి?" అని అమ్మ ప్రశ్నించింది. "ఆమె చెప్పిన విషయం నీవు చెప్పించావేమో అనుకున్నానమ్మా!. నీ భాష నాకర్థం కావటం లేదంది" ఆమె. "నా భాషే అర్థం కావటం లేదా ? ఆ మాయ అర్థం కావట్లేదా అన్నది" అమ్మ. "నేను మాయ అని అన లేదు, నీ భాష అన్నాను" అన్నది ఆమె. "మాయ అనే మాట భాషే, మాట్లాడేదంతా భాష, వినేదంతా శబ్దం, చూచేదంతా రూపం అని మీరు పక్కవారితో చెప్పిన మాటలలో ఈ మూడు మాటలు మీ నోటి వెంట వచ్చాయంది" అమ్మ.

"ఇంతకూ కల వచ్చిందా?" అడిగింది రాజమ్మ గారు. "కల వస్తుందని చెప్పిన వారికి కల వచ్చిందో, రాలేదో తెలీదా" అన్నది అమ్మ. "నీకు పెద్దలతో మాట్లాడటం తెలీదనుకుంటాను." "నాకు పెద్దలకు, చిన్నలకు తేడాయే తెలీద"ని చెప్పింది అమ్మ. "ఇటువంటి దానికి అతకటం కష్టం" అన్నది ఆమె. దానికి అమ్మ "అతకనిదేమిటి? అతికేదేమిటి?" అని అడిగింది. "జ్ఞానం" అని బదులిచ్చింది ఆమె. "అతకనిది అజ్ఞానమా? అతకనిది అజ్ఞానమైతే అతికేది

జ్ఞానమా?" అంటూ హిమత్పర్వత శ్రేణిమీద నిలబడి అడిగినట్లుంది అమ్మ తీరు. 'నీదంతా పసిబిడ్డ వ్యవహారంలా ఉన్నది." "పసిబిడ్డలాగానే కానీ, పసిబిడ్డను కాలేదుగా" అన్నది అమ్మ. "నాకట్లా అనిపించింది" అన్నది ఆమె. "అదే నిజమైతే నాకు కావలసింది ఏమిటమ్మా" అన్నది. "కేవలం పశుత్వమేగా" అన్నది రాజమ్మగారు. "పశుత్వమే పసితనమా ఆ రెంటికీ తేడాల్లేవా అమ్మ చూచే మనకు లేవా? ఆ రెంటికీ తేడా తెలీదా?" అన్నది అమ్మ.

బజారులో గేదె, దూడ, వీపున పసిబిడ్డతో ఆడమనిషి, ఆమె వెనుక భర్త వెళ్తూ వాకిట్లో ఎందుకో ఆగారు. వారిని చూచి అమ్మ "అది పసిబిడ్డని, తాను పశువునని పశువుకు తెలియదా. వీపున ఉన్న పసిబిడ్డకు అది గొడ్డు అని, తనను ఎత్తుకున్నది తల్లి అనీ తెలీదా, చెప్పగలిగినది, చెప్పలేనిది, ఉన్నదానిని మరొక రకంగా గుర్తించేది, ఉన్నది ఉన్నట్లుగా గుర్తించేది అంతా తెలివేగా?" అన్నది అమ్మ. "అంతా తెలివే కానీ హెచ్చు తగ్గులున్నాయిగా" అన్నది ఆమె. ఆ "హెచ్చు తగ్గులే సృష్టేమో" అన్నది అమ్మ. "సృష్టి దాకా నీకెందుకు, నీది నీవు చూచుకో" అన్నది ఆమె. "నేను సృష్టి. చూచేది సృష్టి. నా సంగతి సృష్టి. నాకు చెప్పేవారు సృష్టి. వ్యష్టి సృష్టి. సమిష్టి సృష్టి. సమిష్టి యొక్క వ్యష్టిత్వమే ఈ ప్రపంచము" అని అమ్మ వివరించింది.

"నీకు అక్షర జ్ఞానమున్నదా?" అని ఆమె అడిగింది. "క్షర జ్ఞానం తప్ప అక్షర జ్ఞానం" లేదు. "ఎందుకని?" రాజమ్మగారు అడిగింది. "ఆ రెంటికీ తేడా తెలియదు కనుక. క్షరమంటే అక్షరము తెలియని జ్ఞానం. జ్ఞానం కనుక అజ్ఞానాన్ని అక్షరాల్లో పెట్టి జ్ఞానముందా అని అడిగారు. జ్ఞానమనేది అనేక విధాలా? ఒకటేనా? తెలియనిది తెలుసుకునేది జ్ఞానం, అన్నీ తెలియనిదా? అన్నీ తానైనదా? అన్నీ తాను కానిదా? కొన్ని అయి, కొన్ని కానిదా? ఇన్నీ తెలిసి ఒకటిగా ఉండేదా?" అని అమ్మ అడిగింది.

అమ్మ "నాకు మీరు చెప్పదగినవంటూ వేరేలేవు. ఈ వేరులు, ఆ ఏరులు సముద్రంలో చేరేంతవరకు రెండుగానే ఉంటాయి. ఆ రెండింటినీ ఒకటేనని,

ఒకటిగా చూచి, ఒకటిగా చెప్పి, ఒకటిగా విని, ఒక్కటైతే అందరినీ నడిపిస్తాడు వాడు. అంతవరకూ ఒట్టొట్టి మాటలే. మనస్సును ఒక స్థాయిలో పెట్టించ గలిగినదే మంత్రం. అంటే స్థితి అని కాదు. అన్నింటికీ మనస్సే కారణం. అర్థమయ్యేట్టు చెప్పుకుందాం, అసలు వేదాంతం చెప్పేవారికి, వినే వారికి. చెప్పుకోవడం, చెప్పటం, వినటం, ఉన్నంత వరకు అది వేదాంతము కాదు".

**24-8-1949** ఉదయం 7 గంటలకు ఇంటికి వెళ్ళి తిరిగి తొమ్మిది గంటల ఇరవై నిముషాలకు ఆకులు, వక్క, పళ్ళు, దక్షిణ తీసుకుని వెళ్ళి రాజమ్మ గారికి నమస్కరించింది. "దోసకాయ తరిగి పెడతావా?" అని అడిగింది. ఆమె కత్తిపీట లాంటి వారు మీరుండగా తరగటానికి నాకేం" అన్నది అమ్మ. "ఏమిటి మళ్ళీ అను" అన్నది ఆమె. "మీరు కత్తిపీట, నా స్థితి దోసకాయ" అన్నది అమ్మ. "మరి తరిగేదెవరు?" అడిగింది ఆమె. "మీలోని స్థితి, నాలోని స్థితి ఒకటైనా వేరువేరుగా ఉన్నాం కనుక పరిస్థితులు ఏర్పడ్డాయి. ఎక్కడికక్కడికే సాధకుడు, సాధ్యము ఏర్పడే ఉన్నది. ప్రతీ పనిలో ఇవి ఇమిడే ఉన్నాయి. కర్త, కర్మ, క్రియ ఈ మూడు సర్వకాల సర్వావస్థల యందు పోల్చుకోగలిగిన వారికి కర్త, కర్మే గురుశిష్య న్యాయము. అదే పరమాత్మకు, జీవాత్మకు తేడా" అని తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించింది అమ్మ.

"అనుకూలంగా లేనివాటి గురించి చెప్పుకోవటంలో విసుగొస్తోంద"న్నది రాజమ్మ గారు. "మీకు విసుగేమిటి ? ఆ విసుగే నాకవసరం" అన్నది అమ్మ. "విసుగు నేర్చుకోవటానికి వచ్చావా, విసుగులేని మానవుడెవరు?" అడిగింది రాజమ్మ గారు. "దైవానికి విసుగుంటే కదా! దైవానికి లేని విసుగు మనకెందుకు వస్తుంది" అన్నది అమ్మ. వాడు సాక్షి అన్నది ఆమె. "ఎవరికి సాక్షి ? సాక్షికి నిర్వచనమే మిటమ్మా!" అని అమ్మ అడిగింది. "నీకు, నాకు దేనికీ అంటని వాడు" అన్నది ఆమె. అటువంటి వాడిని కొలవటమెందుకు? అంటని వాడనేగా కొలవటం. కొలిస్తే గాని అంటడనా ? దైవం మనకు అంటకుండా ఉండటానికా" అన్నది అమ్మ. "ఏమోనమ్మా ! నీ సమాధానాలు అర్థం కావు, అంతు లేవు,

తేలవు" అన్నది ఆమె. అందుకేగా తమ దగ్గరకొచ్చింది. వాడిని కొలవటం కోసం రాలేదు మీ దగ్గరకు నేనెవరో తెలుసుకోవటానికి, మిమ్మల్ని కొలుస్తున్నాను" అన్నది అమ్మ.

రాజమ్మగారు అమ్మకు మంత్రోపదేశం చెయ్యాలని చాలా ఉవ్విళ్ళూరుతున్నారు. "అన్ని గ్రంథాలలోకి నీకు ఏ గ్రంథం ఇష్టం?" ఆమె అడిగింది. "గ్రంథాలంటూ చదివితే కొన్ని ఇష్టమని చెప్పగలను. చదవనందు వల్ల నాకేదీ తెలీదు అన్నది అమ్మ. "అయితే నా కిష్టమైనది చెబుతా"నంది రాజమ్మ గారు. "మీకు రెండుంటాయా. ? ముందు మీకు అయిష్టమైనది చెప్పి తరువాత ఇష్టమయినది చెప్పండి. ఇష్టమైనది చెప్పేవాళ్ళు చాలామందే ఉంటారు. ఇష్టం అయిష్టం తెలియజేసేవాళ్ళు మీబోటి తల్లులే" అన్నది అమ్మ.

"తల్లి అంటే తొలి అని నా ఉద్దేశం. రెండూ మీలోనుంచే పుట్టినాయి. కనుక రెండుగా కనపడి ఒకటిగా తోస్తే" అన్నది అమ్మ. "ఏమిటో? అంతా మలపవ్యవహారం" అన్నది ఆమె. "మీరు ఏమైనా చెప్పండి ప్రతిమాటకు, ప్రతి అక్షరానికి మీరు చెప్పకపోతే ఇంక ఎవరు నాకు చెపుతారు. అందరి మాదిరి మామూలుగా అనుకునే తల్లి కూడా లేదు. మీరన్న పొరపాట్లతోనే జీవితం గడుస్తోంది. మంత్రం చెబుతానంటిరే లేకుండా పోతుందా ? ఈ రెండింటిలో ఏదైనా ఇష్టమే" అన్నది అమ్మ.

"నీదంతా అడవిగోడుగా వుందే. అడవిగోడు అంటే అర్థం కాకుండా ఉన్నదనేనా" నీ ముఖం నాముఖం అన్నది ఆమె. "మన ఇద్దరికీ వున్నాయి కదా!" అన్నది అమ్మ. "ఆవు పాలతో పాదాలను కడగమంది" రాజమ్మ గారు. ఆవుపాలతో రాజమ్మగారి పాదాలు కడుగుతూ, "కడగటంలో ఆవుపాలకు, నీళ్ళకూ తేడా ఉంటుందా, లేకపోతే రెండింటితోనూ కడగటం ఎందుకు ? ప్రతిదానికి అర్థం చెబుతూ ప్రతి పనీ తన చేతనే చేయించమని" అన్నది అమ్మ. "అసలే నన్ను అడవిగోడునన్నారు కదా ! ఆ అడవంతా మీ దగ్గర ఉన్న గొడ్డలితో నరికి వేయండి. అమ్మ మాటలలోని అమాయకత్వం, అజ్ఞానం నిజమే అనుకొని

తన ప్రతిభాశక్తి, సామర్ధ్యాలను గురించిన అమ్మ పొగడ్తకు పొంగిపోతూ "అందుకేగా ఈ తతంగమంతా" అన్నది రాజమ్మ గారు.

రాజమ్మ అనవసరమూ, అర్ధరహితమూ అయిన పొంగును చూచి అలా పొంగనివ్వడం శ్రేయస్కరం కాదనుకుంది అమ్మ. పొంగుపై చన్నీళ్ళు చల్లుతూ మనుష్యులతో, మనస్తత్వాలతో ఆడుకోవటం, ఆటలాడించటం సరదా అయిన అమ్మ "కంటికి అడవి కనిపించటం లేదు. గొడ్డలి కనిపించటం లేదు. అంతా ఊహే." అమ్మ మాటల్లోని అంతరార్ధాల జోలికి పోవడం ఇష్టం లేకనో, అంత లోతులకు వెళ్ళే శక్తి చాలకనో ఆ విషయం అంతటితో వదిలేసి సంభాషణ మార్చింది ఆమె. ఆమె గురుత్వం స్థిరపరుచుకునే తహతహతో ఆవు నెయ్యి వేసి పాదాలు కడగమంది. బుద్ధిమంతురాలైన శిష్యురాలి వలె చెప్పిన వెంటనే అమ్మ ఆమె పాదాలు కడుగుతూ ఏమీ తెలియనట్లుగా "ఈ జిడ్డు పోవటానికి ఏమి పెట్టి కడగాలమ్మా" అన్నది. "అది తరువాత చూసుకుందాం పెరుగు వేసి కడుగు." "ఆ పెరుగుతో ఆ జిడ్డు వెనుకపడింది. పెరుగు తరువాత ఏమి పోయమంటారు" అన్నది అమ్మ.

"అయ్యో తేనె తెప్పించలేదమ్మా ఎంత పొరపడ్డానో, అసలు పంచామృతాలంటే తేనె, పంచదార, పాలు" అని అంటుండగానే అమ్మ "అసలు పంచామృతాలంటే ఇవి కనుకనే మీరు అనుకోకుండా అవి మరుగున పడి మీరు కోరకుండానే ఇవి తటస్థపడ్డాయి. "పంచామృతాలంటే ఇవేనా" అడిగింది ఆమె. "ఒక అమృతంలో నుంచి పంచబడ్డవి కనుక పంచామృతాలనబడ్డాయి. ఎట్లాపంచబడ్డాయో" వివరించమని రాజమ్మ గారు అడిగింది. పాలు, మీగడ, పెరుగు, వెన్న, నెయ్యి" ఎన్నడూ వినని ఆ వివరణకు ఆశ్చర్యమూ, ఆనందమూ పొందుతూ "ఇంతవరకూ ఎవరూ ఈమాట చెప్పలేదమ్మా, శాస్త్రాలలో కూడా ఈ మాట లేదు" అని చెప్పింది. పూర్వం లేనిది, ఎవరూ వివరించని వివరణ అమ్మ ఇచ్చింది. అందుకేగా "నా అభిప్రాయమంటున్నాను" అన్నది అమ్మ. "సాయంకాలం ఇనుపకుతికెల శంకర శాస్త్రి గారి దగ్గర ఈ సంగతి తేల్చుకుందామని" అన్నది ఆమె.

ఏ విషయమయినా శాస్త్రం చెబితే కాని ఒప్పుకోని మనస్తత్త్వం రాజమ్మ గారిది. ఏ విషయాన్నైనా సిద్ధాంతీకరించగల, ఏ అంశం గురించి అయినా స్వయంగా ఆలోచించి అభిప్రాయం ప్రకటించగల అనుభవం అమ్మకున్నది. "శాస్త్రం అనుభవాన్నివ్వదు, కాని అనుభవం శాస్త్రాన్నిస్తుందని" అమ్మ ప్రకటించింది. శంకర శాస్త్రిగారి తేల్చాల్సిన అవసరం ఏమున్నది" అన్నది అమ్మ వారు బాగా చదువుకున్నవారు సంస్కృత పండితులు సందేహ నివృత్తి చేయగలిగినవారు" అన్నది రాజమ్మగారు. "ఎవరి సందేహాలు?" అమ్మ అడిగింది. "అందరి సందేహాలు తీర్చగలవారే" అన్నది ఆమె. "సందేహాలు లేని మానవులు లేరు. తీర్చే మానవులు లేరు. ఎన్ని తీరినా ఏవో మిగులుతూనే ఉంటాయి" అన్నది అమ్మ. "ఆయన దైవం వంటి వారు అలా అనకూడదమ్మా" అన్నది రాజమ్మ గారు. "అంటే సాక్షి అనా, ఏదీ అంటని వాడనా? అది ఎట్లా తీరుస్తాడు? అన్నది అమ్మ.

పండితుడే భగవంతుడమ్మా" అన్నది ఆమె. "రకరకాలుగా చెబుతుంటారు. మీరు చెప్పి నన్ను నమ్మించినా సరే, నా మనసు ఏదీ కోరకుండా ఉన్నాసరే సందేహ నివృత్తి చేసినా సరే" అన్నది అమ్మ. "పెద్దలంటే నమ్మకం ఉంటేగా?" అన్నది ఆమె. "పెద్దలంటే?" అన్నది అమ్మ. "పెద్దలే లేరా" అన్నది ఆమె "ఉన్నారు, లేరు అన్న మాటే లేదు నేనన్న దానిలో" అన్నది అమ్మ. "నీదంతా ఇదంతా ఒక విపరీతమైన సమావేశంగా కనిపిస్తుంది. నీ వర్చస్సులోనే మార్పు ఉన్నదమ్మా అంటూ కన్ను ఆర్పకుండా అమ్మ వంక చూస్తూ కదలకుండా కూర్చో అమ్మా" అని అడిగింది రాజమ్మ గారు. "కదలకుండా పాదాలు ఎట్లా కడిగేది అన్నది" అమ్మ. "కడుగుతూ నావంక చూస్తుండమ్మా" అంటే "కింద కనపడవద్దూ?" అన్నది అమ్మ. "పాదాలు చేతికి తగలవా" అన్నది ఆమె. "చేతులకందవు పాదాలు" అన్నది అమ్మ. "ఏమిటందవు?" అంటే "మీరు కడగమన్న వసువులందవు" అన్నది అమ్మ.

సంభాషణలో కాలం వ్యర్థమౌతున్నట్లు, పొందబోతున్నది మాటల మాటున

దూరమౌతున్నట్లు అనిపించి అమ్మను "కదలకు" అన్నది. అమ్మ "వదలనని" అన్నది. దానికి ఆమె "ఉండమ్మా" అన్నది. "ఉండనా" అమ్మ. "ఒక్కమాటలోనే అర్థం మార్పు చేస్తావేమమ్మా" అన్నది రాజమ్మ గారు. "అవకాశం ఉన్నది కనుక" అన్నది అమ్మ. రాజమ్మ గారు అమ్మ ముఖం వంక అట్లాగే చూస్తోంది. తాను ఎప్పుడూ చూడని అనన్య తేజస్సు, అద్భుత దృశ్యం, దృగ్గోచరమౌతున్నది. శరీరం పులకించి, కన్నులు చెమర్చి, కంఠం గద్గమయింది. "తల్లీ ! తల్లీ అన్నపూర్ణేశ్వరీ పాదాల మీద చెయ్యి తియ్యమ్మా!" అని "అమ్మలగన్న అమ్మ ముగురమ్మల మూలపుటమ్మ" అను పద్యం చదువుతూ "అమ్మా! నన్ను ఏదో త్రాసులో పెట్టి తూస్తున్నట్లు సిబ్బి ఒక వైపుకు వంగుతూ, లేస్తూ ఉందమ్మా" అన్నది ఆమె.

చేతులు రాజమ్మగారి పాదాల మీదనే ఉంచి "ఏ రకం రాయి వేశారమ్మా తూకానికి" అని అమ్మ అడిగింది. "రాయి కనిపించటం లేదమ్మా. త్రాసు అని ఎందుకు తోచింది. ఏమీ చెప్పుకోలేని స్థితిగా ఉంది" అంటూ మాటకట్టుబడి కన్నులు మూసుకున్నాయి. అమ్మ మౌనంగా ఆమె వంకే చూసింది. ఆ పదిహేను నిముషాలలో అమ్మలో ఏమి అద్భుతం చూసిందో ఏమి అనుభవం పొందిందో రాజమ్మ గారిలో అమ్మకు తాను గురువు అనిపించుకోవాలన్న కాంక్ష తీవ్రమైంది. ఈ అవకాశం జారవిడుచుకుంటే కలగబోయే అద్భుతమైన మహాభాగ్యాన్ని తాను నష్టపోయినట్లు అవుతుందని "అమ్మా పాదాలు కడిగేసేయ్ అన్నం పెడతాను" అన్నది. అమ్మకు ఆశ్చర్యం కలిగింది. కానీ అమ్మకు ఎప్పుడూ ఏ భావం ప్రకటించడం అలవాటూ లేదు. ఇష్టమూ లేదు. అందువల్ల నిర్లిప్తంగా "అన్నం తినమంటారా?" అని అమ్మ అడిగింది. "అన్నం తినవా?" అన్నది ఆమె.

విధి నిషేధాలకు అతీతమైన అమ్మ తినవన లేదు. అన్నీ తెలిసిన అమ్మనన్నిట్లా అడుగుతున్నదే అని ఆలోచిస్తున్నాన్నది అమ్మ. అశ్రుపూరిత నయనాలతో అనుభూతి అందించిన ఆవేశంలో "అమ్మా అన్నపూర్ణా, అన్నపూర్ణా" అని పిలుస్తూ "పెసర పిండితో జిడ్డుకడుగమ్మా" అన్నది రాజమ్మగారు. పాదాలు కడుగుతుండగా ఆ నీటిపై జిడ్డు కనిపించింది. "ఇక్కడ జిడ్డు పోయి నీటిపై కనిపిస్తున్నదమ్మా! జిడ్డు అంటూ ఉంటే ఎక్కడైనా ఉండేదే" అన్నది అమ్మ.

"కేశవనామాలు చెప్తూ సంకల్పం చెప్పుకో"మంది. "సంకల్పం చెప్పుకునేది కాదు. కలిగేది. చెప్పుకునే సంకల్పం కలగలేదు. జరుగుతున్న ప్రతీ పనికీ సంకల్పం కలిగింది." "ఉత్తిష్ఠంతు భూత పిశాచాః భగవంతుని దగ్గర మన గోత్ర నామాలు తెలియపరుచుకోవటమే సంకల్పం. సంకల్పం చెబుతాను ఒక్కమాట అను" అన్నది రాజమ్మ గారు. "ఒక్కమాట" అన్నది అమ్మ. "అదే చాలా" అన్నది ఆమె. "చతురక్షరమమ్మ విడదీస్తే ఆరు అక్షరాలున్నాయి. ఏమైనా అవుతాయి" అన్నది అమ్మ. రాజమ్మ గారు విసుగుతో "ఎన్నైనా చేస్తావు" అన్నది. "వచ్చిన పని, మీరిచ్చిన పని, అందరూ మెచ్చేదిగా ఉండాలి. మెచ్చడం అంటే అందరూ మన దగ్గరకు వచ్చి బాగుందనటం కాదు. ముందు ముందు ఈ సమావేశం యొక్క ప్రయోజనం మనకు మాత్రమే కాదు. మనకందరికీ" అన్నది అమ్మ. అమ్మకున్న దూరదృష్టికి రాజమ్మ గారు ఆశ్చర్యపోయి "బ్రహ్మాండంగా పలికావు" అన్నది. అమ్మ నిర్లిప్తంగా "బ్రహ్మాండమేగా? వారిద్దరి సమావేశం భవిష్యత్తులో సర్వ ప్రయోజనకారి అవుతుంది" అని తెలియచెప్పింది అమ్మ.

అమ్మ పలికే ప్రతి మాట జ్ఞాన ప్రసూన పరిమళాలు, వెదజల్లుతున్నా నాసికనే కానీ, మనస్సుకు పట్టని రాజమ్మ గారు అమ్మ మాటల్లోని చమత్కృతికి ముగ్ధురాలవుతూ తన స్థాయిని గగన వీధుల్లో ఊహించుకుని "ఒక్క రెండు సంవత్సరాలు నీవు నా దగ్గర ఉంటే" అంటుండగానే అమ్మ అందుకుని "ఒక రెండు ఏమిటి? ఒకటి రెండు అనా, రెండూ ఒకటనా లేక రెండూ ఒకేసారి చెప్పడం చేత అట్లా అన్నారా." పేక మేడలో అడుగుముక్క లాగితే మేడ కుప్పకూలి పోయినట్లు చప్పగా జావకారిపోయిన రాజమ్మగారు "ఏమి మాట్లాడాలో తెలియలేదమ్మా!" అంటూ అమ్మ ముఖంలోకి చూచింది. "నాతోనా అమ్మా" అని అడుగుతుండగానే ఆ వదన మండలంలోని దివ్య ప్రభలు వెలుగుతున్నా చూడలేని ఆమె, నీ ముఖాన పెట్టుకున్న కుంకుమలో తళుకు కలిపారా అన్నది.

దానికి అమ్మ "నా కుంకుమే తళుకుమనవచ్చు. నా కుంకుమలో తళుకు కలపలేదు. కుంకుమకు, బొట్టుకు అర్థంకావాలమ్మా. దేనికి అక్కర్లేదు." "అవును

దేనికీ అక్కర్లేదు. అన్నింటికీ కావాలి. అవన్నీ పెట్టుకు కూర్చుంటే ప్రస్తుత కార్యక్రమానికి విఘ్నం కలుగుతుందని కూర్చోమ్మా" తూర్పుకు తిరిగి తులసీ దళాలు అన్నం పైన వేసి ఆరు అరటి ఆకుల్లో 33 పదార్థాలు వడ్డించింది. అన్నంపైకి తీసి గోపురం లాగా తయారు చేసి వడ్డించిన పదార్థాలలో "నీకేదిష్టమో కలుపుతల్లీ" అన్నది రాజమ్మగారు. అమ్మ ఏదీ ఆలోచించకుండానే వెంటనే చేతికి వచ్చిన పదార్థాన్ని తీసుకుని కలిపింది. అది చూచి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయిన రాజమ్మగారు. ఆవేశపూరిత కంఠంతో "అమ్మా అమ్మా నేను నీకు పెట్టేదా లేక నీవు నాకు పెడతావా" అని అడిగింది. దానికి అమ్మ "నేను తిననిది మీరు పెట్టలేరు, మీరు పెట్టింది నేను తినలేను" మీ చేత పెట్టించుకోవటానికి వచ్చాను. కానీ, మీకు పెట్టటానికి రాలేదు" అన్నది అమ్మ.

వాక్పమత్కృతికి, తర్క వైభవానికి, ఆ రెంటి వెనక దోబూచులాడుకునే జ్ఞాన రోచిస్సులకు విస్తుపోతూ తదేకంగా అమ్మ వంక చూస్తూ వింత కాంతులు గమనిస్తూ ఏదో తెలియని అనిర్వచనీయమైన అనుభూతిని పొందింది రాజమ్మగారు. ఆ అనుభూతి ఏనుగు దిగిన సరోవరంలాగా మనస్సు కల్లోలితం కాగా అశ్రుపూరిత నేత్రాలతో గద్గద కంఠంతో రాజమ్మగారు "ఇంతకు ముందు సాధన చేశావా? ముఖవర్చస్సు చామంతి రంగులో గులాబీ కలిపి మధ్య మధ్యలో మొగలిపూవు రంగు కనిపిస్తున్నది" అన్నది ఆమె. అమ్మ "నారంగు నాకు తెలియటం లేదు, తెలిసి చేసిన సాధన అంటూ లేదు" అన్నది. "సాధన అంటే తెలిసి చేసేది" అని అమ్మ తలను తన గుండెలకు హత్తుకున్నది ఆమె. చేతులతో చెంపలు నిమురుతుండగా రాజమ్మగారి కన్నీళ్ళు అమ్మ తలమీద పడ్డాయి. అమ్మ రాజమ్మగారి నోటికి అన్నపు ముద్ద అందించింది.

బిచ్చగాని కేక విని అమ్మ బయటకు వచ్చింది. అతని చంకనుండి జారి పిల్ల అమ్మ పాదాల మీద పడ్డది. శరీరం కొయ్యబారింది. ప్రాణం పోతుందేమోనని తండ్రి భయపడ్డాడు. వచ్చేపోయే జనం గుమికూడారు. అమ్మ ముఖం వంక ఐదు నిముషాలు పరీక్షగా చూసి "అమ్మా" అని అరచి "చక్రం కావాలం"ది.

"ఏమిటి దొరసాని చక్రం కావాలంటుంది" అన్నాడు. "ఏమో నాయనా నా దగ్గర ఏమీ లేదు వట్టి చేతులే" ఇందాక నుంచీ ఏమి చూసి ఉంటుంది. ఎవరి దగ్గరకూ వెళ్ళే బిడ్డ కాదే బిచ్చగానికి ఏమీ అర్థం కాలేదు. రాజమ్మ గారికి కాలం వృథా అవుతుందన్న బాధ ఎక్కువగా ఉంది. "అమ్మా సాయంకాలం అవుతుంది. తెల్లవారు జామున నాలుగు గంటలకు ప్రారంభించాము ఇంతవరకూ పని పూర్తికాలేదు." "మనకున్న పని పూర్తి అవుతున్నదిగా!" అన్నది అమ్మ. మనకున్న పని అంటే భ్రష్టత్వం కావడమేనా అని అన్నది ఆమె. "అదీ మనకున్న పనేగా" అన్నది అమ్మ. "ఇదంతా బాగు చేసి వచ్చెయ్" అన్నది రాజమ్మ గారు. అమ్మ చీపురు నీళ్ళు తీసుకువచ్చి కడిగి శుభ్రపరిచింది. "ఇక స్నానం చేస్తావా" అన్నది ఆమె. "మీ సమక్షంలో నాకు స్నానం ఎందుకు? మీ స్థానమే నాకు ప్రస్థానమంది" అమ్మ.

ప్రొద్దున నువ్వు చెప్పిన పంచామృతాలు సిద్ధం చెయ్యి. అమ్మ సిద్ధం చేసిన ఆ పంచామృతాలను కలిపి రాజమ్మ గారు అమ్మ నోట్లో పోసింది. ఉదయం ధ్యాస శ్లోకం ఒక ముక్క చెప్పుకుని ఆపేశావు. కనీసం ఆ శ్లోకం అన్నా సాంతం చెప్పిచ్చుకోమంది ఆమె. "చెప్పుకోవటానికేమమ్మా చెప్పుకుంటా, చెప్పుకున్న తరువాత చెప్పవలసిన సమాధానాలు చాలా ఉంటాయి. నా కొరకు కాదు" అన్నది అమ్మ. "నీవు ఎదురు చెప్పకూడద"ంది ఆమె. "గురుశిష్య న్యాయమంటే అడగటం చెప్పటమేనేమో. మాట్లాడవద్దన్న నియమం ఈ క్షణం నుండేనా, ఈ మాట శాస్త్ర సమ్మతమా? మీ సమ్మతమా?" అని అమ్మ అడిగింది. "శాస్త్ర సమ్మతమే"నంది ఆమె "ఏ శాస్త్రంలో ఉందో చెప్పండి" అని అమ్మ అడిగింది. "నీకేం తెలుస్తుంది చెప్పినా" అన్నది రాజమ్మ గారు. "మరి ఏమి తెలుస్తుందని ఉదయం నుండీ నాకు చెప్పటానికి ప్రయత్నిస్తున్నారు. ఏది చెప్పినా తెలియనప్పుడు మీకే శ్రమ ఎందుకు? అయినా నన్ను వదిలి వేసి, సామాన్యంగా గురువంటేయేమిటి? శిష్యుడంటే ఏమిటి? మంత్రాలెందుకు? మంత్రమంటే ఏమిటి? ఏవి మంత్రాలు?" అని అడిగింది అమ్మ. "మంత్రమంటే ఏమిటో తెలియని దానివి మంత్రాలంటావు? మంత్రార్థాలంటావు, లక్షా తొంభై ఉన్నాయి

మంత్రాలు" అన్నది ఆమె. "ఒక్క మంత్రం సంగతేనమ్మ? అసలు మంత్రమంటేనే ఏమిటో తెలియనప్పుడు మంత్రాలెన్నయితే నాకెందుకు?" అన్నది అమ్మ. అనుకున్న పని పూర్తి అయినాక అన్నీ వివరించి చెపుతాను అన్నది ఆమె. "రోజు గడచిపోతుందని" అమ్మ అన్నది. "నా ఏడుపు అదే" అన్నది రాజమ్మగారు. "ఇదే నాకు సంతోషం" అన్నది అమ్మ. "అనుకున్నది కాకపోవడమేనా?" అన్నది ఆమె. "తనకున్నది ఋజువవుతున్నందుకు" అని అమ్మ అన్నది. "ఈ సంభాషణ అపరిమితంగా పెరిగిపోతున్నది. ఒడ్డులేదు. దరిలేదు" అన్నది ఆమె. "ఆది లేదు, అంతం లేదు కనుక ఆదీ, అంతం అదే గనుక" అన్నది అమ్మ. "ఏది ఆది, ఏది అంతం" రాజమ్మ గారు ప్రశ్నించింది. "ఆది, అంతం నేనే" అని అమ్మ చెప్పింది. "రెండూ నీవు ఎలా అవుతావంది" ఆమె. "పుట్టినప్పుడు ఆది, పోయినప్పుడు అంతం".

ఇంతలో రాజమ్మగారి కొడుకు వచ్చి వారికి మైల వచ్చిందని చెప్పాడు. "తనొకటి తలిస్తే దైవమొకటి తలిచింది" అన్నది రాజమ్మ గారు. అమ్మ ఆ సామెతను అంగీకరించదు. జీవితానికి దైవమే కారణమనీ, మనస్సులో కలిగే ప్రతి చిన్న ఆలోచనకు కూడా దైవ సంకల్పమే మూలమని అమ్మ ధృఢమైన అభిప్రాయం. అందుకే అమ్మ "దైవం తలిస్తేనే తాను తలుస్తాడు" అన్నది. ఈ అపూర్వ సిద్ధాంతానికి విస్మయం చెంది "నీవంతా వికటకవిగా ఉన్నావు. దారీ డొంకా లేదు. ధర్మం లేదు. మడి లేదు. ఆచారం లేదు" అన్నది ఆమె. "మీరన్నవి మినహా మిగతావి నాకున్నవిగా" అన్నది అమ్మ. "అంతా కటిక చీకటిగా కనబడుతున్నది. ఏమీ కనిపించడం లేదు" అన్నది ఆమె. "ఔను దీపం ఉన్నా కనబడదమ్మా." రాజమ్మగారు వింతగా అమ్మ ముఖంలోకి చూచింది "గుర్తించే గుర్తు లేక కన్నులు చూడలేవన్నది" అమ్మ.

"మైలప్పుడు మంత్రం చెప్పకూడ"దంది రాజమ్మగారు. "మైలరానప్పుడూ, వచ్చినప్పుడూ కూడా మీరు ఒకలాగానే కనబడుతున్నారే" అన్నది అమ్మ. "అది కనబడేది కాదు. అనుకునేది. లేదనేది కూడా అనుకునేదేగా. పురుళ్ళూ, సూతకాలు పట్టడం లేదా ఏమిటి?" అంటే "ప్రత్యేకంగా పట్టేదేమున్నది. పుట్టారన్న

సంతోషం ఉన్నవాడు పురుడున్నది. చనిపోయారని దుఃఖమున్ననాడు మైల ఉన్నది. అది నే పట్టేదేమి వున్నది." ఇంతలో బాపారావు గారు మైల స్నానంతో సరి అని చెప్పారు. "బ్రతికించావు నాయనా" నిరాశోపహతురాలయిన రాజమ్మ గారిలో మళ్ళీ ఆశాభావం పొడసూపి అమ్మను స్నానానికి నీళ్ళుతోడి ఇవ్వమంది. అమ్మ రాజమ్మగారికి స్నానం చేయిస్తూ "అమ్మా! ఇందాక బ్రతికించావు అన్నారే! చంపేది కూడా వారేనా! ప్రతి అక్షరానికి ఇట్లా అడిగితే ఎట్లాగమ్మా! విపరీతార్ధాలు అడుగుతావు." "తోస్తుంటే ఏం చేసేదమ్మా, ఎవరు చెప్తారు. ఇది వరకు ఏవైనా సందేహాలు కలిగినా సమాధానాలు చెప్పేవారు లేక అడిగే అవకాశమే లేకపోయింది. అయినా నిన్ననే చెప్పానుగా మామూలుగా నేర్పే అమ్మ కూడా లేదని" "పదే పదే ఆ మాట అనకమ్మా" అన్నది రాజమ్మగారు.

ఆవు నేతితో దీపారాధన చెయ్యమంది. "దీపారాధనకు కూడా వివరణ కావాలని" అడిగింది అమ్మ. "దీపం పెట్టు కోవట్లేదా?" అన్నది ఆమె. "దీపానికి కారణం తెలుస్తున్నది. కానీ దీపం ఉండగా దీపారాధన అవసరమైంది. అందువల్ల దీపారాధనకు వివరణ కోరుతున్నా"న్నది అమ్మ. "మామూలు దీపం వల్ల మసక చీకటి పోతుంది. దీపారాధన వల్ల దేవుడికి చీకటి పోతుందా" అన్నది అమ్మ. "దేవుడికి చీకటేమిటే?" అన్నది రాజమ్మ గారు. మంత్రోపదేశ మిషతో రాజమ్మగారి దగ్గరకు వెళ్ళిన అమ్మ తన సంభాషణా వైశిష్ట్యంతోను దివ్య దర్శనానుభూతిని ప్రసాదించటంతోను ఆమెను ముగ్ధురాలిని చేసి భిన్నత్వాన్ని సోదాహరణంగా ఆమెకు నిరూపించి "భగవంతుడంటే ఏమిటో వివరించ"మంది.

"అన్నీ గుడ్డి ప్రశ్నలు వేస్తావు. అసలు నీవు ఎందుకు వచ్చావు?" అన్నది రాజమ్మగారు. "నీవు యదార్ధం తెలుసుకోగల అమ్మవని, యదార్ధం చెప్పగల అమ్మవని" అడుగుతున్నాను అన్నది అమ్మ. "యదార్ధమంటే ఉన్నది ఉన్నట్లేగా" అన్నది ఆమె. "అంతేనమ్మా చూచేది, చెప్పేది, చేసేది. ఇన్నింటిలోనూ యదార్ధమే కావాలంటున్నాను. మూడు ఒక్కటైనప్పుడు మాట ఎక్కడుందమ్మా? రెండయితే చాలు, చేసేది చెప్పినా చాలు. చూసేది చెప్పినా చాలు" అన్నది అమ్మ. "అయితే నేను చూడనిది, చేయనిది చెప్తున్నానా?" "అలా అని తాను అనలేద"న్నది అమ్మ.

"ఇంతకూ భగవంతుడంటే చెప్పలేదుగా, నేను వచ్చింది అందుకే. మీరు చెప్పబోయే సర్వమంత్రసారము ఇదే." "ఇంక మంత్రము అక్కర్లేదా ఏమిటి?" అన్నది ఆమె. "మంత్రమెందుకసలు?" అన్నది అమ్మ. "తనను తాను తెలుసుకోవటానికి" అన్నది రాజమ్మగారు. "తనను తాను తెలుసుకోవటమంటే భగవంతున్ని తెలుసుకోవటమే" అని నిర్ధారించింది అమ్మ.

రాత్రి తొమ్మిదిన్నర అయింది. షోడశకళలతో పూర్ణచంద్రుడు ప్రకాశిస్తూ మేఘ మాలికలు లోకానికి, చంద్రునికి మధ్యలో తారాడుతూ, లోకంపై చీకటి తెరలు కప్పుతున్నాయి. ఆ మేఘాలను దూసుకువచ్చే కిరణాలు ప్రసరించే వెన్నెల వెలుగుల్లో జగతి పులకించుతున్నది. ఉండి ఉండి వాన జల్లు పడుతున్నది. ప్రకృతికి ప్రతిబింబంగా ఉంది రాజమ్మగారి ఇల్లు. సాక్షాత్ భగవంతుడు ఎదురుగా కూర్చుని ఉన్నా మధ్యలో మాయ తెర అడ్డుగోడుగా ఉంది. అమ్మ పలికిన సత్యవాక్కు గానీ, ప్రసాదించిన దివ్య దర్శనం గానీ ఆ మాయను విడదీయలేకపోతున్నాయి. కన్నులు మిరుమిట్లు గొలిపేలా కాంతిని ప్రసరించినప్పుడు మాత్రం రాజమ్మగారు సుప్తమానసం జాగృతం అవుతూనే ఉన్నది. అందులో పరవశించి పోతూనే ఉన్నది. ఆనంద భాష్పాలు జాలువారుతూనే ఉన్నాయి. కానీ ప్రయోజనమేమిటి? అంతలోనే మాయ మబ్బులు కమ్మి రాజమ్మగారి గురుత్వం గుర్తుకు వస్తుంది. తాను ఆచార్య పీఠమదిరోహించి పద్మాసనం వేసుకుని కూర్చుంది.

"చిన్నప్పట్నుంచీ నీ యదార్థస్థితి చెప్పమ్మా" అని రాజమ్మగారు అడిగింది. "నా యదార్థస్థితిని నేనే తెలియజేయాలనుకుంటే ఇంతసేపు ఇక్కడ ఉండేదాన్ని కాదు" అమ్మకేమో వాక్రూపంగా అందించడం అలవాటు లేదు. పరోక్షచర్యల ద్వారా ప్రబోధించటమే అమ్మ అభిమతం. ఏ విషయమైన తెలియచేయటమే కాని తెలియజెప్పే విధానంలేదు. చెప్పేటట్లైతే ఒక్కమాట చాలు. అందుకు ఇంత సంభాషణ, సమయం అవసరం లేదు. ఏ అద్భుతంతోనో ఏ లీలతోనో తెలియజేసినా అవి స్థిరంగా ఉండకపోవచ్చు. క్రమ పద్ధతిలో వచ్చిన పరిణామం వల్ల కలిగిన గుర్తు అయితే దృఢమౌతుంది. అదే విశ్వాసమై చెదరకుండా

నిలుస్తుంది. దాని కొరకే ఒక రాజమ్మగారి హృదయంలో సత్యాన్ని ఆవిష్కరించేందుకు ఇంతకాలం, సుదీర్ఘ కార్యక్రమము అమ్మ చేపట్టవలసి వచ్చింది.

"అమ్మా! ఘడియలు గడిచిపోతున్నాయి. పని నిలిచిపోయింది. మనస్సు పరి పరి విధాల పోతున్నది. ఉన్నది గుర్తించలేక జరగబోయేది ఊహించలేక పోతున్నాను. నీ ముఖ వర్చస్సు మారిపోతున్నది. ఆ వర్చస్సు ఇదమిత్థమని చెప్పలేను. ఆనందమో, ఆ ఆనందమనేది నా అనుమానమో చెప్పలేన"ంది రాజమ్మ గారు "చెప్పుకోమ్మా!" ప్రాధేయపూర్వకంగా అడిగినట్లన్నది. "ఏది ఎట్లా జరిగినా నాకు చెప్పటమే మీకు ముఖ్యంగా తోస్తున్నది. మన ఇద్దరి ఈ సంభాషణ ఈ చెప్పటం, వినటం, చెప్పి చేయించటం, నడిచి నడిపించటం, నొప్పించకుండా ఒప్పించడం ఈ ద్వంద్వాలు, ఈ కార్యక్రమం అచ్చంగా నా కొరకు కాదు. మీకు, నాకు, ప్రపంచానికి అవసరం" అన్నది అమ్మ.

మంత్రోపదేశం మిష వలన రాజమ్మగారు ఉపదేశం చేసే భ్రమలో ఉన్నదనీ ఆ భ్రాంతిని వదిలించేందుకు సంకల్పించి మీకోసం కూడా అని చెప్పింది. మరి రాజమ్మగారిని సంస్కరించటమే అమ్మ ప్రధాన ఉద్దేశము. ఎక్కడో రాజమ్మ గారింట్లో జరిగినా ప్రపంచానికి ఏమిటి ఉపయోగం. ఎప్పుడో, ఎక్కడో కురుక్షేత్రంలో కృష్ణార్జునులకు జరిగిన సంభాషణ భగవద్గీత అయి నేటికీ ప్రపంచానికి మార్గదర్శకం కాలేదా? అదే విధంగా ఈ సంభాషణ జగద్విఖ్యాతమై భవిష్యత్‌లో సర్వప్రయోజనకారి అవుతుందన్న అమ్మ మాటకు రాజమ్మ ఆశ్చర్యపడింది.

"మనది మనకే తెలియనప్పుడు ప్రపంచాన్ని ఉద్ధరిస్తామా అమ్మా!" రాజమ్మగారు అడిగింది. "నన్ను ఒక్కదాన్నే ఉద్ధరిద్దామనుకున్నారా" అని అమ్మ అడిగింది. "నేను ఉద్ధరించను, నీ సంస్కారమే నిన్ను ఉద్ధరిస్తుంది". "అలాంటప్పుడు మీరు అవసరం లేదుగా? లేక నా సంస్కారరూపమే మీరా" అన్నది అమ్మ. "త్వరగా చెప్పుకోమ్మా" అని రాజమ్మగారు అడిగింది. రాత్రి

పదకొండున్నర సమయంలో లోకం ప్రశాంత వాతావరణంలో పవళించింది. కానీ ఒక వ్యక్తి హృదయం మాత్రం మేలుకొలుపులతో కల్లోలితమౌతోంది.

అమ్మ స్ఫటికాల దండ చేతపట్టుకుని రాజమ్మగారికి నమస్కరించి కూర్చుంది. అడ్డు చెప్పకుండా మంత్రం చెప్పుకోమంది రాజమ్మగారు. ముందు మంత్రం చెప్పినా నవరించవలసి ఉంటుంది. ఆ నవరించినప్పుడే చెప్పుకున్నట్లవుతుంది. "తృప్తిని, శాంతిని, హాయినిచ్చి, సందేహనివృత్తి చేయగలిగిందే మంత్రం" అన్నది అమ్మ. "కొన్ని వందల మందికి చెప్పి ఉంటాను. ఎవరూ ఇటువంటి అడ్డు ప్రశ్నలు వేయలేదు" అన్నది ఆమె. "అడ్డు ప్రశ్నలు కాదమ్మా వాళ్ళకు అడగటానికి తావు లేదు. నాకు అడగటానికి తావు మీరిచ్చిందేగా", "చెవి ముందు పెట్టమ్మా" అంటూ కాలవిలంబనాన్ని సహించలేని రాజమ్మ గారే అమ్మ వద్దకు జరిగి చెవిలో నోరుపెట్టి "గురుర్‌బ్రహ్మా, గురుర్‌విష్ణు, గురుర్ దేవో మహేశ్వరః" అన్న శ్లోకాన్ని గబాగబా చెప్పి "నీకేమంత్రం కావాలమ్మా?" అని అడిగింది. "చెప్పారుగా" అన్నది అమ్మ.

"అది మంత్రం కాదు. ధ్యాన శ్లోకం" అన్నది రాజమ్మ గారు. "ధ్యానమంటే ఒక ధ్యేయాన్ని స్మరించటమేగా, ధ్యాన శ్లోకం నోట పట్టిందా" అని అడిగింది ఆమె. "మనస్సుకు పట్టింది" అన్నది అమ్మ. ఏమని? "గురువు బ్రహ్మమే అని తెలుసుకొన్నప్పుడు ఆ గురువుకు ఆత్మార్పణ చేసుకొనటమే; నమస్కారం అంటే చేతుల కలయికే కాదుగా" అన్నది అమ్మ.

"ఓం, ఐం, క్లీం, హ్రీం, శ్రీం, ఓం" బీజాక్షరాలను రాజమ్మగారు అమ్మ చెవిలో చెప్పి దండ చేతికి అందించారు. అమ్మ ఆదండలోని కొలికి పూస పట్టుకుని ఓంకారం ప్రారంభించింది. సుదీర్ఘమైన ఆ ఓంకారం పూర్తికాకముందే అమ్మ చేతిలోని దండతో పాటు సర్వేంద్రియాలూ నిశ్చలత పొంది అమ్మ సమాధిగత అయింది. తిరిగి జాగ్రదావస్థలోనికి వచ్చేటప్పటికి తెల్లవారు జామున నాలుగున్నర అయింది. అమ్మ కళ్ళు తెరిచి చూస్తే రాజమ్మగారు అమ్మ ఒడిలో పడుకుని ఉంది. అమ్మ ఆమె పాదాలు పట్టుకుంది. "అమ్మా! తల్లీ! జగజ్జననీ

నా పాదాలు పట్టుకుంటున్నావా! వద్దు వద్దు" అంటూ ఆమె అమ్మ పాదాలు పట్టుకుంది.

"అమ్మా నా పాదాలు మీదకు మీ చేతులు, మీ పాదాల మీదకు నా చేతులు వాటంతట అవే వస్తున్నాయి కదా! అంటే చేయించుకునేవారు, చేసేవారు కూడా ఒకటనేనా?" రాజమ్మగారి ముఖము, కన్నులు కూడా తేజోవంతంగా ఉన్నాయి. కన్నీరు కారుతున్నది. "అమ్మా నీమాటలు వినపడటం లేదు. నీ రూపం నా హృదయంలో నిలిచిపోయింది" అన్నది ఆమె. దానికి అమ్మ "నేను వినేదంతా మీ మాటే. కనేదంతా మీ రూపే, చేసేదంతా మీ సేవే. మీ పాదాలలో నాభర్త పాదాల స్పర్శ తగిలింది. ఆకర్తే ఈ కర్త. ఆ భక్తియే ఈ నా భక్తి" అన్నది అమ్మ. ఆ మాటలని మరోసారి అనమని వేడుకొన్నది రాజమ్మగారు. అమ్మ మళ్ళీ అవే పదాలను అన్నది. "నా పాదాలలో ఆ పాదాలెట్లా చూసావమ్మా?" అన్నది ఆమె. "ఈ పాదాలన్నింటికీ ఆ పాదాలే సాక్షి. మీకు నమస్కారం చేసేటప్పుడు నా సూత్రాలు రెండూ మీ పాదాల మీద పడ్డాయి. నమస్కారం చేసే ప్రతీసారీ ఈ సూత్రాలే కాదు మనస్సు, అవయవాలు అన్నీ మీ పాదాలపై వాలిపోతున్నాయి" అన్నది అమ్మ. "ఈ సద్భావాలు, ఉన్నతమైన అభిప్రాయాలు చిన్నప్పటినుంచీ ఉన్నాయా" రాజమ్మగారు అడిగింది. "నేను రాగానే మీకు ఏ అభిప్రాయమున్నదో, ఇప్పటి మీ అభిప్రాయాలకు గల తేడా వీటన్నింటికీ ఎవరు కారణమంటారు? మీలో కలిగే పరిణామాలు మీకే తెలుస్తాయి. అవి నాకు తెలియజేస్తే ఆనందిస్తానంది" అమ్మ. "మంత్రం చెప్పుకోగానే నీలో కలిగిన మార్పులు గుర్తున్నాయా" అని అడిగింది రాజమ్మ గారు. "గుర్తుంచుకోవలసిన పనిలేదు. మార్పులతో పనిలేదు. ఏమి కలిగినా కాదనేది లేదు. విధే విధానం కనుక. విధి మీరు, విధానం నేను" అని అమ్మ చెప్పింది.

"ఒక్కసారి నా తలను నీ హృదయానికి హత్తుకోమ్మా నేను కొన్ని కోట్ల జపం చేసి ఉంటాను. దానికి ప్రతిఫలంగా దైవమే ఈ విధంగా బోధ చేయించుకోవటానికి, బోధ చేయటానికి, రూపం చూపించటానికి వచ్చింది.

అందులోనూ బిడ్డగా వచ్చింది. ఒక క్షణంలో ఉన్న రూపం మరో క్షణం లేదు. నా తల్లివో, బిడ్డవో, దైవానివో, మోసానివో, సత్యానివో, అంతా అబద్ధమో, ఏదో అర్థం కాని ఆనందం. కాలు నిలవటం లేదు. శరీరం వణుకుతోంది" అన్నది రాజమ్మగారు. రాజమ్మగారు కర్పూరం తెచ్చింది.

రాజమ్మగారు అమ్మను జగన్మాతగా దర్శించి ఆసక్తితో అమ్మ జీవిత చరిత్రను అడిగింది. "నా జీవితమే అబద్ధం, చరిత్రబద్ధం" అని చమత్కరించింది అమ్మ. రాజమ్మగారు అమ్మ జీవితాన్ని గురించి కలగన్నానని, అది సత్యం అవునో కాదో తెలుసుకోవాలని అమ్మ జీవిత గాథ కావాలంది. రాత్రి రెండున్నరకు తాను చూచిన దృశ్యం ప్రపంచంలో ఎవరికైనా ఊహకైనా అందుతుందా? అని రాజమ్మగారు అడిగింది. దానికి అమ్మ "మీరు కలగన్న వివరాలు చెబితే అవి నిజమో కాదో" చెప్తానంది. ఏది ఏమైనా రాజమ్మగారికి అమ్మ అవతారమూర్తి అని, సహన దేవత అని ఎవరో తట్టి చెప్తునట్లు అనిపించింది. తరువాత ఇద్దరూ కలిసి భోజనం చేద్దామనుకున్నారు. అమ్మ అరటి ఆకు కోసుకువచ్చింది.

వంట ఇంటి గుమ్మంలో నిలుచుని ఉండగా రాజమ్మగాని కోడలు సుబ్బమ్మగారు వచ్చి అమ్మను పలకరిస్తూ తాను నొసట బొట్టు పెట్టుకుంటూ అమ్మ ముఖంవంక చూడగా తళుక్కుమన్నది. వెంటనే ఆమె "నీ ముఖాన ఉన్న కుంకుమ ఏమి కుంకుమ అమ్మా" అని అడిగింది. "పవిత్రం చేసే కుంకుమ" అన్నది అమ్మ. "నక్షత్రంలా మెరుస్తుంటే అడిగాను." సమాధానంగా అమ్మ పెదవులపై చిరునవ్వు, కనీకనిపించని పలువరుస, కుంకుమ, నొసలు, కన్నులు అన్నీ తళుక్కుమంటున్నాయి. అనుకోకుండా ఆమె అమ్మపాదాల వంక చూచింది. పాదాల నుండీ తేజఃపుజం ప్రసరిస్తున్నది. సర్వావయవాలు దివ్యకాంతులతో విలసిల్లుతున్నాయి. ఏమిటీ తళుకు? "ఎందుకు మెరుపు అనుకుంటూ ఎందుకు వచ్చావమ్మా?" అని అమ్మను అడిగింది సుబ్బమ్మ గారు.

లోపల నుండి రాజమ్మగారు అమ్మను కేకవేశారు. ఆ కంఠంలోని కంపన చూసి రాజమ్మగారికి కోపం వచ్చిందని కోడలు భయపడింది. ఆ కంపన ఆ

కొద్ది ఆలస్యానికే ఓర్చుకోలేని ఆర్తి వలన కలిగిందని ఆమెకు తెలీదు. "నీకేమన్నా జబ్బా అమ్మా? ఎందుకు వచ్చావమ్మా?" అని సుబ్బమ్మ అడిగింది. "పుట్టు రోగిని" అని జవాబిచ్చి గిన్నెలు చేతపట్టుకుని రాజమ్మగారి గదిలోనికి వచ్చింది. "ఏవమ్మా! ఇంతసేపు చేశావు అని రాజమ్మగారు అడిగింది" "నేను చేయలేదని అదే అయిందని" చెప్పింది అమ్మ. అమ్మ ఎవరితో చెప్పేటప్పుడైనా మనిషికి కర్తృత్వం లేదని అంతా విధి విలాసమని చెప్తుంది. తాను మనిషి రూపం ధరించింది కాబట్టి అదే సత్యాన్ని తన పరంగానూ చెప్పుకుంది.

రాజమ్మగారు ఆ వాక్యపు లోతుల్లోకిపోక అమ్మ చంకలోని రవిని, చేతిలోని వస్తువులను చూచి మానవ సహజమైన సానుభూతి, ప్రేమలతో "పిల్లవాడిని దించు డొక్క నొప్పిపుడుతుంది. ఇందాకటి నుంచీ ఇట్లా ఎత్తుకునే ఉన్నావా? పిల్లవాడిని చంకలో పెట్టుకుని ఇవన్నీ ఎట్లా తెచ్చావమ్మా" అన్నది ఆమె. "నేను పిల్లవాడిని మోస్తే పిల్లవాడు కొన్ని మోసాడు" అన్నది. "ఏమి సమాధానాలమ్మా, వెతుక్కోవూ" అన్నది రాజమ్మగారు. "ఎక్కడన్నా పెట్టి మరిచిపోతేగా వెతుక్కోవటానికి" అన్నది అమ్మ. "విస్తరులో పెట్టమంటే పెద్దవారుంటే వారిని అడిగి చేయటం అలవాటు" అన్నది అమ్మ. "ఎంత వినయ విధేయతలు తల్లీ" అన్నది ఆమె. "అన్నీ మీ ఆశీర్వచనాలే" అని "ఆశీర్వచనం అంటే నిర్వచనం లేనిది" అని వివరించింది అమ్మ.

విస్తరి శుద్ధి చేసి నెయ్యిరాసి పదార్థాలు వడ్డించమంది రాజమ్మగారు. "అన్నీ పదార్థాలేగా అయినా పదార్థాలంటే అర్థమేమిటో, పదాల అర్థాలా? లేక వస్తువులా?" అన్నది అమ్మ. "అనుపాకాలు" అన్నది రాజమ్మగారు. అన్ని పదార్థాలు వడ్డించి నెయ్యి అభీకరించింది. "నిన్నటి ధ్యానశ్లోకం మంత్రం ఒకసారి పఠించి నిన్న నేను పెట్టాను కాబట్టి ఈ రోజు నీవు కలిపి పెట్టమ"ంది రాజమ్మగారు. ఇద్దరం వంగి గుటుకుగుటుకూ మింగుదాం అన్నది అమ్మ. రాజమ్మగారు పకపకా నవ్వి "ఉభయ భాషా ప్రవీణవా, నానాభాష ప్రవీణవా" అన్నది.

లలితా ఖడ్గమాలలో "నీలపతాకయైనమః" అని వచ్చింది. అమ్మను

గురించి స్వప్నం వచ్చినప్పుడు అమ్మ ఖడ్గమాల చదువుతున్నట్లుగా వినపడ్డది. ఆ నామానికి అర్థమేమిటని అడిగింది ఆమె. "నాకు మాత్రం ఏమి తెలుస్తుంది. పతాకమంటే జెండా అని వాడుక పదమే. నీల పతాక అంటే ఆకాశం జెండగా ధరించిందని" అమ్మ చెప్పింది. ఇద్దరూ కలిసి ఒకేసారి కళ్ళుమూసుకు తినడం ప్రారంభించారు.

'సాంప్రదాయానుసారమూ ఉపదేశం ఇచ్చే సమయంలో గురువు ఉచ్ఛిష్టం శిష్యుని చేత తినిపిస్తాడు. అన్నం పరబ్రహ్మ స్వరూపం కనుక గురువు మొదట అనుభవం పొంది దానిని శిష్యునకు పంచి ఇస్తాడు. అదే పద్ధతిలో రాజమ్మగారు ఏర్పాటు చేసింది. తింటున్నప్పుడు ఒకవైపు పిల్లి, ఒకవైపు కుక్క కలియబడ్డాయి. రాజమ్మగారి నోటికి ఎన్నడూ తినని ఏదో కొత్త రుచి కలుగుతోంది. అంతలో రాజమ్మగారి నోటికి కుక్క మూతి తగిలింది. ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. విస్తట్లో అన్నం అయిపోయింది. పిల్లి, కుక్క ఆమె వంక చూస్తున్నాయి. అక్కడ లేకపోయినా పందిపిల్ల కూడా ఉన్నట్టు ఆమెకు కనిపించింది. "నీవు అన్న, పరిపూర్ణమిదా అమ్మా" అని అడిగింది రాజమ్మ గారు. "ఆపరిపూర్ణం" అంటూ "అరటి ఆకు చూస్తే తన వీపు గుర్తుకు వస్తుంది" అన్నది అమ్మ. ఆకును అమ్మ వీపు మీద పెట్టగానే వెడల్పు, పొడవు సరిపోయి, ఆకు మీద ఉన్న చారలు ఎముకల్లా కనపడి, కాడ వెన్నుపూసలాగా భాసించింది. "సత్యభాషివి, ధర్మరూపివి, మార్గదర్శివి, ఆదర్శజీవివి. ఏది ఏమైనా నీవు ఎందుకు వచ్చావో తెలీద"ంటూ ఆకు మడచి దగ్గర పెట్టుకుంది రాజమ్మగారు.

మధ్యాహ్నం మూడున్నర అయింది. అమ్మ చీపురు, నీళ్ళు తెచ్చి కడగటం మొదలు పెట్టింది. వద్దమ్మా నేను కడుగుతాను అన్నది రాజమ్మ గారు. "నాకు మురికి పోగొట్టడం నేర్పమని" అమ్మ అడిగింది. "ఈ మురికి పోగొట్టక పోతావా, రోజూ, చేస్తూనే ఉంటావుగా" అన్నది ఆమె. "చేతకావటానికి, రోజు చెయ్యటానికి సంబంధం లేదంది" అమ్మ. "చీపురే జ్ఞానోపదేశం చేసేటట్టుందా! నిన్న కత్తిపీట అన్నావు. ఇవాళ చీపురన్నావు, అది ఛేదించేదన్నావు, ఇదేమో తీసేసేదన్నావు, అసలు వేదాలు నీ నోటినుండి పుట్టినవేగా" అన్నది ఆమె. "అవును నా నోటిలో

పుట్టి నాకు తెలీకుండా నీ నోటిలో పడ్డవి, మీ దగ్గర విందామని వచ్చాను" అన్నది అమ్మ. "విందామనా, తెలుపుకుందామనా" అన్నది అమె. "వేదమంటే శబ్దమేగా, వినేదే విన్నప్పుడు వేరే తెలుసుకొనేదేముంది."

సాంఖ్యయోగం వేరే అవసరం లేదు. "నీతో మాట్లాడితే అమనస్కానికి వెళ్ళవచ్చు అని" నీ జీవిత గాథ చెప్పమని అడిగింది రాజమ్మగారు. "వెలలేని గాథమ్మా అది. మనకు పరిమితి ఉంది" అన్నది అమ్మ. "ఇప్పుడు కాకపోయినా మరొక్కప్పుడైనా నీ పుట్టుక, ఈ దైవీ లక్షణాలు ఎప్పుడు బహిర్గతమౌతాయి అన్నది." దేని నిమిత్తంగా ఎవరు ఇట్లా గుర్తించింది, చిన్నప్పటి నుండీ నీ మహిమలు, అనుభవాలు చెప్పమ్మా. నీవు పుట్టగానే ఆముదం పోసారనుకో అది ఎలా ఉండి త్రాగావో తెలీదుగా, నీ కళ్యాణాన్ని గురించి వినాలని ఉందమ్మా. నీ కళ్యాణం లోక కళ్యాణంగా ఉంటుంది అనుకుంటున్నాను అంటూ తన విశ్వాసాన్ని తెలియజేసింది" రాజమ్మగారు.

"లోక కళ్యాణమే నా కళ్యాణం కాని నాకళ్యాణం లోకళ్యాణం కాలేదు" అన్నది అమ్మ. ఒక చిన్న కోరిక ఉందమ్మా. "నీకు కొన్ని మంత్రాలిస్తాను. ఈ మంత్రాలన్నీ ప్రపంచానికి వెదజల్లమ్మా" అన్నది రాజమ్మగారు. "ఇంతవరకూ మంత్రమంటే నాకు అర్థం కానిదే నేనెక్కడని వెదజల్లేది" అన్నది అమ్మ. "నీవే మంత్రానివి నీకు అర్థం కావడమెందుకు, నేను రాసిస్తాను, చెప్పిన మాటలు చెప్పు. అడిగిన వారికి వారి తాహతును బట్టి చెప్పు. ఇది నీకు తప్పదు. శాసనం కాదులే, కోరిక" అన్నది రాజమ్మగారు. "కోరికలన్నీ తీర్చగలనా? కోరికలను కోరలేను, తీర్చలేను. సమర్థత ఇచ్చినప్పుడు సమర్థించడానికి బాధేమున్నది. మాటలతో చెప్పటం కాదు. మనస్సుకు తోచేటట్లు చేయాలి." రాజమ్మగారు ఒక కాగితం మీద "రామ చంద్రాయ", శ్రీరామ చంద్ర", "జయ జయ విఠల్" ఇట్లా కొన్ని మంత్రాలు రాసి చెప్పింది. ఏ దేవుడు ఇష్టమైన వారికి ఆ మంత్రాన్నివ్వమంది.

ఇంకో చిన్న కోరిక ఒక ఫోటో తీయిస్తావు అడిగింది రాజమ్మగారు. "నేను

కాదుగా తీయించేది. మీరు తీయిస్తే నేను వచ్చి కూర్చుంటాను. ఫోటోలు ఎప్పుడూ తీయించుకోలేదు. 1947 ఆగష్టు 15న అనుకోకుండా నాన్నగారితో కలిసి ఫోటో తీయించుకుంది. మీరెన్ని ఋజువులిచ్చినా, ఎన్ని ప్రమాణాలు చేయించినా నాకు 33 సంవత్సరాలు వస్తేగాని ఏపని జరగదనుకుంటాను. మీ కోరిక ప్రకారం కొంత సంఖ్య ఇవ్వండి. ఆ ప్రకారమే చేస్తాను. "ఎప్పుడో కాదమ్మా ఈ పూట ఒక్కటైనా చెయ్యి" అన్నది రాజమ్మగారు. "ఈ మంత్రాల గురించి చాలా గొడవలు వింటున్నాను. కుటుంబ చిక్కులకు, మంత్రాలకు ముడిపెడుతున్నారు. హెచ్చు తగ్గులకు మీరే బాధ్యులు." "సరేలే నీ భర్తను కనుక్కుంటావా ఫోటో గురించే కాదు మంత్రం గురించి కూడా." నాన్నగారి అనుమతితో అమ్మ రాజమ్మగారితో కలిసి ఫోటో తీయించుకుంది. కేవలం శాస్త్ర జ్ఞానంతో మొద్దుబారి స్థంబించిన రాజమ్మగారి గుండెను కరిగించి దేవుని వైపు ప్రవహింపచేసి, చివరకు ఆ దైవం తానే అని సాక్షాత్కారాన్నిచ్చి తరింపచేసింది అమ్మ.

రాజమ్మ గారు అమ్మకు మంత్రోపదేశం చేసినప్పుడు 33 ఆధరవులతో సంకేతంగా అమ్మ తెలియబడటం గురించి సూచించింది. అమ్మకు 33వ సంవత్సరంలో అమ్మ దర్శనార్థం అనేకులు వచ్చారు. ఒక ముక్కోటి నాడు గోవిందరాజు దత్తాత్రేయ శర్మ గారితో అమ్మ "1918 లో నృశింహ జయంతి సందర్భంలో మంగళగిరి బాలాంబ గారి సత్రంలో నీవు వడ్డిస్తున్నపుడు నేను చూచాను" అని చెప్పింది. కానీ ఆ అన్నయ్య తీరిగ్గా ఈ మాటలు గురించి ఆలోచిస్తే అమ్మ జననం 1923లో కదా, ఇంకొక సోదరుని విషయంలో 1914లో జరిగిన సంఘటనను ఆయనకు వర్ణించి చెప్పింది అమ్మ.

జిల్లెళ్ళమూడికి రెండున్నర మైళ్ళ దూరంలో పూండ్ల అనే ఊరు ఉన్నది. ఆ ఊరిలో నోరి మాణిక్యమ్మ అనే ఆమె వున్నది. ఆమె చిన్నవయస్సులోనే భర్తను కోల్పోయింది. అప్పటి నుండి భక్తి మార్గంలో, దైవ చింతనతో జీవయాత్ర సాగించేది. నోరి మాణిక్యమ్మ ఏకాదశి ఉపవాసం ఉండి ద్వాదశికి బ్రాహ్మణుని పిలిచి భోజనం పెట్టేది. అలా వచ్చిన వారిలో కంభంపాటి రామచంద్రశాస్త్రిగారు

భాగవతం, కృష్ణుడు, మహాత్ముల గురించి చెప్తూ ప్రసంగ వశాత్తు ఎక్కడో పురాణ వ్యక్తుల్ని, వెళ్ళిపోయిన వాళ్ళని గురించి ఆలోచిస్తాము కానీ మన ఎదుట ఉండే వారి గురించి ఆలోచించం. దూరపు కొండలు నునుపు అన్నట్లుగా దగ్గర ఉన్న వ్యక్తులు అర్ధం కారు. వారికి మన దృష్టిలో విలువ ఉండదు. వారు నివురుకప్పిన నిప్పులా ఉంటారు. జిల్లెళ్ళమూడి గ్రామంలో జిల్లేడు పొదల్లో తులసి మొక్క మొలిచినట్లు ఒక మహాతల్లి ఉంది. ఆమె ఆ ఊరి కరణంగారి భార్య. అలౌకిక శక్తి సంపన్నురాలు. కొంచెం పులగాన్నే ఎందరికో పంచగలదు. ఆమెని దర్శించి రమ్మని చెప్పారు. అప్పటికి అమ్మ వయస్సు 30 సం॥లు.

ఆమె మీకు ఎలా తెలుసని మాణిక్యమ్మ గారు అడిగింది. అప్పికట్లలో నాన్నగారి తమ్ముడైన లోకనాథం గారింట్లో అమ్మ ఉన్నది. అమ్మ ఆరోగ్య పరిస్థితి చూచేందుకు వైద్య నిమిత్తమై నూతలపాటి వీరయ్యగారు వెళ్ళారు. ఆయనకు అమ్మలో రోగ లక్షణాల కంటే యోగలక్షణాలు ఎక్కువగా కనిపించాయి. ఆ విషయాన్ని కనకమ్మ బామ్మకు చెప్పారు. కానీ ఆమెకు విశ్వాసం కుదరలేదు. మర్రిపూడిలో యాజులుగారు యాగం చేసే యోగశాల, మిగిలిన ఏర్పాట్లను చూపించేందుకు అమ్మను, బామ్మను తీసుకు వెళ్ళారు. మర్రిపూడిలో అమ్మ దర్శన భాగ్యం కలిగిందని ఆయన చెప్పారు.

వీరయ్యగారు, రామచంద్ర శాస్త్రిగారు జిల్లెళ్ళమూడికి అమ్మ దర్శనార్థమై వెళ్ళారు. అప్పుడు అమ్మ గొడ్ల చావిడి బాగుచేస్తోంది. వారికి ఆనందాశ్చర్యాలు కలిగాయి. "అమ్మా! మనకు గోమాత కూడా ఉందా?" అని అడిగారు వీరయ్యగారు. అవునన్నట్లుగా తలవూపింది అమ్మ. వీరయ్యగారు రామచంద్రగారితో "నీకేమనిపిస్తోంది"? అన్నారు. "ఆగోవుకు, సర్వచరాచర సృష్టికి మాతృమూర్తిలా కనిపిస్తోంది" అన్నారు. రామచంద్రశాస్త్రిగారు స్నానం చేసాక తులసీదళాలు అడిగారు. "మాదొడ్లో ఇవి లేవు నాయనా ఏమి చేసేది". అని "అమ్మే నాలుగు వేపచిగుళ్ళు, పుట్టమన్ను ఇచ్చిందని" మాణిక్యమ్మతో చెప్పారు.

అమ్మను గురించి విన్న కొద్దిసేపటికే ఆకాశంలో దేవతలా అమ్మ కనిపించింది. దానితో అమ్మను దర్శించాలన్న కోరికను అణుచుకోలేక మర్నాడే

యల్లమందను తీసుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళింది. చిన్న పర్ణశాలలో అమ్మ ఉన్నది. అమ్మ "మెడలో పసుపుతాడు, నల్లపూసలతో, చేతికి నిండుగా గాజులతో మహాలక్ష్మిలా ధగధగా మెరిసిపోతూ ఆమెకి దర్శనమిచ్చింది" అమ్మ. ఆ తరువాత పర్ణశాలలో సీతమ్మ వారిలా, మెడలో నల్లపూసలతో అరుంధతీదేవిలా, పెద్ద ముత్తైదువలా కనిపించింది. వెంటనే సాష్టాంగ నమస్కారం చేసుకుంది మాణిక్యమ్మ. ఆమెను చూడగానే అమ్మ "ఏమే! ఏముందని వచ్చావే ఇక్కడికి?" అంటూ పుట్టినప్పటినుంచీ తెలిసిన వ్యక్తిలాగా పలకరించింది. మాణిక్యమ్మకి కూడా ఏమిటి ఇట్లా పలకరిస్తుంది అని అనిపించలేదు. వెంటనే మాణిక్యమ్మ "ఇదే వైకుంఠం, నువ్వే సాక్షాత్తు ఆదిలక్ష్మివి" అన్నది. అప్పుడు అమ్మ "ఓసి! చాలా మాటలు నేర్చావే" అన్నది.

అమ్మ దగ్గరకు వచ్చిన తరువాతే మాణిక్యమ్మ వంటావార్పు నేర్చుకుంది. "నేనే మిమ్మల్ని కన్నాను, మీ తల్లిదండ్రులకు పెంపుడిచ్చాను" అని అమ్మ అంటుంది. అందువల్లనే కొత్తపాతలు, అడ్డుగోడలు, దూరం దగ్గరలు అమ్మకు లేవు. సర్వసాధారణమైన భౌతిక వాతావరణంలో అసాధారణమైన అలౌకిక హృదయానుభూతిని అనుభవించింది మాణిక్యమ్మ.

అప్పటి నుంచీ అమ్మ చింతనతోనే ఆవిడ మనసులో సహజ ఉపాసన జరిగింది. జిల్లెళ్ళమూడిలో అమ్మ "ఒసే మాణిక్యమ్మోరా" అని పిలిస్తే పూండ్లలో వున్న ఆమెకు వినిపించేది. వెంటనే అది అర్ధరాత్రికానీ, మిట్టమధ్యాహ్నం కానీ, వానా కానీ బురద కానీ, ఎండకానీ, వెన్నెలకానీ, ఆమావాస్యకాని ఏ కాలమైనా, ఎట్టి పరిస్థితులలో వున్నా అమ్మ పిలుపు వినగానే కూరలు, ఉప్పు, పప్పు, చింతపండు, మిరపకాయలు ఒక బుట్టలో పెట్టుకొని జిల్లెళ్ళమూడి వచ్చేది. కొద్దిరోజులు జిల్లెళ్ళమూడిలో ఉండి అమ్మ సేవ చేసుకుని తిరిగి వెళ్ళేది.

పూండ్ల గ్రామస్థులు, జిల్లెళ్ళమూడి గ్రామస్థులు అందరూ ఆమెని "ఎందుకమ్మో వెళ్తావు, ఏముందక్కడ, పిచ్చా, చాదస్తమా?" అని అవహేళన చేశారు. అవేవీ లెక్క చేయక అమ్మ చెంతకు వచ్చేది. జనం విస్తృతంగా రాని రోజుల్లో

తన ఊరి జనం, జిల్లెళ్ళమూడి జనం నిరుత్సాహపరుస్తున్నా ఆమె ఒక్కర్తే అంచంచల విశ్వాసంతో అమ్మను సేవించుకున్న మహాభక్తురాలు మాణిక్యమ్మ.

ఒకసారి నాగులచవితికి జిల్లెళ్ళమూడి వెళ్ళింది. పుట్ట, నాగేంద్రుణ్ణి చూపిస్తే పాలు పోసుకుంటానని అమ్మతో చెప్పింది. అమ్మ "సరే" అన్నది. తరువాత ఆమెకు అమ్మ పాద పీఠం మీద నాగేంద్రుడు పడగ విప్పి కనిపించాడు. "పాలు పోసుకుంటానన్నావుగా రా ఇడిగో నాగేంద్రుడు" అన్నది అమ్మ. నిజంగానే నాగేంద్రుడు కనపడే సరికి భయపడి బయటకు పరిగెత్తింది ఆమె. "నాగేంద్రుడికి పాలు పోసుకుంటానన్నావుగా పాము లేదు, ఏమీ లేదు రా" అన్నది అమ్మ. మాణిక్యమ్మ లోపలికి వచ్చి చూస్తే పాము కనపడలేదు. అపుడు ఆమె అమ్మ పాదాల మీద పడి నువ్వే నాగేంద్రుడు, నువ్వే సర్వం ఇంక వేరే పుట్ట, నాగేంద్రుడు ఎందుకమ్మా!" అని అమ్మ నోట్లో పాలుపోసుకుని పూజించుకుంది. సర్వ దేవతా స్వరూపం అమ్మే అని, సర్వం అమ్మే అని అంకురిత దీక్షతో అమ్మను సేవించింది.

మాణిక్యమ్మ అక్క పిల్లలను తీసుకుని అమ్మ దర్శనానికి వచ్చింది. అమ్మ దగ్గర సెలవు తీసుకుని బయలుదేరుతామని అమ్మకు చెప్పింది. "ఈ రోజు ఉండి రేపు ఉదయం వెళ్ళమన్నది" అమ్మ. పిల్లలను రేపు మా అక్కయ్య దగ్గరకు పంపించాలని వారిని వెంట బెట్టుకుని పూండ్ల బయలుదేరింది. జిల్లెళ్ళమూడి ఊరి చివరలో ఒక తాగుబోతు కర్రచేత బుచ్చుకుని "వచ్చావా రా నీ తలకాయ పగలగొడతాను" అంటూ కర్ర ఎత్తి మీదకు వచ్చాడు. మాణిక్యమ్మ అతనితో "ఏమిటి నాయనా ఏమి కావాలి. ఎందుకు నన్ను కొట్టటానికి వస్తున్నావు" అన్నది. చీకట్లో ఆ వ్యక్తి మాణిక్యమ్మని గుర్తుపట్టి ఎత్తిన కర్రదించాడు. ఆమె అతన్ని గుర్తించి "ఓరి సుబ్బయ్యా నువ్వా!" అన్నది. "నేనే అమ్మగారు" అని పూండ్ల ఊరి బయట దాకా దిగబెట్టాడు. ఈ విధంగా ప్రమాదం తప్పింది. ఆ చీకట్లో ఏమాత్రం గుర్తించక పోయినా ఆమె తల పగలి ఘోరమైన ప్రమాదం జరిగేది.

మర్నాడు మాణిక్యమ్మ జిల్లెళ్ళమూడి వచ్చింది. ఈమెను చూడగానే అమ్మ "ఆ వచ్చావా రా నీ తలకాయ పగల గొడతారా" అంటూ కర్ర పట్టుకున్నట్లుగా రెండు చేతులూ ఎత్తి క్రితం రోజు సుబ్బయ్య ఏ విధంగా అన్నాడో ఆ విధంగా

అన్నది అమ్మ. సర్వజ్ఞ అయిన అమ్మకు తెలియనిది ఏముంది?. "వెళ్ళవద్దంటే విన్నావా?" అన్నది అమ్మ. అమ్మ సర్వజ్ఞత్వానికి రక్షణకి అంజలి ఘటిస్తూ "ఏం చేయనమ్మా పరోక్షంగా సూచన ఇచ్చినా నాకు అర్ధం కాలా, అజ్ఞానంతో వెళ్ళాను" అని నమస్కరించింది.

అమ్మ నివసించే పర్ణశాలలో ఒక పుట్ట ఉంది. పుట్టమన్ను కొద్దిగా తీసుకురమ్మంది అమ్మ. ఆమె మొత్తం పుట్టని పెకలించి పళ్ళెంలో పెట్టి తీసుకువచ్చి నవ్వుతూ అమ్మతో "మొత్తం పుట్టను తెచ్చానమ్మా" అన్నది. అమ్మ మొత్తం తెచ్చావా?" అంటూ ఆమె వంక చూసి చూడక ముందే మాణిక్యమ్మ కింద పడిపోయి నోటివెంట నురగలు వస్తూ కాళ్ళు, చేతులు కొట్టుకోసాగింది. అప్పుడు అమ్మ మాణిక్యమ్మని చేతితో నిమిరింది. వెంటనే ఆమె మామూలు స్థితికి వచ్చింది. అమ్మ "దాని అవసరం తీరిందిలే. అందుకే ఇట్లా జరిగిందేమో?" అన్నది. ఈ విధంగా పుట్ట యొక్క చరిత్ర మాణిక్యమ్మతో పరిసమాప్తి అయింది.

మాణిక్యమ్మ ఇంట్లో ఒకసారి సంకీర్తన జరిగింది. సంకీర్తన ఆగిన తరువాత కూడా ఒకే చోట నుండి ఆ ఇంట్లో ప్రక్కగా శబ్దం వినపడింది. కొందరు ఖంగారుపడ్డారు. జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మతో చెప్పారు. తరువాత ఆ శబ్ధం ఆగిపోయింది. అచంచల విశ్వాసం అంటే ఆమెదే. ఆమె చెల్లెలి కూతురు యశోదను పెళ్ళికూతుర్ని చేయటానికి జిల్లెళ్ళమూడికి "నీదే భారం" అంటూ వరదలో ఈదుకుంటూ తీసుకు వచ్చింది. వాళ్ళు లేకుండా అమ్మ ఏ పనీ చేసే కాదు. దానిని "ఈ అక్కయ్యే కాదు వాళ్ళ అమ్మ కూడా మంచి భక్తురాలు. ఎప్పుడూ నా ధ్యాసే. ఇక్కడ నాకేమి అవసరమైనా కూతురు చేత పంపించేది. పని ఎక్కువైనపుడు పనికీ తోడు పంపించేది" అని చెప్పింది అమ్మ. "ఆమె ఇక్కడకు రాకపోయినా మీరు ఇక్కడ ఎట్లా ఉన్నారో ఆమెకు పూండ్లలో కనిపించేవారట కదా!" అని ఒకరు అడిగారు. అది సహజమే కదా అంత ధ్యానంలో ఉన్నప్పుడు ఎవరికోసం పోను? భగవంతుడు భక్తుని ఆర్తిని గ్రహించి ఎక్కడైనా ప్రత్యక్షమౌతాడు కదా! దగ్గర వాళ్ళలో దూరంగా ఉండి నన్ను చూసింది. ఆమె తల్లే" అని అమ్మ చెప్పింది!.

మహాత్ముల దగ్గర వుండి కాలం గడపటం కంటే, వారి ధ్యానంతో మననంతో, ధ్యాసతో వుంటే అవసరమైనప్పుడు భగవంతుడే దిగి వచ్చి భక్తుడ్ని అనుగ్రహిస్తాడు. మంత్రం అంటే మననం చేసే వారిని రక్షించేది. ఇది అమ్మ ప్రత్యక్షంగా తెలియచేసిన సందేశం. బ్రహ్మ విష్ణుమూర్తి బొడ్డులోని కమలంలో వుండే విష్ణుమూర్తి గూర్చి తపస్సు చేస్తుంటాడు. విష్ణుమూర్తి ఆదిపరాశక్తి గూర్చి ధ్యానిస్తుంటాడని దేవీ భాగవతంలో వివరింపబడింది కదా! ఎవరైనా యాత్రికులు పూండ్ల మీద నుండి జిల్లెళ్ళమూడి వస్తుంటే వారికి కూరలు, బియ్యం, పప్పు ఈవిధంగా అనేక వస్తువులు ఇచ్చి పంపించేది మాణిక్యమ్మ. "అది నా పుట్టిల్లు" అని అమ్మ అనేది. బిడ్డని అత్తవారింటికి పంపి ఎవరైనా వెళ్తుంటే ఇది ఇవ్వండి అది ఇవ్వండి అని ఇచ్చి పంపినట్లు మాణిక్యమ్మ పంపుతూ వుండేది. భక్తి భావంతో అమ్మ చెంతకు చేరి సేవించుకుని భక్తురాలై చివరికి తల్లియై అమ్మను మాతృవాత్సల్యంతో సేవించుకున్నది. "అది నా పుట్టిల్లు" అని అమ్మ ప్రకటించిందంటే ఆమెకి ఎంతటి అనుగ్రహాన్ని ప్రసాదించిందో అమ్మ వేరే చెప్పనవసరం లేదు. ఇట్టి అదృష్టానికి నోచుకుని, సేవించిన విశిష్టవ్యక్తి నోరి మాణిక్యమ్మ.

మన్నవ బుచ్చిరాజుశర్మగారు చీరాల ఐ.ఎల్.టి.డి. లో పని చేసేవారు. వారి మామగారు గంగరాజు లోకనాథంగారు. ఆయనకు కాలు సెప్టిక్ అయింది. కొమ్మూరు నుంచి రాజు గారిని జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ ప్రసాదం, కుంకుమ తెమ్మని పంపించారు. 1954 జూన్‌లో మొదటిసారిగా అమ్మను దర్శించారు. బాపట్ల రైల్వేస్టేషన్‌లో టీ తాగటానికి స్నేహితులతో వెళ్ళారు. అక్కడ ఒక ముసలమ్మకు పదిపైసలు వేసారు. హిందీ సినిమాలో లతామంగేష్కర్ పాడిన పాట బస్తీ, బస్తీ అన్నపాటను రేడియోలో విని పరవశం చెందారు. వారం తరువాత ఆ వరసలో

పాడుచు పాడుచు నీ కథ చాటుచు
పయనించెదనోయమ్మా
ప్రాణము వదెలెదనోయమ్మా

అన్న పాటను అమ్మ మీద రాసి, అమ్మకు పాడి వినిపించారు. జిల్లెళ్ళమూడిలో అందరూ ఆయన్ని రాజుబావ అంటారు. అమ్మ రాజు బావతో "నీవు హొటలు దగ్గర ఒక ముసలి దానికి పది పైసలు వేసావు గుర్తుందా?" అని అడిగింది. బిచ్చగత్తె రూపంలో అమ్మే వచ్చిందని రాజు బావకు అర్ధమయింది.

1955లో అమ్మ కొమ్మూరులో గంగరాజు లోకనాధంగారిని చూడటానికి వెళ్ళింది అమ్మ. కాట్రపాడు మున్సబుగారు, గంగరాజు లోకనాధం గారు ఆధ్యాత్మిక వాదులు. లోకనాధంగారి తమ్ముడు గంగరాజు శ్రీహరిరావుగారు అమ్మ శక్తి యుక్తులు పరీక్షించటానికి ప్రయత్నించారు. ఆయనకు ఆధ్యాత్మిక చింతన వున్నా బాల్య చాపల్యంతో "స్త్రీలకు ఆధ్యాత్మికత మీద అధికారమేమిటి?" అని అమ్మను ప్రశ్నించారు. దానికి అమ్మ "వేద మాతా అంటారు కానీ వేదపితా అనరు. కాబట్టి వేదాలు స్త్రీగానే వర్ణించబడ్డాయి. మైత్రేయి, గార్గి, లోపాముద్రా, అరుంధతి అంతా స్త్రీలే కదా! వారికి ఆధ్యాత్మికత మీద అధికారం లేదనటానికి వీలు లేదు. సుజాత గర్భిణిగా ఉన్నప్పుడు ఆమె తండ్రి వేదాలు వల్లిస్తుండగా ఉచ్చారణలో దోషం వచ్చినప్పుడు గర్భంలో వున్న పిండం అష్టవంకర్లు తిరిగాడు. అందుకే ఆ పిల్లవాడిని 'అష్టావక్రుడు' అంటారని అమ్మ తెలియచేసింది. సుజాత విన్నది, ఆమె కడుపులో పిండం వినగా లేనిది స్త్రీలకు అర్హతలేదనటానికి కారణమేమిటి?" అని ప్రశ్నించింది అమ్మ. దానికి అమ్మను పరీక్షించాలని వచ్చిన గంగరాజు శ్రీహరిరావుగారు నిరుత్తరులయ్యారు.

శ్రీనాన్నగారు జిల్లెళ్ళమూడిలో కొంతకాలం పొగాకు బేరన్ నడిపారు. రాజుబావకు పొగాకు విషయం తెలుసుకనుక పొగాకు గ్రేడింగు చూడటానికి జిల్లెళ్ళమూడి వస్తుండేవాడు. ఒకరోజు జిల్లెళ్ళమూడి వచ్చి బేరన్ తలుపులు తీసి చూసాడు. ఎదురుగా వున్న దృశ్యం చూచి భయభ్రాంతుడయ్యాడు. మనిషి ఎముకను కూడా మసి చేసే అగ్ని జ్వాలలో అమ్మ వున్నది. అది చూడగానే రాజుబావ షాక్ తిన్నట్లు అయ్యాడు. అతను చూస్తుండగానే నల్లగా కమిలిన దేహంతో అమ్మ మెల్లగా బయటకు వచ్చింది. కొద్దిసేపటికి అమ్మ శరీరం

మామూలు రంగుకు వచ్చింది. పంచభూతాలు తానే అయి, పంచభూతాలకి అతీతమైన అమ్మను అవి ఏంచేస్తాయి "సర్వమూ తెలిసిన నేను, బాధే నేనైనప్పుడు నాకు బాధలేదు సర్వాన్ని నిరోధించగలను అని తెలుసుకోలేరు". అని అమ్మ తెలియచేసింది.

ఏది ఏమైనా తామంతటతాముగా బయటపడితే గానీ అవతార పురుషుల గురించి మనము తెలుసుకోలేము. అమ్మ కష్టసుఖాలన్నీ రాజుబావకు అవగతమే. ఒక్కో సంఘటనకు ఒక్కో పాటతో తన ఆవేదనను వ్యక్తం చేసుకున్నాడు రాజు బావ. వివేకానంద "కనపడే పదార్థమంతా ఆకాశానికి ప్రతిరూపం అని, మనకు వచ్చే సంకల్పమంతా శక్తికి ప్రతిరూపమని" అంటారు. ఈ సర్వం తానైన అమ్మకు ఇదంతా అత్యల్పం.

అమ్మమీద ఏదైనా సాహిత్యం ప్రింటు చేయాలని అనుకున్నారు. ఆ రోజుల్లో రాజుబావ రాసిన పాటలు అమ్మ దగ్గర ఎక్కువగా పాడుతుండేవారు. ఒకరి దగ్గరి నుండి మరొకరు వ్రాసుకోవటంలో తప్పులుపడే అవకాశం ఉంది కాబట్టి ఆ పాటలను పుస్తక రూపంలో ప్రింటు చేయాలని నిర్ణయించారు. ఆ విషయాన్ని అమ్మ దగ్గర ప్రస్తావించగా రాజుబావ దగ్గర పర్మిషన్ తీసుకోమన్నది. రాజుబావ "అమ్మ వ్రాసిన పాటలకి అమ్మ పర్మిషన్ తీసుకోవటమేమిటని" అన్నాడు. తొలిసారిగా ఆయన పాటలు 'అనుభవసారం' అన్న పేరుతో అచ్చువేయబడ్డాయి. అమ్మ జన్మదిన సంచికను ప్రచురించాలని రచయితలకు అపీలు వ్రాసిన పాంప్లెట్స్‌ను పంపించారు. మొదటి సంచిక మన్నవలో **1962**లో ఆవిష్కరింపబడింది.

ఆ రోజుల్లో చాల కొద్దిమంది మాత్రమే అమ్మవద్దకు వెళ్ళి వస్తూండేవారు. ఆ అదృష్టవంతుల్లో రాజు ఒకరు. అప్పట్లో అమ్మే తనను చూడడానికి వచ్చేవారికి అన్నం వండి వడ్డించేది. ఎన్నో పారమార్థిక సాధన రహస్యాలను, ఆధ్యాత్మిక సత్యాలను అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు వెల్లడిస్తుండేది. ఎన్నో అతీంద్రియ శక్తులూ, దివ్య మహిమలూ అమ్మ సన్నిధిలో తరుచుగా జరుగుతుండేవి. తన

జీవిత చరిత్రకు సంబంధించిన ఎన్నో నిగూఢ విషయాలను అమ్మ కథలు కథలుగా వివరిస్తుండేది. తన ఆధ్యాత్మిక అనుభవసారాన్ని గూడా ఆనాటి భక్తులకు అమ్మ అలతి అలతి పదాలతో అభివ్యక్తం చేస్తుండేది. అట్లా అమ్మ చేతిమీదుగా అన్నం తిని, అమ్మ నోటివెంట అనవరతం రాలిపడే రత్నాలను ఏరుకుని మూటకట్టుకున్న మహాభాగ్యవంతుడు, అదృష్టవంతుడు శ్రీరాజు.

అమ్మను వంట నుంచీ తప్పించి గంగరాజు లోకనాథంగారి కుమార్తె ప్రభావతే వంట చేయటం మొదలు పెట్టింది. రాజుబావకు, ప్రభావతికి వివాహం అమ్మ స్వయంగా జరిపించింది. డైరీ రాయటం మొదలు పెట్టింది సుప్రభాతం సంధ్యావందనం మొదలు పెట్టింది కూడా ప్రభావతియే.

ఆ రోజుల్లో కొన్ని దివ్య ముహూర్తాల్లో గర్భగుడి తలుపులు అమ్మ తెరిచేది. కొద్దిమంది పుణ్యాత్ములు అమ్మదర్శనం చేసుకోగలిగారు. అమ్మచరిత్రను తెలుసుకోగలిగారు. అమ్మమహిమలను గమనించగలిగారు. అమ్మజీవితంలోని ఆకాశచుంబిత పరమోన్నత దివ్యశిఖరాలను అవలోకించగలిగారు. ఆ పుణ్యజీవుల్లో శ్రీరాజు ఒకరు.

ఏ సాధన చేయక పోయినప్పటికీ అమ్మ ఆధ్యాత్మికమయిన పరమానుభవాన్ని పొందింది. క్లిష్టతమ మయినటువంటి యోగంలో పరాకాష్ట స్థితిని అమ్మ సాధించింది. అనంతమయిన జ్ఞానంయొక్క సారాన్ని అమ్మ గ్రహించింది. జీవితంలోని బాధనూ, దుఃఖాన్నీ, సుఖాన్నీ, ఆనందాన్నీ అనుభవించింది. లౌకిక, అలౌకిక అనుభవసారాన్ని అమృతం వలె అమ్మ పుక్కిటిబంటిగా పానం చేసింది. తన అపార అనుభవ సాగరంలోంచి అమృతాన్ని తీర్థంవలె ఉద్ధరిణలతో కొద్దిమందికి పంచింది.

శ్రీరాజు అమ్మ తన జీవితంలో సాధించిన ఆధ్యాత్మిక విజయాలకు ఆకర్షితుడయ్యాడు. అమ్మ తన జీవితంలో అనుభవించిన కష్టపరంపర చూసి విచలితుడయ్యాడు. అమ్మచూపిన అతిమానవ సహనానికి విస్మితుడయ్యాడు. తాను కళ్ళతో చూసిన, చెవులతో విన్న విషయాలతో ఆవేశ భరితుడై "పాడనా

నా హృదయవీణపై...'' అని ఆలపించాడు. "వెలలేని నీ గాథ వినిపించెద, లోకాన నీ జ్యోతి వెలిగించెద...'' అని ఎలుగెత్తి చాటాడు.

"ఎంత మంచిదానవో యమ్మా
నీ దెంత మంచి విధానమో యమ్మా..." అన్న పాటను శ్రీరాజు 1956 ఫిబ్రవరి 15వ తేదీన వ్రాశాడు. "స్వభావ మధుర'' అయిన అమ్మలోని మానవాతీత కమనీయ తత్వానికే అక్షరాకృతిని కల్పించి స్వరబద్ధం చేసి లోకానికి అందించాడు. లోకం విచిత్రంగా విని, కళ్ళు యింతలు చేసుకుని అమ్మవంక తలయెత్తి చూసింది. అమ్మలోని అతిమానవత్వమూ, అతిలోక శక్తి మెరుపుల్లా మెరిశాయి. జనం కళ్ళు మిరుమిట్లు గొలిపాయి.

తర్వాత హృదయం స్పందించినపుడల్లా వ్రాసిన ఒక్కోపాట అమ్మ చరిత్రలోని సంఘటనకో, అమ్మతత్వానికో, మహిమకో సంబంధించి ఉండేది. అమ్మ జీవితంలోని రెండవ అధ్యాయానికి సంబంధించిన అనేక అజ్ఞాత సంఘటనలు యీ పాటల్లో మనకు సాంకేతికంగా దర్శనం యిస్తాయి. అమ్మతత్వం, ముఖ్యంగా అమ్మ అనిర్వచనీయమయిన సహనం అనేక గీతాల్లో సుస్పష్టంగా మనకు అవగాహనమై మన మనస్సులను కల్లోలపరుస్తుంది. మరి, రచయిత ఎంత విలవిలలాడి పోయి ఉంటాడో!

అమ్మఒడిలో పెరుగుతూ, అమ్మ బడిలో పాఠాలు చదువుకుంటూ శ్రీరాజు 'అమ్మతోడిదే లోకం' గా భావించాడు, అమ్మతో తాదాత్మ్యాన్ని పొందాడు. 'కన్నులు మూసిన కన్నులు తెరచిన కనబడు చుండునేదెవరమ్మా?' అంటాడు. 'గడియ గడియకు కనిపించును విడువలేను నీ పాదాలు' అంటాడు. 'నీమాట నామాట ఒకటేనులే' అని ఒక చోట 'నీ అడుగుజాడలే నా ఆదర్శమూ, నీ మనుగడే భువిని నా జీవితమ్మూ, గాఢాంధకారంబు బాపావులే, వెలుగు చూపావులే' అని తన స్థితిని చెప్పుకున్నాడు, అమ్మ అతనికి జ్ఞానాన్ని ప్రసాదించింది. ఆ జ్ఞాన నేత్రంతో అమ్మ అనుభవసారాన్ని గ్రహించడమే కాకుండా ఆ అనుభవసారాన్ని తనదిగాకూడా చేసుకున్నాడు.

అమ్మా --

నీవే, నీవే నమ్మా

సంతోషంబులో, సంతాపంబులో

సంగీతంబులో, నాదు గీతంబులో ...........

నాదు శ్వాసంబులో, నాదు ధ్యానంబులో....... అంటూ అంతటా అమ్మనే చూస్తూ, వింటూ తన్మయుడైపోయాడు రచయిత. ఆ తన్మయత్వమే పాటలకు మాధుర్యాన్నీ, రమణీయకాన్ని సంతరించిపెట్టాయి.

అమ్మ అనుభవసారాన్ని శ్రీరాజు సంగ్రహంగా తెలిపాడు. ఈ సర్వం బ్రహ్మయనే, ఈ ఆత్మే బ్రహ్మయనే, ప్రజ్ఞానం బ్రహ్మయనే, ఆ బ్రహ్మవు నీవయనే..... ఆత్మావలోకన అమ్మకు కలిగిందంటాడు. మరొక చోట మరీ క్లుప్తంగా సూటిగా చెప్పాడు. 'ఈ సర్వం ఒకటిగా అనిపించు నీకు, ఈ సర్వం నీవుగా అనిపించు మాకు' - అని.

అమ్మ అందరినీ అనుగ్రహించింది! అనుగ్రహిస్తుంది! అమ్మ అందరినీ సంతృప్తి పరుస్తున్నది. అన్ని మతాల వారికీ అన్ని మార్గాల వారికీ అన్ని దేశాలవారికి అన్ని ఉద్దేశాలవారికీ అందరికీ సమ్మతమయిన సందేశాన్ని అందించింది. అందుకే ఎన్నోదేశాల వారు తమ క్రీస్తు ప్రభువే అమ్మగా వచ్చాడని విశ్వసిస్తున్నారు. మహమ్మదే మళ్ళా అవతరించాడని కొందరు నమ్ముతున్నారు. సాక్షాత్తు బుద్ధ భగవానుని కారుణ్యమే ఇలా ఆకృతి దాల్చిందని కొందరు భావిస్తున్నారు. ఇట్లా ఎవరు ఏమినమ్ముతారో అమ్మదానినే పోషిస్తూ ఒకమూసలోకే ఒదిగి అలాగే సాక్షాత్కరిస్తూ సమాధాన పరుస్తున్నది.

ప్రాతఃకాల తుషారబిందువు ప్రభాకరుని గాంచిన మొదలు తన ప్రత్యణువు నందు ఆ దివాకరుడ్ని నింపుకొని ఆ దీప్తిచే కరిగి అతనిలో అదృశ్యమైపోతుంది. అట్లే అమ్మను చూచిన క్షణంలో హృదయాంతరంలో మెరిసిన అమ్మ రూపు మెరుపు మన అణువణువున వ్యాప్తమౌతుంది. మన మనస్సులు అమ్మను గూర్చిన మధుర మధుర తలపులతో నిండిపోతాయి. అప్పుడు అమ్మ రూపే మనకు

ఆరాధ్యమై అమ్మ ధ్యాసే ఆహారమై, అమ్మ పలుకే బంగారమై మన కోరికలన్నీ తీర్చేకల్పవల్లి అయిన అమ్మ సన్నిధిలో విహరిస్తాం. అమ్మ సందర్శనంతో కోరికలన్నీ మటుమాయమై నీటి బొట్టుకై ఎదురుచూచే చకోర పక్షిలా జీవిత చరమాంకంలో అమ్మలోనే ఐక్యమవ్వాలన్న ఒక్క కోరిక మిగిలేట్టుగా చెయ్యమని అమ్మని వేడుకుందాం.

అమ్మ రూపం చాలా అద్వితీయంగా వింత వింత శోభలతో విలసిల్లుతుంటుంది. ఆమెను చూచిన ప్రతి వ్యక్తికి ఇది అని వర్ణించటానికి అలవికాని, ప్రత్యేకత, ఆకర్షణ, దైవత్వం కనిపిస్తుంది. అమ్మ పొట్టిగా, అవయవాలు పొందికగా కళ్ళు, ముక్కు, నోరు, చేతులు, పాదాలు అంతా విగ్రహంలా తీర్చిదిద్దినట్లు ఉంటాయి. అది లౌకికమైన సౌందర్యం కాదు. అలౌకికమైన సౌందర్యం. ఆ అలౌకికత మన కళ్ళను గాక మనస్సునే ఆకట్టుకునే దివ్య సౌందర్యం, స్ఫురద్రూపి, ఆ దృష్టిలో ఎంతో చురుకుదనం, దయ, శాంతి, లాలన అన్నీ కలిసి ఉంటాయి. కనుబొమ్మల మధ్య ఉండే పెద్ద కుంకుమ బొట్టు చూడగానే ఆమె ఎవరో తెలియకపోయినా "అమ్మ" అనే పదం హృదయానికి హత్తుకుంటుంది. అమ్మ ముంజేతులు, అరిచేతులు, వేళ్ళు, పాదాలు అన్నీ ఆమెలోని దైవత్వాన్ని చాటుతాయి.

గొప్ప రామభక్తులైన రంగన్నబాబు గారు ఆయనతో వచ్చిన వారితో "అమ్మ పాదాలను గమనించారా, అటువంటి పాదాలు ఇంకెక్కడా ఉండవు. అవి సామాన్యమైనవి కాదు" అని చెప్పారు. అమ్మ రూపంలో విశేషం అమ్మ ఒక క్షణం ఉన్నట్టు మరొక క్షణం ఉండదు. ఇది కేవలం మన భ్రాంతి ఏమోనని ఫోటోలు తీస్తే ఎన్నివేల ఫోటోలలో అయినా సరే ఒక ఫోటోలో ఉన్నట్లుగా మరొక ఫోటోలో ఉండక పోవడం అమ్మ ప్రత్యేకత. అంత మృదువుగా ఉండే శరీరంలో భూదేవికుండేంత సహనం అంత బలం ఎలా దాగి ఉన్నాయా అనిపిస్తుంది. అమ్మకు పాలాభిషేకం చేయాలన్న తొందరలో మరుగు పాలను తీసుకువచ్చి కుమ్మరించినా ఆమె చలించలేదు. సలాసలా కాగే పులుసులో చేతిని ముంచి ముక్కను అందుకుని రుచిని చూడటం మానవమాత్రుల వల్ల అయ్యేపని కాదు.

షిర్డిబాబా కూడా వంటచేస్తూ ఉడికిందో లేదోనని మరుగుతున్న దానిలో చెయ్యిపెట్టి చూచేవారని చరిత్ర చెప్తుంది. "మహాతత్వాలకు మహిమలతో పనిలేదంటుంది" అమ్మ. కానీ ఇటువంటి సంఘటనలను వీక్షించినపుడు మన మానసం ఆశ్చర్యానంద డోలికలలో ఊగుతుంది.

ఈ లోకంలో జీవించినంత కాలం భగవంతుని కాపుదలలో ఉంటే ఎటువంటి పరిస్థితులకు భయపడనవసరం లేదు. కానీ ఆయనకు దూరంగా ఉంటే ప్రతి సమస్యకు, పరిస్థితికి భయపడుతూనే ఉండాలి. ప్రతిదినం గండంగానే ఉంటుంది. ఎప్పుడైతే ఆయన్ని మన జీవితంలోకి ఆహ్వానిస్తామో అప్పటి నుండి ఆ భగవంతుడే మన సన్నిధిలో ఉండి ప్రతి అవసరాన్నీ తీరుస్తూ ఆశీర్వదిస్తుంటాడు. అలాగే లలితామూర్తి అయిన మన అమ్మ అనేక విధాలుగా ఎందరెందరినో అనుగ్రహిస్తోంది.

**కాళిదాసు రఘు వంశంలో .....**
**"వాగర్ధావిత సంపృక్తౌ వాగర్ధ ప్రతిపత్తయే"**
**జగతః పితరౌ వందే పార్వతే పరమేశ్వరౌ"**

అను శ్లోకంలో భగవంతుడిని రమణీయంగా వర్ణించాడు. భగవంతుడే తల్లి తండ్రి. పురుష రూపంలో తండ్రియై, జీవలోకానికి ధర్మోపదేష్టయై ప్రపంచాన్ని శాసిస్తాడు. స్త్రీ రూపంలో తల్లియై, వాత్సల్యమూర్తియై ప్రేమతో లాలిస్తాడు. కలియుగంలో భగవంతుడు కల్కి రూపంలో వస్తాడన్నారు. కలికి అంటే స్త్రీ కదా! ఈ కలియుగంలో స్త్రీ రూపంలో అవతరించిన దైవం అమ్మ.

అనంత సీతాచలంగారు కొమ్మూరు డాక్టరుగా ప్రసిద్ధి. కొమ్మూరులోని గంగరాజు లోకనాధంగారు అమ్మ అన్నగారైన రాఘవరావు మావయ్య బంధువులు. అమ్మ, నాన్నగారు, పిల్లలు వారింటికి వచ్చారు. అనంత సీతాచలం గారికి అమ్మను చూపించారు. డాక్టరుగారు "ఏమిటమ్మా! నీకెలా ఉంది?" అని అడిగారు. నాన్నగారు "అమ్మ ఆరోగ్యం సరిగా లేదని" బదులిచ్చారు. డాక్టరు గారు అందరినీ బయటకు పంపించి అమ్మ నోట్లో ధర్మామీటరు పెట్టారు. పాదరసం చివరిదాకా

పాకింది. పొట్టమీద విపరీతమైన వేడిగా ఉంది. నాడి బాగానే ఉంది. నాలిక, కళ్ళు అన్నీ బాగానే ఉన్నాయి. డాక్టరుగారు లోకనాథం గారిని పిలిచి ఇంత టెంపరేచరు ఎవరికీ చూడలేదు. "ఈమెకు జబ్బా? అని ఆశ్చర్యంతో మందులు తెచ్చి అమ్మను వాడమని" చెప్పారు.

డాక్టర్ గారి దగ్గరకు మళ్ళీ అమ్మను తీసుకువస్తామన్నారు నాన్నగారు. "వద్దు నేనే వస్తానని" చెప్పారు. ఏ మందు ఇచ్చినా వద్దని కానీ, పుచ్చుకోనని కానీ అమ్మ అనేది కాదు. అమ్మ ఆహారం ఏమీ తీసుకోక పోయినా బాగానే ఉండేది. ఏడెనిమిది మాట్లు డాక్టరు గారు అమ్మను చూచాక అమ్మ శక్తి మంతురాలని, తన వైద్యం అవసరం లేదని అనిపించింది. కానీ ఆయన తరచూ అమ్మ దర్శనం చేసుకునేవారు. ఒకమారు అమ్మకు కాళ్ళు నొక్కుతుండగా ఒక కాలు అతి వేడిగాను, ఇంకొక కాలు అతి శీతలంగాను ఉండటం గమనించి ఆశ్చర్యచకితులయ్యారు.

డాక్టరు గారు అమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా నీకీ స్థితి ఎలా కలిగిందని" అడిగారు. దానికి అమ్మ "పక్కన గిన్నెలు తోముతున్నామెను చూపించి ఆమె" ఏం చేస్తుందీ అని" అడిగింది. ఆమె "గిన్నెలు తోముతుందమ్మా" అని చెప్పారు. "అలా తోమటం వలనే కదా మకిలి పోతుంది. అదే విధంగా ఒరిపిడి తగిలితేనే మన మనస్సుకు పట్టిన మకిలి పోతుందని చెప్పింది. బంగారాన్ని కొలిమిలో కాల్చితే ఏ విధంగా మెరుపు వస్తుందో మనిషికి ఎంత ఒరిపిడి కలిగితే అంత ప్రకాశిస్తాడని" అమ్మ చెప్పింది.

అమ్మ ఏడవ సం॥లోనే బాపట్లలో చిదంబరరావు తాతగారింట్లో బిక్షకులకు అన్నం పెట్టింది. తరువాత అమ్మ బజారు వెంట వెళ్తుండగా బ్రహ్మాండం వారి సత్రంలో బిక్షకులందరూ కూర్చుని అన్నం తింటున్నారు. అది చూచి అమ్మ అక్కడే నిలబడిపోయింది. పక్కనే దత్తాత్రేయ స్వామి దేవాలయం నుండి జేగంటలు వినిపించాయి. సంస్కృత పాఠశాల నుండి వేద ఘోష తరంగాలుగా చెవికి సోకాయి. ఆ దివ్య ముహూర్తంలో దేవాలయం లేని ఊళ్ళో దేవాలయం నిర్మాణం చెయ్యాలని, అందరికీ స్వతంత్రమైన సత్రం ఏర్పాటు చెయ్యాలని సంస్కృత పాఠశాల స్థాపించాలని అమ్మ నిర్ణయించింది.

అమ్మ ఆలోచనలకు జిల్లెళ్ళమూడిని, కార్యరంగంగా ఏర్పాటు చేసుకుంది. అందుకనే జిల్లెళ్ళమూడిలో యాదవులు, బోయిలు, సాయిబులు అందరూ ఎసట్లో బియ్యం వేసేటప్పుడు తలా ఒక పిడికెడు బియ్యం బిక్షగా పక్కన పెట్టమంది. ఆ బియ్యం అమ్మగా వచ్చిన 300 రూ॥లతో అమ్మ స్థలం కొన్నది. ఆ స్థలంలో 1956 సం॥లలో మే 5న అమావాస్య ఆదివారంనాడు దేవాలయ శంఖుస్థాపన చేసింది. బిక్షగా తీసిన బియ్యం అమ్మగా వచ్చిన డబ్బుతో కొన్న స్థలం కాబట్టి దానిని "బిక్ష గుడి" అంటారని అంజయ్య మస్తాను, కిట్టమ్మ చెప్పారు. గుడి ఎక్కడ వస్తుందమ్మా అని అడిగారు. అప్పుడే అమ్మ తలలో పువ్వు ఒకటి కింద పడింది. అక్కడే గుడి వస్తుందని అమ్మ చెప్పింది. అదే "అనసూయేశ్వరాలయం".

కొమ్మూరు డాక్టరు గారు, అక్కిరాజుగారు, నోరి వెంకటేశ్వర్లు మొదలగు చీరాల వాళ్ళు దసరాల్లో అమ్మకే ముందు అర్చన చేయాలన్నారు. బామ్మ ముందు కలశానికి పూజచేయమంది. ఆమెను బాధ పెట్టటం ఇష్టం లేక అమ్మ కలశానికి పూజచేసింది. చీరాల వాళ్ళు అమ్మకు పూజచేసారు. మొత్తం మీద వారి కోరిక, వీరి కోరిక తీర్చిన కల్పవల్లి అమ్మ.

అనంతసీతాచలంగారి తమ్ముడు వెంకటేశ్వర్లు. అతని భార్య రాముడమ్మ. వెంకటేశ్వర్లును, రాముడక్కయ్యను అమ్మ రమ్మని కబురు పెట్టింది. అమ్మ దగ్గరకు రాకముందు 14 సం॥లు, 6సం॥లు, 4సం॥లు. మగపిల్లలు, ఆరు నెలల ఆడపిల్ల చనిపోయారు. అమ్మ దగ్గరకు వచ్చాక ఒక్క పిల్లవాడు బ్రతికి బట్టకట్టాడు. రాముడక్కయ్య పిల్లాడికి పేరు పెట్టమని అమ్మని ఎంతగానో బ్రతిమాలింది. అమ్మ "నేను పెట్టను పో" అనేది. ఒకమారు రాముడక్కయ్య లాంతర్లు తుడుచుకుంటోంది. అమ్మ పాత మందిరంలో కూర్చుని రమ్మన్నట్లు తల ఊపింది అమ్మ. తనని కాదేమోనని ఊరుకుంది రాముడక్కయ్య మళ్ళీ అమ్మ తల ఊపుతూ పిల్లవాడిని తీసుకురమ్మని సైగ చేసింది. రాముడక్కయ్య పిల్లవాడిని తీసుకుని అమ్మ దగ్గరకు వెళ్ళింది. అమ్మ పిల్లవాడిని తీసుకుని "నరుక్కుంటాను, ముక్కలు చేసుకుంటాను" అన్నది అప్పటికే నలుగురు పిల్లలను పాతరపెట్టిన అక్కయ్య అమ్మమీద ఎనలేని విశ్వాసంతో "అంతా నీ ఇష్టమేనమ్మా!"

అన్నది. అమ్మ ఆపిల్ల వాడిని దగ్గరకు తీసుకొని ఈడ్చి వీపున ఒకటి తగిలించి అతనికి ప్రాణదానం చేసి ముక్కంటి అనే పేరుపెట్టింది. ఆ తరువాత నుంచీ అందరూ ముక్కంటి అని పిలిచేవారు.

వెంకటేశ్వర్లు వచ్చిన తరువాత గొడ్లను కొని వ్యవసాయం చేయించింది. ఒకమారు సంస్థలో వాళ్ళు మీటింగ్ పెట్టుకున్నారు. పొద్దు ఎక్కుతోంది. వెంటేశ్వర్లు "నాగొడ్లను మేతకు తీసుకువెళ్లాలి. అంతగా అవసరమనుకుంటే ఆ మీటింగ్ ఏదో సాయంత్రం పెట్టుకోండని" గొడ్లను పొలంకు తోలుకుపోయాడు. అది చూచి "అందరూ వాడిలా కర్తవ్యం ముఖ్యం అనుకుంటే మీటింగులతో పని లేదంది" అమ్మ. బావి దగ్గర రాముడక్కయ్య హోటల్ పెట్టుకుంది. మస్తాన్, మళ్ళా వెంకటసుబ్బయ్య, పోష్టు వెంకటేశ్వర్లు హైమనే అమ్మగా చూచుకునే వాళ్ళు. హైమ "నా పిల్లలకు ఏమైనా పెట్టమని" రాముడక్కయ్యను అడిగేది.

రాముడక్కయ్య అమ్మకు జడవేసేది. శని, ఆది వారాల్లో చీరాల వాళ్ళు వచ్చేవారు. వాళ్ళు వచ్చేటప్పటికి ఇల్లు అలికి, అమ్మ మంచం వేసి, చాపలు పరిచేది. వేధించకుండా జడవేయించుకోమ్మా అని అమ్మను బ్రతిమాలేది రాముడక్కయ్య. రాముడక్కయ్య భర్త వెంటేశ్వర్లు చనిపోయినప్పుడు అక్కయ్య అమ్మకు పూజ చేసుకుంది. ముక్కంటి 9 సం॥ల పిల్లవాడు. అనంత సీతాచలంగారు, అనంత వీరాస్వామిగారు పూజచేసుకుంటుంటే వారి మధ్య కూర్చోబెట్టమంది అమ్మ. "నీకు ఎవరంటే ఇష్టంరా? ఎవరి దగ్గర ఉంటావు రా?" అని అమ్మ అడిగింది. చిన పెదనాన్న వీరాస్వామి గారి దగ్గర వుంటానన్నాడు ముక్కంటి.

చీరాల వాళ్ళంతా అమ్మ దగ్గర కూర్చుని ఉన్నారు. ఇల్లు అలుకుతున్నప్పుడు రాముడక్కయ్యకు తేలు కుట్టింది. అమ్మ దగ్గరకు వెళ్ళి తేలుకుట్టిందని చెప్పింది. అమ్మ అక్కయ్యను తన ఒళ్ళో పడుకోబెట్టుకుంది. అక్కయ్యను ఒళ్ళో ఉంచుకునే ఆవరణలో అందరికీ అన్నం ముద్దలు కలిపి పెట్టింది. రాముడక్కయ్య ఒక మాటు అమ్మను చూస్తూ సమాధిగత అయింది. ఎంతసేపటికీ తెలివి రాలేదు.

వెంటనే అమ్మ అక్కయ్య నోట్లో ఇంత కర్పూరం వేసింది. దానితో ఆమెకు తెలివివచ్చింది. అవ్యాజకరుణామూర్తి అయిన అమ్మ ఒడిలో ఓలలాడే అదృష్టం రాముడక్కయ్యకు కలిగింది. ఇప్పటికీ అమ్మ జ్ఞాపకాలతో, అనుక్షణం అమ్మనామంతో గడుపుతున్న ధన్యజీవి.

డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు చీరాలలో ఆయుర్వేద వైద్యం చేసేవారు. యోగాభ్యాసం చేసిన వ్యక్తి. నోరి వెంకటేశ్వర్లు గారు అమ్మ గురించి ముందుగా డాక్టరు గారికి తెలియచేసారు. జిల్లెళ్ళమూడి కరణం గారి భార్య యోగాభ్యాసురాలు. ఆమె భర్త నా సహాధ్యాయి. ఆమెను చూసివస్తే బాగుంటుందని" చెప్పారు. ఒకమారు ఆయన జీపు తీసుకువచ్చి డాక్టరు గారిని అమ్మను దర్శించటానికి తీసుకువెళ్ళారు. అమ్మను చూడగానే నోరి వెంకటేశ్వర్లుగారు సాష్టాంగ నమస్కారం చేశారు. డాక్టరు గారు కోటు జేబుల్లో రెండు చేతులూ పెట్టుకుని తానుగా అమ్మకు నమస్కారం చేయకూడదనుకున్నారు. కానీ ఆయన చేతి వేళ్ళలో కదలిక వచ్చి రెండు చేతులూ కలిపి నమస్కారం చేశారు. "ప్రయత్నానికి వెనక ప్రేరణ ఒకటి ఉంది. అది నేనే అని" వారికి తాత్త్విక అనుభూతిని కలుగజేసింది అమ్మ.

రెడ్డిపాలెం కాంతయ్యగారు చాలా యోగసాధన చేసిన వ్యక్తి. ఆయన్ని చీరాల డాక్టరు గారు జిల్లెళ్ళమూడికి రమ్మని ఆహ్వానించారు. కాంతయ్యగారు ఆయన ఆరాధించే గాయత్రి విగ్రహం వద్దకు వెళ్ళి "తల్లీ! ఆ తల్లిని చూచి రమ్మంటున్నావా?" అని నమస్కరించి చీరాల వచ్చారు.

డాక్టరుగారింట్లో ఆయన పూజ చేసుకుంటున్న ఆంజనేయస్వామి విగ్రహాన్ని చూసి ఇందులో బీజాక్షరలోపం వుంది. అందువల్ల "నీ వంశం క్షయమవుతుంది, కుటుంబం నాశనమవుతుందని చెప్పారు. దానికి డాక్టరుగారు దేవుడు కరుణామయుడు. దీన రక్షకుడు అంటారు. అటువంటిది ఒక్క బీజాక్షరలోపం వల్ల వంశనాశనం చేస్తాడా? అలా చేస్తే వాడు దేవుడు కాదు. ఒకవేళ మీరు చెప్పినట్లుగా భగవంతుడు అనుకున్నా వాని భౌతికాన్ని నాశనం చేసి మోక్షం ఇస్తాడు. "అయినా దేవుడికి చూపించి మనమే తింటున్నాం వాడేమైనా తినవచ్చాడా? పెట్టవచ్చాడా? ఎందుకు ఈ పూజ, నివేదన" అన్నారు.

దానికి యోగి గారు "ధృఢమైన మనస్సు ఉంటే ఏదీ ఏమీ చేయదన్నారు, అక్కడి నుంచి జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించి "అమ్మా! గాయత్రి ఇక్కడ వున్నావా?" అని ఆర్తిగా ఆనంద భాష్పాలు రాల్చారు. వారికి అమ్మ పంచముఖ గాయత్రిగా దివ్యదర్శనమిచ్చింది.

అమ్మా, కాంతయ్య యోగి గారు సమాధి స్థితిలో ఉన్నారు. అమ్మ మామూలు స్థితిని వచ్చినా వారు ఎంత సేపటికీ మామూలు స్థితికి రాలేకపోయారు. అప్పుడు అమ్మవారి భృకుటి స్థానంలో వేలు పెట్టి నొక్కితే యధాస్థితికి వచ్చారు. యోగిగారి షట్చక్రస్థానాలను అమ్మ సరిదిద్దింది. ఆయన రెడ్డిపాలెం తిరిగి వెళ్ళారు.

డాక్టరుగారి భార్య 25 పూరీలు చేసి ఇచ్చింది. తీరా ఈయన తినటానికి చూస్తే 5 పూరీలే ఉన్నాయి. వారి పిల్లల్ని మీరు తిన్నారా? అని అడిగితే వారు తినలేదని చెప్పారు. ఆ పిల్లల్ని దండించారు. డాక్టరు గారు అమ్మ దర్శనానికి వెళితే అమ్మ తన పక్కవారితో "చేత కాకపోతే సరి, తిన్నవాళ్ళని పట్టుకోవాలి కానీ పిల్లల్ని కొట్టటం ఎందుకు వాళ్లేం చేస్తారు" అన్నది. అది విని డాక్టరు గారు "పిల్లలే తిని వుంటారన్నారు" "కాదు నేను తిన్నాను. చేతనైతే నన్ను పట్టుకో" అన్నది అమ్మ. "నీ మీద మాకున్న నమ్మకంతో అలా అంటున్నావు. కానీ నీకు చాటుగా తినవలసిన ఖర్మమేమిటి నన్ను అడిగితే నేను పెట్టనా?" అన్నారు. "సరే చేతనైతే పట్టుకో" అన్నది అమ్మ. ఈమారు 25 పూరీలు చేయించుకొని అలమార్లో పెట్టి తాళం వేసారు. మధ్యాహ్నం తినటానికి చూస్తే అందులో ఒక్కటి కూడా లేదు. అప్పుడు అమ్మ అన్నమాట అర్థమయింది.

డాక్టరుగానే కాక ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నత స్థానాన్ని చేరిన వ్యక్తి. ఆయనకు ప్రథమ దర్శనంలోనే మరుపురాని దివ్యానుభూతిని కలుగజేసి తన అక్కున చేర్చుకుంది అమ్మ. ఒకమారు డాక్టరుగారు జిల్లెళ్ళమూడి వెళ్ళేటప్పటికి "నీవు దోచిపెడుతుంటే వాడు ఎక్కడి నుంచి తెచ్చి పెడతాడు. నీ మాయ రోగం కుదురుస్తాను అని కేకలు వేస్తోంది" అమ్మ అత్తగారు. "నువ్వు వచ్చేటప్పటికి మానేసింది" అని చెప్పింది అమ్మ. ఆ తరువాతే చీరాల వారంతా చందాలు

వేసుకొని అన్నపూర్ణాలయాన్ని ఏర్పాటు చేసుకున్నారు. డాక్టరు గారికి పాలు ఏ విధంగా పొంగించాలో చెప్పి వారిచేత పొంగలి చేయించింది. వల్లూరి లక్ష్మీనరసమ్మ గారిచే వండించి అన్నపూర్ణాలయంలో అమ్మ స్వయంగా వడ్డించేది. హైమాలయం దగ్గర ఉన్న బావిని డాక్టరుగారే తవ్వారు. అమ్మ పుట్టిన రోజు వేడుకగా చెయ్యటం మొదలు పెట్టింది డాక్టరు గారే.

డాక్టరు గారికి ఫోటోగ్రఫీ యందు మక్కువ ఎక్కువ. అమ్మ రూపాలను వేలకు వేలుగా ఫోటోలు తీసి, మూవీ కెమెరాలతో సినిమాలు తీసి, స్లైడ్స్ తీసి నిరంతరం అమ్మ రూపాన్ని ధ్యాన దర్శనాదులతో అర్చించుకున్న ధన్యజీవి డాక్టరుగారు. ఆయన చీరాలలో ఉన్నప్పుడు అమ్మ గోడకు ఆనుకుని బాధపడుతూ కనిపించింది. డాక్టరు గారు స్వయంగా చేసిన మందు తీసుకుని జిల్లెళ్ళమూడి వచ్చారు. చీరాలలో ఏ విధంగా కనపడింతో అదే విధంగా అమ్మ ఉంది. డాక్టరు గారు తెచ్చిన మందుతో నొప్పులు తగ్గాయి.

"వ్యాధులకూ రూపాలున్నాయి. అవి నాకు కనపడుతూ ఉంటాయి. వ్యాధులూ ప్రాణులే నా శరీరంలో **30,40** రకాలకు తగ్గకుండా ఉంటాయి. మీరు నన్ను విడిచి ఉండలేనట్లు అవి కూడా నన్ను విడచి ఉండ లేకుండా ఉన్నాయి" అన్నది అమ్మ. "సంకల్ప మాత్రంచేత "సర్వమూ తెలిసిన" నేను సర్వాన్నీ నిరోధించగలను, బాధే నేనైనపుడు నాకు బాధే లేదు". అని నిరద్వంద్వంగా ప్రకటించింది అమ్మ. ఒకమారు డాక్టరు అమ్మ దగ్గర ఉండగా ఆకాశం నుంచి తేనెలాంటి తియ్యని పదార్థం ధారగా పడింది. అమృత తుల్యమైన ఆ ద్రవాన్ని డాక్టరుగారితో పాటూ అక్కడ ఉన్నవారూ దోసిళ్ళతో పట్టుకుని తాగారు.

**1968** ఏప్రియల్ **5**న హైమ మరణించింది కానీ **6**వ తేదీన హైమకు మళ్ళీ నాడి ఆడటం, శరీరం వేడెక్కటం జరిగింది. అనగా అమ్మ ప్రాణ ప్రతిష్టను జరిపి హైమక్కను అందరి సమక్షంలో సమాధి చేసింది. ఆ సమాధిపై నిలబడి "ఈ అమ్మాయి మరల మీకు కనపడుతుంది. మీతో మాట్లాడుతుంది. మీతో కలిసి తిరుగుతుంది. సర్వవ్యాపకమైన శక్తికి ఆసక్తి కలిగినపుడు ఎక్కడికక్కడే రూపధారణ చేస్తుంది అని" చెప్పింది అమ్మ. "హైమాలయంకు పునాదులు

తీస్తుంటే మా అమ్మకోసం మేము తీసుకుంటామని వాళ్ళ ముగ్గురే పునాదులు తీసారు. రాముడక్కయ్య రాజ్యలక్ష్మక్కయ్య సిమెంట్, ఇటుకలు అందించేవారని" మస్తాన్ చెప్పాడు.

ఒక పూర్ణిమ నాడు స్నానం చేసి జపానికి కూర్చున్నారు డాక్టరుగారు. అమ్మ డాక్టరు గారి శిరస్సుమీద చెయ్యి పెట్టి, చెవిలో ఏదో చెప్పింది. వెంటనే ఆయన మనసు అంతర్ముఖం అయింది. ఆ సందర్భంలో దేహం మీద చీమలు పాకుతున్నా తెలియని స్థితిలో ఉన్నారు. ఆ స్థితిలో వారికి రామలాల్ ప్రభూజీ కనపడ్డారు. అంతకు ముందు ఆ ప్రభూజీ గురించి ధ్యానిస్తే కనపడలేదు. అమ్మ అనుగ్రహం వల్ల ఎంతో సాధన చేసినా లభ్యం కాని అనుభూతులు, స్థితులు ఆయనకు అవలీలగా లభ్యమయినాయి.

డాక్టరు గారు, రాజుపాలెం రామచంద్రరావుగారు అమ్మ సన్నిధిలో ఉన్నారు. అమ్మ సమాధావస్థలో కొంతసేపు ఇంగ్లీషులో మాట్లాడింది. అమ్మ మాట్లాడిన విషయాలన్నీ రామచంద్రరావుగారు ఒక కాగితం మీద రాసుకున్నారు. అమ్మ మామూలు స్థితికి వచ్చిన తరువాత ఎవరితోనమ్మా ఇంగ్లీషులో మాట్లాడావు అన్నారు. దానికి అమ్మ ఆమెరికాలో ఉన్న వారితో మాట్లాడాను. వారు కొన్ని ప్రశ్నలు వేశారు. దానికి సమాధానం బెట్రండ్ రస్సెల్ రాసిన పుస్తకంలో ఫలానా పేజీ నుండి ఫలానా పేజీ వరకు వుంది" అని అమ్మ చెప్పింది. అరువాత రామచంద్రరావు గారు బెంట్రడ్ రస్సెల్ పుస్తకంలో అమ్మ చెప్పిన పేజీలు చూస్తే సరిగ్గా అమ్మ చెప్పిందే ఉంది. కొన్ని వేల మైళ్ళ దూరంలోవున్న వారితో మాట్లాడటం, దూరశ్రవణం తనకు ఉండటమే కాదు. దూరంగా ఉన్న వారికి వినిపింప చేయటం మొదలైనవి శార్వాణి అయిన అమ్మకు చాలా చిన్న విషయాలు.

డాక్టరు గారికి, ఫోటోలు తీసే అదృష్టం తనకు లభ్యపడిందన్న అహంకారం పెచ్చు పెరిగింది. దానితో మూడు నెలలు అమ్మ ఆయనను దూరంగా ఉంచింది. అప్పుడు మద్రాసు నుండి వేరొకరు వచ్చి ఫోటోలు తీసారు. మూడు నెలల తరువాత డాక్టరు గారు చీరాల నుండి అమ్మకు "బ్రతికి ఉన్నాడు, జీవచ్ఛవం వలె" అని రాసి పంపారు. అమ్మ డాక్టరు గారిని రమ్మని కబురు చేసింది.

"భగవంతుడు రాక్షసులను సంహరించాడని, దేవతలను రక్షించాడనీ చెప్తారు. దేవతలకు అహంకారం పెరిగినపుడు వారికి కనువిప్పు కలగటానికి శిక్షించాడు. సంహారం అనివార్యం అయినందున రాక్షసులను సంహరించాడు. "శిక్షణే తప్ప శిక్ష లేదనీ, శిక్షణ కూడా రక్షణే, సర్వం అనుగ్రహమే" అని తెలియచేసింది అమ్మ. పూర్వం దేవతల విషయంలో వివరించినట్లు డాక్టరు గారికి కనువిప్పు కలిగించింది.

అమ్మ, డాక్టరు గారితో "ఇక్కడ ఒక శబరి నాకోసం పరితపిస్తున్నది దాన్ని చూడాలి నాన్నా" అన్నది సరే అని ఆమె దగ్గరకు వెళ్ళారు. ఆ గుడిసెలో 80 ఏళ్ళ వృద్ధురాలు కుక్కి మంచంలో పడుకుని ఉన్నది. అమ్మ ఆమెను తట్టి లేపింది. అమ్మను చూడగానే ఆ వృద్ధురాలు ఎంతకాలానికి వచ్చావమ్మా! అని ఆనంద పారవశ్యంలో మునిగింది. "నీకోసమే వచ్చానులే! అంటూ అమ్మ తీర్థ ప్రసాదాలిచ్చింది. అమ్మ డాక్టరు గారితో "నాన్నా! మా ఇద్దరికీ ఫోటో తియ్యి" అన్నది. "ఇక్కడ వెలుగు సరిగా లేదు బైటకి వస్తే ఫోటో సరిగా వస్తుంది" అన్నారు. దానికి ఆమె "ఏడు సంవత్సరాల నుండీ అన్నీ మంచం లోనే, నేను లేవలేనమ్మా" అన్నది. వెంటనే అమ్మ లేస్తావులే అంటూ ఆమె చెయ్యి పట్టుకుని బయటకు తీసుకువచ్చింది. ఆమెను కూర్చోబెట్టి తాను ప్రక్కనే నిలుచుని ఆమె శిరస్సుపై చేయిపెట్టి ఫోటో తీయించుకుంది" అమ్మ. "ఇంకా ఎందుకమ్మా! నీ దర్శనమైందిగా నీలో కలుపుకో" అన్నది ఆమె. అమ్మ ఆమెకు దర్శనమిచ్చిన మరుసటి రోజే ఆమె శరీరం చాలించింది.

అమ్మ చీరాల బేర్ హాస్పిటల్‌లో కొంతకాలం ఉన్నది. అదే హాస్పిటల్‌లో మిస్ మేయర్ అనే డాక్టరు అమ్మ యొక్క అలౌకికతను అనుభవించారు. మిస్ మేయర్ గది నుండే గదులు, గోడలు అడ్డుగా ఉన్నా లేనట్టుగానే అమ్మ దర్శనమిచ్చేది. వాళ్ళు భారతదేశం వదిలి అమెరికా వెళ్ళిన తరువాత కూడా అమ్మ ట్రాన్స్‌లో వారితో మాట్లాడేది.

బేర్ ఆసుపత్రి డాక్టర్స్ అరుణాచలంలో హాస్పిటల్ పెట్టటానికి వెళ్తూ అమ్మను తీసుకు వెళ్ళారు. ఆ సందర్భంలో వీరంతా రమణ మహర్షి ఆశ్రమానికి

వెళ్ళారు. అమ్మ ఆయన దర్శనం చేసుకుని ఒక ప్రక్కగా కూర్చుంది. అమ్మను దగ్గరకు పిలిచి సాక్షాత్తు అవతారమూర్తియైన రమణ మహర్షి "మాతృశ్రీ" అని సంభోదించారు. ఆ విషయాన్ని డాక్టరు పొట్లూరి సుబ్బారావు గారికి అమ్మ చెప్పింది. "నేను దర్శనం ఇచ్చిన చోటనే మాతృభూతేశ్వరాలయం రమణ మహర్షి నిర్మించారని తెలియజేసింది" అమ్మ.

జిల్లెళ్ళమూడిలో అమ్మ పూరిపాకలో ఉన్న రోజుల్లో డాక్టరు గారు అమ్మ దగ్గర కూర్చున్నారు. రాత్రి పది గంటల వేళ అమ్మ సమాధి అవస్థలో అనేక భాషల్లో మాట్లాడింది. ఇప్పుడు ఒక విశేషం జరిగిపోతున్నది రండి అని, అనేక భాషల్లో ఎందరో మహానుభావులను పిలిచినట్లు అయనకు అర్థమైన భాషలో అమ్మ మాట్లాడినప్పుడు తెలిసింది. అట్లా మాట్లాడిన తరువాత అమ్మ మామూలు స్థితికి వచ్చింది. డాక్టరు గారు కెమేరా సిద్ధం చేసి ఫోటో తియ్యటానికి నిలబడ్డారు. నిలుచున్న అమ్మ దేహం నుండి కాంతులు విరజిమ్మాయి. తరువాత అనేక రూపాలు అమ్మలో వచ్చాయి. అమ్మ దేహం ఎన్నో రూపాలుగా మారింది. వారి దగ్గర ఒక్కటే ఫిల్మ్ ఉండటం వల్ల అన్ని రూపాలను తీయటం కుదరలేదు. " అన్ని రూపాలూ నావే అన్ని నామాలూ నావే ఏ పాదాలకు మ్రొక్కినా నా పాదాలకు మ్రొక్కినట్లే". శక్తి పార్వతి, జ్ఞానం సరస్వతి, రూపం లక్ష్మి అని త్రిమాతల తత్త్వన్ని గురించి వివరించింది" అమ్మ రకరకాల భాషలలో మాట్లాడటం వలన వాణీవిద్యాదాయిని అయిన సరస్వతి తాను (జ్ఞానం) అని తెలియజేసింది. కాంతులు విరజిమ్ముతూ సాక్షాత్కరించడం ద్వారా పార్వతి (శక్తి) తానే అని తెలియజేసింది. ఎన్నో రూపాల సాక్షాత్కారాల ద్వారా లక్ష్మి (రూపం) తానే అని తెలియజేసింది. ఆ విధంగా త్రిమాతలు తానే" అని నిర్ధారించింది అమ్మ.

డాక్టరు గారు అమ్మతో "ఇవాళ నాకు ఏమి కావాలన్నా ఏమి చెయ్యాలన్నా అన్నీ నీవే" సంఘం, భర్త, పిల్లలు, బాధలు, అన్నీ నువ్వు ఏర్పాటు చేసుకున్నావు. వాళ్ళు ఎంతో పుణ్యం చేసుకున్నారు. నీ సంకల్పంతోనే వారు అంతా చేస్తున్నారు" అన్నారు. అప్పుడు అమ్మ "ఒక బుట్టలో నేరేడు పళ్ళు పోసి చూస్తే ఎట్లా కనిపిస్తోందో అట్లా ఈ గోళాలు కనిపిస్తాయి. నీ మాటలు, నీ రూపం అన్నీ వినపడుతాయి,

కనపడుతాయి" అన్నది. అప్పుడు డాక్టరు గారు కన్ఫ్యూజ్ కావా? అని అడిగారు. ప్రతి అణువూ నేనే అయినపుడు కన్ఫ్యూజనేముంది? ఏదీ ప్రత్యేకత కాదు. విశేషం ఏమీ లేదు" అన్నది అమ్మ.

ఒకసారి బామ్మ మాట్లాడుతున్నపుడు అమ్మ దేహం కట్టెలాగా అయి సమాధి అవస్థలో ఉంది. మామూలు స్థితికి వచ్చాక బామ్మ అమ్మతో "నీవు మాతో మాట్లాడుతునే నీలుక్కు పోయావు. నీవు ఏమి దర్శించావు?" అని అడిగింది. దానికి అమ్మ "ఒక జలాశయంలో ఒకామె తపస్సు చేస్తున్నది ఆమెను చూచాను" అన్నది.

ఒకసారి డాక్టరు గారు జిల్లెళ్ళమూడిలో ఉన్నప్పుడు ఒక కల వచ్చింది. లారీలో వెళ్తూ రాళ్ళ గుట్ట మీదపడి మొహం మీద దెబ్బలు తగిలినాయి. నిద్రలేచి చూసుకుంటే ముఖం మీద దెబ్బలున్నాయి. అమ్మతో ఏమిటి ఇట్లా జరిగింది. అంటే, అమ్మ సమాధానం చెప్పలేదు. చీరాలలో ఒకరికి ఈ విషయం చెప్పినప్పుడు "మహాత్ముల సాన్నిధ్యంకు వెళ్తే వారి కృప వలన మనము అనుభవించాల్సిన దానిని కలల రూపంలో అనుభవాన్నిచ్చి కర్మానుభవాన్ని తగ్గిస్తారని" చెప్పారు. "డాక్టరు గారి కర్మానుభవాన్ని అమ్మ ఆ విధంగా తగ్గించింది.

డాక్టర్ గారు అమ్మ దర్శనార్థం ఓడరేవుకు వెళ్ళారు. అక్కడ ఇంకెవరూ లేరు. కానీ అమ్మ పాదాల మీద పూజ చేస్తున్న మాదిరిగా పూవులు పడుతున్నాయి. "ఎవరూ పూజ చేయకుండానే పూలు ఎలా పడుతున్నాయమ్మ" అని ఆయన అమ్మని అడిగారు. అమ్మ వెంటనే చీర జాకెట్టు గుడ్డ, పూలు, పళ్ళు తెచ్చుకోనాన్నా అన్నది. ఆయన వాటిని పట్టుకు రాగానే ఆయనతో పాటూ తానూ సముద్రంకు వెళ్ళి ఒక చోటు చూపించి చీర, పూలు, పళ్ళు అక్కడ వేయమంది. ఆయనకు అర్థం కాక ఆశ్చర్యంతో చూస్తుంటే "నా పాదాల మీద పూలు ఎక్కడ నుండి పడుతున్నాయి? ఎవరు పూజ చేశారని అడిగావుగా నాన్నా? ఈ సముద్రం అడుగున ఋషులు పూజ చేసుకుంటున్నారు. వారి పూజా పుష్పాలే నా పాదాల మీద పడ్డాయని" అమ్మ ఆయనకు తెలియజేసింది.

చిన్నతనంలోనే అమ్మ అనుగ్రహం వలన మహా మనీషి అయిన శ్యామలాదేవిని డాక్టరుగారు చూసారు. ఆమె గొప్ప ఆధ్యాత్మిక స్థితిలో ఉన్నట్లు గ్రహించారు. ఆ గొప్ప వ్యక్తిని చూసిన అనుభవం, డాక్టరు గారు ఒకమారు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు పది పన్నెండు మంది లంబాడీ వాళ్ళు వచ్చారు. వారితో కలిపి అమ్మకు ఫోటో తీశారు. ఆ ఫోటోలో శ్యామలాదేవిని అమ్మ డాక్టరు గారికి చూపించింది. అమ్మ చరిత్రలో అమ్మ అనుగ్రహం కలిగిన ఇద్దరు మహా వ్యక్తులు ఒకరు రహి, మరొకరు శ్యామలాదేవి. వారిని చూసే అదృష్టం డాక్టరుగారికి అమ్మ ప్రసాదించింది.

అమ్మ జిల్లెళ్ళమూడి నుండి డాక్టరు గారిని పిలిస్తే డాక్టరు గారికి వినపడేది. చీరాలలో వారికి అమ్మ దర్శనం కూడా కలిగేది. అమ్మ పిలుపు వినపడినప్పుడు జిల్లెళ్ళమూడికి వెళ్తే ఆ సమయానికి అమ్మ జిల్లెళ్ళమూడిలో పిలిచినట్లు తెలిసేది. అమ్మ చీరాలలో డాక్టరు గారింటికి వెళ్ళటం జరిగింది. డాక్టరు గారితో అమ్మ తాను జిల్లెళ్ళమూడి నుంచి పిలిచినపుడు ఆయన ఎక్కడ నిలుచున్నది, తాను కనపడినప్పుడు తాను వారికి ఎక్కడ దర్శనమిచ్చిందీ అన్నీ వివరంగా చూపించింది. ఈ విధంగా అమ్మ ఇచ్చిన అనుభూతులకు అమ్మే సాక్ష్యం చూపించింది.

డాక్టరు గారు అమ్మ దగ్గర కూర్చుని "తనకు జ్ఞానం కావాలనీ ఈ జన్మలో జ్ఞానిని చెయ్యమని" అడిగారు. "వాడివ్వదలిస్తే ఎవరికైనా ఇస్తాడు. అన్నది అమ్మ. "మానవులకే స్థితులు పొందటం సాధ్యం. ఎవరికైనా ఎట్లా ఇవ్వగలడు" అని డాక్టరుగారు అడిగారు. ఆ సమయంలో ఒక కుక్క అక్కడ కూర్చుని అంది. అమ్మ ఆకుక్కను చూపిస్తూ ఆకుక్కను చూడు అంటుండగానే ఆ కుక్క శాంభవీ ముద్రను వేసింది. డాక్టరు గారు యోగాభ్యాసం చేసిన వ్యక్తి. ముద్రలు వెయ్యటం, అవి సిద్ధించటం గురించి శాస్త్ర రీత్యా అధ్యయనం చేసినవారు. వెంటనే దాని వెన్నెముకను తట్టి చూశారు. వెన్ను తోక గట్టిగా నిటారుగా ఉన్నాయి. భృకుటి మీద దృష్టి నిలిపి, శ్వాస ఆపి ఆ కుక్క అంతర్ముఖమైనది. వారికి ఏనాడూ రాని శాంభవీ ముద్ర ఆకుక్కకు వచ్చింది.

వారు ఆనందంతో ఇంతకాలం మనుష్యులకే అనుకున్నా ఇప్పుడు ఎవరికైనా ఇవ్వగలవని అర్థమైంది" నువ్వు నన్ను జ్ఞానిని చేస్తే చాలు. కుక్క, పిల్లి నీ ఇష్టం ఏ లిస్టులోనైనా వేసుకో కానీ నన్ను జ్ఞానిని చెయ్యి" అన్నారు.

డాక్టరుగారు ఫోటోలు తీస్తుండగా అమ్మ కృష్ణవేషధారియై వచ్చి "ఫోటో తీయరా" అన్నది. దానికి డాక్టరుగారు "కృష్ణుడు ఇంత పొట్టిగా ఉంటాడా" అన్నారు. "ఎంత పొడవుగా ఉంటాడు? అని అడిగింది అమ్మ. ఇంత అని తన ఊహకు తగ్గ ఎత్తు చెప్పారు డాక్టరుగారు. అమ్మ అంత ఎత్తూ పెరిగింది. డాక్టరుగారు చూస్తుండగానే రకరకాల ముద్రలు వచ్చాయి. అవన్నీ ఫోటోలు తీసారు.

డాక్టరుగారు హైదరాబాదు వెళ్ళారు. 1957 నుండి ఆయన తీసిన కొన్ని వేల ఫోటోలు, నెగెటివ్స్, స్లైడ్స్, సినిమా ఫిల్మ్‌లు మొత్తం హైదరాబాదు సేవాసమితికి ఇవ్వదలుచుకున్నారు. స్టేషన్ దాటి బయటికి వెళ్ళారు. ఎదురుగా అమ్మ ఒక పక్కకు చూస్తూ సంజ్ఞ చేస్తూ కనపడి అదృశ్యమయింది. వెంటనే ఒకతను గబగబా వచ్చి డాక్టరుగారిని, సామానుని ఒక బస్సులో ఎక్కించి "నువ్వు వెళ్ళవలసిన బస్సు ఇదే" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ అపరిచిత వ్యక్తి అమ్మ పిలవగా వచ్చిన వ్యక్తి. అమ్మకు సంబంధించిన సామాగ్రినంత హైదరాబాద్ సేవాసమితికి ఇవ్వాలనే ప్రేరణ డాక్టరుగారికి ఇచ్చింది అమ్మ. హైదరాబాద్‌లో ఆయన కూతురింటికి క్షేమంగా చేర్చింది. ఆనాడు జరిగిన ఉత్సవంలో ఆయన ఈ అనుభవాన్ని, అనుభూతిని పరవశంతో తెలియజేశారు.

డాక్టరు గారు అమ్మ అనుగ్రహానికి పాత్రులై జీవితము, జీవనము అంతా అమ్మగానే భావించారు. మనస్సు నిండా అమ్మనే నింపుకొని, సర్వసమర్పణ గావించి, "జనన, మరణాలనే కృంగుపొంగులు లేకపోవడమే అమృతత్వము" అని అమ్మ సూక్తి. ఈ తత్వసారాన్ని అమ్మ మనకిచ్చే అనుభవాల ద్వారా ప్రభోదిస్తుంది. డాక్టరు గారికి సర్వమూ తానే అయి జీవన పథాన నడిపించి. సేద తీర్చి తరింపచేసింది అమ్మ. అమ్మ రూపాన్ని ధ్యానాదులతో కొలిచి, ఎన్నెన్నో అనుభూతులు పొంది, అమ్మ కృపకు పాత్రులైన డాక్టరుగారు మహోన్నత వ్యక్తి.

చీరాల డాక్టరు గారి దగ్గరకు పేషెంట్ల కంటే అమ్మ గురించి తెలుసుకోవాలనే తపన ఉన్నవారే ఎక్కువగా వస్తుండేవారని, అందులో తానూ ఒకడినేనని కిష్టమ్మ చెప్పాడు.

బెండపూడి అక్కిరాజుగారు చీరాల నివాసి. మొదటి నుంచీ ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. ఇంటి విషయాలేమీ పట్టేవి కావు. మాల పిచ్చమ్మ గారి దగ్గరకు రెడ్డి కాంతయ్యగారు, నోరి వెంకటేశ్వర్లు గారు అక్కిరాజు గారిని తీసుకు వెళ్ళారు. ఆమె రెండు రోజులు సమాధిలో ఉండి ఒకరోజు బాహ్య ప్రపంచంలోకి వచ్చేవారు. సరిగా ఆ రోజు గుర్తుంచుకుని ఆయన ఆమె దర్శనం చేసుకునేవారు.

రెడ్డి కాంతయ్య గారు చాలా యోగ సాధన చేసిన వ్యక్తి. ఆలయ నిర్మాణం గురించి తాపత్రయ పడుతుంటే ఆయన యోగ సాధనలకు ఆటంకం కలుగుతుందని పిచ్చమ్మగారి ఉద్దేశం. అక్కిరాజు గారితో రెడ్డి కాంతయ్య "బురద తొక్కుతున్నాడు, బురదలో కూరుకుపోతాడు అని చెప్పగల ధైర్యం ఉందా" అని పిచ్చమ్మ గారు అడిగారు. దానికి ఆయన "నేను ఎవరితోనైనా, ఏ విషయాన్నైనా నిర్భయంగా చెప్పగలనని" అన్నారు. ఆ విషయాన్నే యధాతథంగా అక్కిరాజుగారు రెడ్డి కాంతయ్య గారికి చెప్పారు. అది విని "నా ప్రారబ్ధం ఎలాగుంటే అలా జరుగుతుందని" కాంతయ్య గారు అన్నారు. ఆ తరువాత మాల పిచ్చమ్మ గారు సిద్ధిపొందింది.

మళ్ళీ అక్కిరాజు గారి అన్వేషణ మొదలైంది. 1956లో అమ్మ చీరాలలో నోరి వెంకటేశ్వర్లు గారి ఇంటికి వెళ్ళింది. అక్కిరాజు గారి భార్య ప్రార్థనను మన్నించి వారింటికి వెళ్ళింది. ఆ సమయంలో అక్కిరాజు గారు ఇంట్లో లేరు. ఆయన తప్పించి ఇంట్లో వారందరూ అమ్మను దర్శించుకున్నారు. భార్య అమ్మ గురించి ఎంత చెప్పినా ఎవరోలే ఈ అమ్మ అని ఆయన ఆ విషయాన్ని పట్టించుకోలేదు.

నోరి వెంకటేశ్వర్లు గారు, పాట్లూరి సుబ్బారావు గారు అక్కిరాజు గారిని జిల్లెళ్ళమూడి తీసుకువెళ్ళారు. అమ్మ దర్శనానంతరం "నన్ను చూచి నవ్వింది"

ఆ నవ్వు నీ ఇంటికి వచ్చినా, నీ భార్య చెప్పినా గుర్తించలేకపోయావు. ఇప్పుడు డొంకల వెంబడి, ముళ్ళ వెంబడి పడి చూడటానికి వచ్చావు" అన్నట్లు ఆయనకు అనిపించింది. చీరాల నుంచి అక్కిరాజు గారు, నోరి వెంకటేశ్వరరావు గారు, రాజుపాలెం రామచంద్రరావు గారు, కోట వెంకాయమ్మ కొడుకు మొవ్వ సత్యం అమ్మ దగ్గరకు వచ్చిపోతుండేవారు. ప్రతి శనివారం వెళ్ళి ఆదివారం అమ్మ దగ్గర గడిపి వచ్చేవారు.

ప్రభావతి చేత వండించి అమ్మ స్వయంగా వడ్డించేది. రాత్రుళ్ళు పడుకోవటం కూడా అక్కడే. అమ్మ కూడా క్రిందే పడుకునేది. వారికి ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు స్వయంగా తెలియజేసేది. కొందరు నిద్రకు ఆగలేక పడుకున్నా, కొందరు అమ్మ చెప్పే విషయాలను శ్రద్ధగా వినేవారు. అమ్మ మాత్రం ఎప్పుడూ మెలకువగానే ఉండేది. అలా ఒక సంవత్సరం దాకా నాన్నగారి ఇంట్లోనే భోజనం చేసారు.

"బ్రహ్మవా? బ్రహ్మ తత్త్వానివా? బ్రహ్మ పదార్థానివా?" అని అక్కిరాజుగారు అమ్మని అడిగారు. దానిక అమ్మ "బ్రహ్మనే, బ్రహ్మ పదార్థమే బ్రహ్మ తత్త్వమైనది. బ్రహ్మ పదార్థం చైతన్యం, బ్రహ్మ తత్త్వం అవాఙ్మనాస గోచరం" అని తెలియజేసింది. అక్కిరాజుగారికి అమ్మ కాలిబ్రొటన వేలి నుంచి శక్తి వస్తుందని నమ్మకం. ఆ బ్రొటనవేలి మీద తల ఆనించి పడుకునేవారు. ఒకరోజు నాన్నగారు వచ్చి ఏమిటండీ ఇలా పడుకున్నారు? అని అడిగారు. దానితో ఇయన దూరంగా వెళ్ళారు. నాన్నగారు వెళ్ళిన తరువాత అమ్మ ఆయన్ను పిలిచి పడుకోమని చెప్పింది.

ముందు చెడు జరుగుతుందేమోనని భయపడుతున్న ఒకరితో అమ్మ "కష్టాలకు కూడా సిద్ధంగా ఉండాలమ్మ!" సీతా, సావిత్రి, హరిశ్చంద్రుడు మొదలైన వారి కథల నుండి మనం నేర్చుకున్నదేమిటి? వాళ్ళ కష్టాలతో పోలిస్తే మనమేమి కష్టాలు పడుతున్నాము? కాస్సేపు ఒక్క మాటతో అందరూ మన వాళ్ళే అనుకుంటున్నాము. మళ్ళీ ఒక్కమాటలో మాకెవ్వరూ లేరనుకుంటున్నాము. మనస్సు ఎప్పుడూ మారుతూనే ఉంటుంది. దాని గురించి బాధ పడకూడదు" అని చెప్పింది అమ్మ.

అమ్మ చుట్టూ అందరూ కూర్చుని ఉన్నప్పుడు అమ్మ ఎవరెవరితోనో అనేక భాషలలో మెల్లగా మాట్లాడుతున్నట్లు వినిపించేది. అలాగే ఫ్రెంచి భాషలో పాండిచ్చేరి మదర్‌తో మాట్లాడుతుండేది. ఒకనాడు అలాంటి సంభాషణలలో ఈజిప్టు, అమెరికా ప్రాంతాల వారితో మాట్లాడం విన్న బెండపూడి అక్కిరాజు గారు ఎగిరి గంతేసి గందర గోళం చేసి ఆ విషయం అందరికీ చెప్పబోతుంటే అమ్మ ఆగమన్నట్లు చేతితో సంజ్ఞ చేసేసరికి జావ కారిపోయి చతికిలపడి ఒరిగి నిద్రపోయారు. తీరా లేచిన తరువాత ఆ విషయం ఎంతకూ గుర్తుకు రాకపోవడంతో ఆ మరుపుకు ఆయన మూగబోయారు.

"ఎక్కడ ఉన్నా ఏం చేసినా ఎవరి దయా వీక్షణం ఉన్నా కష్టాలు మాత్రం తప్పవు. జీవితంలో అవీ ఒక భాగం కనుకనే ప్రాణం ఉన్నంతవరకు కష్టాలు తప్పవు. కాలగతిలో కష్టాల రూపం మారవచ్చు. కానీ కష్టం తప్పదు. ఒకటి పోతే మరో కష్టం చుట్టుకుంటుంది. ఒక సమస్య పరిష్కారమయితే మరొక సమస్య తలెత్తుతుంది. ఒక ప్రశ్నకు సమాధానం దొరికితే మరొక ప్రశ్న ఉదయిస్తుంది. ఈ జపాలు, తపాలు, యజ్ఞయాగాదుల వల్ల కష్టాలు అనుభవిస్తున్నా బాధ అనిపించదు. కష్టాలను భరించే శక్తి వస్తుంది. "ఏడుస్తూ అనుభవించే వాడు నవ్వుతూ అనుభవించే వాడి దగ్గరికి సలహాకు వస్తాడు". శాస్త్రాలు చిత్తశుద్ధి ఉండాలంటాయి. కదా అని ఒకరు అడిగారు "చిత్తశుద్ధే ఉంటే అసలు ఆ భగవంతునితో పనేముంది. భగవంతుడే వాడి కోసం రాడా! అసలు దైవం అంటే వాడేగా, వాడి గురించి చెప్పేదేముంది" అన్నది అమ్మ.

అమ్మ బంతిపువ్వును చూపిస్తూ మూలాధారం నుంచీ సహస్రారం వరకు గల చక్రాలను, కుండలిని, ప్రేరణను, దాని స్వరూప స్వభావాలు ఎలా ఉంటాయో చీరాల వారికి వివరించింది. అంతకు ముందే కార్తీక పౌర్ణమినాడు ఓంకార నదికి వేకువనే వెళ్ళి అమ్మతో పాటూ వీరంతా స్నానం చేశారు. స్నానాంతరం అమ్మ వీరందరికీ "సోహం" అనే మంత్రాన్ని ఉపదేశించింది.

అధరావరపు శేషగిరిరావు అన్నయ్య వచ్చిన తరువాత సంస్థ స్వరూప స్వభావాలు మారిపోయాయి, పూరి గుడిసెలకు బదులుగా "అందరింటి" డాబా

తయారయింది. అప్పుడే జిడ్డు ప్రసాద్‌గారు అమ్మకు మంచాన్నిచ్చారు. శేషగిరిరావు అన్నయ్య వచ్చిన తరువాతే చీరాల వారికి అమ్మతో సాన్నిహిత్యం తగ్గింది. అయినా వారి వారి అవకాశాలను బట్టి దర్శనం చేసుకునేవారు. ''అవనరవము'' అన్న ఐదు అక్షరాలను అమ్మ పంచాక్షరి అన్నది. తనకవసరమనుకున్నప్పుడు అమ్మ అక్కిరాజుగారికి కబురు పెడుతుండేది. ఆ కబురు అందుకున్న వెంటనే ఆయన బయలుదేరి వచ్చేవారు. సాన్నిహిత్యం తగ్గినా అవసరాలకు వస్తుండేవారు.

అమ్మ బాపట్ల ఎప్పుడూ వచ్చినా అక్కిరాజు గారికి ప్రత్యేకించి కబురు చేసేది. ఒకమారు దినకర్ ఇంట్లో అమ్మ దర్శనం ఇస్తున్నప్పుడు అక్కిరాజు గారు అమ్మ పాదాల చెంత కూర్చుని ఆ పాదాలు నొక్కుతూ దాదాపు ఒకగంట సేపు కుర్చున్నా అమ్మ ఆయన్ను పలకరించలేదు. వచ్చిన వారందరితో లోకాభిరామాయణం మాట్లాడుతుంది. పూర్వంలా ఆధ్యాత్మిక ప్రసంగాలు లేవు అని అనుకున్నారు. అమ్మకు ఇహం, పరం అంటూ వేరే లేదు. "ఉన్నదంటూ ఒకటే కదా! ఈ వ్యాపారంలో లాభనష్టాలు లేవు అని చెప్పనే చెప్పింది"! అమ్మ.

అమ్మ పలకరించలేదన్న బాధతో ఖిన్నులై అక్కిరాజు గారు రెడ్డి సుబ్బయ్యతో "నా అవసరం తీరిపోయింది. నీవు నన్నుదూరం చేస్తున్నావని" అమ్మకు చెప్పమన్నారు. రెడ్డి సుబ్బయ్య ఆయన చెప్పమన్నట్లే అమ్మకు చెప్పాడు. అది విన్న వెంటనే అమ్మ రవిని పంపించి అక్కిరాజు గారిని తీసుకురమ్మంది. ఆయన రాగానే ఆ భవనాలన్నీ చూపించి తన వెంట తిప్పుకుంది. దినకర్ ఇంట్లో ఆయన్ని పట్టించుకోని విషయాన్ని కానీ, రెడ్డి సుబ్బయ్య చేత ఆయన కబురు చేసిన విషయాన్ని కానీ అమ్మ ఎత్తలేదు. అక్కిరాజు గారు కూడా ఆ విషయం గురించి అడగక అమ్మతో హాయిగా 2 గం॥లు కాలక్షేపం చేశారు. అమ్మ దగ్గర ప్రతి విషయాన్ని కూలంకుషంగా చర్చిస్తే గాని నిద్రపోయేవారు కాదు. అక్కిరాజుగారు అందుకే అమ్మ ఆయన్ని "గోలఅక్కిరాజు" అనేది.

కృష్ణవేణక్కయ్య, శ్రీరాముల వెంకటేశ్వర్లు కాకుమాను నివాసులు మాష్టర్

సి.వి.వి. ధ్యాన సాధన చేసేవారు. దాసుగారు ధ్యానంలో ఉండగా మాష్టర్ సి.వి.వి. "ఆగ్నేయ మూలగా అమ్మ ఉన్నది. ఆమె చెప్పినట్లు చెయ్యి"మన్నారు. 1955లో గంగరాజు లోకనాధం గారు కబురు పెట్టినపుడు కృష్ణవేణక్కయ్య అమ్మను దర్శించటానికి వెళ్ళింది. కాకుమానులో "ఆమెకు ఎప్పుడూ రోగం, ఆవిడ దగ్గర ఏముంది? వెళ్ళడం దండగా" అన్నారు.

అమ్మను దర్శించగానే "మీ ఆయన ఆరోగ్యం బాగుందా"? అని అడిగింది. (శ్రీరాములు గారినే హరిదాసు గారు అంటారు). ఆయన కాళ్ళు వాపులు, మంటలు, ఆయాసంతో బాధపడుతున్నారు. ఉత్త చేతులతో వెళ్ళకూడదని అక్కయ్య అమ్మ దగ్గరకు కొంచెం పంచదార తీసుకువెళ్లింది. దానిలో అమ్మ చెయ్యి పెట్టి తిప్పుతూ "ఇది మీ ఆయనకు ఇవ్వమని" చెప్పింది. ఎప్పుడైతే ఆ పంచదార ఆయన తిన్నారో ఎంతోకాలంగా ఉన్న ఆ కాళ్ళమంటలు, ఆయాసం తగ్గాయి.

పుష్యమాసం సంక్రాంతి రోజుల్లో "హరిలో రంగహరి" అంటూ ఊరూరా తిరుగుతూ భగవత్ చింతనలో కాలం గడిపేవారు. ఆయన మొదట జిల్లెళ్ళమూడికి ఆరకంగానే వచ్చారు. అప్పుడు అమ్మ ప్రేమతో దాసుగారి నోట్లో ముద్దలు పెట్టింది. ఆ అనురాగానికి, వాత్సల్యానికి ముగ్ధులైన దాసుగారు ఆనందంతో పెద్దగా అన్నపూర్ణాష్టకం చదివి పరవశులైనారు.

కృష్ణవేణక్కయ్య మొదటిసారి జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు "నీవు ఇది వరకు ఈ ఊరు వచ్చావా? నన్ను చూశావా?" అని అమ్మ అడిగింది. "లేదమ్మా ఇదే మొదటిసారి రావటం" అని చెప్పింది ఆమె. ఇంటికి వెళ్ళి హరిదాసుగారికి ఈ విషయం చెప్పగా "నీవు అమ్మను కలలో చూశావుగా" అని గుర్తు చేశారు. జిల్లెళ్ళమూడి రాకముందు కృష్ణవేణక్కయ్యకు కలలో ఒక పల్లెటూరు, ఆ ఊరి డొంక, ఆ ఊరి మంచినీటి చెరువులో కలువలు, పద్మాలు, ఒక పూరిఇల్లు అందులో నుదుట పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని దివ్యతేజస్సుతో కూడిన ఒక పెద్ద ముత్తైదువ కనిపించింది. అమ్మను దర్శించాక ఈ అమ్మే అలా కనిపించిందని గుర్తించారు. తరుచూ ఆదంపతులు అమ్మను దర్శించుకునేవారు.

అనసూయేశ్వరాలయం శంకుస్థాపన ఆదివారం అమావాస్య 1956 మే 5వ తేదీన జరిగింది. రెడ్డి సుబ్బయ్య, హరిదాసుగారు, సీతాచలంగారు, నాన్నగారు ఉన్నారు. అమ్మ చినతాతగారు శ్రీ చిదంబరరావుగారు ఇది ఏమీ తెలియకుండానే పూలు, ఆకులు తెచ్చారు. హరిదాసు గారితో "మీరు ఇంటికి వెళ్ళేటప్పటికి ఏదో విశేషం జరుగుతుంది" అన్నది అమ్మ.

5సం॥ల పిల్లవాడు వీరి ఇంటి ముందు నిలబడి అమ్మా అని పిలిచి ఒడి చూపి చేత్తో సంజ్ఞ చేసాడు. అక్కయ్యకు ఆ పిల్లవాడిని ఎత్తుకోవాలనిపించి లోపలికి రమ్మన్నది. అక్కయ్య అన్నం తీసుకువచ్చి ఒడిలో వేయగానే పరుగెత్తుకు పారిపోయాడు. ఆ పిల్లవాడు సరాసరి వెళ్ళినట్లుగా హరిదాసుగారి చెల్లెలికి కనిపించాడు. అక్కయ్యకు కుడి ప్రక్కకు వెళ్ళినట్లుగా కనిపించింది. ఇలా విరుద్ధంగా కనపడేసరికి వాళ్ళ బావగారు వస్తే ఆయనతో చెప్పారు. ఆయన సైకిలు వేసుకొని ఊరంతా తిరిగారు. సరిగా వీరికి ఈ అనుభవం అయినపుడే హరిదాసు గారితో "మీ ఇంటి దగ్గర ఏదో విశేషం జరుగుతుందని" చెప్పింది అమ్మ.

అంతకు పూర్వమే అక్కయ్య ధ్యానంలో ఉండగా మాష్టర్ సి.వి.వి. "నీకు ఒక పిల్లవాడు కనపడతాడు నీకు చిక్కితే నీవాడవుతాడు, లేకపోతేలేదు" అని చెప్పారు. అక్కయ్యకు ఆ పిల్లవాడు జిల్లెమూడికి వెళ్ళేతోవలో పరిగెత్తినట్లే కనిపించింది. ఈ విషయం అమ్మకు చెప్పాలనివస్తే ముందుగా అమ్మే "నీలంరంగు మీద తెల్లగళ్ళుచొక్క వేసుకుని మెడలో రుద్రాక్ష ఉన్న పిల్లవాడు కదా! వచ్చింది" అని అడిగింది.

కృష్ణవేణక్కయ్య అమ్మకు బాగా సన్నిహితం కావటంలో జిల్లెళ్ళమూడిలోనే ఉంటానంది. దానికి అమ్మ భార్యాభర్తలిద్దరూ ఉండాలి కానీ ఒకరు ఉండటం భావ్యం కాదంది. అప్పటికే చీరాల సోదరులు అమ్మ సేవకు ఒకరిని ఏర్పాటు చేస్తే బాగుంటుందని అనుకున్నారు. వారు కృష్ణవేణక్కయ్య దంపతుల్ని జిల్లెళ్ళమూడికి ఆహ్వానించారు.

అక్కయ్య కాకుమానులో పడుకున్నా, మేలుకున్నా అమ్మ దర్శనమయ్యేది. ఒకమారు మేలుకొని ఉండగానే హృదయంలో తులసి చెట్టు కనిపించింది. కంగారుతో భయంగా అమ్మకు చెప్పాలని జిల్లెళ్ళమూడి వచ్చింది. అక్కయ్య చెప్పక ముందే "ఎందుకమ్మా అక్కడ కనపడితే ఇక్కడకు ఎందుకు వచ్చావు" అని మెల్లగా అన్నది. అమ్మ దగ్గర ఆమెకు ఒళ్ళు తెలీకుండా పోయి అనేక దృశ్యాలు కనిపించాయి. ఆ తరువాతే వారు జిల్లెళ్ళమూడి నివాసులయ్యారు. అమ్మకు పూజలు చేస్తే సమాధిలోకి వెళ్తుందనే భయంతో నాన్నగారు వద్దనేవారు. అమ్మ పడుకున్న మంచం ప్రక్కనే అక్కయ్య కూర్చుని ఉంది. మరొక అమ్మ మందిరం వైపు నుంచి రావటం కనిపించింది. సమాధి అవస్థలో రకరకాల భాషలలో మాట్లాడేది అమ్మ. ఒకసారి అమ్మ మాట్లాడుతూ "ఓ రొట్టెలు చేసుకున్నారా? పచ్చడి లేదా?" అని అక్కయ్య తో ఉసిరికాయ పచ్చడి తెమ్మని చెప్పింది. అక్కయ్య చూస్తూ ఉండగానే అమ్మ చేతిలోని పచ్చడి మాయమైంది. మెంతి మజ్జిగ అన్నం కలిపి రావి చెట్టు మీద, బేరన్ గొట్టాల మీద పెడితే మాయమయ్యేవి. "సాధనలో ఒక స్థాయి వచ్చిన వారికి ఆహారం అవసరం లేదు. తననే నమ్ముకుని ఆహారం అవసరమైన వారికి ఆ విధంగా పంపుతుందని" రాజుపాలెం రామచంద్రరావు గారు చెప్పారు. ఉసిరికాయ పచ్చడి పంపిన తరువాత "అమ్మ నన్ను నమ్ముకున్న లంబాడీ తండా ఒకటి ఉన్నది. పచ్చడి వాళ్ళకే పంపాను" అని అమ్మ చెప్పింది. ఎక్కడో ఉన్న వాళ్ళ అవసరాలను కనిపెట్టి తన సర్వజ్ఞత్వాన్ని తెలియజేసింది అమ్మ.

అమ్మ దిండు కింద ఉన్న పొట్లాన్ని కృష్ణవేణక్కయ్య చూస్తుండగానే ఒక అన్నయ్య అవతలకు విసిరేసాడు. అది బుస్సుమని పొంగింది. ఎందుకట్లా పారేశావు? అని అమ్మ కోప్పడినట్లు అడిగింది. ఆ విషం అమ్మకు ఇవ్వటం కోసం పెట్టారు. ఇలాంటి కాలకూట విషాలు ఎన్నోసార్లు అమ్మకు పెట్టడం అమ్మ తీసుకోవటం జరిగింది. గరళకంఠుడైన పరమశివునికే తల్లి అయిన అమ్మను ఇవి ఏమి చేయగలవు?

చుట్టుప్రక్కల గ్రామాల్లో మజ్జిగ, పాలు సేకరించి సంస్థకు సమకూర్చేవారు హరిదాసుగారు. ఆవరణలో వ్యవసాయం, స్టోర్సు ఆయనే చూసేవారు. ఆయన్ని ఎవరు ఏది అడిగినా తత్త్వం, తత్త్వం అనేవారే కానీ వివరించి ఏమీ చెప్పేవారు కాదు.

కృష్ణవేణక్కయ్య నిత్యం పదిసార్లు 50, 60 కడవల నీళ్ళతో అమ్మకు స్నానం చేయించేది. అమ్మ బట్టలు రోజూ, చీరలు రవికలు, దుప్పట్లు, గలేబులు, ఒళ్ళుతుడుచుకునే గుడ్డలను మొత్తం 40 గుడ్డల వరకు మల్లెపూవుల్లా ఉతికేది. రోజూ ఇలా ఉతికితే విసుగు పుట్టదా అని రామకృష్ణ అన్నయ్య అడిగితే "అమ్మ బట్టలను ఉతకటం అంటే నా మనస్సును ఉతుక్కోవటం, అమ్మకు స్నానం చేయించడం అంటే ఆనంద ఝరిలో అమృతాన్ని పానం చేయటమే అని, విసుగులేని మూర్తిని చూడటంలో విసుగు ఎందుకు కలుగుతుంది" అని కృష్ణవేణక్కయ్య చెప్పింది.

అమ్మకు అన్ని పనుల్లో సాయంగా కృష్ణవేణక్కయ్య ఉండేది. దాసుగారు వచ్చిన సంవత్సరమే సంక్రాంతికి అమ్మ మొదటి బిక్ష వేసి పల్లెలకు పంపింది. "ఆదిమాత వేసిన బిక్ష అక్షయ పాత్ర" అయింది. ఏ సంవత్సరమూ లేని విధంగా 10 బస్తాలకు పైగా బియ్యం వచ్చాయి. ఆ బియ్యాన్ని దాసుగారు అమ్మకు సమర్పించారు. జిల్లెళ్ళమూడికి వచ్చేవారి సౌకర్యాలు చూస్తూ, అన్నపూర్ణాలయ నిర్వహణలో కాలం వెళ్ళబుచ్చేవారు.

హరిదాసుగారు ఒక కుక్కను పెంచేవారు. దానిని దమయంతి అని పిలిచేవారు. అమ్మ దమయంతీ ఒక పాట పాడవే అంటే అది పాటలాగా రాగం తీసేది. దాసు గారికి కృష్ణవేణమ్మ గారికి చాలా నియమాలున్నాయి. జపం చెయ్యటం, ధ్యానం చెయ్యటం, మొదలగునవి తమకు కలిగిన అనుభవాలను పుస్తకాలలో రాసుకునేవారు.

హరిదాసు గారు అమ్మకు కావలసిన బట్టలు కుట్టేవారు. అందులోనే ఆయనకు అమితమైన ఆనందం లభించేది. హరిదాసుగారికి ఆదికి రవిక ఇస్తూ

అమ్మ "ఈ రోజు రవిక బిగుతు అయింది. కింద వదులు అయింది మరి ఎలాకుడతావో ఏమో, నా రవిక కుట్టడంలో నీ నేర్పు అంతా బయట పడుతుంది" అన్నది. దానికి దాసుగారు నీ ఆది తెలీదన్నారు. అందుకు అమ్మ "నాది అనాది కనుక నా ఆది అందదు" అన్నది. ఈ రకంగా అనాది అయిన ఆదెమ్మతో ఆడుతూ పాడుతూ విశ్వజనని సేవలో తరించారు దాసుగారు. ఆ దంపతులకు పిల్లలు లేరు. కానీ అమ్మ వద్దకు వచ్చిన వారిని తమ పిల్లలుగా భావించి తృప్తిగా జీవించారు.

దాసుగారు చాలా పరిశుభ్రమైన దుస్తులు ధరించి కొత్త పెళ్ళికొడుకులా కనిపించేవారు. చివరి రోజుల్లో లక్ష్మీనారాయణన్నయ్య "నీ కింకా జీవించాలని ఉందా?" అని అడిగారు. దానికి దాసుగారు "ఆ కోరిక లేదు గానీ శరీరం ఉన్నంత వరకు అచ్ఛాదన ఉండాలి కదా! అన్నారు. "తృప్తే ముక్తి" అన్నది అమ్మ. ఆ తృప్తిని అమ్మ దాసుగారికి, కృష్ణవేణక్కయ్యకు ప్రసాదించింది. అమ్మ సాన్నిధ్యంలో ఎన్నో అనుభూతులు పొంది అపారంగా అమ్మను సేవించుకున్న ధన్యులు హరిదాసుగారు, కృష్ణవేణక్కయ్య. "జీవితం, జీవనం దేవుడిచ్చినవే" అన్న అమ్మ వాక్యానికి అనుగుణంగా తమ జీవితాలను అమ్మకు అంకితం చేసి శారీరకంగా, మానసికంగా జీవితంలోని ఒడిదుడుకులను అనుభవించి శాశ్వత ఆనందధామమునకు చేరువలో వుంది అక్కయ్య.

వీరయ్య చౌదరిగారి భార్య మహాలక్ష్మమ్మ, కృష్ణవేణక్కయ్య కాలువకు వెళ్ళారు. చీరాల డాక్టరుగారు రావటం ఆలస్యమయింది. మహలక్ష్మి అక్కయ్య పొద్దు వంక చూస్తున్నది. ఎంతసేపైన పొద్దు పైకి పోలేదు. చీరాల డాక్టరు గారు వాళ్ళు వచ్చాక పొద్దుపైకి పోయింది.

బేరన్ మీద అట్లు పెట్టించింది అమ్మ. ఆ తరువాత కృష్ణవేణక్కయ్యను అవితిని రమ్మన్నది ఎవరికోసమో పెట్టినవి వాళ్ళు రాలేదు కాబోలు అక్కయ్యను తినమన్నది అమ్మ. కొమ్మూరు డాక్టరు గారిని అమ్మా అని పిలిచేది అమ్మ. ఆయన అమ్మను తన భుజం మీద వేసుకుని తిప్పేవారు అమ్మకు విశ్రాంతి అవసరమన్నారు. ఒక మగ ఒక ఆడా అమ్మ దగ్గర వుండాలన్నారు. అది విని

కృష్ణవేణక్కయ్య ఆ అదృష్టవంతురాలెవరో అని అనుకుంది. తీరా ఆ అదృష్టవంతురాలు తానే అయ్యేటప్పటికి పరమానందభరితురాలైంది. అమ్మ సమాధిలోకి వెళ్ళి పైదేశాల వారితో మాట్లాడుతుంటే కొమ్మూరు డాక్టరు గారు విన్నారు.

శివరాత్రికి అమ్మ దగ్గర 600 మంది మొగవాళ్ళు వరుసగా పడుకున్నారు. అక్కయ్యకు అమ్మ వుండమంది కదా! నన్ను తన దగ్గర పడుకోనివ్వదా? అని మదన పడింది. సరిగా అమ్మ దగ్గరగా ఒక మనిషికి సరిపడే జాగా వుంది. శివరాత్రి మర్నాడు వూరికి వెళితే హరిదాసుగారు కోపంతో మండిపడ్డారు. వెంటనే అక్కయ్య చేతిలో అమ్మ ప్రసాదం చూచి తమాయించుకున్నారు. 600 మందికి ప్రభావతి వంట చేసింది. అది మనవ మాత్రుల వల్ల అయ్యే పనేనా! వెనక అమ్మ హస్తం వుంది కాబట్టే అక్కడ పనులు ఆ రకంగా జరిగిపోయేవని ప్రభావతి చెప్పింది.

తంగిరాల కేశవశర్మ గుంటూరు నివాసి ఆర్.ఎస్.ఎస్. మీటింగ్‌లకు వెళ్ళేవాడు. కేశవ అన్నయ్యకు పని వుంటే దానిని పక్రమంగా నిర్వర్తించకపోతే చాలా బాధపడేవాడు. రామకృష్ణ పరమహంస, వివేకానంద పుస్తకాలు చదివి తాను ఆకాలంలో లేకపోయానని బాధనొందేవాడు.

ఈ పుస్తకాలు చదవటంవల్లబ్రహ్మచర్యం మీద మక్కువ ఎక్కువ అయింది. కానీ జీవితంలో స్థిరపడాలన్న కోరికా వుండేది. ఒకమారు బాపట్లలో బస్సు ఎక్కటానికి నిలబడ్డాడు. అదే బస్సులో బెండపూడి అక్కిరాజుగారు దిగారు. "ఎక్కడ నుంచీ వస్తున్నారు?" అని కేశవన్నయ్య అడిగారు. "జిల్లెళ్ళమూడిలో డివైన్ మదర్" వున్నారు. ఆమె దగ్గరకు వెళ్ళి వస్తున్నానని చెప్పారు. "ఆయన అసలే స్ఫూరద్రూపి. ఆయన వదన మండలం కాంతులను విరజిమ్ముతోంది. అమ్మ దగ్గరకు వెళ్ళి వచ్చిన ఈయనలోనే ఇంత కళ వుంటే అమ్మ ఎలా వుంటుందో! తప్పక చూడాలని" నిర్ణయించుకున్నారు.

అంతకు పూర్వమే అమ్మ గురించి విన్నారు. కానీ అక్కిరాజు గారిని చూచాక ఎలాగైనా అమ్మను చూడాలన్న కోరిక ఉద్భవించి బలీయమై జిల్లెళ్ళమూడి

వెళ్ళారు. అమ్మ దగ్గర పళ్ళు పెట్టి నమస్కారం చేసారు. "బ్రహ్మచర్యం అంటే ఏమిటి?" అని అమ్మను అడిగారు. "నాకేమి తెలుస్తుంది నాయనా! నేను గృహిణిని కదా!" అని అమ్మ జవాబు ఇచ్చింది. ఆ ఒక్కమాటే ఆయన్ని మంత్రముగ్ధుడ్ని చేసింది. అప్పటి నుంచీ అమ్మ నామసంకీర్తనలో నిమగ్నమయినారు.

అప్పటికి ఆయన గుంటూరు పొగాకు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నారు. జిల్లెళ్ళమూడిలో ఎక్కువ కాలం గడపటంతో ఆ ఉద్యోగం పోయింది. ఆరోజుల్లో అన్నయ్య ఆధ్యాత్మిక దాహాన్ని అమ్మ తీర్చింది. అలా 15 రోజులు అమ్మ దగ్గరే పూర్తిగా వున్నారు.

అమ్మతో కన్యాకుమారి వెళ్ళి వివేకానంద రాక్‌మీద ధ్యానం చేసుకోవాలన్న తన కోరికను వెలిబుచ్చారు. "నిన్ను విడిచి ఉండలేను నాన్నా! నీవు వెళ్తానంటే ఎలా?" అంటూ "కన్యాకుమారి ఎలా వెళ్తావురా!" అని అమ్మ ప్రశ్నించింది. దానికి కేశవన్నయ్య "ఏముందమ్మా! ఏవూరు వెళితే ఆ వూరులో మునసబు, కరణమో వుంటారు కదా! అక్కడ భోజనం చేసి వెళ్తానన్నారు. పక్కనే వున్న బెండపూడి అక్కిరాజుగారు కేశవన్నయ్యకు 15 రూ ఇచ్చారు.

అన్నయ్యకు కన్యాకుమారీ వెళ్ళాలన్న కోరిక బలీయంగా వుందని తెలుసుకుంది అమ్మ. బయలుదేరే ముందు "అన్నయ్యకు ఇష్టమైన నల్లచీర కట్టుకొని, నాన్నగారు అమ్మ ఒకే మంచం మీద కూర్చుని అన్నయ్య చేత పూజచేయించుకొని అన్నయ్యకు బట్టలు పెట్టి ఆశీర్వదించి పంపింది" అమ్మ. కన్యాకుమారి వెళ్ళాక 6 నెలలు వుండాలనుకున్న అన్నయ్య అమ్మను వదిలి వుండలేక నెలరోజులకే తిరిగివచ్చారు.

బాపట్లలో పళ్ళు కొనుక్కొని అమ్మ దగ్గరకు వెళ్ళారు. అటు తిరిగి పడుకున్న అమ్మ, ఇటు తిరిగి "ఏంన్నాన్నా! వచ్చేశావా!" అన్నది. 1958 కార్తీక పౌర్ణమికి నదికి వెళ్తూ అన్నయ్యను రమ్మంది అమ్మనదిలో దిగిన తరువాత అన్నయ్యను దగ్గరకు పిలిచి మంత్రోపదేశం చేసింది. అంతవరకు అమ్మ తనకు మంత్రోపదేశం చేస్తుందని ఊహించలేదు. కోరుకోనూలేదు. ఆనాటి నుంచీ ఆయన మీద అమ్మ ప్రభావం పదింతలు పెరిగింది. ఎప్పుడూ అమ్మని గురించిన ఆలోచనే.

అమ్మను వదిలి వుండలేని పరిస్థితికి రావటంలో ఎక్కువ కాలం అమ్మ సన్నిధిలో కాలం గడపనారంభించారు.

గుంటూరు వెళ్ళినప్పుడు వాళ్ళ నాన్నగారు ఉద్యోగం, సద్యోగం లేకుండా జిల్లెళ్ళమూడి అమ్మ అని తిరుగుతుంటే నేను నిన్ను పోషించలేనని ఖచ్చితంగా చెప్పారు. అమ్మ దగ్గరకు వెళ్ళి వాళ్ళ నాన్నగారు అన్నమాటలు చెప్పి ఏడ్చి, మా అన్నయ్య హైదబాద్‌లో వున్నాడు అక్కడికి వెళ్ళి ఉద్యోగం వెతుక్కుంటానని అమ్మకు చెప్పి అమ్మ అనుజ్ఞ తీసుకువెళ్ళారు. అక్కడ వాళ్ళ అన్నయ్య ఒక ప్రైవేట్ కంపెనీలో 50 రూపాయల ఉద్యోగం ఇప్పించాడు.

అమ్మ కేశవన్నయ్యకు బొట్టు పెట్టి "వాళ్ళతో వెళ్ళు నాన్నా" అన్నది. "నేను బాపట్ల మీదుగా వెళ్తానమ్మా!" అన్నాడు. "కాదు నాన్నా! దెందుకూరి శ్రీనివాసరావు వాళ్ళతో వెళ్ళ"మంది. వాళ్ళు మర్రిపూడి మీదుగ పొండ్ల వెళ్ళారు. పొండ్లలో నోరిమాణిక్యాంబ గారని అమ్మ భక్తురాలు వుంది. ఆమె మాటల సందర్భంలో ఒక పిల్ల వుంది. భారత, రామాయణాలు చదవగలదు. పిల్ల అందంగా ఉంటుంది. పనిపాటలు బాగావచ్చు అని చెప్పింది. కట్నకానుకలు ఇచ్చుకోలేరు. చాలా బీదవారని, పెళ్ళి కూడా చాలా నిరాడంబరంగా చేస్తారని చెప్పింది. తాను బాపట్ల మీదగా వెడ్తానన్నా వద్దని వాళ్ళతో పొండ్ల పంపించటం, అక్కడ పిల్ల గురించి తెలియచేయటం అమ్మ సంకల్పమే అని అన్నయ్య నమ్మకం. అందుకే అన్నయ్య అమ్మ దగ్గరకు వెళ్ళి "ఆ పిల్లను చేసుకోమంటావా? అది నీ సంకల్పమే కదా!" అన్నారు. "నా సంకల్పమే అయితే నన్ను అడగటమెందుకు?" అన్నది అమ్మ. ఆ అమ్మాయిని తను చూడనేలేదు. తన తల్లిదండ్రులతో ఆలోచించలేదు కానీ ఆ పిల్లను చేసుకుంటానని ప్రామిస్ చేసాడు ఈ సంఘటన ద్వారా అన్నయ్యకు అమ్మయందు కల విశ్వాసం అవగతమవుతుంది.

గుంటూరు వచ్చాక ఆ పిల్ల తాలూకు వాళ్ళ వత్తిడి ఎక్కువైంది. వాళ్ళ నాన్నగారు వాళ్ళకి ఈ సంబంధం ఇష్టం లేనందున వేరే పెళ్ళి చూపులకు బయలు దేరారు. కానీ ఆ పిల్ల వాళ్ళకు నచ్చలేదు. తీరా పెళ్ళి చూపుల నుంచీ వస్తూ మొదటిసారిగా కేశవన్నయ్య తల్లీ, తండ్రి అమ్మను దర్శించారు. కేశవన్నయ్య అమ్మ దగ్గరికి వెళ్ళి "పెళ్ళి కొడుకును చేయమ్మా?" అని అడిగాడు "వాళ్ళ వాళ్ళు

ఒప్పుకోవటం లేదమ్మా" అన్నారు అక్కడివాళ్ళు. "కానీ వాడు అడిగింది మంచిదే కదా!" అని వెంటనే పెళ్ళి కొడుకును చేసింది అమ్మ. "పిల్ల ఎలా వుంటుందిరా!" అన్నది అమ్మ. "చూడలేదమ్మా! అన్నాడు. "వాడు ఇచ్చిన మాట నిలబెట్టుకోవటానికి నలిగిపోతున్నాడురా!" అన్నది అమ్మ. పెళ్ళికొడుకుని చేసాక అన్నయ్య హైదరాబాద్ వెళ్ళేటప్పటికి వాళ్ళ నాన్నగారు వాళ్ళు పెళ్ళికి ఒప్పుకున్నట్లుగా ఉత్తరం వచ్చింది. అది అంతా అమ్మ కరుణా కటాక్షమే అని అన్నయ్య ప్రగాఢ విశ్వాసం.

అన్నయ్య హైద్రాబాద్‌లో వుండగా అధరావరపు శేషగిరిరావన్నయ్య వెళ్ళాడు. అక్కడ 50 రూపాయలతో అన్నయ్య గడుపుతున్న జీవన విధానం ఆయన మనస్సును కలచివేసింది. ఆ విషయాన్ని దిగమింగుకోలేక జిల్లెళ్ళమూడి వెళ్ళి వెంటనే అమ్మకు చెప్పి బాధపడ్డారు. ఆ తరువాతే కేశవన్నయ్యకు ఎల్.ఐ.సి. లో ఉద్యోగం రావటంతో స్థిరపడ్డాడు.

అమ్మ సాన్నిధ్యంలో అనుభవించిన శాంతి, ఆనందాలకైపడే తీవ్రమైన తపనే ఆవేదన. అమ్మ మన ఆర్తి, ఆవేదనలకే పలుకుతుంది. ఈ శాంతి, ఆనందాలే ముక్తి స్వభావాన్ని విశద పరుస్తాయని పెద్దలు చెప్తారు. ముమూక్షత్వమే మోక్షమన్నారు శంకరులు. అమ్మ సాన్నిధ్యంలోఉండాలన్న ప్రగాఢభావమే మనస్సును ఇతర కోర్కెలను అధిగమించేటట్లు చేస్తుంది. వ్యక్తిత్వం వినయశీలమై, స్వీయ అసమగ్రత కళ్ళకు కట్టినట్లు కాగా, మనిషి శ్రద్ధాళువుగా మారుతాడు.

ఏసుక్రీస్తు "ముక్తి పొందేది కాదు నిర్ణీతమైన తరుణంలో దైవసంకల్పంచేత అను గ్రహింపబడుతుంది" అంటారు. ఆ క్షణం తటస్థించినప్పుడు ముక్తిని పొందేందుకు కావలసిన అర్హత కూడా దానంతట అదే వస్తుంది. అర్హత అనేది పొందేదికాదు. ఈ విషయం తెలియని వారికి మానవ ప్రయత్నం వల్లనే ఇది సాధ్యపడుతుందనిపిస్తుందని" అమ్మ వివరంగా తెలియచేసింది.

హైదరాబాద్ సోదరులు, గుంటూరు సోదరులు కలిసి పెదనందిపాడు మీదుగా జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి బస్సుకోసం నిరీక్షిస్తున్నారు. ఒక పెద్దమనిషి

వారిని "ఎక్కడికి వెళ్ళాలి"? అని పలకరించారు. వారిలో ఒక సోదరుడు జిల్లెళ్ళమూడి అని జవాబిచ్చాడు. ఆ పెద్దమనిషి "అమ్మ గారిని చూడటానికా?" అని వెటకారంగా అడిగాడు. అవునండి అని సమాధానమిచ్చారు. "బాగా చదువుకున్న వాళ్ళలా ఉన్నారు. ఇదేమిటి ఆమెని చూడటానికి వెళ్తున్నారా!" అన్నాడు. ఆ అగంతకుడు, కేశవన్నయ్య చిరునవ్వుతో "చదువుకున్నవాళ్ళు కనుకనే వెళ్తున్నాం అనుకోండి" అన్నాడు. దానితో ఆ అడిగిన ఆయన ముఖం మాడింది.

కృష్ణుడంతటి వాడినే దొంగ అని, పచ్చి వ్యభిచారి అని, ఇతరులకు నియుక్తమైన కన్యను తాను పరిగ్రహించాడని శిశుపాలుడు వంటి వాళ్ళు ఆకాలంలోనే వ్యతిరేక ప్రచారం లేవదీసారు. అలాంటిది ఈ కలియుగంలో పుకార్లు పుట్టించటం ఏమీ వింత? అమ్మని చూడని వాళ్ళు, అమ్మను గురించి తెలియని వాళ్ళు కూడా పుకార్లను ప్రచారం చేసేవారు.

అమ్మ రాత్రి ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు బాపట్ల ఎవరో ఒకరింటికి వెళ్తుండేది. అన్నయ్య అమ్మతో "మా ఇంటికి మాత్రం చెప్పాపెట్టకుండా రాకమ్మా! నేను ఇంట్లో ఉన్న సమయంలో రమ్మని" కోరుకున్నాడు. "నీవు వుండేదేమిటిరా! నా ఇష్టం వచ్చినప్పుడు వస్తానని" చెప్పింది అమ్మ.

కేశవన్నయ్య జిల్లెళ్ళమూడి నుండీ బాపట్ల వెళ్ళిన అరగంటకే బయలుదేరి అమ్మ వాళ్ళింటికి వెళ్లింది. వాళ్ళ బాబు తేజోమూర్తిని తీసుకొని అమ్మ వంట ఇంట్లోకి వెళ్ళింది. అన్నం వుందా? గోంగూర పచ్చడి వుందా? అని అడిగి అన్నం వండిన ఇత్తడి గిన్నెలోనే పేరి నెయ్యి వేసి కలిపి అందరికీ ముద్దలు పెట్టింది. శారదక్కయ్యకు ఇత్తడి గిన్నెలో పచ్చడి వేసి కలుపుతోంది. ఆ అన్నం కిలుము ఎక్కుతుందేమోనని భయపడింది. కానీ అన్నం అతి మధురంగా వుంది. ఇంట్లో పటిక బెల్లం వుంటే దానినే నివేదన చేసారు. అమ్మకారులో కూర్చుంది. "అమ్మా! ఇంట్లో అనేక పుస్తకాలు వున్నాయి నేనేమో సరిగా వుండను కదా! నేను అవి చదవచ్చా?" అని అడిగారు. దానికి అమ్మ "నీ వెన్నంటే నేను వున్నాను నాన్నా! నీకేమీ భయము లేదు. ఏదైనా చదవవచ్చని" అభయ ప్రధానం చేసింది.

అమ్మ మద్రాసు వెళ్ళినప్పుడు కేశవన్నయ్య తమ ఇల్లు చిన్నదని అమ్మ వస్తే, అమ్మతో పాటూ వచ్చే వాళ్ళకి సదుపాయాలు చూడటం కష్టమని అమ్మని రమ్మని కూడా అడగలేదు. అమ్మ కంచి, రమణాశ్రమం, గుడిపాటి వెంకటాచలం గారి దగ్గరకు వెళ్ళింది. అమ్మతో పాటు అన్నయ్య వెళ్ళాడు. అ తరువాత "అమ్మ మీ ఇంటికి వస్తోందని" ఫోను వచ్చింది. అమ్మ వస్తే సమర్ధించలేనని రావద్దని చెప్పాడు. "మేము వచ్చి వుంటాం. వెళ్తాం నీవు ఎవడివిరా? నన్ను రావద్దనటానికి" అని అమ్మ వెళ్ళింది.

ఎల్.ఐ.సి. లో ఇంకో కేశవశర్మగారు వుండేవారు. ఆయన భార్య మంగళ సూత్రం పోయిందని అమ్మకు చెప్పుకోవటానికి ఎంతో ఆర్తిగా వచ్చింది. కేశవశర్మగారికి వర్క్ మైండే కానీ వేరే ఆలోచన వుండదు. ఆమెను రావద్దని ఎక్కువమంది అయితే అమ్మకు ఇబ్బందని అన్నారు. దానికి అమ్మ "నీవు కంట్రోలు చేయనవసరం లేదు. నేను చూసుకుంటాను, వాళ్ళను రానివ్వమని" చెప్పింది. ఆమె తన దగ్గరకు రావటానికి గల కారణాన్ని అమ్మ అన్నయ్యకు తెలియజేసింది.

అమ్మతో పాటు వచ్చిన వాళ్ళు, అమ్మను చూడటానికి వచ్చిన వాళ్ళు దాదాపు 150 మంది అయ్యారు. వారందరికీ శారదక్కయ్య కూర, పప్పు, పులుసు, పచ్చడి చేసి భోజనాలు పెట్టింది. ఇంకా నాలుగు మానికల అన్నం మిగిలిపోయిందమ్మా! అన్నది అక్కయ్య. నాలుగు పదార్ధాలు నాలుగు బేసిన్లలలో కలిపి ఆ క్వార్టర్సులో వున్న వారందరికీ కులం, మతం ప్రమేయం లేకుండా ప్రసాదం పంచమని చెప్పింది అమ్మ. అక్కయ్య అదే విధంగా చేసింది. ఎవ్వరూ ఎటువంటి అభ్యంతరం చెప్పకుండా ఆ ప్రసాదాన్ని స్వీకరించారు.

అమ్మ ఎక్కడికి వెళ్ళినా ముందుగా స్నానం చేస్తుంది. అందుకని 5 డ్రమ్ముల నీళ్ళు పట్టివుంచారు. "నాకు ఇప్పుడు స్నానం చేయాలని లేదు. నేను పడుకుంటాను. మీ భోజనాలు కానివ్వండి" అని చెప్పింది. ఆ తరువాత స్నానం చేస్తే ఆ ఎల్.ఐ.సి. క్వార్టర్సులో నీరు పోయే మార్గం లేకపోవటంతో సామాను,

మంచంతో సహా నీళ్ళలో తేలింది. అక్కడే పీటలు వేసి వాటిమీద అమ్మను నిలుచోపెట్టి పూజ చేసుకున్నారు. బాత్‌రూమ్‌లో నుంచి, వంటింటిలో నుంచీ తప్ప నీరు పోవటానికి వేరే మార్గం లేదు. ముందుగా కనుక అమ్మ స్నానం చేస్తే బిడ్డల భోజనాలకు, ఇబ్బంది అవుతుందని అమ్మకు తెలుసు. అందుకే నేను పడుకుంటాను. ముందు భోజనాలు కానివ్వమంది" బిడ్డలయందు అమ్మకు కల వాత్సల్యానికి ప్రతీక ఈ సంఘటన.

వైజాగ్‌కు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చాడు. ఆయనకు మొదటి నుంచి సనాతన సాంప్రదాయాల మీద మక్కువ ఎక్కువ. వైజాగ్ రాక ఆయన జీవితాన్నే మార్చేసింది. పూర్వంలా కాక ఎప్పుడు పూజలు మీదే ఆయన దృష్టి. ప్రతి పౌర్ణమికి వైజాగ్‌లో ఎన్నోమార్లు లక్షనామార్చనలు మా అందరిచేత చేయించారు.

విశాఖ మాతృశ్రీ అధ్యయన పరిషత్ రిజిస్ట్రేషన్ అన్నయ్య వచ్చిన తరువాతే జరిగింది. వైజాగ్‌లో అందరి దగ్గర డబ్బులు చందాల రూపేణ వసూలు చేసి జిల్లెళ్ళమూడిలో శ్రీమాతా గెస్టుహౌస్ అన్నయ్య ప్రోత్సాహంతో నిర్మించుకున్నాము. ఒక సమయంలో అన్నయ్య, అక్కడున్న భక్తులు కొందరిచే బ్యాంక్‌లో లోను పెట్టించివారు నెలనెలా డబ్బుకు ఇబ్బంది పడ్తున్నా శ్రీమాతా బిల్డింగ్‌ను పూర్తి చేయించాడు. తాను డబ్బుకు ఇబ్బందిపడ్తున్నా కూడా అమ్మకోసం సంస్థకోసం ఎంతో తాపత్రయపడేవాడు.

అమ్మ వజ్రోత్సవంకు వైజాగ్ వాళ్ళంతా కలిసి లక్షరూపాయలు వసూలు చేయాలని అనుకున్నారు. మొదట్లో వసూలు కార్యక్రమం అనుకున్నంతగా జరగలేదు. అమ్మ దగ్గరకు వెళ్ళి బాత్రూం దగ్గర అమ్మ వుండగా "అమ్మా బాల మంత్రం ఉపదేశం తీసుకుంటానమ్మా" అని అమ్మతో చెప్పి వాళ్ళనాన్నగారి దగ్గర మంత్రోపదేశం పొందారు. "వైజాగ్ వచ్చాక ఇష్టకామ్యసిద్ధి అని పేరు పెట్టి" శ్రీ కమలాలయా మంత్ర సంపుటీకృత శ్రీ సూక్తమ్" మొదటిసారిగా మా అందరిచేతా చేయించారు. ఏది చేయించినా మనస్ఫూర్తిగా నిష్ఠగా, పద్ధతి ప్రకారం చేయించటం అన్నయ్య ప్రత్యేకత.

బ్రహ్మ పదార్థం యొక్క స్థితి లలిత. ఆ లలితామూర్తియే మన అమ్మ. అమ్మ సిద్ధి పొందినప్పుడు అమ్మ లేకుండా బ్రతకగలనా అని అలమటించాడు. అమ్మ విగ్రహ ప్రతిష్ఠకు ముందుగా మండలం రోజులు పంచదశీమంత్ర జపం చేయాలని వాళ్ళ నాన్న గారి ద్వారా ఉపదేశం పొందాలనుకున్న అన్నయ్య అనేక పుస్తకాలు కొన్నారు. అందులో సర్వదేవతా ప్రతిష్ఠమంత్రాలు ఉన్న పుస్తకం, శ్రీకల, కామకల మొదలగు పుస్తకాలెన్నో వున్నాయి.

అన్నయ్య వాళ్ళు జిల్లెళ్ళమూడిలో శ్రీయాగం చేసినప్పుడు అందులో పాలు పంచుకునే అదృష్టం మా దంపతులకు అమ్మ కలుగజేసింది. చండీయాగంకు కర్కరీ స్థాపన (కమండలంలో) ఈశాన్యదిక్కులో సింహముఖంలో వుండి యాగానికి రక్షణగా వుంటుందని చేస్తారు.

కేశవఅన్నయ్య వాళ్ళ నాన్నగారు శ్రీచక్రదీక్షాపరులు. నిత్యానుష్టానం చేసిన మహోన్నతవ్యక్తి. తన పిల్లల్లో నిత్యానుష్ఠానం చేయగలిగినవాడు అన్నయ్యే అని, అన్నయ్య ఏదిచేసినా ఎంతో నియమ నిష్ఠలతో చేస్తాడన్న నమ్మకం కలగటంతో అన్నయ్యకు పంచదశి చెప్పకుండానే షోడశి మంత్రోపదేశం చేసారు. షోడశికి నియమాలు పాటించవల్సిన అవసరం ఎంతోవుంది. అమ్మ విగ్రహ ప్రతిష్ఠ ఎటువంటి విఘ్నాలు కలుగకుండా జరిగి పోయింది. వేలాదిమంది అనసూయేశ్వరాలయంలో, హైమాలయంలో అర్చనలు చేసుకొని లబ్ధినిపొందుతున్నారు.

అన్నయ్య వైజాగ్ స్థిరనివాస మేర్పరచుకొని తన నియమనిష్ఠలతో నిత్యానుస్థానంతో తనకు నచ్చిన తనదైన శైలిలో జీవిస్తున్నాడు. ఏది వచ్చినా, ఏమి జరిగినా అంతా అమ్మ ప్రసాదమేనని నిశ్చింతగా, హాయిగా జీవనయానం సాగిస్తున్నాడు. తనకు ఉన్నా లేకపోయినా అందరూ అన్ని సౌకర్యాలతో హాయిగా గడపాలన్న తపన కలవాడు అన్నయ్య. కాబట్టే అమ్మ అన్నయ్యకు అన్ని సదుపాయాలు కలుగజేసి నలుగురు పిల్లల మధ్యావుండే విధంగా ఏర్పాటు చేసింది.

అమ్మ ఉండే పాకలో వంట గదిలో ఒక జాడీ ఉండేది. దాని చుట్టూ పుట్టవచ్చింది. ఆ జాడీలోకి ఒక పాము వచ్చేది. అమ్మ ఆ జాడీలో నుంచే

కుంకుమ తీసి వచ్చిన వారందరికీ ప్రసాదంగా ఇచ్చేది. "ఆ జాడీని వరలక్ష్మమ్మకు చూపించమంది" అమ్మ. "ఆమె బ్రాహ్మణవనిత కానందున అక్కడి వారు మడి కదా! ఎలాగ" అని అన్నారు. "మడి, ఆచారం అంటూ వేరే ఏమీ లేదు. ఆమెకు చూపించమంది" అమ్మ. కుల పరంగా మంత్రాయితో మొదలైన రివల్యూషన్ అనే విత్తు అనంత వరలక్ష్మమ్మతో మొలకెత్తింది.

అనంత వరలక్ష్మమ్మగారు, అనంత అంజయ్యగారు కొమ్మూరు నివాసులు. గంగరాజు లోకనాథం గారితో అమ్మ గుడికి వెళ్ళి వెంకాయమ్మ చేత వరలక్ష్మమ్మకు కబురుచేసింది. అంతకు పూర్వం ~~ఈ~~ఆమెకు అమ్మ తెలియదు. శ్రీరామ నవమికి వరలక్ష్మమ్మ జిల్లెళ్ళమూడి వెళ్ళింది. అమ్మను చూడగానే విపరీతంగా ఏడ్చి, అమ్మా అంటూ అమ్మ పాదాక్రాంతమయింది వరలక్ష్మమ్మ.

"ఇక్కడకు వచ్చిన వారందరికీ అన్నం పెట్టడం జరుగుతుంది కదా! నీకు పండిన పంట ఇస్తూ ఉండమని వరలక్ష్మమ్మతో చెప్పింది. అలాగే బియ్యం, కూరలు, మిరపకాయలు, డబ్బు తరచూ ఇస్తుండేది. ఒకమారు ~~ఈ~~ఆమె చాలా రోజుల తరువాత వెళ్ళింది. అమ్మ ఇంత తొందరగా వచ్చావేమి? అని, తన దగ్గరే పడుకోమంది. ప్రతీ శుక్రవారం వాసనలు వస్తున్నాయమ్మ! అన్నది ఆమె. అదేమీ లేదే వచ్చిన వాళ్ళు సెంటు రాసుకున్నారు అన్నది అమ్మ. కాదమ్మా నీ బట్టలు కూడా వాసన వస్తున్నాయని ఆమె చెప్పింది. "నేను వెళ్ళినపుడల్లా అమ్మ ఒక పాట పాడవే" అని అడిగేది. ప్రతి పుట్టినరోజుకు అమ్మ అక్కయ్యకు చీర పెట్టేది". నీకు యాభై సంవత్సరాలు నిండుతున్నాయి అని చీర పెట్టి కట్టుకోమంది. చీర కట్టుకొచ్చిన తరువాత అమ్మ, నాన్నగారు నా తలమీద పూలు పోశారు" అని వరలక్ష్మమ్మ ఆనందంతో చెప్పింది.

గోపురంకు రెండువందలు ఇచ్చింది. రామకృష్ణఅన్నయ్య "ఇది మూకుడు బోర్లించటానికా?" అన్నాడు. దానికి అమ్మ అన్నయ్యను అట్లా అనవద్దని వారించింది. అమ్మకు వారిచ్చే డబ్బు కంటే వారి ఆర్తి ఆవేదనలే ముఖ్యం. అమ్మ ఎప్పుడూ ఎవరినీ డబ్బుతో తూచలేదు. వరలక్ష్మమ్మ "మళ్ళీ ఇంకో మూడు వందల రూపాయలు ఇచ్చి ఆగోపురం ఏదో నీవే పెట్టించమ్మా! అని చెప్పింది.

"చిన్నప్పుడు నేర్చుకున్న చదువు మరిచి పోయానని ఇంట్లో అనుకుంది" వరలక్ష్మమ్మ అమ్మ దగ్గరకు వెళ్ళినపుడు అమ్మ "బీరువాలో పుస్తకాలు చదివి వదిలేస్తున్నారు. నీకు నేను అక్కడే ఉన్నాను కదా! నీ చదువు ఎక్కడికీ పోలేదు" అని చెప్పింది. జిల్లెళ్ళమూడి రాలేకపోయినా అమ్మ నామస్మరణతో స్మృతులతో జీవిస్తున్న ధన్యజీవి.

అనంత కృష్ణగారు వరలక్ష్మి అంజయ్య గార్ల కొడుకు. అందరూ అమ్మ శక్తి స్వరూపిణి అనుకున్నా అమ్మ అత్త గారికి కోడలనే భావన, నాన్నగారికి భార్య అన్న భావన ఉండేది. రెడ్డి సుబ్బయ్య నమ్మిన బంటులాగా ఉండేవాడు. నిలువెత్తు మనిషి. ఆయన అమ్మను ఎత్తుకునే వాడు ఒకమారు అమ్మను ఎత్తుకుని బరువు మోయలేక పడిపోయాడు. ఆ విషయం నాన్నగారితో చెబితే అప్పటి నుంచే ఆయనలో కొంచెం మార్పు రావటం సంభవించింది.

నాన్నగారికి రెండు బేరన్‌లుండేవి. ఆరెంటి మధ్య చిన్న గుడిసెలో అమ్మ కాపురం ఉండేది. అమ్మ దర్శనానికి వెళ్ళినపుడు అమ్మ అనంత కృష్ణగారిని అక్కడే పడుకోమనేది. రాత్రి పన్నెండు గంటలకు బుస వినిపించేది. అమ్మ పడుకుంటే బాగుండునని ఈయన అనుకున్నారు. అప్పుడు "అమ్మ ఎవరితోనో అనేక భాషలతో మాట్లాడుతుండేది. ఎవరో ప్రశ్నించినట్లు, దానికి అమ్మ సమాధానం చెప్పునట్లుగా" అనంత కృష్ణగారికి తోచేది. ఆ సంభాషణలలో ఏమోనమ్మా నాకేమీ తెలీదంటూనే ఆత్మావలోకం అంటే ఆత్మను ఆత్మతో అనుసంధానం చెయ్యటం" అన్నది. మళ్ళీ నో,నో, అంటూ ఇంగ్లీషు, హిందీ భాషల్లో ఎవరో అడుగుతుంటే ఆయా భాషల్లో అమ్మ జవాబివ్వటం జరిగింది. మర్నాడు ఉదయం నాన్నగారు "ఏమిరా! అమ్మ వద్ద దొంగతనం చేస్తున్నావటగా!" అని అడిగారు. అనంత కృష్ణ తరుచూ జిల్లెళ్ళమూడి వెళ్ళటంతో సుబ్బారావు అన్నయ్య, హైమ, రవిలతో ఎక్కువ సాన్నిహిత్యం ఏర్పడింది. ఒకమారు నాన్నగారు "అమ్మగారి ఫోటోలు చూసావా" అన్నారు. "మీకంటే అమ్మే బాగుందని" అన్నారు. అందులో ఒక ఫోటోను హైమ ఈయనకు ఇచ్చింది. ఆ ఫోటోలో హైమ అమ్మ మెడలో దండ వేస్తున్నట్లుగా ఉంది. అది చూచిన ఈయనకు అమ్మలోని శక్తి

హైమలోనికి వచ్చినట్లుగా, హైమకు పెళ్ళి అవసరం లేదన్నట్లుగా అనిపించింది.

కాశీ నుండి పండితులు వచ్చారు. వారితో జమ్మలమడక మాధవరాయ శర్మ, ఉమామహేశ్వర పండితులు చర్చలు జరిపారు. కృష్ణగారు దూరంగా కూర్చుని ఆలకించేవారు. వారి చర్చలను వింటూ "కల్పమే కదా సంకల్పం" అన్నది అమ్మ. "అమ్మా! ఎక్కడిదమ్మా ఈ సంస్కారం. మేము ఇంతగా చర్చిస్తున్నా ఊరుకుని ఒక్కమాటలో ఎలా చెప్పావని" ఆశ్చర్యపోయారు.

ఒకమాటు పొలాల గట్లు మీదుగా వెళ్తుంటే సింహ ద్వారానికీ, రోటరీ వాళ్ళు కట్టిన షెల్టరు మధ్య ఒక పాము పడగ విప్పి కృష్ణగారు ఎటు వెళ్తుంటే అటు చూస్తుంది. "ఏమిరా పాము పడగ కనిపించిందా?" అని నాన్నగారు అడిగారు. రేటూరు నుంచి ఈయన సైకిలు మీద వస్తుంటే జెర్రిగొడ్డు చాలా స్పీడుగా వస్తోంది. రెల్లుగడ్డి పక్కన ఇంత లావు పాము కనిపించింది. సైకిలు వదిలి జిల్లెళ్ళమూడి పరుగెత్తారు. "ఏమిరా ఈ మారు పెద్ద పాము కనిపించిందా?" అని నాన్నగారు అడిగారు.

పెళ్ళికాని వాళ్ళు, పెళ్ళి అయిన వాళ్ళు, వ్యాపారస్తులు, ఉద్యోగం వచ్చిన వాళ్ళు, రాని వాళ్ళు, చదువుకునే వాళ్ళు ఒకరనేమిటి సంఘంలోని అన్ని రకాల వాళ్ళు అమ్మ దర్శనానికి వచ్చేవారు. జబ్బుగా ఉండే వాళ్ళు వాళ్ళ జబ్బు గురించి అడిగితే "నేనే పుట్టురోగిని నేనేమి కుదర్చగలనని" వారితో చెప్పేది. కానీ అమ్మ దర్శనానంతరం అనేకమంది అనేక విధాలా లాభాన్ని పొందేవారు.

హైమాలయంకు వెళ్ళే దారిలో 200 మందికి పైగా జనం ఉన్నప్పుడు అమ్మ హైమ పైట సవరిస్తూ "హైమమ్మా ఇవాళ నుంచీ నీవు చిన్నమ్మవు అవుతావని" అన్నది. అపుడు అక్కడ ఉన్నవాళ్లందరూ నవ్వుకున్నారు. హైమాలయం వెలసిన తరువాత అమ్మ అన్న మాట కరెక్ట్ అయింది. అవును "నీవు చిన్నమ్మవు అవుతావని అమ్మ అన్నది కదా !" అని అనుకున్నాడు. నమ్ముకున్న వాడికి సొమ్ము, నమ్మని వాడికి దుమ్ము" అని మస్తాన్ తన విశ్వాసాన్ని ప్రకటించాడు.

ఎవరైనా పండితులు చర్చించుకుంటుండగా దూరంగా ఉన్న హైమను చూస్తూ అవును, కాదు అంటూ అమ్మ అనేది. ఆ మాటలన్నీ హైమ తరువాత మొన్న పండితులు చర్చించుకున్న విషయాలు అని కృష్ణగారికి తెలియజేసేది. హైమ సిద్ధిపొందిన అనంతరం ఈయన బాధపడుతుంటే "25 సం॥ల తరువాత పెళ్ళి చేసుకోమన్నానురా. అది దాటకుండానే వెళ్ళిపోయిందిరా" అన్నది అమ్మ. ఇతర దేశాల వాళ్ళు అమ్మ దర్శనార్ధం రావటంతో అమ్మ దగ్గర ఉన్న వాళ్ళలో ఈర్ష్య, అధికార దాహం మొదలైంది. దానితో నాన్నగారు ఆ మార్పుకి వ్యధచెందారు.

ఒక యోగిగారు సాయిబుపాలెం నుంచి వచ్చి గుట్టల దగ్గర, పుట్టల దగ్గర ఉంటుండేవారు. ఆయనను అందరూ వేమన అంటుండేవారు. అమ్మగారి దగ్గరకు వెళ్ళారంటే మహాక్షేత్రమౌతుందని ఆయోగి గారు చెప్పారు. ఆయన "అమ్మను దర్శించి అమ్మ అవతార మూర్తి" అని చెప్పారు. ఆయనకు శక్తి ఉందని అమ్మ తెలియజేసింది.

ఒక సాయిబు మిషన్ కుట్టుకుండేవాడు. వాళ్ళకు పిల్లలు లేరు. వాళ్ళకొచ్చిన డబ్బుని యోగి గారు జిల్లెళ్ళమూడికి పంపించేవారు. "అమ్మ నన్ను వాటేసుకుందని" ఆ సాయిబు అన్నాడు. అది విని యోగిగారు "వాడు అమ్మకు వేటు వెయ్యాలని అనుకున్నాడురా!" అని అన్నారు. ఆ మూడోరోజు అతనికి పక్షవాతం వచ్చింది.

పొగాకు బేరన్ దగ్గర యోగిగారు అమ్మతో గట్టిగా మాట్లాడుతున్నారు. నీకు తెలిసిన వాటిని ఎందుకు నివారించవని బాధపడ్డారు. యోగిగారు అక్కడ తాగటం, తిట్టడం చేశారు. మీరు ప్రశాంతంగా ఉంటూ అక్కడ సరిచేయొచ్చు కదా! అని కృష్ణగారు యోగి గారిని అడిగారు. ఆయోగి "ఎంత ఉన్నత స్థితికి వెళుతుందో అంత దిగజారుడు స్థితి కనిపిస్తోందిరా" అని అన్నారు.

అక్కడ ఒక ముసలివాడు యోగిగారిని వాళ్ళింటికి తీసుకువెళ్ళాడు. ఊళ్ళో వాళ్ళొంతా భోజనానికి వస్తున్నారు. వాళ్ళంతా వస్తే కష్టం అన్న భావన సంస్థలో

వాళ్ళకి కలిగింది. "ఎవరు వచ్చినా అన్నం పెట్టమని డ్రెస్సును బట్టి ఎడ్రస్‌ను బట్టి కాకవాడి ఆకలిని బట్టి అన్నం పెట్టమంది. అన్నపూర్ణాలయంలో భోజనం చేయటానికి ఆకలే అర్హత అని చెప్పింది అమ్మ. అలాంటిది సంస్థలో వచ్చిన తేడాకు అమ్మ వ్యధ చెందింది''. పిల్లలు లేని వాళ్ళకు పిల్లలు పుట్టడం, ఎందరో స్వామీజీలకు అమ్మ దర్శనాంతరం తమకు ఏమీ తెలీదని అమ్మ మ్రోల తలలు వంచేవారు.

గోపాలకృష్ణ, రామకృష్ణ అప్పికట్ల వాస్తవ్యులు, మొట్టమొదటి సారిగా అమ్మను పూండ్ల గ్రామంలోని ఆలయ ప్రాంగణంలో జుట్టు విరబోసుకొని, పద్మాసనంలో కూర్చుని ఉన్నప్పుడు గోపాలన్నయ్య, రామకృష్ణన్నయ్య 1956 ప్రాంతంలో అమ్మను దర్శించారు. వారు అమ్మకు నమస్కారం చేసినపుడు అమ్మ వారికి తీర్థప్రసాదములు ఇచ్చింది.

ఒకసారి అప్పికట్లలో గోపాలన్నయ్య వాళ్ళింట్లో అవధూతేంద్రస్వామి, శ్రీ రఘువరదాసుగారు సప్తాహాలు చేసారు. అప్పుడు అమ్మ వారింటికి వెళ్ళి వరండాలో కూర్చుని భోంచేసి గోపాలన్నయ్యను చూచానని చెప్పింది. అప్పికట్లలో కుర్తా సుబ్బారావు గారింట్లో ఇంకొకమారు గోపాలన్నయ్యను, రామకృష్ణన్నయ్యను చూచానని అమ్మ చెప్పింది. అప్పటికే అమ్మను ఒక సిద్ధ పురుషురాలని చెప్పుకునేవారు.

అమ్మ మరిది శ్రీ లోకనాధం బాబాయి గారు అప్పికట్లలో టీచరుగా పనిచేసేవారు. వారింట్లో వుండి అమ్మ పెద్ద కొడుకైన, బ్రహ్మాండం సుబ్బారావు గోపాలన్నయ్య వాళ్ళ నాన్నగారి దగ్గర చదువుకోవటానికి వచ్చేవాడు. గోపాలన్నయ్యకు 3సం॥ లప్పుడే తల్లి చనిపోయింది. వాళ్ళ నాన్న రెండో పెళ్ళి చేసుకున్నారు. ఆమెను అమ్మా అని పిలవమని ఎంత చెప్పినా పిన్ని అనే పిలిచేవాడు. కానీ అమ్మను దర్శించింది మొదలు ఎప్పుడూ అమ్మా! అమ్మా అంటూ అమ్మ ధ్యాసలోనే ఉండేవాడు. వాళ్ళ అత్తయ్య కూతురైన వెంకాయమ్మను వివాహం చేసుకున్నాడు. ఎక్కువ కాలం అమ్మ దగ్గరే గడుపుతుండేవాడు.

బాపట్లలో ఉన్న తండ్రి, పిన్ని, భార్యా, పిల్లల్ని పట్టించుకునేవాడు కాదు. దానికి ఆయన అత్తయ్య అమ్మ "స్త్రీ" యే కదా! పెళ్ళాం, బిడ్డల్ని పట్టించుకోక పోయినా ఎట్లా ఊరుకుంటోంది అంటూ నిత్యం అమ్మనే తిట్టకునేది. అమ్మ అంటే అయిష్టం లేదు కానీ తన అల్లుడు సంసారం, పిల్లల్ని పట్టించుకోకుండా అమ్మా, అమ్మా అంటూ తిరుగుతున్నాడని ఆమెకు కోపం. ఆమె అమ్మ దగ్గరికి వచ్చినపుడు "నిన్ను ఎప్పుడూ తిట్టుకుంటున్నానమ్మా" అన్నది. దానికి అమ్మ నీవు ఆవిధంగానైనా కొలుస్తున్నావు కదమ్మా! అనటంతో ఆశ్చర్యపోవటం ఆమె వంతు అయింది.

వాళ్ళకు "అత్రివాణి ప్రెస్", లక్ష్మీప్రసాద్ పుస్తకాల షాపు వుండేది. గోపాలన్నయ్య, పట్టించుకోకుండా పని వాళ్ళమీద వదిలేసి ఎప్పుడూ జిల్లెళ్ళమూడిలోనే ఉండేవాడు. అందుకని ఆ ప్రెస్‌ను వేరే వాళ్ళకు అమ్మేశారు. కానీ వాళ్ళూ దానిని సరిగా నడపలేకపోయారు. అప్పుడు ఆ ప్రెస్‌ను అమ్మ సంస్థకు కొనిపించి "మాతృశ్రీ ప్రెస్" అని పేరు పెట్టింది. పాత పని వారందరినీ అందులోనే ఉంచి, గోపాలన్నయ్యకు ప్రెస్ బాధ్యతను అప్పజెప్పింది. ఆ విధంగా అమ్మ ప్రెస్‌ను కొని అన్నయ్యను బాపట్లలో బంధించింది.

"నీవు నా గురించి ఆలోచించు నాన్నా, నీ గురించి, నీ కుటుంబం గురించి నేను చూస్తానుగా" అన్నది అమ్మ. అలాగే అనుగ్రహ ప్రదాయిని అయిన అమ్మ కరుణా వృష్టి వారి కుటుంబంపై కురిపించేది. జిల్లెళ్ళమూడిలో ఏ ఫంక్షన్ జరిగినా గోపాలన్నయ్య తండ్రికి, పిన్నికి, అత్తయ్యకి ప్రత్యేకించి కబురు పెట్టేది. ఎంతమంది ఉన్నా వాళ్ళకి ముందుగా దర్శన భాగ్యం కలగజేసేది.

**1963-1964** గోపాలన్నయ్య అమ్మచేత దర్శనమిప్పిస్తున్నాడు. ఒకామె అమ్మకు పూజ చేసుకుంటోంది. అన్నయ్య అమ్మను కన్నార్పకుండా చూస్తున్నాడు. అలా చాలాసేపు చూడగా చూడగా అమ్మ పెద్ద పెద్దగా అయి ఆకారం లేకుండా పోయింది. అన్నయ్యకు స్పృహ తప్పింది. తీరా స్పృహ వచ్చేసరికి అమ్మకు మామూలుగా పూజ చేస్తున్న ఆమె హారతిస్తోంది. సమయంలో అన్నయ్య

అంతులేని ఆనందాన్ని చవి చూసాడు. తన ఆనందాన్ని రామకృష్ణన్నయ్యకూ పంచాలన్న తపన పెరిగింది. అమ్మ అన్నయ్యతో "నాన్నా నువ్వు పుస్తకం ఎందుకు వ్రాయకూడదు?" అన్నది. "నాకు భాషరాదు నేను వ్రాయటం మొదలు పెడితే నీ పుస్తకాలు ఎవరూ కొనరు అన్నాడు. పోనీ నీవు చెప్పేదంతా చెప్పేయి. అది రికార్డు చేయించు అని చెప్పింది అమ్మ. ఈ విధంగా అమ్మ సచ్చరిత్ర రెండవ భాగంకు తన అనుభవాలు చెప్పమని గోపాలన్నయ్యను కోరాను. ఇన్ని సంవత్సరాల తరువాత అమ్మ అన్నమాట కార్యరూపం ధరిస్తోందని అన్నయ్య ఆనందపడ్డాడు.

రామకృష్ణన్నయ్యకు అమ్మ దగ్గర జరిగిన విషయం చెప్పాడు. పూజచేసిన ఆమె దేవీ ఉపాసకురాలేమో అన్నాడు రామకృష్ణన్నయ్య. ఆమెనడిగితే అవునని చెప్పింది. అమ్మ స్నానం చేసి ఏమిట్రా మహా ఆనందంగా ఉన్నావు ఏమిటి సంగతి అని గోపాలన్నయ్యను అమ్మ అడిగింది. జరిగిన సంగతి చెప్పి ఆనందాన్ని పట్టలేకుండా ఉన్నానమ్మా అన్నాడు. గోపాలన్నయ్య, దీని ప్రత్యేకత ఏమిటంటే (దానికి సిగ్నిఫికెన్స్ ఉందా) పరిమితమైన దాన్ని అపరిమితంగా వీక్షించావు. మళ్ళీ దాన్ని శూన్యంగా వీక్షించావు. మళ్ళీ దాన్నే పరిమితంగా వీక్షించావు. అదే విశ్వరూప సందర్శనం అన్నది అమ్మ. విశ్వరూప సందర్శనలో కొండలు, కోనలూ, మహాసముద్రాలు అన్నీ చూపిస్తారు కదా! సర్వం అందులోనే ఉన్నాయని చూపించాడు శ్రీకృష్ణుడు. కానీ ఇక్కడ "నేనే సర్వం అని తెలియజేసింది" అమ్మ. కృష్ణుడు అర్జునుడికి విశ్వరూపం చూపించటానికి కథ ఉంది. మరి నాకెందుకు చూపించావు? అని అడిగాడు గోపాలన్నయ్య. "నీకు దర్శనం ఇవ్వటం నాకోసమే" అని చెప్పింది అమ్మ.

జిల్లెళ్ళమూడి నుండి వచ్చి బ్రిడ్జి దగ్గర గట్టు మీద పడుకుంటే సరిగ్గా బస్సు వచ్చే సమయానికి తెలివి వచ్చేది. బాపట్లకు బస్సులో వెళ్తుంటే నిద్రపట్టింది. అమ్మ దగ్గర ఎవ్వరూ లేరు. అమ్మ వొంగి చెప్పులు తీసుకుని బాత్‌రూమ్‌కు వెళ్తూ పడబోయింది. దానితో బస్సులో ఉన్న అన్నయ్య పెద్దగా "అయ్యో! "అమ్మా!" అని అరిచాడు. చుట్టూ ఉన్న జనం ఏమిటని అడిగారు. ఏమీ లేదని మళ్ళీ

పడుకున్నాడు. గోడ పట్టుకోబోయి అమ్మ మళ్ళీ తూలింది. మళ్ళీ లేచి అరిచాడు. బస్సులో వాళ్ళు ఆశ్చర్యపోయారు. మర్నాడు అన్నయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు "అమ్మా నీ దగ్గర ఎవ్వరూ లేని పరిస్థితి ఉందా?" అని అడిగాడు. వరలక్ష్మి అక్కయ్యా వాళ్ళు విస్తుపోయారు. ఏమిటమ్మా? ఇది నిజమేనా అంటే "వాడు చూసాడుగా" అన్నది అమ్మ.

గోపాలన్నయ్య కడుపులో అల్సర్ ఉండటంతో ఒక్క పాలు మాత్రమే తాగేవాడు. మిగిలిన ఏ ఆహారమూ తీసుకునేవాడు కాదు. ఒకమారు అన్నయ్య మద్రాసు వెళ్తున్నప్పుడు పాలు తాగు నాన్నా అన్నది అమ్మ. కానీ ఊరు వెళ్ళే హడావిడిలో పాలు తాగలేదు. అమ్మ పాలు తీసుకు వస్తుందేమోనని రైలు ఎక్కుతూ చూసాడు. చీరాల దాకా వెళ్ళాక ఇక అమ్మ రాదని రైలులో పైకి ఎక్కి పడుకున్నాడు. తీరా నెల్లూరు వెళ్ళేటప్పటికి అమ్మ తనకి పాలు ఇచ్చినట్లు అనుభూతి కలిగింది. లేచి చూసుకునే సరికి నోరంతా పాలు ఉన్నాయి. మద్రాసు వెళ్ళేవరకు ఆ అనుభూతి అలా నిలచేవుంది.

ఇంగ్లీషులో తీసిన అమ్మ సినిమా వ్రాతప్రతిని తీసుకుని హౌరామెయిల్‌లో గోపాలన్నయ్య వస్తున్నాడు, ఒక్కమారు పెద్ద శబ్దంతో ఇంజను వెనుకనే ఉన్న బోగీ పైకి లేచింది. వెనకనే గోపాలన్నయ్య ఉన్న బోగి ఉంది. రైలుకు యాక్సిడెంట్ జరిగింది. దాని ఆ కంపార్టుమెంట్‌లో ఇరుక్కుపోయి ఉన్న అన్నయ్యను బయటకు తీసారు. ఆ బోగీలో వున్న సినిమా ఫైలును బయటకు తీస్తే 100 రూ॥లు ఇస్తానన్నా ఎవ్వరూ తియ్యలేదు.

ఇంతలో ఎవరో సామానంతా తీసి బయట పడేశారు. ఆ ఫైలు తీసి పట్టుకున్నాడు. షాకు వలన కాళ్ళు, చేతులూ గడగడా వొణుకుతున్నాయి. ఇంతలో ఒక కుర్రవాడు వచ్చి సామాను తీసుకువచ్చాడు. ఒక బస్సు ఆపకుండా పోతుంటే ఒక పోలీసు వచ్చి బస్సు ఆపి ఎక్కించాడు. నెల్లూరు డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి కట్లు కట్టించుకున్నాడు. కారులో జిల్లెళ్ళమూడి బయలుదేరాడు. యాక్సిడెంట్ అయింది గోపాలన్నయ్యను తీసుకువస్తున్నామని టెలిగ్రాం ఇచ్చారు. వాళ్ళువాళ్ళు

ఇంటికి రమ్మన్నా వెళ్ళక అన్నయ్య జిల్లెళ్ళమూడి అమ్మ దగ్గరకు వెళ్ళాలని పట్టుబట్టాడు. మిగిలిన వారందరకీ కాళ్ళు చేతులు విరిగి బాగా దెబ్బలు తగిలాయి. అమ్మ దయవల్లే తనకు దెబ్బలు తగలలేదని అన్నయ్య నమ్మకం.

ఒకరు నాన్నగారు లేనప్పుడు అమ్మను చెరచటానికి ప్రయత్నించారు. తరువాత కాలంలో ఆ వ్యక్తి అనూహ్యమైన మార్పు వచ్చి అమ్మను దర్శించటానికి వచ్చాడు. అమ్మ అతనికి అన్నం కలిపి ముద్దలు పెట్టి, బట్టలు పెట్టి ఆశీర్వదించింది. వాడిని ఎందుకు రానిచ్చావమ్మా అని అన్నయ్య వాళ్ళు అడిగారు. "వాడిలో మార్పు వచ్చింది నాన్నా! నిజంగా నామీద భక్తితోనే వచ్చాడు" అన్నది అమ్మ. దుర్గా సప్తశతిలో రాక్షస సంహారం కోసం వచ్చిన దుర్గని ఆ రాక్షసుడు మోహించి తన దగ్గరకు రమ్మనటం మనకు తెలిసిన విషయమే కదా! అప్పుడు దుర్గాదేవి ఆ రాక్షసుని సంహరించింది. కానీ ఇప్పుడు అమ్మ ఆ వ్యక్తిలోని దుష్టత్వాన్ని శిక్షించి అతనిలో మార్పు తీసుకువచ్చింది. అదే అమ్మ అవతారంలోని విశిష్టత.

ఒకసారి బషీర్ బాబా అమ్మ దగ్గరకు వచ్చారు. ఆయన అక్కడున్న వారితో మీరు పూజలు చేసుకోండి కానీ హారతి మాత్రం ఇవ్వకండి చెప్పారు. అమ్మతో స్నానం చేసి వస్తానని చెప్పి వెంటనే తిరిగివచ్చారు. అది చూసి "స్నానం చేసి వస్తానన్నావుగా అప్పుడే వచ్చివేమిటి?" అన్నది అమ్మ. నేను విభూతి స్నానం చేశానమ్మా అని అమ్మ ముందు చెయ్యి ఒకసారి తిప్పే సరికి ఆయన చేతిలోకి కర్పూరం వచ్చింది. దానిని గోపాలన్నయ్య వెలిగించాడు. అది ఎన్నిమార్లు వెలిగించినా సగం వెలిగి ఆరిపోయేది. ఆయన అమ్మకు నమస్కరించుకున్నాడు. కర్పూరం వెలిగింది. "అర్ధరూపాయి పెడితే వచ్చే దానికి ఇంత శ్రమ ఎందుకు నాన్నా!" అన్నది అమ్మ.

గోపాలన్నయ్య కడుపులో అల్సర్ వల్ల రక్తపు వాంతులతో విపరీతంగా బాధపడ్తున్నాడు. నొప్పి తట్టుకోవటం అసాధ్యమైంది. అప్పుడు అమ్మ ఆవకాయ ముద్దలు కలిపి పెట్టింది. దానితో వాంతులు, కడుపునొప్పి తగ్గాయి. ఒకసారి

హైద్రాబాద్ నుండి వస్తుంటే రాత్రి పన్నెండు గం॥లకు టాక్సీ యాక్సిడెంట్ అయింది.

జిల్లెళ్ళమూడికి లైట్లు ఎప్పుడు వచ్చాయని అడిగితే మార్చిలో వచ్చాయన్నాడు అన్నయ్య. "ఆ లైట్లను మార్చి ఈ లైట్లను పెట్టారు నాన్నా" అన్నది అమ్మ. మార్చి నెలలో అని చెపితే అమ్మ వాటిని మార్చి అని చెప్పటంతో అంతా నిర్ఘాంతపోయారు. "గోపాలకృష్ణమూర్తి ఎమ్.ఎ." అన్నది అమ్మ. "ఏ సబ్జక్టులో చేశాడమ్మా" అని అడిగారు. దానికి "మాష్టర్ ఆఫ్ యాక్సిడెంట్స్ నాన్నా!" అన్నది అమ్మ. అమ్మ యొక్క వాక్చాతుర్యానికి ఇవి మచ్చుతునకలు మాత్రమే.

అన్నంరాజు రామకృష్ణ అన్నయ్య మానాన్నగారు శ్రీ అన్నంరాజు మాధవరావు గారు గోపాలన్నయ్యతో పనివుండి వారింటికివెళ్ళారు. అక్కడ గోపాలన్నయ్య పెద్ద కూతుర్ని చూచి మోహన్‌కు ఈ అమ్మాయి అయితే బాగుంటుందనుకుని అ సంగతి అమ్మతో చెప్పారు. కట్నం తీసుకోము, పెళ్ళి మాత్రం ఘనంగా చేయాలన్నారు. అమ్మ సరే అని పెండ్లి నిశ్చయించింది. ఆ సమయంలో అన్నయ్య సంస్థ పనిమీద ముంబాయి వెళ్ళాడు. అన్నయ్య రాగానే అమ్మాయి సంబంధం నిశ్చయం చేసాను, వాళ్ళది మంచి కుటుంబం, మోహన్ అమ్మాయిని బాగా చూసుకుంటాడు అని చెప్పింది అమ్మ. అమ్మ చెప్పిందంటే అన్నయ్యకు వేదవాక్కే. "అంతా నీ ఇష్టమే అమ్మా" అన్నాడు.

కట్నం వద్దన్నా పెళ్ళి ఘనంగానే చేయమన్నారు కదా! పొలం అమ్మాలంటే "అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి కదా!" అని గోపాలన్నయ్య అనుకున్నాడు. దానితో రామకృష్ణ అన్నయ్య "డబ్బు సంగతి నేను చూస్తాను వర్షాకాలం కదా! వర్షం రాకుండా నీవు చూసుకోవాలని" అమ్మతో చెప్పాడు.

చంద్రమోహన్ మా పెద్ద నాన్నగారైన కీ॥శే॥ శ్రీ అన్నంరాజు వెంకటేశ్వరరావు గారి కుమారుడు. పెండ్లికి తెనాలి, గుంటూరు, బాపట్ల, పెదనందిపాడు అన్ని చోట్లా వర్షమే. రామకృష్ణ అన్నయ్య అడిగినట్లుగా "జిల్లెళ్ళమూడికి అమ్మ గొడుగు పట్టిందా? అనిపించింది. భోజనాలు అయి చేతులు కడుక్కోవటానికి లేచారు. అంతే దడదడా ఒకటే వర్షం. ఎక్కడి వారు అక్కడికి వెళ్ళటానికి ఎటువంటి ఆటంకం లేకుండా సాయంత్రానికి వర్షం తెరిపి ఇచ్చింది.

గోపాలయన్నయ్యకు ఐదుగురు పిల్లలప్పుడు ఆపరేషన్ చేయించుకోమని భార్య గొడవపెట్టింది. ఆ విషయం అన్నయ్య అమ్మతో చెప్పాడు. దానికి అమ్మ "నేను పుట్టద్దా నాన్నా" అన్నది. ఆ తరువాత ఒక మగపిల్లవాడు, తరువాత ఆడపిల్ల కలిగారు. "దానికి ఏం పేరు పెట్టమంటావు? నాన్నా!" అని అన్నయ్యను అడిగింది. "నువ్వే పుడతానన్నావుగా" అన్నాడు అన్నయ్య. అమ్మ 'అనసూయ' అని పేరు పెట్టింది. ఆ అమ్మాయి ఎంతో శాంతంగా , నెమ్మదిగా, అణుకువగా ఉండేది. దానికి అసూయ లేదు నాన్నా! అని అమ్మ చెప్పింది. ఇంట్లో ఏదైనా శుభకార్యం జరుగుతున్నా అన్నయ్య జిల్లెళ్ళమూడి బయలుదేరుతుంటే "ఇప్పుడు మీరు వెళితే ఎలాగండీ?" అని అక్కయ్య అడిగేది. "నీవు చేస్తున్నావా, నేను చేస్తున్నానా? జరిపించేది అమ్మే కదా! నీకెందుకు దిగులు" అనేవాడు అన్నయ్య.

అనారోగ్యంతో ఒకమారు అన్నయ్య పరిస్థితి విషమించింది. అన్నయ్యను వైద్యం కొరకు నెల్లూరు డాక్టరుగారి దగ్గరకు పంపించింది అమ్మ. అన్నయ్య ప్రయాణం చేస్తున్న కారుకు నిమ్మకాయలు కట్టించి, కొబ్బరికాయలు కొట్టించింది అమ్మ. అన్నయ్య తిరిగి వస్తాడన్న నమ్మకం సంస్థలో ఏ ఒక్కరికీ లేకపోయింది. అంతగా ఆరోగ్యం క్షీణించింది. తాను స్నానం చేసి కిందకు వస్తానని అంతవరకు బయలుదేరవద్దని కబురు చేసింది. అది అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

నెల్లూరులో డాక్టరుగారు వైద్యం ప్రారంభించారు. దానితో కొంచెం నయమైంది. అమ్మ అన్నయ్యకు ఎలా ఉందని ఫోన్ చేసింది. దానికి డాక్టరుగారు "ఏం చెప్పమంటావమ్మా రామకృష్ణన్నయ్య, గోపాలన్నయ్య సినిమాకు వెళ్ళారని" చెప్పారు. ఆ సమాధానం విన్న అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. జగన్నాటక సూత్రధారి అయిన అమ్మకు తెలియనిది లేదు. కానీ ఈ నాటకమంతా మనకోసమే.

జిల్లెళ్ళమూడిలో నక్సలైట్స్ పడినపుడు నాన్నగారింట్లో గోపాలన్నయ్య పడుకున్నాడు. నాన్నగారి పడకని ఆ రోజు పై అంతస్థుకి మార్పించింది అమ్మ. నక్సల్స్ దాడికి వస్తారని తెలిసే ఆ మార్పు చేసింది అమ్మ. జగన్మాత అయిన

అమ్మకు తెలియనిది ఏముంది? ధైర్యవంతుడైన గోపాలన్నయ్యను క్రింద ఉంచింది. నక్సల్స్ బరిసెలు, గొడ్డళ్ళతో వచ్చి బీరువా తాళాలు అడిగారు. అన్నయ్య తనకు తెలీదన్నాడు. దానితో ఒకడు బరిసెతో అన్నయ్య మీదకు ఉరికాడు. అన్నయ్య రెండు చేతులూ గుండెకు అడ్డం పెట్టుకుని 'అమ్మా' అని కేకవేశాడు.

ఆ బరిసె అన్నయ్య చేతి వేలికి ఉన్న అమ్మ లాకెట్‌వున్న ఉంగరంకు తగిలి చేయి గీరుకుపోయింది. దానితో వారి దృష్టి బంగారం మీదకు మళ్ళింది. అన్నయ్యను వదిలేసి, బీరువా బద్దలు గొట్టి అందులో ఉన్న బంగారం, డబ్బు పట్టుకుపోయారు. అమ్మ ఉంగరమే ఆ బరిసె తన గుండెల్లో దిగకుండా కాపాడిందని అన్నయ్య ప్రగాఢ విశ్వాసం.

మర్నాడు బాపట్లకు వెంకాయ్యమ్మక్కయ్యను అమ్మ తీసుకురమ్మందని కారు తీసుకువచ్చారు. అక్కయ్యకు ఏమీ అర్ధం కాలేదు. అయోమయంగా అమ్మ రమ్మంది కదా అని జిల్లెళ్ళమూడి వెళ్ళింది. జిల్లెళ్ళమూడిలో అందరూ "నీవు చాలా అదృష్టవంతురాలివి" అన్నారు. ఏమీ అర్ధం కాక వాళ్ళు ఎందుకు అంటున్నారో తెలియక పైకి, అమ్మ దగ్గరకు వెళ్ళింది. అక్కయ్య మంగళ సూత్రాలను అమ్మ తన చేతులతో పట్టుకుని "వాడు నీకు పసుపుతాడు కట్టకుండా ఇనుప గొలుసులు కట్టాడా లేక నీవు గండాల గౌరీదేవి నోము నోచావేమిటి?" అని అక్కయ్యను అడిగింది అమ్మ.

కాజీపాలెం స్వాములు వారు కట్టించిన గుడిని ఎండోమెంట్ వారు స్వాధీనం చేసుకుంటామన్నారు. దానిని ఆపుచేయటానికి అన్నయ్యను సహాయం చేయమన్నారు. అప్పుడు ఆ విషయం చర్చించటానికి అన్నయ్య వెళ్ళేవాడు. ఒకమారు స్వామీజీ దగ్గర మాటల సందర్భంలో "పెద్దమ్మాయి పెళ్ళి బాధ్యతంతా అమ్మే చూచుకుంది. ఇప్పుడు రెండో అమ్మాయికి పెళ్ళి చేయాలి" అన్నాడు అన్నయ్య. దానికి స్వాముల వారు "అమ్మ ఎక్కడికీ పోలేదు, పెద్దమ్మాయి పెళ్ళి ఎలా జరిపించిందో, అలాగే చిన్నమ్మాయి పెళ్ళి కూడా జరిపిస్తుంది. ఎవరు ఏ

దేవుడ్ని కొలుస్తారో వారే భక్తుని యోగక్షేమాలు చూస్తారని" చెప్పారు. సరిగా ఆరు నెలలు తిరక్కుండానే అమ్మ పినతల్లి కూతురైన దుర్గపిన్ని అనసూయకు సంబంధం తీసుకురాడటం, వెంటనే వివాహం నిశ్చయమవటం జరిగింది. పెళ్ళిఅయి, పెళ్ళివారు వెళ్తున్న సమయంలో కాఫీ ఇవ్వాలనుకున్నారు. పాలు విరిగిపోయాయి.

ఒక్క అరగంటలో పాలు తెప్పించి కాఫీలు పెట్టిస్తానన్నాడు. ఈలోగా వారు తొందరపడ్తున్నారు. వంటశాలలోకి వెళ్తే ఆశ్చర్యంగా, అనూహ్యంగా పొయ్యి మీద కాఫీ మరుగుతోంది. ఆ పాలు ఎవరు తెచ్చారో, ఎవరు కలిపారో కూడా ఎవరి దగ్గరా సమాధానం లేదు. అమ్మ ఆ విధంగా తన పరువు ప్రతిష్ఠలు కాపాడిందని అన్నయ్య అమితానంద భరితుడయ్యాడు. అది చూచిన మగ పెళ్ళివారు దిగ్భ్రాంతి చెందారు. పెళ్ళికూతురిని గృహప్రవేశంకు వాళ్ళింటికి తీసుకు వెళ్తూ అనసూయ మామగారు అమ్మ ఫోటోతో వాళ్ళింట్లో అడుగు పెట్టమన్నారు.

గోపాలన్నయ్య పిన్ని "వాడు ఏమి చేసినా, ఏమి పట్టించుకోక పోయినా ఏమీ అనరేమి"టని వాళ్ళ నాన్నగారితో దెబ్బలాడేది. "మనకు లేని నమ్మకం, గురి వాడికి అమ్మ మీద ఏర్పడ్డాయి. కాబట్టి అన్నయ్య బాగోగులన్నీ అమ్మే చూసుకుంటుంద"న్న నమ్మకంతో నిశ్చలంగా, నిర్వికారంగా ఉండేవారు. ఆయనకు ఐదుగురు పిల్లలు మరణించిన తరువాత గోపాలన్నయ్య బ్రతికి బట్టకట్టాడు. అందుకు ఆయన అన్నయ్యను ఏమీ అనలేకపోయేవారు. అన్నయ్యను చూసేటప్పటికి "భోంచేసి వెళ్ళు నాన్నా, వ్యాను టైమవుతుందేమో అనేవారు. వాడేమీ కానీ పని చేయటం లేదు కదా!" అని భార్యను విసుక్కునేవారు.

గోపాలన్నయ్య భార్య అంటే అమ్మకు ఎనలేని అనురాగం. భర్త ఇంటి విషయాలు పట్టించుకోకపోయినా మామగారు, అత్తగారు, తల్లి, పిల్లలను ఎంతో భక్తి శ్రద్ధలతో, ఓర్పుతో, నేర్పుతో ఆ కుటుంబాన్ని నడిపించింది. పిల్లల్ని క్రమ శిక్షణతో పెంచి వారి భవిష్యత్తుకు బంగారు బాటలు వేసే శక్తిని వెంకాయమ్మక్కయ్యకు అమ్మ ప్రసాదించింది.

కొండముది రామకృష్ణన్నయ్య, గోపాలన్నయ్య అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడి వెళ్ళారు. దర్శనానంతరం తిరిగి వారు అప్పికట్లకు బయలుదేరారు. ఇంతలో వెనకనుంచి పిలుస్తున్నట్లుగా తోచి ఆగిపోయారు. ఒక కుఱ్ఱవాడు పరిగెత్తుకుంటూ వచ్చి అప్పికట్ల నుంచి వచ్చిన పిల్లలను అమ్మ రమ్మంటున్నారని చెప్పాడు. వీరిద్దరూ తిరిగి అమ్మ దగ్గరకు వెళ్ళారు. సిరిగిరి సుబ్బారావు అనే గుడ్డివాడు లక్ష్మీనరసింహ స్తోత్రము అమ్మ దగ్గర గానం చేస్తున్నాడు. పాట విని ఆ నరసింహస్వామియే దిగి వచ్చాడా అన్నట్లుగా అందరూ పరవశులయ్యారు. అతని గానం అత్యద్భుతంగా జనరంజకంగా ఉంది. అక్కడే ఉన్న ఆడపిల్లలు ఈ పని ఆపని తేడా లేకుండా చకచకా చేస్తున్నారు. ఇప్పుడు ఆలయ ప్రాంగణమున్నచోట పండుగలప్పుడు పందిళ్ళు వేసి భోజనాలు పెట్టేవారు. నాన్నగారి పర్యవేక్షణలో వడ్డనలు చేస్తుండేవాళ్ళు.

గోపాలన్నయ్య అది చూచి కళ్ళు లేని అతను తనవంతు కృషిగా అమ్మతో పాటూ అందరినీ రంజింపచేస్తున్నాడు, ఆడపిల్లలు ఆడపని, మగపని అని తేడా లేకుండా చేస్తున్నారు. మనం కూడా చేతనైన సేవ ఈ సంస్థకు చేస్తు బాగుంటుంది అన్నాడు. దానికి రామకృష్ణన్నయ్య సరే అన్నాడు. గోపాలన్నయ్య వాళ్ళకు "అత్రివాణి" అనే ప్రింటింగ్ ప్రెస్ దానిని లీజ్‌కు తీసుకొని, బాపట్లలో ఉండేది. దాని బాగోగులు గోపాలన్నయ్యే చూసేవాడు. రామకృష్ణన్నయ్య కవి, రచయిత. అప్పటికే కథలు, నాటకాలు రాశాడు. రామకృష్ణన్నయ్య కాగితం ఖర్చు పెట్టుకుని, గోపాలన్నయ్య ప్రింటింగ్ చార్జి పెట్టుకుని ఒక మేగజైన్‌ని విడుదలచేశారు. **1962** నుండి **1966** వరకు సంవత్సరానికొక మేగజైన్‌ని ప్రచురించారు. వారు తరుచూ అమ్మ దగ్గరకు వస్తూ పోతూ ఉండేవారు.

అమ్మ వీరితో "అంతా పొద్దున్న వచ్చి సాయంత్రం వెళ్ళిపోతున్నారు. నాన్నా! పిల్లలు చిన్నవాళ్ళు, నేను ఒంటరినవుతున్నానని" అన్నది అమ్మ. దానికి వీరిద్దరూ "మేము ఉంటామమ్మా" అన్నారు. అమ్మ మంచం ప్రక్కనే ఉన్న గోపాలన్నయ్యను "చేతిలో చేయివేసి చెప్పమంది". దానికి గోపాల్ అన్నయ్య అమ్మ చేతిలో చెయ్యివేశాడు. "వాడినీ వెయ్యమనరా" అన్నది అమ్మ. అప్పుడు రామకృష్ణన్నయ్య

అమ్మ మంచం క్రింద పడుకుని ఉన్నాడు. గోపాలన్నయ్యే రామకృష్ణన్నయ్య చెయ్యితీసుకుని తన చేతి మీద వేసుకున్నాడు.

మేగజైన్‌కు మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. అందరికీ అమ్మ గురించి తెలియటం జరుగుతున్నది. అప్పటికీ సంస్థలో సర్వం తానే అయినఅదరావరపు శేషగిరిరావు అన్నయ్య ఈ మేగజైన్‌నే మాసపత్రికగా వెలువరిస్తే బాగుంటుందన్న తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. దానికి డబ్బు అవసరం అవుతుంది కదా! అన్నాడు గోపాలన్నయ్య పత్రిక సంగతి మీరు చూసుకోండి, డబ్బు గురించి నేను చూసుకుంటానని శేషగిరిరావు అన్నయ్య అన్నాడు. ఆ తరువాతే తెలుగు, ఇంగ్లీషు భాషలలో కూడా "మాతృశ్రీ మాస పత్రిక" వెలుగు చూచింది.

1956 సం॥లోనే రామకృష్ణన్నయ్యను దర్శించినా అమ్మ ప్రభావం అంతగా లేదు. 1962 నవంబరు 11వ తేదీన కార్తీక పౌర్ణమి అన్నయ్య జీవితమే మలుపు తిరిగిన శుభదినం. అమ్మఒడిలోకి చేర్చిన సుముహూర్తం. ఆనాటి రాత్రి అమ్మ పున్నమి చంద్రుడై అన్నయ్య హృదయాకాశంలో ఉదయించి అలౌకికమైన అనుభూతిని ప్రసాదించింది. అప్పటినుంచే అమ్మ అవతారమూర్తి అన్న నమ్మకం ప్రబలింది.

ఆ క్షణం నుంచీ అన్నయ్య తనకుతానుగా అమ్మకు సమర్పించుకున్నాడు. అనుభవం వల్ల విశ్వాసము, విశ్వాసము వల్ల అనుభవం కలుగుతుందా? అన్నది విత్తుముందా? చెట్టుముందా? అన్నట్లు వివాదా స్పదమే అయినప్పటికి అన్నయ్య జీవితంలో అనుభవం ద్వారానే విశ్వాసం ఏర్పడింది. దానితో అన్నయ్య జీవితంలో అణువణువునా "అమ్మ" ఆక్రమించుకుంది. అన్నయ్యను కన్నవాళ్ళకంటే, స్నేహితులకంటే, కట్టుకున్న భార్యకంటే, బంధువులకంటే, సంపదల కంటే అమ్మ నిత్యారాధ్య అయింది. క్రమంగా అమ్మ సంస్థలో కూడా భాగస్వామ్యాన్ని కలిగించింది.

నిత్యం అమ్మకు జరిగే అర్చనాదుల్లో అన్నయ్యకు పూజారిగా ఎంచుకొని అహర్నిశం అమ్మ సమక్షంలో వుండి అదృష్టాన్ని ప్రసాదించింది. ఒక సందర్భంలో

అమ్మ "వీడు అర్చన స్థానంలో వుంటే ఇది శివపూజ లేకపోతే శవపూజ" అన్నది. ఆ మాటలు విని నొచ్చుకున్నవాళ్ళతో "వాడు అర్చకుడుగా ఆస్థానంలో ఉంటే నేను నిశ్చింతగా యీ కుర్చీలో కూర్చుంటాను. ఆ స్థానంలో మరెవరైనా ఉంటే యీ కుర్చీలోవుండేది నా శరీరం మాత్రమే. నేను వెళ్ళి అర్చకుడిలో కూర్చుంటాను. రామకృష్ణకైతే, అన్నీ తెలుసు. ఎప్పుడు ఏమిచేయాలో, ఏది ఎట్లా చేయాలో వాడైతే నాకు హాయిగా ఉంటుంది" అని అన్నది అమ్మ. అమ్మ ఇచ్చిన ఈ నిర్వచనంతో ఆయన యొక్క వ్యక్తిత్వం అమ్మకు అన్నయ్య నందు కల అనురాగం, వాత్సల్యం నమ్మకం అవగతమౌతాయి.

కొండముది రామకృష్ణన్నయ్య అమ్మ దగ్గర కూర్చున్నాడు. ఆ సమయంలో శ్రీ ఎక్కిరాల వేదవ్యాసుగారు అమ్మ దర్శనార్థం వచ్చారు. అమ్మ ప్రక్కనే ఉన్న రామకృష్ణయ్యను చూచి తరువాత అమ్మతో "ఈ అబ్బాయి ఎవరో కానీ ఎక్కువ కాలం బ్రతకడనిపిస్తోందని" చెప్పారు. "నువ్వు ఎలా చెప్పగలవు?" అని అమ్మ అడిగింది. "నాకు అతని ముఖం చూస్తే అలా అనిపించిందని" చెప్పారు. అమ్మ అన్నయ్యను పిలిచి నీకు ఎవడైనా ఆప్తుడైన వాడు ఉన్నాడా? అని అడిగింది. దానికి అన్నయ్య "నాతో పాటూ ఇక్కడికి వస్తాడే గోపాలకృష్ణ మూర్తి, వాడే నాకు ఆప్తుడు" అని చెప్పాడు. మరి అమ్మకు ఈ విషయం తెలియకుండా ఉంటుందా? కానీ కర్తృత్వం తన మీద ఉంచుకోదు కదా! అందుకని వేదవ్యాసుగారి ద్వారా ఆ విషయాన్ని బహిర్గతం చేసింది.

గోపాలన్నయ్య వాళ్ళకు బాపట్లలో "లక్ష్మీప్రసాద్ బుక్ షాప్" ఉండేది. అమ్మ ఒక మనిషిని అక్కడికి పంపించి గోపాలన్నయ్యకు "నీవు ఒక్కడివే రమ్మని కబురుచేసింది. కబురు విన్నాక రాత్రి 9 గం॥లకు షాపు కట్టి, బస్సు ఎక్కి ఏడవ మైలురాయి దగ్గర దిగి ఆ చీకట్లో, డొంకల్లో, పాముల పుట్టల్లో పొదల్లో నడిచి వెళ్ళాలి. బ్రిడ్జి దగ్గర చీకట్లో తోవ తెలీక, కాలువ, పిల్ల కాలువల మధ్య 2 ని॥లు నిలుచున్నాడు. ఆ చీకట్లోనే తెల్లగా తోవ కనిపించింది. దాని వెంటే బయలుదేరి జిల్లెళ్ళమూడి చేరాడు.

అప్పటికి అమ్మ పూరింట్లో ఉండేది. బయట నుయ్యి దగ్గర కాళ్ళు కడుక్కొని అమ్మ దగ్గరకు వెళ్ళాడు. "నాన్నా అన్నం తిన్నావా" అని అమ్మ అడిగింది. "నేను షాపు నుంచి సరాసరి వస్తున్నానని" చెప్పాడు అన్నయ్య. అక్కడ ఉన్న అమ్మాయి చేత అన్నం తెప్పించి అమ్మ అన్నం కలిపి ముద్దలు పెట్టింది. రాత్రి **11** గం॥లకు అన్నయ్య అమ్మకు ఒక చేత్తో విసురుతూ, ఒక చేత్తో నడుము రాయటం మొదలు పెట్టాడు. అన్నయ్యతో అమ్మ "నీకు ఒక ముఖ్య విషయం చెప్పాలి నాన్నా. అందుకే కబురు చేసాను" అన్నది. "ఏమిటమ్మా!" అన్నాడు అన్నయ్య "నీకు ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు అన్నది" అమ్మ. ఫరవాలేదు చెప్పమ్మా అన్నాడు అన్నయ్య. శ్రీవేదవ్యాసుగారు రామకృష్ణన్నయ్య గురించి చెప్పిన విషయం గోపాలన్నయ్యకు వివరించింది అమ్మ.

అది విన్న గోపాలన్నయ్య అమ్మ పాదాల మీద పడి విపరీతంగా ఏడవటం మొదలు పెట్టాడు. అమ్మ కూడా కళ్ళనీళ్ళు పెట్టుకుంది. అమ్మ కంటతడి చూచిన అన్నయ్యకు దుఃఖం ఇంకా ఉధృతమయింది. ఆగదిలో ఉన్న అమ్మ ఫోటోలన్నింటిలో రామకృష్ణన్నయ్యే కనిపించాడు గోపాలన్నయ్యకు. ఆ తరువాత అమ్మ నువ్వు ఇప్పుడు ఏమి చేస్తావురా అని అడిగింది. "నీ ఇష్టం అమ్మా; నీవు ఏమి చెప్తే అది చేస్తాను" అన్నాడు. "ఈ విషయం వాళ్ళమ్మతో కూడా చెప్తే బాగుంటుంది నాన్నా" అన్నది అమ్మ. సరే అలాగే చెప్తానన్నాడు గోపాలన్నయ్య. వాళ్ళమ్మతో చెప్పి ఏం చెయ్యాలో ఆమెతో ఆలోచించి తనకు చెప్పమన్నది అమ్మ.

ఆ మర్నాడు గోపాలన్నయ్య అప్పికట్ల వెళ్ళాడు. రామకృష్ణన్నయ్యను జిల్లెళ్ళమూడి వెళ్తున్నాడని వాళ్ళమ్మ విపరీతంగా తిట్టేది. గోపాలన్నయ్యను కూడా ఎప్పుడూ తిట్టేది. అమ్మ చెప్పమన్న సంగతి ఆమెతో ఎలా చెప్పాలన్న మీమాంస, ఏమని చెప్పాలన్న ఆలోచనతో వాళ్ళింటికి వెళ్ళాడు గోపాలన్నయ్య. "ఏం పని మీద వచ్చావురా?" అని అడిగింది ఆమె. అప్పికట్ల హైస్కూలుకి పుస్తకాలు ఇవ్వటానికి వచ్చానని హెడ్‌మాస్టారుగారు ఉన్నారేమో చూసి చూసి వస్తానని వెళ్ళి ఊరికే అలా తిరిగి వచ్చాడు. "సంగతులేమిటిరా! వీడు జిల్లెళ్ళమూడి వెళ్ళి

వస్తానని ఇంకా రాలేదు. అక్కడే ఉన్నాడా?" అని అడిగింది. "అక్కడే ఉన్నాడు పిన్నీ. అక్కడ ఒక విషయం జరిగింది అది నీకు ఎలా చెప్పాలో అర్థంకావడం లేదు" అన్నాడు "ఫరవాలేదు చెప్పు" అన్నది ఆమె.

అమ్మ చెప్పమన్న సంఘటన అంతా తన ఎదుట జరిగినట్లుగా చెప్పాడు అన్నయ్య. ఆ సంగతి వినగానే ఆమెకు దుఃఖం ఆగలేదు. కొంతసేపటికి ఆమె తెప్పరిల్లుకొని "వీళ్ళ తాత, నాన్నా కూడా సరిగ్గా 25 సం॥లకే పోయారు. ఇప్పుడు అన్నయ్యకు 25వ సం॥మే. కరణీకం వొద్దు, వేరే ఉద్యోగం చూసుకోమని చెప్పాను వాడు వినలేదు. చివరికి ఇట్లా ముంచుకొచ్చింది. నేనేం చేసేది. నువ్వే ఏం చేయాలో ఆలోచించమని" గోపాలన్నయ్యకు చెప్పింది.

తెలిసిన వాళ్ళను కనుక్కొని, ఏం చేయాలో చూస్తానని బాపట్ల వచ్చాడు. చుండూరు రాఘవయ్యగారు, గోపాలన్నయ్య వాళ్ళు ఒకే ఇంట్లో అద్దెకుండేవాళ్ళు. కష్టసుఖాలు, మంచి చెడ్డలూ అన్నీ అన్నయ్య ఆయనతో చర్చించేవాడు. కొంతమంది మహనీయులు ముఖం చూడగానే చెప్పడం జరగుతుంది. మార్కండేయుడిని శివుడు బ్రతికించలేదా? అదే విధంగా వీడ్నీ ఏ శక్తో బ్రతికించగలదని, శివునికి అభిషేకాలు చేయించమని చెప్పారు.

జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మతో రామకృష్ణన్నయ్యతో ఈ విషయంచెప్పాడు. ఈ అభిషేకాలు ఏ శివునికో, ఎవరికో చేయను. అభిషేకాలు చేయవలసి వస్తే అమ్మకే చేసుకుంటానని, తన నిర్ణయం మారదని గంటాపథంగా చెప్పాడు" రామకృష్ణన్నయ్య. గోపాలన్నయ్యతో "అభిషేకాలు ఇక్కడే చేసుకుంటానన్నాడుగా ఆ ఏర్పాట్లు ఏవో నువ్వు చూడు" అన్నది అమ్మ.

బాపట్లలో 10 వారాలు మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు చేయించమన్నారు. 11వ వారము 11 మంది బ్రాహ్మలచేత మహారుద్రాభిషేకం చేయించమన్నారు. చుండూరి రాఘవయ్యగారు రామలింగ సోమయాజి అనే వృద్ధుడి దగ్గరకు వెళ్ళి విషయం చెప్పి మీరు వచ్చి అభిషేకాలు చేయించవలసిందిగా కోరారు. దానికి ఆయన బాపట్ల శివాలయంలో కానీ అప్పికట్ల శివాలయంలో

కానీ నేను వచ్చి చేస్తాను. అంతేకానీ ఒక వ్యక్తి పాదాలకు అభిషేకం నేను చేయించనని అన్నారు. చేసేవాడు అమ్మ పాదాలకు తప్ప ఇంక ఎక్కడా చెయ్యనంటున్నాడు. చేసేవాడు వాడు కదా! మీరు మంత్రం చెప్పడమే కదా! (మన మనస్సు ఎక్కడ లయం అయితే అదే ఆలయం) మీరే చేయించాలని కోరుకున్నారు. ఆయన రానన్నారు. దానితో బాపట్లలో ఉన్న బ్రాహ్మలు ఎవ్వరూ రావటానికి ఇష్టపడలేదు. రాఘవయ్యగారు నచ్చచెప్పటానికి ఎంతగానో ప్రయత్నించారు. కానీ ఆయన వినలేదు. ఆ సమయంలో గోపాలన్నయ్యకు విపరీతమైన కోపం వచ్చింది.

ఒక మనిషి మృత్యు ముఖంలో ఉన్నాడని తెలిసి మీరు గనుక రాకపోతే అదే విశ్వాసంతో అమ్మ నామం చెప్తూ, నా రక్తంతో వాడి చేత అభిషేకం చేయిస్తానని చెప్పాడు. ఆయన మంత్రాల వల్లే బ్రతికితే, దీనితో మాత్రం ఎందుకు బ్రతకడు అని ప్రతిజ్ఞ చేసి బయటకు వచ్చాడు. సోమయాజులుగారు దఢాలున తలుపు వేసారు. వెళ్ళిపోవటానికి గోపాలన్నయ్య 10 అడుగులు వేయగానే బుద్ధిమార్చుకుని ఆయనే రమ్మని కబురు చేసి "నేను అభిషేకాలు చేయించటానికి వస్తానని" చెప్పారు. గోపాలన్నయ్యకు ఆదివారం షాపుకు శెలవు కాబట్టి అభిషేకాలు ఆదివారం చేయించటానికి నిర్ణయం జరిగింది.

అభిషేకానికి కావలసిన సరంజామా అంతా తీసుకుని, సోమయాజులు గారిని తీసుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. సోమయాజులుగారు "నేను ఇంటికి వెళ్ళి భోంచేయాలి, నేను మరెక్కడా భోంచేయను, కాబట్టి నన్ను తొందరగా పంపించాలని" చెప్పారు.

జిల్లెళ్ళమూడిలో అమ్మ ఇంటి పక్కనే ఉన్న కుమారస్వామి మందిరంలో అమ్మకు పూజలు చేసేవారు. రామకృష్ణన్నయ్యకు జ్వరంగా ఉంది. సోమయాజులు గారికి ఇడ్లీ పెట్టమంది అమ్మ. అభిషేకం అయ్యేవరకూ ఏం తిననని, ఇంటికి వెళ్ళాకే భోంచేస్తానని చెప్పారు. అమ్మ వెంటనే ఆయనకు పాలు పంపించింది. ఆయన శివశివా అని కేకపెట్టి ఆపాలు తాగారు. అమ్మ స్నానం చేసి

పందుకొండున్నర గం॥లకు డయాస్ మీద కూర్చుంది. ఏకాదశ రుద్రాభిషేకం అంటే 3 గం॥లు కూర్చోవాలి. ఆయన కంఠం చాలా గంభీరంగా ఉంది. తన్మయత్వంలో మంత్రం చెప్పారు. రామకృష్ణన్నయ్య అమ్మ పాదాలకు అభిషేకం చేస్తున్నాడు. ఆ మంత్రాలు వింటూ గోపాలన్నయ్య 3 గం॥లు సేపు చేతులు కట్టుకుని అలాగే నిలుచున్నాడు.

అభిషేకం అయిన తరువాత అమ్మ పాదాలకు అభిషేకం చేసిన తీర్ధాన్ని వెండి గిన్నెలో పోసి ఉద్ధరిణెతో సోమయాజులు గారికి ఇచ్చింది అమ్మ. ఆయన చేయి ముందుకు చాపిన వారే మళ్ళీ వెనక్కు తీసుకున్నారు. అమ్మ ఉద్ధరిణెను అలాగే పట్టుకు కూర్చుంది. ఆయన కాసేపు అమ్మను చూసారు. మరి ఏమనిపించిందో ఏమో ఆయనే చేయి చాపి అమ్మ చేతులు మీదుగా మూడుసార్లు తీర్ధం తీసుకున్నారు. ఆ తరువాత రామకృష్ణన్నయ్యకు, గోపాలన్నయ్యకు, మిగిలిన వారికి తీర్ధం ఇచ్చింది. ఈ తంతు పూర్తయ్యేసరికి 3 గం.లు అయింది. "నాకు తాంబూలం ఇప్పించండి నేను వెళ్తాను" అన్నారు సోమయాజులుగారు.

అన్నపూర్ణాయంలో లక్ష్మీనర్సమ్మగారి చేత మడితో వంట చేయించాను, తిని వెళ్ళమన్నది. వీరు భోజనం పూర్తయి వచ్చే సరికి అమ్మ స్నానానికి వెళ్ళింది. అమ్మ స్నానం అయ్యేంతవరకూ బయట కూర్చున్నారు. అమ్మ స్నానానంతరం, అమ్మ తన చేతుల మీదుగా దక్షిణ తాంబూలం సోమయాజులుగారికి ఇచ్చింది. దానికి ఆయన అమితానందభరితులై "అమ్మా! నేను కాశీ వెళ్ళాను, రామేశ్వరం వెళ్ళాను, భారతదేశంలోని అన్ని పుణ్యక్షేత్రాలలోనూ అభిషేకాలు చేశాను. కానీఎక్కడా ఇంతటి ఆనందాన్ని పొందలేదు. అభిషేకం అయిన తరువాత శివసహస్రం పుస్తకం చేతిలో పట్టుకుని ఆయనకు తెలియకుండానే లలితా సహస్ర పూజ చేయించారు. అది విన్న గోపాలన్నయ్య ఏమిటన్నట్లు అమ్మను చూస్తాడు. అమ్మ ఊరుకోమన్నట్లు సంజ్ఞ చేసింది. సోమయాజులుగారే ఆ విషయాన్ని గ్రహించుకుని అమ్మ పాదాలకు మళ్ళీ మళ్ళీ నమస్కారం చేసుకున్నారు.

సోమయాజులు అంతటి నిష్టాగరిష్ఠుడు అభిషేకం చేయించారు కాబట్టి

బాపట్లలో ఉన్న బ్రాహ్మలంతా అభిషేకం చేయించటానికి ఉద్యుక్తులయ్యారు. 10 వారాలు ఇదే విధంగా జరిగాయి. 11వ ఆదివారం 11 మంది బ్రాహ్మలు దొరకాలి. మహారుద్రాభిషేకానికి పుష్కర నదుల నుండి జలం తెప్పించాలనుకున్నాడు గోపాలన్నయ్య. అన్ని నదులూ సముద్రంలో కలుస్తాయి. కన్యాకుమారి వద్ద మూడు సముద్రాలూ కలుస్తాయి. దానిని సర్వతీర్థమంటారు. అది తెచ్చి చెయ్యమని ఒకరు సలహా ఇచ్చారు.

గోపాలన్నయ్య కన్యాకుమారి వెళ్ళటానికి ప్రయాణమయ్యాడు. అమ్మ ఒక అడ్రస్ ఇచ్చి, మధురలో మీనాక్షి దేవిని దర్శించి ఆ అడ్రస్ గల ఆయన అక్కడ ఉన్నాడో, లేడో కనుక్కోమంది. మధురలో హోటల్‌లో బసచేసి ఆ అడ్రస్ కొరకు వెతుక్కున్నాడు. నంబర్లు మారడంతో వారిని కనుక్కోలేకపోయాడు. మీనాక్షి ఆలయంకు వెళ్ళాడు. లోపల పెద్ద క్యూ ఉంది. అందులో వెళ్ళి దర్శనం చేసుకోవాలంటే కన్యాకుమారికి వెళ్ళే రైలు తప్పిపోతుంది. ఏమీ పాలుపోక నిలుచున్నాడు ఇంతలో ఒకపండు ముదుసలి అటు వెళ్తూ "ఇక్కడ నిలుచున్నారేమని" అడిగారు. "నేను కన్యాకుమారి వెళ్ళాలి. నేను ఈ క్యూలో వెళ్తే ఆలస్యమౌతుంది. అందుకని ఆలోచించిస్తున్నానన్నాడు" అన్నయ్య. "నాతో రమ్మని ఆయన గుడిలోనికి తీసుకువెళ్ళి అమ్మవారి మెడలో వేసిన గులాబీ పూలదండ అన్నయ్య మెడలో వేసి, అమ్మవారి పాదాల మీద పూలు తలమీద వేసి, ప్రసాదం ఇచ్చారు. ఆయన ఆలయ ప్రధాన పూజారి అట. అమ్మ తన పిల్లలకు కావలసిన విషయాలలో ఎంత మెలకువను ప్రదర్శిస్తుందో పై సంఘటన వలన మనకు విశదమౌతుంది.

అమ్మవారు కళ్ళుమూసుకుని యోగనిద్రలో ఉన్నట్లుగా వుంది. అన్నయ్య జిల్లెళ్ళమూడిలో అమ్మకు దండవేసి, పూజ చేసుకుంటే అమ్మ సమాధిలోనికి వెళ్ళేది. అన్నయ్యకు అక్కడ కూడా అటువంటి అనుభూతే ఎదురయ్యింది. అన్నయ్య పదిరూపాయలు ఇవ్వబోతే ఇది అమ్మ ఆజ్ఞ అందుకు చేశాను, నేను డబ్బులు పుచ్చుకోను అని చెప్పారు పూజారిగారు. మీరు కొలిచే అమ్మవారు

జిల్లెళ్ళమూడిలో సజీవంగా ఉన్నది. నేను అమ్మ దగ్గరే ఉంటాను. మీరు వచ్చి అమ్మను దర్శించుకోమని గోపాలన్నయ్య చెప్పాడు.

మధుర నుంచీ అన్నయ్య కన్యాకుమారి వెళ్ళి ఒక పెద్ద బిందె, మూత కనుక్కొని మూడు సముద్రాలు కలిసే చోటికి వెళ్ళాడు. అప్పటికి వివేకానంద రాక్ మీద ఆలయం నిర్మింపబడలేదు. నీటిని ఎలా ముంచుకోవాలన్న సంధిగ్ధంలో అన్నయ్య వుండగా అమ్మ ఆదేశించిందా అన్నట్లుగా ఒక్కమారుగా ఒక పెద్ద అలవిరుచుకుపడి బిందెను నింపి వెనక్కి వెళ్ళింది. దానితో అన్నయ్య ఆనందానికి అవధులు లేదు. అమ్మ కరుణాకటాక్షాలను తలుచుకోగానే ఒళ్ళు పులకరించి అంజలి ఘటించాడు.

మహారుద్రాభిషేకం చేసే రోజు వచ్చింది. ఆ అభిషేకం చూడటానికి అమ్మ బిడ్డలందరూ వందలలో వచ్చారు. రామకృష్ణన్నయ్య బంధువులందరూ వచ్చారు. ఇప్పుడు హైమాలయం ఉన్న చోట స్టేజి వేసి అమ్మకు అభిషేకం చేయాలనుకున్నారు. చుట్టూ పందిళ్ళు వేసారు. ఆ రోజుకి పదిమంది బ్రాహ్మలే వచ్చారు. ఆ విషయం అమ్మకు చెప్పారు. "నేను స్నానం చేసి వస్తాను, ఎంత మంది వుంటే అంతమంది చేతే చేయించ"మన్నది అమ్మ. ఆ పదిమంది బ్రాహ్మలు మహన్యాసం చేస్తుండగా ఒక బ్రాహ్మడు నూతి దగ్గర స్నానం చేసి వచ్చి స్టేజీ ఎక్కి మహన్యాసం అందుకున్నాడు. ఆ దృశ్యం చూసేటప్పటికి గోపాలన్నయ్య పరమానంద భరితుడయ్యాడు. అమ్మ అన్నయ్య వంక చూసావా! అన్నట్లుగా చిద్విలాసం చేసింది.

అభిషేకాలయ్యి భోజనాలు పూర్తయిన తరువాత గోపాలన్నయ్య అమ్మ చేత తాంబూలాలు ఇప్పించాడు. 11వ ఆయన తాంబూలం తీసుకుంటా కానీ, అందులోని దక్షిణ మాత్రం తీసుకోను అన్నాడు. "నాకు మహారుద్రాభిషేకం చేస్తున్నారని చిలకలూరి పేటలో తెలిసింది. రాత్రికి రాత్రి పెదనందిపాడు వచ్చి అక్కడ బస చేసి అక్కడ నుండి జిల్లెళ్ళమూడికి నడిచి వచ్చాను. ఇంత ఆనందాన్ని పంచి ఇచ్చిన నీకు నేనేమి ఇవ్వగలను" అని ఆనందాశ్రువులు జాలువారుతుండగా

అమ్మతో అన్నాడు. "వాళ్ళివ్వటం కాదు నాన్నా! నేను ప్రసాదంగా ఇస్తున్నాను" తీసుకోమని చెప్పింది అమ్మ. రామకృష్ణన్నయ్య బంధువర్గమంతా ఉన్న సమయంలో రామకృష్ణన్నయ్యా వాళ్ళమ్మ అన్నయ్యను అందరమ్మ చేతిలో ఉంచింది. "ఇక నుంచీ ఈ పిల్లవాడు నీ పిల్లవాడే. చంపుకుంటావో, బ్రతికించుకుంటావో నీదే భారం" అని అమ్మకే అప్పజెప్పింది.

ఈ అభిషేకం జరుగుతున్నంత సేపూ నిలబడి మంత్రాలు వింటుంటే తనకే అభిషేకం జరుగుతున్నట్లు గోపాలన్నయ్యకు భావన కలిగింది. ఆ విషయం అమ్మతో చెప్పాడు. ఆ అభిషేకం చేసింది వాడు కాదు నువ్వే అని చెప్పింది. రామకృష్ణను వాళ్ళమ్మ కని నా చేతిలో పెట్టింది. మీ అందరినీ నేను కని మీ మీ తల్లులకు పెంపుడిచ్చాను" అన్నది అమ్మ. ఆ తరువాత రామకృష్ణ అన్నయ్య వాళ్ళమ్మ చాలాసార్లు అన్నయ్యను రమ్మని అడిగింది. "నీవు అమ్మకు దత్తత ఇచ్చావు కాబట్టి నేను రానని ఖచ్చితంగా" చెప్పాడు. "వాడు అప్పికట్లకు కరణం, నాకు ఉపకరణం" అని ప్రేమతో అమ్మ ప్రకటించింది.

**1966** జన్మదిన సంచిక, మే **5** కళ్యాణ దినోత్సవం. అప్పటి నుంచి మాతృశ్రీ పేరుతో మాస పత్రికలలు వెలువడ్డాయి. గోపాలన్నయ్య, రామకృష్ణన్నయ్య సంపాదకత్వ ఆధ్వర్యంలో అమ్మ సిద్ధిపొందే వరకూ అసంఖ్యాకంగా వెలువడ్డాయి. అన్నయ్య రాసిన మాతృశ్రీ సంపాదకీయాలన్నీ "మాతృసంహిత" అన్న పేరుతో గ్రంథం వెలువడింది. అవతారమూర్తి అమ్మ, అనసూయ కళ్యాణం, వాత్సల్యగంగ, శ్రీచరణకమలాలు, హైమాలయం, మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు మొదలగునవి రామకృష్ణ అన్నయ్య రచనలు. అమ్మ సినిమాకి అన్నయ్య రాసిన స్క్రిప్టు చూచి సినీ జగత్తులో ఎందరెందరో ప్రశంసించారు. అన్నయ్య రచన, శైలి దానిలోని మార్దవం మరియే ఒక్కరికీ రాదు. మొదలు పెడితే చివరవరకూ చదివించే వినూత్న శైలి అన్నయ్యకు అమ్మ ఒసగిన వరమే.

సంసారికమయిన, ఉద్యోగ సంబంధమైన బాధ్యతలు ప్రతిబంధకాలుగా

నిలిచినప్పుడు వాటిని తన విశ్వాసానికి పెట్టిన పరీక్షలుగా భావించి, ఆ బాధలను అమ్మకు పూజా పుష్పాలుగా నివేదించుకొని కర్తవ్య పథంలో నడచిన ధీరుడు రామకృష్ణ అన్నయ్య. అమ్మ భౌతికంగా దూరమయిన పిమ్మట అమ్మ అనుగ్రహంతో స్థాపించబడిన మాతృశ్రీ విద్యాపరిషత్, విశ్వజననీపరిషత్ మొదలైన సంస్థలను అమ్మ ప్రతిరూపాలుగా భావించి, వాటి సేవలో తుది శ్వాస విడిచిన కర్మయోగి మన రామకృష్ణన్నయ్య. "తమ కార్యంబు పరిత్యజించియు పరార్ధ ప్రాపకుల్ సజ్జనులు" అన్న భర్తృహరి మహాకవి సూక్తికి ఉదాహరణ మన రామకృష్ణ అన్నయ్య.

అమ్మ వారి పాదుకలు పూజచేస్తే అమ్మవారిని పూజించినట్లే. అమ్మ రెండు పాదాల్లో ఒకటి సుగుణం, రెండవది నిర్గుణం. ఒకటి అం. రెండవది ఆ. అం అనగా అంతులేనిది, ఆ అనగా ఆధారమైనదీ, అంతటా అవరించి ఉన్నది అని, ఆది, అంతము లేనిదని అర్థం. అమ్మ అనే మాటను జిల్లెళ్ళమూడి అమ్మ "అం ఆ" అని వ్రాసేది. ఆ అక్షర ద్వయమే భక్త కోటికి అభయాలై బీజాక్షరాలైనవి. ఆర్తుల పాలిటి కల్పవృక్షాలైనవి. ఉపాసనాపరులకు యోగ్యములై, ప్రశాంతిదాయకాలై, సూక్ష్మమోక్షోపాయాలైనవి.

అందుకే అన్నయ్య "అమ్మపాదాలు అమ్మకు ప్రతినిధులు కావు, ప్రతిధ్వనులు కావు, ప్రతిబింబాలు కావు. ఆ పాదాలు సాక్షాత్తు అమ్మే" ఆపాదాలను ఎప్పుడు చూచినా అమ్మలోని అందాలన్నీ నాకు కనిపిస్తాయి. కనుకనే ఆ పాదాలంటే నాకు అంత ఇష్టం. ఆపాదాలకేనా అర్చనలూ, ఆర్పణలు, నా వేదలనలు, నా నివేదనలు అని ఢంకా బజాయించి ఆశ్రీచరణ వైభవాన్ని తాను దర్శించటమే కాక తాను పొందిన ఆనందాన్ని లోకానికంతటికి పంచిపెట్టాలన్న తపనతో శ్రీ చరణ వైభం"ను ఆవిష్కరించాడు. ఆ జగన్మాత పాదాలలో అన్నయ్యకు చతుర్వేదాలు కనిపించాయి. ప్రణవనాదాలు వినిపించాయి. అమ్మపాదాలు అన్నయ్యకు సుమసామ్యాలు, అతిరమ్యాలు, భావనానాగమ్యాలు, సౌందర్యకేవధులు, చైతన్యనీరధులు, శ్రీనివాసాలు, ముక్తికాంతమంద హాసాలు,

వాత్సల్యకేతనాలు, కారుణ్య నికేతనాలు, నిత్యనూతనాలు. ఆ పాదాలకు పంచభూతాలు దాస్యం చేస్తాయి. ఆ పాదాలలో అణిమాది సిద్ధులు లాస్యం చేయిస్తాయి ఆపాదాలకు గుళ్ళల్లోకంటే గుడిసెల్లో నివాసము ఇష్టమన్న అన్నయ్య భావన వర్ణించినతీరు ఎంత ఉదాత్తమైనది.

వాత్సల్యామృతవర్షిణి అయిన అమ్మ అపారకృపా రసాన్ని అన్నయ్య పుక్కిటి బంటి తాగిన పుణ్యాత్ముడు. అమ్మనీడలో మార్జాల కిశోరన్యాయంగా, క్షేమంగా కాలం గడిపిన అన్నయ్య మర్కట కిశోరంగా పట్టు నేర్చుకొని అప్రమత్తంగా ఆవలిగట్టు చేరుకున్న ధన్యజీవి.

శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణయతీంద్రుల మాటలలో "అమృత మహాసాగరం, ఆ సాగదరంలోని ఉత్తుంగ తరంగం విరిసిన తెలినురువు శ్రీరామకృష్ణ. అమ్మ సర్వకామద, మహాకల్పవృక్షం. ఆ కల్పతరువు కొసకొమ్మ తొడిగిన ప్రసూనం శ్రీరామకృష్ణ. అమ్మ మహోన్నతహిమవచ్ఛృంగం, ఆ శృంగాన్నిసందిట పొదుపుకున్న మంచు శ్రీరామకృష్ణ" అని వర్ణించారు.

శ్రీ విశ్వజననీపరిషత్‌లో అన్నపూర్ణలయం, మాతృశ్రీపింటర్స్ ఆదరణాలయం మాతృశ్రీ మెడికల్ సెంటర్, చోటు చేసుకున్నాయి. మాతృశ్రీవిద్యాపరిషత్‌లో మాతృశ్రీ విద్యాలయం, మాతృశ్రీ ప్రాశ్చభాషాసెకండరీ స్కూలు, మాతృశ్రీ ఒరియంటల్‌కాలేజీ చోటు చేసుకున్నాయి. వాటి నిర్వహణ ఆయా సంస్థలకు అప్పచెపితే ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాగిపోతాందన్న ఉద్దేశంతో ఈ సంస్థలు ఏర్పాటు చేయబడ్డాయి. అన్నయ్య **1966** నుండి **1987** వరకు మాతృశ్రీ పత్రిక నిర్వహణలో ప్రధాన బాధ్యతను వహించి, సంపాదకీయం చేతబట్టాడు. ఆ సంపాదకీయాలన్నీ ''మాతృ సంహిత'' పేరన ముద్రించబడినాయి.

జిల్లెళ్ళమూడిలో **1970**లో ప్రధానమైన సంస్థలు రెండు ఏర్పడ్డాయి. ఒకటి శ్రీ విశ్వజననీపరిషత్, రెండవది మాతృశ్రీవిద్యాపరిషత్. శ్రీ విశ్వజననీ పరిషత్‌కు చాలాకాలం అమ్మే అధ్యక్షురాలు. అప్పుడు అన్నయ్య కొంతకాలం కోశాధికారిగా,

చాలాకాలం కార్యదర్శిగా వున్నాడు. అమ్మ అధ్యక్షపదవిని వదిలేసిన తరువాత అమ్మ అవతార పరిసమాప్తి చెందేవరకూ అన్నయ్యనే అధ్యక్షుడిగా చేసి అమ్మే కార్యక్రమాలు నడిపించింది.

మాతృశ్రీ విద్యాపరిషత్‌కు కొంతకాలం అధ్యక్షుడిగా, తరువాత అన్నయ్య మరణించేవరకూ కార్యదర్శిగా ఉన్నారు. సంస్థల నిర్మాణంలో, నిర్వహణలో, ప్రధాన బాధ్యతలు అప్పగించి "అవసరమైతే గడ్డిపోచద్వారా నా పనులు చేసుకుంటానని" 1973 ఏప్రియల్ 12న అమ్మ స్వర్ణోత్సవ సందర్భంగా లక్షమందికి ఒకే పంక్తిన భోజనాలు పెట్టిన చారిత్రాత్మక అపూర్వ సంఘటన అన్నయ్య జీవితంలో ఒక మైలురాయి.

"నా జీవితం అబద్ధం, చరిత్ర బద్ధం" అని ప్రకటించిన అమ్మ ఆ చరిత్రను గ్రంథస్థం చేసే అవకాశాన్ని అన్నయ్యకు అనుగ్రహించి, మాసపత్రిక సంపాదకత్వ బాధ్యతను అన్నయ్యకు అప్పగించింది. నా చరిత్ర పండితుడైన పామరుడు వ్రాయడు, పామరుడైన పండితుడు వ్రాస్తాడు అన్నది అమ్మ.

ఆ చరిత్ర సంభాషణల్లో వుండటంతో గుర్తించుకోవటం కష్టమౌతుందన్న పలువురు అభిప్రాయపడ్డారు. దాన్ని సంక్షిప్తం చేయుటకు , తరువాత చరిత్ర కూడా అమ్మే రాసుకుంటున్నది. పలికెడిది భాగవతమట, పలికించెడు వాడు రామభద్రుడట, నే పలికిన భవహరమగునట. నన్ను కలంగా ఎంచుకొని అమ్మరాయిస్తున్నది. అట్టి కారుణ్యామూర్తి కరుణను ఏమని వర్ణించగలను?

శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు శ్రీ చరణవైభవంకు అమృతాభిషేకం చేస్తూ పలికిన పలుకులు "శ్రీచరణ వైభవం ఒక భక్తిరస భరితమైన మానససరోవరంలో వికసించిన "సహస్ర పత్రకమల మిది. వెల్లివిరిసిన పాలవెల్లి గుండెల నుంచి ఆవిర్భవించిన "అమృత కలశమిది".

జీవన బృందావనమందలి మందార కుంజంలో నుంచి వీనుల విందుగా కనిపించే "వేణుగీతిక" ఇది. అమ్మకోసం అలమటించి, అమ్మను అవలోకించి, ఆశ్రయించి, అర్పించి, ఆరాధించి, అమ్మపాదాలకే అంకితమై అమ్మ అనురాగ

సరసిలో తేలియాడి, ఓలలాడి తన బ్రతుకును పండించుకున్న ఆసుకవి రామకృష్ణ ఒకరాజహంస లేదా పరమహంస, కాదా రామకృష్ణ పరమహంస, అవును సందేహం దేనికి? అమ్మ భక్తుడు శ్రీ రామకృష్ణపరమహంస" అని ప్రస్తుతించారు.

డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు "అమ్మ కనుమరుగైనప్పుడు" చెమటోడ్చి చేనుదున్నుతుండగా రైతుపట్టిన నాగలి ముక్కలైంది ఏటిన భూమిమీదే వదిలి నీరు గగన తలం చేరిందట. వస్తువు మాయమై నీడకు గాయమయిందట. ఈ ఒక్క వాక్యం చాలు. ఈ నూరేండ్ల ఆధునిక కవులకన్నా అన్నయ్య గొప్పవాడని చెప్పటానికి అని ఆయన అభిప్రాయాన్ని తెలియచేసారు.

జి.వి.యల్.ఎన్. విద్యాసాగర శర్మగారు అమ్మే సర్వంగా భావించిన శ్రీ కొండముది రామకృష్ణగారు, సర్వం అమ్మగా దర్శించటంతో తనవితీరక నిరంతరం కవితా తపస్సు చేస్తూ తత్వాన్వేషణలో శివ స్వరూపమైన జ్ఞానసిద్ధిని పొందిన మహామనీషి అని తెలియజేసారు.

డా॥ మోపిదేవి కృష్ణస్వామిగారు అన్నయ్య శ్రీ చరణవైభవానికి శుభాకాంక్షలు తెలియచేస్తూ "ఇది వచన కవిత కాదు. వచ్చిన కవిత. కొండముది నుండి వెలువడింది కాదు. ఆ కొండతుది నుండీ ఎగిసిపడినది. ఇది అక్షరాకృతి ధరించిన ఆరాధన. ఇది పలుకులు కట్టిన పారవశ్యం. ఇవి అమ్మలో అంతనూ చూసిన శ్రీరామకృష్ణ అంతటా అమ్మను చూస్తున్న దివ్యక్షణాలు. ఆ అమ్మ మధు వీక్షణాలు అని చెప్పారు.

మమకారానికి మరణం లేదు. అంటూ ఓంకార స్వరూపిణి అయిన అమ్మకు మరణం లేదు. విశ్వవ్యాప్తమైనదన్న సత్యాన్ని తెలియచేసాడు అన్నయ్య భక్తిజ్ఞానాల గురించి తెలియచేస్తూ

భక్తిమార్గం, జ్ఞానమార్గం వేరువేరై లేవురా
భక్తి అయినా జ్ఞానమయినా అమ్మ ఇంటిదారులే
అల్పమంటూ అధికమంటూ వేరువేరై లేవురా
రాయి అయినా రత్నమయినా- అమ్మకంటికి వెలుగులే.

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ అన్నయ్య గురించి "తన హృదయం నిండా అమ్మ ప్రేమను నింపుకుని, అమ్మ అడుగులో అడుగు వేసి అమ్మ ఆశయ సిద్ధికై జీవితాన్ని అర్పణ చేసిన సౌమ్యశీలి, త్యాగమూర్తి" అని కొనియాడారు. అమ్మను అంటిపెట్టుకుని సేవకునిగా, స్నేహితునిగా, మంత్రిగా, ఆత్మీయునిగా, తనయునిగా సంచరించి అమ్మ చెంత అత్యంత ఆత్మీయ స్థానాన్ని పొంది, అమ్మ భౌతిక దేహానంతరం కొంతకాలం విలపించాడు. తదుపరి అమ్మను చూస్తూ అమ్మ ఆశయాన్ని లక్ష్యాన్ని నెరవేర్చటానికి తీవ్రకృషి సలిపాడు. జిల్లెళ్ళమూడిలో అందరింట్లో అమ్మ లేదనుకునే బిడ్డలను చూచి ఆవేదనపడ్డాడు. ఆరాటం చెందాడు. అమ్మ ఆశయాన్ని నెరవేర్చలేకపోతున్నామనే బాధ అన్నయ్య ఆరోగ్యంపై దెబ్బతీసింది. రోగగ్రస్తమైన శరీరాన్ని కూడా లెక్కచేయకుండా ఆఖరిక్షణం వరకూ అమ్మకోసం తపించాడు. అమ్మ కోసం శ్రమించాడు. అమ్మలోనే ఐక్యమైపోయాడు. కొండముది రామకృష్ణ శరీరం త్యజించి చిరంజీవి అయినాడు. అతడు ధన్యజీవి, "అమ్మ బిడ్డలందరికీ ఆదర్శజీవి" అని కొనియాడారు.

అన్నయ్య ఏపని నిర్వర్తించినా ఎంతో సమర్ధవంతంగా, నిర్వహించేవాడు. సంస్థలో అణువణువు నిండి ఉండి తానే సంస్థకు ఒక మూలస్తంభమైనాడు. జిల్లెళ్ళమూడికి వచ్చిన వారి అవసరాలను కనుగొంటూ, వారి వారి ఆవేదనా ఆర్తిని బట్టి అమ్మ దర్శన భాగ్యం కలుగజేసేవాడు. అన్నయ్యకు గల పరిపాలనాదక్షత, నిరుపమానము. ఏ పని ఏవిధంగా చేయాలో, అది ఎవరి చేత ఎలా చేయించాలో అన్నయ్యకు తప్ప వేరొకరికి చేతకాదు. శత్రువుతో కూడా నవ్వుతూ మాట్లాడగలిగిన వితరణశీలి అన్నయ్య.

అమ్మ తాను సూర్యతాపంలో పరితప్తమవుతూ, ఆశ్రితులకు చల్లని నీడను అనుగ్రహించే తరువు, తనను శిలాఘాతాలతో బాధించినా వారికి సైతం తీయని ఫలాలనందించే వృక్షం కళ్ళముందు కదులుతుంది. తాను కాలిపోతూ మనకు వెలుగునిచ్చే క్రొవ్వొత్తి, తాను కరిగిపోతూ అరిగిపోతూ మనకు పరిమళాలను ప్రసరించే చందనపుచెక్క. మనమాలిన్యాన్ని తాను గ్రహించి మనలను శుభ్రపరిచే

పావన జాహ్నవి గుర్తుకువస్తాయి. అందువల్లనే తల్లి అంటే తరింపచేసేది. "మీరు బురద పూసుకున్నా, మరేమి పూసుకున్నా శుభ్రం చేయాల్సిన బాధ్యత నాదేనని" నిర్వచించింది అమ్మ. మంచి వాళ్ళను వాళ్ళ మంచి తనమే కాపాడుతుంది. వాళ్ళు లోకంలో ఎట్లాగు గౌరవింపబడతారు. చెడ్డవాళ్ళను నేను కూడా దగ్గరకు తీయకపోతే ఎట్లా? "అందుకే నాఒళ్ళోను, నా ఆవరణలోనూ వాళ్ళకు ఎప్పుడు స్థానం ఉందని" చెప్పింది. ఈ సృష్టి నాది అని ఉద్ఘాటించగలిగిన విశాలహృదయ, విశ్వకుటుంబిని, విశ్వజనని అమ్మ. అమ్మ సర్వజ్ఞ, సర్వవ్యాప్తిని, అమ్మ సర్వశక్తిమయి, అమ్మ ఘటనాఘటన సమర్ధ.

అమ్మదయ అపారంగా అన్నయ్య మీద వర్షించింది. ఆమె ప్రేమ సాగరపులోతులను ఆయన దర్శించాడు. విశ్వాసమే భగవంతుడు "అన్న సంపాదకీయంలో" అమ్మ దైవమనే భావం స్థిరం కావాలి. విశ్వసృష్టి, అభివృద్ధి పతనాలకు, సర్వానికి అమ్మే కారణమన్న ఆరూఢస్థితిరావాలి. నిరంతరం ఆ మూర్తినే అర్చించాలి. కన్నుమూసుకున్నా, తెరిచినా ఆ రూపం కనిపించాలి. తన పంచేంద్రియాలు సదా ఆ మూర్తికి్నఉన్ముఖమైవుండాలి. అహరహరమూ తన రోమ రోమమూ ఆ స్మరణతోనే పులకెత్తాలి. శరీరంలోని ప్రతి అణువు ఆ గానంతోనే పరవశించాలి. తన రక్తమాంసాదులు ఆ ధ్యానంతోనే కుతకుతా వుడికిపోవాలి. అదీ ఆరాధన అంటే సర్వకాల సర్వ అవస్థలయందూ తన సర్వశక్తులు "తన సర్వస్వం" అని నమ్మిన దాని కోసం అర్పించటమే ఆరాధన. ఆ అర్పణలో తాను పూర్ణాహూతి కావాలి. తాను అంటూ లేకుండా తన్మయమైపోవాలి అన్నాడు అన్నయ్య. అది ఎంత ఉదాత్తమైన భావము. దాన్నిమించిన యజ్ఞయాగాదులుకాని, దాన్ని మించిన యోగం కానీ, దాన్ని మించిన జ్ఞానం గానీ ఏముంటుంది. సర్వ సమర్పణ బుద్ధిని ప్రసాదించవలసినదిగా ఆ జ్ఞానమూర్తి ఆ మహేశ్వరి అయిన అమ్మనే వేడుకోవాలి.

నందిగామ నుండి వచ్చిన రమణారావు గారు "ఏదైనా ఒక పని జరగాలంటే మా కోరిక బలవత్తరంగా ఉండాలా లేక మీ సంకల్పం ఉండాలా?" అని తన సందేహాన్ని అడిగారు. దానికి అమ్మ నా "సంకల్పమే, ఏదైనా నేనేగా మీకిచ్చేది" అని సర్వ వ్యాపకత్వాన్ని సర్వజ్ఞతను తెలియజేసింది.

రామరాజు కృష్ణమూర్తిగారు గుంటూరు వాస్తవ్యులు. వీరు అమ్మ దగ్గర ఎంతో కాలం నివాసమేర్పరచుకున్నారు. అమ్మ యందు పరిపూర్ణ విశ్వాసంతో చివరి శ్వాస వరకు అమ్మ ధ్యాసతోనే కాలం గడిపిన వ్యక్తి. అమ్మ రూపం ఆయన స్మృతుల్లో అమ్మ చూపులో, అమ్మ ఆకారంలో ఎద నిండి పొంగి ఏదో హాయినిచ్చే మాధుర్యం కనులకు కమనీయమైన కుసుమకోమలం, హిమశీతలం అందించేది అని ఆయన విశ్వాసం. అమ్మను దర్శించుకొన్ని వారికి వారి వారి ఇష్ట దైవంగా చిన్న వయస్సు నుండే సాక్షాత్కరించేదన్న విషయం విదితమే కదా!

రామరాజు కృష్ణమూర్తిగారు నిరాశతో చచ్చిపోవాలనుకుని గుంటూరులో కరెంటు ముట్టుకున్నారు. సరిగా అదే సమయానికి అమ్మ జిల్లెళ్ళమూడిలో చెయ్యి విదిలించింది. ఆ విదిలింపు దెబ్బ కొమ్మూరు డాక్టరుగారికి తగిలింది. తరువాత రెండుమార్లు ఆత్మహత్యయత్నం చేసి విఫలులై జిల్లెళ్ళమూడి వచ్చి "నీవేమీ (సాయం) చేయవు, కనీసం చస్తానన్నా చావనీయవేం!". అని అమ్మను అడిగారు.

అమ్మ దర్శనానంతరం వ్యధ, అసంతృప్తి తొలగి ఆశా ఆనందాల తొలి మొలకలు వ్యక్తిలో తలయెత్తి ఇమిడిపోలేక, పొంగిపోలేక, పొంగి పొంగి యోచన అయి, ఆశయమై, ఆర్తి అయి ఆ వ్యక్తిలో రేగుతూ ముంచుతూ ఆ తల్లి పాదాల ముందు హృదయం విప్పకుండానే దానంతట అదే బహిర్గతమౌతుంది. తనలో తాను తపించినట్లు వ్యక్తిలోని జీవనలత పులకించి తొడిగిన లేమొగ్గరేకలు విప్పుకుంటూ సౌగంధికాలు అమ్మ దగ్గర విరజిమ్ముతుండేవి.

అమ్మ దర్శనమైన తరువాత మనలో విచిత్రమైన ఔన్నత్యం తోస్తుంది. ఆ సందర్శనలో ఈ బ్రతుక్కు ఒక అర్థం స్ఫురిస్తుంది. హృదయం విప్పి అమ్మ ముందు పరుచుకోవటంలో, మనస్సు విప్పి మాట్లాడుకోవటంలో ఎంతో గొప్ప తృప్తిని, శాంతిని పొందుతాము. మన బ్రతుకులు నిండుగా అనుభవించడానికి ఏదో అనిర్వచనీయమైనదీ, పొందదగినది వేరేవుందని తెలుస్తుంది.

రామరాజు కృష్ణమూర్తిగారు సూర్య భాస్కరరావు గారిని జిల్లెళ్ళమూడికి తీసుకువచ్చారు. అమ్మను దర్శించటానికి వచ్చేటప్పటికి అమ్మ సమాధి అవస్థలో ఉంది. తరువాత మామూలు స్థితికి వచ్చి వీరేమీ చెప్పకుండానే "బాపట్ల బస్సులో

వస్తుండగా భాస్కరరావుగారికి దేహ స్మృతి కోల్పోయి అలౌకికానుభూతి కలిగింది. వారి హృదయం నుండి తామర పుష్పం వికసించి గగన తల శిఖరాగ్రానికి వెళ్ళినట్లు కాడ మాత్రం వారి హృదయంలోనే ఉన్నట్లు అనుభూతి అయింది" దానినే అమ్మ పూసగుచ్చినట్లు చెప్పింది.

భాస్కరరావు గారికి ఆశ్చర్యం వేసింది. సర్వజ్ఞత్వాన్ని గురించి విన్నది ఇక్కడ అనుభవించారు. ఈ కుగ్రామంలో ఉన్న అమ్మకు ఇవన్నీ ఎలా తెలిసాయి అనుకున్నారు. అమ్మ భాస్కరరావుని "ఏమి సాధన చేశావు?" అని అడిగింది. దానికి వారు "నేను ఏమీ చేయలేదు. ఆధ్యాత్మిక గ్రంథాలు, మహనీయుల పుస్తకాలు చదువుతుంటాను" అన్నారు. "పుస్తక జ్ఞానం అనుభవం కాదు నాన్నా" అన్నది అమ్మ. అమ్మ స్వరం మానవ స్వరానికి అతీతంగా, ఆ స్వరంలోని మాధుర్యం తమ హృదయం లోనికి దూసుకుపోతున్నట్లు అనిపించింది. వంట చేసి తాను క్రింద కూర్చుని వీరికి పీట వేసి అన్నం కలిపి ముద్దలు పెట్టింది. పొయ్యి దగ్గర కూర్చుని వారికి గిన్నె, గరిటె, కట్టెలు, పొయ్యి చూపించి ఇవే నా సాధన సామగ్రి అన్నది అమ్మ. "రుక్మిణి అంటే ఋగ్వేదము" అన్నది అమ్మ నిప్పులతో ఉన్న కుంపటిని చేత్తో బయట పెట్టింది అమ్మ. కాల్చిన బంగారం లాగా ధగధగా మెరుస్తూ ఉంది అమ్మ శరీరం అనుకున్నారు భాస్కరరావు గారు.

భాస్కరరావు గారు ఒక నులక మంచం మీద కూర్చుని ఉంటే "ఏం నాన్నా జ్వరంగా ఉందా" అని అమ్మ అడిగింది. ఆయనకు అమ్మను చూడగానే చలి జ్వరం వచ్చిన వాళ్ళలాగ మనిషంతా వణికి, అశ్రుధారలతో చెంపలు తడిసాయి, ఒళ్ళు పులకరించింది. ఆయనలో ఆయనకే తెలియని అనుభూతి కలిగింది. "మీ కోసం నేనేమీ తీసుకురాలేదమ్మా" అని బాధపడ్డారు. "వికసించిన హృదయ పద్మాన్ని తెచ్చావుగా నాన్నా" అన్నది అమ్మ. దాంతో ఆయనకు అంతమటుకు ఉన్న వ్యధ తొలగి దాని స్థానే ఆనందం పొంగి పొర్లింది. వంట ఇంటి దగ్గర కూర్చున్న కృష్ణమూర్తి గారితో "భాస్కరాన్ని ఇక్కడకు తీసుకువచ్చావు. నీవు ధన్యజీవివిరా!" అని ప్రశంసించింది. "నాన్నా! భాస్కరా నాకు శరీరాన్ని వదిలిపెట్టాలని ఉన్నది" అన్నది అమ్మ. "శరీరాన్ని మార్చాలి కానీ వదలవద్దని

అరవిందులు చెప్పారని" చెప్పారు. రఘువర దాసుగారి శిష్యులు అమ్మ దగ్గర తన్మయంగా నామం చెయ్యటం మొదలు పెట్టారు. ఆ సమయంలో అక్కడే ఉన్న నల్ల కుక్క జనంలో నుంచి వచ్చి అందరి ముందు తన్మయంతో నాట్యం చేసింది.

నాలుగు రోజులుండి వెళ్తున్న వీరితో "కార్తీక పూర్ణిమకు రండి" అని చెప్పింది. కార్తీక పౌర్ణమికి భాస్కరరావు గారు వస్తే అమ్మవారి నుదుట భృకుటి స్థానంలో బ్రొటనవేలు పెట్టింది. వెంటనే వారు భావ సమాధి పొందారు. ఆ స్థితిలో అనేక రంగురంగుల కాంతులు కనపడ్డాయి. ఈయన అమ్మ వద్ద కూర్చుని మహాత్ముల గ్రంథాలు చదివి వినిపిస్తుంటే "నాకు కర్పూర హారతి ఇస్తున్నావురా" అనేది అమ్మ.

పూర్ణిమ నాడు అమ్మతో పాటూ అందరూ కాలువకు వెళ్ళారు. చాలా లోతుగా ఉన్న కాలువలో అమ్మ నీటి మీద తేలుతూ వెళ్ళటం చూసి ఆశ్చర్యపోయారు. కుంకుం పొట్లాలు దగ్గర పెట్టుకుని "నాన్నా నీకు పటిక బెల్లం ఇస్తున్నానురా" అంటూ ఆ కుంకుమ పొట్లాల నుండి ఒక పొట్లం ఇస్తే అందులో పటిక బెల్లం ఉంది. కార్తీక పౌర్ణమి నాడు అందరితో పాటూ అమ్మ వీరికి కూడా మంత్రం ఇచ్చింది.

సాయంత్రం 5 గంటలకు ఆయుర్వేదం డాక్టరు సాంబయ్య వలివేరు రెడ్డి మొదలగు వారు కూర్చుని ఉండగా అమ్మ సాంబయ్యను చూస్తూ " ఈ ఊళ్ళో వాళ్ళకు నేను దాటిన తరువాత ఈ ఇళ్ళల్లో ఎవరుంటారు అని సందేహం కలుగుతోందిరా!" అని అన్నది. "ఆ తరువాత మంత్రిణితో వచ్చిన ఆయన ఆంధ్ర దేశంలోకెల్లా ఇది మహాక్షేత్రమౌతుందని చెప్పారు. నీళ్ళు లేవు. ఇంత మొండి కేసుకున్నదేమిరా. ఈ కప్పలు చచ్చిన నీళ్ళు తాగుతూ ఉండటమేమిటి?" అని అన్నారు. "డ్రైన్ కాలువ దాకా ఇళ్ళు పడితే అక్కడ నుండి నీళ్ళు తెచ్చుకుంటే, అదే జీవనది అయితే" అన్న అమ్మ మాటలకు సాంబయ్య ఎటూ జీవనదేగా మానవ రూపంలో ఉండటంతో తెలుసుకోకపోతున్నారన్నాడు. అమ్మ యందు అచంచల భక్తి విశ్వాసాలు కలవాడు సాంబయ్య (అనసూయా వ్రతకల్పంలో సాంబయ్య గారి గురించిన వివరణ ఉంది.)

సీతాపతి తాతగారు అనారోగ్యంతో బాధపడ్తున్నారు. అమ్మవారిని చూడటానికి బాపట్ల వెళ్ళింది. అప్పటికే అమ్మ గురించి విన్న వాళ్ళు అమ్మ దర్శనానికి వచ్చేవారు. బాపట్లలో ఒక స్వామీజీ అమ్మతో మాట్లాడాలని, ఆమె గృహిణి, వారు సన్యాసి కనుక వారితో అమ్మ మాట్లాడుతుందో, లేదోనని సందేహాన్ని వ్యక్తీకరించారు. ఆ విషయం విన్న అమ్మ "వారు బిక్ష ఎక్కడ తీసుకుంటున్నారు?" అని ప్రశ్నించాంది. దానికి ఆ కబురు చెప్పిన ఆమె "మా అందరి ఇళ్ళల్లో బిక్ష పుచ్చుకుంటున్నారు" అని చెప్పింది. "మీరూ గృహిణులే కదా!" అంది అమ్మ.

అప్పారావన్నయ్య 1957లో మొదటిసారిగా అమ్మను దర్శించాడు. అప్పటి నుంచీ మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేది. అందుకని 1961 వరకూ అప్పుడప్పుడు అమ్మను దర్శించేవాడు. 1961లో శ్రీరామ మంత్రోపదేశం పొంది అహర్నిశలు రామనామాన్ని జపించేవాడు. ఇంక ఎక్కడికీ వెళ్ళాలన్న కోరిక కలగనందున 1961 నుండీ 1971 వరకూ జిల్లెళ్ళమూడి కూడా వెళ్ళలేదు. వృత్తిరీత్యా 1967లో ఏలూరు చేరాడు. 1971 నుంచీ అమ్మ మహిమలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. దానితో అమ్మను చూడాలన్న కాంక్ష కలిగింది.

అమ్మ దర్శనానికి జిల్లెళ్ళమూడి వెళ్ళాడు అన్నయ్య. ఈ మారు అమ్మ వినూత్నంగా కనిపించింది. అమ్మ కరుణారస వీక్షణాలు అన్నయ్యపై వర్షిస్తున్నాయి. ఆ కరుణారస తరంగాలలో తనువు పునీతమై అన్నయ్య ఒడలు మరిచాడు. అమ్మ పాదాలు రామ పాదాలుగా భాసిస్తున్నాయి. రామాయనమః రామ భద్రాయనమః సీతాపతయే నమః అంటూ అన్నయ్య చేతులు అప్రతయత్నంగా అమ్మ పాదాలను పూజిస్తున్నాయి. అక్షులు అశ్రువులతో చేస్తున్నాయి. అన్నయ్య చేతల మీద తన అధికారం లేదు. చేతులు అన్నయ్యవే కానీ చేతలు అన్నయ్యవి కావు.

ఇంతకాలం అన్నయ్యను ఆదుకొని రక్షిస్తున్న దయా సముద్రుడగు రామచంద్రుడే మాతృప్రేమను వర్షిస్తూ కరచరణాదులతో అమ్మగా జిల్లెళ్ళమూడిలో ఉన్నాడని ధృవీకరింపబడడంతో ఆనందంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు.

1975లో అన్నయ్యకు అంతా అమ్మ మహిమే. ఆరోజుల్లో ఆంధ్రా బ్యాంక్ మేనేజర్ రామబ్రహ్మంగారితో పరిచయమేర్పడింది. రామబ్రహ్మం గారు కర్మయోగి, విధి నిర్వహణను నిజాయితీతో పాటించేవారు. అమ్మను గురించిన అధ్యయనం చేయటంతో ఒకరితో ఒకరికి బాగా సన్నిహిత్యం పెరిగి ఏకోదరులుగా మెలగసాగారు. అమ్మ నామ సప్తాహాలు, ఏకాహాలు అన్నీ ఎంతో ఉత్సాహంతో నిర్వహించేవారు.

రామబ్రహ్మంగారు అమ్మ దగ్గర వున్నప్పుడు ప్రసంగవశాన అమ్మ "అప్పారావు ఎంతో పరిశోధన చేశాక నా దగ్గర స్థిరపడ్డాడు" అని చెప్పింది. దానికి రామబ్రహ్మంగారు "అప్పారావన్నయ్యకు భద్రాచలంలో అమ్మే, అమ్మే, అమ్మే, అని మూడుసార్లు అనిపించాకనే నీ దగ్గర స్థిరపడ్డానని నాతో చెప్పాడు" అని అమ్మతో అన్నారు. కేవలం అనిపించడం "కాదు నాన్నా! వాడికి మూడుసార్లు వినిపించింది కూడా" అని చెప్పింది. ఆ విషయం ఆయన అప్పారావన్నయ్యతో చెప్పారు. అప్పుడు ఆయనకు అనిపించటమే కాదు వినిపించింది అన్న సంగతి జ్ఞప్తికి వచ్చింది.

ఈ సంగతి అప్పారావు అన్నయ్య ఎవరికీ చెప్పలేదు. మరి అమ్మకి ఎలా తెలిసింది. అదీ ఒక్క రామబ్రహ్మంగారికి మాత్రమే చెప్పారు. కరుణామయి అయిన అమ్మ అనుగ్రహం మనకున్నంత మటుకు అమ్మ సర్వాంతర్యామి అని ఆనాటి నుండీ అమ్మయే గురువు, అమ్మయే దైవం, అమ్మయే తల్లి, అమ్మయే సర్వంగా అర్పించుకుంటున్నాడు అప్పారావన్నయ్య.

అమ్మ సన్నిధిలో శ్రీ శ్రీ లక్ష్మణయతీంద్రులవారు చాలా ఉత్సాహంగా ఉపన్యాసం చేస్తున్నారు. మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీ జిల్లెళ్ళమూడి వారు శ్రీశ్రీ లక్ష్మణయతీంద్రుల వారిని సన్మానిస్తూ చాలా పెద్దసైజు పువ్వులదండ మెడలో వేశారు. అందరి దృష్టి వారి ఉపన్యాసం పైనే ఉంది.

అమ్మ దృష్టి మాత్రం స్వామివారి మెడకు వ్రేలాడుతూ వున్న దండ వెనుక ఉన్న త్రాడుపై పడింది. అలా మెడ ఒరుచుకు పోవడం అమ్మ చూడలేక పోయింది. అక్కడే వున్న ఒక విద్యార్థికి అమ్మ సంజ్ఞ చేయగా ఆ విద్యార్థి లేచి స్వామి వారి

మెడకు వ్రేలాడుతున్న దండను వెనక్కు జరిపాడు. అప్పుడు గాని యతీంద్రుల వారికి తన మెడ ఎంత ఒరుచుకుపోతుందో తెలియలేదు.

వెంటనే శ్రీశ్రీ లక్ష్మణతీంద్రుల వారు అనందంతో ఇది అమ్మంటే అని మాతృ ప్రేమను సభికులకు తెలియజేశారు. "బిడ్డల బాధను చూడలేనిది అమ్మే కదా!".

"మన ఏవ మను ష్యాణాం కారణం బంధ మోక్షయోః"

భగవద్గీత మానవుల బంధ మోక్షములకు మనస్సే కారణం అని ఉపదేశిస్తున్నది. అమ్మ జీవిత ఘట్టాలలో ఈ భగవద్గీతా ఉపదేశం రూఢి అయింది.

"ఒకనాడు అప్పారావన్నయ్య అమ్మ దర్శనానికి జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. వాత్సల్యాలయంలో అమ్మ మంచం మీద పడుకొని ఉన్నది. అమ్మను చూడటంతోనే అమ్మ అనారోగ్యంగా ఉందని తోచింది. అమ్మ బాగా నీరసించింది. కళ్ళెను ఉమ్మి వేయటానికి కూడా అమ్మ లేచి కూర్చోలేని స్థితిలో ఉంది. వసుంధరక్కయ్య అమ్మకు సపర్యలు చేస్తున్నది.

ఎవరు దగ్గరకు వెళ్ళినా ఆప్యాయంగా మాతృ ప్రేమతో ఆదరించే అమ్మను ఆనాడు అట్టి అనారోగ్య స్థితిలో చూచేటప్పటికి అన్నయ్యకు దుఃఖం పెల్లుబికి వచ్చింది. "గద్గద స్వరంతో 'అమ్మా' అని పిలిచి ఎలా వున్నది?" అని అడుగుతూ దుఃఖాన్ని ఆపుకోలేక దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. "నేను కులాసాగానే ఉన్నాను నాన్నా?" అని అమ్మ తన సహజ ఆప్యాయతతో తలనిమురుతూ అన్నది.

"అమ్మా! నన్ను తృప్తిపరచడానికి అంటున్నావు గానీ బాధ స్పష్టంగా కనిపిస్తుదమ్మా" అని అన్నాడు. దానికి అమ్మ కులాసాగా వున్నాను అన్నాను గానీ బాధ లేదన్నానా! కులాసా అనేది మనస్సుకు సంబంధించినది. బాధ అనేది శరీరానికి సంబంధించినది అని అమ్మ వివరించింది. శారీరక బాధలు మనస్సు మీద ప్రభావం కలుగజేయునపుడు వారు మహర్షులే కదా! అమ్మ విషయంలో గీతా వాక్యం ఎంత అనుభవైక యోగ్యంగా వుందో అపుడు అన్నయ్యకు అర్థమయింది.

"సర్వం కల్విదం బ్రహ్మ - కనిపించే దంతా అదే - అమ్మ"

అమ్మ చెప్పే "కనిపించేదంతా అదే" అనే ఉపనిషత్ వాక్యం అన్నయ్యకు అవగతమయ్యేది కాదు. ఒకసారి శ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులు, అన్నయ్య ఇద్దరూ కలసి అమ్మ దర్శనానికి జిల్లెళ్ళమూడి బయలుదేరారు. స్వామివారు అనేక వేదాంత నిఘూఢ రహస్యాలు వివరిస్తూంటే అమ్మ చెప్పే మాటలలోని నిఘూఢమైన విషయాలు బోధపడుతూ వున్నాయి. అన్నయ్యకున్న అనుమానాలను నివృత్తి చేసుకుంటూ వున్నాడు.

ఉభయులు అమ్మ సన్నిధికి చేరారు. అమ్మ ఆప్యాయతతో స్వామి వారి తలనిమురుతూ వాత్సల్య గంగలో ముంచివేసి స్వామివారిని తన మంచంపై ప్రక్కనే కూర్చోపెట్టుకుని ఒక పట్టు చీరను స్వామివారిపైన కప్పింది. "అమ్మా వేదాంతపరమైన నిఘూఢ విషయాలలో అప్పారావుకు చాలా అనుమానాలున్నాయి. నీవే తీర్చాలి" అని యతీంద్రుల వారు అమ్మను కోరారు. స్వామివారు అన్నయ్య గురించి అమ్మకు చెప్పడంతో అన్నయ్య మనస్సు ఆనందోత్సాహాలలో మునిగిపోయింది.

ఆహా సాక్షాత్తు జగన్మాత అయిన అమ్మతో ఉపదేశమా! ఎంత అదృష్టవంతుణ్ణి అని పరవశించి అమ్మకు దగ్గరగా జరిగి అమ్మా "అంతా అదే అంటున్నావు కదా! అలా అనిపిస్తూందా! అనుకోవడమా! అని అడిగాడు. దానికి అమ్మ "అనిపిస్తుంది నాన్నా!" అని అమ్మ సమాధానం. అక్కడే వున్న వసుంధరక్కయ్యను పిలిచి వసుంధరక్కయ్య చేతికి వున్న ఒక బంగారు గాజు తీసుకోని "ఇది ఏమిటి? నాన్నా అని అన్నయ్యను అడిగింది. గాజు అని సమాధానం చెప్పాడు. "బంగారం కదా" అని అమ్మ అన్నది. అవును. బంగారమే గాజుగా అయింది అన్నాడు. అన్నయ్య "మట్టికదా" అని అడిగింది అమ్మ. నిజమే మట్టిలోనించే కదా బంగారమొచ్చింది కనుక దీని మూలపదార్థం మట్టి అని అంగీకరించాడు అన్నయ్య.

మట్టి కూడా పంచభూతములలో ఒకటే కదా ఈ సృష్టి అంతా పంచ భూతములతో కూడినదే కదా నాన్నా ! అంటూ అమ్మ వివరిస్తూ వుంటే "నిజమే

అనిపించింది. "కనిపించేదంతా అదే అయితే కళ్ళుమూత లెందుకు నాన్నా! అన్న అమ్మ మాటలు స్మృతి పథంలో వెలిగింది. అమ్మను ఆశ్రయించిన అన్నయ్యకు ఆ అనుభూతి అవటంతో ఆశృవులతో అమ్మ పాదాలను అభిషేకించాడు.

"ముందు అనుకోనాన్నా తరువాత అనిపిస్తుంది" అని అమ్మ హామీ ఇచ్చింది. మర్నాడు ఏలూరు చేరాడు అన్నయ్య. అమ్మ ఉపదేశం అనుక్షణం చెవులలో మారుమ్రోగుతూ వుంది. ఆ రోజు లగాయతు అమ్మ చెప్పిన ప్రకారం కనిపించే ప్రతి వస్తువును అక్కడ అదే అనుకుంటూ సాధనకు ఉపక్రమించాడు.

అప్పారావన్నయ్య ఏలూరులో స్థిరనివాసమేర్పరుచుకున్నాడు జీవితంలోని ప్రతి సంఘటనను - అమ్మ సూక్తులకు సమన్వయం చేసుకునే సాధకులు. అమ్మ కటాక్షాన్ని పొందిన వ్యక్తి. అమ్మ యందు అనురక్తి, భక్తి అపారము. ఏది వచ్చినా అమ్మ ప్రసాదమేనని స్వీకరించగలిగిన స్థితప్రజ్ఞుడు. అమ్మ సర్వాంతర్యామి అని అమ్మే గురువు, అమ్మే దైవం, అమ్మ తల్లి తండ్రి, అమ్మయే సర్వసంగా అర్పించుకుంటూ అమ్మ అనుగ్రహం ఎప్పటికో? అని నిరీక్షణలో కాలంగడుపుతున్న భాగ్యశాలి. అప్పారావన్నయ్య.

అమ్మకు ఆరోగ్యం సరిగా లేనందున అన్ని ఊళ్ళల్లో అమ్మ గురించి అభిషేకాలు, పూజలు, పారాయణలు, వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు మొదలైనవి ఎన్నెన్నో అమ్మ బిడ్డలంతా ఉడతా భక్తిగా చేసారు. విశాఖపట్నంలో పదకొండు మంది ఋత్విక్కులచేత మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు భీమేశ్వరాలయంలో జరిపించాము.

ఏలూరులో అప్పారావు అన్నయ్యకు అమ్మ నామం చేస్తే అమ్మకు ఆరోగ్యం బాగుంటుందని నమ్మకం ఏర్పడింది. నాలుగు సార్లు ఏకాహాలు, రెండు సార్లు విశేష పూజలు, నలభై రోజులు దీక్ష తీసుకున్నారు. వారింట్లో వారం వారం సత్సంగం చెయ్యటం రివాజు. ఒక్కొక్కరింట్లో ఒక్కొక్కటి చేయసాగారు. కమలమ్మ గారింట్లో ఏకాహానికి అప్పారావు అన్నయ్యకు ఆరోగ్యం సరిగా

లేకపోయినా అమ్మకు తగ్గాలన్న తపనతో ఏకాహంలో పాల్గొన్నారు. ఆ రాత్రి ఒంటి గంటకు తాను పైన ఉండి ఆనందంతో ఏకాహాన్ని అందులో అనారోగ్యంగా ఉన్న తన దేహాన్ని తానే చూచుకుంటూ ఆనందిస్తున్నట్లుగా దృశ్యమానమైంది.

అమ్మ నెల్లూరులో వైద్యం కోసం డా॥ శిష్ట్లా సుబ్బారావు గారింట్లో ఉన్నది. అమ్మకు గ్లాక్సో కంపెనీ మందులు వాడుతున్నారు. వాటి ప్రొడక్షన్ ఆపివేయటంతో ఆ కంపెనీ మందులకు కొరత ఏర్పడింది. ఎక్కడా దొరకలేదు. చిన్న ఊళ్ళల్లో దొరుకుతాయన్న ఉద్దేశ్యంతో అప్పారావు అన్నయ్యకు ఫోను చేశారు. ఈ లోగా బొంబాయి నుంచి ఫ్లైట్ ద్వారా మద్రాసుకు - అక్కడి నుంచి నెల్లూరుకు పంపించారు. ఆ మందులు వాడుతున్నా అమ్మకు ఎటువంటి గుణం కనిపించలేదు. "నెల్లూరు డాక్టరు గారు ఈ మందులు వాడితే తగ్గాలమ్మా, ఇవి ఎందుకు పనిచెయ్యటం లేదో అనూహ్యంగా ఉంది. నీవే తగ్గించుకోమ్మా" అని ప్రార్థించారు.

అంతలో అప్పారావు అన్నయ్య మందులు పట్టుకువెళ్ళారు. "ఈ మందులు వాడండి నాయనా నాకు తగ్గుతుందని" అమ్మ డాక్టరు గారితో చెప్పింది. ఇప్పటి వరకూ ఆ మందులేనమ్మా వాడింది అని డాక్టరుగారు అన్నారు". నాన్నా నాకు తగ్గాలని ఎంతో ఆర్తి, ఆవేదనలతో అల్లాడిపోతూ వాడు ఆ మందులు తెచ్చాడు. నాకు మందులు కాదు వాటి వెనుక ఉన్న ఆర్తి, ఆవేదనలే పనిచేస్తాయని" అమ్మ తెలియజేసింది.

అహర్నిశలు అమ్మకోసం తపించే ప్రేమ బంధుర హృదయ స్పందనానికీ తల్లి బిడ్డల మధ్య అలరారే మధుర మధుర మహనీయ మమతానుబంధం అవగతమౌతుంది. ఆ పరమ కారుణ్యమూర్తి మృదు హృదయాంతర్గత లలిత లలిత భావలహరిలో ఒక్క వాత్సల్యారసామృత బిందువునైనా చవిచూడ కలిగితే జన్మ ధన్యత చెందుతుంది.

మనం యోగ సాధనను గురించి వింటుంటాం. యోగమంటే ఏమిటి? ద్వంద్వా తీత స్థితియే యోగం. అదే స్థిత ప్రజ్ఞత్వం. గీతలో కూడా "సమత్వం,

యోగ ఉచ్యతే" అని చెప్పబడింది. లాభాలాభాలలో, జయాపజయాలలో, రాగద్వేషాలలో, సుఖదుఃఖాలలో సమాన స్థితి యోగం. భక్తియోగమైనా, కర్మయోగమైనా, రాజయోగమైనా మరి ఏ ఇతర యోగికైనా పరమార్థమిదే. ఈ మహాయోగాన్ని అమ్మ ఆచరణ రూపంలో అలవోకగా, హాస్యోక్తులతో రంగరించి, మధురమధురంగా బోధించి సుసాధ్యం చేసింది. అమ్మ దర్శనానంతరం మనకేది అవసరమో అది సంపూర్ణంగా లభిస్తుంది. మనం ఎక్కడ నుండి చేసే సాధనలకైనా సాధ్యం అమ్మే కదా! మన సాధన లక్ష్యాన్ని ఇక్కడ సాకారంగా చూడగల్గడం విశేషం.

మురాల నారాయణ రావుగారు యోగభాగ్యం, ప్రాణాయామం చేసేవారు. అనేక ఆశ్రమాలు తిరిగి యోగ విద్యలో నిష్ణాతులై నియమ బద్ధ జీవితాన్ని గడిపే మధ్య తరగతి గృహస్తు. ఇయనకు షిర్డీబాబా, అమ్మ దర్శనమిస్తుండేవారు. అప్పారావు అన్నయ్యతో స్నేహం ఏర్పడింది. ఇద్దరూ అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మదగ్గర అప్పారావన్నయ్య మాట్లాడుతున్నారు. నారాయణరావుగారు కళ్ళు మూసుకుని ధ్యానం చేసుకుంటున్నారు. 5 ని॥ల తరువాత అమ్మను ఏమైనా అడుగుతారా అని అప్పారావన్నయ్య అడిగాడు. దానికి ఆయన "అమ్మను నేను అడగటం, అమ్మ జవాబివ్వటం జరిగిందని" అన్నారు. "నేను ఇక్కడే ఉన్నాను కదా మీరెప్పుడు అడిగారని" ఆశ్చర్యపోయాడు. ఒక కుక్క ఇక్కడకు వచ్చింది కదా! దాని శ్వాస ద్వారా, శ్వాసను ఏరకంగా బంధించాలో తెలియజేసింది. అది చేసి చూచాను. సరిగా సరిపోయింది. ఇంక అమ్మను వేరే అడగవలసిన పనిలేదని తెలియచేసారు.

· అమ్మ కరుణావృష్టి కురిసినంతనే నాలాంటి వారు కూడా అమ్మ గురించి రాయగలుగుతున్నారు. అలాగే ఇమాం అనే మహమ్మదీయుడు అమ్మ సంకీర్తన "జయ హో మాతా శ్రీ అనసూయా రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి" అను నామాన్ని రూపొందించాడు. అదే నామం హైమాలయ ప్రాంగణంలో 1968 ఏప్రియల్ 3వ తేదీ నుంచి అమ్మ ఆదేశానుసారం అఖండంగా సంకీర్తన చేయబడుతోంది, ఆ నామం అంటే హైమక్కకు చాలా అనురక్తి.

రేటూరి వాస్తవ్యులై ఇమాం అనే మహమ్మదీయ బాలుడుని కుమార స్వామిగారి భార్య తను పూజ చేసుకుంటున్న బాలకృష్ణుడే అని దగ్గరకు తీసుకుని 'శ్యామ్' అని నామకరణం చేసి పెంచుకున్నారు. కుమారస్వామి గారు గుంటూరులో పేరున్న వ్యాపార వేత్త.

ఇమాం జన్మ స్థలమైన రేటూరి జిల్లెళ్ళమూటికి మూడు మైళ్ళు మాత్రమే. అతని తాలూకు వాళ్ళు జిల్లెళ్ళమూడి వస్తుండేవారు. అమ్మ దర్శనం చేసుకోవాలన్న తపనతో శ్యామ్, కుమారస్వామి దంపతులను ఒప్పించి జిల్లెళ్ళమూడికి తీసుకువెళ్ళాడు. ఆ దంపతులకు అమ్మ దర్శనానంతరం ఎనలేని భక్తిశ్రద్ధలు ఏర్పడ్డాయి. అమ్మా "మా ఇంట్లో ఏకాహం జరపాలని ఉంది. దానికి నీవు తప్పక రావాలమ్మా" అని ప్రార్థించారు. "ఏకాహంలో ఏ నామం చెయ్యాలమ్మా" అంటే అమ్మ నవ్వి వూరుకుంది. అమ్మ పూర్వం "జయ జయ రామ జానకి రామ జానకి వల్లభ సీతారామ" అనే నామం చెప్పేది.

కుమార స్వామి గారింట్లో అందరూ రామ నామాన్ని జపించేవారు. అది ఇమాంకు కూడా అలవడింది. అతను బహిర్ భూమికి వెళ్ళినపుడు, "జయ హో మాత శ్రీ అనసూయ రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి" అని వినిపించింది. అది దైవ ప్రేరణ అని అతని విశ్వాసం. మొట్టమొదటి సారిగా అమ్మ నామంతో వారు ఏకాహం చేసారు. వాళ్ళు ఏకాహం జరుపుతుండగా ఒక వెలుగు గది చుట్టూరా తిరిగి వెళ్లింది. అమ్మే ఆ వెలుగు రూపంలో వచ్చిందని వారి పరిపూర్ణ విశ్వాసం. ఆ నామాన్నే అమ్మ "మహామంత్రం" అంటుంది. ఆనాటి నుండి ఆనామం అఖండమై, అజేయమై, మహా మంత్రమై వెలుగొందుతోంది. ఎందరెందరినో ఆర్తి, ఆవేదనకు దూరం చేసి మనశ్శాంతిని ప్రసాదిస్తోంది.

అమ్మ నామాన్ని లోకానికి అందించిన మహనీయుడు, ధన్యజీవి శ్యామ్. అమ్మ కరుణా కటాక్షాలను మిక్కుటంగా గ్రోలినవాడు. జీవిత చరమ దశలో అమ్మ ఆయన్ను జిల్లెళ్ళమూడికి రప్పించింది. ఆయన హైమాలయ ప్రాంగణంలో తులసీ రామాయణాన్ని పురాణంగా చెప్పటం గమనించవలసిన విషయం. స్పర్ధలతో, ఆవేశకావేశాలతో వేగిపోతున్న ఊరి జనం కొంత మంది మన

మహమ్మదీయుడే పురాణం చెప్తున్నాడని, ప్రతిరోజు పురాణ శ్రవణానికి రావటం, ఇది అమ్మ యొక్క అనురాగానికి ప్రతీక, అమ్మ భౌతిక దేహానంతరం అందరినీ ఒకే తాటి మీద నడిపేందుకు జరిగిన అద్భుత సంఘటనే ఇది.

సీతాపతిగారి భార్య కామేశ్వరమ్మగారి ఆహ్వానమందుకుని 1957 అక్టోబరు 17వ తేదీన స్వామీజీ బిక్షకు వెళ్ళారు. అమ్మ, స్వామీజీల సంభాషణ వినాలన్న కుతూహలంతో అందరూ ఆసక్తిగా ఎదురుచూసారు. "ఏమిటమ్మా నీ సాధన?" అని అహంభావ పూరితంగా స్వామీజీ అమ్మను ప్రశ్నించారు. అది విన్న జనం ఉలిక్కి పడ్డారు. అమ్మ నెమ్మదిగా "సర్వసాధారణమైనదే సాధన" అని చెప్పింది. మీరు ఆహారం ఏమి తీసుకుంటారని స్వామీజీ అడిగారు. "సర్వం సాధారణమే, అందులో ఆహారం కూడా ఉంది" అన్నది అమ్మ. "నీ ఇష్ట దైవం ఎవరు?" అని ప్రశ్నించారు స్వామీజీ. "అఇష్టత లేనిదే ఇష్టదైవమని" అమ్మ చెప్పింది. అమ్మ చెప్పే సమాధానాలకు ఆయనకు కోపం వచ్చి "అద్వైతమంటే ఏమిటో, ద్వైతమంటే ఏమిటో తెలుసా?" అని అమ్మని ప్రశ్నించారు.

అమ్మ వెంటనే ప్రక్కనే ఉన్న అరటి పండు తీసి ఇది అద్వైతమనుకుంటున్నారు. పండు వలిచి తొక్క, పండు వేర్వేరుగా చూపించి ఇది ద్వైతమనుకుంటున్నాను అన్నది అమ్మ. "సంస్కారం ఉంది కానీ శాస్త్ర జ్ఞానం లేదు. బాగా శాస్త్రం చదువుకో" అని చెప్పారు. "శాస్త్రం అనుభవాన్నివ్వదు కానీ, అనుభవం శాస్త్రాన్నిస్తుందని" అమ్మ చెప్పింది. "శాస్త్రం నీకోసమే పుట్టలేదు. అది ప్రమాణం" అంటూ వెంటనే లేచి వెళ్ళిపోయారు.

కొత్తపాలెంలో అమ్మ పినమామ గారైన భూషణం గారింట్లో గజేంద్రమక్కయ్య వాళ్ళూ అద్దెకుండేవారు. ఇయన జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను చూస్తే మంచి జరుగుతుందని అక్కయ్యకు చెప్పారు. అక్కయ్యకు నమ్మకం లేక వాళ్ళ ఆయనను చూసి రమ్మని పంపించింది. ఆయన అమ్మను చూచి చాలా మహిమ ఉందని అక్కయ్యను వెళ్ళమ న్నారు.

ఆ ఊరి కరణం గారి భార్య, ఇంకొక పదిమందితో కలిసి గజేంద్రమక్కయ్య

జిల్లెళ్ళమూడికి వచ్చింది. అమ్మ పూరి గుడిసెలో కూర్చుని ఉంది. లోపల చాలా మంది ఉన్నారు. ఇంత చిన్న గుడిసెలో అంత మంది ఎలా పట్టారని అక్కయ్య ఆశ్చర్యపోయింది. రెడ్డి కాంతయ్యగారు యోగి. వారి తొడ మీద అమ్మ పడుకుని ఉంది. అక్కయ్య వెళ్ళి అమ్మ తలప్రక్కన కూర్చుని ఉంది. అమ్మ కళ్ళల్లో పార్వతీ పరమేశ్వరులు కనిపించారు. బ్రహ్మానంద భరితురాలైంది. అందరూ వెళతామంటే "సరే" అని గజేంద్రమక్కయ్యను మాత్రం ఉండమని అమ్మ చెప్పింది. "నాకు భయం" అన్నది అక్కయ్య "ఏమీ అనను లే ఉండు" అన్నది అమ్మ.

ఆ పట్టు పది రోజులు ఉన్నది. కృష్ణవేణక్కయ్య అమ్మకు స్నానం చేయించి తడికల గదిలో నుంచి లోపలకు తీసుకు వెళ్ళింది. అక్కయ్య స్నానాల గదిలోకి వెళ్ళి చూస్తే అమ్మ వడ్డాణ్ణం కనిపించింది. వెంటనే తీసుకువెళ్ళి అమ్మకు ఇచ్చింది. ఏది ఏమైనా నన్ను పరీక్ష చేశావు అన్నది అక్కయ్య. 1960 సం॥లో జిల్లెళ్ళమూడిలో స్థిర నివాసమేర్పరుచుకుంది. అమ్మకు అక్కయ్యను తన దగ్గర ఉంచుకోవాలని కోరిక. నాన్నగారు ముందు వద్దన్నా తరువాత ఒప్పుకున్నారు. అక్కయ్యకు నాన్నగారింట్లో ప్రత్యేకంగా భోజనం ఏర్పాటు చేశారు. "నాన్నగారు బాగా పలకరించేవారని, చాలా మంచి వారని, బోళాశంకరుడని" అని అక్కయ్య చెప్పింది. శేషగిరిరావు అన్నయ్య తనకు వేడి వేడిగా గారెలు, ఇడ్లీలు చేయించి పెట్టేవారు. అక్కయ్యకు పూరిల్లు కట్టించారు.

గజేంద్రమక్కయ్య నిజామాబాద్ వెళ్ళి మూడు నెలలు ఉంది. అక్కడ అమ్మ కనపడి భుజం తట్టి వెంటనే రమ్మని చెప్పింది. అమ్మ పర్ణశాలలో ఉన్న రోజుల్లో ఒక వ్యక్తి పర్ణశాల పక్కనే ఉన్న రెల్లు మందిరం దగ్గర ఉన్నాడు. అమ్మ గదిలో కూర్చుని కిటికీలోనుండి ఆ వ్యక్తిని చూస్తున్నది. గజేంద్రమక్కయ్యకి అనుమానం వచ్చింది. అమ్మ దర్శనం చేసుకోకుండా ఇక్కడ నిలుచున్నాడేమని, అమ్మ పంచలోకి వచ్చి నిలుచుంది. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. ఆ చూపులో, మౌనంలో సర్వ భాషలూ ఇమిడి ఉన్నాయి. "ఆలోచనలు ఆగినా పరస్పర అవగాహనకు పనికి వచ్చేది మౌనం" అంటారు. అలాంటిది వారి భాష. ఆ తరువాత ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు. అమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

అతను అమ్మ దర్శనానికి వెళ్ళక పోవటంతో దొంగేమోనన్న అనుమానంతో అమ్మ పెద్ద కొడుకు సుబ్బారావుతో అక్కయ్య చెప్పింది. సుబ్బారావన్నయ్య 10 మంది మనుష్యులను వెతకమని పంపారు. ఎంత వెతికినా ఆ వ్యక్తి కనపడలేదు. అట్లా అదృశ్యమైన వ్యక్తి పూర్వం జరిగిన అనుభవాల మూలంగా సిద్ధపురుషుడు రహి అని అక్కయ్యకు అర్ధమయింది.

రావూరి నరసింహమూర్తి గారు, యార్లగడ్డ భాస్కరరావు గారు, సింగుపాలెం తాతయ్య, సాగర్ గారి కుటుంబం అమ్మ దగ్గర ఉండేవారు. అంతా కలిసి పొలం పనులు అనగా కోతలు, కుప్పలు, నూర్పిళ్ళు, నాట్లు వేసేవారు. డాబాలు కట్టేటప్పుడు ఇసుక, సిమెంటు, రాళ్ళు మోస్తుండేవాళ్ళు. ఆవరణలో ఆడ పని, మగపని అని తేడా ఉండేది కాదు. అందరూ కలిసిమెలసి అమ్మ నామం చేస్తూ పని చేసుకుంటూ ఉండేవారు. అమ్మ వారికి అరటి పళ్ళు, ప్రసాదాలు మూటకట్టి పంపిస్తుండేది. గజేంద్రమక్కయ్య హోటల్ పెట్టుకుంది. ఒక్క పైసా కూడా వదలకుండా వసూలు చేసి అంది అంతా అమ్మ పాదాల చెంత పోసేది.

పైకి చూడటానికి కరుకుగా కనిపించినా అక్కయ్య మనసు మాత్రం నవనీతం. ఒకమారు మేనాకు చేసిన అలంకారం చాలా బాగుందని అక్కయ్య అన్నది. దానికి అమ్మ "ఏం అలంకారాలమ్మ, అలంకారాల వల్ల వచ్చేదేముంది, చల్లని దనమే, చక్కని ధనం, ఎంతైనా తరగని ధనం, అలంకరణలు రంగులు ముఖ్యం కాదని చెప్పింది. కార్తీక పౌర్ణమి నాడు దీపాలు నదిలో వదలిపెట్టారు. నది దగ్గరకు వెళ్ళినపుడు ఆ జలక్రీడ మహోత్సవాన్ని చూసి అనుభవించి తీరవలసిందే కానీ వర్ణింపనలవి కానిది. శ్రీకృష్ణ లీలలు గురించి పురాణాలలో చెప్పేవన్నీ మనకు అమ్మ ప్రత్యక్షంగా చూపించి అనుభవాన్ని ప్రసాదించింది. వేద శిరోమణి అయిన అమ్మ మొక్కులే మక్కువ అన్నది.

సుబ్బారావు అన్నయ్యకు మందు ఇవ్వాల్సిన టైము అయిందని అంటే "మందు, విందు, కందుకు పసికందుకు ఎందుకో" అని అమ్మ హాస్యంగా పలికింది. ప్రపంచంలో ఆదరణే ఆస్తి. ఆ ఆస్తి ఎవరంటే అమ్మే. "అందం యంత్రం - మనస్సు మంత్రం" అన్నది అమ్మ. అందం ఉంటే సంవత్సరాలలో, నెలల్లో,

రోజుల్లో ఎప్పుడైనా పోవచ్చు. ఎంత అందమైన వారికైనా ఆటలమ్మ, స్ఫోటకం వస్తే ఆ అందం పోతుంది. మానసికమైన అందం ఎప్పటికీ పోదని అమ్మ వివరించింది.

నామం చేసుకుంటూ, సుప్రభాతం చేస్తూ రాత్రిపూట రెడ్డి సుబ్బయ్యతో పాటూ ఇటుకలు, కాల్చటానికి పొట్టు తీసుకువెళ్ళేవారు. సుబ్బారావు అన్నయ్య, రవి కూడా వంతులు వేసుకొని, పని చేసేవారు. అమ్మకు నీ,నా అనే భేదం లేదు. అందరూ అమ్మ బిడ్డలే తన రక్తం పంచుకు పుట్టిన వాళ్ళనైనా ఒకేలా చూచేది. అది ఎంత మందికి సాధ్యమవుతుంది. "నాది అనుకోవటం మానవత్వం, మనది అనుకోవటమే మాధవత్వం" అని తనయందు మానవత్వాన్ని మనం వెదుకుతామట. మనలో మాధవత్వాన్ని తాను వెలికి తీస్తుందిట ఎంతటి హృద్యంగమైన భావన.

హైమ అమ్మకు పూజ చేసుకు వస్తుంటే దేవలోకం నుంచి దిగి వచ్చిన దేవకన్యలా భాసించేదని అక్కయ్య చెప్పింది. హైమ సిద్ధిపొందిన అనంతరం తెల్ల పరికిణి, తెల్ల వోణీ వేసుకుని హైమ ఊళ్ళో అందరికీ కనిపించింది. సత్యం చూసి భయపడి అరిచాడు. ప్రక్కనే ఉన్న వేల్పూరి శకుంతల, సాకి వెంకాయమ్మ కూడా హైమ ఇంటి వెనకకు వెళ్ళటం చూశారు. ఒకమారు రాత్రి 8 గంటల సమయంలో గజ్జెల మోత వినిపిస్తే "ఎవరిది బొత్తిగా భయం భక్తి లేకుండా పోతోంది" అని కేకలేసింది. "నేను గజేంద్రమక్కయ్య" అని హైమ బదులిచ్చింది. "అయ్యో హైమమ్మనా నేను ఇంత కేకలు వేసింది" అని బాధ పడింది.

అప్పుడప్పుడు అమ్మకు అక్కయ్య స్నానం చేయించేది. ఒకసారి కోతలకు కూలీలు దొరకలేదు. ఆవరణలో అంతా అలసి పోయి ఉన్నా అందరూ కోతలు కోసి గట్లు వెయ్యడంతో మూడు ఎకరాలే మిగిలింది. ప్రతి సంవత్సరం నెల్లూరి నుంచి కోతల టైంలో ఒక 30 మంది దాకా వచ్చి వాళ్ళే కోతలు కోసి, కుప్పలు వేసేవాళ్ళు. పొలం నుంచి వాళ్ళు వచ్చేటప్పటికి వేడినీళ్ళు పెద్ద పెద్ద కాగులతో పెట్టించేది. వేడినీళ్ళతో స్నానం చేస్తే శారీరక శ్రమ తగ్గుతుందనేది. కష్టపడి పనిచేసే వాళ్ళకు సరైన తిండి ఉండాలని పప్పు ఎక్కువగా వేసి సాంబారు పెట్టించేది.

పూర్వం జిల్లెళ్ళమూడి పార్టీలు, కక్షలతో కూడుకుని ఉండేది. స్త్రీలు బయటకు వెళ్ళటానికి కూడా భయపడేవారు. గజేంద్రమక్కయ్య ఈ ఊరి వాళ్ళు మారటం కష్టం అనేది. అమ్మ రోజుకు 10 సార్లు స్నానం చేసేది. పది మందీ కలిసి చెరువుకు నీళ్ళకు వెళ్తే ఊళ్ళో వాళ్ళు పక్కకు తప్పుకోవటం మొదలు పెట్టారు. అమ్మ గజేంద్రమక్కయ్యతో "అంతా కల్ల అన్నావు, ఇప్పుడు మార్పు వచ్చింది కదా!" అన్నది.

అమ్మకు ఒంట్లో బాగుండక పోతే నాన్నగారు తరచూ వెళ్ళి అమ్మను చూచేవారు. ఒకమారు నాన్నగారు వెళ్ళినప్పుడు అమ్మ ఆయన ఎడమ చేయి తీసుకుని తన బుగ్గ మీద రాసుకుంది. ఆ మనోహర దృశ్యాన్ని తిలకించే అదృష్టం తనకు కలిగిందని పరవశంతో చెప్పింది.

అమ్మ సిద్ధిపొందే ముందు గజమ్మా, గజమ్మా అని పిలిచింది. కానీ తనకు అక్కడకు వెళ్ళటానికి వీలు పడలేదని రుద్ధకంఠంతో తెలియజేసింది. ఈ ఊరు వచ్చింది కాబట్టి తనకు ఏరోగాలూ లేదని, ఇంటి వద్దే ఉంటే ఎప్పుడూ పోయేదాన్నని, ఇక్కడ ఉన్నాను కాబట్టే ఇన్నాళ్ళు ఉన్నానని చెప్పింది. ఈ మధ్య అమ్మ కలలో దర్శనమిస్తోంది. కలలో కనిపించి "అక్కయ్య గారూ" అని పిలిచింది అని చెప్పింది.

గజేంద్రమక్కయ్య అమ్మ మంచం దగ్గర పడుకుని ఉండగా చంద్రమక్కయ్య అమ్మతో "అమ్మ నీ తరువాత ఎలా ఉంటుందంటే నేను స్త్రీ రూపంలో వస్తానని మీరంతా చూస్తారనీ" అన్నది. "మీ తరువాత ఇలాగే జరుగుతుందా లేక కుంటు పడుతుందా!" అని అడిగింది. "జరిగినన్నాళ్ళు జరుగుతుంది. జరగనపుడు అంబలి కాచి దోసిళ్ళలో పోస్తారు. పాత వాళ్ళు వెళ్తారు. కొత్తవాళ్ళు వస్తారు. పాతవాళ్ళు 7వ మైలురాయి వద్దే ఏడుస్తారు. పెద్ద చరిత్ర అవుతుంది. ఉండటానికి చోటు దొరకదు. అంతా బ్రహ్మాండంగా ఉంటుంది. అంతా వెలుగే" అని చెప్పింది. బొమ్మలో చూపిస్తుందో మళ్ళీ బొమ్మలా వస్తుందో పూర్వం వైభవం తిరిగి రావటానికి అని గజేంద్రమక్కయ్య విశ్వాసం నిండిన ముక్తకంఠంతో తెలియజేసింది.

అమ్మ జిల్లెళ్ళమూడిలో ఉండమన్నది కాబట్టి. అమ్మ భౌతిక దేహాన్ని వదలి విశ్వవ్యాప్తమైనా కాని తాను జిల్లెళ్ళమూడిలోనే ఉంటోంది. ఎటువంటి పరిస్థితులు, ఒడిదుడుకులు ఎదురైనా, ఎంతమంది సంస్థను వదలి పెట్టినా తాను మాత్రం ఆ సంస్థనే అంటిపెట్టుకుని తనకు చేతనైన సేవ చేసుకుంటున్న ధన్యురాలు గజేంద్రమక్కయ్య. అమ్మస్నానానికి వెళ్ళినప్పుడు "అమ్మా! రవి నన్ను చిన్నమాతా చిన్నమాతా" అంటున్నాడని హైమ చెప్పింది. అలాగే తాను హైమాలయంలో అర్చనామైర్తి అయి, అందరి కోరికలు తీర్చే కల్పవల్లిగా పూజలందుకుంటోందని "గజేంద్రమక్కయ్య గద్గద కంఠంతో చెప్పింది.

భాస్కరన్నయ్య సింగుపాలెంలో అమృతానందస్వామి సత్సంగంలో పాల్గొనేవాడు. అమ్మ గురించి ఆయన చెప్పింది విని జిల్లెళ్ళమూడికి వచ్చాడు. అమ్మను దర్శించి నమస్కారం చేసుకుని వెళ్తూ మళ్ళీ నమస్కరించాలని అమ్మ దగ్గరకు వెళ్ళాడు. అమ్మ ఆయన నెత్తిన చేయి పెట్టి ఆశీర్వదించింది. పూళ్ళ వెళ్ళి తలమీద నుండి మూట దించేసరికే తలమీద పసుపు అయింది. ఆ తెల్లవారు ఝామున స్పర్శ తెలుస్తుంది. నిద్ర, మెళకువ కాని స్థితిలో రెండు మార్లు అమ్మకు నమస్కరించిన విధంగా అనిపించింది. వాళ్ళన్నయ్య దగ్గరకు వెళ్ళి అమ్మ గురించి వ్రాస్తావా?" అని అడిగాడు. రాఘవన్నయ్య అప్పటికే పాటలూ, పద్యాలూ వ్రాసేవాడు. "అమ్మను చూడాలి కదరా! చూడకుండా ఎలా వ్రాస్తాను" అన్నాడు. భాస్కరన్నయ్యకు ఏ పని చేసినా అమ్మ కనిపిస్తూనే ఉండేది. ఎప్పుడూ అమ్మ ధ్యాసలోనే ఉండేవాడు. దారి సరిగా లేదు ఏం వెళ్తాములే అనుకున్నా మళ్ళీ నాలుగు రోజులకే అమ్మను చూడాలన్న తపన ఎక్కువయ్యేది. రెండవమారు రాఘవన్నయ్యను తీసుకువెళ్ళాడు. రాఘవన్నయ్య 108 పద్యాలతో అమ్మ మీద శతకం వ్రాసాడు. భాస్కరన్నయ్య అప్పుడప్పుడు జిల్లెళ్ళమూడి వెళ్తుండేవాడు.

తెనాలిలో బంధువులు ఇంట్లో పెళ్ళికి అమ్మ భాస్కరన్నయ్యను, రాఘవన్నయ్యను రమ్మంది. తెనాలి శాస్త్రిగారు, భాస్కరన్నయ్య బావగారు ఒకే స్వామివారి శిష్యులు, స్నేహితులు. శాస్త్రిగారికి అమ్మ ఏమీ చదువుకోలేదని ఏదేదో చెప్తుందని అనుకునేవారు. వారు అమ్మని పరీక్షించాలని అమ్మ నాన్నగారు

కూర్చుని ఉండగా అమ్మను అడిగారు. దానికి అమ్మ "సరే" అన్నది. శాస్త్రిగారు, సింగుపాలెం బావగారు అమ్మను ఎన్నెన్నో ప్రశ్నలు వేశారు. ఏదీ ఆలోచించకుండానే అమ్మ సమాధానమిచ్చింది. అవన్నీ శాస్త్ర సమ్మతంగానే ఉన్నాయి. ఆ విషయాన్ని వాళ్ళ బావగారు చెప్తుంటే ఆయన ప్రక్కనే అమ్మ భాస్కరన్నయ్యకు దర్శనమిచ్చింది. ఆ విషయాన్ని రాఘవన్నయ్యతో చెప్పాడు. ఆ మాటకి రాఘవన్నయ్య "నేనూ వినాలి కదరా" అన్నాడు. వారి బావగారు అదే విధంగా చెప్పటం అమ్మ ఆయనకు కూడా దర్శనం ఇవ్వటం జరిగింది.

భాస్కరన్నయ్య అప్పుడప్పుడు వచ్చి అమ్మ చెప్పే చరిత్ర వ్రాసేవాడు. ఎవరన్నా వస్తే బావుంటుందని అమ్మ అనుకుంటుండగానే భాస్కరన్నయ్యకు రావాలనే కోరిక కలిగి వచ్చేవాడు. "నేను నిన్నే తలుచుకున్నానురా అనేది" అమ్మ. దైవం తలిస్తేనే, తాను తలుస్తాడనటానికి నిదర్శనమే ఇది. అమ్మ చరిత్రను మిగిలిన వారు వ్రాస్తామన్నా ఒకే చేతి మీదే వ్రాయాలని ఎవరికీ ఆ అవకాశం ఇవ్వలేదు అమ్మ. ఆ తరువాత కుటుంబంతో వచ్చి రెండు సం॥లు ఉన్నాడు. ఆ తర్వాత భార్య, పిల్లలు వాళ్ళ ఊరు వెళ్ళిపోయారు. కానీ అన్నయ్య మాత్రం ఇక్కడే స్థిరపడిపోయాడు.

హైమకు జబ్బుగా ఉంది. అమ్మ దగ్గరకు రావాలని ప్రయత్నించాంది. కానీ రాలేని పరిస్థితిలో ఉంది. భాస్కరన్నయ్య ఎత్తుకుని అమ్మ దగ్గరకు తీసుకువెళ్ళాడు. లలితా సహస్రం అన్నయ్యకు చదవటం రాదు. కానీ ముందుగా గొడ్ల చావిడిలో కూర్చొని, పుస్తకం తీసుకొని చూచేవాడు. ఆ తరువాత "అమ్మ దయవల్ల చదవటం వచ్చిందని" ఆనందంతో చెప్పాడు. అమ్మ దగ్గర కూర్చొని ఉండగా "నేను వెళ్ళేటప్పుడు విమానం వస్తుంది నాన్నా" అన్నది. "రాములవారికి విమానం వచ్చినప్పుడు తన తోటి వారందరినీ తీసుకెళ్ళాడు కదా! మనందరినీ అమ్మ అలా తీసుకెళ్తుందని" అనుకున్నాడు.

అమ్మ దగ్గర భాస్కరరావన్నయ్య ఉండగా ఒకరు పుస్తకం అటక మీద పెట్టి కూర్చున్నారు. 8 గం.ల వేళ భోంచేసారు. అతనే రహి అని అమ్మ తెలిజేసింది.

అమ్మ ఒడిలో భాస్కరన్నయ్య పడుకున్నట్లు అనుభూతి కలిగేది. అమ్మ శరీరం నిమిరిన స్పర్శతో ఒడలు మరిచిపోయేవాడు. ఆ ఆనందంలో ఒక్క స్తోత్రమూ గుర్తురాలేదు. అమ్మా అమ్మా అంటూనే ప్రదక్షిణాలు చేసాడు.

సరోజినక్కయ్య నామం బాగా చేసేది. కొన్ని రోజులుగా అక్కయ్య సంధ్యావందనం బాగా చెయ్యట్లేదని అనుకున్నాడు. ఆ తరువాత అక్కయ్యే అమ్మగా కనిపించింది. గోపాలరావు గారు గుడిలో పూజ చేసుకుంటూ పని అమ్మాయి బాగా పనిచేయట్లేదని కేకలేశారు. ఆ పిల్ల ఆయన్ను తిట్టుకుంది. భాస్కరన్నయ్య ఏమిటి ఈ అమ్మాయి ఇట్లా అంటుంది అనుకున్నాడు. ఆ పిల్ల అన్నయ్యకు అమ్మలా కనిపించింది. "సర్వాంతర్యామి అయిన అమ్మ ఉండగా నేను వాళ్ళ గురించి అనుకోవటమేమిటి, నా పని ఏదో నేను చేసుకోకుండా అని అమ్మ ఉద్దేశం కాబోలు" అనుకున్నాడు.

అమ్మకు ఆరోగ్యం సరిగాలేదు. జూన్ 12, 1985న అమ్మ దర్శనం చేసుకుని హైమాలయంలోకి వెళ్ళి వచ్చేటప్పటికి అన్నపూర్ణాలయ గంట మోగింది. భోజనానికి కూర్చున్నాడు. భోంచేస్తుండగా విమానం వచ్చి షెడ్ మీద ఆగినట్టు శబ్దం వినిపించింది. ఆతరువాతే అమ్మ సిద్ధి పొందిన జే గంట వినిపించింది. విమానం ఆగిన శబ్దం విన్నప్పుడు గుర్తు రాలేదు కానీ సిద్ధి పొందినపుడు ముందుగా అమ్మ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. ప్రతి రోజూ భాస్కరన్నయ్యను పైకి వచ్చి టిఫిన్ తిని వెళ్ళమనేది అమ్మ. అలాగే టిఫిన్ పెట్టి పాలు ఇచ్చేవారు. తరువాత అన్నయ్య గురించి వాళ్ళల్లో వాళ్ళు ఘర్షణ పడ్డారు. ఆ తరువాత మూడు రోజులు వెళ్ళినా చూడనట్టుగానే ప్రవర్తించేవారు. అందుకని టిఫిన్‌కి వెళ్ళటం మానుకున్నాడు. ఆ తరువాత వాళ్ళే ఏమీ ఎరగనట్లుగా "టిఫిన్‌కి రావట్లేదేమి అని అడిగారు. అదీ అమ్మ ఆజ్ఞ అనుకుని టిఫిన్‌కి వెళ్ళేవాడు.

"భక్తి కరుడు గట్టిన భాస్కరుడు" అని అమ్మ చేతే కొనియాడబడ్డాడు భాస్కరన్నయ్య కణకణలాడే నిప్పులు అమ్మ చేతిలో పోసుకున్నా చేతులు కాలలేదు. అది చూసి అన్నయ్య "నిప్పు దాని స్వభావాన్ని మార్చుకుందా? అమ్మా! అని అడిగాడు" "దానికీ నేను అమ్మనే కదా!" అని అమ్మ జవాబిచ్చింది.

రాములక్కయ్య, బెండపూడి అక్కిరాజుగారు, భాస్కరన్నయ్య అమ్మ దగ్గర కూర్చుని ఉండగా చంకన ఒక కడవ పెట్టుకుని పుణ్యాల పాలల్లో, పాపాల పాలు పోయండి అంటూ వాళ్ళందరి చేత ఆ కడవలో పాలు పోయించుకుంది. అక్కడ పదిమంది దాకా ఉన్నారు. ఈ విధంగా వారి పాపాలన్నీ హరింపచేసింది అమ్మ. భాస్కరన్నయ్య ఓపిక వున్నన్నాళ్ళు పనులు చేసేవాడు. పొలం నుంచీ ఇంటికి రాగానే అఖండ నామంలో పాలుపంచుకోవటం, ఆ తరువాత హైమాలయంలో రోజు మంత్ర పుష్పం నిష్ఠగా చదివేవాడు.

యార్లగడ్డ రాఘవయ్యగారు గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా సింగుపాలెం నివాసి. చేబ్రోలుని అమృతానంద సరస్వతి స్వాముల వారి ఆజ్ఞానుసారం వారి సోదరుడైన భాస్కరుని ప్రేరణతో అమ్మను దర్శించటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. వికారి నామ సంవత్సర కార్తీక పౌర్ణమి మంగళవారం నాడు రాత్రి 9గం॥లకు ఎంతో వేడుకగా అందరితోపాటు రాఘవయ్య గారు కూడా అమ్మకు పూజచేసుకున్నారు. దేదీప్యమానమైన రత్నఖచిత బంగారు కిరీటం ధరించి సర్వాభరణ భూషితమై సాక్షాత్తు మహేశ్వరిగా దర్శనమిచ్చింది అమ్మ. అమ్మ ఇచ్చిన దర్శనాన్ని వివరిస్తూ ఆయన పులకిత గాత్రులయ్యారు. ఒక పళ్ళెం పులగం ఎంతో మందికి పెట్టిన మహిమను తలుచుకుని ఆనందించారు. కార్తీక పౌర్ణమికి ఓంకార నదిలో స్త్రీలు వదిలిన దీపములన్నీ ఒక్కటిగా కలవటం చూసి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. భిన్నత్వంలోని ఏకత్వం యొక్క సమన్వయాన్ని సామర్థ్యాన్ని ఈ చర్య ద్వారా అమ్మ తెలియజేసింది.

రాఘవయ్యగారికి సిద్ధపురుషుడైన రహి, అమ్మ సంభాషణలు వినపడేవని రాసుకున్నారు. రహి సిద్ధి పొందే ముందు రక్తాక్షరాలతో రాఘవయ్య గారికి ఉత్తరం రాసారు. ఎన్నోమార్లు అమ్మ పెట్టుకున్న ఆభరణాలను వివరించేవారు. సిద్ధపురుషుడైన రహితో మాట్లాడగలగడం, ఆయన స్వయంగా వీరికి ఉత్తరం వ్రాయటం దానిలో "ఇక నేను వుండవలసిన అవసరం లేదు. శరీరం చాలిస్తున్నాను, వచ్చిన పని అయిపోయిందని" రాసారు. అట్టి అదృష్టాన్ని చవిచూచారు. అమ్మ దగ్గరకు రాకపూర్వం రాముని, కృష్ణుని ఆరాధించేవారు. వారికి అమ్మ భావానీ

దేవిగా దర్శనమిచ్చింది. అందుకే ఆయన "చిట్టెమ్మవయ్యావు కిష్టమ్మ" అని పాడేవారు. స్త్రీ పురుష నామరూపాలకు అతీతమైంది దివ్యపథం. అట్టి దివ్యపథమే అమ్మ.

మంచి చెడులను పాటించని కామ పిశాచి రాఘవన్నయ్య. కాని అమ్మ ఆగ్రహింపక, ప్రేమకురిపించి పరమేశ్వరి రూపం చూపిందని చాటి చెప్పారు. నిష్కామకర్మ చేయాలన్నది అమ్మ ప్రబోధం, అనగా ఎవరికి అయితే చేస్తున్నామో వారికి కూడా తెలియకుండా చేయాలని, కీర్తికాంక్ష లవలేశం లేని అహంకార రహితమైనదే నిష్కామకర్మ అన్న దైవ సంపత్తిని గూర్చి తెలియజేశారు రాఘవన్నయ్య.

అమ్మను దరిచేరి అమ్మకు తనపై కోపం వచ్చిందేమోనని దుఃఖిస్తున్న రాఘవయ్య గారితో "నేను నీకు కన్పించినా, కన్పించకున్నా నాకు నీపై గల ప్రేమలో మార్పులేదు. ఇది నిశ్చయం సుమా" అని మృదుమధురంగా పలికింది. ఆ పలుకులతో ఆయన మనసు ఆనంద డోలికలలో ఊగిసలాడింది.

సంకల్ప వికల్పములు, భావనా భావనలు, వేయేల సర్వము అమ్మణ్ణి చిద్విలాసములో అంతర్భూతమైనవని రాఘవయ్య గారి భావన. అమ్మ యొక్క సుందర పవిత్ర మూర్తిని హృదయంలో పదిల పరుచుకుని గాడాంధకారంలో వెలుగు దీపికలవలె నిలిచే అమ్మ పాదాలే మనకు శరణు అని చెప్పారు. మొదట కొద్దిగా కనిపించేది కానీ తరువాత చూపు పూర్తిగా మందగించింది.

"కమనీయమైన దృశ్యం, మధురమైన భావమూ, ఆకర్షణీయమైన గీతం, పవిత్రమైన ప్రేమను ఎక్కడ గాంచినా అమ్మే గుర్తుకు వస్తుంది. విను వీధిలో ఊహలరెక్కలు రెపరెపమంటూ వేధించే భౌతిక దేహం కదలలేక పోతుంది. ఏం చేయమంటావమ్మా?" అని అమ్మనే ప్రశ్నించారు రాఘవన్నయ్య.

మహర్షులు, మహాయోగులు, భక్తులు, జ్ఞానులు అందరూ తమరక్తం ధారపోసి తమ ప్రాణాలను నివేదన చేసి ఏ పాదాలు చేరాలని ఆరాటపడ్డారో ఆ పాదాల వద్దకు సునాయాసంగా చేరి ఆనందించిన ఆ కమనీయ దృశ్యాన్ని మనం అవలోకించగలిగితే దాన్ని మించిన ఆనందం ఈ జన్మకు మరి ఏముంటుంది?

ప్రేమ ఆ మధుర వాక్కులలోనూ, ఆ మనోజ్ఞ మందహాసంలోనూ, ఆ సుందరనయన యుగళిలోనూ, ఆ కోమల హస్తాలలోనూ, ఆ పావనపద ద్వయంలోనే ఉండి అమ్మలో ఒక భాగం కాలేదు. అమ్మలోని ప్రతి అణువున నిండి ఉన్నది. కనుకనే ఆ పవిత్ర చరణ సన్నిధి చేరే సుగంధ సుమాలతో పాటు దుర్గంధ కుసుమాలూ ధన్యత పొందుతున్నాయి. అక్కడ పావనుడితో పాటూ పతితుడు "అమ్మా!" అని పిలిచినా "ఏం నాన్నా!" అని అతి చల్లని పలకరింపు వినిపిస్తుంది. తన వెంట వస్తున్నదో లేదో కూడా తిరిగి చూడకుండా ప్రవహించటమే నదికి తెలిసినట్లుగా అవ్యాజమైన ప్రేమకు ఫలితాన్ని ఆశించడం తెలియదు. దానికి ప్రేమించటమే తెలుసు.

అమ్మ యొక్క సుందర పవిత్ర మూర్తిని హృదయంలో పదిలపరుచుకొని గాడాంధకారంలో వెలుగు దీపికలై నిలచే అమ్మ పాదాలే మనకు శరణ్యం. మనుజుల హృదయాలలోని మాలిన్యాన్ని కడిగి, నిర్మల హృదయాలుగా చేయటానికి మనిషిగా అవతరించిన జగజ్జనని అమ్మ. శరశ్చంద్రిక వంటి మనసు కలిగి ధవళాం బరధారిణిమైన అమ్మను ఎన్నిమార్లు చూచినా తనివి తీరదు.

నిండు పున్నమినాడు చంద్రుని వలె దేదీప్యమానమైన వెలుగులను విరజిమ్ముతున్నది. దీపావళినాడు అమ్మ తేజస్సు ముందు ఈ దీపాల వెలుగులు తేలిపోతుండేవి. ఆ నాటి అమ్మ రూపాన్ని చూసి తీరవలసిందే కాని వర్ణించ శక్యం కాదు. అది అనుభవైకవేద్యమే!

రాఘవయ్య అన్నయ్య పెద్దగా నామం చేస్తుంటే అనుకోకుండా వెండి పీట మీద తెల్లని వస్త్రంతో అమ్మ ఏసు ప్రభువులా దర్శనమిచ్చింది. ఆ పీటకు క్రింద కోళ్ళు లేవు, పైన తాళ్ళు లేవు. దేని మీద ఆధారపడకుండా గాలిలో ఉంది.

అమ్మ సన్నిధిలో యార్లగడ్డ రాఘవయ్య గారు పాడుతూ "పచ్చిపసుపు కన్న శోభాయమానంగా మెరుస్తున్న అమ్మ పాదాలు" అన్నప్పుడు అమ్మ "ఆ రంగంటే నీ కిష్టమా? మిగిలిన రంగుల కంటే బాగుంటుందా?" అని ఆయన్ని అడిగింది. "నాకు బాగుండటం కాదమ్మా! నీ పాదాలు నాకట్లా అరగంటకు

పైగా కనిపించాయి'' అన్నారు. "ఓహో అట్లాగా'' అన్నది అమ్మ. ఆ ముందు రోజు రాత్రి మహిమల గురించి అమ్మ దగ్గర చర్చ జరిగినపుడు అమ్మ "అంధులకు నేను దృష్టినిచ్చానన్నారు. రాఘవయ్యగారు చూడగలుగుతున్నారా!'' అన్నది. ఎవరూ మాట్లాడలేదు. కానీ అమ్మ ఏ రంగు చీర కట్టుకున్నారో సింగుపాలెంలో ఉన్నప్పుడు కూడా కనిపించడం, ఒకమారు అమ్మ జిల్లెళ్ళమూడిలో మన్నవ భూషి గారు ఇచ్చిన నల్ల కళ్ళజోడు పెట్టుకుంటే సింగుపాలెంలో వుండి అమ్మ రూపం చూడగలిగారు, అందుచేత అమ్మ పాదాలు పచ్చి పసుపు రంగులో చూడటం కళ్ళతో చూడటం కాదు, అమ్మ ఆ రూపంలో ఆయనకు సాక్షాత్కరించడమే. కళ్ళుండటానికి ప్రయోజనం దైవదర్శన సౌభాగ్యమే అయితే అది ఆయన్ని వరించినట్లే కదా!

యార్లగడ్డ రాఘవయ్యగారు ప్రసూనాంజలి అన్న రెండు భాగాల కావ్యాన్ని వారి కుమారుని "స్మృతి చిహ్నంగా'' అమ్మకు సమర్పించుకున్నారు. అమ్మ కరుణతో సోదరుల ప్రోత్సాహమున "వేద శిరోమణి'' అను పేరుతో హరికథను రాసి ప్రథమముగా అమ్మ సన్నిధిలో రాఘవయ్యగారు గానం చేశారు. ఒకమారు ఒక ఉత్సవములో గొప్ప గొప్ప విద్వాంసుల సమక్షంలో హరికథ చెప్పవలసి వచ్చింది. హరికథ ఏ విధంగా చెప్పవలెనో తెలియక ఆయనకు భయం కలిగింది. అంతా అమ్మణ్ణి కృపయని మృత్యుంజయ స్వామి దేవాలయానికి వెళ్ళారు. దేవాలయమున అమ్మ ధవళ వస్త్ర ధారిణియై, కుర్చీలో ఆసీనురాలై అంధుడైన రాఘవయ్యగారికి ఇరువది నిముషములపాటు దివ్య ప్రభాసమానమై విరాజిల్లుతూ అమ్మ దర్శనమిచ్చింది.

ఆ ఉత్సవంలో అమ్మ చిత్రఫలకంను ఒక కుర్చీలో ఏర్పాటు చేసారు. ఆ హరికథా కాలక్షేపం మూడు గంటలు పట్టింది. వేలాది ప్రజలు హర్షధ్వానాలతో కథను శ్రవణం చేసారు. పండిత ప్రవరులు మృదంగ విద్వాంసులు అయిన శ్రీ ధర్మాల రామ్మూర్తి ఆలింగనము చేసుకుని దాసుగారు "బ్రహ్మానందమందు ఓలలాడింప చేశారు. అమ్మ కథను వినిపించి మమ్ములను కృతార్థులను చేశారు. ఇంకా రెండు గంటలైనా చెపితే బాగుండేదనిపించింది'' అన్నారు.

రాఘవయ్యగారు అమ్మ దర్శనమునకు వెళ్ళినప్పుడు అమ్మా! "నీవు దేవాలయమునకు వచ్చావు కదా?" అని అడిగారు. "ఏమో నీ విశ్వాసం నీది నేను కాదన్నా నీవు ఒప్పుకుంటావా?" అని అన్నది. ఆ రోజు అమ్మ తెల్ల చీరే ధరించింది. ఆయన అమ్మమీద బుర్ర కథను కూడా రచించారు. మన్నవ భూషణం గారు అమ్మకు నల్ల కళ్ళజోడు ఇచ్చారు. అమ్మ దానిని పెట్టుకుంది. ఆ విషయాన్ని సింగుపాలెంలో వున్న కళ్ళు లేని రాఘవన్నయ్య వివరించాడు. కళ్ళు వున్న మన కన్నా అమ్మ దర్శన భాగ్యం కలిగే రాఘవన్నయ్య అదృష్టవంతుడు.

శేషయ్యగారు బాపట్ల నివాసి. అమ్మ దగ్గరకు వచ్చిన వాళ్ళకు శేషయ్యగారి గురించి తెలియని వాళ్ళు వుండరనటంలో అతిశయోక్తి లేదు. బాపట్లలో అన్నయ్య కుటుంబం వుండేది. అప్పుడప్పుడు వెళ్ళి యోగ క్షేమాలను విచారించి వస్తుండేవారు. 1958 ఆగష్టు 15న శేషయ్యగారు అన్నపూర్ణాలయ ప్రారంభోత్సవం నాడు రావటం అమ్మ మహిమే కారణం కదా! ఎంత వంట అయినా అవలీలగా చేసేవారు. పెండ్లికాని పిల్లలు అన్నపూర్ణాలయంలో వడ్డన చేస్తే తప్పక మంచి సంబంధాలు కుదిరి జీవితంలో స్థిరపడతారని ఆయన విశ్వాసం. అది నిజం కూడా! ఎందరెందరో ఆ విధంగా జీవితంలో స్థిరపడ్డారు. ఎక్కువ మంది వుంటే శేషయ్యగారు సంస్థలో అంతా ఒక రౌండ్ వేసి జనాన్ని అంచనా వేసుకొని వంటచేసేవారు. ఆయన అంచనా తప్పటం అంటూవుండేది కాదు.

ఎన్నోమార్లు పులుసు కాచే పాత్రకు కళాయి పోయింది. పెట్టించమని సంస్థ వారికి చెప్పినా ఎవరూపట్టించుకోలేదు. దానితో ఆయనకు కోపం వచ్చి దానితోనే పులుసు పెట్టారు. ఆ రోజు అందరూ వాంతులు చేసుకోవటం ఖాయం అని అనుకున్నారు. భోజనాలు అయి వెళ్తూ రోజూకంటే ఈ రోజు పులుసు చాలా బాగుందనుకుంటున్న జనాన్ని చూచి విస్తుపోయారు. ఆ పిమ్మట పైకి వెళ్ళి అమ్మ పాదాల చెంత తలవంచారు. "అమ్మా! నీ విషయం తెలిసి కూడా నేను విస్మరించాను. నాకు బుద్ధి వచ్చిందని" చెప్పారు. అప్పుడు అమ్మ సంస్థవారితో పాత్రలకు కళాయి పెట్టించమని చెప్పింది.

శేషయ్యగారి అన్నగారు పెద్ద ఉద్యోగంలో వున్నారు. జిల్లెళ్ళమూడి వచ్చి

"వంట శేషయ్య వున్నాడా?" అని అడిగారట. దానికి అమ్మ ఎంతో నొచ్చుకుంది. "డబ్బు మనుషుల్ని, ప్రేమల్ని, అభిమానాలను కూడా విడదీస్తుంది కదా! మా తమ్ముడు శేషయ్య ఉన్నాడా? అని అడిగితే అతనికి నామార్దా కాబోలు" అన్నది అమ్మ. శేషయ్య "నామీద విశ్వాసంతో ఈ సంస్థలో చేస్తున్నాడు కాని, ఇక్కడ సంస్థ ఇచ్చే డబ్బుకోసం కాదు కదా! వాడు పని చేసేది" అని అమ్మ చేతే అనిపించుకున్న ధన్యజీవి.

అన్నపూర్ణాలయంలో పని ఎప్పటికప్పుడు సజావుగా జరిగిపోవటానికి ఆయన డిసిప్లేనే కారణం. ఎవరు పని ఎగ్గొట్టి కూర్చున్నా, సమయానికి అందించకపోయినా చాలా కోపం వచ్చేది బాధపడేవాడు. అంత సంస్థలో ఆ మాత్రం స్ట్రిక్టుగా వుండకపోతే పనులు జరగటం కష్టమన్న సంగతి మనందరికీ తెలిసిన విషయమే.

అన్నపూర్ణాలయంలో అన్నపురాసిని అమ్మ ఫోటో కెదురుగా పోసి కొబ్బరి చిప్పలో కర్పూరం వెలిగించి హారతి పాటపాడే శేషయ్యగారిని ఎప్పటికీ మరువలేము. అటువంటి వారే కీర్తిశేషులు. ఆమాట అందరికీ వర్తించదు. చనిపోయిన వారి కీర్తి భూమి మీద మిగిలివుంటే వారే కీర్తిశేషులు.

ఒక ఉత్సవ సమయంలో శేషయ్యగారు "అమ్మా స్వీటు ఏం చేయమంటావు?" అని అడిగారు. దానికి అమ్మ "చేసిన పదార్థ అందరికీ అందటం కంటే స్వీటు ఏముంటుంది? అదిచేయండి" అని చెప్పింది. చండీయాగం చేసిన తరువాత హోమగుండంలో ఏమైనా అమ్మను వేయమని అడిగారు. దానికి అమ్మ "నేనేమి వేయవలసివచ్చినా గాడిపొయ్యిలోనే వేస్తాను అన్నది. నా ఆయుధాలు గిన్నెలు, గరిటలే. అన్న పూర్ణాలయం నా గుండె, అక్కడి గంటల గణగణ నా గుండె కొట్టుకోవటం అని నిర్ద్వంద్వంగా పలికింది" అమ్మ. అది ఆగకుండా చూడమని మనకు ఆదేశమిచ్చింది.

అన్నపూర్ణాలయంలో అన్నం ఎవరికి పెట్టాలి? అన్న విచికిత్స జరిగింది. దానికి అమ్మ "వాడు సన్మార్గుడా, దుర్మార్గుడా, ధనికుడా, బీదవాడా, వాడికులం, మతం గురించి ఆలోచించవద్దు. వాడి డ్రెస్సు బట్టి, ఎడ్రస్సుబట్టి కాక ఆకలే అర్హతగా అన్నం పెట్టండని" ఆదేశించింది.

"మీకు పెట్టడం అది గుడ్డఅయిన, అన్నమయినా పెట్టడం మీకు నేర్పటానికే. జ్ఞానం అంటే మాటలు కావుగా నేను చేయకుండా మీకు చెప్పకూడదుగా. అందుకే ఈ అన్నపూర్ణాలయం" అన్నది అమ్మ చిరునవ్వుతో. "నాకు తెలిసింది ఒక్కటే. ఏది ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. మన ప్రయత్నమేమీ లేదు. మానవ ప్రయత్నానికి ప్రేరణ కల్పించేశక్తి మరొకటి ఉన్నదనీ అది ఎట్లా చేయిస్తే అట్లా నడుస్తున్నామని మనిపిస్తుంది" అన్నది అమ్మ.

రామకృష్ణ అన్నయ్యకు డయాబిటీస్ అందుకని బొబ్బట్లు ఒక అక్కయ్య పంచుతుంటే తీసుకోలేదు. "అమ్మ ప్రసాదం కదా ఏమీ చేయదు తీసుకో" అన్నది అక్కయ్య. వెంటనే అమ్మ వంక చూసాడు. అమ్మ చిన్నగా నవ్వుతూ "ఏమి చేయకపోతే ఇంక తినడమెందుకు?" అన్నది. ఆ ప్రశ్న మేలు చేస్తుందనే హామీ వినిపించి వెంటనే తినేశాడు. మధుమేహం వాళ్ళకు అమ్మ తీపి పదార్థాలు పెట్టడం, కడుపులో అల్సరు వున్న వాళ్ళకు ఆవకాయ అన్నం పెట్టడం చూస్తాం. వాటిపై అమ్మకున్న అధికార ప్రభావం వల్ల వాటి సహజ గుణాలు కోల్పోయి అమ్మ అనుగ్రహానికి ప్రతీకలవుతాయి. ప్రసాదంను నిర్వచిస్తూ అమ్మ "అనుగ్రహ ప్రసారమయిన పదార్థమే ప్రసాదం" అని చెప్పింది. మరి అమ్మ ప్రసాదం అపకారం ఎందుకు చేస్తుంది? అమ్మ ప్రసాదం సర్వవ్యాది ఉపశమన సామర్థ్యం కలది. శుభప్రదం. అమ్మ సర్వవ్యాధి ప్రసమని కదా!

మద్దినేని పూర్ణచంద్రరావు మన్నవ నివాసి. చిన్నతనం నుంచీ సీతాపతి తాతగారితో, చంద్రమౌళి వారి కుటుంబాలతో అవినాభావ సంబంధమున్న వ్యక్తి. సుబ్బారావన్నయ్యకు మంచి మిత్రుడు. పూర్ణచంద్రరావు రాఘవరావు మామయ్యతో కలిసి జిల్లెళ్ళమూడి వచ్చాడు.

అమ్మ చెప్పినట్లుగా "గడ్డిపోచలాంటి వాడిని ఉక్కు ఊచగా చేసి సంస్థకు అవసరమైన పనులను చేయించుకునేది. మొదటి నుంచి తెలిసో తెలియకో అమ్మతో పాటు హైమక్కకు నమస్కారం చేసుకునేవాడు. తరువాత తరువాత హైమని దైవంగా గుర్తించి పూజచేసేవాడు. హైమక్క "మాబోడి ఎక్కడ?" అనేది. అమ్మతో "నీకు చాలామంది పిల్లలున్నారు. నాకు ఒక్కడే కదా!" అని హైమక్క

అనేది. పూర్ణచంద్రరావు చిన్న పిల్లడుగా ఉన్నప్పటి నుంచీ అమ్మ దగ్గరకు రాకపోకలు వుండేవి. అందుకే బాల్య చాపల్యంతో చనువుగా అమ్మను గారెలు చేసిపెట్టమనేవాడు. అమ్మ కోమటి కొట్టుకు వెళ్ళి ఒక గిన్నెతో నూనె తెమ్మని పంపించేది. గారెలు వండాక మళ్ళీ ఆ గిన్నెడు నూనె కొట్లో ఇచ్చి రమ్మనేది! ఇది మహిమే కదా! ఎందుకంటే ఒకమారు కాగిన నూనెను కొట్టువాడు తిరిగి తీసుకోడు కదా!

14 సం॥ల వయస్సులో వీరయ్య చౌదరిగారు తాసిల్దారుగా వుండగా, అమ్మ గుడి గడపకు కావలసిన రాళ్ళను పూర్ణచంద్రరావు తీసుకు వచ్చాడు. 1958లో మంత్రోపదేశం చేసింది అమ్మ. అతని జీవిత రథ సారధి అమ్మే అయింది. "మన్నవ, రేటూరు గ్రామాల్లో అందరికీ భోజనాలు పెట్టించమని" ఆదేశించింది అమ్మ. అన్నయ్య ఎక్కడికి వెళ్ళినా, ఏ పనిచేసినా అమ్మ అదృశ్య హస్తం తోడుగా ఉండేది. ఆనామకుడిగా వున్నవాడిని ఇంత వాడ్ని చేసింది అమ్మేనని" ఎంతో పరవశంతో చెప్పాడు.

1980 నుండి 1982 వరకూ అన్నయ్యను సుదర్శన చక్రం పూర్ణచంద్రరావు అనేది అమ్మ. సంస్థలో ఎందులోనూ సభ్యుడు కాకపోయినా అనేక పనులను అమ్మ అన్నయ్యకు అప్పచెప్పేది. సంస్థతో సంబంధం లేకుండా తన పనులను అమ్మ అన్నయ్య చేత చేయించుకునేది. చందాల రూపంలో కాకుండా ఏదో విధంగా డబ్బు సమకూరేది. అన్నయ్య కారు అంటే అమ్మకు చాలా ఇష్టం. "ఆ బుల్లి ముండ ఎక్కడరా?" అని అడిగి ఆ కారును అమ్మే డ్రైవ్ చేసేది.

వైజాగ్ వాళ్ళకు ధాన్యాభిషేకం అప్పచెప్పినట్లుగా, హైమ జన్మదినం వేడుకను అన్నయ్యకు అప్పచెప్పింది అమ్మ. అప్పటి నుంచీ ఎంతో భక్తి శ్రద్ధలతో డబ్బుకు వెనకాడక ప్రతి సం॥ హైమ జయంతి వైభవంగా జరుపుతాడు.

అమ్మ భూమి మీద అవతరించి 75 వసంతాలు నిండిన సందర్భంగా అమ్మ ఆలయంలో విగ్రహ ప్రతిష్ఠ జరిగి పుష్కరకాలం అయిన సందర్భంగా అమృతోత్సవాలను అన్నయ్య రథసారధ్యం వహించిన తీరు ఎవరినైనా ఆశ్చర్యాన్ని,

ఆనందాన్ని కలిగించకమానదు. ఆ ఉత్సవాలకు ఏంపేరు పెట్టాలని అంతా తలమునకలు అవుతుంటే రామకృష్ణ అన్నయ్య "అమృతోత్సవాలని" పేరు పెట్టటం ఎంతో ఔచిత్యంతో కూడుకున్నది.

ఆ ఉత్సవాలలో దీక్ష తీసుకున్న వారందరికీ వెయ్యి మందికి పైగా దీక్షా వస్త్రాలను ఇచ్చారు. దీక్ష తీసుకున్న విద్యార్థులకు 40 రోజులు ప్రత్యేకించి సాయంత్రం అల్పాహారం చేయించి పెట్టించాడు. వారు, వీరు అని తేడా లేకుండా అందరియందు అతనికి గల అభిమానం, ఆప్యాయత వెల్లడవుతాయి. ఆ అమృతోత్సవాలకు మన రాష్ట్రం నుంచే కాక కర్ణాటక, తమిళనాడు మున్నగు రాష్ట్రాల నుంచి అధిక సంఖ్యలో పాల్గొనటం విశేషం.

నీ ఆనందాన్ని నలుగురుకు పంచు. నీ దుఃఖాన్నీ నీవే దిగమింగుకో అని కదా!నానుడి. ఉన్న ఒక్కగానొక్క కొడుకు మరణించినా అన్నయ్య ఆ దుఃఖాన్ని దిగమింగుకుని అమృతోత్సవాలను జరిపించిన తీరు శ్లాఘించవలసిన విషయమే.

పూర్ణచంద్రరావు "అమ్మా విమానం చేయించమ్మా! ఎక్కడికి వెళ్ళాలన్నా అందరం కలిసి వెళ్ళవచ్చు" అన్నడు. దానికి అమ్మ "అవమానం లేనిదే విమానం నాన్నా" అన్నది. చిన్న చిన్న మాటలతో అమ్మ చెప్పే తీరుకు ముగ్ధుల మవుతాము. అవి విన్నప్పుడే కాక అమ్మ మాటలు తలుచుకున్నప్పుడల్లా మన మానసం ఎటుపోతుందో! ఎవరికెరుక. తీపి తీపి గుర్తులను మనకోసం ఎన్నో వదిలి తాను భౌతికంగా మనకు దూరమైనా, మన మనస్సులో ఎల్లపుడూ నిండి వుండే అమ్మను ఏరకంగా వర్ణించగలము.

అమ్మ 1958వ సం॥లలో మన్నవ వెళ్ళింది. మహర్నవమినాడు అమ్మపూలు, పళ్ళు, పసుపు, కుంకమ రెండు జాకెట్టుగుడ్డలు మన్నవలోని రాజ్యలక్ష్మీ అమ్మవారికి తీసుకువెళ్ళి గడపలో నిలుచుంది. అమ్మవారి చేతి నుండి పూవు రాలింది. ఆ పువ్వు రాలటం చూస్తే అమ్మవారు అమ్మను ఆహ్వానిస్తున్నట్లుగా ఉంది. అమ్మ లోపలికి వెళ్ళి విగ్రహాన్ని అలా ఎత్తి కిందనున్న యంత్రాన్ని తీసింది. పూజారిగారిని పిలిచి దానిమీద ఉన్న బీజాక్షరాలను చూపించింది. అది రాజరాజేశ్వరి యంత్రం.

అమ్మ దగ్గర నిత్యం అర్చక స్థానంలో ఉండే రామకృష్ణన్నయ్యను, అమ్మ ఎవరి వివాహానికో వెళ్ళినప్పుడు పసివాడుగా ఉన్నప్పుడు అన్నయ్యను ఎత్తుకుని ఆ పసితనంలోనే అన్నయ్యను తన ఒడిలోకి తీసుకుంది. నాకు కావల్సిన వారిని నేనే వెతుక్కుంటాను, ఎంచుకుంటానని అమ్మ చెప్పింది. అమ్మకు జ్ఞాపకం అపారం. అంతా తానేయైన అమ్మకు కలలు, జ్ఞాపకాలు అంటూ వేరే ఉండవు కదా! మొట్టమొదట అమ్మ జననమొందినప్పుడు ఆ గదిలో ఎవరెవరున్నారో తెలియజేసింది. మొట్టమొదటిసారిగా బామ్మే అమ్మకు పాలు ఇచ్చిన సంగతి చెప్తే బామ్మ తెల్లబోయి ఈ విషయాలన్నీ ఎవరు చెప్పారమ్మా అని అడిగింది. దానికి అమ్మ నవ్వే సమాధానమయింది.

ప్రసాదరాయ కులపతిగారు గుంటూరు వాస్తవ్యులు. పుంభావ సరస్వతే దిగి వచ్చిందా అన్నట్లుగా ఉంటుంది ఆయన తీరు. ఆయన నిర్మల నిశ్చల సరస్సు అయితే వారి తమ్ముడు పి.ఎస్.ఆర్. ఉత్తుంగ ఝరీ ప్రవాహం, కులపతిగారికి అమ్మయందు ఎనలేని విశ్వాసం. మాతృశ్రీ పత్రిక ప్రారంభించిన నాటి నుంచీ వారి రచన లేకుండా ఉండేది కాదు అంటే అతిశయోక్తి కాదు. ఉభయ భాషలలో వారి పాండిత్యం అపారం. వెలకట్టలేనిది. వారు అమ్మ దగ్గర సరస్వతీ సామ్రాజ్యం నిర్వహించిన తీరు ఎవరికైనా ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలుగజేయక మానదు. అందులో దేవగురువుగా ఆయన పాత్ర సమయోచితంగా, సందర్భోచితంగా ఉంది. నిజంగా దేవగురువే దిగివచ్చాడా అన్నంతగా చూపరులకు పరవశం కలిగించింది. ఆయన ఠీవి, దర్పం, వర్చస్సు దిగ్భ్రాంతిని కలుగచేస్తుంది.

ప్రసాదరాయ కులపతిగారు **1959**లో గోవిందరాజుల దత్తుగారు, ఏకా ఆంజనేయులు గారి ద్వారా అమ్మ గురించి విన్నారు. నూతడక సత్యనారాయణ గారు, కృష్ణ భిక్షువు, కులపతి గారు మొట్టమొదటిసారిగా అమ్మను మన్నవలో దర్శించారు. ఆ తరువాత అమ్మను దర్శించటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఎవరో అమ్మ దగ్గర కొన్ని సందేహాలను వెలిబుచ్చారు. అమ్మ పక్కనే ఉన్న పుస్తకాన్ని కులపతిగారిని తీయమంది. అందులో వారి సందేహాలకు తగిన జవాబులున్నాయి.

కులపతిగారు మొదట్నించీ సాధనా మార్గంలో పయనించాలని వివాహమందు విముఖతగా వుండేవారు. జిల్లెళ్ళమూడి అమ్మ గృహిణిగా వుండి ఆబాల గోపాలాన్ని ఆనందింప చేసిన తీరుకు ముగ్ధులయ్యారు. దానితో వివాహం తన సాధనకు ప్రతిబంధకం కానేరదని వివాహం చేసుకున్నారు.

కులపతిగారు భార్యను జిల్లెళ్ళమూడి తీసుకువెళ్ళారు. అప్పుడు విపరీతమైన వర్షాలు. వరదతో జిల్లెళ్ళమూడి ద్వీపమే అయింది. ఆయన మొక్కవోని విశ్వాసంతో భార్యను ఆ వరదలో ఎత్తుకుని వచ్చారు. ఆయన ఆజానుబాహు మనిషి. ఆయన ముఖంలో సరస్వతీ కళ ఉట్టిపడుతుంది. శ్రీ ప్రసాదరాయ కులపతి అమ్మను చూచి దివ్యావేశంతో 300 శ్లోకాలు అమరీత్రిశతి, 700 పద్యాలు ఆంధ్రీసప్తశతి పేర వ్రాసి "అంబికా సాహస్రి" అనే గ్రంధం ప్రింటు చేయించారు. దానిలోని శ్లోకాలకు అర్ధ, తాత్పర్యాలతో సహా ప్రచురించాలని శ్రీ అధరావరపు శేషగిరిరావు అన్నయ్య సంస్థను నిర్వహిస్తున్న కాలంలో అనుకున్నారు.

1961 సంక్రాంతి నాడు కులపతి గారి ఖండకావ్యాన్ని ఆవిష్కరణ జరపాలని నిశ్చయించారు. ఆ రోజు అమ్మకు విపరీతమైన విరోచనాలు, వాంతులు, జ్వరం, ఈ స్థితిలో పెద్దలంతా వస్తే అమ్మ ఎలా కూర్చోగలదన్న తహతహ నాన్నగారిలో బయలుదేరింది. ముందుగా దత్తుగారు వచ్చారు. ఆవిష్కరణ సమయానికి స్నానం చేసి వచ్చి వేదిక మీద ఎటువంటి అసౌకర్యం లేకుండా అమ్మ కూర్చుంది. అవతార పురుషులకు ఇటువంటివి మామూలే కదా!

"నాకెట్లా ఉన్నా, నేనే స్థితిలో ఉన్నా, ఏమైనా ఈ శరీరం నిలవదని తోచినపుడు ముందుగా మీకు చెప్తానని" అమ్మ నాన్నగారికి హామీ ఇచ్చింది. ఏదైనా ముందుగా ఆమెకు తెలుస్తుందని, చెప్తుందన్న ధైర్యము, ఫరవాలేదన్న విశ్వాసము నాన్నగారికి ఉండేవి. అందుకే ఆ రోజు అంత అనారోగ్య పరిస్థితిలో ఉన్నా నాన్నగారు సరే అన్నారు.

అంబికా సాహస్రితో పాటూ మిన్నకంటి గురునాధ శర్మగారు రచించిన "అమ్మ" శ్రీ వాడరేవు సుబ్బారావుగారు సంకలనం చేసిన "మాతృశ్రీ అనసూయా

దేవి" కూడా ఆవిష్కరింపబడినాయి. అమ్మ శరీరం మీద రంగులు మారుతుండేవి. ఇప్పుడు హైమ ఉన్నట్లుగా చిన్నప్పుడు అమ్మ ఉండేది. రోజా రంగు చీర కట్టుకుంటే ఆ చీర రంగులో అమ్మ శరీరం రంగు కలిసిపోయేది. ఏ ఊరికైనా ప్రయాణమైనప్పుడు నాన్నగారు "వెళ్ళిరానా" అని అమ్మను అడిగేవారు.

104 డిగ్రీల జ్వరం కూడా అమ్మ పడుకోకుండా పనులు చేసేది. ఆ రోజుల్లో అమ్మ శిరస్సును తాకితే చేతికి రక్తం అంటుకునేది. ఆ రక్తం సువాసనలు వెదజల్లుతుండేది. ఒకమారు నాన్నగారికి అన్నం వడ్డిస్తుండగా అమ్మ భృకిటి నుండి రక్తం చిమ్మటం నాన్నగారు, హైమ చూచారు. ఆ రక్తం క్రింద పడగానే భస్మం అయింది. వెంటనే ఆ భస్మాన్ని నీళ్ళతో కలిపి తీర్థంగా సేవించారు. ఒకమారు పూర్ణచంద్రరావు అన్నయ్య ఊరికి వెళ్ళేముందు కొబ్బరికాయ కొట్టి, ప్రదక్షిణ చేసినా అమ్మ కళ్ళు తెరవలేదు. ఆయన ఆ రోజు వూరికి వెళ్ళలేదు. "మన చక్షువులకు బయట ఎట్లా కనపడ్తుందో లోపల మీ అమ్మగారికి అట్లా కనపడ్తుందని" నాన్నగారు చెప్పారు.

కృష్ణవేణక్కయ్య, రాములక్కయ్య అమ్మను చూస్తూ గంటలు గంటలు కూర్చునేవారు. వాళ్ళకు కాలం తెలిసేది కాదు. జిల్లెళ్ళమూడిలో కుక్క పిల్లికి పాలివ్వటం, ఆవు పాలు కుక్క తాగటం మున్నగు సందర్భాలు చాలా ఉన్నాయి. పిల్లి ఓంకారాన్ని పలికేది. అలాగే అఖండ నామం అప్పుడు కుక్క జయహో మాతా శ్రీ అనసూయ రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి" అని నామం చెప్పేది. అమ్మ గంటల తరబడి కదలకుండా కూర్చుని దర్శనమిచ్చేది.

ఇప్పుడు హైమాలయం ఉన్నచోట పాక ఉండేది. అందులోనే ఎవరు వచ్చినా అమ్మ దర్శనాలు ఇచ్చేది. మోదడుగు రామచంద్రయ్య గారు, ఓరుగంటి నరసింహయోగి గారు వస్తుండేవారు. కొందరికి ఏమీ లేదనిపించేది. మరికొందరికి అమ్మ దగ్గర ఏదో ఉందనిపించేది. 1954-56 ప్రాంతాల నుండి బాగా గుర్తింపు కలిగింది. అమ్మను చూడటానికి అనేకులు రావటం, రకరకాల మనుష్యులు, రకరకాల సమస్యలను అమ్మకు నివేదించడం అమ్మ వాటికి అలతి అలతి మాటలలో పరిష్కారాలను సూచించటం జరిగేది. ముందు ముందు జనం

ఏడవమైలు రాయి దగ్గర నుండే చూచి పోవాల్సి వస్తుందని అనేది. అమ్మకు వర్షం వచ్చినట్లుగా కల వస్తే మరునాడు కుంభవృష్టి కురిసేది. అటువంటి దృష్టాంతరాలు అమ్మ జీవితంలో ఎన్నెన్నో మైలు రాళ్ళుగా నిలచిపోయాయి. ప్రకృతి మీద అమ్మకు గల అధికారానికి అవాక్కు అయ్యేవారు.

కులపతిగారు స్నానం చేస్తూ అమ్మ సిద్ధి పొందిన తరువాత అమ్మను పిలిచారు. అమ్మ సాక్షాత్కరించింది. ఆయన సాధనా మార్గం గురించి అమ్మను అడిగారు. దానికి అమ్మ "పదిమందికి ఆదరంతో అన్నం పెట్టు నాయనా! అదే తపస్సు, అదే సాధన" అని తెలియచేసింది. సాధనకు, నలుగురికి ఆదరించి అన్నం పెట్టటానికీ సంబంధం ఏముంటుందని కులపతిగారు అనుకున్నారు. ఈలోగా పి.ఎస్.ఆర్. అన్నయ్య మనుమరాలు 2 1/2 సం॥ల పిల్ల అలేఖ్య వచ్చి "పూర్వం అమ్మకు సేవ చేసుకున్నాను. దాని ఫలితంగా ఈ జన్మలో అమ్మకు ఆత్మీయులైన కుటుంబంలో మళ్ళీ జన్మించానని" చెప్తూ మేడ దిగి వెళ్ళింది.

వర్షాలు కురవక అల్లాడిపోతున్నరోజుల్లో కుంభాభిషేకం చేయమని అమ్మ ఆనతి ఇచ్చింది. అమ్మ ఆజ్ఞ శిరసావహించి అక్కడి అన్నయ్యలు కుంభాభిషేకానికి ఏర్పాట్లు చేసారు. అది తెలిసి ఎందరెందరో దూరాభారం నుంచి కూడా జిల్లెళ్ళమూడి వేంచేసారు. కుంభాభిషేకం అయిన తరువాత ఇద్దరన్నయ్యలు వర్షంలో తడుస్తూ వెళ్తున్నారు. అది చూచిన ఒకరు ఆ విషయాన్ని అమ్మకు నివేదించారు. "కుంభాభిషేకం చేస్తే వర్షం వస్తుందంటున్నారు. అది ఏమిటో చూద్దామని వచ్చారు. వాళ్ళు అందుకని వారిని వానలో తడుస్తూ వెళ్ళనివ్వమ"ని అమ్మ సెలవిచ్చింది.

పి.ఎస్.ఆర్. ఆంజనేయ ప్రసాద్ గుంటూరు వాస్తవ్యుడు. విశ్వవిఖ్యాతి చెందిన శ్రీ ప్రసాదరాయ కులపతి గారి తమ్ముడు. అన్నగారు నిర్మల గంగాఝరీ, తమ్ముడు మహోగ్ర కెరటం. అన్నగారు పండిత జనరంజకుడు, తమ్ముడు సామాన్యుల హృదయాల్లోనికి సూటిగా గుచ్చుకునే పూలశరం. పురుషోత్తముని బిడ్డలయిన వీరు తండ్రికి పురుషోత్తములుగా వన్నె తెచ్చిన మహనీయులు.

తంగిరాల కేశవ శర్మ, ఆంజనేయులు మంచి స్నేహితులు. రాష్ట్రీయ

స్వయం సేవక సంఘంలో కార్యకర్తలు. కేశవన్నయ్య 1958లో గుంటూరు నేషనల్ పొగాకు కంపెనీలో గుమస్తాగా పని చేసేవాడు. కేశవన్నయ్య గుంటూరు నుండి జిల్లెళ్ళమూడి సైకిల్ మీద సాయంత్రం బయలుదేరి అమ్మ దర్శనంగావించుకుని మళ్ళీ తెల్లవారేటప్పటికి గుంటూరులో వుండేవారు. రానూపోనూ వందకిలో మీటర్లు ఒక్క పూటలో సైకిల్ ప్రయాణమంటే మాటలతో పనికాదు. దీని వలన అమ్మ యందు ఆయనకు గల అచంచల విశ్వాసం, అకుంఠిత దీక్ష మనకు అవగతమవుతుంది.

వారంలో 3,4 సార్లు ఆ విధంగా కేశవన్నయ్య అమ్మ దగ్గరకు వెళ్ళేవాడు. ఏదో ఆకర్షణ ఉంది. ఇష్టంలేకపోతే ఎవరూ అంతశ్రమ ఓర్చుకోలేరు కదా! అది ఏమిటి? అని కేశవ శర్మని పి.ఎస్.ఆర్. ప్రశ్నించాడు. దానికి ఆయన జిల్లెళ్ళమూడిలో ఒక అమ్మవారు వున్నది. ఆమె వాత్సల్య స్వరూపిణి. వేదాలను అరటిపండు ఒలిచి పెట్టినట్లు తేలిక మాటల్లో తెలియచేస్తుంది. అలతి అలతి పదాలతో వేదాల, ఉపనిషత్తుల సారాన్ని మనకు అందిస్తుందని చెప్పాడు. ఆమె చాలా మహిమాన్వితురాలని, ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలనిపిస్తుందని అవతారమూర్తే ఆమె అని తన ధృడ నిశ్చయాన్ని చెప్పాడు.

పి.ఎస్.ఆర్. అన్నయ్యకు దైవభక్తి, దేశభక్తి మెండు. కానీ స్వాముల వార్లన్నా, అమ్మలన్నా అంత ఇష్టపడేవాడు కాదు. కానీ పిచ్చిపట్టినట్లుగా, దయ్యం పట్టిన వాడిలా తిరుగుతున్న స్నేహితునితో పాటూ ఒకమారు ఆ విశేషమేమిటో చూద్దామని సైకిల్ మీద కేశవ శర్మతో బయలుదేరాడు. మున్ముందుగా చేబ్రోలు కాలవకట్టల మీదగా అమ్మ జన్మస్థలమైన మన్నవ వెళ్ళారు. అమ్మ పుట్టిన స్థలంలో చిన్న పాకవేసి అందులో అమ్మ ఫోటో పెట్టి కొందరు సోదరీమణులు నామ సంకీర్తన చేస్తున్నారు. అది పూర్తి అయిన తరువాత అమ్మ అన్నగారైన రాఘవరావు మామయ్య గారింటికి వెళ్ళారు. మామయ్యగారు బలవంతం చేయటంతో వారింట్లోనే భోజన కార్యక్రమం ముగించారు. జగన్మాత అయిన అమ్మ సహోదరునికి భోజన సదుపాయాలు చేయటం వింత అయిన విషయం కాదు

కదా! ఆ రక్తంలోనే అన్నపూర్ణాలయ వాసనలు జీర్ణించుకుపోయాయి. రాత్రి 9 గం॥లు కావడంతో ఆ రాత్రికి అక్కడే విశ్రమించారు. మళ్ళీ ఉదయమే కాలవకట్ట వెంబడి బయలుదేరి జిల్లెళ్ళమూడి చేరారు.

కేశవ అన్నయ్య అక్కడికి తరుచూ వెళ్తుండటంతో సరాసరి శాలవా పరిచిన ఒక నులక మంచం మీద కూర్చున్న అమ్మ వద్దకు పి.ఎస్.ఆర్. ని తీసుకువెళ్ళాడు. రక్త విరోచనాలతో చాలా బలహీనంగా ఉన్న అమ్మకు నమస్కరించి, కేశవ అన్నయ్య అక్కడ పనులలో పాల్గొనటానికి వెళ్ళాడు. పి.ఎస్.ఆర్. అన్నయ్య అమ్మకు 4,5 అడుగుల దూరంలో గోడకానుకుని కూర్చున్నాడు. అమ్మ అన్నయ్యను పలకరించలేదు. అన్నయ్య అమ్మకు నమస్కారం చేయలేదు. సుమారు 3 గం॥లు కూర్చున్న చోటినుండి కదలకుండా అమ్మనే చూస్తున్నాడు. ఇంతలో ఎవరో వచ్చి భోజనానికి రమ్మన్నారు. అమ్మ భర్త శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారిని అందరూ నాన్నగారు అని పిలుస్తారు. ఆయన ఆ వూరి కరణం. వారింట్లోనే భోజన ఏర్పాట్లు జరిగాయి. అమ్మ దర్శనార్థం వచ్చేవారే ఎవరికి అందుబాటులో ఉండే పనిని వారు చేసేవారు. ఈ పనికి అంటూ ఒకర్ని నిర్దేశించటం అంటూ వుండేది కాదు. ఆ విధంగా అక్కడికి విచ్చేసిన వరగాని కమలక్కయ్య ఆ రోజు ప్రేమతో వారికి వడ్డించింది. భోజనాంతరం అమ్మ వద్ద కూర్చున్నాడు. మళ్ళీ ప్రొద్దున లాగానే అమ్మ పలకరించలేదు. అన్నయ్య నమస్కరించలేదు.

ఆ సాయంత్రం గుంటూరుకు బయలుదేరారు. అమ్మతో మాట్లాడావా? అని కేశవన్నయ్య పి.ఎస్.ఆర్‌ను అడిగాడు. అమ్మ తనని పలకరించలేదని పి.ఎస్.ఆర్. చెప్పాడు. దానితో ఆశ్చర్యపోవటం అన్నయ్య వంతయింది. మామూలుగా అమ్మ అన్నం తిని రమ్మనో, ఎలా వున్నావనో పలుకరిస్తుంది. అలాంటిది నిన్ను పలకరించకపోవటమే ఆశ్చర్యం. నేను పరిచయం చేస్తాను అన్నాడు. తల్లికి, బిడ్డకు పరిచయం ఏమిటి? వద్దన్నాడు పి.ఎస్.ఆర్. అన్నయ్య. మళ్ళీ సైకిళ్ళమీద తిరుగుముఖం పట్టారు.

ఆ తరువాత దాదాపు రెండు సంవత్సరాలపైన జిల్లెళ్ళమూడికి

వెళ్ళకపోయినా అమ్మ ప్రభావం పి.ఎస్.ఆర్. అన్నయ్య మీద పనిచేస్తూనే ఉన్నది. అనేక పాటలు, పద్యాలు అమ్మ మీద వ్రాశాడు. ఒకమారు సంక్రాంతికి రెండవ మారు అమ్మను దర్శించారు. ఈ లోగా ఈయన అన్నగారైన కులపతిగారు అమ్మ మీద శ్లోకాలు వ్రాసి అంబికా సాహస్రి అనే గ్రంధాన్ని ప్రింటు చేయించారు. సంక్రాంతినాడు అంబికా సాహస్రి ఆవిష్కరింపబడింది. ఆ సభలో ఇంకా ఎవరైనా వ్రాసిన వారుంటే చదవమన్నారు. అప్పుడు పి.ఆర్.ఎస్. అన్నయ్య లేచి కొన్ని పద్యాలు చదివి అమ్మ మీద ఆయన రాసిన పాటలు పాడారు. అమ్మకు నమస్కరించకుండానే వచ్చి కూర్చున్నాడు.

అమ్మ వేదిక మీద మహామహోపండితులు సర్వశ్రీ కృష్ణబిక్షువు, గురునాధశర్మ, విద్యాసాగరశర్మ, కులపతి, పాతూరి వెంకటేశ్వరరావు, పురుషోత్తమరావు వంటి హేమాహేమీలు వుండగా అమ్మ పి.ఎస్.ఆర్. అన్నయ్యను తన దగ్గరకు పిలిచి తన మెడలోని దండను అన్నయ్య మెడలో వేసింది. నుదుట కుంకుమ దిద్ది, అన్నయ్యను ముద్దుపెట్టుకుని తన సరసన కూర్చోబెట్టుకున్నది అమ్మ. మళ్ళీ పద్యాలు చదివించుకుని విన్నది. వచ్చే ఆదివారం వస్తావుగా! అని అన్యాపదేశంగా రమ్మని సూచించింది. అప్పటినుంచీ జిల్లెళ్ళమూడి తరుచూ వెళ్తూనే వున్నాడు.

ఒకమారు సాయంత్రం బయలుదేరి మర్రిపూడి గుళ్ళవద్ద బస్సుదిగి నడిచి జిల్లెళ్ళమూడి వెళ్తున్నాడు. వూండ్ల తరువాత జిల్లెళ్ళమూడి ఊరి బయట పంట కాలవ ఉన్నది. నీరు ఉధృతంగా ప్రవహిస్తున్నది. కాలువకు రేవు ఎక్కడ వుందో, ఎక్కడ దాటాలో తెలియలేదు. అందులోనూ ఒంటరిగా అమ్మ దర్శనార్ధం వస్తున్నాడు. కాలవగట్టు వెంబడే అటూ ఇటూ తిరిగాడు. స్థానికులు ఎవరైనా కనిపిస్తే ఏ ప్రదేశంలో కాలువ దాటవచ్చో చెప్తారని మళ్ళీ తిరిగాడు. ఆ చలిలో రాత్రిపూట ఒకడు కాలవగట్టున గడ్డి కప్పుకుని పడుకుని ఉండటం కనిపించింది. అతణ్ణి లేపి తోవ చూపించమని అడిగాడు. అతను బద్ధకంతో, విసుగుదలతో అమ్మ దగ్గరకా వెళ్ళేది అంటూ కాలవ ఎక్కడ దాటాలో చూపించాడు. అతనికి కాఫీ తాగమని కొంత చిల్లర ఇచ్చాడు. అతను చూపిన దగ్గర కాలవ దాటి

అర్ధరాత్రి 12 గం॥లకు అమ్మ దగ్గరకు చేరి అమ్మకు నమస్కరించి కూర్చున్నాడు. వెంటనే అమ్మ కాలవదాటించిన వాడికి ఎంత డబ్బులిచ్చావన్నది. డబ్బులేమిటి? అన్నాడు. కాఫీ త్రాగమని డబ్బులిచ్చావు గదా! అని అడిగింది. దానితో విస్తుపోయాడు. అమ్మ విశ్వవాప్తిని కదా! అమ్మ ఆ విధంగా అడిగేటప్పటికి అమ్మే అర్ధరాత్రి తనకు త్రోవ చూపించిందన్న విశ్వాసం పెరిగింది. ఆ సంఘటన అన్నయ్యకు నమ్మకం ఏర్పడటానికి బాగా దోహదపడింది.

పి.ఎస్.ఆర్. అన్నయ్యకు కిడ్నీలో రాళ్ళు ఏర్పడటంతో విపరీతమైన బాధతో డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. ఆయన టెస్టుచేసి 200 రూపాయల మందులు రాసారు. అప్పటికి అన్నయ్య జీతం 160 రూపాయలు మాత్రమే. దానితో సంసారం గడపటమే బహుకష్టమయిన రోజుల్లో 200 రూపాయల మందులు కొని వాడటానికి మనసొప్పక వూరుకున్నాడు.

ఒకరోజు అమ్మ ఆవరణలో వుండగా కడుపు నొప్పితో మెలికలు తిరుగుతూ బాధపడ్తున్నాడు. అమ్మ చిన్న కొడుకు రవి అది చూచి అమ్మ దగ్గరకు వెళ్ళి అన్నయ్య బాధపడ్తున్న విషయం చెప్పాడు. అమ్మ "వాడ్ని ఇటు తీసుకురండి" అని చెప్పింది. అన్నయ్య వెళ్ళి అమ్మ దగ్గర కూర్చున్నాడు" ఏమిటిరా? అని అమ్మ అడిగింది. తన బాధ అమ్మకు నివేదించుకున్నాడు. "ఏమీ లేదులే" అని అమ్మ అన్నది. "ఏమీ లేదు అంటే ఎలా అమ్మా? అనుభవిస్తున్నాను కదా!" అన్నడు. "ఏం లేదు లేరా" అని అమ్మ మళ్ళీ అన్నది. "బాధ పడేది నేనైతే ఏం లేదంటావేమిటి?" అని అమ్మనే ప్రశ్నించాడు. "ఏం లేదురా" అంటుంటే ఉడుకుమోత్తనం ముంచుకొచ్చింది. అలాగే ఓర్చుకుంటూ కాసేపు అమ్మ దగ్గరే కూర్చున్నాడు. తాను ఇంత బాధ పడ్తుంటే అమ్మ లేదంటుందేమిటి అని మధనపడ్డాడు. ఈ లోగా పాస్‌కు వెళ్ళాలనిపించి బయటకు వెళ్ళి పాస్ పోసుకుంటుంటే అందులో రాయి పడిపోయిన అనుభూతి కలిగింది. ఆ తరువాత 30 ఏళ్ళపాటు ఏ రకమైన బాధా లేకుండా హాయిగా వుండగల్గటం అమ్మ అనుగ్రహమే కారణమని అన్నయ్య విశ్వాసం. "తోలు నోరు కాదు కదా! తాలు మాట రావటానికి".

అన్నయ్య ఒకమారు అమ్మతో అభిషేకం చేసుకుంటానని చెప్పాడు. "విశేషం ఏమిటి?" అని అమ్మ అడిగింది. ఆ రోజు తన జన్మదినం అని చెప్పాడు. అమ్మ మన ఇష్టానుసారమే జరిపిస్తుంది కదా! అన్నయ్య రిక్తహస్తాలతో జిల్లెళ్ళమూడి వెళ్ళినా అమ్మ చీరె, రవిక గుడ్డ ఇచ్చి అన్నయ్య చేత తను పెట్టించుకుంది. అమ్మ స్నానం చేస్తూ అన్నయ్యకు కబురు చేసింది. అన్నయ్య వెళ్ళి అమ్మ పాదాలకు అభిషేకం చేసుకున్నాడు. అమ్మ అన్నయ్య చేత పెట్టించుకున్న చీరె కట్టుకు వచ్చి, అన్నయ్య చేత పూజ చేయించుకుని, అన్నయ్యకు నూతన వస్త్రాలు పెట్టింది. ఇలా ఏ దేవుడి దగ్గరైనా జరుగుతుందా? అన్నయ్యకు ఆ మధురానుభూతితో కళ్ళల్లో నీళ్ళు తిరిగి, గొంతు మూగబోయింది. తానే గుడ్డలిచ్చి పెట్టించుకుని, పూజ చేయించుకుని, వరాలు ఇచ్చే దేవత ఎక్కడ దొరుకుతుంది. ఒక్క జిల్లెళ్ళమూడిలో తప్ప. జీవితంలో జిల్లెళ్ళమూడికే దత్తత అయినాడు. అమ్మ "మిమ్మల్నందర్నీ నేనే కన్నాను. మీ తల్లులకు పెంపుడిచ్చానని" అంటుంది కదా!

దసరాల్లో నవరాత్రి పూజలయ్యాక ఆ నిర్మాల్యాన్ని ఓంకార నదిలో కలిపి రావటం ఆచారం. అందరూ కలసి కాలవకు వెళ్ళి తిరిగి వస్తుండగా తంగిరాల సింహాద్రి శాస్త్రి గారి భార్య విజయక్కయ్య తాళిబొట్టు, తాడు కాలవలో పడిపోయిందని గోలపెట్టింది. తిరిగి అంతానది దగ్గరకు వెళ్ళి వెతికారు. ఆశ్చర్యం మొలలోతు నీళ్ళలో ఆ తాళిబొట్టుతో వున్న బంగారపు తాడు అన్నయ్యకు దొరికింది. ఆ విషయాన్ని అమ్మతో శాస్త్రి అన్నయ్య చెప్పాడు. "వాడు ఆంజనేయుడు కదా! వాడికి దొరక్కపోతే ఎవరికి దొరుకుతుంది? అన్న ఆ మాటతో అన్నయ్య హృదయం ఆనంద పారవశ్యంతో నిండిపోయింది.

పి.ఎస్.ఆర్. అన్నయ్య భార్యకు ఆపరేషన్ చేయించాలని డాక్టర్లు చెప్పారు. కానీ అన్నయ్య అమ్మ మీద కల అచంచల విశ్వాసంతో ఆపరేషన్ చేయించటానికి బదులు అమ్మ దగ్గరకు తీసుకువచ్చాడు. "నీ దగ్గరకే తీసుకువచ్చాను. నీకు తప్పించి నా బాధ ఎవరితో చెప్పుకుంటాను" అని అన్నాడు. దానికి అమ్మ "చూడరా! వాడు ఏమంటున్నాడో?" అన్నది. పక్కనే ఉన్న రామకృష్ణ అన్నయ్య

అది నిజమే కదమ్మా! నీకు చెప్పుకోకపోతే ఎవరికి చెప్పుకుంటాడు" అని అన్నాడు. ఆ తరువాత ఎటువంటి ఆపరేషన్ అవసరం లేకుండానే ఆమెకు స్వస్థత చేకూరింది.

తరువాత ప్రతి విషయంలో అడుగడుగునా అన్నయ్య జీవితంలో అమ్మ ప్రమేయం వుందన్న సంగతి నిశ్చయంగా తెలుస్తోంది. జీవితమే అమ్మదయినపుడు అమ్మ ప్రమేయం ఉండకుండా ఎలా ఉంటుంది? అని అమిత విశ్వాసంతో, అపారమైన నమ్మకంతో అలవి మాలిన ఆనందంతో తెలియచేసాడు.

అమ్మ అదృశ్య శక్తిగా అన్నయ్య చేత అనేక రచనలు చేయించింది. "ఆనందనందనం" "తులసీదళాలు", "మాతృశ్రీదర్పణం" అనే పద్య వచన సంకలనాలు, గిరిబాలగీతాలు అనే గేయ సంకలనం, మాతృశ్రీ మహత్యం అనే వ్యాస సంకలనం, మల్లెలు - మొల్లలు అనే భావ పుష్పాలు అమ్మకు అన్నయ్య విరిమాలగా సమర్పించాడు. వజ్రోత్సవాల సందర్భంగా అమ్మకు సమర్పించిన మరో పుష్పం "అనుభవాల మూట - అమ్మ మాట". అన్నయ్య లేఖిని నుండి ఇంకా ఎన్నెన్నో అనర్ఘ రత్నాలు వెలువడాలని అభిలషించుదాము.

కోనా సుబ్బారావు గారు చీరాల నివాసి. రామభక్తులైన రంగన్న బాబుగారు వీరింటికి తరుచూ వస్తూ పోతూ ఉండేవారు. ఆయన "జిల్లెళ్ళమూడి అమ్మ దగ్గరకు వెళ్ళివచ్చానని, వాడే వీడు" అన్నారు. ఆ రాముడే అమ్మ అని ఆయన విశ్వాసం. వచ్చినప్పుడల్లా అమ్మ గురించి తెలియ చేస్తుండేవారు.

కోనా సుబ్బారావు గారు ఆయన స్నేహితులు బాపట్లలో వుండగా నాగులు భార్యకు హిస్టీరియా అని చెప్పుకోవటం విన్నారు. నాన్నగారిని వారి బంధువులంతా నాగులు అని పిలిచేవారు. అప్పటికే చీరాల అక్కిరాజు గారు వాళ్ళూ అమ్మ దగ్గరికి వెళ్తుండే వాళ్ళు. నోరి వెంకటేశ్వర్లుగారు, రాజుపాలెం రామచంద్రరావు గారు వాళ్ళతో కలిసి సుబ్బారావుగారు (శనివారం వెళ్ళి ఆదివారం బయలుదేరి వచ్చేవారు). ఒకమారు శనివారం జిల్లెళ్ళమూడి బయలుదేరారు. అదే సమయంలో అమ్మ పెద్ద కొడుకు సుబ్బారావన్నయ్య చేత వాళ్ళను రావద్దని కబురు పెట్టింది. ఏమిటో ఎప్పుడూ లేనిది అమ్మ ఈ విధంగా కబురు పెట్టిందని ఆశ్చర్యపోయారు.

సరిగా అదేరోజు రాత్రి కోనా సుబ్బారావు గారి అమ్మాయి అకస్మాత్తుగా అనారోగ్యం పాలై 6 నెలల పిల్ల చనిపోయింది. కాలస్వరూపిణి అయిన అమ్మకు తెలియనిది లేదు కదా! అందుకే అమ్మ వారికి ముందుగానే రావద్దని కబురు చేసింది. అమ్మ యొక్క అవ్యాజ కరుణకు అంజలి ఘటించారు.

వారం రోజుల తరువాత కోనా సుబ్బారావు గారు అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడి వెళ్ళి ఫోటో తెచ్చుకుని అర్చించటం మొదలుపెట్టారు. ఆయనకు నెలరోజుల తరువాత జబ్బుచేసి చాలా సీరియస్ అయింది. అమ్మ జిల్లెళ్ళమూడి నుండి తీర్థ ప్రసాదాలను పంపింది. సుబ్బారావు గారి భార్య అమ్మను చూడకపోయినా పెద్ద ముత్తైదువు తీర్థ ప్రసాదాలు పంపటంతో ఆమెలో ఉన్న ఆదుర్దా తగ్గింది. అమ్మే చూసుకుంటుందన్న ధైర్యమూ కలిగింది. వాడు అడిగినవన్నీ పెట్టమని, ఆయనకు ఆయుష్షును ఇచ్చానని అమ్మ కబురు పెట్టింది. ఆరోగ్యం కుదటపడిన తరువాత సుబ్బారావు గారు అమ్మ దర్శనం చేసుకున్నాడు.

1958 మాఘ పౌర్ణమికి కుటుంబాన్ని తీసుకురమ్మని అమ్మ చెప్పింది. ఎల్లుండి పౌర్ణమనగా జిల్లెళ్ళమూడికి బయల్దేరారు. వారి పెద్దమ్మాయి అయిన వసుంధరక్కయ్యకు అమ్మను గురించి విన్నప్పటి నుంచీ అమ్మని ఎప్పుడు చూద్దామన్న తపన బయలుదేరింది. ఊరు దగ్గరికి వచ్చినా ఆ ఇల్లు కనపడట్లేదని తహతహలాడింది.

ప్రస్తుతం నాగేంద్రుడ్ని ప్రతిష్టించిన రావి చెట్టుకి ఎదురుగా నాన్నగారి ఇల్లు ఉండేది. దానికి దక్షిణం ప్రక్క బేరన్ ఉండేది. బేరన్ దగ్గర్నుంచి కొత్తగా వేయబడిన తాటాకు పందిళ్ళు కనువిందుగావించాయి. గుర్రపు బండి చప్పుడు విని ఇల్లు చిమ్ముతున్న అమ్మ ఆ చీపురుతోనే వాళ్ళకు దర్శనమిచ్చింది. కడుపు శోకంతో ఉన్న అక్కయ్యను కౌగలించుకుని ఆమెకు ఓదార్పును ప్రసాదించింది. అమ్మ ఎదురుగా ఉన్న చెట్ల క్రింద చాపవేసి మంచినీళ్ళు ఇచ్చి హైమను పిలిచి వారికి పరిచయం చేసింది. అప్పటికి వసుంధరక్కయ్యకు 15 సం॥లు.

1958వ సం॥ వరకు అమ్మే వంట చేసేది. అప్పుడు అమ్మ వీరికి వడ్డన

చేసింది. ఆ రోజుల్లో అరటిపళ్ళు, జీడిమామిడి పళ్ళు కలిపి పెట్టిన పులుసు ఘుమఘుమలాడుతూ అతి మధురంగా ఉండేది. అమ్మ చేతి వంట తిన్నవారు ఎంత అదృష్టవంతులో కదా! మా అమ్మగారు అన్నంరాజు దుర్గాంబగారికి అమ్మ చేసిన గోంగూర పులుసు తినే అదృష్టం కలిగింది.

వసుంధరక్కయ్యకు అమ్మను చూసిన దగ్గర్నుంచీ అమ్మ దగ్గర కూర్చోవాలన్న కోరిక వెన్నెల కోసం ఎదురు చూసే చకోరపక్షిలా, వాన చినుకులై తపించే చాతకంలా ఆ క్షణం కోసం పరితపించింది. అమ్మ పందిరంతా తానై, నలుదిక్కులా తిరుగుతూ వచ్చినవారి అవసరాలను కనుక్కుంటోంది.

అమ్మ ఇంటికి ఎదురుగా ఒక పాక ఉంది. ఆ పాకలోని ముందు గదిలో ఒక పుట్ట ఉంది. (మొదట్లో అమ్మ వచ్చిన వారికి ఆపుట్టమన్నునే ప్రసాదంగా ఇచ్చేది. ఆ మన్ను సువాసనలు వెదజల్లేది) మధ్యలో తడిక అడ్డంగా ఉండి మరొక గది ఉంది. ఆ రాత్రి భోజనాంతరం అమ్మ దగ్గరకు వెళ్ళాలన్న తపన ఉన్న అక్కయ్య అవకాశం కొరకు ఎదురు తెన్నులు చూచింది. అమ్మ పాకలోకి వెళ్ళటం గమనించిన అక్కయ్య మెల్లగా అమ్మ వెనకనే దొడ్డి వాకిట ద్వారా లోపలికి అడుగు పెట్టింది.

ఒక పక్కగా మాఘ పౌర్ణమికి కావలసిన సరుకులు కూరలు ఉన్నాయి, చీకటి, అక్కయ్య అడుగుల చప్పుడు విన్న అమ్మ "ఎవరు?" అని ప్రశ్నించింది. "నేనేనమ్మా" అన్నది అక్కయ్య మెల్లగా, అమ్మ వెంటనే "సుబ్బారావు కూతురివా? ఏమిటి చీకట్లో వచ్చావు?" అన్నది అమ్మ. "నీ దగ్గర కాస్సేపు కూర్చుందామని" అంటూ అమ్మ దగ్గరికి వెళ్ళింది. అమ్మ దగ్గర రవి, రాజుబావ ఉన్నారు. అక్కయ్య కొంతసేపు అమ్మకు విసిరింది. కాళ్ళు పిసుకుతానని అమ్మను కోరింది. దానికి అమ్మ "సరే" అన్నది.

అమ్మ శరీరం బంగారంలా మెరిసిపోతుంది. తన చేతులు మసి బొగ్గుల్లా ఉన్నాయనిపించింది అక్కయ్యకు. ఒక గంట తరువాత వెళ్ళి పడుకోమంది అమ్మ. ఒకటికి రెండుసార్లు అమ్మ చెప్పాక బాగుండదని అమ్మను వదిలి

వెళ్ళటానికి మనసు ఒప్పకపోయినా బలవంతంగా వెళ్ళింది. అమ్మను దర్శించిన క్షణం నుండీ అమ్మ కావాలనీ, అమ్మ దగ్గరే కూర్చోవాలనీ, అమ్మతోనే గడపాలన్న తీవ్రమైన కాంక్ష ఉత్పన్నమైంది. మరునాడు కూడా అమ్మ పర్యవేక్షణతోనే గడిచింది. రేపు అమ్మ మంత్రోపదేశం చేస్తుంది అన్నవార్త తెలిసింది.

నదికి వెళ్ళటానికి నాన్నగారు "బండి కట్టిస్తాను, నడిచి వెళ్ళొద్దు" అన్నారు. "10 ని.లలో బండి రెడీ అయితే సరే లేకపోతే నడిచే వెళ్తాను" అన్నది అమ్మ. బండి రావటం ఆలస్యమవటంతో అమ్మ నదికి నడిచే వెళ్ళింది. అమ్మ నడకను మిగిలిన వారు పరుగుతో కూడా అందుకోలేకపోయారు. పున్నమినాటి వెన్నెల్లో ఆ నది ఆహ్లాదకరంగా ఉంది. అమ్మ నదిలోకి దిగి నడుం లోతువరకు వెళ్ళింది. ప్రవాహ వేగం బాగా ఉన్నది. వెన్నెలను చూచి నీరు ఉప్పొంగుతుంది. అందులోనూ అమ్మని చూచిన నది పరవళ్ళు తొక్కింది. చాలా మంది నదిలోదిగి స్నానాలు చేస్తున్నారు.

ఒడ్డునే ఉన్న వసుంధరక్కయ్యకు తనకు కూడా అమ్మ మంత్రోపదేశం చేస్తే బాగుంటుందని ఆరాటం, తాను అమ్మ దగ్గరకి వెళ్ళాలన్న తపనతో ప్రక్కనున్న వారితో చెప్పింది. "నువ్వు చిన్న పిల్లవు నీకెందుకు?" అన్నారు. సహస్రాక్షి అయిన అమ్మ మంత్రోపదేశం చేస్తున్నా అక్కయ్య ఆవేదనను, ఆర్తిని గమనించి అక్కయ్యను పంపించమని చెయ్యి ఊపింది. వాళ్ళు ఆశ్చర్యపోయారు. అక్కయ్యకూ అమ్మ మంత్రోపదేశం చేసింది. 600 మందికి మంత్రోపదేశం చేసినా వెన్నెల బాగానే ఉంది. ఎవ్వరినీ వెంట రావద్దని నదిలో ఇంకా ముందుకు వెళ్ళి ఒంటరిగా అరగంటసేపు ఉండి ఒడ్డుకు చేరింది అమ్మ.

అమ్మ దర్శనానంతరం ఇంటికి వెళ్ళాలంటే చాలా బాధగా ఉండేది అక్కయ్యకు. ఎప్పుడు వచ్చినా అమ్మ బ్రతిమాలి పంపేది. తప్పనిసరి అయి వెళ్ళినా మళ్ళీ వచ్చేస్తుండేది. ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలయ్యాక తన స్నేహితురాలు వరలక్ష్మిని తీసుకుని వచ్చింది. ఆ విధంగా ఎక్కువకాలం అమ్మ దగ్గర, తక్కువ కాలం ఇంటి దగ్గర గడిపేది వసుంధరక్కయ్య.

1962 ఆగష్టు 9వ తేదీన అమ్మ చీరాల వెళ్ళింది. జిల్లెళ్ళమూడికి వెళ్తూ "నాతో పాటూ వసుంధరను తీసుకు వెళ్తున్నానని, ఆమె తన వ్యక్తి అని, అక్కయ్య బరువు బాధ్యతలన్నీ తనవేనని సుబ్బారావు గారికి చెప్పి తీసుకువెళ్ళింది. ఆనాటి నుంచీ అక్కయ్యకు ఆరోగ్యం సరిగా లేకపోయినా ఇంటికి కబురు చేయకుండా తానే పూర్తి బాధ్యత వహించింది.

1963 చీరాల ఆచార్యులు గారు అమ్మ లాకెట్స్ తీసుకువచ్చారు. అందరికీ ఒకముడి తాను వేసి రెండవముడి వాళ్ళనే వేసుకోమంది. వసుందరక్కయ్యకు మాత్రము రెండు ముడులూ తానే వేసింది. మూడవ ముడి కూడా నువ్వే వెయ్యమ్మా! అని అక్కయ్య అడిగింది "అచ్చం పెళ్ళికూతురిలా కూర్చున్నావే? ఏం వేరే పెళ్ళి వద్దనా" అన్నది అమ్మ. "అవునమ్మా! వద్దు, నీకంటే ఇంక ఎవరు కావాలని?" అక్కయ్య అన్నది.

8 సం॥లప్పుడు వసుంధరక్కయ్య బాపట్లలో ఆంజనేయస్వామి దేవాలయానికి వెళ్ళినప్పుడు భగవంతుడు భర్తగా కావాలని కోరుకుందనీ వాళ్ళ తాతగారు తెలియచేసారు. 1957లో కోన సుబ్బారావు గారికి జబ్బు చేసినప్పుడు పరీక్షలకు వెళ్ళలేదు. కోన సుబ్బారావు గారి భార్య వెంకాయమ్మకు తిరుపతి వెళ్తునట్లు కలరావటం, వాళ్ళు జిల్లెళ్ళమూడి వెళ్ళటం జరిగేది. ఒకమారు వెంకాయమ్మకు అమ్మ విష్ణుమూర్తిలా, వసుంధరక్కయ్య కాళ్ళు పిసుకుతూ లక్ష్మీదేవిలా కలవచ్చింది. చిన్నప్పటి నుంచి వసుంధరక్కయ్య చాకిరీకే అంకితమయింది. వాళ్ళ అమ్మకు ఆరోగ్యం సరిగావుండేది కాదు. ఒకరోజు ఒకరు, మరొకరోజు మరొకరూ ఇద్దరు పిల్లలు, అంతకు ముందు 6 నెలల పిల్లా చనిపోయారు.

అక్కయ్యను పెళ్ళి చూపులకని రెండు మూడుమార్లు చీరాల పంపించింది అమ్మ. తరువాత పశువుల సంతకాదు మాటిమాటికీ చూపించటానికి, నేను దాన్ని పంపించననీ, దానికి సంబంధాలు చూడవద్దనీ కోనా సుబ్బారావుగారితో ఖచ్చితంగా చెప్పింది అమ్మ. రుక్మిణమ్మకు వసుంధరక్కయ్య అమ్మకు చేసే

సేవ చూచి "వసుంధర అమ్మను చేసుకొని ఇక్కడే వుండిపోతే బాగుండునని అనిపించేదిట. వసుంధరక్కయ్యకు ఒక నల్లపూస దొరికితే అమ్మకు ఇచ్చి కట్టమందిట. బీర్వాలో మంగళసూత్రాలున్నాయి అవీ తెచ్చుకోమని మే 5 కు కడ్తాన్నది. " నీ అంత అవ్వాలనా?" అని రామకృష్ణ అన్నయ్య అడిగాడు. "నా అంత పొట్టిగా అవ్వలేదు లేరా" అన్నది అమ్మ. పూర్వమేలాకెట్లుకు రెండు ముళ్ళు వేసి, నల్లపూసకు ముడివేసి పూర్తి అక్కయ్య బాధ్యతను తానే తీసుకున్నానని నిరూపించింది.

1965లో బామ్మ పోయినప్పుడు మాసికాలకు అమ్మను దీపారాధన చేయటానికి రమ్మన్నప్పుడు అమ్మ పాదుకలను విడచి వత్తివేసి వెలిగించింది. "అది చూసిన వసుంధరక్కయ్య ఒక వత్తే వేస్తారా?" అని అడిగింది. "నేను పోయినప్పుడు ఇలాగే చెయ్యి. అప్పుడు సుబ్బారావు, రవి ఎక్కడుంటారో" అని చెప్పింది అమ్మ. అమ్మ చెప్పిన విధంగానే అమ్మ సిద్ధి పొందినప్పుడు వసుంధరక్కయ్యే దీపారాధన చెయ్యటం జరిగింది.

ఒకానొక సందర్భంలో నన్ను తీసుకెళ్ళమ్మా! అని అక్కయ్య ఎంతగానో వేడుకుంది. "నువ్వు లేకపోతే నాకెవరున్నారని" అమ్మ అన్నది. దానికి అక్కయ్య "నేను లేకపోతే నీకు చాలా మంది ఉంటారు. నువ్వు లేకపోతేనే నాకు కష్టమమ్మా" అన్నది. "ఎంతమంది ఉన్నా నువ్వు ఉన్నట్లు ఉండదు. నాకు నువ్వు కావాలి. నన్ను దాటించటం నీ ధర్మం. ఇంకెప్పుడూ నా ముందు పోవాలనుకోవద్దు. ముందు పోవాలనుకోవడం నీ ఇష్టమేనా?" అని గంభీరంగా అన్నది. దానితో అక్కయ్య మరి మాట్లాడలేకపోయింది.

ఎంతమంది పిల్లలున్నా వారందరిలా వసుంధరక్కయ్యను చిన్న పిల్లలా చూడక, ఒక బాధ్యత గల స్త్రీగానే చూచేది అమ్మ. భద్రాద్రి తాతయ్య గారు భగవద్గీత నాటకంగా రిహార్సల్స్ చేయించారు. ఆ నాటకంలో హైమ భూదేవి, వసుంధర ధృతరాష్ట్రుడు, బాల, రమణ ఇద్దరు కృష్ణులు. ఆ నాటకం అమ్మకు చూపించారు. ఈ తరువాత బాగా ప్రచారం చేసినందు వల్ల జనం విపరీతంగా వచ్చారు. సుబ్బారావుగారికి వసుంధరక్కయ్యకు మేకప్ వేయించటం ఇష్టం

లేకపోవడంతో ఆ నాటకం ఆగిపోయింది. ముఖానికి రంగు పుసుకుని నాటకాల్లో వేస్తే పెళ్ళి ఎలా అవుతుందని ఆయన భయం.

వసుంధరక్కయ్యకు కలరా వచ్చింది. డాక్టరు సాంబయ్య వైద్యం చేశాడు. బామ్మ వసుంధరక్కయ్యతో "నీవెక్కడికీ వెళ్ళకే ఆ నాన్న అయితేనేం, ఈ నాన్న అయితేనేం వీళ్ళిద్దర్నీ కనిపెట్టకొని ఇక్కడే ఉండమని" చెప్పింది.

కోనా సుబ్బారావు గారు తన కూతురు పెళ్ళికి స్వర్ణనుంచీ సరుకులు, రేటూరు నుంచి పెరుగు పాలు తెప్పించాలని పందిళ్ళు వేసి లైట్లు వెలుగుల్లో వైభవంగా పెళ్ళి చేయాలని ఎప్పుడూ అనుకునేవారు. సుబ్బారావుగారు అనుకున్నట్లుగానే అన్ని ఏర్పాట్లు చేయించింది అమ్మ. **1966** మే 5వ తేదీన వసుంధరక్కయ్య పెళ్ళి అని చెప్పింది. పెళ్ళి కూతుర్ని చేసి పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టారు. పెళ్ళికొడుకు ఎవరో ఎవ్వరికీ తెలీదు. ఆఖరికి వసుంధరక్కయ్యకు కూడా తెలీదు. అమ్మ మీదే భారం వేసి పెళ్ళిపీటల మీద కూర్చుంది. హఠాత్తుగా బియ్యంలోని మంగళసూత్రాలను తీసి వేలాది జన సమక్షంలో, మంగళ వాద్యాల నడుమ అక్కయ్య మెడలో మంగళసూత్రం కట్టి, తలంబ్రాలు పోసి శాస్త్రబద్ధమైన కళ్యాణం చేసుకొని లోకాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది. ముందు నుంచీ అక్కయ్య తనకు తానుగా అమ్మ పాదాలకు అంకితం చేసుకున్న నిస్వార్థ మహోన్నత వ్యక్తి.

అమ్మ వసుంధరను పెళ్ళి చేసుకుందని అధరావరపు శేషగిరిరావన్నయ్యకు చాలా కోపం వచ్చింది. గృహప్రవేశంకు కొత్త గుడ్డలు పరిచి వారిద్దరినీ నడిపిస్తూ తీసుకువెళ్ళి హారతిచ్చారు. మేజువాణీకి పాన్పువేశారు. వసుంధరక్కయ్యను వివాహం చేసుకున్నానని చీరాల డాక్టరు గారితో చెప్పి ఆవిషయాన్ని కోన సుబ్బారావుగారికి చెప్పమంది అమ్మ. ఆయన కోరిక మేరకు పందిళ్ళలోనే, లైట్ల వెలుగులోనే పెళ్ళి జరిగిందని చెప్పమంది. కోన సుబ్బారావు గారు మూడు నిద్రలకు వచ్చినప్పుడు ధోవతలు, చొక్కాలు, బనియన్లు, తలపాగా అమ్మకు సమర్పించుకున్నారు.

వసుంధరక్కయ్య తల్లి వెంకాయమ్మగారికి ఒంట్లో బాగుండకపోతే తన దగ్గరకి తీసుకురమ్మంది. ఆమె వచ్చినప్పుడు సారె, పసుపు. కుంకుమ, చలివిడి, బొమ్మలు తీసుకువచ్చి ఇచ్చింది. అమ్మ తరుచూ వెళ్ళి ఆమె సందేహాలను తీరుస్తుండేది. ఆమె బాధపడుతోంది. ముందురోజు సాయంత్రం వెంకాయమ్మగారి తండ్రి వూరు వెళ్తానన్నారు. అమ్మ ఈ రోజు వుండి రేపు వెళ్ళండి అని చెప్పింది. అమ్మ మాట కొట్టేయలేక ఆయన ఉండిపోయారు మానవ మాత్రులం మనకు తెలియదుకాని, అవతారమూర్తి అమ్మకు తెలియనిదంటూ వుండదు కదా!. ఆమెకు మరణమాసన్నమయిందని ఎవ్వరూ ఊహించలేదు. కాని ఆమె బంధువులతోపాటు, పురోహితుడు వగైరాలను కూడా పిలిపించి అంత్య క్రియలకు కావల్సిన ఏర్పాట్లు చూసి అంతావిస్తుపోయారు. రాత్రి 8 గం॥లకు, 12గం॥ దాటిన తరువాత ఆమె చనిపోతుందని అమ్మ చెప్పింది. 12 గం॥ దాటింది. ఆమె మరణశయ్యనధిరోహించి కన్నులు తెరచిచూస్తుంటే ఇంకాఏం చేస్తావు? కళ్ళుముయ్ అని అమ్మ చెయ్యివిసిరింది. అంతే ఆ మూసిన కన్నులు ఆమె తెరవలేదు.

అమ్మ వసుంధరక్కయ్యతో 1985 జూన్‌లో నేను వెళ్తాను. అన్నయ్యకు కావలసినవి చూసుకో. ఇంక ఈ తెర పడిపోతే బాగుండును అన్నది అమ్మ. నేనేం అయిపోవాలమ్మా?" అన్నది అక్కయ్య "నీ తమ్ముళ్ళున్నారుగా" అన్నది అమ్మ.

అక్కయ్యతో రామకృష్ణన్నయ్య గురించి చెప్తు వాడికోసం "మాతృశ్రీ ప్రెస్" జిల్లెళ్ళమూడి తీసుకురావాలి" అన్నది. ప్రతి నవంబర్ 11న, జనవరి 16న అన్నయ్యకు తలంటుపోసి, రెండు జతల బట్టలు తీసేది అమ్మ. అన్నయ్య తనకంటూ తనేమీ పట్టించుకునేవాడు కాదు. అమ్మే అన్నయ్య అవసరాలను కనిపెట్టి చూచేది.

1985 జూన్ 12న అమ్మ సిద్ధి పొందింది. అమ్మ ఉన్నన్నాళ్ళూ అణిగిమణిగి ఉన్న అన్నయ్య అనారోగ్యం కాలనాగులా తలెత్తింది. షుగర్ వ్యాధితో చాలా

బాధపడ్డాడు. అట్టి పరిస్థితుల్లో అమ్మ చెప్పినట్లుగా పత్యంతో పాటూ అన్నయ్యకు కావలసినవి వసుంధర అక్కయ్యే చూసేది. సమయానికి మందులు వేయడం, ఆరారగా ఆహారం అందిస్తూ ఎవ్వరూ చేయలేనంత సహనంతో అన్నయ్యకు అన్నీ తానే అయి చూసింది.

ఇప్పటికీ జిల్లెళ్ళమూడి వచ్చిన వారిని ఆదరిస్తూ ఆ గడ్డనే నమ్ముకుని అమ్మతోటి సంగతులను నెమరువేసుకుంటూ కాలం గడుపుతున్న ధన్యజీవి వసుంధరక్కయ్య.

వసుంధరక్కయ్య చీరాలలో చదువుకుంటున్నప్పుడు వరలక్ష్మి అనే స్నేహితురాలుని తీసుకొని జిల్లెళ్ళమూడి వెళ్ళింది. అమ్మవారిద్దరినీ తనదగ్గరే వుండమంది. వరలక్ష్మి కాఫీలు, వంటపని చూసేది. ప్రతిరోజు స్నానం చేసి అమ్మకు కాఫీ ఇచ్చేది. అమ్మ సన్నిధిలో గడ్డిపోచలు - ఉక్కుపోచలుగా మారినట్లు సాధారణ జీవులే అసాధారణ కార్యక్రమాలు చేయగలరు. వరలక్ష్మికి ఒక చేయికి పోలియో వచ్చింది. మిగిలిన ఒక చేత్తోనే ఎంతో నైపుణ్యంతో వంట చేసేది. అలాగే అమ్మ బట్టలు ఇస్త్రీ చేసేది. ఒక్క క్షణం కూడా ఖాళీగా కూర్చోకుండా ఏదో ఒక పనిచేసేది.

అమ్మ "వసుంధర, వరలక్ష్మి కుమారి, బాల, హైమ, మంగ, రమణ, సావిత్రి లను అష్ట భార్యలని వారిని రోజుకో రకం ఆకులతో ఒక్కోరోజు, ఒక్కొక్కళ్ళని పూజ చేసుకోమనేది. వసుంధర-రుక్మిణీ, కుమారి-సత్యభామ, మంగ-మిత్రవింద అంటూ......ఈవిధంగా అమ్మ తానే శ్రీకృష్ణపరమాత్మనని ధ్రువీకరించింది. అమ్మను కొలిచినందుకే మంగ ఆచార్య భరద్వాజగారి భార్య అయింది. ఒంగోలులో భరద్వాజగారు కట్టించిన సాయి మందిరం ప్రక్కనే భరద్వాజగారి సమాధి ఉంది. వాటిని పరిరక్షించుకుంటూ తన దగ్గరకు వచ్చిన వారిని జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించమని చెప్తోంది. కామయ్య పాలెం నుండి ధనుంజయ ఆయన స్నేహితులు ఆ విధంగా అమ్మను దర్శించినవారే.

అమ్మకు దసరాల్లో ముద్రలు పడేవి. ఆ సమయంలో అమ్మకి ఎవరైనా ఎదురొచ్చినా చాలా రౌద్రంగా కనిపించేది. ఒకమారు మహర్నవమికి అమ్మను

చూసి చాలా భయపడ్డారు. మాములుగా అమ్మ వెనకాల రామకృష్ణన్నయ్య వెళ్ళటం రివాజు. కానీ ఆ సంవత్సరం శ్రీశ్రీశ్రీ పూర్ణానందస్వామి, రామకృష్ణన్నయ్య కూడా అమ్మ దరికి వెళ్ళలేకపోయారు. అమ్మ అతి భీకరంగా కాళికాదేవిలా త్రిశూలంతో కలశంకు పెట్టిన చెంబును తీసి మహిషాసుర మర్ధనిలా భాసించి ధనధనా చప్పుడు చేస్తూపైకి వెళ్ళింది.

తన కూతురిని హైమనేమీ ఎక్కువగా చూచేది కాదు. హైమ కంటే మిగిలిన వారినే ఆప్యాయంగా చూచేది. "సర్వం అమ్మే" అని వరలక్ష్మి తన గొలుసు, గాజులు వసుంధరక్కయ్య నెక్లెస్, గాజులు అమ్మకే ఇచ్చారు. వరలక్ష్మి అంటే హైమకు చాలా ఇష్టం. హైమది చాలా సున్నితమైన మనసు. ఎప్పుడూ అనారోగ్యంతో బాధపడేది. తరుచూ తలనొప్పి వచ్చేది. ఉదయం సాయంత్రం తొట్టి స్నానం చేసి "అంబా శాంభవి చంద్రమౌళి" అని అమ్మను స్తోత్రం చేసేది. ఎవరికి సుస్తీ చేసినా ఎంతో వాత్సల్యంగా, ప్రేమగా హైమ వారిని పలకరించేది. వరలక్ష్మి హైమ బహిర్భూమికి వెళ్ళినపుడు హైమ "నాకు మనశ్శాంతి లేదు, బ్రతకాలని లేదు అని అనేది. ఎక్కడికైనా వెళ్ళాలని ఉంది" అని చెప్పింది. ఆ మాట అమ్మతో చెప్తే సాయమ్మగారిని తోడిచ్చి హైమను షిర్డీకి పంపించింది. అప్పటికి వరలక్ష్మి బాపట్లలో ఉంటోంది.

హైమ షిర్డీ వెళ్ళేటప్పుడు వరలక్ష్మిని బస్టాండుకు రమ్మని కబురు చేసింది. బాపట్ల బస్టాండులో వరలక్ష్మితో హైమ "నీకు మళ్ళీ కనిపిస్తానో లేదో, నీవు జాగ్రత్తగా ఉండు" అని బస్సు ఎక్కింది. తెల్ల పరికిణి, తెల్ల వోణీతో దేవతలా భాసించింది హైమ అని వరలక్ష్మి చెప్పింది. హైమ సిద్ధి పొందిన అనంతరం వరలక్ష్మి దగ్గరకు కారు పంపించారు. ఈ రకంగా షిర్డీ వెళ్తూ హైమ అన్న మాట నిజమయిందని బాధపడింది.

చంద్రమ్మక్కయ్య, ఆమెభర్త కొల్లి చిన్న వెంకటరత్నం సింగుపాలెం నివాసులు, వారికి మొదటి నుండి దైవభక్తి ఎక్కువ. సింగుపాలెం దగ్గర్లో ఉన్న మూరతోట అనే గ్రామానికి అమృతానందస్వామీజీ వచ్చినప్పుడు సత్సంగంలో

పాల్గొనేవారు. అమృతానంద స్వామీజీయే సింగుపాలెం వాళ్ళకి అమ్మ గురించి చెప్పారు. 1958లో అమ్మను దర్శించుకున్నారు. అపుడు అమ్మ వారికి స్వయంగా వడ్డించింది. అక్కయ్య "ఏదైనా ఉపదేశం చేస్తారా?" అని అమ్మను అడిగింది. అమ్మ కాగితం మీద రాసి ఇచ్చింది.

చంద్రమ్మక్కయ్య భర్తను జిల్లెళ్ళమూడిలో తాతయ్య అన్నయ్య అనేవారు. ఆయన సింగుపాలెం వెళ్దామని అమ్మకు చెప్పటానికి వెళ్తే అమ్మ దర్శనం ఇవ్వలేదు. ఆయనకు విసుగుపుట్టి అమ్మకు చెప్పకుండా బయలుదేరారు. ఒక ఆంబోతు ఎదురువచ్చి ఆయన ఎటువెళ్తే అటువైపు పోనివ్వకుండా నిలదీసింది. రాళ్ళగుట్ట ఎక్కితే రాళ్ళగుట్ట కూడా ఎక్కింది. అమ్మకు తను వెళ్ళడం ఇష్టం లేనందువల్ల ఈ విధంగా జరుగుతోందని తిరిగి జిల్లెళ్ళమూడి చేరాడు.

సింగుపాలెం తాతయ్య అమ్మ పుట్టిన రోజు పండుగకి నెయ్యి తీసుకు వస్తూ రాత్రి చీకట్లో దారి తప్పాడు. ఎటువెళ్ళాలో తెలీక "అమ్మా ఏమిటిది నీ దగ్గరకు వస్తుంటే ఈ విషమ పరీక్ష" అని ఆవేదన చెందాడు. అమ్మ తన బిడ్డలెవ్వరినీ బాధపడనీయదు కదా! అంతలో ఒక పిల్లి రమ్మన్నట్లుగా తలవూపి అరచింది. సరే ఏదో ఒకటి అని చేసేదేమీ లేక దాని వెనకాల వెళ్ళాడు. తీరా జిల్లెళ్ళమూడి చేరాక ఆ పిల్లి మాయమైంది. మాతృమూర్తి అయిన అమ్మ ఎలాగైనా, ఏదైనా, చెయ్యగలదని పై సంఘటన వలన తెలుస్తోంది.

మరొకసారి సింగుపాలెం వెళ్తానని అమ్మతో చెప్తే అమ్మ వద్దంది. అయినా వినకుండా వెళ్ళాడు. రేపల్లెకి వెళ్ళేటప్పటికే చీకటి పడింది. వాళ్ళ ఊరికి వెళ్ళేతోవలో ఉరుములు, మెరుపులతో వర్షం కూడా రావటం మొదలైంది. ఆయనకు దిక్కుతోచలేదు. ఆ చీకట్లో అమ్మ రెండు చేతులూ చాచి ముందు నడుస్తూ వర్ష ప్రభావాల్ని తొలగిస్తూ సింగుపాలెం చేర్చింది. ఈ విధంగా మాట వినక పోయినా వాత్సల్యమూర్తి అయిన అమ్మ క్షేమంగా వారిని ఇంటికి చేర్చింది.

అట్లతద్ది పండుగకి అమ్మను, హైమను చెరొక తొట్టిలో కూర్చోబెట్టి గుండ్రంగా తిప్పుతూ, పాటలు పాడుతూ నాట్యం చేస్తూ అమ్మే కృష్ణుడిగా,

జిల్లెళ్ళమూడే బృందావనంగా పండుగ చేసుకున్నారు. అమ్మ ఒక బిందే పట్టుకుంది. అందులో తలా ఒక గ్లాసుడు పాలు పోసారు. ఎన్ని పాలు పోసినా ఆ బిందె నిండలేదు. అప్పుడు అమ్మ "బిందె నిండలేదు, వెల్తిగా ఉంది. మళ్ళీ వస్తాను? అని లోపలికి వెళ్ళి తిరిగి వచ్చి "త్రిగుణాలు అనే పొయ్యిని, చిత్తమనే అగ్గిపెట్టెతో వెలిగించి, శరీరం అనే కుండలో, పాపాలనే పాలు పోసి, అహంకారం అనే తోడువేసి, శ్వాస, నిశ్వాసాలనే కవ్వంతో చిలికితే "నేను నేనైన నేను" అంటూ అమ్మ వివరించింది.

ఒకరోజు తెల్లవారు జామున చంద్రమ్మక్కయ్య లలితా పారాయణం చేస్తోంది. అపుడు ఇంటిపైన చప్పుడు వినపడింది. బయటకు వచ్చి చూడగా విమానం ఆగి ఉంది. దానిలో ముగ్గురు ముత్తైదువులు కనిపించారు. ఆదృశ్యం చూసి అక్కయ్య నమస్కారం చేసింది. అది అదృశ్యమైంది. ఒకమారు తాతయ్యకు రాత్రిపూట కడుపు ఉబ్బింది. సోడా తేవటానికి అక్కయ్య వెళ్ళింది. తిరిగి వచ్చేటప్పటికి నాగుపాము పెద్ద చుట్ట చుట్టుకొని పడగ విప్పి ఆడుతూ మంచం కింద ఉంది. ఆ పాము కాటేస్తుందేమోనని చాలా భయపడ్డారు. ఈ సంఘటన జరిగిన రెండవ రోజున అమ్మ యోగయ్యగారికి ఒక పూలమాల, ప్రసాదం ఇచ్చి సింగుపాలెం తాతయ్యకు ఇవ్వమని పంపింది.

అమ్మ సింగుపాలెం వెళ్ళినప్పుడు వాళ్లింట్లో మంచం మీద పడుకుంది. ఆ తరువాత వారికి ఒక మగపిల్లవాడు కలిగాడు. అమ్మ అతనికి 'సంపూర్ణ' అని పేరు పెట్టింది. 1958వ సం॥లో నాన్నగారికి పొగాకు బేరన్‌లు ఉండేవి. అమ్మ బేరన్‌లో కూడా పనిచేసేది. కొమ్మూరి లోకనాథం గారు అమ్మ దర్శనం చేసుకుని బండిలో వెళ్తూ అంజయ్యతో "కనకమ్మగారు కోడలనుకుంటోంది. నాన్నగారు భార్య అనుకుంటున్నారు, ఊరి జనం సామాన్య స్త్రీ అనుకుంటున్నారు కానీ అమ్మ శక్తి స్వరూపిణి" అని చెప్పారు. అమ్మ దగ్గర ఆయన కూతురు ప్రభావతి, హైమ ఉండేవారు. 1958 మే 1వ తేదీ రాత్రి 10 గంటలకు పెద్ద వాళ్ళంతా తనని పిల్ల అనుకున్నా అందరూ తన పిల్లల్లే అనుకునేదని రాజుబావ చెప్పాడు.

చంద్రమక్కయ్య విద్యానగర్‌లో ఉన్నప్పుడు కలలో విమానం కనిపించింది. బయటకు వచ్చి చూస్తే ఇద్దరు అమ్మలు 10 ని॥లు కనిపించారు. ఆ దర్శనం తరువాత అనసూయావ్రతం చేయాలనిపించింది. వారింటి ప్రక్కన ఉన్న నరసింహారెడ్డి గారి భార్యకు కూడా అమ్మ కనిపించింది. 15 మంది దంపతులతో వ్రతం చేసుకున్నారు. అప్పటికి విద్యానగర్‌లో అమ్మను చూసిన వారు ఎవరూ లేరు. కానీ 50 మందికి పైగా పూజలో పాల్గొన్నారు.

మూడవ రోజు కలశం తీయాలని చంద్రమక్కయ్య ఫోటో తీస్తే నలిగిన వైర్లు ఫోటోకి అంటుకున్నందున షాక్‌కొట్టి గడగడా వణుకుతుంటే వ్రతం జరిగిన ఇంటి యజమాని రమాదేవి స్విచ్ ఆఫ్‌చేసింది. ఈ విధంగా వ్రతం చేయించి తనని పెద్ద ఆపద నుండి అమ్మ కాపాడిందని అక్కయ్య ప్రగాఢ విశ్వాసం. ఒకమారు తెల్లవారితే శివరాత్రి అనగా లలితా పారాయణ చేసారు. అక్కయ్య కళ్ళు మూసుకుని చేస్తుండగా ఒక పెద్దాయన మెడంతా పాము చుట్టుకుని కనపడ్డాడు. ఆయన "అమ్మా బాగున్నావా?" అని పలకరించారని చెప్పింది అక్కయ్య. అపారమైన భక్తిశ్రద్ధలతో అక్కయ్య కొన్ని లక్షల లలితా పారాయణ చేసింది. ఈ పుణ్యమూర్తి వారం రోజుల ముందే ఫలానా టైంకు పోతానని చెప్పి అదే విధంగా శరీరం చాలించి అమ్మలో ఐక్యమైంది.

1959వ సంవత్సరములో అధరావరపు శేషగిరిరావుగారు మన్నవలో అమ్మను దర్శించారు. 1960వ సం॥లో అమ్మ చరణ సన్నిధిలో నాన్నగారితో "నన్ను మీ రవి తరువాత వాడిగా చూసుకోమని" కోరారు. ఆ సంవత్సరం నుంచే సంస్థలో అన్నీ తానై, తానే అన్నీ అయి మెలిగారు. మొట్టమొదట సంస్థను నడిపిన వ్యక్తి శేషగిరిరావన్నయ్య. ఆ ఆవరణలో వారు స్పృశించన శాఖలేదు. జన్మతః వారు సేవాభావ నిరతులు, కార్యదీక్షాదక్షులూ, మేధా సంపన్నులూ, సంస్కారవంతులూ, త్యాగ జీవనులూ, సాహస ప్రియులూ, అసమాన ధైర్యోపేతులూ, అమలినచేతస్కులు అయినందున అచిర కాలంలోనే ఆ ఆవరణకు అన్ని విధాల ఆలంబనమై వెలుగొందారు.

అమ్మ అనుగ్రహమును పరిపూర్ణంగా అనుభవించిన వ్యక్తి. అవసరమైన వాళ్ళను తానే ఏరుకుంటాననీ, తనకవసరమైనట్లుగా వాడుకుంటాననీ అమ్మ ప్రకటించింది కదా! ప్రాథమికావస్థలో ఉన్న సంస్థయొక్క ఉజ్జ్వల భవిష్యత్తుకై అనేక మహత్తర కార్యభారాలను నిర్వహించారు. అది ఏపని అయినా సరే దానిని చేసే తీరూ, పనిపూర్తి అయ్యేవరకు శ్రమించే పద్ధతి చూపరులకు ఆశ్చర్యాన్ని కలిగించేది. అమ్మపట్ల ఆయనకున్న ఆరాధనాభావం అచంచలమైనదే కాక అనుపమానమైంది కూడా.

శేషగిరి రావన్నయ్య "నేను మందు వేసుకుంటే నీకు తగ్గుతుందా" అని అమ్మను అడిగాడు. అందుకు అమ్మ "నీవు మందు వేసుకుంటే నాకు తగ్గదు శేషు, నేను మందు వేసుకుంటే నీకు తగుతుంది" అని చెప్పింది. జిల్లెళ్ళమూడి రోడ్డు నిర్మాణం ఆయన చెమటతో తడిసింది. జిల్లెళ్ళమూడిలో విద్యుద్దీప కాంతులు, అన్నపూర్ణాలయ గాడిపొయ్యి మంటలో వారు పడ్డ నిరంతర శ్రమ ఉంది. మాతృశ్రీ పత్రిక ప్రాదుర్భావంలో వారి మేధాశక్తి ఉన్నది. మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీకి తన సర్వస్వాన్ని ధారపోసారు.

అమ్మకు శేషగిరిరావు అన్నయ్య మానసిక, శారీరక అవస్థల స్వస్థత ముఖ్యం, అన్నయ్యకు సంస్థ పురోభివృద్ధి ప్రధమ కర్తవ్యంగా భావించాడు. అనిర్వచనీయమైన అమ్మ ప్రేమామృతాన్ని తన అణువణువునా నింపుకున్నాడు. ఒకమారు అమ్మకు జ్వరం వచ్చింది "అన్నయ్య ఉన్నాడా?" అని అడిగింది. ఆయన ఉంటే హోమియోపతి మందు వాడేవారని అనుకున్నారు. అప్పటికి ఫోను సౌకర్యం కూడా లేదు. ఇంతలో పొన్నూరు నుండి అన్నయ్య వచ్చాడు. అక్కడి వారంతా ఆశ్చర్యపోయారు. పొన్నూరులో అన్నయ్య అమ్మ ఫోటో వంక నిర్నిమేషంగా చూస్తూండగా ఆ ఛాయా చిత్రంలో అమ్మ కళ్ళవెంట కన్నీరు కారసాగింది. అది చూడగానే మనసుండబట్టలేక అర్ధరాత్రి బస్సులు లేక పోయినా పొన్నూరు నుండి జిల్లెళ్ళమూడికి నడిచి వచ్చేశాడు. శేషగిరిరావు అన్నయ్య అమ్మకు మొట్టమొదట పూరిల్లు కట్టించి ఇచ్చారు. అన్నయ్యే చందాలు పోగుచేసి ఆ డబ్బుతో అందిరిల్లు

గదులు కట్టించాడు. కోటేశ్వరరావు అమ్మ భవనాలు కట్టడానికి 4 ఎకరాల భూమి, రాళ్ళు ఇచ్చాడు. ఆతరువాత రామకృష్ణ అన్నయ్య హయాంలో కాలేజీ కట్టేస్థలంలో రెండు ఎకరాలు ఇచ్చాడు. మాతృశ్రీ ప్రథమ సంపాదకులుగా శేషగిరిరావు అన్నయ్య పనిచేసాడు. మాతృశ్రీ ప్రింటింగ్ స్థాపించటానికి గజేంద్రమక్కయ్య దగ్గర రూ.500 లు తీసుకున్నాడు. శేషగిరిరావు అన్నయ్య "ఒక రేణువుగా ఐక్యం కావాలన్న కోరికను" అమ్మ నెరవేర్చింది.

ఆయన మరణవార్త విని ఆయన వల్ల సహాయ సహకారం అందుకున్న ప్రతి ఒక్కరూ తల్లిడిల్లిపోయారు. ఆయన మృతదేహాన్ని జిల్లెళ్ళమూడి తీసుకురావాలనుకున్నా ఆయన స్వస్థలమైన పొన్నూరులో అంత్యక్రియలు జరిపించమంది అమ్మ. అందరూ ఆశ్చర్యపోయారు. మరికొందరు ఆయన దురదృష్టానికి చింతించారు. కానీ పొన్నూరులో ఆయన అంత్యక్రియలలో పాల్గొన్నపుడు అమ్మ సమాధానంలోని అంతరార్థ అవగతమైంది. ఒకరు అమ్మతో "అన్నయ్య నీ సన్నిధానంలో పోతే బాగుండేదమ్మా" అన్నారు. "నేను కనిపించకపోతే కదా! ఆయనకు కొరత. కానీ నేను బాధపడేది ఒక్కటే. తను అనుకున్నది సాధించటానికి ఆయన శరీరాన్ని పెట్టిన హింసే నన్ను వేధిస్తోందన్న" అమ్మ మాటలు శిరోధార్యం, అమ్మ వాత్సల్యానికి ప్రతీక.

మా నాన్నగారు కీ॥శే॥ శ్రీ అన్నంరాజు మాధవరావుగారు, మా అమ్మ దుర్గాంబగారు అమ్మ అనుంగు బిడ్డలు. ఆయన జిల్లెళ్ళమూడిలో నివాసమేర్పరుచు కుందామనుకుంటుండగా ఆయన మృత్యువాత పడటం జరిగింది. ముందు రోజు రాత్రి అప్పుడే బాపట్ల నుంచి జిల్లెళ్ళమూడి వచ్చిన అన్నంరాజు రామకృష్ణ అన్నయ్యతో అమ్మ "నీవు గుంటూరు వెళ్ళి పిన్నికి ధైర్యం చెప్పమని" పంపింది. రాత్రి పూట రెండు లారీలు మారి తెల్లవారు జామున 5గంటలకు గుంటూరు చేరాడు. స్నానానికి నీళ్ళుతోడమని సాయమ్మగారితో "అబ్బ నొప్పిగా వుందే అని గుండెను పట్టుకుని కూర్చుంది, అమ్మ. ఎవరిదో అమ్మ అనుభవిస్తోందనుకున్నది శాయమ్మగారు. సరిగా ఏడున్నర ప్రాంతంలో

ఆయనకు గుండెనొప్పి వచ్చింది. అమ్మ కుంకుమ తన నుదుట పెట్టమని సైగచేస్తూనే కన్నుమూసారు. ఆయన అంత్యక్రియలలో వాడమని తను ఒళ్ళుతుడుచుకునే బట్ట, పూలు, గంధపుచెక్క అమ్మ గుంటూరుకు పంపించింది.

మహాలక్ష్మమ్మగారు నర్సారావుపేట నివాసి, ఈమెకు అమ్మ ఉపదేశం చేసింది. వారింట్లో ఏమీ వెలిగించకుండానే సువాసనలు వెదజల్లేవి. అమ్మ కుంకుం పెట్టి మంత్రం వేస్తే అనేకమైన బాధలు తగ్గేవి. అన్నం మీద మూతపెట్టి ఉండగా ఐదువేళ్ళు ముద్రలు పడేవి.

ముక్కోటి నాడు వచ్చి అమ్మను దర్శించుకుని వెళ్ళింది. ఇంటికి వెళ్ళిన తరువాత ఎప్పుడూ అమ్మధ్యాసే. "ఎప్పుడూ అట్లా కూర్చోకపోతే చందాలు వసూలు చేయరాదా?" అని వినపడింది. అమ్మఫోటోలో నవ్వుతూ కనపడింది. ఎదురుగా రోడ్డుమీద ఉన్న మనిషి వందరూపాయిలు ఇచ్చి వెళ్ళింది. కలెక్టరుగారి ఇంటికి వెళ్ళి మాట్లాడుతుంటే ఇంకొకరు ఆమెకు రెండు వందల రూపాయలు ఇవ్వటం జరిగింది. ఎట్లా వసూలూ చేయటమా అని దిగులు పడ్తున్న ఆమెకు అమ్మ ఈ విధంగా దారి చూపింది.

మహాలక్ష్మగారి పెద్దబ్బాయికి అమ్మ మీద నమ్మకం లేదు. ఒకరోజు అతను ఇంట్లో ఉండగా ఎవరో 8 ఏళ్ళపిల్ల తలుపునెట్టుకు వచ్చి అన్నం పెడతావా అని మహాలక్ష్మగారిని అడిగింది. ఆ అమ్మాయి చేతిలో గిన్నెవుంది. అది పిండికంటే తెల్లగా మెరిసిపోతూ కనిపించింది. అందులో మూడు ముద్దలు వున్నాయి. మహాలక్ష్మగారు కూడా అందులోనే అన్నంపెట్టింది. అన్నం పెట్టిన తరువాత ఆ అమ్మాయి తలుపు దగ్గరగా వేసి వెళ్ళింది. ఆ అమ్మాయి ఎవరా అని ఆరా తీయాలని వెంటనే వాళ్ళబ్బాయి వచ్చి ఆ అమ్మాయి కోసం వెతికాడు. ఆ అమ్మాయి కనిపించలేదు. ఇంతలోనే ఎలా అదృశ్యమయింది అని ఆశ్చర్యపోయాడు. దానితో వాళ్ళ పెద్దబ్బాయికి నమ్మకం కుదిరింది.

మహాలక్ష్మగారు అమ్మతో "నిన్ను ఎత్తుకుంటాను" అని అడిగింది. అమ్మ "ఎత్తుకోలేవు" అన్నది. అట్లా చెప్పినా ఆమె వినక అమ్మను ఎత్తుకుంది. అమ్మ

మొదట బెండులాగా ఉంది. తరువాత విపరీతంగా బరువెక్కింది. ఆమె మోయలేక "అమ్మా బరువుగా ఉందమ్మా" అని మొరపెట్టుకుంది. అమ్మ మళ్ళీ తేలికయింది.

ఒక్కొక్కప్పుడు అమ్మ చిన్న విషయం గురించి అడిగినా దానికి ఏదో కారణం ఉంటుంది. ఒకరోజు అందరూ కూర్చుని ఉండగా అమ్మ పిప్పరమెంట్ అడిగింది. ఎవ్వరూ లేదన్నారు. కానీ ఒక అబ్బాయి తన దగ్గర వుందని అమ్మకు ఇచ్చాడు దానిని తీసుకుంది అమ్మ. అతను "నాదగ్గర ఉన్నది ఈ పిప్పర్‌మెంటే కదా! అమ్మకేమిస్తానులే" అని అనుకున్నాడు. అటువంటి వారి వెంటపడి అడిగి తీసుకొని, వారి కోరిక తీర్చి తృప్తిపరుస్తుంది అమ్మ. అమ్మకు విలువ కంటే మనస్సే ముఖ్యం కదా!

సూర్యగ్రహణం ఎట్లా పడుతుంది? అని అడిగింది మహాలక్ష్మగారు. ధ్యానంలో కూర్చుంటే ఎలా ఏర్పడేది కనిపించింది. ఒకమారు అమ్మ ఫోటో చూస్తుంటే అమ్మ వెనకాల చెట్టు, చెట్టుమీద కృష్ణుడు పిల్లగ్రోవి వాయిస్తున్నట్లు కనపడింది. ఇట్లా ఎన్నో అనుభూతులు పొందిన అదృష్టవంతురాలు మహాలక్ష్మమ్మగారు.

పర్ణశాలలో మంచం మీద కూర్చుని అనేక రకాల వారికి, అన్ని మతాలవారికి, అన్ని తరగతుల వారికి, అన్ని వృత్తుల వారికి, పండితులకు, పామరులకు, దేశ విదేశాల నుండి వచ్చిన వారికి అమ్మ దర్శనమిచ్చేది. పూలపూజలు, పాలాభిషేకాలు, పాదస్పర్శనం చేసుకుంటూ వేలాది కొబ్బరి కాయలు కొడతారు. కర్పూరం ముద్దలు ముద్దలు ఆత్మార్పణం చేసుకుంటుంది. అన్ని కాలాలలో నవనవోన్మేషమై నవ్యకాంతులు వెదజల్లే ఆ దివ్య పాదారవిందాల మీద రాసులు రాసులుగా మల్లెలు, గులాబులు, చేమంతులు, బంతులు పరమాత్మలో సంలీనమైన జీవులు మాదిరి తమ జీవితాలకు సార్ధకతను సంతరించుకుంటాయి. అరుణారుణ దీప్తివంతములైన ఆ చరణ పంకేరుహాల పావన స్పర్శతో కుంకుమ మరింత ఎర్రదనం పులుముకుంటుంది. ఆ మంగళ గళసీమను అలరించిన పూలదండల పకపకలతో పరిసర ప్రాంతాన్ని, ప్రక్షాళిత హృదయాలను పరిమళభరితం చేస్తుంటాయి.

ఆ తేజోమూర్తి దివ్యసందర్శనలో ఎందరి హృదయాలలోనో భగభగ మండే ఆవేదనాగ్ని జ్వాలలు చల్లారుతున్నాయి. ఆ పాదాలలోని పరుశ వేది స్పర్శతో ఎందరో పాపులు పావన చరితులవుతున్నారు. ఆ నయనాంచనాల జాలువారే కరుణామయ దృక్కులతో మోడువారిన ఎందరి జీవితాలలోనో వసంతం వెల్లి విరుస్తుంది. ఆ తీయని పలుకులలోని అమృత సేచన ఆశోపహతులెందరో పునర్జీవులయి ఉజ్వల పథాల పయనిస్తున్నారు. ఆ అనురాగ స్రవంతిలో దోసెడు జలపానం చేసిన వారి శుష్క జీవితాలలో మమతలు, మధురిమలు చివుళ్ళు తొడుగుతాయి. తనకేమీ తెలియదని తానేమీ చేయలేనని అంటూనే ఆధ్యాత్మిక సందేశంతో పాటూ లౌకిక కామానులుకు ఆకారం ఇస్తుంది అమ్మ.

యోగ సాధనలో పరాకాష్ఠ అయిన చిన్న మస్తకను పొందటాన్ని శాంభవి ముద్రతో అమ్మను చూచిన వారికి వేరే సాధనలతో పనిలేదు. భృకుటి నుండి స్రవించే రుధారాన్ని విభూదిగా మార్చి ప్రసాదంగా పంచటం, భోజనం చేయకున్నా శరీర, పోషణ జరగటమే కాకుండా తేజోవిలసితం కావటం గమనించి విస్మితులు అయిన వారు, నిద్ర లేకున్నా ఈషణ్మాత్రము అలసట గుర్తించక విస్తుపోయినవారు, అమ్మ దర్శనంలో, స్పర్శలో, సంభాషణలో అద్భుత దృశ్యాలు లౌకిక ఆనందానుభూతిని పొందినవారు ఎందరో కలరు. అపార విజ్ఞాన సంపద కనుగొన్నవారు, ఒక్కరోజులో భగవద్గీత యావత్తును, మరొక రోజులో లలితా సహస్రనామ స్తోత్రమును అప్పచెప్పగల్గిన శేముషీ వైభవాన్ని చూసి ఆనందించిన వారు కలరు. అనేక రకాలుగా అమ్మలో మానవతీత లక్షణాలు గుర్తించిన అదృష్టవంతులు ఎందరో కలరు. చిన్నతనంలోనే చంద్రమౌళి చిదంబరరావుగారు అమ్మ మాటలలో, చేతలలో ద్యోతకమయ్యే భిన్నత్వం లేని మనస్తత్వం, అత్యద్భుత అద్వైతసిద్ధి, అమ్మ సన్నిధిలో అనేక పర్యాయాలు అపూర్వ అలౌకిక దృశ్యాలచే ప్రభావితులయ్యారు. తమ ఇంట అసాధారణ తత్త్వం సాధారణమై వెలసిందని తమని తరింపచెయ్యటానికే అమ్మ వచ్చిందని చెప్పేవారు.

అమ్మ చిన్నతనంలోనే అనేకులకు వారి వారి ఉపాసనలు బట్టి మనః

స్థితులను బట్టి రాజరాజేశ్వరిగా, గాయత్రిగా, కృష్ణుడిగా, రాముడిగా, సత్యనారాయణస్వామిగా, ఆంజనేయస్వామిగా, సాయిబాబాగా, మహ్మద్ ప్రవక్తగా, ఏసుక్రీస్తుగా, మేరీమాతగా అనేక రూపాలతో అనేక విధాల దర్శనమిచ్చింది. అందుకే అమ్మ "ఎవరు ఎట్లా చూస్తే అట్లా కనపడతాము" అన్నది.

అమ్మ దర్శనం ఇచ్చేప్పుడు అందరినీ పరికించేది. దూరాన ఉన్న వారి మీద కూడా అమ్మ, తన దృష్టిని ప్రసరింపజేసేది. ప్రతి ఒక్కరికి అమ్మ తమనే చూస్తోందన్న భావన కలిగేది. అమ్మ యొక్క క్రీగంటి చూపును అమ్మతో పరిచయమున్న ఏ ఒక్కరూ మరచిపోలేనిది. అమ్మ దృష్టిలో పడగలగటమే మన అదృష్టం.

ఒకామె అమ్మతో "బహిర్ భూమికి వెళ్ళినప్పుడు మంత్రం గుర్తుకు వస్తోందమ్మా" అని అన్నది. దానికి అమ్మ "మలం బయటికి పోతే మంత్రం వచ్చింది", తప్పు లేదమ్మా! సర్వావస్థలయందు గుర్తుండటమే మంత్రసిద్ధి. దానిని మర్చిపోకుండా ఉండటానికే "మంత్ర జపం అక్షర లక్షలు చేయమంటారు" అన్నది.

అమ్మ మత ప్రభోదంకొరకో, మతప్రచారం కొరకోరాలేదు. మానవత్వాన్ని పెంపోందించడానికి, మానవత్వపు విలువల్ని తెలియచేయటానికి వాటిని సంరక్షించటానికి అవతరించిన అమృతమూర్తి అమ్మ.

సర్వజ్ఞురాలై, సకలశాస్త్ర నిక్షిప్తమైన సర్వవిషయాలనూ బిడ్డలందరికీ బోధిస్తూ "నాది తెలిసీ తెలియని స్థితి అంటుంది. సర్వవ్యాప్తిని అయి ఎవరు ఎక్కడ ఆర్తితో అర్థించినా పలకరిస్తూ, పట్టుమని పది అడుగులు వేయటానికి ఆయాసం అంటుంది. కానీ యావజ్జగతికీ తన ప్రేమసందేశంతో అమృతం పోస్తుంది" "నాకు ప్రేమించటం, మీకు ప్రేమింపబడటం సహజం" అంటుంది. అందుకే జిల్లెళ్ళమూడి లౌకికులకు, పారమార్థికులకు కూడా మహత్తర క్షేత్రమయింది.

దయానిధి, సమవర్తిని అయిన మాతృమూర్తి పవిత్ర సన్నిధిలో అందరూ ఏకోదరుల వలె మెలగుతారు. అమ్మ అందరి హృదయాలనూ, మనస్సులను అవలోకిస్తుంది. అందరి బాధలనూ, గాధలనూ ఓపికగా విని వారి వారికి

తగినట్లుగా జవాబు ఇస్తూ "అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదు" చేయాలనుకున్నా చేయలేవు, మానలనుకున్నా మానాలేవు. నిన్ను నడిపించే అదృశ్యశక్తి ఒకటి ఉన్నది. దాని నిర్ణయం దాటరానిది. కనుక సుఖదుఃఖాలలో, జయాపజాయాలలో ఏది ప్రాప్తమైతే దానిని నిర్లిప్తంగా స్వీకరించి, నిర్వికారంగా అనుభవించమంది".

శుష్కతర్క హేతువాదనతో అన్ని తలుపులూ మూసుకుపోయిన చీకటి కోనలను సైతమూ వింత వెలుగులు ప్రసరించే అఖండదివ్యజ్యోతి అమ్మ. దేశకాలాద్యాతీతంగా, మృధు మధురంగా, మనోజ్ఞరీతులలో సర్వులను సమ్మోగ్ధులను చేసే విశ్వవిమలానురాగ సమ్మోహనగీతి. కులమత భేదరహితంగా అవిచ్ఛిన్నమై, అప్రతిహతమై వెల్లువలె ప్రవహించే అత్యద్భుత కరుణా ప్రవంతి అమ్మ.

అమ్మ దర్శనార్థం ఎందరు వచ్చినా ఏ ఒక్కరినీ నిరాశపరచకుండా, ఏ సమయంలో అయినా సరే వారికి దర్శనమిచ్చే కల్పవల్లి అమ్మ. ఒకమారు సాయంత్రం నాలుగు గంటలకు అమ్మ దర్శనార్థం అగంతుకులు వచ్చారు. వారు అమ్మ గురించి ఏవేవో అడుగుతున్నారు. అక్కడివారు చెప్తున్నారు. అలా గంటన్నర సమయం గడిచింది. అమ్మ దర్శనార్థము వచ్చి ఆసీన అయింది. వారు పూజ చేసుకోవటానికి సమాయుక్తమౌతున్నారు. "అన్నం తిన్నారా నాన్నా"? అమ్మ అడిగింది. వారు లేదన్నారు. "ముందు భోంచేసి తరువాత పూజ చేసుకోమంది" అమ్మ. పూజచేసుకొని భోజనం చేయటం సాంప్రదాయమైనా అమ్మ ఆజ్ఞ అయింది కనుక వారు లేచి వెళ్దామనుకున్నారు. కానీ వేళకాని వేళ కదా అని ఆలోచిస్తున్నారు. అది గమనించిన అమ్మ "ఎవరి అన్నం వారికి ఎప్పుడు వచ్చినా ఉంటుంది నాన్నా! సందేహించక లేచి వెళ్ళి భోంచేసి రమ్మంది".

అమ్మ ఎప్పుడూ కొత్తగా వచ్చిన వారిని అన్నం తిన్నదీ లేనిది కనుక్కొమని చెప్తుంది కానీ ఆ సమయంలో వారు అన్నం తినకుండా వస్తారని అక్కడివారు ఊహించలేదు. గంటన్నర వారు మాట్లాడారు. కానీ వారి భోజన విషయం

ప్రస్తావించినలేదు. అమ్మ వచ్చిన నిముషంలోనే వారిని భోజనానికి పంపింది. ఎప్పుడూ అన్నం తినని అమ్మకు మన ఆకలి గురించి, మన అన్నం గురించి ఎంత శ్రద్ధో, మన మీద ఉన్న వాత్సల్యానికి అక్కడున్న వారి కన్నులు అశ్రుపూరితాలయినాయి.

బాపట్ల నుంచి ఒక కోతి వచ్చింది. అది రోజూ అమ్మ దర్శనం సమయానికి వెళ్ళి కూర్చొనేది. అందరూ ప్రసాదాలు తీసుకు వెళ్ళిన తరువాత అమ్మ ఇచ్చిన అరటిపళ్ళు తీసుకువెళ్ళేది. ఆవరణలో ఎవరినీ ఏం చేసేదికాదు. కొన్నిరోజుల తరువాత పిల్లలేవరో దాని కాలు విరగకొట్టారు. అమ్మ వైద్యుడ్ని పిలిపించింది. దాన్ని పరీక్షిస్తుండగానే అది ప్రాణం వదిలింది. ఆ డాక్టరుగారు వచ్చి అమ్మతో "కోతి చనిపోయిందమ్మా" అని చెప్పారు. అమ్మ బోటా బొటా కన్నీరు కార్చింది.

మన్నవ వెంకటేశ్వర్లుగారిని పిలిచి దానిని ఖననం చేయమంది. బాపట్లలో దొరకే అన్నిరకాల పళ్ళు తెప్పించి పూలు, పసుపు, కుంకుమ వేసి దానిని పాతి పెట్టమంది. అమ్మ చెప్పినట్లే చేశారు. ఆ రోజు మంగళవారం ఆనాటి నుంచి ప్రతి మంగళవారం ఆయన ఉపవాసం ఉంటున్నారు. ఆ గడ్డ మీద మరణించటానికీ, అక్కడ ఖననమవ్వటానికీ ఆ కోతి చేసిన పుణ్యమేమిటో? దాని గురించి అమ్మ కన్నీరు కార్చిందంటే దాని పూర్వజన్మ సుకృతమే.

అమ్మ దగ్గర ఒక ఆంబోతు ఉండేది. దానిని రాముడు అని పిలిచేవారు. అది ఎక్కడెక్కడ తిరిగినా ఎంత మంది పడుకుని ఉన్నా వారందరినీ తొక్కకుండా జాగ్రత్తగా వచ్చి అమ్మ మంచం దగ్గర పడుకునేది. జిల్లెళ్ళమూడిలో ఎవరి ఎద్దునో పొడిచిందని పలుగుతో దాని పొట్టలో పొడిచారు. దానితో అది మరణించింది. దానిని ఊరంతా ఊరేగించి ఖననం చేయించింది.

శ్రీ సుంకర రమణారావుగారి అధ్వర్యంలో నందిగామలో అమ్మ పల్లకిలో ఊరేగుతూ ఒకరి ఇంటికి పాదపూజకు వెళ్ళింది. ఇంట్లో వారందరినీ ఆప్యాయంగా పలకరిస్తూ ఆ ఇంట్లోకి వెళుతూ అక్కడ ఒక కొబ్బరిచెట్టును చూచింది. చెట్టు నిండా కొబ్బరికాయలు చాల ఉన్నాయి. అమ్మ ఆ కాయల్ని చూస్తూ ఆ ఇంటి

యజమానిని పలిచి ఏరా! "నిండు గర్భిణిగా ఉన్న చెట్టును చూచే విధానమిదేనా? అని ప్రశ్నించింది. చెట్టు మొదలున విస్తరాకులు, ముళ్ళు, గుడ్డలు అనేకం ఉన్నాయి. అమ్మ కుర్చీ తెప్పించి అక్కడ వేయించుకుని అప్పటికప్పుడు చెట్టు మొదలు శుభ్రం చేయించి, చుట్టూ గట్టు కట్టించి, నాలుగు కడవల నీళ్ళు పోయించింది. "చెట్లు కూడా మన పిల్లలేరా!" అంటూ లోపలకి వెళ్ళింది. పై సంఘటనల వలన మనుషులతో పాటూ పశువులను, చెట్లను కూడా ఎంత ప్రేమించేదో మనకు విశదమౌతుంది.

జిల్లెళ్ళమూడిలో ఒకరి పొలంలోకి ఆంబోతు వస్తుండేది. దానిని గుడిసెలో పెట్టి వాళ్ళు ఆ గుడిసెకు నిప్పంటించారు. ఆ తరువాత ఆయనకు పుట్టిన పిల్లలిద్దరూ మూగవాళ్ళయ్యారు. "అంబా అంబా" అని తప్పింది వేరేమి పలుకలేరు. ప్రతి జీవినీ ఆదరణగా చూడాలని వాటికి హాని కలిగిస్తే వాటి శాపం ఊరికే పోదని అమ్మే తెలియచేసింది.

కొమరవోలు ముక్తేశ్వరరావుగారు బాపట్ల నివాసి. అమ్మ దర్శనం తరువాత ప్రభావితులై అమ్మను ఎంతగానో కొనియాడారు. అమ్మ ఆహారాన్ని స్వీకరించకపోయినా నీర్శంగా వుండటం కానీ, అమ్మలోని తేజస్సు క్షీణించటంకానీ కనిపించక పోవటంతో విస్మయచకితులైనారు.

వారి పెద్దబ్బాయి గోపాలరావు గారికి భార్యాబిడ్డల్ని వాళ్ళ మానాన వారిని వదిలి హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేపుకోవాలన్న కోరిక బలంగా వుండేది. అమ్మ గృహస్థు కాబట్టి, కొడుకు అమ్మ దర్శనం చేసుకుంటే, హిమాలయాలకు వెళ్ళే ఆలోచనను అమ్మ విరమింప చేస్తుందన్న నమ్మకం గాఢంగా వుండటంతో కొడుకును అమ్మ దగ్గరకు వెళ్ళమని మరీ మరీ చెప్పారు.

గోపాలరావుగారి సందేహాలకు ఎక్కడా సమాధానాలు దొరకలేదు. ఆయన నిత్యం సంధ్యావందనం, 3,4 గం.లు జపం చేయనిదే పచ్చి మంచినీళ్ళు కూడా తాగేవారు కాదు. ఆడవారితో మాట్లాడటం అన్న ప్రశ్నే లేదు. వాళ్ళ నాన్నగారు అమ్మ గురించి చెప్పినా 6 నెలల వరకూ ఏమీ ఆలోచించలేదు. అప్పటికి ఆయన ఒంగోలులో పనిచేస్తున్నారు.

గోపాలరావు గారు బాపట్ల వచ్చినప్పుడు ఆయన తండ్రి ఆమెకు అన్నీ తెలుసు కానీ ఏమీ చెప్పదని, భోజనం చేయకపోయినా ఆమె వదనం, శరీరం కాంతులీనుతుందని విన్న గోపాలరావు గారు ఆశ్చర్యపోయారు. పూజా జపం అయిన తరువాత అమ్మను ఒకమారు చూచి వస్తే బాగుంటుంది అనిపించింది. "ఉదయమే 6.30 గం॥లకు జిల్లెళ్ళమూడి వెళ్తున్నానని, 11గం॥లకు భోజనానికి వస్తానని" చెప్పారు. అక్కడికి వెళ్ళిన తరువాత అంతా అమ్మే చూచుకుంటుందన్న విశ్వాసం ముక్తేశ్వరరావు గారికి వుండటంతో "సరే" అన్నారు.

జిల్లెళ్ళమూడి వెళ్ళి ఒకరిని అమ్మగారు ఎక్కడ వుంటారని అడిగారు. ఆయన అమ్మ వుండే చోటు చూపించారు. అక్కడకు వెళ్ళేటప్పటికి గోపాలరావుగారి బావగారు క్షీరసాగర్ గారు కనిపించి అమ్మ దగ్గరకు తీసుకువెళ్ళారు. తనకు అమ్మ ఉన్న చోటు చూపించిన వ్యక్తే అమ్మ భర్తగారని, ఆయన ఆవూరి కరణంగారని, అందరూ ఆయన్ని నాన్నగారని పిలుస్తారని తెలిసింది. ఆయన నిరాడంబరతకు నివ్వెరపోయారు.

ఆయన పెద్దల దగ్గరకు వెళ్ళినపుడు పాదాలు తాకరాదని, తాకితే వాళ్ళకున్న శక్తులు హరిస్తాయని పుస్తకాల్లో చదివారు. అందుకని అమ్మ పాదాలు తాకకుండా పళ్ళు, పూలూ పక్కన పెట్టి నమస్కారం చేసుకున్నారు. ఆ క్షణంలోనే అమ్మ సమాధిగత అయింది. అంతకుమటుకు సమాధి గురించి వినటమే కాని సమాధిలోకి వెళ్ళిన వారిని చూడలేదు. ఆయన మోకాళ్ళ మీద కూర్చుని వున్నారు. ఆయనకు ఏమి చేయాలో బోధపడలేదు. చుట్టూ పెద్దలు చాలా మంది వున్నా ఎవ్వరూ ఏమీ అనలేదు. దరాపు 20 నిమిషాల తరువాత అమ్మ స్పృహలోనికి వచ్చింది. అంతసేపూ ఆయన మోకాళ్ళమీదే కూర్చొని వున్నారు.

కృష్ణమూర్తి అనే 17 సం॥ ల పిల్లవాడు అమ్మ తల్లో పువ్వు పెడ్తున్నాడు. అమ్మ సన్నగా వుంది. ఎంతో ఆప్యాయంగా అమ్మ అతని వంక చూచి నవ్వింది. అది గోపాలరావు గారికి ఎబ్బెట్టుగా అనిపించింది. అతను పూనా వెళ్తున్నాడని, గుంటూరు నుంచీ అమ్మను చూచి వెళ్దామని వచ్చాడని తెలిసింది. పావుగంట

కోసం అంతదూరం నుంచీ వచ్చి అమ్మను చూసి వెళ్ళటమేమిటి? ఇదేం పిచ్చి అనిపించింది గోపాలరావుగారికి.

గోపాలరావు గారి నాన్నగారు "ముందుగానే అమ్మ చెయ్యి ఇస్తుంది, నీ చేతిని అందించమని" చెప్పారు. ఆయన ఆ మాట మర్చేపోయారు. అతనికి అన్నం పెట్టి వచ్చి గోపాలరావుగారికి బొట్టుపెట్టి అరిటిపండు ఇచ్చింది. దానిని ఆయన వారి బావగారికి ఇవ్వాలనుకున్నారు. వెంటనే అమ్మ ఎవరికి ఇచ్చింది వాళ్ళే తినండి. మళ్ళీ మీరు వెళ్ళేటప్పుడు ప్రసాదం ఇస్తానని చెప్పింది. దానికి తెల్లబోవటం ఈయన వంతు అయింది. తను పైకి అనుకోలేదు. తన మనస్సులోకి విషయాన్ని ఎలా గ్రహించగలిగిందని ఆశ్చర్యజనితులైనారు. ప్రత్యేకించి ఆయన్ని పలకరించలేదు అమ్మ. ఆయన అమ్మను ఏమీ అడగనూ లేదు. గోపాలరావు గారికి అమ్మ స్వయంగా భోజనం వడ్డించింది. ఆ ప్రసాదం స్వీకరించటంతోనే ఆయనకు అమ్మ యందు ఎనలేని గురి కుదిరింది.

ఆయనకు పుస్తకాలు అందునా ఆధ్యాత్మిక పుస్తకాల యందు ఆసక్తి మెండు, ఏమాత్రం ఖాళీ దొరికినా పుస్తక పఠనంలో మునిగిపోయేవారు. మొదటిసారి అమ్మను దర్శించి వెళ్ళిన తరువాత పుస్తకాలు చదవాలన్న అభిలాష నశించింది. వార్తా పత్రిక తీసినా, ఆఫీసుకు వెళ్ళి ఫైళ్ళు తీసినా అమ్మ ముఖమే కనిపించేది. సంతకం ఎక్కడ చేయాలో కూడా తెలిసేది కాదు. గుమస్తానడిగి సంతకం చేసేవారు. 20 రోజులు ఆ స్థితిలోనే వున్నారు. ఆ తరువాత మామూలైనారు. రెండవవారు అమ్మను దర్శించాక 15 రోజులు అదే స్థితిలో ఉన్నారు.

అమ్మను వదిలి వుండటానికి ఇష్టపడేవారు కాదు. తల్లి ఒడి నుండీ పసిపిల్లవాడిని లాగేసినట్లుగా బాధపడేవారు. 40 సం॥లు దాటిన నేను ఇలా చేస్తున్నానేమని ఆశ్చర్యపోయేవారు. ఎవరి అనుభవం వారిదే. నరసింహారావు గారు మెహర్‌బాబా భక్తులు. రాజమండ్రిలో వుండేవారు. వారికి పుస్తకాలు చదివే అలవాటు లేదు. ఆయన అమ్మ దర్శనానంతరం విపరీతంగా పుస్తకాలు చదవటం మొదలుపెట్టారు. "నాకున్న అనుభవం ఆయనకు లేదని, ఎవరి

అనుభవం వారిదేనని, ఎవరూ కోరుకుంటే వచ్చేది కాదు, నేను కావాలని కోరుకున్నది కాదు" అని గోపాలరావుగారు చెప్పారు.

అమ్మను వదిలి వుండలేక చేస్తున్న ఉద్యోగం మానేసి కుటుంబంతో సహా జిల్లెళ్ళమూడిలో స్థిరపడ్డారు. అయిదుగురు ఆడపిల్లలు ఇద్దరు మగపిల్లలతో జిల్లెళ్ళమూడిలో వుంటున్నారంటే మాచుట్టాలందరూ విస్తుపోయారు. ఆయన భార్య సరోజినక్కయ్య, మా పెద్దనాన్నగారైన అన్నంరాజు వెంకటేశ్వర రావుగారి కుమార్తె. ఆ దంపతుల ద్వారానే అమ్మ మా కుటుంబాలలో ఇలవేల్పు అయింది. వారి పెద్ద అమ్మాయి పద్మ పెండ్లి అమ్మ చేతుల మీదుగా జరగటంతో మావాళ్ళందరూ ఆ పెళ్ళికి వెళ్ళారు. అప్పటి నుంచీ మావాళ్ళందరికీ అమ్మ ఆరాధ్య దేవత అయింది.

అమ్మ పుట్టిన రోజుకు 1958లో మన్నవ వెళ్ళింది. ఆ పుట్టిన రోజుకు మా నాన్నగారు అన్నంరాజు మాధవరావుగారు, అమ్మగారు దుర్గాంబ గారు, మా అన్నయ్య మురళి, నంబూరి హనుమంతరావుగారి కార్లో మన్నవ వెళ్ళారు. అక్కడ అమ్మ అరిటిపండు కొరికి పెట్టింది. మురళీ అన్నయ్య ఎంగిలి అని ఆలోచిస్తున్నాడు. "ఏం నాన్నా! ఎంగిలి అని ఆలోచిస్తున్నావా?" అని అడగటంతో అక్కడి వారంతా ఆశ్చర్యచకితులైనారు. దాదాపు 10 సం॥ల తరువాత పద్మ పెళ్ళికి ఫిబ్రవరిలో వెళ్ళారు. వారం రోజుల్లో మురళీ అన్నయ్య పెళ్ళి ఆరోజే అమ్మ అన్నయ్యను పెళ్ళి. కొడుకుని చేసింది. ఆదండ తీయకుండా మెడలో వుంచుకునే గుంటూరు వెళ్ళాడు. హైదరాబాద్ వెళ్ళినా నెలకు 2 మార్లకు తక్కువ లేకుండా వచ్చేవాడు.

గోపాలరావుగారు కొబ్బరికాయ పట్టుకుని వెళ్ళారు. "ఏమిటో విశేషం అని అమ్మ అడిగింది. "పుట్టినరోజు" అని చెప్పారు. "నా లెక్కలో నీ పుట్టిన రోజు జనవరి పదకొండు నాన్నా" అన్నది. అది ఆయన అమ్మను మొదటసారి దర్శించిన రోజు. అమ్మను దర్శించిన రోజు ఎవరికైనా ఆధ్యాత్మిక పునర్జన్మే, దానినే అమ్మ స్పష్టపరిచింది.

అమ్మను కొందరు రాజరాజేశ్వరిగా, కృష్ణుడిగా, పార్వతిగా, ఆదిశక్తిగా వాళ్ళ

అనుభవాల బట్టి వర్ణిస్తుంటారు. "నామటుకు నాకు అమ్మను అమ్మగా చూడటమే ఇష్టం. రాముడు రాముడే, కృష్ణుడు కృష్ణుడే. అమ్మ అమ్మే. అమ్మను ఇంకొకరితో పోల్చవలసిన అవసరం ఏముంది. డివైన్ పవరే అమ్మ." అని తన అభిప్రాయాన్ని నిర్భయంగా వెల్లడి చేసారు గోపాలరావుగారు.

అమ్మను ఎందరెందరో నీ సందేశమేమిటమ్మ? అని అడిగారు. "నేను ప్రత్యేకించి ఇచ్చే సందేశమేమున్నది. నా జీవితం నుంచీ ఏమైనా నేర్చుకోగలిగితే నేర్చుకోండి. అదే నా సందేశం" అన్నది. ఆ సందేశాన్ని ఎవరికి ఏవిధంగా అర్థమైతే ఆవిధంగా మలుచుకుంటారు. అమ్మను చూడటానికి అనేక కోణాలు వున్నాయి. సముద్రం దగ్గరకు గ్లాసుగాని, బిందెగాని తీసుకు వెళితే వాటి నిండుగానే నీరు వస్తుంది. టాంకర్ తీసుకువెళితే టాంకర్ నిండుగానే నీరు వస్తుంది గాని సముద్రం తరగదు. అలాగే అమ్మలోని దైవత్వానికి లోటు వుండదు కదా! అని తెలియచేసారు.

గోపాలరావుగారిని అమ్మ "సాధన చేస్తున్నావా?" అని అడిగింది. "అవునమ్మా ఏకాగ్రత కోసం చేస్తున్నాను" అన్నారు. "అది నాకొద్దు మానేయి" అన్నది అమ్మ. అమ్మ దగ్గరకు ఏదో ఉద్దేశంతోనో, కోరికతోనో, ఏదో సాధిద్దామనో ఆయన వెళ్ళలేదు. ఆయనకు ఉన్న అనుమానాలకు జవాబులు అమ్మ దగ్గర స్ఫురించటంతో ఆయన అమ్మకు తనని తాను సర్వ సమర్పణ గావించుకున్న ధన్యజీవి.

అమ్మ ఒక శక్తి. ఆశక్తి దగ్గర వారి వారి ప్రాప్తానుసారం, వారి సహజ గుణాన్ని బట్టి, వ్యక్తిత్వాన్ని బట్టి అనుభూతులు పొందుతారు అని వారి ఉద్దేశం. మంట తగిలితే గడ్డిపోచ మండిపోతుంది. ఇనుపముక్క కాలుతుంది. నెయ్యి వేస్తే మంట ఉధృతం అవుతుంది అట్టిదే అమ్మ అనుగ్రహం. 1959లో హిందూ కాలేజీ విద్యార్థి ఒకరు అమ్మతో "రాముడు, కృష్ణుడు కన్నా బుద్ధుడు గొప్పవాడనిపిస్తుందని" చెప్పాడు. దానికి అమ్మ "రాముడు, కృష్ణుడు, బుద్ధుడు ఎంత గొప్పవారో నీవూ అంత గొప్పవాడివే నాన్నా!" అన్నది. అది విని అవిద్యార్థి

అమ్మ తనను హేళన చేస్తోందనుకున్నాడు. అతని ఉద్దేశం కనిపెట్టి "ఒక్కొక్కరు ఒక్కొక్క పర్పస్ కోసం పుట్టారు. ఆపని చేసుకు వెళ్ళారు. నీపని నీవు చేసుకుపోతావు. కాబట్టి ఒకడు ఎక్కువ ఒకడు తక్కువ అని నాకు అనిపించటం లేదు. భగవంతుడు ఎవర్ని ఎందుకు పుట్టించాడో దానిని వాడే చేయించుకుంటాడు. వాడేది ఇస్తే అది అనుభవించవల్సిందే" అని తెలియచేసింది అమ్మ.

ఒకడి చేత రాయించకోవాలనుకుంటే ఆశక్తి వాడే ఇస్తాడు. వీడి ద్వారా వాడే ఆపని చేస్తాడు. అదే విధంగా అమ్మ నన్ను కలంగా మలచుకొని తన చరిత్రను తానే రాయిస్తున్నది. "గృహస్తు జీవనాన్ని గడుపుతూ కూడా ఆధ్యాత్మికతను అలవరచుకోవటానికి తోడ్పడే సాధన ఏమిటి?" అని గోపాలరావు గారిని వారి రెండో కోడలు అడిగింది. దానికి గోపాలరావు గారు "అమ్మ, రామకృష్ణ పరమహంస ఆచరణలో చూపించారు కదా" అని చెప్పారు.

గోపాలరావుగారి నాన్నగారు జీవిత చరమ దశలో జిల్లెళ్ళమూడికి వచ్చి ఆ మట్టిలో కలిసిపోయారు. అప్పుడు వాళ్ళ అమ్మగారిని బొట్టు పూలు లేకుండా చూడటానికి అంతా చాలా బాధపడ్డారు. ఆవిడ పచ్చటి మనిషి నడుం ఒంగిపోయినా పెద్ద బోట్టుతో కళకళలాడుతూ వుండేది. ఆ మాటే రామకృష్ణన్నయ్య అమ్మతో అన్నాడు. దానికి అమ్మ "బొట్టు, పూలు తల్లి పెట్టినవే కదా! వాటిని తీయవలసిన అవసరం లేదు" అన్నది. దానికి చాలా విమర్శలను "ఎదుర్కోవాల్సి వస్తుందమ్మా" అన్నాడు రామకృష్ణ అన్నయ్య "అది నాతోనే మొదలవుతుంది నాన్నా" అన్నది అమ్మ.

ఒకరు అమ్మను "పురుడు అని, మైల అని ఎందుకు అంటారు" అని అడిగారు. "పిల్లగాని, పిల్లవాడు గానీ పుడితే ఆనందం పురుడు. మనిషి చనిపోయినప్పుడు దుఃఖం మైల" అని అమ్మ చెప్పింది. గోపాలరావుగారు ఆఫీసును ఎంతో పకడ్బందీగా నడిపించారు. అలాగే శుక్రవారం పూజా స్కీమ్‌కు చందా కట్టిన వారికి వారి గోత్రనామాలతో పూజలు చేయించి ప్రసాదాన్ని ఎంతో

శ్రద్ధగా వారి వారి అడ్రస్‌లకు సకాలంలో అందేటట్లు ఎంతో కృషిచేసారు. దానితో పాటు అమ్మ యొక్క లీలలను ప్రపంచంలో నలుమూలలా అందేటట్లు చేసారు. ఆయన ఉత్తరాల వల్ల ప్రభావితులై అనేకమంది విదేశీయులు అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడిని సందర్శించారు. ఆయన లెటర్స్ ఎందరెందరికో మార్గదర్శకాలయ్యాయి. ఏపని చేసినా ఎంతో శ్రద్ధగా, నమ్మకంగా చేసేవారు.

సరోజినక్కయ్య ప్రతిపనిలో తానుంటూ తనకంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. అక్కడ ఏ పండుగ జరిగినా, ఏ వేడుక జరిగినా అక్కయ్య హాజరవ్వవలసిందే. అక్కయ్య ఎంతో శ్రావ్యంగా సంధ్యావందనం చేసేది. అందుకే జిల్లెళ్ళమూడిలో అందరూ సంధ్యావందనం సరోజినక్కయ్య అనేవారు. ఎక్కడ మంగళ హారతి పాడవలసి వచ్చినా అక్కయ్య కంఠం వినిపించవలసిందే. అంతగా సంస్థతో పెనవేసుకు పోయింది అక్కయ్య.

అమ్మ మీద ఎంత భక్తి శ్రద్ధలతో ఎన్నో సంవత్సరములు ఆ దంపతులు అమ్మ సేవ చేసుకుని తరించారు. అమ్మ దగ్గర స్థిరపడక ముందు 10 సం॥లు వారు ఏ వూళ్ళో వుంటే ఆ వూళ్ళో వారందరికీ అమ్మ గురించి తెలియచేసి వారందర్నీ జిల్లెళ్ళమూడికి వచ్చేట్టు చేసేవారు. అక్కయ్య ఏ విషయాన్నైనా కన్నులకు కట్టినట్లు వర్ణించటంలో దిట్ట.

వారి నాల్గవ అమ్మాయి కుసుమ తిరుపతి పద్మావతీ కళాశాలలో ఇంటర్వ్యూకు వెళ్ళింది. అక్కడ కుసుమ, ఇంకొక అమ్మాయి సమాన ప్రతిభను కనపరిచారు. వారిలో ఎవరిని సెలక్టు చేయాలి అన్న సమస్య వచ్చింది. కుసుమకు పర్సనాలిటీలో ఒకమార్కు ఎక్కువ వచ్చింది. అందువల్ల కుసుమ సెలక్టు అయింది.

ఇంటర్వ్యూ నుంచి జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు అమ్మ కుసుమను "నీకు పర్సనాలిటీ ఏమిటే?" అని అడిగింది. కుసుమ ఎక్కువ పొడవు, పొట్టికాకుండా సమంగా ఉంటుంది. దానికి కుసుమ "నీవు పెంచితే నా పర్సనాలిటీ పెరగదా ఏమిటి? నీవే నన్ను పెంచి నాకు ఉద్యోగం వచ్చేలా చేశావు" అని అమ్మకు కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించింది. అక్కయ్య పిల్లలు రవి, కుసుమ,

సుహాసిని జిల్లెళ్ళమూడి ఓరియంటల్ కళాశాలలో చదివి అనేక బహుమతులు గెలుచుకున్నారు. అనేక పోటీల్లో పాల్గొన్నారు. యూనివర్శిటీ ఫస్ట్‌గా కూడా వచ్చారు.

సరోజినక్కయ్య వాళ్ళ అమ్మాయికి పెళ్ళి సంబంధం వచ్చింది. మీరేమీ మాట్లాడకండి అని అమ్మే వ్యవహారాన్ని నడిపించింది. పెళ్ళివారితో అమ్మ "మేమేమీ డబ్బు కలవారం కాదు. కట్నాలు అంటూ మేము ఎక్కువ ఇచ్చుకోలేము. మాతాహతుకు తగినట్లుగా పెళ్ళి చేస్తామని, తరువాత ఎలాంటి గొడవలు రాకూడదని పెళ్ళివారితో చెప్పింది. వాళ్ళు అమ్మ చెప్పటంతో దేనికీ ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు. పెళ్ళి అమ్మ యధావిధిగా ఏ లోటూ రాకుండా ఘనంగా జరిపించింది. పెళ్ళి వారు ఎంతో ఆనందించారు. అమ్మను మించిన వ్యవహార వేత్త ఎవరుంటారు? వారి నలుగురి ఆడపిల్లలకీ అమ్మ ఆధ్వర్యంలోనే వివాహాలు జరగటం గమనార్హం.

పూర్తిగా నమ్మిన వారికి అమ్మ దయ అపారం కదా! వారి పిల్లలందరూ వారి వారి జీవితాల్లో సెటిల్ అయి హాయిగా ఉన్నారు. తల్లిదండ్రుల పుణ్యఫలమే పిల్లలకు శ్రీరామ రక్ష కదా!

రుక్మిణి అక్కయ్య వాద కరణంగారైన బెండపూడి యోగానంద నరసింహం గారి భార్య. ఆమె పినమామగారైన బెండపూడి అక్కిరాజు గారి ఇంటి వద్ద అమ్మ ఫోటోను చూచి, అమ్మ గురించి విన్నది. రుక్మిణమ్మకు దైవం అన్నా, అవతారాలన్న విశ్వాసం లేని మనిషి. స్వాముల వారన్నా లక్ష్యం లేదు. కానీ అమ్మ ఫోటో చూచిన మరుక్షణం నుంచి ఒక్కసారి అమ్మను చూచి వస్తే నష్టమేమున్నది అనుకున్నది. 1958వ సం॥ ఫిబ్రవరి నెలలో మాఘ పౌర్ణమికి ముందురోజు ఆమె జిల్లెళ్ళమూడి వెళ్ళింది. అప్పుడు తలంటి స్నానం చేసి ఆరీ ఆరని పొడవైన నల్లని వెంట్రుకలను వదులుగా ముడి వేసుకొని నేత చీర కట్టుకొని, చేతుల నిండుగా గాజులు, కనుబొమ్మల నడుమ పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొని వాకిట్లోనే ఎదురైంది అమ్మ. ఆమె 'అమ్మ' అని చెప్పారు.

రుక్మిణమ్మ ఆశ్చర్యపోయింది. ఇంత నిరాడంబరంగా సామాన్యంగా ఉంది.

కాషాయి గుడ్డలు కట్టుకొని కృష్ణాజినం మీద కళ్ళు మూసుకొని జపమాల తిప్పుకుంటుందని ఊహించింది. ఆమె ఊహకు ఇక్కడ చూసిన దానికి ఎక్కడా సంబంధం లేదు. ముఖంలో ఏదో ప్రసన్నతా తేజోరేఖను రుక్మిణమ్మ స్పష్టంగా గమనించింది. అమ్మ ఆమెకు అన్నం కలిపి ఐదు ముద్దలు పెట్టింది. మర్నాడు ఫిబ్రవరి నాలుగవ తారీఖు మాఘ పౌర్ణమి.

అమ్మ దేవుడైతే నన్ను లోపలికి పిలుస్తుందని రుక్మిణక్కయ్య అనుకుంది వెంటనే అమ్మ దగ్గర నుంచి పిలుపు వచ్చింది. ఆమె ఆశ్చర్యానందాలకు అవధులు లేవు. ఆసాయంత్రం లక్ష్మీకాంత యోగి గారు అమ్మ సమక్షంలో ఉపన్యసిస్తున్నారు. రుక్మిణమ్మ అమ్మను స్పృశించవలెనని అనుకుంది. అమ్మ లోపలికి వెళుతూ ఆమె తలమీద ఒక దెబ్బ వేసి వెళ్ళింది. అమ్మ చెప్పినట్లుగా మళ్ళీ వారం రోజులకు తిరిగి జిల్లెళ్ళమూడి వెళ్ళింది. ఆమెను నలభై రోజులలో నాలుగు లక్షల జపం చెయ్యమని అమ్మ చెప్పింది. అమ్మ చెప్పినట్లుగా నియమ బద్ధంగా జపం చెయ్యటం మొదలు పెట్టింది. నిరంతరం అదే ధ్యాస, ఏ పని చేస్తున్నా ఆమె ధ్యాసకు భంగం లేదు. ప్రతి మాట మంత్రమై మనం అయ్యేది. వారి పడక గదిలో అమ్మ ఫోటో ఉంటే దానిని అక్కడ నుండి తొలగించింది. ఆమె జిల్లెళ్ళమూడి వెళ్ళినపుడు "ఏమ్మా ఫోటో తీస్తే నేను చూడలేననా? నేను చూడగూడని విషయం ఏమీ లేదే" అని ముసి ముసి నవ్వులు నవ్వింది.

ఒక శుక్రవారం భర్తను కొబ్బరికాయ తెప్పించమంది. ఆయన ఏదో కోపంలో ఉండి విసురుగా వెళ్ళారు. దేవుని గదిలోకి వెళ్ళేటప్పటికి మెరుపు మెరిసి కళ్ళు జిగేలు మన్నాయి. పూజా మందిరంలో అమ్మ ఫోటో ముందు కొబ్బరి కాయ కనిపించింది. ఆమె సంతోషంతో మైమరిచి భర్తను పిలిచింది. అది చూచి ఆయన విస్మితులయ్యారు. రుక్మిణమ్మ ఈపురపాలెంలో ఉండగా వండిన పదార్థాలన్నీ ఒక పళ్ళెంతో అమ్మ ఫోటో ముందర పెట్టి తలుపు వేసి వెళ్ళేది. ఆ తరువాత వచ్చి చూస్తే పళ్ళెం ఖాళీ అయి ఉండేది. అమ్మ తేజోరూపంలో వచ్చి ఆరగించేది.

రుక్మిణమ్మకు సంతాన యోగం లేదని డాక్టర్లు నిర్ణయించారు. అందరూ

అమ్మను అడగమనేవారు. అమ్మ ఎక్కడకు వెళ్ళినా రుక్మిణక్కయ్య ఉంటే తనకు సౌకర్యంగా ఉంటుందనేది. అందుకని రుక్మిణక్కయ్య కుటుంబం జిల్లెళ్ళమూడిలో స్థిరపడింది. అక్కయ్య అమ్మ దగ్గర కూర్చుని ఉండగా ఒక కొలను, కొలనులో తామరాకు, తామరాకుపై పసిపిల్ల. ఆ పిల్లఆకులో లేవగానే పది సంవత్సరాల బాలికగా రూపొంది ఆమెను తన వెంట రమ్మంది. ఎక్కడికో తీసుకు వెళ్ళింది. అనేక మంది ఋషులు ఆ బాలికకు నమస్కరించారు. ఆ బాలిక వారితో ఏదో మాట్లాడింది. రుక్మిణక్కయ్యకు అర్థం కాలేదు. ఇంకోచోటుకి వెళ్ళారు. అక్కడ పరమేశ్వరుడు ఉన్నాడు. ఆయన అభివందనాన్ని అందుకుని అమ్మ మాట్లాడింది. తరువాత ఒక చెట్టు కింద ముందు చూసిన దృశ్యాలన్నీ చూపింది. ఇంతసేపు రుక్మిణమ్మ బాహ్యస్మృతిలో లేదు. ఇట్లా ఆమెకు అనేక అద్భుత అనుభవాలు కలిగాయి.

వాటన్నింటినీ మించి, డాక్టర్ల నిర్ణయాలనే తలక్రిందలు చేసి ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి సవాలుగా ఆమె గర్భవతి అయింది. సుఖప్రసూతి కావటం అసంభవమన్నారు. అందువల్ల నెల రోజుల ముందు నుండీ రేపల్లెలో లేడీ డాక్టరు గారి వద్ద ఉంచారు. కానీ ఒక రోజున అమ్మను చూసి వెళ్దామని టాక్సీలో జిల్లెళ్ళమూడి వచ్చింది. ఆరాత్రి అక్కడనే నొప్పులు ఆరంభమై 1965 ఫిబ్రవరి 24న రుక్మిణమ్మ ప్రసవించినది. ఒక బిడ్డ జననమయింది. రెండవ శిశువు లోపలనే ఉంది. అప్పుడు టాక్సీలో జిల్లెళ్ళమూడి నుంచీ బాపట్ల హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. రెండవ శిశువు లోపలనే ప్రాణాలు కోల్పోయి కొన్ని రోజులయింది. ఈ కాన్పు ఎలా జరిగిందనీ, ఒక బిడ్డ ఎలా బ్రతికాడు అనీ, ప్రాణంలేని బిడ్డతో తల్లియెలా బ్రతికి ఉన్నదనీ డాక్టర్లు ఆశ్చర్యపోయారు.

అమ్మ అనుగ్రహానికి పాత్రమైన రుక్మిణమ్మకు ప్రమాదమేమున్నది? అసలు ఆమె ఆ కాన్పుకైనా ఏమి నొప్పులు పడ్డది? ఆ రాత్రి అమ్మ అక్కయ్య నొప్పులు తాను తీసుకొని విపరీతమైన బాధ పడ్డది. ఏమిటమ్మా? ఇది అని అడిగితే " ఆ బాధను అక్కడ తీసివేయగల నేను ఇక్కడ మాత్రం ఎందుకు అనుభవించాలి" అని నవ్వేసింది. ఆ చిరంజీవికి రహి అని అమ్మ నామకరణం చేసింది.

దేవుడే లేడనే రుక్మిణమ్మ ప్రస్తుతం అమ్మే దేవుడంటుంది. అమ్మకు తప్ప మరెవరికీ నమస్కారం కూడా చేయదు. అమ్మలోనే సర్వ దేవతలూ ఉన్నారని, ఆ పాదసేవలోనే సర్వతీర్థాలు ఉన్నాయని ఆమె విశ్వాసం. అమ్మ అవ్యాజానుగ్రహ వీక్షణలో రుక్మిణమ్మ జీవన లత పరివర్తనలో పరిమళ భరితమే కాకుండా పుష్పించి సుందరమైంది.

1949లో దేశిరాజు రాజమ్మగారు అమ్మను "నేను కొన్ని కోట్ల జపం చేశాను. నేను కొన్ని మంత్రాలు రాసిస్తాను. ఈ మంత్రాన్నీ ప్రపంచానికి వెదజల్లమ్మా" అని కోరింది. ఇంతవరకూ "మంత్రమంటే నాకే అర్థం కానిది నేనెక్కడని వెదజల్లేది" అన్నది అమ్మ. "నీవే మంత్రానివి నీకు అర్థం కావటమెందుకు" అని తన విశ్వాసాన్ని తెలియజేసింది రాజమ్మగారు.

1958 ఫిబ్రవరి 4వ తేది మాఘ పూర్ణిమ దేశిరాజు రాజమ్మగారి కోరిక మేరకు అమ్మ ఆనాడు ఉపదేశం చేయటానికి సంకల్పించింది. అందుకోసం వెయ్యిమంది భక్తులు వచ్చారు. తెల్లవారు జామున 2-45 నిముషాలకు జిల్లెళ్ళమూడి గ్రామానికి దక్షిణదిశలో ప్రవహించే "ఓంకార" నదికి వెళ్ళారు. 3-25 గంటలకు అంతా కాలవలో దిగి స్నానాలు చేశారు. ఒక అరగంట తరువాత సరిగా బ్రాహ్మీ ముహూర్తంలో ఒకరి తరువాత ఒకరిగా 600 మందికి ఉపదేశం చేసింది అమ్మ. ప్రతి ఒక్కరికీ ప్రార్థన, ధ్యాన శ్లోకం చెప్పి మంత్రం చెప్పింది. అవసరమనుకున్న వాళ్ళకు మంత్రార్థాన్నీ వివరించింది.

ఒక్కొక్కరికి అమ్మ సుమారుగా ఒక నిముషం తీసుకుందని అంచనా. ఆ కార్యక్రమానికి మొత్తం 10 గంటలు పట్టి ఉండాలి. తూర్పుదిశ అరుణోదయకాంతులు ప్రసరిస్తుండగా బాలభానుడు తన కిరణాల ద్వారా బంగారు రంగు వలువను జగతిపై పరిచినట్లు లేయెండ మిగుల శోభాయమానమై హృదయాహ్లాదకరమైన ఆ సమయంలో 7గం.లకు అమ్మ తిరిగి వచ్చింది.

ఉపదేశ కాలంలో 3 గంటల మధ్య పదిగంటల కాలంను స్థంభింపచేసింది అమ్మ. ఆ రోజు అక్కడ ఉన్న వారంతా అమ్మ సూర్యోదయాన్నే ఆపివేసిందని

ఆశ్చర్యపోయారు. మహాపతివ్రత సుమతి కథను జ్ఞాపకం చేసుకున్నారు. "పతిని ఆధారం చేసుకుని పంచభూతాలను జయించిందే పతివ్రత అనీ "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి" అనీ మరొక ప్రవచనం. ఈ రెండు వాక్యాలూ అమ్మ కిరీటంలో కలికితురాయి. ఈ సంఘటనకు ప్రత్యక్ష సాక్షులుగా వసుంధరక్కయ్య, రుక్మిణక్కయ్య, కాంతయ్యగారు ఉన్నారు.

నాగయ్య నాగులపాడు నివాసి. కాపునాగేంద్రమ్మ ఎన్ని మార్లో జిల్లెళ్ళమూడి రమ్మని అడిగింది. కానీ అతను వెళ్ళ లేదు. తరువాత తనంతట తానుగానే జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. తరుచూ అమ్మ దగ్గరికి వచ్చి 2 రోజులుండి వెళ్తుండేవాడు. అతని భార్యకు జబ్బుగా ఉంది. అమ్మ దర్శనార్థం వస్తే ఆ పూరింట్లో 15 మంది దాకా ఉన్నారు. నాగయ్యను ఏమిటి?" అని అడిగింది. "మా ఆవిడకు బట్టవిడుపు జబ్బు" అని చెప్పాడు. గుంటూరు తీసుకెళ్ళి డాక్టరుకు చూపించమంది అమ్మ. డాక్టరు బాగుచేసి పంపించాడు. రెండవమారు మళ్ళీ వస్తే అమ్మను సంప్రదించకుండా గుంటూరు తీసుకువెళ్ళాడు. డాక్టరుగారు ఇంజక్షన్ చేసారు. మరునాడు ఆమె చనిపోయింది తరువాత నాగయ్య అమ్మ దగ్గరకు వెళ్ళాడు. అమ్మ ఏమీ ఎరగనట్టు మీ ఆవిడ రాలేదేం? అని అడిగింది. భార్య చనిపోయిన సంగతి చెప్పాడు నాగయ్య. నాగయ్యకు ఇద్దరు మగపిల్లలు. "చిన్నపిల్లవాణ్ణి వాళ్ళతాత దగ్గర ఉంచు, నీవు పెద్దపిల్లవాడు నా దగ్గర ఉండడని" అమ్మ చెప్పింది. అమ్మ స్నానం చేస్తుంటే గొట్టంలోనుండి ఆ నీటిని పోకుండా ఆపేశాడు. వెంటనే అమ్మ స్నానం అయిపోయిందని వచ్చేసి ఆ పిల్లవాడు ఎవరని అడిగింది. నాగయ్య కొడుకని చెప్పారు. మావూరు వెళ్ళినప్పుడల్లా వాళ్ళు ఏదో ఒకటి ఇస్తుంటారు" అని నాగయ్య అమ్మతో చెప్పాడు. "నీవు కూడా ఏదైనా తీసుకువెళ్ళి ఇవ్వమంది" అమ్మ. తిరిగి ఇద్దరి పిల్లలను తీసుకుని అమ్మ పుట్టిన రోజు పండుగకు వచ్చి అమ్మను చూసి ఏడ్చాడు. అమ్మ "అతని చేయి అందుకుని ఫరవాలేదు నాన్నా నేనున్నాను కదా! అని ధైర్యం చెప్పింది.

నర్సింహమూర్తి గారు, నాగయ్య గడ్డికోసం గాలిస్తున్నారు. హరిదాసుగారిని నాగయ్యకు అన్నం తీసుకువెళ్ళమంది అమ్మ. "రెండు గంటల" వరకు ఖాళీ

లేదమ్మా" అన్నారు హరిదాసుగారు. "ఎవరికీ ఖాళీ లేకపోతే నాకివ్వండి. ఆ కేరియర్ నేను పట్టుకువెళ్తానంది" అమ్మ. ఈ లోగా బాపట్ల నుంచి కారు వచ్చింది. దానిలో వెళ్ళి నాగయ్యకు అన్నం ఇచ్చారు. మనం మరిచినా అమ్మ మనల్ని మరవదని విశ్వాసంతో చెప్పాడు. తాను అమ్మ మాటకే ఎదురుచూస్తుంటాను కానీ ఎవరేమనుకున్నా తనకిక పనిలేదన్నాడు.

ఒకరోజు నాగయ్య మూలుగుతుంటే హైమ అమ్మ దగ్గరకు వెళ్ళి "నాగయ్య బాధ పడ్తున్నాడని" చెప్పింది. "నాగులపాడు పెద్ది వీరయ్య దగ్గర మందు తీసుకో నాన్నా" అన్నది అమ్మ. ఆయన హోమియోపతి వైద్యం చేసేవారు. "నాగయ్య వెళ్ళి అడిగితే నా దగ్గరేం మందులు లేవు" అన్నాడు. "అమ్మ నీ దగ్గరే వైద్యం చేయించుకోమందని" చెప్పాడు. వెంటనే ఆయన గుంటూరు వెళ్ళి మందులు తెచ్చి నాగయ్యకిచ్చాడు. మందులకెంతయిందని నాగయ్య అడిగాడు. "నీవు నాకిచ్చేదేమిటి? అమ్మగారు చెప్పింది కాబట్టి నేను వైద్యం చేసాను" అని చెప్పాడు. నాగయ్య ఆ సంస్థలోనే ఉంటూ ఆ పనీ, ఈ పనీ చేస్తూ కాలం వెళ్ళదీస్తున్నాడు.

"అస్వతంత్రుడైతే మానవుడు, స్వతంత్రుడైతే దేవుడు" అని అమ్మ నిర్వచనం. ఎన్ని ఉన్నా మనిషికి అజ్ఞానం మాత్రం ప్రబల శత్రువే. ఆ అజ్ఞానమే మనిషిని మంద బుద్ధిగా, భ్రష్టుడిగా, పతితుడిగా చేస్తుంది. డిసెంబరు 25వ తేదీ క్రీస్తు భగావానుడు అవతరించిన దినం నాడు పాశ్చాత్యఖండం నుండి వెలుగులను విరజిమ్మిన దివ్యజ్యోతి నేడు ప్రాచ్య ఖండం నుండి విశ్వమంతటా ప్రేమసుధను వర్షిస్తోంది. గుంటూరు జిల్లాలోని బాపట్ల నుండీ పెదనందిపాడు వెళ్ళే రోడ్డులో ఏడవ మైలురాయి వద్ద కుడిచేతివైపు ఉన్న వంకల వెంబడి శంకలేకుండా నడిస్తే ముక్తి మార్గమును చేరగలము.

ఇంకా ఎన్నాళ్ళురా, ఈ శరీరాన్ని భరించేది. చాలాకాలం గడిచినట్టు అనిపిస్తుంది అని అమ్మ మాటల సందర్భంలో అనేది. అమ్మ ఎందుకలా అంటుందో తెలిసేది కాదు. మనకోసమే ఆ బాధలను భరిస్తూ ఉన్నట్టుగా కనపడేది. సందర్భవసాన "మీరు కన్నపిల్లలని, ఇతర పిల్లలని మీకు తేడా లేదమ్మా!

అన్న వారితో, కన్నపిల్లతో పాటూ ఇతరులను కూడా సమంగా చూసుకోవడం ఆక్షేపణా? అని తిరిగి ప్రశ్నించింది. ఆ అడిగిన వారి మొహం వెల్లవేసినట్లయింది. అవతారమూర్తి అయిన అమ్మకు తన, పర అన్న భేదాలు ఉండవు కదా! మానవ మాత్రులమైన మనకు గానీ ఆ తేడాలు అమ్మకు లేవు. మనం కూడా స్వార్థం విడనాడి అమ్మదారిలో నడచి విశ్వశ్రేయస్సుకు కృషిచేయాలి. అప్పుడే అమ్మకు నిజమైన వారసులం అవుతాము.

అనంత వీరాస్వామిగారు అనంత సీతాచలంగారి తమ్ముడు. పాలపర్తిలో ఉండేవారు. ఆయన బంగారు నగలు చేసేవారు. ఏదో ఒక సమయంలో రామకృష్ణఅన్నయ్య అమ్మ బంగారం అమ్మమని ఆయనకు పంపించేవాడు. అది కూడా "అమ్మ సేవే" అని రహస్యంగా జరిపించేవారు.

జిల్లెళ్ళమూడిలో పల్లపట్ల శాస్త్రిగారింటి గృహప్రవేశ సందర్భంగా అమ్మ వారింట్లో ఉన్నది. పెదనందిపాడు నుండి అనంత వీరాస్వామిగారు తరుచూ వస్తుండేవారు. అమ్మ అంటే అపారమైన విశ్వాసం. వీరస్వామిగారు అమ్మను చూచి దూరం నుంచే అమ్మకు నమస్కరించి వెనుకగా కూర్చున్నారు. అమ్మవారి వైపు ఆప్యాయంగా "నన్ను చూసావుగా! నాన్నా తృప్తిగా ఉందిగా! పోయి అన్నం తినిరా" అని జాలిగా అన్నది. అప్పుడు సాయంత్రం నాలుగు గంటలయింది. అయినా ఆయన కదలలేదు. అమ్మ జాలిగా ఆయన వంక చూస్తూ ఉదయం నుండీ ఏమీ తీసుకోలేదుగా అని మజ్జిగ తెప్పించి పట్టింది. ఆయన తలవంచుకుని ఏదో తెలియని బాధ పడుతున్నారు. ఆయన్ను అంత విచారంగా మునుపెన్నడూ ఎవ్వరూ చూడలేదు. ఆయన్ని ఎంతగా అడిగినా సమాధానం రాలేదు.

అప్పుడు అమ్మే "నన్ను గురించి ఏమిటో విన్నాడురా! తను నమ్మక పోయినా అందరూ వచ్చి అడగటం తట్టుకోలేక నిజమా! అని తెలుసుకోవటానికి ఇక్కడికి వచ్చాడు. తీరా నన్ను చూసి తను ఎట్లానమ్మి వచ్చానా అని బాధపడ్తున్నాడు, "అంతేగా నాన్న" "అంటూ అమ్మ నవ్వుతూ ఆయన్ను ప్రశ్నించింది. అమ్మే తిరిగి "అసలు జరిగిందేమిటంటే ఈ రోజు ఉదయం బాపట్ల బస్సుస్టాండులో

నన్ను గురించి ఒక దుమారం లేవదీసారు. అది ఏమిటంటే నేను దొంగనోట్లు అచ్చువేయిస్తున్నాననీ, నా పీఠం క్రింద యంత్రం దొరికిందనీ, నన్ను అరెస్టు చేసి 10 గం.లకు బాపట్లకు జీపులో తీసుకువెళ్ళారనీ పెదనందిపాడులో వీరాస్వామిగారిని అడిగారని" చెప్పింది. బాపట్ల నుండీ వచ్చిన ప్రతి బస్సులో ఆ మాట నిజమే అని చెప్పారు. దానితో ఆయన ఇంటికి వెళ్ళలేక, భోజనం చేయక దుకాణం నుంచి సరాసరి ఇక్కడికి వచ్చారని అమ్మ చిద్విలాసంగా చెప్పింది.

గృహప్రవేశ హడావిడిగా జిల్లెళ్ళమూడిలో పాలుపంచుకుంటున్న అమ్మ బాపట్లలో తన గురించిన దూషణ, భూషణాలు తెలిసినాయి. ఎక్కడ, ఎవరు, ఏమి అనుకుంటున్నా అమ్మ పట్టించుకోలేదు. నమ్మకం లేని వారిచే ఇటువంటి అబద్ధపు పుకార్లు లేవదీయించి తనని నమ్మని వారిని కూడా ఆనందింప చేసింది అమ్మ. "ఆ తరువాతే రెండు మూడు రోజుల్లో బాపట్ల నుండీ పెదనందిపాడు బస్సులో జిల్లెళ్ళమూడికి అమ్మ దర్శనార్థమై నేను వెళ్తున్నాను. అమ్మను అరెస్టు చేశారని, అడ్వకేటు అయిన మా నాన్నగారు అన్నంరాజు మాధవరావు గారు బెయిలు మీద అమ్మను విడిపించారని చెప్పుకున్నారు. ఆ విషయం విని చలించిపోయాను. అమ్మ దగ్గర ఆ విషయాన్ని ఏడుస్తూ చెప్పాను. అందుకు అమ్మ "పిచ్చిదానా! ఏడుపెందుకు? వీళ్ళంతా పత్రికల ద్వారా, అధ్యయన పరిషత్‌ల ద్వారా చేయలేని ప్రచారం పైసా ఖర్చు లేకుండా జరిగింది. ఎవరో జిల్లెళ్ళమూడి అమ్మట, ఆమెను జైల్లో పెట్టారట అని చెప్పుకోవటం వల్ల పూర్వం కంటే ఎక్కువ మందికి తెలిసిందని" అమ్మ నిర్వికారంగా, నిశ్చలంగా చెప్పింది.

వీరాస్వామి అంత్యదశలో ఉన్నారని అమ్మకు తెలిసింది. వెంటనే అమ్మ అంత్య క్రియలలో వాడటానికి గంధపు చెక్క, పూలదండ, ఒళ్ళుతుడుచుకునే గుడ్డ, మొదలగునవి పంపించింది.

మా పెద్దమ్మాయి అనూరాధ పెళ్ళి ముహూర్తం ఉదయం గం॥ 7.58 ని.లకు నిర్ణయించబడింది. నమస్కరించుకోవటానికి 7 గం॥లకు అమ్మ దగ్గరకు వెళ్ళాను. "నాదేం ఆలస్యం లేదమ్మా! మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు

వస్తాను. "అంటూ ముహూర్తం అని పెట్టేది అందరూ ఆ సమయానికి చేరటానికే" అన్నది. దానికి నేను "అమ్మా నువ్వు ఎలా చెయ్యదలుచుకుంటే అలా చెయ్యమ్మా. అంతా నీ ఇష్టమే, నాదేమీ లేదు" అన్నాను. సాధారణంగా అమ్మ వివాహాలు, ఒడుగులు అన్నీ మిట్ట మధ్యాహ్నం 12 గం॥లకు చేస్తుంది. అలాగే మా బాబు ఒడుగు, అమ్మాయి పెళ్ళి 12 గం॥ల తరువాతే వైభవంగా చేపింది. 1999 జూన్ 12వ తారీఖున గం. 12-12 ని.లకు వైజాగ్‌లో అమ్మ మందిరానికి శంకుస్థాపన జరిపించుకుంది.

జొన్నాభట్ల వెంకట రామయ్యగారు గుంటూరులో ఉపాధ్యాయుడిగా పనిచేసేవారు. అమ్మను దర్శించింది మొదలు ఆయనకు ఎనలేని శాంతి, విశ్వాసము ఏర్పడ్డాయి. తరుచూ అమ్మ దర్శనానికి వచ్చేవారు. వారింట్లో అమ్మ పూజలు జరిపించేవారు. వాళ్ళ పెద్దబ్బాయి శాస్త్రిని ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలకు ముందు జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ దర్శనం చేసుకోమన్నారు. శాస్త్రి వెళ్ళగానే "మాష్టారుగారి అబ్బాయివా?" అని అతను తన గురించి చెప్పకముందే అమ్మే ప్రశ్నించింది. వారి కుటుంబమంతా అమ్మ సేవలో మునిగిపోయారు.

వెంకటరామయ్య గారికి ఆరోగ్యం సరిగాలేనందున టెస్టులు చేయించి, ద్వాదశినాడు ఆస్పత్రిలో చేర్పించారు. వారం అయినా ఎటువంటి మార్పులేదు. కిడ్నీ టెస్ట్ చేయించాలి. ఈ మందులు తీసుకురాగానే మాకు తెలియచేయండి అన్నారు డాక్టర్లు. మందులు తెచ్చి ఫోన్ చేశారు. మర్నాడు ఆపరేషన్ చేయాలని నిర్ణయం ఇంతలో ఒక చిన్న పిల్లవాడిని ఎమర్జెన్సీ ఆపరేషన్ చేయడానికి తీసుకు రావటంతో ఈయన ఆపరేషన్ చేయటం ఆలస్యమయింది.

రాచర్ల లక్ష్మీనారాయణన్నయ్య, పాపక్కయ్య "డాక్టర్ల వల్ల మందుల వల్ల నయం కాదని వాళ్ళనుకుంటే డాక్టర్లతో సంప్రదించి వాడిని ఇక్కడకు తీసుకురండి" అని అమ్మ అన్నదని చెప్పారు. ఆయన కూడా రెండు రోజులుగా "నన్ను తీసుకువెళ్ళి జిల్లెళ్ళమూడిలో పడెయ్యండని" అడుగుతున్నారు. డాక్టర్లను సంప్రదిస్తే వారు "ఆపరేషన్ టేబుల్ మీద అయినా పోవచ్చు, లేదా కొద్ది రోజులుండి

అయినా పోవచ్చు" అన్నారు. అందుకని పాపక్కయ్య, వెంకటరామయ్య గారిని జిల్లెళ్ళమూడి తీసుకువెళ్ళింది. ఆయన్ను చూచి అమ్మ "నామం చేసుకో నాన్నా"అని చెప్పింది. ఆయన పిల్లల్ని "నాన్నను ఉంచమంటారా?" అని అడిగింది. దానికి వాళ్ళు "అమ్మా! నువ్వు వుంచదల్చుకుంటే ఆయన్ను ఆరోగ్యంగా ఉంచు ఆయన బాధ చూడలేకుండా ఉన్నాము. లేదా నీలో కలిపేసుకో" అని ప్రార్థించారు. చివరి ఏడు రోజులు పరీక్షత్ మహారాజు భగవన్నామస్మరణలో గడిపి ముక్తి పొందినట్లు భాగవతంలో చెప్పినట్లుగా వెంకటరామయ్య గారు అహర్నిశం అమ్మ నామ సంకీర్తనతో గడిపి ముక్తి పొందారు.

ఒకరోజు సాయంత్రం అమ్మ ఆరుబయట మంచం మీద ఆసీనురాలై ఉన్నది. రామకృష్ణన్నయ్య, పార్థసారధి గారు, పొరుగూరి నుండి వచ్చిన మరో ఇద్దరన్నయ్యలు వున్నారు. రామకృష్ణన్నయ్య, అంతకు మునుపు ఎప్పుడో జరిగిన విషయం చెప్పాడు. అన్నయ్య మాటల్లో "ఒకసారి సాయంత్రం అందరం యిలాగే కూర్చుని వున్నాము. ఒక అన్నయ్యను అమ్మ విసనకర్ర తెచ్చి విసరమని చెప్పింది. ఇంతగాలి వేస్తుంటే ఇంకా అమ్మ ఎందుకు విసరమన్నదో మాకు అర్థం కాలేదు. గంటసేపు విసిరిన తరువాత ఆయన వెళ్ళిపోయారు. అప్పుడు ఆయన గమనించింది ఏమిటంటే ఎన్నాళ్ళగానో ఆయనకు ఆ చేయి నొప్పిగా వున్నదట. ఆ నొప్పి కాస్తా పోయిందట. అంటే ఆ నొప్పి పోగొట్టడానికి అమ్మ ఆయన చేత ఆ సేవ చేయించుకున్నది. "బ్యాంక్‌లో మన అకౌంటులో ఏ మాత్రమైనా వుంటేనే భగవంతుడు మనకు ఏ వరమైనా ఇచ్చేది అంటూ నువ్వు ఒక మనిషికి ఎప్పుడైనా ఎక్కడైనా తిండి పెడితే, నీకు భగవంతుడు తిండి పెడతాడు" అని అన్నయ్య అన్నాడు.

అదివిని అమ్మ తాను కాపురానికి వచ్చినప్పటి సంగతి ఈ విధంగా చెప్పింది "ఒకసారి నేను రోట్లో కాఫీగింజలు దంచుతున్నాను. అక్కడే ఉన్న ఒక అన్నయ్యతో "అమ్మా నా చేయి బాగుంటే నీకు సాయం చేసేవాడ్ని కదా! అని అన్నాడు. ఆయనకు చిన్నప్పుడే కుడిచేయి సన్నగా, పుల్లలా అయిపోయింది. దానికి

బదులిస్తూ అమ్మ "సరే! నీవూ ఒకచేయి వేయి" అని అనగానే ఆయన ఆ పుల్లలాంటి చేతితోనే రోకలి పట్టుకున్నాడు. ఆ తరువాత నెల రోజులకు ఆయన చేయి, రోజు రోజుకూ కొంచెం, కొంచెం పెరుగుతూ మామూలు సైజుకు వచ్చేసింది. ఇది చెప్తూ అమ్మ "ఆయన చేతికి రక్తప్రసరణ సరిగ్గా జరగక పోవడంతో అలా అయింది. రోకలి పట్టుకున్నప్పుడు ఏనరానికో వత్తిడి కలిగి, తిరిగి రక్త ప్రసరణ బాగా జరిగి చేయి మామూలుగా అయింది" అని అమ్మ వ్యాఖ్యానించింది. కానీ అది అమ్మకు అతనిపై గల కరుణా కటాక్షం ప్రభావమేనని మాత్రం అమ్మ ఒప్పుకోలేదు.

అమ్మ దగ్గరకు ఒకరోజు అందరూ వెళ్ళి కూర్చున్నారు. సరళ అక్కయ్య సత్యనారాయణ గారు ఆపిల్, కమలా పళ్ళు తీసుకెళ్ళారు. ఆ గదిలో ఇంకా చాలా మంది వున్నారు. ఆ పళ్ళన్నీ ఒక పళ్ళెంలో వుంచి రామకృష్ణన్నయ్య అమ్మ చేతికి తాకించి అందరికీ తలా ఒకపండు ఇస్తున్నాడు. సరళ అక్కయ్య వాళ్ళకు అనుమానం వచ్చింది. అందరికీ పళ్ళు సరిపోతాయో లేదో అని. మొదటి వరుసలోనే సత్యనారాయణగారు కూర్చున్నా ఆయనకు పండు ఇవ్వకుండా అందరికీ ఒక్కొక్కటే ఇస్తూ ఆఖరు పండు వారికిచ్చి ఆయన వైపు చూస్తూ అన్నయ్య పళ్ళెం దులిపాడు. అందరికీ సరిపోయాయి. వాళ్ళకు మాత్రం అద్భుతం అనిపించింది ఆ సంఘటన.

చాలా దూరం నుంచీ అమ్మ దర్శనం చేసుకోవటానికి వచ్చినవారు అమ్మ దర్శనానంతరం "మీకు మేము గుర్తుంటామా?" అని అడిగారు. "అసలు మరుపుంటేగా జ్ఞాపకం వుండటానికి" అన్నది. "మీ దగ్గరికి ఎంతోమంది రోజూ దర్శనం కొరకు వస్తుంటారు కదా! ఇంతమందిలో మేము ఎలా గుర్తుంటామమ్మా" అన్నారు. దానికి అమ్మ "గొర్రెల కాపరికి తనమందలో ప్రతి గొర్రె, దాని ఖరీదు దగ్గర్నించి గుర్తుండేటప్పుడు, తల్లికి బిడ్డలు గుర్తుండటంలో ఆశ్చర్యమేముంది"? అన్నది. "నాకు మరుపే లేదు ఏ విషయమైన ఎప్పుడో జరిగినట్లు వుండవు నాన్నా ఇప్పుడే కళ్ళ ఎదురుగా జరుగుతున్నట్లుంటాయి" అని చెప్పింది అమ్మ.

నాదెండ్ల లక్ష్మణరావుగారు, భ్రమరాంబక్కయ్య 1958 సం॥లో గుంటూరులో సాయిబాల విద్యాలయం వారింట్లో అద్దెకుండేవాళ్ళు. అక్కడే సాయిబాబా భక్తురాలు చుండూరు కామేశ్వరమ్మగారు పూజలు చేస్తుండేవారు. ఆమె జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ సాయిబాబాలా తలకు గుడ్డకట్టుకున్న ఫోటోను తెచ్చి అక్కయ్యా వాళ్ళకు ఇచ్చారు. దానిని పూజలో పెట్టుకున్నరు. ఆమె ధ్యానంచేస్తుంటే చేతిలోకి పూలు వచ్చేవి. అందుకని ఆమెను పూలమ్మ అనేవారు. మా అమ్మగారైన దుర్గాంబగారికి సాయిబాబా మంత్రోపదేశం చేసింది ఆమె.

బ్యాంక్ ఆఫ్ బరోడాలో అన్నయ్య ఉద్యోగి, బదిలీ మీద చిలకలూరిపేటకు వెళ్ళారు. అక్కడ వారం వారం వెంకటేశ్వరస్వామి సుప్రభాతం ఒక్కొక్కరి ఇంట్లో అంతా కలిసి చేసుకునేవాళ్ళు. అక్కడ జిల్లెళ్ళమూడి అమ్మను చూడాలని నలుగురు ఆడవాళ్ళు బయలుదేరి వచ్చారు. వారితో పాటు అక్కయ్య వచ్చింది. అప్పుడు అమ్మ కుమారస్వామి ప్రాంగణంలో కూర్చుంది. అమ్మకు పూజ జరుగుతోంది. కొద్దిమంది వున్నారు. "ఇంత చిన్న పిల్లను అమ్మ అంటున్నారేమిటి?" అని అనిపించింది అక్కయ్యకు. మళ్ళీ మధ్య వయస్కురాలి వలె కనిపించింది. అప్పుడు అక్కయ్య "నీదు చరణ పంకజములెగతి" అన్న కీర్తన పాడింది. అమ్మ అక్కయ్య వంక దయార్ద్ర దృక్కులు బరపి "చాలాబాగుంది" అన్నది. భోజనానంతరం అమ్మను దర్శించుకొని తిరిగి వెళ్ళిపోయారు.

అన్నయ్య మరికొందరు స్నేహితులు కలిసి మర్రిపూడిలో రామనామ సప్తాహం జరుగుతుంటే చూడటానికి వెళ్ళారు. అక్కడికి జిల్లెళ్ళమూడి దగ్గరే కనుక కాలినడకన అమ్మను దర్శించాలనుకుని బయలుదేరారు. కొంతదూరం వెళ్ళిన తరువాత అన్నయ్య మధ్యలో ఆగిపోయి మిగిలిన వాళ్ళును వెళ్ళమని తిరిగి వెళ్ళిపోయాడు. మిగిలిన వారు అమ్మను దర్శించుకున్నప్పుడు "నాన్నా! మీరందరూ కలిసి రావాలనుకున్నా మధ్యలో తిరిగి వెళ్ళినవారు ఉన్నారు కదా!" అని అడిగింది. దానితో వారు విస్తుపోయారు. ఎక్కడో దారిమధ్యలో జరిగిన విషయం గురించి అమ్మ అడగటంతో అమ్మ సర్వాంతర్యామి అని వారికి

బోధపడింది. కానీ అదే సం॥ అన్నయ్య అనుకోకుండా అమ్మను దర్శించుకోవటం జరిగింది.

అన్నయ్య రామకృష్ణపరమహంస మొ॥వారి చరిత్రలు ఎక్కువగా చదువుతుండేవారు. అప్పటికి అమ్మయందు ఎటువంటి అభిప్రాయం ఏర్పడలేదు. మళ్ళీ పది సం॥లు అనంతరం **1967** సం॥లో శాయమ్మగారు అమ్మ గురించి ఎక్కువగా చెప్తుండేవారు. ఆమె, అధరావరపు శేషగిరిరావన్నయ్య బంధువులు ప్రతినిత్యం తాను ఏది చేసుకున్నా అమ్మకు నివేదన చేసేది. అమ్మకు స్నానం చేయించటం, అమ్మకు కావలసినవి అమర్చటం చేసేది. శాయమ్మగారు అమ్మ సన్నిధానంలోనే తానూ ఇల్లు కట్టుకుని ఎన్నో సం॥లు జిల్లెళ్ళమూడిలోనే నివసించిన పుణ్యశాలి, తన మనస్సును, తనువును అమ్మకే అంకితం ఒనర్చిన ధన్యజీవి. ఆమె మాతృశ్రీలు తెచ్చి భ్రమరాంభక్కయ్య వాళ్లను చదవమనేది. అన్నయ్య ఎంతో ఆసక్తితో ఆపుస్తకాలను చదివారు. అమ్మ పుణ్యాత్మురాలనే సదాభిప్రాయం కలిగింది.

అన్నయ్యకు తాను చనిపోతానన్న భయం అవహిచింది. రామనామం చేస్తుండేవారు. దానితో పాటు తెలీకుండా ప్రాణాయామం చేసేవారు. చనిపోతానన్న భయంతో ఎందరెందరి దేవతలనో ప్రార్థించారు. భయం తగ్గలేదు. చివరకు అమ్మను ప్రార్థించారు. అంతే "నీకు ఆ భయం గుండెదడ వుండదని అంతర్వాణి" చెప్పింది. అలాగే అన్నయ్యకు భయం తొలగింది. అమ్మను చూడాలనే ఆతృత, ఆర్ధత పెరగింది.

అమ్మను దర్శించుకున్నారు. అప్పటికి కరెంటు దీపాలు లేవు. మట్టిరోడ్లు బురదతో కూడి వుండేవి. అక్కడ తలంటు పోసుకోమన్నారు. కానీ అన్నయ్యకు మొహమాటం ఎక్కువ. పండుగకు ఇంటికి వెళ్ళాని బయలుదేరారు. దారిలో హైమక్క కనిపించి "దీపావళి బాగా జరుగుతుందని, ఆ వేడుక చూసి వెళ్ళమని" అడిగింది. "రేపు సెలవే కదా!" అని కూడా అన్నది. కానీ వీళ్ళు తిరిగి వెళ్ళిపోయారు.

హైమక్కకు సుస్తీ చేస్తే గుంటూరుకు తీసుకు వెళ్ళారనీ, డాక్టర్లు లాభం లేదనటంతో జిల్లెళ్ళమూడి తీసుకు వెళ్ళారనీ విని **5-4-1968** కీలక చైత్ర శుద్ధ అష్టమినాడు హైమ దివంగతురాలైనదనీ విని నిశ్చేష్టులయ్యారు. కొద్దిరోజుల్లో అమ్మ జన్మదినానికి వెళ్ళాలనుకున్నా ఆ విచార వార్త విని, ఇప్పుడు అమ్మ జన్మదినం ఏం జరుపుకుంటుంది అనుకుని వెళ్ళలేదు. కానీ అమ్మకు ఖేద మోదములు రెండూ ఒకటే అని తరువాత తెల్సుకున్నారు. అప్పటి నుంచీ తరుచూ జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించుకునేవారు. రామనామం అమ్మ నామానికి దారి చూపిందని వారి విశ్వాసం.

"మాతృశ్రీ అధ్యయన పరిషత్ గుంటూరు శాఖ ప్రారంభించారు. అందులో అన్నంరాజు మాధవరావు గారు ప్రెసిడెంట్‌గా, రాచర్ల లక్ష్మీనారాయణ, వల్లూరి పాండురంగారావు, పి.యస్.ఆర్. ఆంజనేయులు, కుమారస్వామి, జొన్నాభట్ల వెంకట్రామయ్యగారు, లక్ష్మణరావు గారు, దావులూరి హనుమంతరావుగారు, డి.యస్.పి సత్యనారాయణగారు, దుర్గాంబగారు, రమ, జయ, విజయలక్ష్మి మొ॥వారు ఇంకా అనేకమంది అక్కయ్యలు, అన్నయ్యలతో ఆ శాఖ మూడుపూలు ఆరు కార్యక్రమాలు, ఏకాహాలు, సహస్ర ఘటాభిషేకాలు మహానందంగా జరుపుకునేవారు.

ఒకసారి భ్రమరాంభక్కయ్య వదినగారికి విపరీతంగా రక్తస్రావం జరుగుతోంది. వాళ్ళ అన్నయ్య రామచంద్రరావుగారు డాక్టరుకు చూపించారు. డాక్టరు క్యాన్సర్ అని చెప్పారు. అక్కయ్య ఏడుస్తూ బ్యాంక్‌లో పనిచేస్తున్న అన్నయ్యకు ఫోన్‌చేసి ఆ విషయం అమ్మకు నివేదించమంది. అన్నయ్య అమ్మకు ఫోను చేసారు. అమ్మకు పూజ జరుగుతున్నా ఎక్కడి నుంచి అని అడిగి ఫోను తీసుకుని అమ్మ స్వయంగా మాట్లాడింది. "క్యాన్సర్ అని చెప్పారా?" అని అడిగింది. "అవునన్నారు" అన్నయ్య. "క్యాన్సర్ కాదు నాన్నా! ఆమె మూడవ మాసం గర్భిణీ, గర్భస్రావం అయింది. ఆపరేషన్ చేయించండి నేను దగ్గరే వుంటాను, చూడగలిగితే!" అని అభయం ఇచ్చింది.

గవర్నమెంట్ ఆసుపత్రికి తీసుకువెళ్ళారు. అక్కడి డాక్టర్లు పరీక్ష చేసి

అమ్మ చెప్పిన విధంగానే గర్భస్రావం అయిందని చెప్పి ఆపరేషన్ చేసారు. మర్నాడు అన్నయ్య వాళ్ళు జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ పాదాలకు ప్రణమిల్లారు. అక్కడి వాళ్ళతో అమ్మ చెప్పిన విషయం చెప్పారు. "రక్తం ఎక్కించారా! సరిపోయిందా" అని అమ్మ అడిగింది. "అమ్మా నాకేమీ తెలయదంటావు. మరి ఇవన్నీ ఎట్లా అనుగ్రహించావని" అడిగారు. అమ్మ మనకు చిక్కుతుందా? దొరుకుతుందా? "అది కాదు నాన్నా! ఈ వూళ్ళో ఒక అమ్మాయికి ఇట్లాగే రక్తం పోయి గర్భస్రావం జరిగింది. అందుకని అదేమోనని చెప్పానన్నది" అమ్మ. అక్కయ్య వాళ్ళ వదినకు ప్రాణధాత్రి అయింది అమ్మ. అమ్మయొక్క వాత్సల్యానికి ప్రతీకలే ఇటువంటి సంఘటనలు.

మొదట్లో అక్కయ్యని అంతా హైమక్కలా గుండ్రటి ముఖం, ఆ ఎత్తు అంతా అలాగే వుందని అనుకునేవారు. గుంటూరులో దంపతులిద్దరూ అమ్మ పూజలు, అమ్మనామం ఎంతో మధురంగా చేసేవారు. అమ్మ గురించి తనకు తెలిసిన వారందరికీ ఎంతో వినసొంపుగా అక్కయ్య చెప్పేది. విన్నవారు పరవశించేవారు. అన్నయ్య మితభాషి. తన పని తాను చేసుకుపోయే తత్వం కలవాడు.

జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అమ్మతో అక్కయ్య "హైమను ఒక్కమాటే చేసానమ్మా! హైమతో ఎక్కువ పరిచయం లేదు, నాకు మళ్ళీ చూడాలని ఎంతో తపనగా వుంది" అన్నది. అమ్మ విని వూరుకుంది. ఒకరోజు ఉదయం పూజ చేసుకుని ఇవతలకు వచ్చింది. స్ఫురద్రూపి, ఒకమారు చూస్తే మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేటటువంటి వర్చస్సుతో ఒక కుర్రవాడు అన్నం పెట్టమని అడిగాడు. దానికి అక్కయ్య లోపలికి వెళ్ళి కొంచెం అన్నం తెచ్చి ఈ కొంచెం ఏమితింటావు మరో ఇంటికి వెళ్ళి అడుక్కోమంది. మరో ఇంటికి వెళ్ళేవాడిని కాను "నేను చాలా అభిమానవంతుడ్ని ఇంక నేను ఎవరింటికి వెళ్ళను" అన్నాడు.

చేసేదేమీ లేక అతడ్ని కూర్చోమని అప్పటికప్పుడు వంట చేసి పెట్టింది. అతనికి విస్తరివేసి అన్నం పెట్టి, రవ్వలడ్లు వుంటే అవీ వేసింది. ఆ తరువాత జిల్లెళ్ళమూడి వెళ్ళింది. అమ్మ అక్కయ్యతో "హైమ మీ ఇంట్లో ఎప్పుడైనా భోజనం

చేసిందా?" అని అడిగింది. దానికి అక్కయ్య "హైమతో నాకు పరిచయమే లేదు. ఒక్కమారే కదా! నేను చూసింది" అని అన్నది. "నువ్వంటే చాలా ఇష్టమని, మీ ఇంట్లో భోజనం చేసానని, నువ్వు రవ్వలడ్డు పెట్టావని హైమ చెప్పింది" అని అమ్మ తెలియచేసింది. హైమ మా ఇంటికి ఎప్పుడూ రాలేదమ్మా! రాకుండా భోజనం ఎలా పెడ్తాను" అన్నది అక్కయ్య.

గుంటూరు వెళ్ళిన తరువాత తాను స్ఫురద్రూపి అయిన కుర్రవాడికి భోజనం పెట్టిన సంగతి గుర్తుకు వచ్చింది. హైమను చూడాలన్న తన కోరికను అమ్మ మన్నించి హైమను తన ఇంటికి పంపిన విషయం గుర్తుకు చేసేకుని పరమానందభరితురాలైంది అక్కయ్య. పరమ కారుణ్యామూర్తి, మృదు హృదయాంతర్గత లలిత భావలహరి అయిన హైమలోని ఒక్క వాత్సల్యరసామృత బిందువు చిందినా మనందరం ధన్యులమవుతాము.

అక్కయ్య అందరితో స్నేహంగా వుంటుంది. నాన్నగారికి మూత్రకోశవ్యాధి వచ్చినప్పుడు గుంటూరులో జె.వి. కృష్ణారావుగారి ఆసుపత్రిలో చేర్పించారు. వల్లూరి లక్ష్మీనరసమ్మక్కయ్యను వంటకు పంపించింది అమ్మ. నాన్నగారిని చూడటానికి వచ్చిన వారంతా వీరింట్లోనే భోజనం చేసేవారు. బియ్యం, పప్పు,నెయ్యి అమ్మ పంపించింది. ఆ మూడు ఎప్పటికి ఖర్చు కాకుండా అక్షయమయ్యాయి. మిగిలిన సరుకులన్నీ ఎప్పటికప్పుడు తెచ్చుకోవాల్సి వచ్చేది. లక్ష్మణరావుగారిని కన్న కొడుకులా నాన్నగారు చూచుకునేవారు. అక్కయ్యకు తాను కాక, హైమే తనలో ప్రవేశించి నాన్నగారికి సేవ చేస్తోందనిపించేది. నాన్నగారి ఒక్కరికీ వంట భ్రమరాంభక్కయ్య చేసి పెట్టింది.

ఆసుపత్రిలో నాన్నగారిని చూడటానికి అమ్మ గుంటూరు వెళ్ళినపుడు అక్కయ్య వాళ్ళింట్లో, ఆసుపత్రిలో కూడా అమ్మ గుమ్మడికాయలు పగలకొట్టింది. "సుబ్బారావన్నయ్య, రవి అన్నయ్య కన్న కొడుకులం మాకంటే మీరే ఎక్కువగా చూసుకున్నారని లక్ష్మణరావుగారితో అన్నారు. ఆసుపత్రిలో నాన్నగారు ఉన్నప్పుడు అమ్మకు ఉత్తరం రాసారు. అమ్మ లక్ష్మణరావుగారికి ఆ ఉత్తరం మీద పువ్వు

పెట్టి ఇచ్చి దానికి ఫ్రేమ్ కట్టించమని చెప్పింది. అమ్మ మనవరాలు హైమ 5వ నెల పిల్లగా వున్నప్పుడు డోకులు, విరోచనాలు అవుతుంటే గుంటూరుకు ఫోను చేయించింది అమ్మ. టాక్సీ తీసుకువచ్చారు. మెడ వేలాడేసే పిల్లను భ్రమరాంభక్కయ్య చేతిలో పెడుతూ మెల్లగా "నీపిల్లే అని" అమ్మ చెప్పింది. అక్కయ్యకు పిల్లలు లేకపోయినా అందర్నీ తన పిల్లలుగా చూచుకునే మనస్తత్వాన్ని ఇచ్చింది అమ్మ. అమ్మ మనవరాలు హైమ మెదటి సం॥ పుట్టిన రోజు వేడుక అక్కయ్య చేతుల మీదగానే జరిపింది.

నాన్నగారు గుంటూరులో చీరకొని భ్రమరాంభక్కయ్యకు పెట్టారు. అది అందరికీ చాలా ఆశ్చర్యమనిపించింది. ఎప్పుడూ అమ్మ పెట్టటమే కానీ నాన్నగారు ఎప్పుడూ ఎవ్వరికీ పెట్టలేదు. అమ్మ నెల్లూరులో వున్నప్పుడు లక్ష్మణరావుగారు, భ్రమరాంబక్కయ్య అమ్మను చూచి వస్తుంటే శ్రీ నాన్నగారు కూడా వీళ్ళతో తిరిగి వచ్చారు. లక్ష్మణరావుగారు పనివుందనుకుంటుంటే "నాతో పాటు మా అమ్మాయిని జిల్లెళ్ళమూడికి తీసుకు వెళ్తానన్నారు" నాన్నగారు.

అక్కయ్య వాళ్ళకు వైజాగ్ ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కయ్య "అమ్మా! నిన్ను వదిలి అంతదూరం వెళ్ళాలంటే చాలా బాధగా వుంది" అని అన్నది. దానికి అమ్మ "మనుష్యులు దూరం అయితే మనస్సులు దగ్గర అవుతాయని, విశాఖపట్నంలో కుసుమ వుంది. దాన్ని నీతోబుట్టువులా చూచుకుంటూ కష్టసుఖాలలో కలిసిమెలసి వుండమని" అమ్మ దీవించింది. ఆ రోజు నుంచి ఈ రోజువరకు అలాగే వుంటున్నాము. కష్టానికీ, సుఖానికీ అమ్మ ఒక్కటిగా వుండమన్నట్లే ఆ దంపతులు ఆ సమయంలో ధనరూపేణా, వస్తు రూపేణా, సలహా రూపేణా అనేక సహాయాలు చేసారు. అది మేము ఎప్పటికీ మరువలేము.

నాదెండ్లలో వుండగా అక్కడ వారందరూ అక్కయ్యను అమ్మ అని, అన్నయ్యను నాన్నగారని పిలిచేవారు. పిల్లలు లేని మాకు అందరిచేత అమ్మ, నాన్నా అని పిలిపించుకో గలగటం అమ్మ దయే అని అక్కయ్య విశ్వాసం.

అక్కయ్య "మా బావగారి అమ్మాయి పెళ్ళి, బాబు ఒడుగు చేయాలని

అమ్మతో" అన్నది. మీరు పెళ్ళి చేస్తుంటే చూడాలని నాకు వుంది. ఇక్కడే చేయండి "అన్నది అమ్మ" పెళ్ళి ఎలా చేయాలో అడుగుదామని జిల్లెళ్ళమూడికి బయలుదేరారు. దోవంతా వర్షం బురద, దారి తెన్నూ తెలియకుండా వుంది. టార్చిలైట్ వెలుగు మధ్య మధ్య కనిపిస్తుంటే ఆ వెలుగు వెంబడి వచ్చారు. తొందరగా రావటంతో దడవచ్చి పడిపోయింది. అక్కయ్య కాస్త సర్దుకున్న తరువాత పైకి వెళ్ళి అమ్మతో వెలుగు విషయం చెప్పింది. ఇలా వెలుగు పడుతోందని చెప్పిన వాళ్ళల్లో నీవు రెండోదానివి. రాఘవరావు మామయ్య మొదటివాడని అమ్మ చెప్పింది.

శుభలేఖ రాస్తున్న రామకృష్ణ అన్నయ్యతో "కరణీకం ఎలా చేస్తావో కాని ఇందులో తేడా వచ్చిందో భ్రమరాంబ నీ దుంప తెంచుతుందని" అమ్మ చెప్పింది. అక్కయ్య పిల్లలు లేరని దిగులు పడుతుంటే "ఏది కావాలని నీవు ఏడుస్తున్నావో, నీవు కావాలని నేను అనుకుంటున్నాను, చచ్చిపోతానని నీవు గొడవ చేయకు వాడ్ని ఇబ్బంది పెట్టకు, నన్ను బాధ పెట్టకు" అని చెప్పింది అమ్మ.

భ్రమరాంబక్కయ్య ఖమ్మంలో హోటల్లో పడుకొని వుండగా అక్కయ్యకు కలలో "అమ్మ సాయంత్రం దర్శనమిచ్చే మంచం మీద నుంచీ వచ్చినట్లుగా కనిపించింది. ఏమిటమ్మా! ఇక్కడకు వచ్చావని అమ్మను ఎత్తుకుని మామూలు స్థానంలో కూర్చోబెట్టింది. మళ్ళీ తన పక్కకు వచ్చినట్లు కనిపించింది. మళ్ళీ ఎత్తుకుని కూర్చోబెట్టింది. ఇంతలో మెలకువ రావటంతో ఈవిధంగా కలవచ్చిందేమిటని విశ్లేషించుకుంది. "నేను బొమ్మను కాను అమ్మను" అన్నట్లుగా తోచింది.

మర్నాడు కలలో "ధ్యానాలయంలో వుండే బొమ్మలు ఉన్నాయి. బల్లి గోడకు అతుక్కుని వుంది అనుకుంటుండగానే, ఆ బల్లి అక్కయ్య ఒళ్ళో పడింది. కొద్దిసేపు ఉండి మళ్ళీ గోడకు అతుక్కుంది. నేను నీ వొళ్ళో పడినట్లు ఎవరికీ చెప్పకు అని కలలో అన్నది "అమ్మ. అక్కయ్య పిల్లలు లేరని దిగులు పడ్తుంటే "నేనే నీ పిల్లనని చేప్పేది". అందుకే ఆ బల్లి రూపంలో తన వొళ్ళో పడ్డదేమోనని

అనుకుంది అక్కయ్య. భ్రమరాంబక్కయ్య, లక్షణరావుగారు బిడ్డనే నేను అని అమ్మ చెప్పేది. వారి బిడ్డని అక్కడ ప్రతిష్ఠచేశారు. "నీకూతురు ఏం చేస్తోందని" అక్కయ్యతో రాచర్ల లక్ష్మీనారాయణ అన్నయ్య కూతురు భగవతి, కృష్ణవేణక్కయ్య హాస్యం ఆడుతుంటారు.

అన్నయ్యకు ప్రమోషన్ వస్తే ఆంధ్రా వదలి వెళ్ళాలని ఇష్టపడలేదు. కానీ ఇంటర్వ్యూకి రమ్మని లెటర్ వచ్చింది. ఎట్టి తాపత్రయం లేక ఒకమారు వెళ్దామని నిర్ణయించుకున్నారు. మద్రాసు వెళ్ళాటానికి రైలు ఎక్కిన తరువాత టికెట్టుకోసం చూసుకుంటే కనిపించలేదు. కంగారుపడి మళ్ళీ డబ్బులిచ్చి వేరే టికెట్టు రాయించుకున్నారు. ఎవరో ఇద్దరు వ్యక్తులు పరుగుపరుగున వచ్చి అన్నయ్యకు టికెట్టు ఇచ్చారు. వేరే టికెట్టు రాయించుకున్నాని చెప్పారు. రైలు బయలుదేరబోతుండగా ఆ టికెట్టును అమ్మేసి డబ్బు వాపసు తెచ్చి ఇచ్చారు. ఇంతకీ వారెవరో అన్నయ్యకు తెలియదు. తనకోసం అంత శ్రమకోర్చి ఆపని ఎందుకు చేసారో! అంతకంటే అర్ధం కాలేదు. ఆ రోజుల్లో జీతాలు తక్కువగానే ఉండేవి. మద్రాసులో అన్నయ్య డబ్బుకు ఇబ్బంది పడకుండా వుండటం కోసం అమ్మే వారి రూపంలో వచ్చి సాయం చేసింది. అమ్మ కరుణకు ఏకొలత సరిపోతుంది?

మద్రాసుకు వెళ్ళాక హోటల్లో రూమ్ దొరకలేదు. ఎలాగ, ఏం చేయటమా అని ఆలోచిస్తున్నారు. ఇంతలో ఒకరు రూమ్ ఖాళీచేసి వెళ్ళటంతో అన్నయ్య ఇబ్బంది నుండి బయటపడ్డారు. అన్యమనస్కంగానే ఇంటర్వ్యూకి వెళ్ళారు. ఆ ఇంటర్వ్యూలో సెలక్టు అవటంతో లక్నోలో పోస్టింగ్ ఇచ్చారు. కొత్తచోటు, భాషరాదు. అంతా అమ్మ మీదే భారం వేసి వెళ్ళారు.

"జిల్లెళ్ళమూడి నుంచి అమ్మ భక్తులు వచ్చారని" అమ్మ కలలో కనిపించి పార్ధసారధిగారి భార్య వేదవతిగారికి చెప్పింది. ఆవిడ తెలుగువాళ్ళు కొత్తగా వచ్చారని వెతుక్కుంటూ వచ్చింది. వేదవతిగారి సహాయంతో అక్కయ్య అమ్మ జన్మదిన వేడుకను ఎంతో ఘనంగా జరిపించింది. ఆ వేడుకకు తెలుగువారే

కాక అన్ని ప్రాంతాలవారూ, అన్ని భాషలవారూ వచ్చి అమ్మ ప్రసాదాన్ని స్వీకరించారు.

పార్థసారధిగారికి బెరైలీ బదిలీ అయింది. వారింట్లో మళ్ళీ సం॥ అమ్మ జన్మదిన వేడుకలు చేసారు. మంత్రపుష్పంలో 1,116 రూపాయలు వచ్చాయి. అమ్మ మఠం వేసుకున్న విగ్రహాన్ని చేయించాలని ఆ 1,116 రూపాయలతో నాంది పలికింది. అన్నయ్య 10వేలరూపాయిలు, చక్రవర్తిగారు 2వేలురూపాయిలు ఇచ్చారు. విజయవాడలో అప్పారావన్నయ్యకు ఈవిషయం తెలిసి 5 వేలరూపాయిలు ఇచ్చారు. విగ్రహం తయారైన తరువాత తీసుకురావటానికి 2 వేలు పెట్టి ఇన్‌ష్యూర్ చేయించాలన్నారు. 2 వేలరూపాయలు దండగా ఎందుకు. ఆ విగ్రహాన్ని అమ్మే చూసుకుంటుందని అమ్మ మీద భారం వేసి తెచ్చారు. అమ్మ దర్శనం ఇచ్చే గదిలో దాన్ని కప్పి వుంచారు.

ఫిబ్రవరి 17న ధాన్యాభిషేకంకు వెళ్ళినప్పుడు చక్రవర్తిగారు అదిచూసి బాధపడ్డారు. అమెరికన్ సోదరుడు వెష్టర్లాండ్ ఇచ్చిన డబ్బుతో ధ్యానాలయం కట్టించారు. ఫ్లోరింగ్‌కు డబ్బు చాలనందున ఇంకా చేయించలేదని చెప్పారు. ఫ్లోరింగ్‌కు అవసరమైన డబ్బు విశాఖ సోదరులు పంపించారు. ఫ్లోరింగ్ అయిన తరువాత ప్రతిరోజూ సాయంత్రం అమ్మ ఎక్కడైతే దర్శనం ఇచ్చేదో అక్కడే ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠ చేసారు. అమ్మ మంచం మీద కూర్చుని దర్శనం ఇచ్చేది కదా! మంచంలాగా పాలరాతితోనే చేయించారు.

అన్నయ్య షష్టిపూర్తికి శుభలేఖలు దగ్గర్నించి తయారయిన తరువాత అక్కయ్యకు రాత్రి 3 గం.ల వేళ నిద్రలోనే హార్ట్‌ఎటాక్ వచ్చింది. అప్పటికి వాళ్ళు హైద్రాబాద్‌లో వుండేవారు. శుభలేఖలు అందరికీ పంపించమంది. శుభలేఖలకు బదులు కర్మకాండలు జరుపబడునని ఉత్తరాలు వేస్తే నీకేమాట వస్తుంది. ఇప్పటికి ఈ వేడుక ఆపుదామని అన్నయ్య చెప్పారు. అలాంటి భయం మీకేమీ అవసరంలేదు. ఎంజియోగ్రామ్ తీస్తుంటే ఆ స్క్రీన్ మీద అమ్మ కనిపించి, ఆశీర్వదించిందని" చెప్పింది అక్కయ్య.

ఆసుపత్రిలో డాక్టరుగారితో మాది జిల్లెళ్ళమూడి. ఆ అమ్మ మా దేవత. ఇలవేల్పు. నాకు జబ్బేమీ లేదని చెప్పండి. 12వ తారీఖున అక్కడ ఫంక్షన్ చేసుకోవాలని డాక్టర్లని ఒకటే ఊదరకొట్టింది. మా అమ్మ వుండగా మాకేమీ కొదవలేదని చెప్పింది. దానికి "డాక్టర్ల రిపోర్టు చూసి చెప్తామన్నారు. అందులో ఏమీ తేడా రాలేదు. "ఆవిడకు జబ్బు ఏమీ లేదని చెప్పారు. రైలులో ప్రయాణం చేయవచ్చా?" అని అన్నయ్య డాక్టర్లను అడిగారు. ఆవిడ వరల్డ్‌టూర్ కూడా చేయవచ్చని చెప్పారు.

లక్ష్మీనారాయణ అన్నయ్య వాళ్ళు హైమాలయంలో జ్వాలా తోరణం కట్టించారు. అక్కడ పనిచేసే మేస్త్రీలకు, కూలీలకు వంటచేసి పెట్టాటానికి మనిషి కోసం చూస్తే ఎవ్వరూ దొరకలేదు. వారందరికీ భ్రమరాంబక్కయ్య వాళ్ళింట్లో భోజనాలు ఏర్పాటు చేయించింది అమ్మ. అంత నీర్సంగా వుండే అక్కయ్య వాళ్ళంతా భోజనాలకు వచ్చినప్పుడు ఎంతో సంతోషంతో ఎక్కడ లేని బలం, ఉత్సాహం తెచ్చుకొని వారికి వడ్డించేది. అలా మూడు మాట్లు జరిగాయి. భోజనాలు ఆపకుండా జిల్లెళ్ళమూడిలో వున్న పెద్దవారికి ఆదరణాలయం లాగా వంటలు చేయించాలని అక్కయ్య ఆలోచన.దానికి అమ్మే తోడూ,నీడగా ఉండి ఆదరణాలయంను మొదలు పెట్టాలని అది సర్వతోముఖాభివృద్ధిగాంచాలని కోరిక.

లక్ష్మణరావుగారిని "ఉద్యోగం మానేసి జిల్లెళ్ళమూడిలో నివాస మేర్పరుచుకోమని" అమ్మ చెప్పింది. దానికి భ్రమరాంబక్కయ్య వాళ్ళు కుటుంబంలో బాగా వృద్ధిలోకి వచ్చింది అన్నయ్య ఒక్కరే. ఆ కుటుంబంలో 6గురు ఆడపిల్లలు వున్నారు. వాళ్ళ బాధ్యతలు తీర్చిన తరువాత తప్పక నీవు చెప్పినట్లే వస్తామని" చెప్పింది. ఉద్యోగ విరమణాంతరం జిల్లెమూడిలో స్థిరనివాసం ఏర్పరుచుకున్న ధన్యజీవులు. వారి దగ్గర ఆ సమయంలో డబ్బు లేకపోయినా జిల్లెళ్ళమూడిలో ఇల్లు కొనిపించింది అమ్మ. ఆ దంపతులిద్దరూ అమ్మకు అనుంగ బిడ్డలు. ఆ పవిత్ర స్థలంలో వుండగలగటమే అదృష్టం. అట్టి అదృష్టానికి నోచుకున్నారు ఆ దంపతులు. అమ్మ సంచరించిన ప్రదేశంలో ఆనందంగా

సేద తీర్చుకుంటూ, జిజ్ఞాసతో కూడిన మానసిక సమన్వయంతో, నమ్మకమే నడవడిగా, బ్రతుకే జీవితంగా వెలుగొందుతున్నారు. వారి విధానమే మనకు మార్గదర్శకంగా మారి, ఆ కారుణ్య సింధువు నీడే మన జీవన విధానమై భాసిల్లాలి.

రాచర్ల అనంతరామయ్యగారి చెల్లెలు లలితాంబగారు. పూజలు, జపాలతో నిష్ఠాగరిష్టమైన జీవితాన్ని గడుపుతోంది. ఒక సాధువు ఆమెతో "అమ్మా నీకు భక్తి బాగా ఉంది. నేను ఎన్నో క్షేత్రాలు చూశాను. ఎందరినో దర్శించాను. కానీ జిల్లెళ్ళమూడి లాంటి క్షేత్రంకానీ, అమ్మ లాంటి దైవం కానీ మరెక్కడా చూడలేదు. నువ్వు తప్పక దర్శించమని, జిల్లెళ్ళమూడికి త్రోవ చెప్పి కొంతదూరం వెళ్ళి అదృశ్యమయినారు. ఈ సంఘటనతో అమ్మను చూడాలనే కాంక్ష ఆమెలో బాగా పెరిగిది.

నర్సారావుపేటలో వాళ్ళన్నగారికి, బంధువులకు జరిగిన విషయం తెలియజేసి జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించింది. మొదటి దర్శనంలోనే అమ్మ సాక్షాత్తు రాజరాజేశ్వరీ అన్న నమ్మకం ఏర్పడింది. అమ్మ సమక్షంలో కూర్చున్నప్పుడు ఆమెతో అమ్మ "నీకు ఎవరైనా సాధువు వచ్చి ఇక్కడి విషయం చెప్పాడా?" అని అడిగాంది. అంతకు ముందు అనుభవం గుర్తుకు వచ్చి ఆమె "అవునమ్మా నీవే నన్ను నీ దగ్గరకు రప్పించుకున్నావు కదామ్మా" అని ఎనలేని ఆనందాన్ని పొందింది.

ఒకవారం రోజుల తరువాత తిరిగి అమ్మ చెంతకు వచ్చి వెక్కి వెక్కి ఏడుస్తుంటే "పిల్లలు భర్త పోయినందు ఏడుస్తున్నావా? అని అడిగింది అమ్మ. "అందుకు కాదమ్మా ఏదో తెలియని ఆనందం కలిగి ఆనందభాష్పాలు వచ్చాయి" అన్నది. ముక్కోటి ద్వారదర్శనంనకు ఆలస్యమయిపోతుందని లలితాంబగారు బాధ పడింది. ఆమెతో పాటూ వాళ్ళ అన్నగారి కోడలు రాచర్ల కమల, ఆమె మరిది శ్రీరామమూర్తి వచ్చారు. కమలక్కయ్య "నువ్వే కనకదేవుడైతే ద్వారాదర్శనం కాదు కదా అక్కడ పందిరే వెయ్యకూడదు. నువ్వు స్నానం చెయ్యకూడదు" అని మనసులో అనుకుంది. ఏడవమైలు రాయి దగ్గరు బస్సుదిగేటప్పటికి పందిరికి

కావలసిన కర్రలు, జిల్లెళ్ళమూడి తీసుకువెళ్ళటానికి సిద్ధంగా ఉన్నారు. అంతా జిల్లెళ్ళమూడి చేరారు. అప్పుడే అమ్మ స్నానానికి వెళ్ళింది చెప్పారు. తాను అనుకున్నట్లు జరగడంతో కమలక్కయ్య విస్తుపోయింది.

అమ్మ వచ్చి ఉత్తరం వైపు ద్వారం వద్ద నిలబడింది. కమలక్కయ్య "ఈమెను చూస్తుంటే ఏమి ప్రత్యేకత కనపడుట లేదే" అనుకుంటుండగానే రెప్పపాటులో దూరంగా ఉన్న వేదిక దగ్గర అమ్మ కనిపించింది. అక్కయ్యకు ఆశ్చర్యం వేసింది. ఈ క్షణకాలంలో అమ్మ అక్కడకు ఎలా వెళ్ళిందని పూజ చూస్తు కూర్చుంది. వీళ్ళను రెండురోజులు అమ్మ ఉండమంది. అమ్మ "ఇవి పుట్టింటి పసుపు కుంకుమలు తీసుకో అంటూ జాకెట్టుగుడ్డ, పసుపు, కుంకుమ కమలక్కయ్యకు ఇచ్చింది. ఆరోజు శనివారం, ఏకాదశి, లలితాంబగారు వాళ్ళు భోజనం చెయ్యరు. వాళ్ళ అవసరం కనిపెట్టి ఎవరో తెచ్చిన అరటిపళ్ళు అమ్మ వారికి ఇచ్చింది. వెంకటేశ్వరస్వామి దగ్గరకు వెళ్తే కోరికలు తీరతాయి. ఈమె దగ్గరకు వెళ్తే ఏమి తీరతాయి అని ఒకరు అనుకున్నారు. అదే సమయంలో అమ్మ "వెంకటేశ్వరస్వామి దగ్గరకు వెళ్తే కోరికలు తీరుతాయి. నాదగ్గరకు వస్తే ఏమి తీరుతాయి" అన్నది. అప్పటి కప్పుడే వాళ్ళ మనసులో అనుకున్న మాట అమ్మ చెప్పింది.

ద్వాదశిపూజ గుంటూరు నుంచీ వచ్చిన రామకోటి చేసుకోవాలి. పూలు రావటం ఆలస్యమైంది. ఏమిటిరా ఎప్పుడు పూజ? ఉపవాసం ఉన్న వాళ్ళందరికీ నీరసం వస్తుంది అన్నది అమ్మ. దానికి రామకోటిగారు నీదే ఆలస్యమమ్మా నాదేమి లేదు అన్నారు. అమ్మ "నాది ఆలస్యం అంటావా? అదేం కాదు. పూలకు వెళ్ళినవాడు పడ్డాడు. పూలు రావటం ఆలస్యమయింది అన్నది. రాత్రి పన్నెండు గంటలకు పూజ జరిగింది. అప్పుడు అమ్మ నుండి దేదీప్యమానమైన కాంతి రావటం దర్శించి పులకించి పోయింది కమలక్కయ్య.

నాలుగు వందల మంది బారులు తీర్చి కూర్చున్నారు. అమ్మ, నాన్నగారు, కనకమ్మగారు వడ్డన చేశారు. అమ్మ అన్ని పదార్థాలు కలిపి అందరికీ తలా ఒక

ముద్ద ఇచ్చింది. కొంత వడ్డన అయ్యాక వంటశాల నుండీ వచ్చిన వ్యక్తి పదార్థాలు నిండుకున్నాయన్న విషయం అమ్మకు చెప్పాడు. అంతకు ముందు తాను పదార్థాలు కలిపిన పళ్ళెంలో కొద్దిగా అన్నము ఉంది. ఆ పళ్ళెంను వంటశాలలోనికి తీసుకు వెళ్ళితానే స్వయంగా ఆ పళ్ళెంలో తిరిగి వచ్చింది. మిగిలిన వడ్డన చేస్తుండగా ఊరి జనం అంతా తండోపతండాలుగా ప్రసాదం కోసం వచ్చారు. అదే పళ్ళెంలోని అన్నం వారందరికీ పెట్టినా ఇంకా మిగిలింది. ఈ దృశ్యం చూసి అక్కయ్యకు అక్షయమైన అన్నపు పళ్లెం పట్టుకున్న అమ్మ సాక్షాత్తు అన్నపూర్ణాదేవిలా భాసించింది.

అమ్మ వడ్డన చేస్తున్నంతసేపు అమ్మ కొంగు పట్టుకొని తిరుగుతున్న స్పృహలేని లలితాంబగారికి అమ్మ సోడా పట్టింది. దానితో ఆమె పెద్ద కేకవేసి అవ్యక్తమైన ఆనందానుభూతిని పొందింది. అమ్మ ఫోటోలు తీసుకొని వారు తిరిగి వెళ్ళారు.

కమలక్కయ్య ఆ ఫోటోను గోడకు తగిలించింది. ఆ ఫోటో చూస్తూంటే లక్ష్మీనారాయణ అన్నయ్యకు అందులో వాళ్ళ అమ్మ కనిపించింది. ఈ ఆనందానుభూతిలో వారికి ఆనంద భాష్పాలు వచ్చాయి. గుంటూరు వెళ్ళిన అక్కయ్యకు అనుక్షణం అమ్మ గురించే ఆలోచన. అమ్మను దర్శించాలని అన్నయ్య తను కలిసి వచ్చారు. అమ్మను దర్శించుకొని "నేను గుర్తున్నానా అమ్మా?" అనిఅడిగింది. ఎందుకు గుర్తులేవు ఏబిడ్డకాబిడ్డే అంటూ "జాకెట్టు కుట్టించుకున్నావా?" అని అమ్మ అడిగింది. లక్ష్మీనారాయణ అన్నయ్య మొదటిసారి రావటంతో దూరంగా కూర్చున్నాడు. అమ్మే అన్నయ్య దగ్గరకు వెళ్ళి "ఎందుకు నాన్నా దూరంగా కూర్చున్నావు మీ అమ్మనే కదా!" అని తల నిమిరింది. కమలక్కయ్య మంత్రం అంటే ఏమిటి? మంత్రం వల్ల లాభమేమిటి? దాని వల్ల మనస్సు ఏవిధంగా నిలబడుతుంది? అని మనసులో అనుకుంది. ఈ లోగా మరోవ్యక్తి ఇవే ప్రశ్నలను వేశాడు. దానికి అమ్మ "కొన్ని అక్షరాలు కలిపితే మంత్రం అవుతుంది. దాన్ని విశ్వాసంతో పదే పదే మననం చేస్తే మనస్సు నిలుస్తుందని" సమాధానం ఇచ్చింది.

ఒకరోజు అక్కయ్య ఇంట్లో పని చేసుకుంటుండగా అదే పనిగా తనలో నుండి ఇంట్లో పాము ఉంది. మంచం మీద కూర్చో అని అనపించడం మొదలు పెట్టింది. తనకు పాము కనిపించక పోయినా మంచం మీద కూర్చుంది. ఆ రోజు జిడ్డు ప్రసాద్, నందిపాడు వీరాస్వామిని భోజనానికి రమ్మంది. అన్నయ్య ఆఫీసుకు వెళ్ళి ఇంటికి బొగ్గులు పట్టుకెళ్ళమని నౌకరుతో చెప్పాడు. అతను బొగ్గులు తెచ్చి, బొగ్గులు పొయ్యటానికి పెట్టె తీశాడు. ఆ పెట్టె క్రింద ఒక మూల గోధుమవర్ణం, నలుపు కలిగిన పెద్ద త్రాచుపాము చుట్ట చుట్టుకుని ఉంది. అమ్మగారు ఇక్కడ పాము ఉంది అని అరిచాడు. కమలక్కయ్య అమ్మే ఆ రూపంలో వచ్చిందేమోనని దానిని చంపవద్దని చెప్పబోతుండగానే దానిని చంపేసారు. అది చనిపోయినందుకు అక్కయ్య చాలా బాధపడింది. ఆ విషయం తెలిసిన జిడ్డు ప్రసాద్‌గారు, నాన్నగారు వచ్చారటగా అన్నారు. నాన్నగారి పేరు నాగేశ్వరరావుగారు.

వాళ్ళు జిల్లెళ్ళమూడి వెళ్ళి గుంటూరులో జరిగిన సంగతి చెప్పారు. అక్కయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళినపుడు అమ్మ అక్కయ్యతో "చంపవద్దన్నావుటగా" అని అడిగింది. అక్కయ్య అవునంది. అది దుష్టజంతువు కదా! చంపితే పరవాలేదు అంటూ అక్కయ్య బాధను దూరం చేసింది.

ఒకరోజు రాత్రి 1.30 గం.లకు కమలా, కమలా అని అమ్మ గొంతు వినపడింది. బయటకు వచ్చి చూస్తే ఎవరూ లేరు. ఆ సంగతి భర్తకు చెప్పింది. కొంతకాలమైన తరువాత పెద్ద కూతురు భగవతి కడుపుతో ఉండగా "పిల్లల్ని ఇచ్చి నన్ను దూరం చేద్దామని చూస్తోంది. ఏమైనా సరే అమ్మకు ఏమీ తీసుకెళ్ళకూడదు. అమ్మతో పోట్లాడలని" కట్టుబట్టలతో బయలుదేరింది.

బాపట్ల బస్టాండులో సపోటా, అరటి, జామపళ్ళు, పూలుకొని అమ్మకు ఇచ్చి నన్ను దూరం చేయ్యాలని చూస్తున్నావా అంటూ పోట్లాడే ధోరణిలో అడిగింది. దానికి అమ్మ తెచ్చిన పళ్ళన్నీ ముక్కలు చేసి బంతిలో వడ్డించమని నాలుగు రోజులు అక్కయ్యను ఉండమంది. అక్కయ్య బట్టలు వాళ్ళ అమ్మ, తమ్ముడు

తీసుకువచ్చి అమ్మకు ఇచ్చారు. అమ్మతో పోట్లాడుదామని వచ్చి నాలుగు రోజులుండటం ఆశ్చర్యమనిపించింది. కమలక్కయ్య దిట్టకుర్తి సుబ్బారావు అన్నయ్య వస్తే అన్నయ్యకు కబురు చెయ్యాలనుకుంది. వెంటనే ఆయన రావటం, ఆయన ద్వారా అన్నయ్యకు కబురు పెట్టింది అక్కయ్య. కానీ రాత్రి అవ్వటంతో సుబ్బారావుగారు మర్నాడు ఉదయం చెప్పవచ్చని లక్ష్మీనారాయణ అన్నయ్యకు చెప్పలేదు. రాత్రి 1 గం.కు గుంటూరులో "ఒరే రేపు రారా" అని అమ్మ గొంతు వినిపించింది. వెంటనే అర్ధరాత్రి సైకిల్ మీద బయలుదేరారు. జనవరి నెల అవటంతో మంచులో తడిసి ముద్దై అమ్మ నామం చేసుకుంటూ నందిపాడు చేరి అక్కడ నుంచీ ఫస్ట్‌బస్సుకు బయలుదేరి జిల్లెళ్ళమూడి చేరారు. అన్నయ్య రాకముందే "వాడు వచ్చాడే" అని అమ్మ చెప్పింది.

అన్నయ్య ఒక రోజు రాత్రి అన్నం తిందామని పెరుగు చూస్తే పెరుగు పిల్లి దొర్లించటంతో అన్నం తినకుండా పడుకున్నాడు. రాత్రి పదిన్నర గంటలకు పెరుగు పెరుగు అంటూ ఒకామె పెరుగు అమ్ముతుంటే అది పోయించుకుని భోజనం చేసి పడుకున్నాడు. అమ్మ దగ్గరకు వెళ్ళినపుడు పెరుగులేకపోతే ఏదో ఒకటి వేసుకుని తినొచ్చు కదా! అంత మాత్రం చేత పడుకోవాలా అన్నది. అన్నయ్య నవ్వుతూ పెరుగు పోసి వెళ్ళింది అమ్మేనని జరిగింది చెప్పాడు.

అడవుల దీవి సుశీలక్కయ్య పటికబెల్లం వస్త్రకాళితం చేసి జిల్లెళ్ళమూడి పంపింది. అక్కయ్య కొడుకు మధు, అమ్మ కూతురు హైమ ఆ పొడితో పూజ చేసుకుంటున్నారు. "నేను కూడా చేసుకుంటే బాగుండని" కమలక్కయ్య అనుకుంది. అమ్మ అక్కయ్య వంక చూస్తూ "అనుకున్నావుగా, చేసుకున్నట్లే" అన్నది. అక్కయ్యా వాళ్ళు పాత గుంటూరులో ఉండగా ఒకరోజు వేణుగోపాలస్వామి రథం వారింటి ముందు నుంచి వెళ్తోంది. అక్కయ్య భర్తతో "రెండు కొబ్బరికాయలున్నాయి కదా! ఒకటి స్వామికి కొడతాను" అన్నది. దానికి అన్నయ్య "ఆకాయలు అమ్మకు తెచ్చాను, అమ్మకి కొట్టాలి" అన్నాడు. అన్ని రూపాలు, అందరి దేవుళ్ళూ అమ్మ బిడ్డలేగా? కొడితే ఏమి? అని ప్రశ్నించింది. ఈ సంఘటన జరిగాక అక్కయ్యా వాళ్ళు జిల్లెళ్ళమూడికి వెళ్ళినపుడు అమ్మ

రథం వెళ్తోంది. భార్యభర్తలు ఇలా అనుకున్నారంటూ వారి మధ్య జరిగిన సంఘటన వివరించింది. భగవతిని కడుపుతో ఉన్నపుడు "నారదుడు ప్రహ్లాదునికి ఉపదేశం చేసినట్లు అమ్మ ఉపదేశిస్తే బాగుంటుందని అనుకుంది. అంతలో అమ్మ అక్కడకు వచ్చి తన రెండు పాదాలూ అక్కయ్య పొట్టమీద రెండు నిముషాలు ఉంచి ఉపదేశం అయింది" అన్నది. ఒకసారి అమ్మ చేతికి పాయసం ఇస్తే కొద్దిగా పుచ్చుకొని ఆగ్లాసు చేతిలో పట్టుకొని నాన్నా తీసుకోరా! మూడురోజుల నుండి ఏమీ తినలేదుగా. ఇంకొంచెం ఇంకొంచెం తీసుకోమంది అమ్మ. గ్లాసుకు మూడు వంతులున్న పాయసం సగానికి తగ్గింది. అమ్మ ఆ వ్యక్తి పేరు, ఎక్కడ ఉన్నాడో చెప్పకుండా "వాడు నన్నే నమ్ముకున్నాడు అందుకే వాడికిచ్చాను" అని చెప్పింది.

ముక్కోటి ద్వారదర్శనం ఇచ్చే ముందు అక్కయ్యకు "అమ్మ స్త్రీ కదా! విష్ణువుగా రావటమేమిటి అన్న అనుమానం వచ్చింది. అమ్మ వేదిక మీదకు వచ్చాక అమ్మ ముఖం శ్రీరామునివలె పురుష రూపంతో అక్కయ్యకు దర్శనమిచ్చింది". దీనితో అక్కయ్య అనుమానం తీరింది. అనసూయలోను, రామునిలోను ఉన్న శక్తి ఒకటే. అనసూయంటే ఆడకాదు, రాముడు అంటే మొగకాదు అని అమ్మ తెలియజేసింది.

కొండమ్మ అనే ఆమె అమ్మను దర్శించుకోవటానికి పూర్వం నుంచి అమ్మ చెంతకు వచ్చేది. అమ్మ మహా సమాధి పొందిన తరువాత కొండమ్మ తన చివరి రోజుల్లో జిల్లెళ్ళమూడికి వచ్చింది. అక్కయ్య గుంటూరులో వాళ్ళబ్బాయి యం.బి.ఏ. సీటు గురించి ఆలోచిస్తూ అమ్మ ఉంటే అమ్మతో చెప్పకునేదాన్ని ఇప్పుడా తృప్తి లేదుకదా అనుకుంది. అక్కయ్య చీర తీసుకుని అమ్మకు తాకించి కొండమ్మకు ఇద్దామని అనుకుంది. డాబామీద నుండి కిందకు చూస్తే రూపాయంతబొట్టు పెట్టుకుని కాశీదారం, పూసలదండ ధరించి చాలా ఆకర్షణీయంగా ఉన్న ఒకామె నుంచుంది. అక్కయ్య, భగవతి ఒక కొబ్బరిచిప్ప, ఒకరూపాయ ఆమెకు ఇవ్వటానికి కిందకు వెళ్ళారు. ఆమె అక్కయ్యతో నీకొడుకుల్లో ఒకడు వ్యాపారం చేస్తున్నాడు. రెండోవాడు చదువుకుంటున్నాడు. మీరు గుడి, గుడిశిఖరం కట్టించారు. ఇంకా కొన్ని కట్టిస్తారు. రథం చేయిస్తారు" అని చెప్పింది.

అక్కయ్య తన కొడుకు సంగతి చెప్పుకోవడానికి అమ్మలేదు అనుకుంది. ఆమె తన కొడుకుల సంగతి, చేసిన దైవకార్యాల సంగతి చెప్పింది. అక్కయ్య అమ్మకు నివేదించిన ప్రసాదం ఆమెకు ఇచ్చింది. "ఆహా నా ప్రసాదం" అంటూ ఎగరవేస్తూ తీసుకుంది. ఆమె చీర ఏదైనా ఒకటి ఇమ్మని అడిగింది. "వాళ్ళ పక్కింటావిడ ఇలాంటి వాళ్ళను నమ్మకూడదు ఏవో కబుర్లు చెప్పి, వాళ్ళ పబ్బం గడుపుకుంటారు" అన్నది. దానికి ఆమె "అందరూ అటువంటి వారు ఉంటారా? మంచివారు కూడా ఉంటారు" అని వాళ్ళతో అంటూనే "ఆ చీర తీసుకొనిరా, నాకు పెట్టిందేగా ఆ కొండమ్మను నేనే అనుకో ఆ చీర నాకు ఇవ్వు" అన్నది. ఎప్పుడైతే ఆమె ఈ మాటలన్నదో వెంటనే ఆ చీరను అక్కయ్య ఆమెకిచ్చింది. "ఇది కాశీలో కట్టుకుంటాను" అంటూ గేటు తీసుకొని వెళ్ళింది. వెంటనే బయటకు వెళ్ళి వెతికితే ఎవరూ కనిపించలేదు. వీళ్ళు ఆ చీరెను జిల్లెళ్ళమూడి తీసుకు వెళ్ళినా కొండమ్మకు ఇవ్వగలిగేవారు కాదు. అప్పటికే కొండమ్మను తనలో ఐక్యం చేసుకుంది అమ్మ. మర్నాడే ఆమె చనిపోయిందన్న కబురు విన్నారు.

అమ్మ అశ్రుకాసారంలో సముద్భవమైన సరోజం 1979 నాటికి సంపూర్ణంగా ప్రఫుల్లమయింది. అమ్మకు అత్యంత ప్రేమపాత్రుడైన శ్రీరాచర్ల లక్ష్మీనారాయణ పుష్కరకాలంలో హైమాలయంలో కఠిన నియమబద్ధమైన మండల దీక్షలు ఎన్నో నిర్వహించి లలితాకోటినామ పారాయణ పూర్తిచేశాడు. 1979 నవంబరు 10వ తేదీన హైమ 37వ జన్మదినోత్సవం సందర్భంగా లలితాకోటి నామపారాయణ 9వ తేదీన హైమాలయంలో మహారుద్రాభిషేకం జరిగింది. 121 మంది ఋత్విక్కులు పాల్గొన్నారు. ఆ అభిషేకానికి సోదరురుడు శ్రీ వల్లూరి పాండురంగారావు దేశంలోని పుష్కర నదుల నుండీ కన్యకుమారి వద్ద గల సాగరసంగమం నుండి పవిత్ర జాలాలను తీసుకువచ్చారు.

10వ తేదీనాటి కోటి నామ పారాయణలో 660మంది పాల్గొన్నారు. 9గంటలకు ప్రారంభమై సాయంకాలం7 గంటలకు ముగిసింది. ఆనాడు జరిగిన ఆ బృహత్తర కార్యక్రమం చరిత్రాత్మకమయింది. అది హైమాలయ చరిత్రలో సువర్ణ అక్షరాలతో లిఖించదగిన సముజ్వలాధ్యాయము.

కోటి నామపారాయణ ప్రారంభసమయంలో ముముక్షజన పీఠాధిపతులు పూజ్యులు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులవారు "ఆ వేద వేద్యుడే రాముడు. ఆ రాముడే లలిత. ఆ లలితయే మన అమ్మ. అమ్మ మరో రూపమే హైమ. అందరికీ హైమక్క అనడమే అలవాటు. అక్క రూపంలో వున్న అమ్మ హైమ'' అని తన విశ్వాసాన్ని ప్రకటించారు.

**పితామహోస్య జగతోమాతాధాతాపితామహః!**

నేనే తల్లిని, నేనే తండ్రిని అన్నాడు పరమాత్మ. పితృస్వరూపం, మాతృ స్వరూపం రెండూ ఆయనే ధరిస్తుంటాడు. ఏది ఎప్పుడు అవసరమవుతుందో ఏది ఎప్పుడు ముచ్చట అవుతుందో ఆయనకే తెలియాలి. ఆయన మాతృస్వరూపంగా లలితామూర్తిగా ఉంటాడు. పితృ స్వరూపంగా పరమేశ్వర స్వరూపంతో ఉంటాడు. ఆ లలితామూర్తియే మన అమ్మ.

అమ్మ లలితామూర్తిగా వుండి మనం మట్టి ముద్దలుగా ఉండటం ఆమెకు ఇష్టం లేదు. మనల్ని లలితా మూర్తులుగా మార్చడానికే ఈ కోటినామపారాయణ మనచేత చేయిస్తున్నదని శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణయతీంద్రులు ఉద్ఘాటించారు.

శ్రీమతి రావూరి శేష ప్రభావతి, కొమరువోలు గోపాలరావు, సరోజినక్కయ్యల అమ్మాయి శారీరకంగా చాలా బలహీనంగా వుండేది. ఆ సమయంలో అమ్మ అమ్మాయిని హైమాలయంలో అర్చనకు నియమించింది. 1977లో ఆ బాధ్యతను స్వీకరించి మహన్యాసం, త్రికరణశుద్ధితో రుద్రనమక చమకాలు, శ్రీసూక్తం, పురుషసూక్తం, మంత్రపుష్పం అన్నీతాను చేయటమేకాక వచ్చిన వారందరి చేత చాలా శ్రద్ధగా పూజలు చేయించేది.

కొన్ని సం॥లుగా ఆమెను పీడిస్తున్న దీర్ఘవ్యాధి అయిన తలనొప్పి ఏమందూ లేకుండానే నయమయింది. అది కేవలం హైమ అనుగ్రహమే అని శేషు అంటుంది. ఆ పూజల ఫలితంగా ఆమెకు శ్రీరావూరి ప్రసాద్‌తో అమ్మే తనచేతుల మీదగా వివాహం జరిపించి ఆశీర్వదించింది. ఆమె రెండో కుమారుడు సరిగా హైమవతీ జయంతినాడు కోటినామపారాయణ సమయంలో జన్మించాడు.

భవ చక్రవర్తిని అయిన అమ్మ "ఆచరించ గలవారికి అన్ని ఆశ్రమాలు గొప్పవేనని, ఆధ్యాత్మిక సాధనకు సంసారం ఏ మాత్రం ఆటంకం కాదు" అని స్పష్టపరిచింది. ఒకమారు సంభాషణ సమయంలో అమ్మ ఏదో ఆలోచిస్తున్నట్లుగా వుంటే "అమ్మా పరధ్యానంగావున్నట్లున్నావే అని రామకృష్ణ అన్నయ్య అడిగాడు. దానికి అమ్మ పరధ్యాసకాదు నాన్నా పతిధ్యాస" అన్నది. ఒక సందర్భంలో నాన్నగారిని తన గొడుగుగా అభివర్ణించింది. అదేమిటమ్మా సర్వానికీ ఆధారం నీవేకదా! అన్నాడు. తనకు నీడనిచ్చేదైన ఆ గొడుగును తానే పట్టుకోవాలిగా అని నవ్వింది అమ్మ. మరొకమాటు "నాన్నగారి కాలిగోటిలోని మట్టియే తనకు సర్వసంపదలూ, సకల భాగ్యాలు అంటూ మురిసిపోయి మనలను ఆశ్చర్యచకితులను చేసింది. భర్త సంసారం, బంధుజనం వారి సౌఖ్యం, వారి సౌకర్యాలు, వారి ఆనందమే ధ్యేయంగా, లక్ష్యంగా అమ్మ భావించినట్లు అమ్మ జీవిత చరిత్ర పరిశీలిస్తే మనకు అవగతమవుతుంది.

గబ్బిట లలితాంబగారి మేనళ్ళుల్లు రాచర్ల శ్రీరామమూర్తి, వారి కుటుంబమంతా అమ్మ యందు అచంచల విశ్వాసం కలిగిన వారు. శ్రీరామమూర్తి ఉద్యోగం కొరకు బొంబాయిలో ఉన్న పెద్దన్నగారైన మూర్తి గారింటికి వెళ్ళాడు. అమ్మ ఫోటో, కుంకుమ వారికిచ్చాడు. అమ్మ ఫోటో చూడగానే మహాలక్ష్మిలా భాసించింది. ఆ ఫోటోను పూజా మందిరంలో ఉంచి, నిష్ఠగా అమ్మను అర్చించటం మొదలు పెట్టారు. అమ్మ మీద ధ్యాసే ధ్యానంగా మారింది.

అమ్మను భౌతికంగా దర్శించాలన్న కోరికతో కుటుంబంతో సహా జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అక్కడ అమ్మ చూపిన ఆదరణ కన్నతల్లిని కూడా మరిపించింది. అన్నపూర్ణాలయంలో భోజనం, అమ్మ ఆదరణ మరువలేనివిగా వారి మనసు నందు ముద్రవేసాయి.

పూరిపాక ముందు అమ్మ పడుకుని ఉంది. అన్నయ్య వారి శ్రీమతి అమ్మ వద్దకు వెళ్ళి ఈ రోజు వెళ్తామని చెప్పారు. అది మే నెల, దానికి అమ్మ "రేపు మధ్యాహ్నం భోంచేసి, చల్లబడ్డ తరువాత వెళ్ళమన్నది". అన్నయ్యను

కుడి పాదము, అక్కయ్యను ఎడమ పాదము పిసకమని అనుజ్ఞ ఇచ్చింది. వారు ఆ పాదాలను నొక్కుతూ ఆనందాబ్ధిలో మునిగిపోయారు. తరువాత విసరమని చెప్పింది. అట్టి అవకాశం అమ్మ కలుగజేస్తేనే తప్ప మనం కావాలనుకున్నా పొందలేము. అన్నయ్యకు అమ్మ ముఖంలో వెంకటేశ్వర స్వామిలా నామాలు, విష్ణుమూర్తి శేషతల్పం మీద పడుకున్నట్లుగా దృశ్యమానమయింది." దొరకునా ఇటువంటి సేవ అని అమ్మతో అన్నారు. అమ్మ నవ్వింది. ఎన్ని సం॥లు గడిచినా ఆ ఘట్టం ఒక మధురానుభూతిగా వారి మనసులో నిలిచిపోయింది.

"నాన్నా ముంబాయిలో ఇద్దరు పిల్లలతో ఉంటున్నావు. జీతం మీ నలుగురికీ పరిపోతుందా?" అని అడిగింది అమ్మ. నీవు ఉన్నావు కదమ్మా! అన్నాడు అన్నయ్య. మర్నాడు సాయంత్రం బయలుదేరుతున్నామని చెప్పటానికి అమ్మ దగ్గరికి వుళ్ళారు. అక్కడ ఉన్నవారి ప్రశ్నలకు అమ్మ జవాబిస్తోంది. మూర్తిగారి మేనత్త లలితాంబగారు అక్కడే కూర్చుంది. అమ్మ వీరి నొసటన బొట్టు పెట్టి, ప్రసాదం ఇచ్చింది. అది పుచ్చుకుని అన్నయ్య ఉవ్వెత్తున ఎగసిన కెరటంలా అమ్మను పట్టుకుని బావురుమని చిన్న పిల్లవాడిలా ఏడ్చాడు. అంతసేపూ అన్నయ్య వీపురాస్తూ, సముదాయిస్తూ అమ్మ బుజ్జగించింది.

బయటకు వచ్చిన తరువాత ఎందుకురా అంత ఏడ్చావు అని వాళ్ళ అత్తయ్య అడిగింది. ఎందుకు ఏడ్చానో నాకే అర్థం కావట్లేదని అన్నయ్య చెప్పాడు. ఆ సంఘటన గుర్తుకు వచ్చినప్పుడల్లా ఆలోచనలోనికి వెళ్ళిపోతుంటాడు. అన్నయ్యను చూచి వాడికేమీ బాధల్లేవు. ఆ బాధలన్నీ దానివే అన్నది అమ్మ. వారి మేనత్త, తండ్రి, బామ్మగారు అమ్మ సేవలో మునిగి తరించారు.

ముంబాయి నుంచి 2,3 సం॥ల కొకమారు అమ్మ దర్శనానికి వెళ్ళేవారు. అన్నయ్య టాటాటెక్స్ టైల్స్‌లో పనిచేసేవాడు. ఆఫీసుకు వెళ్ళే హడావిడితో బయలుదేరుతున్న రైలు ఎక్కాడు. తీరా చూస్తే అది ఫస్టుక్లాసు. అన్నయ్య దగ్గర ఉన్నది సెకండ్ క్లాస్ పాస్. టి.సి. వచ్చి అడిగితే చిన్నతనం, తెలిసిన వాళ్ళు చూస్తే పరువు పోతుంది. ఏమి చేయాలో పాలుపోక అమ్మ నామం

చేయసాగాడు. ఆ కంపార్టుమెంటులో 50,60 మంది దాకా ఉన్నారు. అందరి టిక్కెట్లు చెక్ చేశారు. కానీ అన్నయ్యను అడగలేదు. ఈలోగా అన్నయ్య గమ్యస్థానం రావటం అన్నయ్య దిగిపోవటం జరిగింది. ఆఫీసుకి వెళ్ళి అమ్మ ఫోటో చూసి ఆనందాశ్రువులు రాల్చాడు.

ఇటువంటి సంఘటనే ఈ మధ్య మాకూ జరిగింది. విజయవాడలో పినాకినీలో బయలుదేరి బాపట్లకు వెళ్దామని ప్రయాణమయ్యాను. కూలీ ఎవ్వరూ దొరకలేదు. జనరల్ కంపార్ట్‌మెంట్ చాలా దూరంలో ఉండటంతో అంత దూరం సూట్‌కేస్ మోసుకెళ్ళలేక రిజర్వ్‌డ్ కంపార్ట్‌మెంట్‌లో నేను, మా ఆడపడుచు అమ్మని తలుచుకుంటూ ఎక్కేసాము. టి.సి.వచ్చి అడిగితే పరువుపోతుంది అని భయం. ఆ కంపార్ట్‌మెంట్ మొత్తం రిజర్వేషన్ చేయించుకున్నవాళ్ళే. ఈ నంబర్ మాది అని కూర్చునవాళ్ళందరినీ రిజర్వేషన్ చేయించుకున్న వాళ్ళు లేపుతున్నారు. మా ముందు సీటు వరకు అలాగే జరిగింది. అమ్మ మీదే భారం వేసి కూర్చున్నాము. రైలు బయలుదేరింది. తెనాలిలో ఎవరన్నా వచ్చి లేవమంటారేమోనని సంకోచంగా ఉంది. అక్కడ ఎవ్వరూ ఎక్కలేదు. బాపట్లలో మేము దిగేవరకూ ఎవ్వరూ రాకపోవడం నా దృష్టిలో అమ్మదయే. మూర్తి అన్నయ్య "అమ్మ పై ఉన్న అచంచల విశ్వాసమే భక్తుల ఆపదలను కాపాడటానికి కారణమౌతుంది" అంటారు.

మూర్తి అన్నయ్యకు అకస్మాత్తుగా పక్షవాతం వచ్చింది. 12 రోజులు ఆస్పత్రిలో ఉన్నారు. ఈ సంగతి గుంటూరులో ఉన్న ఆయన తమ్ముడు లక్ష్మీనారాయణ అన్నయ్యకు తెలిసింది. లక్ష్మీనారాయణ అన్నయ్య వెంటనే అమ్మ దగ్గరకు వెళ్ళి మూర్తి అన్నయ్యకు పక్షవాతం వచ్చి ఆస్పత్రిలో ఉన్నాడని చెప్పి ముంబాయి వెళ్ళిచేసి వస్తానన్నాడు. అమ్మ పరవాలేదురా నువ్వు వెళ్ళేసరికి వాడు తిరుగుతుంటాడురా అన్నది. అమ్మ ప్రసాదం, కుంకుమ పట్టుకుని ముంబాయి వెళ్ళాడు. అప్పటికే మూర్తి అన్నయ్య ఇంట్లో తిరుగుతున్నాడు. నీవు వెళ్ళేసరికి వాడు లేచి తిరుగుతాడని అమ్మ చెప్పిందని లక్ష్మీనారాయణ అన్నయ్య చెప్పాడు. భక్తుల పాలిట కల్పతరువు, అమ్మ తలచుకుంటే మనకు కొదవేమిటి? అన్నాడు మూర్తి అన్నయ్య.

అమ్మ అనసూయేశ్వరాలయంలో సుప్రతిష్ఠ అయినా పూర్వంలానే అమ్మ సంస్థకు యథాశక్తి ప్రతినెలా డబ్బు పంపేవారు. ఏకారణంచేతనైనా 15వ తారీఖులోగా పంపకపోతే అమ్మ స్వప్నంలో కనిపించి డబ్బు ఇంకా పంపలేదా నాన్నా! అని అడిగేది. ఈ విధంగా అమ్మ అనేకమార్లు కలలో దర్శనమిచ్చేది! అమ్మ. "నన్ను పరీక్షిస్తోంది" అని అనుకునేవాడు. అమ్మా పనివత్తిడి వల్ల పంపలేదు ని వెంటనే డబ్బు పంపించేవాడు.

వాళ్ళమ్మాయి ఆపరేషన్‌కని చెన్నై వెళ్ళారు. అక్కడ అన్నయ్య మనవలతో తమిళ సినిమాకు బయలుదేరారు. కారువాళ్ళ పెద్దమనవుడు డ్రైవ్ చేస్తున్నాడు. అన్నయ్య మనవడితో "నీకు డ్రైవింగ్‌లైసెన్స్ ఉందా, నీకు బాగా నడపడం వచ్చా?" ని అడిగాడు. డ్రైవర్‌రానప్పుడు నేనే నడుపుతాను. మీరేమీ మాట్లాడకండి ఆ న్నాడు. అన్నయ్య అమ్మ ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. మౌంట్‌రోడ్‌లో రెడ్‌సిగ్నల్ రా. టంతో కారుఆపాడు. గ్రీన్‌సిగ్నల్ రాగానే కారు కదులుతుండగా వెనకనుంచి ఒక రీ వచ్చి కారుకు గుద్దుకుంది. ఆ లారీ ముందు భాగం కారు వెనక భాగం లోని. దూరింది. వెనక సీట్లో మూర్తన్నయ్య, వాళ్ళ మనుమరాలు, ముందు సీట్లో ద్దమనవడు, చిన్నమనవడు కూర్చున్నారు. అన్నయ్యకు ఏం జరిగిందో తెలీక ంతా అయోమయమయింది. మనవలు తాతయ్యా కారు యాక్సిడెంట్ అయింద దిగమని చేతులు పట్టుకులాగారు. పోలీసులు చుట్టముట్టారు. ఎంతో పెద్ద ప్రమా ం జరిగి ఉంటుందనుకున్నారు. అటువంటిది ఏ ఒక్కరికీ దెబ్బతగలక పోవడంతో శ్చర్యపోయారు. అమ్మ కరుణామృత వర్షిణి కదా! అట్టి కరుణా వృష్టిలో తడిసిన వారికి ఏమీ జరక్కపోవడంలో ఆశ్చర్యమేముంది?.

అమ్మ అవ రాల గురించి తెలిసినా అపోహలు తొలగిపోవటానికై అమ్మ చరిత్రను చదవటం, ఏదైనా ప్రత్యక్షంగా చూస్తేనే నమ్ముతాం అనే వారికి ఇటువంటివి కనువిప్పు లిగిస్తాయని అన్నయ్య విశ్వాసం. "నమ్మిన నిన్నె నమ్మవలెనమ్మ, నమ్మకపోయి న వేరే దైవమున్నాదా" అని అన్నయ్యకు మనసులో మెదిలింది. అనంతమైన అం లేని మాతృశ్రీ అవతార వైభవంలో చోటు

చేసుకున్న మధుర ఘట్టాలను "అమ్మ సచ్చరిత్రలో" క్లుప్తంగానైనా రూపొందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. "సంఘటనల కూర్చే జీవితం" అన్న అమ్మ వాక్యాలకి విశిష్టత చేకూర్చేవి ఇటువంటి సంఘటనలే.

రాచర్ల శ్రీరామమూర్తి 1959లో ముక్కోటికి వాళ్ళ మేనత్త వదిన కమలక్కయ్యలతో పాటూ అమ్మను దర్శించుకున్నాడు. వారి మేనత్త "వీడికి సరిగా చదువబ్బలేదు." వీడిని గురించే దిగులు" అని అమ్మతో చెప్పింది. దానికి అమ్మ "ఇంత లావు అమ్మని నేను ఉండగా నీకు దిగులెందుకు" అని శ్రీరామమూర్తిని దగ్గరకు తీసుకుంది. ఒకమారు అమ్మకు పాలాభిషేకం జరుగుతుంది. "అభిషేకం శివునికి కదా జరిగేది ఈ వ్యక్తికి చేస్తున్నారేమిటి?" అనుకున్నాడు. మరుక్షణంలో అమ్మ లింగాకారంగా అన్నయ్యకు దర్శనమిచ్చింది. ఆనాటి నుంచి సర్వ దేవదేవీ స్వరూపం అమ్మేనని స్ఫురించి అమ్మయందు పరిపూర్ణ విశ్వాసం ఏర్పడింది.

శ్రీరామమూర్తి అన్నయ్య జిల్లెళ్ళమూడిలో హైమక్క ఎక్కడకు వెళ్ళినా తోడుగా ఉండటంతో స్నేహ బంధం ఏర్పడింది. 1968లో హైమక్కకు ఆరోగ్యం సరిలేనందున శ్రీరామమూర్తి భార్య లలితతో "నీకు హైమ అంటే ఇష్టం కదా దానిని చూసుకో" అని చెప్పింది. ఆ తరువాత కొద్ది రోజులకే 1968 ఏప్రియల్ 5వ తేదీన హైమక్క చనిపోయింది. 6వ తేదీ భూగృహంలో హైమక్క భౌతికదేహాన్ని అమ్మ ప్రతిష్టించింది. "ఇది తపో భూమి అవుతుందని, దానికి శంఖువుగా హైమని ప్రతిష్టించానని, హైమ అమరం" అని అమ్మ చాటి చెప్పింది.

హైమాలయం ఏర్పడిన తరువాత భద్రాద్రి తాతయ్య అభిషేకం చేసేవారు. తిరుమలక్కయ్య, లలిత హైమను కొలుచుకునేవారు. లలితతో అమ్మ 40 రోజులు హైమాలయంలో ప్రదక్షిణాలు చేసుకోమంది. హైమాలయం కట్టక ముందు హైమక్క సమాధి చుట్టూ బద్దలతో కట్టి - పైన పాక వేశారు. ఆ సమయంలో లలితకు హైమక్క సమాధిపై బాలా త్రిపుర సుందరిగా హైమక్క దర్శనమిచ్చింది. లలితకు పిల్లలు లేనందున అనేక మంది డాక్టర్లకు చూపించారు.

అందరూ ఆమెకు పిల్లలు పుట్టరనే చెప్పారు. నర్సారావుపేటలో డాక్టరు కమల అమ్మకు అనుంగు బిడ్డ. ఆమె కూడా లలితకు పిల్లలు పుట్టరనే చెప్పింది. అమ్మ డాక్టర్ కమలతో "ఏమిటి దీనికి పిల్లలు పుట్టరని చెప్పావా" అని అడిగింది. దానికి " డా॥ కమల ఏకోశాన పిల్లలు పుట్టే అవకాశం లేదంది". దానికి అమ్మ "ఆ దానికేం తెలుసు, అదేమన్నా కడుపులో దూరి చూసిందా ఏమిటి? ఎట్లా పిల్లలు పుట్టరో చూద్దాం" అని అన్నది. ఆ తరువాత లలితను హైమాలయంలో ప్రదక్షిణాలు చేసుకోమని సూచించింది. "నీవు ప్రదక్షిణాలు చేసేటప్పుడు చేతిలో కర్జూరపు కాయలు పెట్టుకుని ప్రదక్షిణాలు చెయ్యమంది. 40వ రోజు ప్రదక్షిణాలు చేస్తుండగా ఐదు కర్జూరాలు కనిపించలేదు. హైమక్కకు నమస్కరిస్తుంటే ఐదు అరటి పళ్ళు లలిత చేతిలో పెట్టి హైమక్క అదృశ్యమయింది. దానిలో ఒక పండు కింద పడింది. హైమ ప్రసాదమైన ఆ నాలుగు పళ్ళను లలిత తినేసింది.

ఆతరువాత లలిత గర్భవతి కాగా డాక్టర్లు మగ పిల్లవాడని చెప్పినా, అమ్మ "కాదు ఆడపిల్లే పుడుతుంది" అని చెప్పింది. లలితకు తొలి కాన్పులో ఆడపిల్లే పుట్టింది. ఆ పిల్లకు అమ్మ హైమ అని నామకరణం చేసింది. ఆ తరువాత నలుగురు మగ పిల్లలు పుట్టారు. మధ్యలో ఒక పిల్లవాడు పోవటం జరిగింది. హైమక్క ఐదు పళ్ళు ఇవ్వటం, అందులో ఒక పండు కింద పడిపోవటం గుర్తుకు వచ్చింది.

అమ్మ సిద్ధిపొందిన అనంతరం వీరింటి పక్క వాటా అద్దెకిచ్చారు. పక్కవాటాలో ఆమె అర్ధరాత్రి ఎవరో పలిచినట్లై తలుపు తీసుకుని బయటకు వచ్చింది. లలిత కనిపించింది. ఏమిటి పిన్ని అర్ధరాత్రి సందులోనుంచి వస్తున్నావు అని అడిగింది. సరేలే, లే లే అంటూ లలితలా ఉన్న ఆమె వీరి వాటాలోకి వెళ్ళి అదృశ్యమయింది. మర్నాడు లలితనడిగితే "నేను బయటకు రావటమేమిటమ్మా" అయినా నేను ఆ సందులోకి ఎందుకు వెళ్తాను" అన్నది. మర్నాడు పెద్దబొట్టు పెట్టుకుని, తెల్లచీర కట్టుకుని అర్ధరాత్రి ఆమెకు మళ్ళీ అదే విధంగా కనిపించిది. ఇంట్లో ఏమైనా పిశాచాలున్నాయేమోనని మామగారైన నరసింహారావు గారితో

చెప్పింది. "వారింట్లో జిల్లెళ్ళమూడి అమ్మ పూజ చేస్తారు కదా! అమ్మే నీకు ఆ విధంగా కనపడి ఉంటుంది. నీవు అదృష్యవంతురాలివి. దయ్యాలు, గియ్యాలు ఏమీ లేవు అని చెప్పారు.

లలిత మనవడికి ఒంట్లో బాగా లేదని ఒంగోలుకు ప్రయిణమైంది. అదే సమయంలో పెద్ద బొట్టు పెట్టుకున్న ఒక ముత్తైదువ పసుపుకుంకుమ ఇస్తావా అని అడిగింది. లలిత పసుపు కుంకుమ ఇచ్చింది. నీకు నలుగురు సంతానం అనీ కుటుంబానికి సంబంధించిన విషయాలన్నీ చెప్పి సాయిబాబా గుడి కట్టిస్తున్నాము 21 రూపాయిలు చందాగా ఇమ్మంది. ఈసారి రా ఇస్తాను అని లలిత చెప్పింది. ఈమారు ఇట్లా వస్తానా ఏమిటి? అప్పుడు వచ్చే తీరులో వచ్చి చీర, పసుపు, కుంకుమ తీసుకుంటానని చెప్పి వెళ్ళిపోయింది.

మనవడికి కులాసా చిక్కాక శివాలయంలో అభిషేకాలు చేయించి అమ్మవారి పూజ చేయించి ముత్తైదువలకు పసుపు, కుంకుమ, చీర పెట్టుకుంది. ఆ వచ్చిన వారంతా వెళ్ళిపోయారు. పక్కనే ఉన్న బియ్యపు పళ్ళెంలో అమ్మ పాదపు గుర్తు కనిపించింది. వారం రోజుల క్రితం చెప్పిన ఆమె మాట గుర్తుకు వచ్చింది. ఈ రోజు నాసంపాదన ఎంత వస్తే అంతా హుండీలో వేస్తాననుకున్నాడు శ్రీరామమూర్తి. 20 రూ॥ వచ్చింది. వాళ్ళబ్బాయి ఒక రూపాయి కలిపి 21 రూ॥లు హుండీలో వేశారు. అమ్మ "జయహోమాతా" నామంలో 21 అక్షరాలున్నాయి. ఆమె అడిగింది 21 రూపాయలు. ఆ 21 రూపాయలు హుండీలో వేయటం జరిగింది.

అధరావరపు శేషగిరిరావు అన్నయ్య కూతురు కమలక్కయ్య శేషగిరిరావు అన్నయ్యభార్య రాంబాయమ్మ అమ్మ దగ్గర కూర్చుని ఉండగా అమ్మలో నుండి మేళతాళాలు వినపడ్డాయి. ఇదేమిటమ్మా ఇలా వినపడతున్నాయి అంటే "అన్నీ నాలోనే ఉన్నాయి కదా! అందుకని అవన్నీ నాలో నుండే వినపడుతున్నాయి' అని అమ్మ చెప్పింది. "సర్వం ఆత్మలోనిదేనని" వేదాంతం చెప్తుంది. దానికి ప్రతిరూపం అమ్మ అని ఆమెకు అనుభవం ద్వారా తెలియజేసింది అమ్మ.

కమలక్కయ్య పెద్దకొడుకు ఫణికి 12వ సం॥లో రాయవెల్లూరులో ఆపరేషన్ జరిగింది. కమలక్కయ్య మేనల్లుడు కంచికి వెళ్ళొచ్చానని అక్కయ్యకు చెప్పాడు. అక్కయ్య నాకు చెబితే నేను కూడా వచ్చేదాన్ని కదా అని అతనితో అన్నది. తను వెళ్ళలేకపోయినందుకు విచారించింది. ఆ రాత్రి కలలో " తాను కంచికి వెళ్ళి అమ్మవారి దర్శనానికి వెళ్తే గర్భగుడిలో జిల్లెళ్ళమూడి అమ్మదర్శనం అయింది. ఆ తరువాత జిల్లెళ్ళమూడి వెళ్ళింది. "ఏమ్మా కంచికి వెళ్ళావా? అక్కడ ఎవరు కనిపించారు" అని అమ్మ అడిగింది. దానికి అక్కయ్య తెలీదుకదమ్మా! అక్కడ కూడా నువ్వే ఉన్నావు! ఇంకెక్కడికీ వెళ్ళనులే" అని అమ్మతో చెప్పింది.

కమలక్కయ్య ఎడమభుజం విపరీతంగా నొప్పి పుడుతుంది. అక్కయ్య, ఆమె, భర్త, బాబు ముగ్గురూ కలిసి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అక్కయ్యతో అమ్మ "భుజం అంతా జాలుగా ఉందమ్మా" అన్నది. దానికి అక్కయ్య "నీక్కూడా ఇదేమిటమ్మా! నేను కరెంటు పెట్టించుకోవటానికి వెళ్దామనుకుంటున్నాను" అన్నది. వెంటనే అక్కయ్యకు భుజం మీద షాక్ కొట్టి జివ్వున లాగినట్లు అనుభూతి కలిగింది. దానితో అక్కయ్యకి ఆ నొప్పి మటుమాయమైంది.

కమలక్కయ్య నడుంనొప్పితో చాలా బాధపడింది. ఆ రాత్రి కలలో అమ్మ కనిపించి "చీరపెట్టి, పూలమాల దూసి ఇస్తున్నది. అక్కయ్య ఒంగి దణ్ణం పెడుతుంటే" అమ్మ వద్దు అన్నది. ఎందుకమ్మా నేను ఏం తప్పు చేశాను అని అక్కయ్య అన్నది. ఏం లేదమ్మా! నీకు బాగాలేదు కదా! అందుకు ఒంగి దణ్ణం పెట్టొద్దన్నాను" అన్నది అమ్మ. తరువాత అక్కయ్యకు ఆ బాధ తగ్గింది. అక్కయ్య బాధను పూలను దూసినట్లు దూసేసింది అమ్మ.

అక్కయ్య కూతురు ఇంద్రాణికి కలలో కనపడి "అది ఎందుకు అట్లా బాధపడుతుంది. నేను చూసుకుంటాను" అన్నది. ఇంద్రాణి వాళ్ళమ్మకు ఫోన్ చేసి "నువ్వు ఎందుకు బాధపడతావు. అమ్మ నాకు కలలో కనపడి అంతా నేను చూసుకుంటానని అన్నదని చెప్పింది. దానితో అక్కయ్య మనసు కుదుట పడింది. అమ్మను దర్శించటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళింది అక్కయ్య. అమ్మ వద్ద శ్రీపాద

గోపాలకృష్ణమూర్తి గారు ఉన్నారు. అక్కయ్యతో అమ్మ "ఏదైనా తాగుతావా" అని పాలు ఇప్పించింది. శ్రీపాదవారు అమ్మకు దణ్ణం పెడుతుంటే "నాకు కాదు దణ్ణం పెట్టవలసింది దానికి పెట్టు. దానికి ఎంత ఓర్పో చూడు" అన్నది అమ్మ.

అక్కయ్యకు కంఠవాతం వచ్చి పరిస్థితి విషమించటంతో మద్రాసు తీసుకు వెళ్ళారు. అ సంగతి యోగయ్య గారి ద్వారా అమ్మ కమలక్కయ్య వాళ్ళమ్మకు కబురు చేసి రాంబాయమ్మను మద్రాసు వెళ్ళమని చెప్పింది. "అది ఎట్లా ఉందో" అంటూ జిల్లెళ్ళమూడిలో సాయంకాలం దాకా స్నానం చేయకుండా కూర్చుంది. ఒకసారి అక్కయ్య వింటుండగా "ఏమిటో అంతా కదలిపోతున్నది" అన్నది అమ్మ. ఆ రోజునే బ్రహ్మాండమైన భూకంపం వచ్చింది. ఆ విధంగా సర్వమూ తానై సర్వ స్వరూపిణి అయిన అమ్మ కృపావృష్టిలో ఎన్నో అనుభూతులు పొందిన భాగ్యశాలి కమలక్కయ్య.

సంసార బాధ్యతల వల్ల జీవితమంతా వ్యర్ధమౌతుందనీ ఆధ్యాత్మిక సాధనకు సమయం సమకూరటం లేదని వాపోయినవారితో "సంసార బాధ్యతలే ఆధ్యాత్మిక సాధన నాయనా! ఆధ్యాత్మిక సాధన అంటూ వేరే లేదు. నువ్వు చేసే ప్రతిపనీ భగవత్సేవయని, భగవదాజ్ఞానుసారమేనని అనుకోగలిగితే ... యీసంసారం ప్రతి బంధకం కానేరాదు. అనగా నీ దృష్టిలో భావనలో మార్పు తెచ్చుకోవటమే" అని చెప్పింది అమ్మ.

అమ్మ దృష్టిలో భార్యాభర్తలుభయులు సమమే. భార్యకు, భర్త ఎలాదైవమో, భర్తకు భార్యా కూడా అలాగే దేవత అని అమ్మ భావన. మంగళ సూత్రరూపేణా భర్త పాదాలు భార్య కంఠాన ఎలా బంధింపబడి ఉంటాయో - యజ్ఞోపవీత రూపేణా భార్యభర్తతోటే సదా ఉంటుందని అమ్మ అభిప్రాయం. అమ్మ దృష్టిలో వింతంతువులు కూడా లేరు. భర్త స్మృతి ఉన్నంత వరకూ ఎవ్వరూ వితంతువులు కారని అమ్మ భావం. ఒకరు సన్యాసం తీసుకోవాలని అమ్మ అనుజ్ఞకోసం వస్తే అప్పుడు అమ్మ "వివాహం చేసుకొని గృహస్థుగా ఆధ్యాత్మిక సాధన చేయటం

కోటలో వుండి యుద్ధం చేయటం, సన్యాసించటం కోట విడిచి యుద్ధానికి వెళ్ళడం" అన్నది.

కోటంరాజు రామారావు గారు 1959లో అమ్మను సందర్శించారు. వారికి ఏమి అనుభూతమయిందో "అమ్మా మిమ్మల్ని" గురించి పత్రికలలో పరిచయం ఇవ్వమని చేయటానికి అనుమతిని ఆర్థించారు. "ఎందుకు" అన్నది అమ్మ. అందరూ యీ విషయం తెలుసుకోవాలి. ఇక్కడకు రావాలి. ఈ ఆనందాన్ని పొందాలి. తమ జీవితాలు అమృతమయం చేసుకోవాలి. "నేను పొందిన అనందం నా సోదరులు కూడా పంచుకోవాలి" అన్నారు.

"నీవు ఏ పత్రికలో చూసి వచ్చావు?" అని అమ్మ ప్రశ్నించింది. "ఒకరి నుంచీ సం॥ క్రితమే విన్నాను. కానీ ఈ రోజుకు రాగలిగాను" అన్నారు. నీకు తరుణం వచ్చింది నీకు వినపడ్డది. నువ్వు వచ్చావు. ఎవరి సమయం వస్తే వారు అలాగే వస్తారు" అన్నది అమ్మ. "అందరూ వచ్చి ఒక్కసారి అయినా నీ పాదాలు మ్రోల సాష్టాంగపడేందుకు, అనురాగమంటే ఏమిటో, ఆనందమంటే ఏమిటో, సహనమంటే ఏమిటో, త్యాగమంటే ఏమిటో తెల్సుకునేందుకు రావాలి" అని అన్నారు. దానికి అమ్మ "ఎందుకు నాన్నా నీకంత తహ తహ" అడిగింది అమ్మ.

"అదికాదమ్మా, మానవత్వం పలుచబడిపోతున్నవేళ, సత్యధర్మాలు నలిగిపోతున్న వేళ, ప్రేమ స్వార్థపూరితమై కలుషితమైపోతున్నవేళ, మీరు అవతరించారు. ఒక్కసారి మీ దర్శనం చేసుకుంటే చాలమ్మ" అన్నారు. "చూస్తేనే సరిపోతుందంటావా?" అని అమ్మ అడిగింది. "చూచినందువల్ల ప్రయోజనం ఉన్నది. సూర్యోదయం అయినంతనే చీకటి ఎట్లా ఉండదో, అగ్నిజ్వాల దగ్గరకు వెళ్ళిన తరువాత చలిబాధ ఎట్లా ఉండదో మీ దర్శనమయిన తరువాత మా మనస్సులో మాలిన్యం నిలవలేదంటాను" అన్నారు రామారావు గారు. "తరుణం వస్తే ఎన్ని పనులున్నా ఎవ్వరూ తప్పించుకోలేరు" అని తెలియచేసింది అమ్మ.

ఆయన కాంక్ష పూరికే పోలేదు. సోదరులు యార్లగడ్డ రాఘవయ్యగారు "ప్రసూనాంజలి" అన్న పద్యకావ్యం, భార్గవ విద్యాదేవ కులపతి గారు "అంబికా సహస్రి" బృందావనం రంగాచార్యులు గారు "పూజపుష్పాలు" సమర్పించారు.

అమ్మకు అస్వస్థతగా వున్నందున అమ్మకు పరిచర్యచేసే అన్నపూర్ణ అతి ప్రేమతో మందు మోతాదు ఎక్కువ విచ్చింది. అందులో గరళం కలిసి వుండటంతో క్షణాల్లో అమ్మ శరీరం కొయ్య భారింది. చర్మం స్పర్శ జ్ఞానం కోల్పోయింది. లోపల తపన ఎక్కువైంది. అందరి హృదయాల్లోనూ ముఖాలపైనా విషాద మేఘాలు అలుముకున్నాయి.

ఏమీ భయపడవద్దు. అదే తగ్గుతుంది అని అమ్మ చెప్పింది. నాన్నగారు మొదట ఆందోళన మనస్కులైనా ఇంతకంటే భయంకరమూ, ప్రయాదకరమైన అనేక సంఘటనలను వివరించి, అమ్మకు శరీరం మీద గల అధికారం గురించి విశదీకరించారు. అవసరమైతే శరీర బాధను మనం చొక్కాను తగించినట్లు అమ్మ చిలక్కొయ్యకు తగిలించగలదన్నారు. అమ్మ గరళాన్ని జయించింది. మానవత్వాన్ని అధిగమించింది. ఆశరీరం అమరమని, అజేయమని ఋజువయింది. అమ్మలోని దైవత్వం మనకు మరొకసారి సాక్ష్యాత్కరించింది.

అమ్మ బాల్యంలో ఒక ప్రసంగంలో చిదంబరరావు గారు అనిర్వచనీయమయిన శక్తి గలదానికి నా ఆశీర్వచనం ఎందుకమ్మ? అన్నారు. దానికి అమ్మ "నిర్వచనాలతో ఉన్నాను గనుక" అన్నది అమ్మ. కొమ్మూరు డాక్టరుగారితో అమ్మ తాను 3 రోజులు సమాధిలోకి వెళ్తానని ఆ మూడురోజులు తన శరీరాన్ని జాగ్రత్తగా చూడమంది. ఆ మూడు రోజులు గడచిన పిమ్మట అమ్మ శరీరకాంతిలో అనూహ్యమైన మార్పు వచ్చింది. చరిత్రలో షిర్డీబాబా కూడా తన శరీరాన్ని జాగ్రత్తగా చూడమని సమాధిలోకి వెళ్ళి మూడురోజుల తర్వాత పునర్జీవితులవ్వటం విదితమే కదా!

భద్రాద్రి రామశాస్త్రిగారు అమ్మను దర్శించిన నాటి నుండి అమ్మ చరణాలకు అంకితమయిన పుణ్యామూర్తి. 'అం ఆ' అనే రెండక్షరాలను గాయిత్రిగా గుర్తించిన జ్ఞాని, చతుర్విధకవితా ప్రవీణులు, శ్రీ చక్రోపాసనాపరులు, సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు. అమ్మను చండికగా, భ్రమరాంబగా దర్శించిన మహానుభావులు, జపతపాలతో, పూజా పురస్కారాలతో అనుక్షణం పవిత్రంగా గడిపిన ధన్యజీవి.

1966 జనవరి 3వ తేదీ ముక్కోటి నాడు అమ్మ సంస్కృత పాఠశాలను స్థాపించింది. దానికి ఆది గురువు భద్రాద్రి రామశాస్త్రిగారే, భద్రాద్రి రామశాస్త్రిగారికి హైమంటే చాలా ప్రేమ. వారికి హైమ ప్రియశిష్యురాలు కూడా. వారి వద్ద హైమ సంస్కృతం అభ్యసించింది. హైమ ఎంత ఉత్తమురాలో అంత బుద్ధిమంతురాలని శాస్త్రిగారు చెప్పేవారు. భద్రాద్రి తాతయ్య బాగా చిక్కి ، ్యమయ్యాడు. హైమ అమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా! తాతయ్య ఎలా వుంటాడో అ. భయంగా వున్నది" అని చెప్పింది హైమ ఆదుర్దాకు అమ్మ నవ్వుకుంది. అల ాటిది తాతయ్య కులాసాగానే వున్నాడు. హైమ సిద్ధి పొందింది.

'మాతృశ్రీ సంగీత విద్యాలయాన్ని' 'మాతృశ్రీ సంస్కృత విద్యాలయాన్ని' పునఃప్రా ంభించింది అమ్మ. ఒకటి ఆపాతమధురమైన సంగీత సంబంధి అయితే మరొకట ఆలోచనామృతమైన సాహిత్య పరమైనది. అమ్మ జీవితకాలంలో అత్యంత ్ర ధాన దినమైన శ్రావణ పంచమి సంగీత విద్యాలయ సముద్భావానికి సుముహూర్తమయింది. అఖిల విద్యలకు ఆధారుడైన విఘ్నేశ్వరుని అర్చనా దినమైన వినాయక చవితి సంస్కృత విద్యాలయ పునర్వికాసానికి దోహదం చేసింది.

సంగీత విద్యాలయానికి ఆధ్వర్యం సంగీత తపస్వీ శ్రీకాసు రాధాకృష్ణరెడ్డి. సంస్కృత విద్యాలయానికి ఆచార్యులూ, ఉభయ భాషలలోను ఉద్దండ పండితులూ, చతుర్వేద కవితా పారాయణులూ, వయో వృద్ధులు అయిన అగ్రజులు శ్రీ రాయప్రోలు భద్రాద్రి రామశాస్త్రిగారు. హైమ సిద్ధిపొందిన మరునాటి నుండీ ఆ పవిత్ర స్థలంలో వారు రుద్రాభిషేకమూ, లలితా నామార్చనా ప్రారంభించారు. వారు హైమను శివశక్త్యైక్య రూపిణిగా దర్శించిన ద్రష్ట.

భద్రాద్రి తాతయ్య మరణించినప్పుడు విపరీతమయిన తుఫాను. ఆయన ముందుగానే తనను దహనం చేయవద్దని, ఖననం చేయవలసిందిగా రాసి పెట్టుకున్నారు. ఆ విధంగానే ఆయన్ని ఖననం చేయటం జరిగింది. అమ్మ సర్వసృష్టిస్థితి లయకారణి కాబట్టే ఆయన పోకముందే ఆయన ఆవిధంగా రాసేలాగా చేసింది. లేని పక్షంలో మిన్నూమన్నూ ఏకమవుతున్నా తుఫానులో దహనం చేయాలంటే కష్టసాధ్యం కదా! అదేకాక ఆయన కూడా ఉద్దండపండితుడు మహాజ్ఞాని. అందుకే ఆయనకు ఆ విధంగా ఆలోచన వచ్చిందేమో!

రాఘవరావు మామయ్య అమ్మ అన్నగారు. ఎనమండుగురు పుట్టినా సీతాపతి, రంగమ్మగారి దంపతులకు పోయినవారు పోగా మిగిలింది రాఘవరావు మామయ్య, అమ్మ. చిన్నప్పటి నుంచీ మామయ్య దుడుకు స్వభావం కలవాడు. దేవుడన్నా, పూజలన్నా నమ్మకం లేనటువంటి వ్యక్తి.

దైవం మీద నమ్మకం లేకపోయినా బంధుప్రీతి ఎక్కువ. జాలి గుండె కలవాడు. ఎవరు కష్టంలో ఉన్నా చూడలేడు. 1958లో అమ్మ మన్నవ వెళ్ళినప్పుడు అమ్మను మామయ్య గారింటికి ఆహ్వానించి పూజచేసుకున్నారు. ఆ సమయంలో వారి నట్టింట కుంకుమ పడింది. ఎంత తుడిచినా అది పోలేదు. దానితో మామయ్యకు కొంత ఆసక్తి కలిగింది.

మామయ్యకు మొదటి సంతానం కలిగిన ఇరవై సం॥ల పిమ్మట ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ తరువాత ఆ కుంకం మాయమయింది. ఈ రెండు సంఘటనలు అమ్మ అనుగ్రహ ఫలితాలే అని వారి నమ్మకం. శ్రీపాద వారితో మామయ్యకు పరిచయం కలిగింది. వారితో సంభాషణలు చేసి, సంవాదాలు చేసిన ఫలితంగా మామయ్యలో విశ్వాసం పెరిగి, పెరిగి మహావట వృక్షం అయింది. అమ్మ ప్రభోధించిన అద్వైత సిద్ధాంతం ఆయనను బాగా ఆకర్షించింది. ఈ లోకానికి జ్ఞాన బిక్ష పెట్టడం కోసమే అమ్మ అవతరించింది అని నమ్మి అందరికీ ఆ విషయాన్నే తెలియజేసాడు.

అమ్మతో శ్రీపాదవారు, వీరమాచినేని ప్రసాదరావుగారు, సంభాషణ చేస్తున్నప్పుడు రాఘవరావు మామయ్య "నాలాంటి వారికే మార్పు వచ్చింది. ఈ మార్పు రావటానికి హైతువేమిటి?" అని అమ్మను అడిగాడు. దానికి అమ్మ "గోర్కి వ్రాసిన పుస్తకం ప్రపంచ చరిత్రలోనే మార్పు తీసుకువచ్చింది. బౌద్ధ జాతక కధలు ఆసియాను ప్రభావితం చేసాయి. కాబట్టే ఎక్కువ మంది బౌద్ధులుగా మారారు. రామాయణం ఎవరినీ ప్రభావితం చెయ్యలేదని చెప్పగలమా?" అన్నది అమ్మ. చరిత్ర వలన మార్పు వస్తుందనే మా విశ్వాసం. అది నిర్ణయంలోని భాగమే ఈ తరంగాలు ప్రపంచమును ఊగించబోతున్నాయని మా విశ్వాసం.

ఈ సిద్ధాంతం ప్రపంచమంతా వ్యాపించగలదని మా నమ్మకం అని వీరమాచినేని ప్రసాదరావుగారు అన్నారు.

"ప్రతి జీవితంలో రకరకాల సంఘటనలు ఉన్నా, వాళ్ళ మనసులకు బాధ కలగకుండా చెప్పాలనుకుంటే అది చరిత్ర అనిపించుకోదు. అలాగని బాధ కలుగుతుందని వదిలివేయటం చరిత్ర లక్షణం కాదు. కొంతమందిలో వాస్తవంగా మార్పు వచ్చింది. రాఘవరావు అన్నయ్య అదేగా అంటున్నాడు" అని అమ్మ చెప్పింది.

అమ్మ సవతి తల్లి కామేశ్వరమ్మగారు ముందు అమ్మను అర్థం చేసుకోలేకపోయింది. అదీ ఆమె తప్పుకాదు. వయస్సులో దాదాపు 25సం॥ పైన తేడా వున్న తాతగారిని చేసుకోవలసి వచ్చింది. చిన్నతనంలో అమ్మను ఇబ్బందులకు గురిచేసి నావయస్సు మళ్ళిన తరువాత తన తప్పును తెలుసుకొని పూర్తిగా అమ్మసేవకే అంకితమైన పుణ్యాత్మురాలు. అమ్మ జన్మస్థలమైన మన్నవలో అమ్మకు మందిరం నిర్మించి విగ్రహప్రతిష్ఠ జరిపించి నిత్యనైవేద్యదీపారాధనలతో మనస్ఫూర్తిగా అమ్మను అర్చించుకుంటున్న ధన్యజీవి. మన్నవ వెళ్ళిన వారందరినీ ఎంతో ఆప్యాయంగా పలుకరించి తనకున్నంతలో అతిధిమర్యాదలను జరుపుతున్న భాగ్యశాలి. తనశేషజీవితాన్ని అమ్మ మందిరంకే ధారపోస్తూ మనందరికీ మార్గదర్శినియై మనందరిచే అమ్మమ్మగా పిలువబడుతున్న మాతృమూర్తి. అమ్మమ్మలో మార్పు వాస్తవంగా వచ్చిందని అమ్మ చేకొనియాడబడిన పుణ్యశీలి.

విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రనాం
పాత్రత్వాత్ ధనమాప్నోతి ధనాత్ ధర్మంతత్సుఖం ॥

విద్య వినయాన్నిస్తుంది. వినయం వల్ల మానవుడు యోగ్యుడవుతాడు. యోగ్యత వల్ల ధనం లభిస్తుంది. ధనం వల్ల ధర్మాన్ని పొందుతాడు. ధర్మం వల్ల సుఖం కలుగుతుంది. కాబట్టి విద్య సుఖానికి పరంపరా కారణమౌతుందే కానీ ప్రత్యక్ష కారణం కాదు. అసలు సుఖమన్నది మనోధర్మం. ఏది సుఖమో, ఏది దుఃఖమో నిర్ణయించటం కష్టం.

"మనయేవ మనుష్యానాం కారణం బంధమోక్షయోః" అని నానుడి. ఈ పరమార్థం మన పిల్లలకు శైశవం నుండే లభించాలి. అందుకే ఈ విద్యాలయాన్ని అమ్మ ఏర్పాటు చేసింది. విద్య వల్ల నిజమైన ప్రయోజనమేమిటో బోధపడాలి. విద్య కేవలం పొట్టకూటి కోసం కాక విజ్ఞాన సముపార్జనకు మూలం కావాలి.

కావ్యంలో కవితగా, వేదాంతంలో పరబ్రహ్మగా, భౌతిక విద్యలో పదార్థశక్తిగా, గాన విద్యలో నాదమాధురిగా, ఒకటేమిటి? అన్ని విద్యలలోనూ అంతర్లీనమై ఉన్న అమ్మ యొక్క అనంతరూప సౌందర్యాన్ని సందర్శించి, చరితార్థులై విశ్వహితార్థులుగా రూపొందుతాము. డాక్టర్ పన్నాల రాధాకృష్ణ శర్మగారు అమ్మ పరిపూర్ణ అనుగ్రహం పొందిన వ్యక్తి. వారు మహామనీషి, ఋషి, విద్వత్కవి, అమృత హృదయులు, సరసులు. వారికి అమ్మ యందు అచంచల భక్తి విశ్వాసాలు. అమ్మకు వారి యందు అపారమైన కారుణ్యము, వాత్సల్యము.

పన్నాల రాధాకృష్ణశర్మగారు చదువుకుంటున్న రోజుల్లోనే ఒక ప్రశాంత ప్రభాత సమయాన జిల్లెళ్ళమూడిలో ఉన్న అమ్మను దర్శించారు. వారితో అమ్మ "నాన్నా! ఇక్కడ సంస్కృత కళాశాల పెడితే నువ్వు వస్తావా" అని అడిగింది. అప్పుడు ఆయనకు కాలేజీలో పనిచేసే అధ్యాపకునికి కావలసిన అర్హతలు లేవు. ప్రాథమిక పాఠశాల తప్పించి కూడా లేని ఆ కుగ్రామంలో కాలేజీ ఏమిటని ఆశ్చర్యపోయారు. అదీకాక ఆయన చదువూ పూర్తి కాలేదు. ఒకవేళ ఇంత చిన్న కుగ్రామంలో కళాశాల పెడితే చదువుకోవటానికి ఎవరు వస్తారని ఆయన భావించారు. ఈ సంభాషణ **1960** ప్రాంతంలో జరిగింది.

అమ్మ జీవిత చరిత్రలో, అమ్మ దివ్య ప్రణాళికలో రాధాకృష్ణ శర్మగారికి అత్యంత ప్రముఖమైన స్థానం ఉన్నది. అమ్మ తన బాల్యదశలోనే ఒక సంస్కృత విద్యా సంస్థను స్థాపించవలెనని సంకల్పించింది. అందుకు రాధాకృష్ణశర్మ గారిని ఉపకరణంగా అమ్మ ఎంచుకున్నది. యాధృచ్ఛికంగా అన్నదా అంటే అంత చిన్న పల్లెటూరిలో కళాశాల రావటం ఆశ్చర్యకరమే! అవతారమూర్తి అయిన అమ్మకు సాధ్యం కానిది లేదు కదా! రాధాకృష్ణశర్మగారు ప్రిన్సిపల్‌గా విచ్చేసినప్పటికే భద్రాద్రి రామశాస్త్రిగారి ఆధ్వర్యాన నడుపబడుతున్న సంస్కృత పాఠశాల

నిర్వహణను చూచి ఆశ్చర్య చకితులయ్యారు. అలాగే జరగబోయేది అమ్మ అంటుందో అమ్మ అన్నది కాబట్టి జరుగుతుందో అర్థం కాదు.

అమ్మ సంకల్పబలం, సంకల్పఫలం వలన ధర్మపురి శ్రీలక్ష్మీనృసింహ సంస్కృత కళాశాల ప్రధానోపాన్యాసకులుగా పని చేస్తున్న విద్వత్కవివరేణ్యులు అయిన శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారిని ప్రధానోపన్యాసకులుగా మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలలో నియామకం జరిగింది. ఒక దాశాబ్దికి పూర్వమే అమ్మ కళాశాలలో నియామకం జరిగింది. విశ్వకళ్యాణార్థం, మానవోద్ధారణార్థం అమ్మ అందిస్తున్న మహత్తర సందేశాన్ని నేటి విద్యార్థి లోకానికి అందించాలి, దాని ద్వారా దివ్య మానవుడిగా రూపురేఖలు దిద్దాలని అమ్మ ఆశయం.

తత్ఫలితంగా రాధాకృష్ణశర్మగారు అగ్రజులు, శ్రీ అధరావరపు శేషగిరిరావు గారి సహకారంతో విద్యా పరిషత్‌కు వ్యవస్థాపకులైనారు. 1971వ సం॥లో మాతృశ్రీ ప్రాచ్య కళాశాల ప్రారంభించబడింది. కళాశాలకు వారు ప్రథమ ప్రధానాధ్యాపకు లయినారు. వారి నేతృత్వంలో జిల్లెళ్ళమూడిలోని విద్యాసంస్థలు అత్యంత సమర్థంగా ప్రకాశవంతంగా, సర్వతోముఖంగా నిర్వహించబడ్డాయి.

1968 ఏప్రియల్‌లో శ్రీ పన్నాల రాధకృష్ణశర్మగారు అమ్మ సుప్రభాతం, సంధ్యావందనాలతో శ్రీకారం చుట్టి పుంఖాను పుంఖాలుగా ఉభయభాషలలోనూ అమ్మతత్వాన్ని రచించి ప్రచురించారు. మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలకు ఆగష్టు 6వ తేదీ ఉదయం గం.7-36 ని.లకు జగన్మాత మన అమ్మ ప్రారంభోత్సవం జరిపించి ప్రత్యేక సంచికను ఆవిష్కరించింది. ప్రిన్సిపాల్ రాధాకృష్ణ శర్మగారు సంస్కృతభాషలో స్వాగత వచనాలు పలుకుతూ విద్యాభ్యాసం ఉదరపోషణకే పరిమితం కారాదని అది ఐహికాముష్మిక శ్రేయోస్సాధనగా గుర్తించాలని ఈ విద్యాసంస్థ విశ్వకళాపరిషత్‌గా రూపొందాలని ఉగ్గడించారు.

అమ్మ సుప్రభాత, సంధ్యావందనాలతో మొదలైన రచనా స్రవంతి సంస్కృతంలో శివార్చన, అశ్రులహరి, అంబికాస్తవ కదంబం, అంబికా సహస్రనామ స్తోత్రం, శృంగాలహరి పొగడపూలు మున్నగు అనేక గ్రంథాలరూపంలో అమ్మతత్వవేత్తగా కావాలనుకున్నవారి హృదయక్షేత్రాలను సస్యశ్యామలంచేసారు.

ఆయనతో మాట్లాడటమే ప్రముఖ విజ్ఞాన సముపార్జన. అటువంటి ఉత్తమ వ్యక్తి "నన్ను సోదరిగా భావించటం నా అదృష్టం. నా రచనా వ్యాసంగానికి శ్రీకారం చెట్టడానికి, నా మొదటి ప్రచురణ దివ్యానుభూతులలో అవ్యాజమైన అభిమానంతో "అమృతాశయాన్ని" అందించిన శ్రీ పన్నాల వారికి నేనేమిచ్చి రుణం తీర్చుకోగలను".

వారు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఉత్తమ విద్యా బోధకులు. కార్యదక్షులు, సాధు స్వభావులు, నిరాడంబరులు. కనుకనే తోటి అధ్యాపకులకూ, విద్యార్థులకూ ప్రీతిపాత్రులైనారు. ప్రజ్ఞాధురీణులూ - ప్రతిభావంతులూ అయిన విద్యార్థినీ విద్యార్థులను తయారు చేసి కళాశాలకు జాతీయ స్థాయిలో గుర్తింపు కలుగజేశారు. అంతేకాక, జిల్లెళ్ళమూడిలో అమ్మ సమక్షంలో ప్రధాన సంస్థ అయిన శ్రీ విశ్వజననీ పరిషత్ ఆధ్వర్యంలో నిర్వహించబడే సర్వ ప్రజాహిత కార్యక్రమాల్లోనూ ప్రముఖపాత్రధారియై చరించే క్రియాశీలి వారు.

ఇంత సంకీర్ణమైన జీవితంలోనూ తనదైన ఒక మార్గంలో ప్రయాణించి, రామాయణంపై పరిశోధన జరిపి డాక్టరేట్ పొందగలగడం నిజంగానే వారి విశేష ప్రతిభకు తార్కాణం. వారి పాండిత్య ప్రకర్షకు గుర్తింపుగానే వారికి తిరుమల తిరుపతి దేవస్థానం వారి నుండి పిలుపు వచ్చింది. శ్రీ వెంకటేశ్వర సెంట్రల్ లైబ్రరీ మరియు రీసెర్చి సెంటర్‌కు వారు డైరెక్టరయ్యారు. వారు రాసిన "సుప్రభాత" ప్రభావం వలన జిల్లెళ్ళమూడి వచ్చే యాత్రికులకు వారు 'సుప్రభాతం అన్నయ్య' గానే సుపరిచితులూ, అనురాగ పాత్రులూ.

అగాధమైన శాస్త్ర సాగరాలలో ఈదుతూ అలిసిపోయి గమ్యం చేరలేని పండితులకు భద్రమైన, పరమమైన రేవును చేరువలో చూపుతోంది అమ్మ. ఎన్నో ఎదురు దెబ్బలు తిని చింతలతో చితికిపోయి ఎండి మోడువారిన అభాగ్యుల జీవిత జీర్ణారణ్యాలు స్వాంతన మధుర పయోధారాలతో చిగురింప చేసి సుందరోద్యానములా రూపొందిస్తుంది. వైవిధ్యమైన కమనీయ జీవిత సౌభాగాన్ని సందర్శింపజేసి, జీవితంలో ఎటువంటి పరిస్థితులలోనైనా నిలదొక్కుకోగలిగిన

ధైర్యాన్ని ప్రసాదిస్తుంది. వివిధ పద్ధతులలో అమ్మ సాన్నిధ్యం పరిష్కార మార్గం చూపుతున్నది. జీవితాన్ని నిర్భయంగా ఎదుర్కొనే సాహసాన్నిస్తుంది. ఎనలేని మనోబలాన్ని కలుగజేసి మన జీవితాలకు పరిపూర్ణతను, పవిత్రతను పరమార్ధాన్ని ప్రసాదిస్తుంది.

ఆంజనేయశాస్త్రిగారు అమ్మ అనుంగ బిడ్డలో ఒకరు. అమ్మ మీద అపారమైన భక్తి విశ్వాసాలు కలవారు. అమ్మ సంస్థకు తాను ఏవిధంగా సేవచేయగలనా అన్న తపన కలవారు. ఒకమారు కూరల సంచులతో గుంటూరు బస్సు స్టాండ్‌లో వున్నారు. అప్పుడే బందరునుంచీ వచ్చిన బస్సులో పాతకమూరి ప్రభాకరం గారు బస్సుదిగారు. ఆయన కాకినాడలో గొప్ప సంగీత విద్వాంసులు. బందర్‌లో కచేరీ చేసివస్తూ గుంటూరులో ఆంజనేయశాస్త్రిగారిని కలిసారు. ఆంజనేయ శాస్త్రిగారితో "జిల్లెళ్ళమూడి వెళ్తున్నాను మీరూ రండి" అని అన్నారు. ప్రభాకరంగారు అంతకు ముందే అమ్మ గురించి విన్నారు. ఇది రెండోసారి. ఆయనకు అంతగా వెళ్ళాలని లేదు. ప్రాప్తం వుంటేగానీ వెళ్ళలేమని ఆంజనేయ శాస్త్రిగారు బలవంతం చేసారు. "మీకేమైనా సంశయాలు సందేహాలు వున్నా అన్నీ జిల్లెళ్ళమూడిలో తీరుతాయని" హామీ ఇచ్చారు.

ఆరోజు ఉదయం 10 గం॥లకు బాపట్ల చేరారు. పెదనందిపాడు బస్సు రెడీగా వుంది. తొందరగా వెళితే పూజకు అందుకోవచ్చునని హడావిడి చేసారు శాస్త్రిగారు. బస్సు చాలా రద్దీగా, కాలు పెట్టటానికి వీలు లేకుండా వుంది. ఆ బస్సు 10 గజాల వెళ్ళిందో లేదో ఆగిపోయింది. బస్సు చెడిపోయిందని, అందర్నీ దిగమని కండెక్టరు, డ్రైవరు చెప్పారు. అంతా దిగటంతో బస్సు ఖాళీ అయింది. బస్సు మీద కూరల సంచులు వేయించి, బస్సు ఎక్కమని ఆంజనేయశాస్త్రిగారు తొందర చేసారు. చెడిపోయిన బస్సుమీద కూరగాయల సంచులు వేయించటంకాక, తనని బస్సు ఎక్కమనటం చూసి ఆశ్చర్యపోయిరు ప్రభాకరం గారు. "ఇది ఏమిటండీ?" అని అడిగారు. "అంది అంతే"ని జవాబిచ్చారు శాస్త్రిగారు. ఒక పావుగంటలో బస్సు బాగవటం, బయలుదేరటం జరిగింది. "అంతా అమ్మ దయ అనుకున్నారు" ఆంజనేయశాస్త్రిగారు.

మీరు అయిష్టంగా జిల్లెళ్ళమూడి బయలుదేరారా? అని ప్రభాకరం గారిని శాస్త్రిగారు అడిగారు. "నిజమే" అన్నారు ఆయన. కానీ బస్సు సంఘటన, జిల్లెళ్ళమూడిలో జరిపిన సంఘటనలు దృష్ట్యా అమ్మ యొక్క అదృశ్య హస్తం ప్రస్ఫుటంగా అవగతమయింది ప్రభాకరం గారికి. జిల్లెళ్ళమూడిలో జరిపిన సంఘటన అమ్మ దర్శనం కొరకు వెళ్ళేటప్పటికి తెల్లచీర కట్టుకొని, పొట్టిగా వున్న స్త్రీకి అంతా పాదనమస్కారాలు చేయుటం, పూజచేయుటం చూసి ఆశ్చర్యమనిపించింది. తాను నమస్కారం చేయకూడదనుకున్నారు. కానీ ఆయన అమ్మ చేతిలో పళ్ళుపెట్టి కాకతాళీయంగా నమస్కరించారు.

ప్రభాకరంగారిని "అమ్మను చూడగానే మీకు పవిత్రభావన కాని దివ్యత్వ స్ఫురణగానీ కలుగలేదా? "అని శాస్త్రిగారు అడిగారు మొదటగా నాకు ఏమీ అనిపించలేదని" అన్నారు. మర్నాడు ఊరికి వెళ్తానన్నారు. "ఏం నాన్నా! ఇంకా స్థిమిత పడలేదా!" అని అమ్మే పలకరించింది. ఆయన అయిష్టంగా తలత్రిప్పారు. అమ్మ ఏమీ మాట్లాడకుండా చిరునవ్వు నవ్వింది. కొద్దిసేపు అయిన తరువాత అమ్మ హైమను చూసి "ఈ అన్నయ్యకు శిరోభారంగా వుంది. కొంచెం కొబ్బరినూనె తలకు పెట్టమ్మా" అని చెప్పింది. హైమ చేతిలో కొబ్బరి నూనె వేసుకువచ్చింది. ఆ కొబ్బరి నూనెను ఆయన చేతిలో వేయమన్నారు. ఫరవాలేదు. చెల్లాయే కదా! రాయించో అన్నది అమ్మ. హైమ ఆయన తలమీద కొబ్బరి నూనె పెట్టింది. హైమచేత తలమీద నూనె పెట్టించుకోవటానికి ఆయన ఎంత అదృష్టం చేసుకున్నారో కదా!.

వీళ్ళు మాట్లాడుతుండగానే ఎవరో వస్తూనే అమ్మ కాళ్ళమీద పడి కళ్ళనీరు నింపుకున్నారు. అమ్మ ఆయన వంక వాత్సల్యంతో చూసింది. అమ్మ దర్శనాంతరం అందరూ బయటకు వచ్చారు. ప్రభాకరం గారు అమ్మ దగ్గర కన్నీరు పెట్టుకున్నాయనను కలిసారు. ఆయన వూరు రేటూరో, పెదనందిపాడో, ఆయనపేరు కృష్ణమూర్తి. గుర్తులేదు ఆయన మానసికంగా కృంగిపోయారు. వ్యాపారంలో నష్టం రావటంతో అప్పుల వాళ్ళు వారి ఇల్లు వేలం వేస్తున్నారు. అందువల్ల గ్రామంలో ఉండలేక వచ్చేసారు.

దానికి ప్రభాకరం గారు "అమ్మకు చెప్పలేకపోయారా? అంతా ఆమెను భగవంతుడని కొలుస్తున్నారు కదా!" అన్నారు. "అమ్మకు తెలియనిది ఏముంది?" అని ఆ అన్నయ్య అన్నారు. ఆరోజు వూరికి వెళ్తానని అమ్మకు చెప్పారు. ప్రభాకరం గారు అమ్మ ఏమీ మాట్లాడలేదు. 7వ మైలురాయి దగ్గర ఎంతసేపు వున్నా బాపట్ల వెళ్ళే బస్సు రాకపోవడంతో తిరిగి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఉదయం అమ్మ దగ్గరన్న కృష్ణమూర్తి గారు, ప్రభాకరం గారు ప్రక్క ప్రక్కనే కూర్చుని భోజనం చేశారు. రాత్రి పక్క పక్కనే పడుకున్నారు. ఓ రాత్రివేళ మెలకువ వచ్చి చూస్తే ప్రక్కన పడుకున్న కృష్ణమూర్తిగారు కలిపించలేదు.

వేరే ఎక్కడైనా పడుకున్నారేమో అని అనుకున్నారు. తెల్లవారి అమ్మ దర్శనంకు వెళ్తున్నప్పుడు కృష్ణమూర్తిగారు వచ్చి కలిసారు. ఆయన చాలా బడలికగా కనిపించారు. అద్భుతమైన ఆవేశంతో వూగిపోతున్నారు. "రాత్రి చడీ చప్పుడు కాకుండా లేచి వెళ్ళిపోయారేమిటి? ఎక్కడికి వెళ్ళారని" అడిగారు ప్రభాకరంగారు. ఆయన కళ్ళు గంగా యమునలే అయ్యాయి. ప్రభాకరం గారికి చాలా ఆశ్చర్యమనిపించింది. "ఏం చెప్పమంటారు? ప్రభాకరం గారూ! అంతా అయోమయంగా ఉంది. నిన్న మా ఇల్లు వేలం ఆగిపోయింది అన్నారు కృష్ణమూర్తిగారు. ఆశ్యర్యపోవటం ప్రభాకరంగారి వంతమయింది". రాత్రి నిద్ర పట్టలేదు. ఇంటి దగ్గర ఏమి జరిగిందో, వాళ్లు ఎలా ఉన్నారో అన్న భావన నన్ను నిలవనీయలేదు.

"చేలకు అడ్డంపడి అర్ధరాత్రి 2 గం.లకు మావూరు చేరుకున్నాను. ఇంటికి వెళ్ళి తలుపు తట్టాను. నా భార్య వచ్చి తలుపు తీసింది. ఇంట్లోకి కూడా వెళ్ళకుండా వీధి అరుగు మీద కూర్చుని "ఇల్లు ఎవరు పాడుకున్నారు" అని అడిగాను. "ఎవరు పాడుకోవటమేమిటండీ, పాట ఆగిపోయింది ఉదయం 10 గం॥లకు మీరు డబ్బు తెచ్చి ఇచ్చారు. మీరు, కరణంగారు ఏవో కాగితాలు మీద సంతకం చేయించుకొని భోజనమైనా చేయకుండా వెళ్లారు కదా" అని నా భార్య చెప్పింది. నాకు ఏమీ అర్ధం కాలేదు. నేను డబ్బు తెచ్చి ఇవ్వటమేమిటి?

ఆ రోజు పగలంతా నేను జిల్లెళ్ళమూడిలోనే ఉన్నాను అందుకని ఆ కాగితాలను చూపించమని" నా భార్యను అడిగాను. ఆవిడ వాటిని తెచ్చి చూపించింది. "నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. అందులో నేను తీసుకున్న అప్పుకు తీర్మానం జరిగినట్లుగా వ్రాసి ఇచ్చిన కాగితాలు." ఆదంతా అమ్మ అనుగ్రహం వల్లనే జరిగిందన్న విషయం ఒక్కసారిగా స్ఫురించింది.

దానితో ఇంక మా వూళ్ళో నిలువబుద్ధికాక పరుగులాంటి నడకతో తిరిగి జిల్లెళ్ళమూడి వచ్చాను" అంటూ జేబులోంచి కాగితాలను తీసి ప్రభాకరం గారి చేతిలో పెట్టారు. ఇంతలో అమ్మ దర్శనం ఇస్తున్నారంటే అక్కడికి ఒక్క దూకులో గడపదాటి అమ్మ పాదాల మీద పడి అశ్రుధారలతో అభిషేకించారు. ప్రభాకరంగారు వెనకనే వెళ్ళి నిల్చున్నారు. అమ్మ ఆయన్ను తన ఒడిలోకి తీసుకుని అనునయంగా ఆయన వీపు మీద రాస్తూ ప్రభాకరంగారి వంక చూచి "ఏం నాన్నా! ఇప్పుడు శిరోభారం తగ్గి స్థిమితం కలిగిందా!" అని అడిగింది. వెంటనే ప్రభాకరం గారు భక్తి పూర్వకంగా అమ్మ పాదాల మీద వ్రాలిపోయారు. ఎటువంటి సందేహాలకు తావివ్వకుండా అనిర్వచనీయమైన ఆనందంతో పరవశించిపోయారు. జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ దర్శనం పొందటంతో ఆయన జన్మధన్యమైనదిగా భావించసాగారు. అంతమటుకూ ఉన్న అనుమానాలన్నీ పటాపంచలయ్యాయి. అమ్మ మాత్రం ఏమీ ఎరగనట్లుగా నవ్వుతూ కూర్చుంది.

**1968** తేదీ ఉదయం మొట్టమొదటిసారిగా అమ్మ చరణ సన్నిధిలో రాధాకృష్ణారెడ్డి అనసూయా వ్రతం చేసుకున్నాడు. మాతృశ్రీ జీవిత మహోదధి నుండి ఐదు తరంగాలు పఠించబడ్డాయి. అమ్మ చరిత్రలో ప్రతిక్షణము ప్రతి సంఘటన మహిమాన్వితమే కదా! అనితర సాధ్యాలయిన ఆ లీలలు ఒక్కొక్కప్పుడు' ఇవి నిజమేనా!" అనిపిస్తాయి. ఎవరికి సందేహం కలిగిందో, ఎవరికి ఋజువు అవసరమో ఏ ఒక్కరికి నిర్దేశింపబడినప్పటికి జరిగింది మాత్రం సర్వజగత్తు ఉపయోగం కోసమే మరి శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేస్తే అది ఆవ్యక్తికే పరిమితం అయిందా!.

ఆనాడు గుంటూరు నుండీ వచ్చిన ఇద్దరు లేడీ డాక్టర్లు వ్రత సమయంలో అమ్మ అపూర్వ చరిత్ర విన్నారు. అమ్మతో వైద్య శాస్త్రం గురించి అనేక విషయాలు చర్చించారు. ఆ రాత్రికి గుంటూరు చేరాలని వెళ్ళిపోయారు. వారు వెళ్ళిన కొద్ది సేపటికి అమ్మ అన్నయ్యను "వారు వెళ్ళారా?" అని అడిగింది. "వెళ్ళారో లేదు కనుక్కొని వుంటే పంపించమంటావా?" అని అన్నయ్య అడిగాడు. అవసరం లేదంది అమ్మ.

బాపట్లలో జ్వరంగా ఉన్న అన్నపూర్ణను చూడటానికి జీపు తెప్పించమంది. అమ్మ జీపు ఎక్కి 7వ మైలురాయి దగ్గరకు పోదామన్నది. తీరా రోడ్డు మీదకు వెళ్ళాక ఆ డాక్టర్లు దారిలో నిలుచున్నారు. లోపల ఉన్న అమ్మను చూడక ఏమి అడగాలో తోచక నిలుచుండిపోయారు. అమ్మ వచ్చిందని రామకృష్ణ అన్నయ్య వారితో చెప్పాడు. అది విన్న వారి ముఖాలు ఆనందంతో దీప్తిమంతమయినాయి.

అమ్మ దగ్గర నుండీ బయలుదేరేటప్పుడు వాళ్ళు ఒక సోదరికి పర్సు ఇచ్చి మర్చిపోయారు. రోడ్డు మీదకు వచ్చేటప్పటికి చీకటిపడ్డది. వెనక్కి వెళ్ళే ఓపిక లేదు. ఆ రాత్రికి గుంటూరుకు చేరాలి. ఏంచేయాలో బోధపడక విషాదవస్థలో కర్తవ్యం తెలీక నిలుచున్నారు. అందులో ఒక సోదరి "అమ్మ ఎప్పుడూ జిల్లెళ్ళమూడి దాటిరారా?" అని అన్నయ్యను అడిగింది. సాధారణంగా అమ్మ బయటకు రాదు. కానీ ఆనాడు వారి కొరకు రావటమే కాక, అవసరమైన డబ్బును జీపు డ్రైవరు దగ్గర తీసుకొని వారిక ఇచ్చి చీకట్లో భయపడేవారిని క్షేమంగా తన జీపులో బాపట్లకు చేర్చింది.

వారి ఆశ్చర్యానికి, ఆనందానికి అవధుల్లేవు. ఆనందంతో ఇద్దరు మైమరచారు. అన్నయ్యకు "సిరికింజెప్పడు అన్న పద్యం గుర్తుకు వచ్చి మీ ప్రార్థన విని అమ్మ ఇట్లావచ్చిందా?" అన్నాడు. కాని ఆ సోదరి "మాకు ఇప్పుడు ఏమి చేయాలో అన్న దిగులే కానీ అమ్మను ప్రార్థించాలన్నది కూడా గుర్తులేదన్నయ్య" అని అన్నది. నిజమే అమ్మలోని ప్రత్యేకత అదే కదా! మనం తనని ప్రార్థిస్తే గాని సహాయం చేయటం కాదు ఎక్కడ ఎవరికి అవసరం కలిగినా గుర్తించి తానే ఆదుకుంటుంది.

అందుకే "అడగనిది అమ్మ అయినా పెట్టదన్న సామెతను ఖండించి అడక్కుండా పెట్టేదే అమ్మ" అని అపూర్వమైన నిర్వచనం చేసి అడుగడుగునా ఆచరణలో ఋజువు పరుస్తున్నది అమ్మ. ఎవరైనా మహానుభావులు వారు ఇవ్వదలిచి ఇస్తారా!. మనకు కావల్సింది ఇస్తారా? అని నరసింహారావు మామయ్య (అమ్మ తమ్ముడు) అడిగాడు. దానికి అమ్మ "వారికి ఎప్పుడు ఏది అవసరమౌతుందనుకుంటే అది ఇస్తారు. 104 డిగ్రీల జ్వరంతో వున్న పిల్లవాడు ఆవకాయ అన్నం అడిగాడు కదా! అని తల్లి వాడికి పెట్టదు. వాడికి అవసరమైన పాలు రొట్టె ఇస్తుంది. ఇదీ అంతే అని తెలియజేసింది.

మన్నవ రామ బ్రహ్మంగారి కుమారుడు మన్నవ దత్తాత్రేయ శర్మ. దత్తు తల్లి సీతారత్నం. రామబ్రహ్మంగారికి నలుగురు మొగపిల్లల తరువాత ఒక ఆడపిల్ల, మళ్ళీ ఇద్దరు మొగ పిల్లలు. దత్తు ఆఖరివాడు. అమ్మ తండ్రి తండ్రి, రామబ్రహ్మం గారి తండ్రి సహోదరులు. రామబ్రహ్మంగారి పెద్దబ్బాయి, అమ్మ చిన్నప్పుడు కలిసి ఆడుకున్నారు. వాసుదాసు స్వామిగారి దగ్గర కలిసిన మన్నవ రామబ్రమ్మంగారు దత్తునాన్నగారే. కాబట్టి వారందరికీ మొదటి నుంచీ అమ్మ బంధువు అనే భావమే వుండేది. దత్తు వాళ్ళ అక్క పెళ్ళికి అమ్మ కూడా వెళ్ళింది.

మన్నవ రామారావుగారు హైద్రాబాద్‌లో వున్న దత్తు వాళ్ళ పెద్ద అన్నయ్యకు అమ్మ గురించి, అమ్మ దైవత్వం గురించీ ఎంతో రాసారు. అది చదివి ఆయన తమ్ముడుతో "రామారావు ఉత్తరం అంతా అనసూయక్కయ్య గురించే రాశాడు రా" అని చెప్పారు. దానికి ఆయన మన హనుమంతుకు కూడా అక్కయ్యను చూచిన తరువాతే ఉద్యోగం రావటం, పెళ్ళి అవ్వటం జరిగిందని చెప్పాడని అన్నారు. "అక్కయ్య దగ్గర అంత శక్తి వున్నాదా ఏమిటి?" అని అడిగారు. "నిజమే అన్నయ్యా! మొత్తానికి అంతా విశేషంగా చెప్పుకుంటున్నారు. చాలా మంది వెళ్తున్నారని" చెప్పాడు. ఈ సంభాషణను ఏడవ తరగతి చదువుతున్న దత్తువినటం జరిగింది.

వేసవి సెలవులకు పొన్నూరు వెళ్ళాడుదత్తు. అక్కడ వాళ్ళ అక్కయ్య,

అన్నయ్య అమ్మ దండకాన్ని చదువుతున్నారు. అక్కయ్య దండకం చదువుతున్నారేమిటి? అనుకున్నాడు. ఆ రోజుల్లో వీరింటి నుంచీ ఎవరు వెళ్ళినా "దత్తుని తసుకురాలేదేమని అమ్మ అడిగేదని చెప్పేవారు. ఆ మన అక్కయ్యేగా? వెళ్ళవచ్చులే" అని అనుకునేవాడు. నాగార్జునసాగర్‌లో దత్తు ఐదవ అన్నయ్య ఎంతో పరవశంతో అమ్మ గురించి చెప్తూ "అమ్మ జిల్లెళ్ళమూడిలో వుండి ఎక్కడో అడవిలో వున్న వాళ్ళు ఆర్తిగా పిలిస్తే కనపడుతుందని, వారికి ఆహారాన్ని అందచేస్తుందని అంతా అమ్మ మహిమ అని" పరిపరి విధాల చెప్పేవాడు.

దత్తు వాళ్ళ అన్నయ్యలు అమ్మ గురించి ఎంతో చెప్తున్నా దత్తుకు మాత్రం ఏమీ అనిపించలేదు. జిల్లెళ్ళమూడి వచ్చి వ్యక్తిగా అమ్మను చూడలేదు. కాని అమ్మ దయ అనంతం, అపారం కాబట్టి ఎక్కడో నాగార్జునసాగర్‌లో వున్న దత్తుకు, అమ్మ తనకు తానుగా తాత్వికానుభూతిని కలుగజేసింది.

నాగార్జునసాగర్‌లో ఎదురుగా ఉన్న కొండలు, చెట్లు, బిల్డింగ్‌లు అన్నీ వున్నవి వున్నట్లుగానే ఉన్నాయి. పగలు కారుమబ్బులు కమ్మితే చీకట్లు ఆవరించి ఎదురుగుండా ప్రకృతి ఏవిధంగా కనపడుతుందో అదే విధంగా ప్రకృతి మీద అమ్మ ఆవరించి వున్నట్లుగా దృశ్యమానమయిన హృదయానుభూతి కలిగింది. దాని తరువాత అమ్మ ధ్యాసమనసులో నిలిచింది. వున్నట్టుండి సువాసనలు రావటం జరిగేది. వాసనలు రావటానికి వీలులేని చోట నుండి కూడా సువాసనలు వచ్చేవి. అలా వస్తే అమ్మ వచ్చిందని నలుగురూ అనుకుంటారని వాళ్ళ అన్నయ్య చెప్పేవాడు. ఒకరోజు వాళ్ళ స్నేహితుని ఇంటికి వెళితే అతని తల్లికి జ్వరంగా ఉందని, మాంసం తింటానని గొడవ చేస్తోందని చెప్పారు. అప్పుడు దత్తూ వాళ్ళ అన్నయ్య జేబులో వున్న అమ్మ కుంకుమ తీసి నీళ్ళల్లో వేసి ఇమ్మన్నాడు. ఆయన అదేవిధంగా చేసాడు. మర్నాటికి ఆమె మాంసం తిన్నా కూడా జ్వరం తగ్గింది. దానితో అమ్మకే కాక అమ్మ ప్రసాదంగా ఇచ్చిన కుంకుమకు ప్రభావముందని అవగతమయింది.

దత్తు బయటకు వెళ్ళినపుడు వున్నట్లుండి వైకంకమ్మి

పడిపోతాననిపించిందిట. దానితో అమ్మా, అమ్మా అని స్మరిస్తూ నడిచాడు. అడుగు ముందుకు వేయలేననుకున్న దత్తుకు ఓపిక వచ్చి చాలా దూరం నడవ గలిగాడు. అమ్మ కుంకుమే కాదు, స్మరణ కూడా అద్భుతంగా పని చేస్తుందనిపించింది. దత్తు మూడవ అన్నయ్య బుజ్జికి రక్త విరోచనాలతో బాగా సీరియస్ అవటంతో ఆసుపత్రిలో చేర్పించారు. రాత్రింబవళ్ళు దత్తు సేవ చేసాడు. ఆ తరువాత బుజ్జి అమ్మను దర్శించాడు. కళ్ళు సమంగా లేవని అనుకునేవాడు. అమ్మ ప్రసాదం స్వీకరించగానే పూర్తి ఆరోగ్యం చేకూరి కళ్ళు బాగా కనిపించాయి.

ఎవరు వెళ్ళినా దత్తు గురించి అడిగే అమ్మ తీరా దత్తు వెళ్ళాక తన గురించి అసలు అడగటం లేదేమిటని అనుకున్నాడు. మనకు నమ్మకం కలిగే వరకూ అమ్మ మన గురించి అడుగుతుంది. ఎలాగైనా ఆమె వెంట మనం పడతామని తెలుసు కాబట్టే తరువాత మన ఊసుకూడా ఎత్తదు.

9వ క్లాసు చదువుతుండగా సాయిబాబాలాగా తలకు గుడ్డ కట్టుకున్న అమ్మ ఫోటో చూచాడు. ఆ రోజుల్లో పొన్నూరు ఎవరు వెళ్ళినా వాళ్ళందర్నీ అమ్మను దర్శించమని చెప్పేవారు దత్తు నాన్నగారు మన్నవ రామ బ్రహ్మంగారు. నాగార్జున సాగర్‌లోని అనుభవాల దృష్ట్యా అమ్మను చూడాలన్న కోరిక దత్తుకు బలీయమైంది.

వాళ్ళ పెద్ద అన్నయ్య, దత్తు అప్పికట్లు వచ్చి రామకృష్ణ అన్నయ్యతో కలిసి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఎదురుగా ఒక స్త్రీమూర్తి వస్తున్నది. రామకృష్ణ అన్నయ్య నమస్కరించాడు. ఆమె రెండడుగులు ముందుకు వేసి దత్తు వాళ్ల అన్నయ్యతో ఏదో చెప్పి "దత్తు కదూ?" అని చెంపమీద చిన్నగా చరిచి ముందుకు వెళ్ళింది. అందరూ ఆమె వెంట మందిరంలోకి వెళ్ళారు. ఆమె "అమ్మా" అని తెలిసి ఆశ్చర్యపోయాడు. హరిదాసుగారు పూజ చేయించారు. అమ్మ చేతిలో ఎవరో పళ్ళు వుంచారు. హారతిచ్చారు. వాటిని అందుకుని సమాధిలోకి వెళ్ళిపోయింది అమ్మ. జనం అనుకునే సమాధి అవస్థ అంటే ఇదేనేమో. క్షణమాత్రాన ఆధ్యాత్మిక స్థితులు రావటం అనూహ్యమనిపించింది.

ఇంతలో ఒక వ్యక్తి వచ్చి క్రింద కూర్చున్నారు. వెంటనే అమ్మలేచి నిలుచుంది. అక్కడ వున్నవారు ఆయనకు కుర్చీవేశారు. ఆయన కుర్చీలో కూర్చున్న తరువాత అమ్మ మంచం మీద కూర్చుంది. ఆయన అమ్మ భర్తగారైన శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారని తెలిసింది. ఎందరెందరో తనకి పూజలు చేస్తున్నా అమ్మ పతివ్రతా ధర్మాన్ని పాటించటం ఆశ్చర్యమనిపించింది.

పొన్నూరు నుండీ ఒకామె బిడ్డతో వచ్చి "త్రిమాతలు నీవేనమ్మా"! నా పిల్లను దీవించమని అడిగింది. త్రిమాతల తత్వమేమైనా అమ్మ ఆమెకు ఏం అనుభవం ఇచ్చిందో? ఎవరికెరుక? అమ్మ వద్ద పెద్దవారు కూడా బిడ్డల మాదిరిలాలన పొందుతారు. అమ్మ "నన్ను పిలిచేవరకూ వెళ్ళకూడదని" అనుకున్నాడు దత్తు. అమ్మ కనురెప్ప కూడా వాల్చకుండా దత్తునే చూస్తోంది. "అని మిషులని దేవతలనంటారు. ఈమెకు ఆ దేవతా లక్షణం వుందనిపించింది. అమ్మ చూస్తోంది కదా! అని దత్తు అలాగే కనురెప్ప వేయకుండా కొద్దిసేపు కంటే చూడలేకపోయాడు". అక్కడ మందిరంలో **40,50** ఫోటోలు వున్నాయి. అన్ని ఫోటోల్లో ఏ రెండు ఫోటోలు కూడా ఒక్క విధంగా లేవు. ఎదురుగుండా ఉన్న అమ్మ తేడాగా వుంది. ఒకే వ్యక్తి ఇన్ని రూపాలుగా రావటం అద్భుతం అనిపించింది. అలాగ ఆ రోజంతా అమ్మ రూప ధ్యానాలతోనే గడిచిపోయింది. "టైము ఎంతైంది? అని అడుగుతూనే" గడియారం బట్టి కాలం నడవదుగా? కాలాన్ని తెలుసుకోవటానికి గడియారం కానీ అన్నది. "కళ్ళు సరిగా లేదని బుజ్జి నాదగ్గరకు వచ్చాడు. ఇప్పుడు ఎలా వుంది?" అని అడిగింది. "నువ్వు ప్రసాదం ఇచ్చావుగా తగ్గి కులాసాగా వున్నాడని" చెప్పాడు. "అదేం లేదు నాన్నా"? అన్నది అమ్మ. అమ్మ దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసింది. ఉదయం నుండీ అమ్మ పిలవలేదని, పిలిస్తే కానీ వెళ్ళకూడదనుకున్న దత్తుకు అప్పుడు సంతృప్తి కలిగింది.

ఆ తరువాత పొన్నూరులో దత్తు స్నేహితులందరితో అమ్మ గురించి చెప్పేవాడు. రెండోమారు దత్తు, స్నేహితుడు రమణను తీసుకొని జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. పెద్దమందిరంలో వందలాది జనసమూహంలో అమ్మకు అఖండ పూజ

జరుగుతున్నది. పెద్ద పెద్ద పూలమాలలు, గులాబీ పూలు, స్వీట్సు, అనేక. రకాల పూలు వున్నాయి. దానితో వీరు తీసుకు వెళ్ళిన చిన్నమాల, రెండు కొబ్బరికాయలను అమ్మకు సమర్పించటానికి జంకు కలిగింది. పూజ జరుగుతున్న సమయంలో అమ్మకు అప్రయత్నంగా అనేక ముద్రలు రావటం జరిగింది. అమ్మ ముఖం తేజస్సుతో వెలిగిపోతోంది. అందరికీ బొట్టు పెట్టి పండుకొరికి తీర్థం ప్రసాదం ఇచ్చింది అమ్మ. వీళ్ళు తీర్ధ ప్రసాదాలు స్వీకరించారు.

ఆ సాయంత్రం వీరిద్దరూ అమ్మ దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు. "నాన్నా నాకోసం ఏమైనా తెచ్చారా"? అని అడుగుతూ ప్రభావతో ఎవరో అన్నారు అన్నది. "తెచ్చామమ్మా" అన్నారు. "మరి ఎందుకు ఇవ్వలేదు తీసుకురమ్మని" చెప్పింది. వెంటనే వీరు వెళ్ళి సంచీలో చూస్తే మాల వాడిపోయి వుంది. అదిపైన పడేసి కొబ్బరికాయలు కొట్టి అమ్మకు ఇచ్చారు. అమ్మ ఎంతో ఇష్టంగా, మురిపెంగా ఆ కొబ్బరితింటూ "ఎంత తియ్యగా వుందో, ఎంత బాగుందో అని తిన్నది. తెచ్చిన వస్తువుని కాక దాని వెనకాల వున్న హృదయాన్ని చూస్తుంది అమ్మ. రెండు నిముషాలు ఆగి "ఇంకేం తెచ్చారు?" అని అడిగింది. చిన్నమాల కదా అని ప్రొద్దున్న పూజలో వేయలేదు, మాలవాడి పోయిందని పారేశామని చెప్పారు. "పెద్దేమిటి? చిన్నేమిట్రా? ఇందాకే వేయద్దు అని 4రోజులు వుండమ"న్నది. "మేము వుండేట్లు ఏమీ తెచ్చుకోలేదమ్మా!" అన్నారు. "నాలుగురోజులుండేటట్లు రమ్మన్నాను కదా!" అన్నది అమ్మ. ఈ మాటు వుండేటట్లుగా వస్తామని చెప్పి తిరుగుప్రయాణమయ్యారు.

రెండవసారి దర్శనంలో మూడు విషయాలు అవగతమయినాయి. మొదటిది అమ్మకు అవలీలగా ఆధ్యాత్మిక ముద్రలు వస్తాయి. మామూలుగా అయితే దానికి ఎంతో సాధన అవసరం. సాధ్యం అయిన అమ్మకు ఇవి అన్నీ సహజంగానే ప్రతిస్పందిస్తాయి. అమ్మకి అంతా ప్రత్యక్షదర్శనమే. వారు తెచ్చిన వాటి గురించి చెప్పకుండానే అమ్మ అడిగింది కదా! ఆ రోజులలో ప్రభావతి అనే వ్యక్తి ఎవరూ అక్కడ లేరు. ఆఖరికి వారు పారేసిన మాల గురించి కూడా ఆరా

తీసింది అమ్మ. ఎక్కడ ఏది జరిగినా చూచే అనంత దృష్టి వున్నదని, కళ్ళు మూసుకు కూర్చున్నా ముద్రలు రావటం, బాహ్య ప్రపంచం గురించి, ఎఱుకలేని గాఢ సుషుప్తిలో తమస్సుతో కూడిన నిద్రావస్థ కాదని, విశ్వ చైతన్య అనుసంధానంతో కూడుకొని, మానవ పరిధులకు అందని నిత్యజాగృత స్థితి అని గ్రహించారు. మూడవది అవ్యాజవాత్సల్యం. మామూలుగా బంధువులు వచ్చినా ఎప్పుడూ వెళ్తారా! అని నిరీక్షించే ఈ రోజులలో నీ నా తరతమ బేధాలు లేకుండా అందరం వాత్సల్యానికే ముగ్ధులై మారుమాటు లేక అమ్మ దగ్గర వుండిపోతాము. రెండవసారి అమ్మ దర్శనం వారి మనోవీచికలలో నయనతార అయింది. స్ఫూర్తిదాయకమూ అయింది. అమ్మ యొక్క అవ్యాజప్రేమకు, వాత్సల్యానికి ఉక్కిరిబిక్కిరి అయి ఆ ప్రేమను పుక్కిటిబంటిగా త్రాగి తిరిగి వెళ్ళారు.

నాగార్జునసాగర్‌కు ఒకమారు దత్తు చిన్న అమ్మమ్మ, దత్తు అన్నయ్య చంద్రుడ్ని రమ్మని వ్రాయమంది. ఉత్తరం అందిన వెంటనే ఆయన పొన్నూరు వచ్చారు. ఏదో తెలియని మానసిక వేదనతో కృంగిపోతున్నాడు. అన్నం తినటం మానేసాడు. అది చూచిన వాళ్ళ నాన్నగారు ఒక్కమారు జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మాయిని చూసి రమ్మని చెప్పారు. దత్తు వాళ్ళ అన్నయ్య జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ దగ్గర గంటల తరబడి కూర్చున్నాడు. అవతలి వారి వ్యధను గుర్తించి ఇంకొకరిని పావుగావాడుకొని వారికి కావలసిన ప్రేమను రాగాలను పంచి ఇస్తుంది అమ్మ.

దత్తు అమ్మతో "నాగార్జునసాగర్‌లో గోడకి బొట్టు పెట్టుకొని దణ్ణం పెట్టుకునే వాడ్ని" అని అన్నాడు. దానికి అమ్మ "ఏమని పెట్టుకునేవాడివి" అంటూ దగ్గరకు తీసుకుంది. దత్తు అన్నయ్య "అది మాత్రం ఎందుకురా?" అని అన్నాడు. వెంటనే అమ్మ "నీస్థితివేరు, వాడి స్థితి వేరు అన్నది. అమ్మది "సరే మంత్రం". ఎవరు ఏది చేస్తామంటే అదే చేయమని, ఎవరి స్థితి నుండీ వారిని చెదరకొట్టక వారి వారి ఇష్టాన్ని బట్టి సాధనా పద్ధతిన నడిపిస్తూనేవారి జీవన కుసుమాన్ని

వికసింపచేస్తుంది. ఎక్కడికక్కడ ప్రతివారితో తదాత్మ్యం చెందే పరిపూర్ణమూర్తి అమ్మ. పుస్తకాలు చదివే మనుష్యులకి, పరిమితమయిన సాధకులకి వ్యత్యాసం ఇదే. అమ్మ ఒక్కమాటగా "నీ స్థితి వేరు, వాడి స్థితి వేరు" అన్నప్పటికీ దాని వెనకాల అద్భుత తత్వగాంభీర్యం వున్నది.

అమ్మ దత్తూ వాళ్ళ అన్నయ్యతో "నీ ముఖంలో కళలేదే, రక్తం పట్టటం, క్షీణించటం ఇది వేరు. మనస్సు సరిగా వుండటం లేదా? అని అమ్మే అడిగింది. "ఉండట్లా? ఏమైనా చెప్పు అక్కయ్య చేస్తాను" అన్నాడు. "చేస్తావా?" అంటూ అలఓకగా ఆలోచిస్తూ, అమ్మ కుడికాలు మడమని ఆయన గుండెల మీదకు పోనిచ్చి కొద్ది నిముషాలు వుంచింది. అమ్మ ఏమీ చెప్పకమునుపే ఆయన "పద్యాలు వ్రాయమంటావా?" అని అడిగాడు. "ఊ వ్రాయి, తీరిక వున్నప్పుడల్లా పద్యాలు వ్రాయి అన్నది అమ్మ. పక్కనే వున్న దత్తు తన మనస్సులో అన్నయ్య అలా అనకపోతే అమ్మ ఏమి చెప్పేదో అనుకున్నాడు. కానీ అమ్మ "తానొకటి తలిస్తే దైవం ఒకటి తలవటం కాదు. దైవం తలిస్తేనే తాను తలుస్తాడు" అంటుంది. కాబట్టి అమ్మ తాను తలచిందే ఆయన వాక్కు ద్వారా బహిర్గతం చేసింది. అమ్మ దగ్గర ప్రసాదం తీసుకుని పొలాలకు అడ్డుపడి నడుస్తున్నారు. అంతకు పూర్వం ఎన్ని మార్లు ప్రయత్నించినా పదిపద్యాల కంటే వ్రాయలేకపోయాడు. కానీ పొలాల్లో నడుస్తుండగానే దత్తు మాట్లాడబోతే "వుండరా పద్యాలు వస్తున్నాయి, మాట్లాడక" అని విసుగ్గా అన్నాడు. అప్పటికప్పుడే పొలంగట్టు మీదే కూర్చుని కొన్ని పద్యాలు వ్రాసాడు.

నాగార్జునసాగర్ వెళ్ళిన కొద్ది రోజుల్లోనే మనిషి బాగా కోలుకున్నాడు. వాళ్ళ నాన్నకు రాసిన ఉత్తరంలో "మానవరూపంలో ఉన్న గాయత్రీ అమ్మ. నన్ను పిల్ల కాలవలో నడుపుతోంది. తరువాత నదిలోకి నది నుండి సముద్రంలోకి నడుపుతుంది", అని వ్రాసారు. ఉన్నతమైన నడక అనెడి పిల్లకాలువలో నడుపుతూ దాని పురోగతి యొక్క వివిధ దశలైన నది, సముద్రం అని ఆయన వ్రాశాడు.

అమ్మ దేనికి తన కర్తృత్వాన్ని ఒప్పుకోదు. కానీ అమ్మ పాద స్పర్శ ప్రసాదం

ఆయన జీవితాన్నే మార్చేసింది. యోగ వాశిష్టంలో "సముద్రాన్ని ఇంకించటం తేలిక కానీ మనస్సుని నిలపటం కష్టం" అన్నారు వ్యాసమహర్షి. అట్లాంటిది స్థిరమైన రూపాంతరం చెందటం అపురూపం కదా! అమ్మ చెప్పినట్లు తీరిక దొరికినప్పుడల్లా పద్యాలు వ్రాయటందో శతకం మించిపోయింది. ఆ తరువాత ఆయన వివాహం జరగటం, గవర్నమెంటు వుద్యోగం రావటం జరిగింది.

అమ్మ దగ్గరకు వెళ్ళినప్పుడు పాలకొల్లు నుంచీ వచ్చిన ఒకరు అమ్మతో మాట్లాడుతున్నారు. అమ్మ మాటలకు పరవశించి "ఓ అమ్మా! ఓ అమ్మా!" అని అరుస్తున్నాడు. ఆయన విచిత్రమైన వ్యక్తి. ఎక్కడో జరిగిన విషయం చెబుతూ ఒక వ్యక్తి ఎవర్నో జుట్టుపట్టుకొని లాగాడని చెప్తూ ఎలా లాగాడో చూపిస్తూ అమ్మ జుట్టు పట్టుకుని లాగి చూపించాడు. అమ్మ ఏమీ అనక నవ్వుతూ వూరుకుంది.

అక్కడే వున్న దత్తుకు చాలా ఆశ్చర్యమనిపించింది. జిల్లెళ్ళమూడి రావాలన్న తపనలో వచ్చాడే కానీ, వచ్చే ముందు అప్పికట్లలో తాను జిల్లెళ్ళమూడి వెళ్తున్నట్లు చెప్పిరాలేదు. అక్కడ వారి అత్తయ్య వుంది. ఆవిడకు ఎలాగైనా కబురు వెళితే బాగుంటుందని అమ్మతో అన్నాడు. అప్పికట్లకు కబురు అందాలి ఎట్లా అన్నది అమ్మ. అధరావరపు శేషగిరిరావుగారు వస్తే ఆయనతో "వీడు ఇంట్లో చెప్పకుండా వచ్చాడు. అప్పికట్లకు కబురు అందాలి" అన్నది ఆయన "నువ్వే చెప్పు" అన్నారు. ఆమాట వాడు ఇందాకే అన్నాడు అన్నది. వీలుంటే దత్తు వెంటనే వెళ్ళాలనే అనుకున్నాడు.

ఓపికలేదు. చీకటి పడుతోంది. అమ్మకు కాఫీ ఇస్తే దత్తుకు త్రాగమని ఇచ్చింది. "ఎందుకమ్మా నాకు వేరే ఇస్తారు కదా? నువ్వు తాగు" అన్నడు. వస్తే మళ్ళీ తాగుదువు కాని ఇప్పుడు ఇది తాగు అన్నది. ఆ కాఫీ తాగిన తరువాత నీర్సమంతా పోయి ఓపిక వచ్చింది. ఆ తరువాత దత్తుకు కాఫీ ఎవరూ ఇవ్వలేదు. అది తెలిసిన పరమాత్మ అయిన అమ్మ అతనికి కాఫీ ఇవ్వలేదు. అది తెలిసిన పరమాత్మ అయిన అమ్మ అతనికి కాఫీ ద్వారా కావలసిన సత్తువను కలుగచేసింది. "పరిగ్రహాన్ మునినాంచ తీర్థానాం పుణ్యతాస్మృతీ" అని ఆర్యోక్తి. మునులు

మహాత్ములు స్వీకరించిన తీర్థానికి పుణ్యత్వం, అఖండ శక్తి వుంటుందని ఆర్యులు వివరించారు. అదేరకంగా అమ్మ ఇచ్చిన కాఫీ దత్తుకు ఆవిధంగా పనిచేసింది. అప్పికట్లకు వెళ్తున్నా ఎవరేమంటారో అన్న భయంతోనే ఇంటికి వెళ్ళాడు. ఏరా జిల్లెళ్ళమూడి వెళ్ళావా? నిన్న సాయంత్రం దాకా చూసి జిల్లెళ్ళమూడి వెళ్ళివుంటావనుకున్నాం అనటంతో మాటపడకుండా సరిపోయిందనుకున్నాడు. సరిగా దత్తు అమ్మకు చెప్పిన సమయం, వీళ్ళ మనస్సుకు తట్టిన సమయం ఒకటే. కాల స్వరూపిణి అయిన అమ్మకు ఇవి అత్యల్పం కదా! మాటలతో పని లేకుండా ఆలోచనా తరంగాల ద్వారా వారికి తెలియచేసింది. ఆది శంకరాచార్యులు నది ఒడ్డున గురువుగారి కౌపీనం పిండుతున్న తోటమలకాచార్యునకు తన ఆలోచన ద్వారా విద్యాదానం చేసారు. అదే విధంగా అరవిందులు "నిక్కమైన ఆధ్యాత్మిక శక్తికి భౌతికమయిన ఉపకరణాలు, భౌతిక వ్యవస్థతో పని లేకుండా జరుగుతుందని" అంటారు.

ఆరోజుల్లో పొన్నూరులో అమ్మ ఫోటో ముందు కూర్చుని మనస్సులో దత్తు అనుకునే విషయాలను జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు యధాతధంగా మరొకరితో అమ్మ చెప్పేది. తన స్నేహితులతో అమ్మ గురించి చెబుతుండేవాడు. జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు "నీ స్నేహితులతో నా గురించి చెబుతున్నావా?" అని అమ్మ అడిగేది. దేశకాలాతీతంగా మనం అనుకునేవి, అంతరంగంలో వున్న విషయాలను సహితం తానే అయి అమ్మ తెలియచేసేది. సర్వసాధారణంగా పొన్నూరు నుంచీ జిల్లెళ్ళమూడి నడిచి వెళ్ళేవాడు.

నాగార్జునసాగర్ వెళ్ళిన తరువాత దత్తు ఒక్కగానొక్క అక్కయ్య అమ్మలో లీనమయింది. ఆమె మరణించటానికి మూడు నెలలు ముందుగా పొన్నూరు ఆసుపత్రిలో చేర్పించారు. ఆవిడ వుండగా ఆవిడ అనుభవాన్ని ఈ క్రింది విధంగా తెలియచేసింది. "నేను మొదటి నుండీ బలహీనురాలను గర్భవతిని అయిన తరువాత సీరియస్ అవటంతో పొన్నూరు ఆసుపత్రిలో చేర్పించారు. అమ్మ నాదగ్గర వుండటంతో నాన్నే వంట చేయాల్సివచ్చింది. మా అమ్మమ్మ మంచంలో వున్నది. ఈ సమయంలో మా అత్త అప్పికట్ల నుండీ జిల్లెళ్ళమూడి 4 రోజులు

వుందామని వెళ్ళింది. కాని అమ్మ "అన్నయ్య ఒక్కడూ పొన్నూరులో ఇబ్బంది పడ్తున్నాడు. నీవు అక్కడికి వెళ్ళి సాయం చేయమని పళ్ళు, కుంకుమ ప్రసాదం ఇచ్చి పంపింది. అమ్మ ప్రసాదం తిన్న తరువాత ప్రసవించే రోజున విపరీతంగా బాధపడ్డాను. మానాన్న ఇంటినుంచీ కావలసినవి తీసుకువస్తుంటే దోవపొడుగున అమ్మ తనతోనడుస్తున్న అనుభూతి కలిగింది. ఈలోగా నాకు తట్టుకోలేని బాధ కలిగింది. డాక్టర్లు చూచి" కడుపులో బిడ్డ పోయిందని పెద్ద ప్రాణానికే ముప్పు అని చెప్పారు. అందరిపాలిట అమ్మవై నాపాలిటకాళీవైనావా దయలేదా? అని తీవ్రంగా నిరసించాను. వెంటనే మంచం కోడు మీద నిటారుగా తోకమీద నిలబడిన పాము కనపడి అది వెలుగుగా మారినాలోకి ప్రవేసించిన అనుభూతి కలిగింది. వెనువెంటనే కడుపులో చనిపోయిన బిడ్డను బయటకు నెట్టినట్లయింది. దానితో బాధ నివారణ అయింది. డాక్టర్లకు అంతుచిక్కలేదు. ఇది ఎలా జరిగింది ఆపరేషన్ చేస్తే కానీలోపలి బిడ్డను తీయలేము, ఆపరేషన్ చేస్తే పెద్ద ప్రాణానికి ప్రమాదం అని కదా! అని ఏమి చేయాలో పాలు పోనిస్థితిలో ఉన్నప్పుడు మహిమాన్వితమయిన ఈ సంగటన జరిగింది వారంతా ఆశ్యర్యచకితులయ్యారు. మానాన్న పక్కన అమ్మ నడుస్తున్న అనుభూతి కలగడం, తరువాత నన్ను కాపాడటం జరిగిందని" తెలియచేసింది.

ఆ తరువాత ఆమెను తనలో విలీనం చేసుకుంది. ఇంట్లో ఆరుగురి మొగపిల్లల్లో ఒక్కతే ఆడపిల్ల అవటంతో ఇంటిల్లిపాదికి ఆపిల్ల అంటే తగని ఆపేక్ష. ఆవిడ మరణం అందరినీ కృంగదీసింది. దానిలో దత్తు ఇంక అమ్మ దగ్గరకు వెళ్ళ కూడదనుకున్నాడు. తెనాలిలో దత్తు చదువుకుంటున్నాడు. ఒకరోజు "ఓరేయ్ దత్తూ రారా" అని ఆలాపనగా వినిపించింది. దానితో వాళ్ళనాన్నతో చెప్పి జిల్లెళ్ళమూడికి బయలు దేరాడు.

అక్కడ అమ్మ దత్తువాళ్ళ అక్కయ్య గురించి చెపుతూ "రామాయణం చదవటమే కాదు అలా ఆచరించింది" అని ప్రసంసించింది. బయలు దేరేముందు దత్తు వాళ్ళనాన్న "అమ్మాయిని అడిగిపటికబెల్లం తీసుకురమ్మన్నారు. తిరిగి వెళ్తున్నప్పుడు "నాన్న నిన్ను అడిగి పటికబెల్లం తీసుకురమ్మన్నారని" చెప్పాడు. ప్రక్కనే వున్న రుక్మిణక్కయ్యతోనూ, వరలక్ష్మితో పటిక బెల్ల ఇవ్వమంది అమ్మ.

వాళ్ళు అంతా వెదికి "పటిక బెల్లం లేదమ్మా" అన్నారు. పళ్ళు కుంకుమ ఇచ్చి అమ్మ "ఊ వెళ్ళు" అన్నది. "నాన్న అడక్క అడక్క అడిగాడు. అయ్యో లేదే! అనుకున్నాడు దత్తు ఇంటికి వెళ్ళి ఆయనకు అమ్మ ఇచ్చిన ప్రసాదం ఇచ్చాడు. పటిక బెల్లం లేదని అంటుండగానే కుంకుమ పొట్లం విప్పారు. అందులో పటిక బెల్లం వుంది. "ఉందిగా" అని వాళ్ళ నాన్నగారు ఆనందంతో నవ్వారు. దత్తుకు ఆశ్చర్యం వేసింది. కుంకుమే పటిక బెల్లంగా మారిందా? అన్నట్లు లేత ఎఱుపులో వుంది ఆపటిక బెల్లం, అణు సముదాయాల మార్పు క్షణంలో సంకల్పం వల్ల కలిగింది ఆది ఆధ్యాత్మిక వేత్తలకు మామూలు కావచ్చు. కానీ పదార్ధ విజ్ఞాన శాస్త్రం క్రమ పరిణామానికి అందేది కాదు. పనికట్టుకుని మహిమగాకాక బాబాయి ఆర్తిగా అడిగిన కోరికను తీర్చింది. ఇటువంటివి అమ్మ జీవితలో సహజంగా జరిగేవి ఎన్నెన్నో. అందులో మనకు దొరికేవి ఏవో కొన్నే!

అమ్మ చాలా మంది ఆడవారి మధ్య కూర్చుని వుంది. అమ్మ దగ్గరకు వెళ్ళాలన్న తీవ్రమైన కోరిక దత్తుకు కలిగింది. కాలుగాలిన పిల్లిలా అటూఇటూ తిరుగుతున్నాడు. అమ్మ దత్తును ఒళ్ళోకి తీసుకుంటూ ఆడవాళ్ళ మధ్య వున్న అమ్మ దగ్గరకు ఎలా వెళ్ళాలా! అని చూస్తున్నావా? "నాన్నా! ఎక్కడ వున్నా ఏరికోరి తీసుకుంటాను నాకు కావలసిన వారిని" అని తన కుడిచేతి బ్రొటన వేలుతో చూపుడు వేలుని నొక్కి చూపిస్తూ నొక్కి నొక్కి అన్నది.

సరిగా ఇదే విషయాన్ని షిర్డీబాబా "పక్షి కాలుకు దారం కట్టి దగ్గరకు లాగుకున్నట్లుగా మిమ్మల్ని దగ్గరకు తీసుకుంటానని" అంటారు. రమణమహర్షి "సూర్యుని తేజస్సులాగా, చంద్రుని వెన్నెలలాగా మహాత్ముల దృష్టి అందరి మీద పడదు. వాళ్ళు ఎవర్ని కావాలనుకుంటారో వాళ్ళేవారి చెంతకు చేరుతారని" అంటారు.

చీకటిలో మన్నవకు నడిచి వెళ్తుండగా కొత్తగా రోడ్డువేస్తున్నారు. కొండరాళ్ళు, గులకరాళ్ళుతో దోవ కనిపించక ఎలా వెళ్ళాలా అని మదన పడ్తున్నాడు. ఇంతలో మంచి వెలుతురు రోడ్డు మీద పడింది. వెనకాల సైకిల్ తొక్కుతున్న చప్పుడు, తిరిగి చూస్తే ఎవ్వరూ లేరు. కానీ మన్నవ వెళ్ళే వరకూ

ఆ వెలుగు, ఆ చప్పుడు వినిపిస్తూనే వుంది. ఇదంతా అమ్మ ఇచ్చిన అనుభూతి ఆ చీకటిలో త్రోవ చూపించిన కరుణామయి అమ్మ.

ఒకసారి అప్పికట్ల వెళ్ళి రామకృష్ణన్నయ్య వెళ్ళి వాళ్ళ అమ్మతో చెప్పమని కొన్ని విషయాలు చెప్పింది. దత్తు వెళ్ళి మాట్లాడి వచ్చాక టేప్ రికార్డర్‌లా దత్తు మాట్లాడిన మాటలువారు ఇచ్చిన సమాధానాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది అమ్మ. "ప్రతిబోధవిందతి" ప్రతి విషయం తెలిసినదని చెప్పింది. సర్వసాక్షి, సర్వజ్ఞత కలిగిన అమ్మకు తెలియంది వుండదు కదా!

గుంటూరు వెళ్తూ అమ్మ దగ్గర ప్రసాదం తీసుకోవటానికి దత్తు వెళ్ళాడు. పెదనందిపాడు వెళ్ళి వీరాస్వామికి ప్రసాదం ఇవ్వమని ఇచ్చింది. తీరా నందిపాడు వెళ్ళాక గుంటూరు ఆసుపత్రిలో చేర్చారని తెలిసి అక్కడికి వెళ్ళి ఆయన గది వైపు తిరిగాడు. ఒక ముత్తైదువ ఆయనను కుడిచేతితో నిమురుతోంది. గాఢ నిద్రలో వున్నా ఆయనకు అమ్మ చేతి స్పర్శలాగా తోచి లేచి చూశారు. దత్తుకు ఆవిడ ముఖం కనిపించలేదు. వీరాస్వామి గారికి అమ్మ దర్శనమిచ్చి ఎదురుగుండా ఉన్న గుమ్మంలో నుంచీ బయటకు వెళ్ళింది. అదే గుమ్మంలోంచి వీరాస్వామి గారి భార్య వచ్చింది. ఆమెకు అమ్మ కనిపించలేదు. ఆయన "అమ్మ వచ్చింది. నన్ను ముట్టుకుంది. నాకు జబ్బు తగ్గిపోతుందని" ఎంతో నమ్మకంగా చెప్పారు. ఆవిడ వెళ్ళటం సరిగా అదే సమయానికి దత్తు వెళ్ళి ఎదురుగా నుంచోవటం జరిగించి. ఈయన ఇలా అంటున్నారేమిటి, ఆయన భార్యకు ఎవరూ కనిపించలేదంటుందని" అనుకున్నాడు. అమ్మ ఇచ్చిన ప్రసాదం ఆయనకు ఇచ్చాడు. ఆ తరువాత ఆయన ఆరోగ్యవంతులైనారు. అమ్మ రోగ పర్వత దంభోళి కదా!

పూజ జరిగే సమయంలో అమ్మ అనేక రంగులలో కనపడేది. అనేక ముద్రలు వేసేది. ఎక్కడో దిగంతాలకు చూస్తునట్లుగా, ఈ పూజలతో తనకు సంబంధం లేనట్లుగా కనిపించేది. ఆ సమయంలో ఎవరైనా దగ్గర నుంచీ పలిచినా, ఎంతో దూరాన్నించి పిలుపువిని పిస్తే ఎలా ప్రతిస్పందిస్తారో అలాగా ప్రతి స్పందించినట్లుగా కనపడేది.

అమ్మకు ఒళ్ళు పడుతుంటే ఒక్కో అప్పుడు కొండరాయిలాగా గట్టిగా వుండేది. మరొకప్పుడు దూదిపింజెంలా మెత్తగా వుండేది, గురక పెడ్తూ నిద్రపోతున్నట్లు వుండేది. తీరా ఎవరైనా వచ్చి నమస్కరించుకొని వెళ్ళిన అరగంటకో, గంటకో శేషయ్య వచ్చి వెళ్ళాడా? రవి వచ్చి వెళ్ళాడా? అని అడిగేది. "అమ్మా! నీ శరీరం ఇనపరాడ్‌లాగా, కొండరాయిలాగా వుందమ్మా అంటే అన్నీ నాలోనే ఉన్నాయిగా నాన్నా!" అనేది. ఈ విధంగా ప్రకృతే తానై నిలచేది.

ఉదయం నుండీ ఒళ్ళు కంపిస్తోందని అన్నది. 3,4 గంటల మధ్య టైమ్ ఎంత అయిందో అనుకుంది. సరిగా ఆసమయంలో బ్రహ్మాండమైన భూకంపం వచ్చిందని తెలిసింది. అమ్మకు ఆరోగ్యం సరిగా లేక సీరియస్ అయింది. అప్పటికప్పుడు కారుమబ్బులు కమ్ముకు వచ్చి ప్రచండ వేగంతో గాలి వీచింది. దానితో చెట్లు ఊగిపోయాయి. అమ్మ గదిలో వున్న డా॥ ఇనజకు తూర్పుదిక్కున ఉన్న తాటిచెట్టు క్రిందకీ మీదకు పడుతూ లేస్తూ కనిపించింది. అమ్మ కుదుటపడిన తరువాత ప్రకృతి శాంతించింది. మహాప్రళయ స్వరూపిణినీ తానే అని తెలియచేసింది అమ్మ. ఈ విధమైన సృష్టిస్పందనే స్వీయ స్పందనగా, స్వీయస్పందనే సృష్టిస్పందనగా విరాజిల్లిన తత్వాన్ని దత్తు అమ్మలో దర్శించాడు.

నారు తీసుకు రావటానికి బండికట్టుకుని స్వర్ణకోటేశ్వరరావు దగ్గరకు వెళ్ళాడు. అతను కనిపించలేదు. ఈలోగా దత్తు ప్రమేయం లేకుండానే ఆ బండీ మెట్ట చేలోకి వెళ్లింది. వచ్చిన పని అవ్వటం లేదన్న తపనతో "అమ్మా! కోటేశ్వరరావుని చూపించ లేకపోతే ఖాళీ బండితో తిరిగి వస్తానని, నారు లేదు. నాటు లేదు" అనుకున్నాడు. బండీ దానంతటదే వెనక్కు తిరిగింది. ఇదేదో అమ్మ ఇచ్చిన సంకేతమే అనుకుని వెనక్కి వెడితే రోడ్డు మీద కోటేశ్వరరావు కూర్చుని వున్నాడు. "నన్ను రమ్మని నీవు ఇక్కడ కూర్చున్నావా?" అని అతని మీద అరిచాడు. అతను తిరిగి కేకలు వేశాడు.

ఇంతలో ఒక ముసలమ్మ "అయ్యా! నేను బండి ఎక్కుతానంటూ ఎక్కింది" నువ్వు ఎక్కడుంటావని అడిగాడు. "ఆ బిల్డింగ్‌లకాడ" అన్నది. మళ్ళీ వీళ్ళు

అరుచుకుంటుంటే ఆ ముసలమ్మ "ఊరుకోండయ్యా! ఎందుకు అలా అరుచుకుంటారు?" అన్నది ఆమాట వారి మీద మంత్రం వేసినట్లే ప్రశాంతంగా వున్నారు.

కొంతదూరం వెళ్ళాక "ఈడ బండాపండి" అని కుడివైపున వున్న చిన్న కాలవ కట్ట మీద కట్టిపోటు వేసుకుంటూ వెళ్ళింది. అలా కొంతదూరం వెళ్ళి మాయమైంది. అప్పుడు కానీ అర్థం కాలేదు. అది అమ్మ చేసిన తమాషా అని, "శబ్దజాలమయం చరాచర జంతుదేహ నివాసినమే" అని. శంకర భగవత్పాదులు గురుపాదుకాస్తవంలో అంటారు. అదే విధంగా బండికి కట్టిన దున్న వెనక్కి తిరగటం జరిగింది. జంతుదేహాలలో నివసించేది చర అచరాల్లో వుండేది ఆ దివ్యశక్తే అని అమ్మ ఈ సంఘటన ద్వారా తెలియ చేసింది అన్ని సంకల్పాలు అమ్మవే కదా! కోపంగా అరుచుకుంటున్న వాళ్ళను శాంతపరచింది అమ్మ.

తిరిగి వచ్చిన తరువాత స్నానం చేసి అన్నంతిని ఆపక్కగదిలో ఉన్న చెక్కలను ఇటు మార్చమంది అమ్మ, **3** రోజుల నుంచీ ఇసుకలారీలు, పొట్టులారీలు తోలి, నారుమడికి వెళ్ళి వచ్చాడు, బాగా అలిసిపోయి, సొమ్మసిల్లి వున్నాడు. అందువల్ల "నేనేమీ చేయను గుండిగడు నీళ్ళు స్నానం చేసి హాయిగా భోజనం చేసి పడుకుంటాను" అని అన్నాడు.

"వెనక మంత్రాయి వీడు చేసే పనులన్నీ చేసేవాడు. దత్తు చేయనంటున్నాడు "అని బాలతో చెప్పింది అమ్మ. స్నానం చేసి వస్తుండగా గుండారం సోదరులు తంగిరాల రాధ, శాస్త్రి మొదలగువారు చెక్కలు మోస్తున్నారు. వాళ్ళు **4** చెక్కలు మోస్తుంటే దత్తు **6,8** చెక్కలు బుజాన పెట్టుకొని మోసాడు. అమ్మ వచ్చి చూసి నవ్వి వెళ్ళింది. తరువాత కానీ దత్తుకు అర్ధం కాలేదు. "ఇదేమిటి? ఇలా మోసాను? అమ్మతో ఏమీ చెయ్యనన్నాను, నామాటకాక తన మాటనెగ్గించుకుంది". అమ్మలో దివ్య నియంతృత్వం వుంది. రావణాసురుడు, హిరణ్యకశిపుడు, హిట్లర్, ముస్సోలినీల నియంతృత్వం కాదు. దత్తుకు ఎనలేని ఓపికను, శక్తిని, మానసిక ఉల్లాసాన్ని ఇచ్చి కులాసా కబుర్లతో ఆనందంగా

జరిపించిన సంఘటన, దివ్యమూర్తుల నియంతృత్వానికి, క్రూరలకు కల వ్యత్యాసం ఇదే అనిపించింది.

"స్థూల, సూక్ష్మ, సకారణాంతర ఖేలనం పరిపాలనమ్" అంటారు, ఆదిశంకరులు, స్థూలమైన దేహాన్ని, సూక్ష్మమైన మనస్సుని, కారణమైన బుద్ధిని సర్వాన్ని ఆడించేది, పరిపాలించేది ఆదిశక్తి అన్న విధంగానే, అమ్మ సర్వం తానే అయి నడిపించేది. "యంత్రారూఢాని మాయయా" యంత్రాలను నడిపేవాడు, యంత్రాలను నడిపినట్లు నేను నడుపుతాను" అని గీతాచార్యుడు చెప్పినట్లు అమ్మ అలవోకగా చేయించే సంఘటనలే ఇటువంటివి. ఈ విధంగా ఎన్నో సంఘటనల ద్వారా ఇంతకు ముందు విన్నవి చదివినవి అమ్మ చెంత సాక్షాత్కరించి మహోజ్వలతత్వానికి ప్రతిరూపమని దత్తుకు అవగతమయింది.

అన్నపూర్ణ ఆదరణ, లక్ష్మీదేవి వదాన్యత కనపరిచే అమ్మ గహనాతి గహనమైన వేదాంత పరిభాషను గోరుముద్దలుగా అందించేది. మంత్రోచ్ఛారణతో జపము, పాటలతో భజన, మౌనంతో ధ్యానం, అభ్యాసంతో యోగం, సేవా పాతివ్రత్యాలను నిత్యానుసంధానంగా ఆమోదించే అమ్మ మనకు మార్గదర్శిని కావటం మనం చేసుకున్న పూర్వజన్మ సుకృతమే.

పోతుకూచి విద్యాసాగర్, రాజ్యలక్ష్మిల కుమారుడు పోతుకూచి రవి. పోతుకూచి రవి జీవన దళం అమ్మ చరణాల చెంతకు చేరే సరికి అతని వయస్సు 16 సం॥ ఆ తరువాత అతను ఆరు సంవత్సరాలు మాత్రమే అమ్మ సన్నిధిలో ఉన్నాడు. అతని వ్యక్తిత్వంలోని ప్రత్యేకతే ఆ ఆవరణలో అతని లేని లోటు పెద్ద అగడ్తనే సృష్టించింది. రవి మెట్రిక్ చదువుతున్నప్పుడు అమ్మను గురించి విన్నాడు. అతని తండ్రి అమ్మను దర్శించి తాను పొందిన అనుభూతిని వర్ణించి చెప్పాడు. అది విని తనకూ అటువంటి అనుభూతి కలుగుతుందా అని అనుకున్నాడు. ఆ రాత్రే అమ్మ కలలో సాక్షాత్కరించింది. అతను స్వప్నంలో సర్వాలంకార భూషితయై, అర్ధనిమీలిత నేత్రాలతో, సింహాసనాసీనమైన అమ్మను చూచాడు. జిల్లెళ్ళమూడిలో నిర్మలమైన చిరునవ్వుతో, నిరాడంబరమైన అలంకరణతో

నిండుగా ఉన్న అమ్మను దర్శించాడు. కానీ రెండు రూపాలలో చూసింది ఒకే తేజస్సును.

రవి ఆశ్చర్యపడకపోగా అనిర్వచనీయమైన ఆనందాబ్ధిలో మునిగిపోయాడు. అమ్మ సుందరమైన, సుకోమలమైన పాదాలను చూసి ముగ్ధుడై ఆ సన్నిధిలో ఉండే అవకాశం లభ్యం కావాలనుకున్నాడు. అతని భావం గ్రహించినట్లుగా అమ్మ అతని శిరస్సును ఆప్యాయంగా నిమురుతూ ఒడిలోకి తీసుకుంది. మనసా, వాచా, కర్మణా, అమ్మ సన్నిధిని కోరుకున్నాడు కాబట్టి అతని కోరిక నెరవేరింది. అతని మనస్సునే ఒక కర్పూర కళిక గావించి తనకై ఆత్మార్పణ చేయగల శక్తిని అమ్మ రవికిచ్చింది.

రోగం ఒకటి, ఔషధం ఒకటి ఉపయోగించటం వల్ల బాల్యావస్థలోనే హృద్రోగ పీడితుడయ్యాడు రవి. మృత్యువాత పడబోయిన తనని ఈ మందులు కాక అమ్మ వాత్సల్యం, ఆ చల్లని స్పర్శ, ఆ తీర్థ కుంకుమలే తనని బ్రతికించాయని అతని విశ్వాసం. 1962లో అమ్మ మద్రాసు వెళ్ళింది. అమ్మ లేకుండా జిల్లెళ్ళమూడి "రాముడు లేని అయోధ్యలా ఉందని" రవి తన బాధను వ్యక్తం చేసాడు.

ఆవరణలోని అన్ని పనుల్లో తానై ఉండేవాడు. ఏ పని చేసినా ఉత్సాహంతోనే కాక శ్రద్ధతో, ముందు చూపుతో చేసేవాడు. తన దినచర్యను డైరీలో రాసుకునేవాడు. రవిలోని ఆ కార్యదీక్ష, కర్తవ్య పాలన అమ్మకు ఎంతో ఇష్టం. అతని ఆలోచనలు ఎప్పుడూ ఆ ఆవరణ, దాని ప్రగతి చుట్టూనే పరిభ్రమిస్తుండేవి. ఆవరణలో ఏపని చేసినా అది అమ్మను అర్చించడమేనని తాను మనస్ఫూర్తిగా చేస్తూ అందరూ అలా చేయాలని కొరుకుండేవాడు.

పోతుకూచి విద్యాసాగరు, రాజ్యలక్ష్మి అక్కయ్య వారి పిల్లలందరూ అమ్మ యందు ఎనలేని భక్తి విశ్వాసాలు కలవారు. ప్రతి పనిలో రాజ్యలక్ష్మక్కయ్య, వారి పిల్లలు రమణ, హైమ, సావిత్రి, ఝాన్సీ ఆడ పని మగ పని అని తేడా లేకుండా సిమెంటు ఇటుకలు అందించడం దగ్గర్నుంచి వ్యవసాయ పనులలో కూడా చేదోడు వాదోడుగా వుండేవారు. మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలలో చదువుకుని ఝాన్సీ ఆ కళాశాలలోనే రీడర్‌గా పనిచేయటం విశేషం. తన మృదు మధుర గానంతో అమ్మ పాటలను ఆలాపిస్తూ శ్రోత ను మైమరపింప చేస్తోంది.

వారి పెద్దమ్మాయి డాక్టరు జోత్స్న. వృత్తి రీత్యా వైద్యం చేస్తున్న డాక్టరు. ఝాన్సీ సంస్కృతబాషలో పి.హెచ్‌డి. చేసి డాక్టరేటు సంపాదించుకుంది. తృష్ణాజీవితంలో మౌనవేదన పడి జీవితావసానం చేరిన ప్రాణి, మానవ, భక్తుల ప్రాణ ప్రయాణ కాలంలో హస్తస్పర్శ, తులసీ తీర్థం ప్రసాదించి తృప్తి గొలిపేది అమ్మ దేవేశ్వరి. పోతుకూరి రవి ప్రాణోత్క్రమణ సమయంలో కూడా మాతృదేవి చరణరేణువులో తాదాత్మ్యం పొంది తరించాడు. భగవద్గీతలో కృష్ణ భగవానుడు "అహమాదిశ్చ్య మద్యంచ భూతానామన్త ఏవచ" అని ఉద్ఘాటించాడు. అది మధ్యాంతాలు నేనే అని నిర్వచించాడు. "అంఆ" అన్న పదానికి అమ్మ ఇచ్చిన నిర్వచనం పై గీతా వాక్యంతో సరిపోతుంది. "అంఆ" అన్న పదానికి అంతమైనది, ఆది అయినదని అమ్మ అర్థం చెప్పింది. నాటి లీలామానుష వేషధారి అయిన శ్రీకృష్ణుడే నేడు మాతృమూర్తిగా విలసిల్లుతోంది.

1963లో జిల్లెళ్ళమూడి వరద చేత ద్వీపమే అయింది. వరద తగ్గు ముఖం పట్టాక పశువులను తోలుకెళ్లారు. పశువులను తిరిగి తోలుకొస్తూ కాలువలో మునిగిపోయిన రవి ఆరు గజాల లోతుకు వెళ్ళాక చేతికి తగిలిన మట్టి పుట్టను గట్టిగా పట్టుకుని అమ్మ నామస్మరణ చేయసాగాడు. స్పృహకోల్పోకుండా, నీళ్ళు తాగకుండా సుమారు 20 ని॥లు ఉన్నాడు. ఇంతలో అతని స్నేహితుడు వచ్చి ఒడ్డుకు తీసుకువచ్చాడు.

రవిజల ప్రమాదంలో చిక్కుకున్నపుడు అమ్మ "నాకు ఊపిరి ఆడటం లేదంటూ," రవి సురక్షితంగా నీటి బయటకు వచ్చే వరకు ఎంతో బాధను అనుభవించింది. మరొక సారి ఒక సోదరుడు అమ్మను చూడలేకపోతున్నాను అన్న వ్యధతో ఆత్మహత్య చేసుకోవాలని కరెంట్ షాక్‌ను ఆధారం చేకున్నాడు. ఉన్నట్లుండి జిల్లెళ్ళమూడిలో అమ్మ కరెంట్ షాక్ తగిలినట్టు చెయ్యి విదిలించింది. సక్కుబాయిని అత్తగారు దండిస్తే ఆ వాతలను శ్రీకృష్ణుడు స్వీకరించినట్లు చరిత్ర మనకు తెలియజేస్తోంది. అదే విధంగా అత్యవసర పని మీద అధరావరపు శేషగిరిరావు అన్నయ్య ఊరికి వెళ్ళాల్సి వచ్చింది. తీవ్రంగా జ్వరం ఉన్నా పని

ఆగిపోతుందన్న భయంతో స్నానం చేసి ప్రయాణానికి సిద్ధమైనప్పుడు చాలా కులాసాగా కనిపించాడు. కానీ ఆ రెండు రోజులూ అమ్మ విపరీతమైన జర్వంతో బాధపడ్డది.

అమ్మ రూపదర్శనం కంటే ఆ స్పర్శలోని హాయిని అతను ఎక్కడున్నా అనుభవించువాడు. ఏ రోజైనా గుండెనొప్పి, ఆయాసంతో బాధపడుతుంటే అమ్మ స్పర్శలోని సుఖానుభూతి వలన బాధ తగ్గిపోయేది. నిద్రపట్టని రాత్రులలో అమ్మ తియ్యని పలకరింపు అతనికి జోలపాట పాడేది. పొలానికి కావలి అవసరమైన రోజుల్లో ఎంతటి చీకటి రాత్రి అయిన వెళ్ళటానికి వెనుకంజ వేసేవాడుకాదు రవి. దారిలో ఎదురయ్యే ఒక సన్నని వెలుగు ద్వారా సురక్షితంగా పొలం చేరేవాడు.

1966 జూన్ 20న మాతృశ్రీ ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభించబడింది. అందులో పనిచేయటానికి రవి వెళ్ళవలసి వచ్చింది. తాను సాకుతున్న పశువులను వదిలి వెళ్ళలేక అంతులేని బాధకు గురి అయ్యాడు. ఏ పనినైనా, ఎక్కడైనా సరే ఎంతో బాధ్యతగా చేసేవాడు. ప్రెస్‌లో పగలంతా కష్టపడినా రాత్రిపూట అమ్మ వెళ్ళి సేదతీర్చేది. రవి మరణించటానికి నాలుగురోజుల ముందు రెండుఒడుగులు, రెండు వివాహాలు జరిగాయి. వివాహ వేదిక మీదకు వచ్చేముందు రవి కోరినట్లు తెల్లపట్టుచీర, నల్లని రవిక ధరించి రవి దగ్గర కూర్చుంది.

అమ్మ కొందరిని కమనీయ కళావేదిక మీదకు పంపి ప్రపంచమంటే ఏమిటో తెలుసుకోమని చెపుతుంది. ఒక చేతితో మృత్యువును ముద్దిడికొని, మరొక చేతితో జీవితాన్ని జిలిబిలి పలుకులతో పిలుస్తుంది. అది అమ్మ ఆట. తనలోనుంచి వచ్చిన జీవాలను కొంచెం ముందు వెనుకలుగా తనలోనే చేర్చుకోక తప్పదు కదా! అమ్మ సన్నిధిలో ఉండి విషాదాభ్యుదయాలను నిర్మల తార్కిక దృష్టితో పరిశీలిస్తే "దుఃఖేష్వనుద్విగ్నమనా? సుఖేషు విగతస్పృహః" అన్న గీతా వాక్యానికి ప్రత్యక్ష నిదర్శనమే అవుతుంది.

చివరి నాలుగు రోజుల్లో ఎక్కువ కాలం రవి దగ్గరే గడిపింది అమ్మ. సూర్యాస్తమయ వేళలో అమ్మ ఒడిలోనే ఇహలోక బంధాల నుండి విముక్తుడయ్యాడు

రవి. అమ్మే స్వయంగా కర్పూరం హారతితో రవి చితికి నిప్పు అంటించింది. రవి జన్మ చరితార్థమయింది. అతని తనువు, మనస్సు ధన్యతచెందాయి.

అమ్మకు ఆరోగ్యం సరిగా లేనప్పుడు ఎక్స్‌రేలు, టెస్టులు గుంటూరులో చేయిస్తున్నారు. డా॥ ఆచంట కేశంరావు గారు, డా॥ లక్ష్మణరావుగారు, చీరాల నుంచి వచ్చిన డా॥ శ్రీధర్‌రావుగారు అమ్మ దగ్గర కూర్చున్నారు. కేశవరావు గారు అమ్మతో "మీ జబ్బులన్నీ మీవి కాదనీ, మీ బిడ్డలవి మీరు అనుభవిస్తుంటారనీ అంటారు. నిజమేనా అమ్మ!" అని అడిగారు. దానికి అమ్మ అది అంతా అబద్ధం నాన్నా! అన్నది. పోనీ మీరు కాకపోతే మరెవరైనా అలా తీసుకోగలరా? అన్నారు. "ఏమైనా నేను మాత్రం తీసుకోలేను" అన్నది అమ్మ. అయితే మా అనుభవాలు అబద్ధమంటారా అన్నారు. చీరాల వెళ్ళినపుడు ఎంతోకాలంగా కడుపునొప్పితో బాధ పడుతున్న వారి శ్రీమతి నొప్పిని తగ్గించారని, అనారోగ్యంగా ఉన్న ఆమెను అనునయిస్తున్నట్లు ఆమె పక్కలో కూర్చుని పొట్టపై అమ్మ చేత్తో రాసిన తరువాత మళ్ళీ నొప్పి రాలేదు అని శ్రీధర్ గారు చెప్పారు. డాక్టర్లు వాళ్ళ టెస్టులు పూర్తిచేసిన తరువాత 24 గంటలలో 20 గంటలు అమ్మ విశ్రాంతి తీసుకోవాలని చెప్పారు. కానీ అమ్మ ఒక్క గంట కూడా విశ్రాంతి తీసుకోలేదు. అమ్మకూ అమ్మే తీసుకోవాలి కాని వేరెవ్వరనూ అమ్మకు విశ్రాంతి ఇవ్వలేరనిపించింది. సాకి నాగేశ్వరరావుకు కలరా వచ్చింది. తలా నాలుగు రూపాయలు పోగుచేసి డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళటానికి ముందు అమ్మ దగ్గరకు వెళ్ళి అమ్మా! వీడికి విరోచనాలు వాంతులు అవుతున్నాయి అని చెప్పారు. "ముద్ద కర్పూరం ఇచ్చి వెయ్యమంది" అమ్మ. అది వేసిన వెంటనే విరోచనాలు, డోకులు తగ్గిపోయాయి.

గండికోట శ్రీరాములు అమ్మ దగ్గర కూర్చొని ఉండగా అమ్మ "ప్రాణయామం చేసినా వెలుగు అందీ అందకుండా ఉందిరా, అందిన రోజు ~~ఈ~~ ఊరు తిరుపతికంటే ఎక్కువగా తయారవుతుందని" చెప్పింది.

సత్తిరాజు శేషగిరిరావు వెళ్ళేటప్పటికి అమ్మ స్నానం చేస్తోంది. స్నానానంతరం

"చిలకలూరిపేట నుండి వచ్చిన శేషగిరిరావు అనే కుర్రవాడిని రమ్మని" అమ్మ కబురు పంపింది. తన గురించి ఎవరూ చెప్పకుండానే తనని పిలవటం ఆశ్చర్యమనిపించింది. అమ్మకి నమస్కారం చేసుకున్నారు. అమ్మ అతని ముఖం మీద చెయ్యిపెట్టింది. అమ్మ చెయ్యిమంచు ముక్కలా, ఆయన శరీరమంతా అంతులేని వేడిగా ఉన్నట్టు ఒక విలక్షణమైన అనుభూతి కలిగింది.

వారికి వివాహమై ఏడుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు పుట్టారు. ఆయన ముందుగా ముగ్గురితో ఆపరేషన్ చేయించుకుంటాననంటే నీవు ఎనిమిది మందినీ భరించాల్సిందే. వారి బాధ్యత నేను చూసుకుంటానంది. ఆయన పెద్ద కూతురు శారదని తన పెద్దకోడలు శేషు తమ్ముడికిచ్చి వివాహం జరిపించింది. శేషగిరిరరావు గారు అమ్మకు అభయ హస్తంతో ఫోటో తీయాలని ప్రయత్నించారు. ఆయన కెమేరా సరిచేసుకునేటప్పటికి చెయ్యి దించేసేది. మళ్ళీ అభయ భస్తం పెట్టేది. వారు ప్రయత్నిస్తే మళ్ళీ దించేసేది. ఈవిధంగా చాలాసార్లు జరిగింది. ఆయన అమ్మ దగ్గర ఉందామనుకున్నా వాసుదేవాచారి గారితో పంపించేసింది. అమ్మ ఎప్పుడు ఏది ఎందుకు చేస్తుందో అనూహ్యం.

వారు ఇంటికి వచ్చేటప్పటికి వారింటి ప్రక్కన కాన్వెంట్ పాక అంటుకుని పెద్దమంటలు లేచాయి. ప్రక్కన వీరిది పెంకుటిల్లు. ఇంట్లో వారికి మెలకువ వచ్చి బయటకు వద్దామంటే కంగారుతో తాళం చెవి కనపడలేదు. చాలాసేపటికి గాని వారు బయటకు రాలేకపోయారు. అమ్మ దయవల్ల వారింటిలో ఉన్న పాట్లు బస్తాలు, కట్టెలు అంటుకొని లోపల వారికి ఏమీ కాలేదు. జిల్లెళ్ళమూడిలో అమ్మ వేదిక మీద అభయ హస్తంతో ఎందుకు ఉన్నదీ, వెంటనే తనని ఎందుకు పంపిందో ఆయనకు ముందు అర్థం కాలేదు. కానీ ఇంటికి వెళ్ళిన పిమ్మట అసలు విషయం అవగతం అయింది. ద్రౌపదికి కౌరవులు చేసిన మానభంగం నుండి శ్రీకృష్ణుడు అభయ హస్తంతో చీరెలిచ్చి కాపాడినట్లు అమ్మ అక్కడ అభయమిచ్చి వీరి కుటుంబాన్ని కాపాడింది.

శేషగిరిరావు గారి అమ్మాయి శైలజ అత్తవారింటికి వెళ్తు అమ్మ ఫోటో

ఫ్రేమ్‌ను తీసుకు వెళ్ళి వారింట్లో చెక్కమందిరంలో ఒక ్రపక్కన పెట్టుకుంది. ఆ మందిరంలో చాలా దేవుళ్ళ ఫోటోలున్నాయి. ఇటు చివరిగా దీపారాధన ఉంది. ఆ సమయంలో వాళ్ళ ఆడపడుచు "పూజా మందిరంలో ఈ మనిషి ఫోటో ఏమిటి? ఈ అమ్మలు, బాబాలు, మొసగాళ్ళు ఎక్కువయ్యారని అరిచింది. మందిరంలో అన్ని ఫోటోలున్నా, అమ్మ ఫోటో మాత్రమే అటు ప్రక్కన వున్న దీపారాధనతో తగలబడింది. శైలజ మామగారికి అమ్మ అంటే భక్తి. ఎప్పుడైతే అమ్మ ఫోటో తగలబడిందో ఆయన వాళ్ళమ్మాయితో "ఆవిడ సాక్షాత్తు 'రాజరాజేశ్వరి' అవతారం. నీకేమయినా బుద్ధుందా ఆ ఫోటో తీసేయ్ అన్నావు. చూశావా దృష్టాంతరం? ఏవీ తగలబడకుండా అమ్మ ఫోటో మాత్రమే తగలబడిందని" అరిచారు. తరువాత వాళ్ళ ఆడపడుచు బాత్‌రూమ్‌లో కాలుజారి, తలకు దెబ్బ తగిలి ఆరు నెలలు మంచం మీద ఉంది. శైలజ భర్త కూడా జిల్లెళ్ళమూడి ప్రయాణమని రెండు రోజులు ఆలస్యం చేశావని అరిచాడు. అతను కూడా బస్సు ఎక్కబోయి కిందపడి కాలు విరిగింది. అప్పటి నుండి అమ్మను ఎవరూ ఏమీ అనటం మానేసారు.

శారదకి రెండవ కాన్పు కష్టమయింది. గుంటూరు తీసుకెళ్లామనుకున్నారు. శారద భర్త రామూ రాత్రి తొమ్మిది దాటిన తరువాత అమ్మ దగ్గరకు వెళ్ళి పరిస్థితి వివరించాడు. అమ్మ ఒక గంట జరగనీ చూద్దామన్నది. అమ్మ ఇచ్చిన భరోసాతో అంతా నిద్రపోయారు. శారద ఒంటరిగా పడుకుని విపరీతంగా బాధపడుతోంది. వెంటనే తెల్లచీర కట్టుకున్న ఒక స్త్రీ చల్లని చేతులతో ముఖం మీద చెయ్యిపెట్టి పొట్ట నొక్కింది. దానితో కాన్పు జరిగింది. శారద పెద్దగా 'అమ్మా' అని అరిచింది. ఆ కేకవిని లోపలికి వచ్చిన వాళ్ళమ్మకు తెల్లచీరకట్టుకున్న ఒక మనిషి ఆపరేషన్ థియేటర్ వైపు వెళ్తునట్లు కనిపించింది. ఆ మనిషి నర్సు అనుకుని "తల బయటకు వచ్చిందే" అంటూ అటు పరుగెత్తింది. అక్కడ ఉన్న మనిషి అదృశ్యమయింది. మూసి ఉన్న తలుపు ముఖానికి తగిలి ఆమెకు పూర్తిగా మెలకువ వచ్చింది. అమ్మే ఆ రూపంలో వెళ్ళి శారదను రక్షించింది.

ఈ పురుడు అయిన నాలుగవ రోజున శారదకి విపరీతంగా అమ్మవారు పోసి సీరియస్ అయింది. ఆమెను కింద పడుకోబెట్టి గుంటూరులో ఉన్నవాళ్ళ డాక్టరు బాబాయికి ఫోను చేశారు. ఆయన గుంటూరు నుండి బయలుదేరారు. ఈలోగా అమ్మ తాను రాసుకునే పౌడరు, కాలెండ్యూలా పౌడరు కలిపి శారద ఒంటి మీద జల్లమని పంపింది. తాను సగం తిన్న అరటి పండును మజ్జిగలో స్వయంగా కలిపి ఇచ్చింది. ఆ మజ్జిగ గొంతులో పోశారు. అమ్మ పంపిన పౌడరుని శారద ఒంటి మీద చల్లారు. దానితో ఆమె కోలుకుంది.

శేషగిరిరావుగారు అమ్మ సాన్నిధ్యాన్ని ఎక్కువ కోరక పోవడంలో కూడా ఒక ఉన్నతమైన లక్ష్యం ఉంది. "రూపానికంటే తత్త్వానికి దగ్గరగా మనసు ఉండాలని వీరి ఆకాంక్ష" వ్యక్తిగా అమ్మకు దగ్గరగా ఉన్నా లేకపోయినా అమ్మ అనురాగానికి అందరూ అర్హులే.

వై.వి. సుబ్రహ్మణ్యంగారు చీరాల నివాసి. చీరాలలో మాతృశ్రీ టెక్స్టైల్స్ అనుపేర బట్టల వ్యాపారం చేస్తున్నారు. చైత్రశుద్ధ దశిమినాడు పొన్నూరులో మొదట అమ్మను దర్శించారు. మే 5వ తారీఖున అమ్మ కళ్యాణ దినోత్సవంనాడు మొదటిసారిగా జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అప్పుడు ఆయన చీరాల ఐ.ఎల్.టి.డి.లో పనిచేసేవారు. కుమారస్వామి మందిరంలో అమ్మకు కళ్యాణమహోత్సవ వేడుకలను జరిపించారు. సుబ్రహ్మణ్యంగారు వెళ్ళేటప్పటికి అమ్మ పూజ అయి స్టేజి దిగుతోంది. నోరి వెంకటేశ్వర్లు గారు అరటి పళ్ళగెలను అందచేసారు. అమ్మ "దానిని తాకి మీ అందరూ తినండి నాన్నా!" అని తిరిగి ఇచ్చేసింది. అందర్నీ భోజనాలు చేసి వెళ్ళమంది. అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మకు ఎప్పుడూ పిల్లల భోజనాల గురించే కదా! ఆలోచన. అందరి భోజనాలు అయిన తరువాత "చీరాల నుంచి వచ్చిన సుబ్రహ్మణ్యం గారు అంటే ఎవరు?" అంటూ గజేంద్రమక్కయ్య అడిగింది. తనపేరు ఎవరికీ చెప్పలేదు. తన పేరు ఎలా తెలిసిందని అనుకుంటూ "నేనే" అని జవాబిచ్చారు. దానికి అక్కయ్య "అమ్మ మీకు ప్రసాదం ఇవ్వలేదట. వెళ్ళేటప్పుడు ప్రసాదం తీసుకు వెళ్ళమంది" అని చెప్పింది. వూరికి వెళ్ళేటప్పుడు అమ్మ చేతి మీదుగా ప్రసాదం తీసుకుని వెళ్ళారు.

రెండు సం॥ల అనంతరం అమ్మే ఆయన యోగక్షేమ సమాచారాలన్నింటినీ అడిగి స్వయంగా తెలుసుకుంది. అదే మొదటిసారి అమ్మ ఆయనతో మాట్లాడటం ఆ తరువాత అమ్మ దగ్గరకు తరుచూ వెళ్తుండేవారు. ప్రసంగవశాన అమ్మ "నేను కారం వేసి అన్నంపెడ్తానంటే సరేనన్న వాళ్ళెవరూరాలేదని" అన్నది. పక్కనే ఉన్న చీరాల సుబ్రహ్మణ్యం అన్నయ్య అమ్మ సరియైన వాళ్ళెవరూ రాలేదని అంటున్నదని చెప్పారు. అప్పుడు అమ్మ "నేను ఎప్పుడూ అట్లా అనలేదు. ఇంతవరకూ రాలేదామాట. దోషాలేమైనా ఉన్నా నామీదే పెట్టుకుంటున్నాను. కానీ మీ మీద పెట్టటం లేదు. దోషాలు మీ మీద పెట్టలంటే ఇక ముందు ఇంకొక రూపంలో రావాలి. దైవం మరో రూపంలో వచ్చినా రక్షణతో పాటు దండన కూడా తావు ఉంటుంది. అన్ని తప్పులు సహించి ఉద్ధరించటం తల్లిగా వచ్చినపుడే సాధ్యపడుతుంది" అని చెప్పింది.

పూర్వ అవతారాల్లో దుష్టశిక్షణ, శిష్టరక్షణ లక్ష్యంగా కనిపిస్తుంది. "శిక్షణ కూడా రక్షణే" అని అమ్మ చెప్తుంది. దండన అంటే దుష్టుడిని సంహరించడం కాదు. వాడిలోని దౌష్ట్యాన్ని సంహరిస్తే చాలు అంటుంది. శిక్ష కాదు శిక్షణ అవసరం. "నాదృష్టిలో దండన అంటే" బాగుపడటమే అని ప్రకటించింది. అన్నయ్యను "బుద్ధిమంతుడని" అమ్మ ముద్దుగా పిలుచుకునేది. అందుకే జిల్లెళ్ళమూడిలో ఆయన బుద్ధిమంతుడన్నయ్యగానే ప్రసిద్ధులు. ఎంతో మందికి ఆయన అసలుపేరు తెలియనే తెలియదు.

అన్నయ్య ఎక్కువగా హైమాలయంలోనే అర్చించుకునేవారు. హైమను భౌతికంగా ఉన్నప్పుడు తరుచూ వారింటికి తీసుకువెళ్ళేవారు. హైమక్కయందు అనురక్తి మెండు. ఎన్నో సం॥గా వస్తున్న జ్వరం హైమాలయంలో 40 రోజుల ప్రదక్షిణాలు చేసేసరికి, ఏ మందులూ వాడకుండానే తగ్గిపోవటం హైమక్క అనుగ్రహమే అని అన్నయ్య నమ్మకం. ఇటీవల చేతికందివచ్చిన కొడుకు మరణించినా మొక్కవోని విశ్వాసంతో నిగ్రహించుకొని జీవనయాత్ర సాగిస్తున్న బుద్ధిమంతుడన్నయ్య ధన్యజీవి. మా పెద్ద అమ్మాయి పెండ్లికి చీరాలలో అన్నయ్యా

వాళ్ళ షాపులోనే సరోజినక్కయ్య నేను కావలసిన బట్టలను తీసుకున్నాము. ఆ దంపతుల ఆదరణ వర్ణించనలవికాదు. ఉన్నదాంట్లో తృప్తిగా జీవిస్తున్న పుణ్యదంపతులువారు. అక్కయ్య ఎంతో ప్రేమగా నోరారా పలకరిస్తుంది.

అమ్మను దర్శించగానే కొందరు ఏడుస్తారు. "వాళ్ళు ఎందుకు ఏడుస్తున్నారమ్మా?" అని అడిగితే పుట్టినప్పుడు ఎందుకు ఏడుస్తున్నారో అదే కారణంగా తనను దర్శించినప్పుడు కూడా ఏడుస్తారని అమ్మ చెప్పడం, తన దర్శనం పారమార్థిక పునర్జన్మని సూచించినట్లు కదా! తల్లిని తిరిగి పొందామన్న ప్రస్తుత వాంఛ వాస్తవానికి ఆత్మను తిరిగి పొందాలన్నదే, ఆత్మ సాక్షత్కారం పొందటం అంటే అహంకారం నశించటమే. అదే శరణాగతి.

మానవ సంబంధ బాంధవ్యాలను గురించిన దూరభిప్రాయాలను అమ్మ మాటలు పారద్రోలుతాయి. ఆధ్యాత్మిక సాధనకు గమ్యమైన సకల చరాచర జీవరాసులలోనూ దైవత్వాన్ని చూడుటమనే స్వచ్ఛమైన అనుబంధాలు సహాయ భూతాలు అంటుంది అమ్మ. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ తనలో సకల చరాచర జీవరాసులను జ్ఞానులు దర్శిస్తారని చెప్పాడు. సరియైన విధంగా మలుచుకుంటే ఈ అనుబంధాలు దివ్యజ్ఞాన సముపార్జనకు ఆటంకం కావని అవే సాధనోపకరణంగా ఉపయోగపడతాయని అమ్మ తెలియపరిచింది.

తమిళనాడు పిచ్చమార్ నుండి బి.సి. చంద్రన్ అమ్మదర్శనార్థం వచ్చాడు. అతనికి తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరుని సన్నిధిలో అమ్మ కనిపించి ప్రసాదం ఇచ్చింది. అతను అంతకు పూర్వం జిల్లెళ్ళమూడి గురించి, అమ్మను గురించి వినటం కూడా జరగలేదు. తరువాత ఆయన వ్యాపార రీత్యా మంగళగిరి వెళ్ళాడు. అక్కడ అతని స్నేహితుని ఇంట్లో అమ్మ ఫోటో చూచాడు. దాని గురించి విచారణ చేశాడు. వారు అమ్మను గురించి వివరించారు. హుటాహుటిగా జిల్లెళ్ళమూడికి పరిగెత్తుకువచ్చాడు. అక్కడ విచారిస్తే అమ్మ ఎప్పుడూ తిరుపతి వెళ్ళలేదని తెలిసింది. అతని ఆశ్చర్యానికి మేరలేదు.

అమ్మ తనకు తిరుపతి దేవాలయంలో ప్రసాదం ఇచ్చిన సంగతి చంద్రన్ అక్కడివారితో చెప్పాడు. అక్కడి వారు అమ్మతో "ఏం ప్రసాదం ఇచ్చావమ్మా!" అని అడిగారు. దానికి అమ్మ "నా దగ్గర ఏంవుంటుంది? ఎవరికైనా ఇవ్వటానికి?

షుగరే ఇచ్చి వుంటాను" అన్నది నవ్వుతూ. వారు వెళ్ళి చంద్రన్‌ని అడిగారు. అమ్మ పంచదారే పెట్టిందని చెప్పటంతో విస్మయచకితులవ్వటం కంటే అమ్మ అతనియందు చూపిన అవ్యాజ కరుణకు ఆనందించారు.

సెప్టెంబర్‌లో ఒకనాడు వరంగల్‌లో ఒక అన్నయ్య ఆర్థిక బాధలతో తలమునకలై వుండగా అమ్మ వారింటికి వెళ్ళి ఆయన భార్యకు నూటపదహారు రూపాయలు ప్రసాదించింది. ఆ డబ్బును పూజా మందిరంలో భద్రపరుచుకొని నిత్యార్చన చేసుకుంటున్నది ఆ అక్కయ్య. అప్పటి నుంచీ వారికి దారిద్ర్య బాధ దూరమైంది.

ఆ సోదరుడు అమ్మ దగ్గరకు వచ్చి అమ్మను అడిగితే "ఇక్కడ డబ్బులు ఎక్కువై నీకు ఇచ్చాననుకుంటావా? వీళ్ళు ఇక్కడ ఇంత యాతన పడుతుంటే ఏమి చేయలేక చూస్తున్నాను. నేనేమైనా ఇవ్వగలిగితే వీళ్ళకూ ఇచ్చేదానినే కదా"! అన్నది.

మా నాన్నగారు అన్నంరాజు మాధవరావు గారిని మాతమ్ముడి ఒడుగు అమ్మ చేయమంది. " ఇప్పుడుకిప్పుడు అంటే ఎలా డబ్బు చూచుకోవాలికదమ్మా!" అన్నారు. "దేనికి?" అంది అమ్మ. "పిల్లలకు, అల్లుళ్ళకు బట్టలు పెట్టాలి కదమ్మా!" అన్నారు. "ఇక్కడ చేయినాన్న, అలాంటివేమీ అవసరం లేదు" అన్నది. బీర్వాలో దమ్మిడి వుండదు కాని లక్షల లక్షల పనులు అవతాయి అని చెప్పింది. మానాన్నగారు అప్పుడు చేయనన్నా పట్టుబట్టి అమ్మ మా తమ్ముడి ఒడుగు జరిపించింది. ఆ తరువాత కొద్ది నెలలకే 1972 ఏప్రిల్ 25న మా నాన్నగారు మరణించారు. ముందు జరగబోయేది మనకు తెలియదు కానీ అవతారమూర్తి అయిన అమ్మకు తెలియంది లేదు కదా! ఆయనకు చేసే కర్మలో తమ్ముడికి కూడా భాగం అమ్మవల్లే కలిగింది.

సక్కుబాయి అక్కయ్య అమ్మను తమ కారులో ప్రయాణం చేయమని అర్థించింది. అమ్మసరే అని లాలా, పార్థులను తన వెంటరమ్మన్నది. బాపట్లలో రవి అన్నయ్యను ఎక్కించుకుంది. కారు రేపల్లె దారి పట్టింది. అమ్మ ఎక్కడికి వెళ్తోందో ఎవరికీ తెలీదు. కానీ అమ్మతో ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా వుంటుంది. ఆ కబుర్లలో కాలం, దూరం కూడా ఎవరికీ గుర్తులేదు.

ఈ లోగా భట్టిప్రోలు వచ్చింది. లాలా, పార్థుల సంతోషానికి అవధులు లేవు. అది వారి సొంతవూరు. అమ్మవారింటికి వస్తోందన్న హర్షాతిరేకాలకు అంతే లేదు. వారు ఆర్థించకుండానే కారును వారింటికి పోనీయమంది అమ్మ. నిద్రపోతున్న తల్లిదండ్రులను లేపి అమ్మ వచ్చిందని చెప్పారు. వారు విన్నది కలో, నిజమో అర్థం కాలేదు. కానీ క్షణాల్లో అమ్మవారి ఎదుటికి వచ్చి నిలుచుంది. పూర్ణ కుంభాలు, వేదమంత్రాలు మంగళవాద్యాలు లేవు. అమ్మే సరాసరి లోపలికి వెళ్ళింది.

ఆ అక్కయ్య అమ్మ పాదాలను తన ఆనంద బాష్పాలతో కడుగుతూ "అమ్మా ఈ దీనురాలిపై దయ ఉన్నదని నిరూపించటానికి వచ్చావా? ఈ రోజు సాయంత్రం నుంచీ అమ్మకు నా పై దయ తప్పిందని బాధపడ్తున్నాను. అది కాదని తెలియజేయటానికి నీవే స్వయంగా వచ్చావా! ఎంత కరుణామయివమ్మా!" అని పరవశించింది.

అమ్మ ఇంటి నాలుగు మూలలా చూచి వంట ఇంట్లోకి వెళ్ళింది. అక్కడ జాడీల మూతలు తీసి పచ్చళ్ళను రుచి చూచింది. ఆ అక్కయ్యకు ఏమి చేయాలో తెలీక కొత్త ఇంట్లో తిరుగుతున్నట్లుగా అమ్మ వెనకాలే తిరుగుతోంది. గిన్నె అడుగున మిగిలివున్న అన్నం, మెంతి మజ్జిగా కలిపి ఆకలిగొన్న దానిలా గబాగబా తిన్నది అమ్మ. అది చూచిన ఆ అక్కయ్య గుండెలలిసేలా ఏడ్చింది. దానినే అందరికీ ప్రసాదంగా పంచింది అమ్మ.

"పేదలపైన అపారమయిన ప్రేమ అమ్మకున్నదన్న సంగతి చదివి విస్తుపోతున్న మాకు ప్రత్యక్షం చేస్తున్నావా అమ్మా?" అని ఆ అక్కయ్య పరిపరి విధాల రోదించింది. ఆ అదృష్టవంతురాలు శ్రీమతి లక్కరాజు సీతమ్మ. ఆమె భర్త భట్టిప్రోలు స్కూలు మాష్టరుగా పనిచేసేవారు. వారి పిల్లలే లాలా, పార్థు మెహన్ మొ॥ వారు. ఆమె కొండముది రామకృష్ణన్నయ్య ఏకోదరులు.

భట్టిప్రోలు నుంచీ పెదపులి పట్టులో ఆనారోగ్యంతో బాధపడ్తున్న సోదరి జానకిని తన వాత్సల్యావారిశిలో ముంచెత్తి ఆశీర్వదించింది అమ్మ. తిరిగి వచ్చిన తరువాత రామకృష్ణ అన్నయ్య "పిలవకుండానే వాళ్ళ ఇళ్ళకు వెళ్ళావేమమ్మా!"

అని అడిగాడు. "వాళ్ళు రమ్మని పిలిచేదేమున్నది. వాళ్ళ బాధే నన్ను పిలిచింది. బాధ కంటే వేరే పిలుపు ఏముంది?" అన్నది అమ్మ.

అమ్మ యొక్క అనురాగజలధిలో మునకలు వేసిన వారికి మరొకటి కావాలనిపించకపోవటం సహజం కదా. ఆ దంపతులతో కలిసి హైమాలయం గర్భగుడిలో అభిషేకాలు చేసుకునే అదృష్టం నాకు కలిగింది. అభిషేకాలు చేస్తున్నప్పుడు నీళ్ళకు కొదవలేదు ఎక్కువ ఎక్కువగా చేయమంది. దానితో ముగ్గరం బిందెలుతోనే అభిషేకం చేసాము. తెచ్చి ఇస్తున్నవాళ్ళ ఇస్తున్నట్లే వున్నారు. నూతిలో నీరు అయిపోయింది అన్నంతగా అభిషేకాలు చేశాము. ఎందరెందరికో అటువంటి అవకాశాలను కలుగజేసిన మహనీయమూర్తి అమ్మ.

అమ్మ దగ్గర దసరాల్లో త్రికాల పూజలు, అభిషేకాలు, మంగళగౌరీ వ్రతం, వరలక్ష్మి పూజ అన్నీ చేసుకునే అవకాశాన్ని కలుగచేసింది. అలాగే పసుపు తాంబూల ఉద్యాపన, గుమ్మడి పళ్ళ పదహారు ఫలాలలను ఎంతో వైభవంగా జరిపించింది అమ్మ. **1982** జూన్ **11**వ తేదీన మా పెద్ద అమ్మాయి అనురాధ పెళ్ళికి చిన్న అమ్మాయి మాధవిని తోడి పెళ్ళికుతుర్ని చేయటం మాఅబ్బాయి రాధాకృష్ణ ఒడుగు స్వయంగా అమ్మ వైభవంగా జరిపించటం మా పూర్వజన్మ సుకృతమే. అన్నింటికంటే అమ్మ భౌతిక దేహానంతరం శ్రీయాగంలో మాకు పాలుపంచుకునే అవకాశాన్ని కలుగు చేసింది అమ్మ.

వీరమాచినేని ప్రసాదరావుగారు మాజీ కమ్యూనిస్టు పార్టీ యం.పి. అమ్మతో అత్యంత ఉపయోగకరమైన సంభాషణలు జరిపారు. భగవద్గీతను శ్రీకృష్ణుడు అర్జునునికి యుద్ధరంగమున భోదించినా అది సర్వకాలకమైనది. అట్లే అమ్మతో వీరమాచినేని ప్రసాదరావుగారు, శ్రీపాదవారు, పార్థసారధి అయ్యంగారు, భరద్వాజన్నయ్య జరిపిన సంభాషణలు చదువుతుంటే అమ్మ యొక్క సర్వజ్ఞత వెల్లడవుతుంది. ఆ సంభాషణలు ఆ కాలనికే కాక సర్వకాలికమైన ఉపనిషధ్వాణి. వానిలో పాలుపంచుకునే అదృష్టం కలిగిన వారెంత అదృష్టవంతులో వారి సందేహాలే మన జీవితనౌకకు చుక్కాని.

వీరమాచినేని ప్రసాదరావుగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అమ్మతో జరిపిన సంభాషణలు ఏరి కూర్చిన ముత్యాల సరాలే. అక్షరదీపాలను ఇంగ్లీషులోకి అనువదించే సందర్భంలో ఆ వాక్యాల గురించి పునరాలోచన వచ్చింది. కానీ కొన్ని వాక్యాలు ఆ అర్థానికి భిన్నంగా వున్నాయేమోనని అమ్మ దృష్టికి తీసుకువెళ్ళారు. ఆ వాక్యాలు సంపూర్ణత్వానికి ఏ మాత్రం విరుద్ధంగా లేవని వ్యాఖ్యానించింది అమ్మ. అమ్మ చెప్పిన ఒకటి రెండు వాక్యాల వద్ద సంశయ నివృత్తి కాక "పునర్ముద్రణలో ఆ వాక్యాలను తొలగిస్తామన్నారు. "ఎందుకు అని అడిగింది" అమ్మ. ఆ వాక్యాలు "నీ తాత్త్విక ప్రవచనాల స్థాయిని తగ్గిస్తాయమ్మా" అని నసిగారు.

"నా ప్రతిష్ఠకు భంగం వస్తుందనా మీ ఆలోచనా? అని, నాన్నా! ఒక తల్లికి నలుగురు కొడుకులున్నారు. అందులో ముగ్గురు బుద్ధిమంతులు, ఒకడు మాత్రం దుర్మార్గుడు. నాడి ఒక్కడి వల్లా వారికి అపకీర్తి వస్తున్నది కదా! అని ఆ ఒక్కడినీ తమ సంతానం కాదంటారా?" అని అడిగింది. ఆ చివరి మాటలు పలుకుతుంటే అమ్మ కంఠస్వరంలో మార్పును గమనించి నివ్వెరపోయారు. అమ్మ ఆ వాక్యాలకూ, పదాలకూ, ఆ అక్షరాలకు కూడా తల్లే అన్నమాట. "రావణాసురుడు దుర్మార్గుడని ఆ తల్లి అతన్ని ప్రేమించకుండా ఉంటుందా?" అని అడిగింది. అట్లాగే ఈ వాక్యాల ద్వారా అమ్మ తన సర్వమాతృత్వాన్ని మరోసారి ప్రకటించింది.

సికింద్రాబాద్‌లో ప్రసాదరావుగారి కొడుకు, కోడలు ఒక జీపులో ప్రయాణం చేస్తుంగా ఒక లారీ డీకొని ప్రమాదం జరిగింది. కుమారునికి కొద్ది గాయాలు కాగా కోడలికి ప్రాణాపాయకరమైన ప్రమాదం జరిగింది. ముఖం వికృతమై పాలభాగంలోని ముఖ్యమైన ఎముకలు నుజ్జు నుజ్జు అయ్యాయి. ఆ శకలాలు గుచ్చుకొని మెదడు దెబ్బతిన్నది. స్పృహకోల్పోయింది. ఆసుపత్రిలో చేర్చారు. ఆమెకు ఆపరేషన్ జరపటానికి నిశ్చయమయింది. బంధువులకు ఆత్రుతగా వుంది. క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి. డాక్టర్లు నమ్మకం చెప్పలేమంటున్నారు. అయినా మానవ ప్రయత్నం చేయాలి కనుక బాధ్యతా

నిర్వహణలో నిమగ్నులైనారు డాక్టర్లు. ఆ క్లిష్టసమయంలో సోదరులు శ్రీ జమ్మి వెంకటరత్నంగారు అమ్మ వద్ద నుండీ ప్రసాదం, తీర్థం తీసుకువెళ్ళారు. ఆ తీర్థం చూసేటప్పటికి ప్రసాదరావు గారికి సంజీవిని వచ్చినంత ధైర్యం వచ్చింది. శ్రద్ధగా ఆ తీర్థం ఆమె నోటిలో పోశారు. స్పృహ లేకపోయినా ఆమె ఆ తీర్థం తాగింది. ప్రసాదరావు గారికి కొండంత ఆశ అంకురించింది.

ఆపరేషన్ థియేటర్‌లోనికి అమ్మ డాక్టర్ డ్రస్సులో వెళ్ళటం ఆయనకు గోచరమయింది. వారి మేను పులకరించింది. ఆనందాశ్చర్యాలు ముప్పిరిగొన్నవి. అమ్మ వెనకనే వారి కోడలిని స్ట్రెచర్ మీద థియేటర్‌లోనికి తీసుకువెళ్ళారు. వారు నిద్రించనూ లేదు. కలగననూ లేదు. ధ్యానావస్థలోనూ లేదు. అతి మానసికావస్థలో రూపదర్శనం కాలేదు. మరి అమ్మ ఎట్లాగోచరమయింది. అనూహ్యమైన సంఘటన. అమ్మయే ఆపరేషన్ స్వయంగా జరుపుతున్న నమ్మకం కలిగింది. ఆపరేషన్ జయప్రదమైనది. అటువంటి శస్త్ర చికిత్సల్లో లక్షకు ఒకటి కానీ సఫలం కాదు. ఒకవేళ రోగి బ్రతికినా మెదడు సరిగా పరిచేయటమూ, జ్ఞాపకశక్తి సక్రమంగా రావటం, మాట్లాడటం చాలా అరుదు.

కానీ అన్నీ సక్రమంగా జరిగి వికృతమైన వదనం, సౌష్టవం, సుందరమూ అయింది. నయనాంచనాలకు వచ్చిన కనుగుడ్లు స్వస్థానం చేరి గతస్మృతి కలిగి మాటలు వచ్చాయి. అమ్మ యొక్క అపార కరుణాఝురికి, అనుపమ సమర్థ్యానికీ నిదర్శనమేనని భావించి అంజలి ఘటించారు.

ఈ సంఘటనను ప్రసాదరావు గారు వివరిస్తే అది విన్న ఒక మాజీ కమ్యూనిష్టు పార్లమెంట్ మెంబరు విస్తుపోయారట. ప్రసాదరావుగారు కూడా ఒకప్పుడు కమ్యూనిస్టు పార్టీమెంబరు. హేతువాది. ఇదేమిటి ఇలా మారిపోయాడు అనుకుని అదే విషయాన్ని ప్రసాదరావుగారిని అడిగారు. దానికి ప్రసాదరావుగారు "పూర్వం ఏ అనుభవమూ, ఏ దర్శనమూ లేదు, ఏమీ నమ్మలేదు, ఇప్పుడు ఎన్నెన్నో అనుభవాలు, నిదర్శనాలు, నిరూపణలు, మరి నమ్మకపోతే ఎట్లా? ఏమీ లేక నమ్మితే ఎట్లా మూఢత్వం అని అనుకున్నానో, ఎన్నెన్నో అవలోకిస్తూ,

అనుభవిస్తూ కూడా లేదనుకుంటే అంతే మూర్ఖత్వమని భావిస్తాను అని చెప్పారు ఏ ప్రకోపం లేకుండా.

నిత్యం సామాన్యంగా పదకొండు, పన్నెండు గంటల సమయంలో దర్శనమిస్తుంది. సామాన్యంగా అమ్మ ఆ సమయంలో మౌన ముద్రాలంకార సంశోభిత అయి కొలువు తీరి ఉంటుంది. కన్నులు ఒక్కోసారి నీటిలోని మీనముల వలే వేగంగా అటూ ఇటూ సంచలింపచేస్తూ అందరిపూ కరుణావృష్టి కురిపిస్తూ అమ్మలోలాక్షి అన్న తన నామాన్ని స్మృతికి తెచ్చేది.

ఎవరి ఇచ్ఛానుసారం, ఎవరి మతానుసారం వారు అమ్మను అర్చించుకొని తీర్ధప్రసాదాలు స్వీకరిస్తారు. అందరికోరికలను మౌనంతోనూ కుంకుమతోనూ, సమాధానం ప్రసాదించేది. అమ్మ అనుగ్రహ ప్రసారానికి సంకేతం కుంకుమ ప్రసాదం. కనుకనే అమ్మకుగానీ మనకుగానీ అమ్మ వాక్కుతో ప్రమేయంలేదు.

యస్. రంగనాధరావు గారు అన్నపూర్ణలయ వార్షికోత్సవం నాడు గుంటూరు నుంచీ అమ్మ దర్శనార్థం వచ్చారు. అమ్మ ఆయన్ని చూడగానే "నాన్న ఎప్పుడు వచ్చావు" అని అడిగింది. ఉదయమే వచ్చానమ్మా అన్నారు. "ఇంతకు పూర్వమే నిన్ను నేను చూసాను" అన్నది అమ్మ. "నేను ఎప్పుడు నిన్ను చూడలేదమ్మా, ఇదే మొదటిసారి జిల్లెళ్ళమూడికి రావటం అన్నారు. "బాపట్లలో నేను నిన్ను చూశాను నాన్నా! అని "నీకేమి కావాలి?" అని అమ్మ అడిగింది. "ఆత్మ సాక్షాత్కారం కావాలని" అడిగారు. "ఆ ఆశ వదులు కోవటమే ఆత్మసాక్షాత్కారం" అన్నది అమ్మ.

అందరూ అమ్మ దగ్గర కూర్చున్నారు. సిరిగిరి సుబ్బారావు అమ్మా అమ్మా అని ఆర్తిగా పిలుస్తున్నాడు. అతన్ని అమ్మ దగ్గరకు తీసుకువచ్చి అతని చేతులు అమ్మ ఒడిలో వుంచారు. అదే అమ్మ ప్రత్యేకత. ఎక్కడి ఆవేదన వుంటే అక్కడికి తాను వెళ్ళటమో వాళ్లను తన దగ్గరకు తెప్పించు కోవటమో చేస్తుంది. రంగానాధరావు గారు రెండవసారి అమ్మ దర్శనానికి వెళ్ళారు. నాన్నా! నీవు వచ్చి సం॥ అయింది కదా అన్నది. **19-5-1959**లో కోటంరాజు రామారావు

గారు జిల్లెళ్ళమూడి వచ్చారని ఆయన కొడుకు కోటరాజు నారాయణ రావు గారితో చెప్పింది అమ్మ. ఆయన ఇంటికి వెళ్ళాక వాళ్ళ నాన్నగారి డైరీ చూస్తే సరిగా అదే రోజున అమ్మను దర్శించుకున్నట్లు ఉంది. మానవమాత్రులైన మనకు మరుపుగాని అవతారమూర్తి అయిన అమ్మకు మరుపేమున్నది.

రంగనాధరావు గారు అనంతపురంలో ఉన్నప్పుడు అమ్మను తమ ఇంటికి రావలసినదిగా కోరుకున్నారు. "కడప వస్తాను నాన్నా" అని చెప్పింది. రంగనాధమ్ అన్న సీనియర్ ప్లీడర్‌గారిని అమ్మ కడప వస్తానన్నారు కనుక సన్నాహాలను చూడాలని రంగనాధమ్‌గారిని జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను రావలసిందిగా కోరమని చెప్పారు రంగనాధరావుగారు. ఆయనకు ఖాళీలేక ఆయన సెక్రటరీని అమ్మను కడప రావలసిందిగా అర్ధించి రమ్మని పంపారు. ఆ సెక్రటరీ జిల్లెళ్ళమూడి వెళ్ళారు, గాని అమ్మను అడగకుండానే తిరిగి వచ్చారు. అందుకే "తానొకటి తలిస్తే దైవం ఒకటి తలచాడన్న నానుడి సరికాదని, దైవం తలిస్తేనే తాను తలుస్తాడు" అని అంటుంది అమ్మ. ఎవరి చేత ఏపనిచేయించుకోవాలో, ఎవరిచేత తనను రమ్మని అడిగించు కోవాలో కూడా అమ్మ నిర్ణయమే.

రంగనాధరావు గారికి అనంతపురంనుంచీ కడపకు బదిలీ అయింది. అన్నయ్యవాళ్ళు రంగనాధమ్ అని అంటే రంగనాధమ్ కాదురా రంగనాధరావు అని చెప్పింది అమ్మ. ఆ అన్నయ్య అమ్మను కడప రమ్మని అర్ధించారు. "కడపలో ఎంతమంది వస్తారు నాన్నా" అని అమ్మ అడిగింది. అక్కడ ఎవరికీ తెలియదు కదమ్మా! అన్నారు. "నలభై వేలమంది వస్తారు నాన్నా! అని అమ్మ చెప్పింది. అలాగే అమ్మను దర్శించటానికి 40వేల మంది వచ్చారు.

పుట్టపర్తి నారాయణాచార్యులుగారు గొప్ప పండితులు. వారు వున్న డబ్బుంతా పోగొట్టుకున్నారు. భార్యభర్తలు దాదాపు పిచ్చివాళ్లు అయ్యారు. వారి బాధలు తగ్గాలంటే అమ్మ దగ్గరకు వెళ్ళమన్నారు రంగానాధరావుగారు. ఈలోగా అమ్మ కడప వస్తుందన్నారు. కాబట్టి అమ్మను మీ ఇంటికి రమ్మని అర్ధించమన్నారు. వారి అభ్యర్ధనమేరకు అమ్మ కడప వెళ్ళినపప్పుడు వాళ్ళింటికి వెళ్ళింది. అమ్మ

కాలు మోపినందుకు ఆయన పోగొట్టుకున్న డబ్బులు ఆయన షష్టిపూర్తి నాడు 60 వేల రూపాయలు కానుకగా ఆయనకు అందాయి. అమ్మ నడయాడిన ఆ ఇంటిని ఆయన శిష్యులు బాగు చేయించి ఇచ్చారు. నారాయణాచార్యులుగారు "అమ్మా నాకు కృష్ణదర్శనం కావాలని" అడిగారు. నీవే కృష్ణుడివైతే వేరే కృష్ణదర్శనం ఎందుకు? అన్నది అమ్మ.

పుట్టపర్తి నారాయణాచార్యులు గారు 14 భాషల్లో పండితులు. ఆయన అమ్మను దర్శించటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఆయనతో అమ్మ "నాన్నా పైశాచిక భాషల్లో మాట్లాడరా" అని అడిగింది. ఆ భాష ఇంకెవరికీ రాదు కదా! అన్నారు ఆయన. గోపాలన్నయ్య, రామకృష్ణ అన్నయ్యలు "మాకు భాషరాక పోయినా మీరు మాట్లాడుతుంటే విని ఆనందిస్తాముగా అన్నారు. అన్ని భాషలకు మూలమైన అమ్మకు రాని భాష అంటూ లేదు కదా! ఆయన అమ్మ మీద అరగంట సేపు అనర్గళంగా పైశాచిక భాషల్లో మాట్లాడారు.

వేదాంతం లక్ష్మయ్యగారు మంచి పండితులు. ఆయన శిష్యులతో అమ్మ పొద్దుటూరులో వుండగా వెళ్ళారు. అమ్మను పరీక్ష చేయాలని అన్నారు. దానికి అమ్మ సరే అన్నది. లక్ష్మయ్యగారు "అమ్మా! మీరు ఏమి చదివారు? అని ప్రశ్నించారు. పుట్టినప్పటి నుండీ వున్న తెలివే కాని మధ్యలో వచ్చిన చదువు ఏమీ లేదు అన్నది అమ్మ". "బ్రహ్మం అంటే ఏమిటి? అని అడిగారు. దానిని చూడలేదు, నాకు తెలియదని చెప్తూ, నేను చేసేదంతా బ్రహ్మమే నాన్నా! అన్నది. అద్వైతం అంటే ఏమిటి? ద్వైతమంటే ఏమిటి? అన్నారు. దానికి అమ్మ "ఒక ఆకు చూపించి ఇది అద్వైత్వం, దానిని రెండు చేసి ఇది ద్వైతం అన్నది. తత్ అంటే ఏమిటి? అని అడిగారు. దూరంగా వుంటే అది, దగ్గరగా ఉంటే ఇది అంటారు అంతా ఒకటే నాన్నా అని తెలియజేసింది. పాపం, పుణ్యం, బేధం-అంతరం ఏమిటి? అని అడిగారు. "అది దృష్టి దోషం నాన్నా! నా దృష్టిలో పాపం లేదు, పుణ్యం లేదని " చెప్పింది. "పుస్తక జ్ఞానం లేదుకాని సహజ సమాధిలో మాట్లాడుతుంది" అని లక్ష్మయ్యగారు చెప్పారు.

పొద్దుటూరు దగ్గర మైదుకూరులో ఎవరైనా దుఃఖిస్తే అమ్మ తప్పక దగ్గరకు వస్తుందన్నారని ఒక ఆమె ఏడుపుతో అమ్మను పరీక్ష చేయాలనుకున్నది. నిజమైన ఆర్తి, ఆవేదనకు అమ్మ కరిగిపోతుంది. కాని ఇలాంటి పరీక్షలకు చలించదు. అమ్మ కడపలో వుండగా శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు వాళ్ళు వస్తున్నారని కరపత్రాల్లో చూచి రంగనాధరావుగారు లలితమ్మ అనే ఆమెను వంటచేసి పెట్టమని అడిగారు. ఆమె తిరుపతి ప్రయాణం వుంది, కాబట్టి కుదరదని చెప్పింది. తీరా జ్వరం రావటంతో ప్రయాణం మానుకుంది. ఎలాగూ వున్నాను కదా! అని అందరికీ వండి పెట్టిన తరువాత ఆమె జ్వరం తగ్గటం తిరుపతి వెళ్ళటం జరిగింది.

రంగనాధం గారు గోవాలో ఉన్నప్పుడు కనకయ్యగారు అసిస్టెంట్ కమీషనర్‌గా వుండేవారు. ఆయన స్వగ్రామం ఒంగోలు. ఆయన ఒంగోలు వెళ్తుంటే అక్కడికి దగ్గరే కనుక అమ్మను చూసి రమ్మని చెప్పారు. అమ్మ ఆయనకు పండ్లు తినిపించింది. ఆయనకు పండ్లు తినిపించింది. ఆయనకు సెనగపిండి పడదు. డోకులు అయ్యేవి. అమ్మ చేత్తో పండు తినిపించినప్పటి నుంచీ సెనగపిండి తిన్నా పడకపోవటం అంటూ మళ్ళీ జరగలేదు. లలితమ్మకు అరిటిపళ్ళు పడవు. కానీ అమ్మ 5,6 అరిటి పళ్ళు పడదన్నా అదేం లేదులే అని తినిపించింది. అమ్మ చేత్తో ఏది పెట్టినా ఉదరరోగాలు మటుమాయమవుతాయి.

ఆయన తల్లిని అమరనాధ యాత్రకు తీసుకువెళ్ళారు. కొంతదూరం వెళ్ళాక ఆమె పడిపోయింది. ఆమెకు తగ్గించమని అమ్మను కోరుకున్నారు. వాళ్ళమ్మగారు కొద్దిసేపటికి లేచి నడవగలను, పరుగెత్తగలను అని చెప్పింది. పౌర్ణమినాడు రెండు డిగ్రీల చలిలో చన్నీళ్లుపోసుకుంది. అప్పుడు కూడా ఏమీ తేడాచేయలేదు. ఆయాత్ర నుంచీ తిరిగివచ్చి తల్లిని వాళ్ళ వూళ్ళో దింపి తాను గోవా వెళ్ళారు. ఆయన వాళ్ళ అమ్మకు తగ్గించమని ఏనాడైతే వేడుకున్నారో ఆ రోజు నుంచి అమ్మ అసలు లేవలేదు. వారియాత్రపూర్తి అయి ఇంటికి తిరిగి వెళ్ళిన తరువాత అమ్మకు కులాసా చిక్కింది. రంగనాధరావుగారు జిల్లెళ్ళమూడి వచ్చిన తరువాత ఈ సంగతి తెలిసి ఎంతపని జరిగిందమ్మా అని బాధపడ్డారు.

ఏం లేదునాన్నా! అమ్మను అమర్‌నాథయాత్ర చేయించాలని అనుకున్నావుగా, నీకోరిక నిర్విఘ్నంగా తీరింది కదా! అని అమ్మ ఆయన్ని ఓదార్చింది. ఆయన ప్రస్తుతానికి బెంగులూరులో స్థిర నివాసమేర్పరుచుకొని అచంచల భక్తివిశ్వాసాలతో అమ్మను అర్చించుకుంటున్న ధన్యజీవి.

నాగపూర్ నుంచి వచ్చిన అన్నయ్య చాలా బాధపడ్డారు. ఎప్పుడు ఇద్దరు భుజంగరావులతో కలిసి ముగ్గురం వచ్చేవాళ్ళము. ఈమాటు ఇద్దరమే వచ్చామని ఈలోగా టపా వచ్చింది. అందులోనుంచి ఒక ఉత్తరం తీసి ఆ అన్నయ్యకు ఇచ్చింది. అది భుజంగరావుగారి దగ్గరనుంచీ వచ్చిన ఉత్తరం. "ఇప్పుడు ఇద్దరు వచ్చి నట్లా? ముగ్గురు వచ్చినట్లా? అని అమ్మ అడిగింది. దానికి వాళ్ళంతా నిరుత్తరులయ్యారు.

కమ్మనేని భుజంగరావుగారికి దేముడి మీద నమ్మకం లేదు. కరెంటు లాంటిది అమ్మ అని అంటారు. "నీతలను పెట్టి చూడమని" అన్నది అమ్మ. తాను పురుషుడు, ఆమె స్త్రీ అన్న భావనతో ఆయన వూరుకున్నారు. నమస్కారం చేసినప్పుడు ఆయన తలను అమ్మ తన రెండు చేతులతో పట్టుకొని తన ఒడిలో పెట్టుకుంది. వెంటనే ఆ అన్నయ్యకు షాకు కొట్టినట్లుయి కదలక మెదలక అరగంటసేపు అలా వుండిపోయారు. నాకు దైవం మీద నమ్మకం లేదు. కానీ అమ్మ అంటే నమ్మకం ఉంది అన్నారు. "నమ్మకమే దైవం అనీ, అమ్మను మించిన దైవంలేదని" అన్నది అమ్మ.

ప్రభాకర ఉమామహేశ్వర పండితులు అమ్మను దర్శించటానికి జిల్లెళ్ళమూడి వచ్చారు. అంతటి పండితులు అమ్మతో ఎంతగా మాట్లాడతారో, ఎన్ని సందేహాలు తీర్చుకుంటారో అనే సందేహంతో అందరూ చుట్టూ చేరారు. అమ్మ వచ్చేటప్పటికి నిలబడివున్న పండితుల వారు అమ్మను చూస్తూనే నమస్కరిస్తూ నిలువునా కుప్పకూలిపోయారు. వణుకుతూ వెక్కి వెక్కి ఏడ్వటం మొదలు పెట్టారు. అలా అమ్మను సందర్శించిన పిమ్మట ఎంతో మంది ఏడుస్తారు. వాళ్ళలోని పాపం ప్రక్షాళనమై అప్పుడే పుట్టిన పిల్లలా ఒకే తోటలోని పూవుల్లా స్వచ్ఛంగా తయారవుతారు. మానవులంతా అమ్మ ఒడిలో బిడ్డలే కదా!

పండితుల వారికి సన్మానంకు అమ్మను రమ్మని ఆహ్వానించారు. దానికి కారు పంపుతాం మళ్ళీ సన్మానం అయిన వెంటనే ఒక గంటలో జిల్లెళ్ళమూడిలో దింపుతామన్నారు. దానికి అమ్మ "నేను వస్తే ఒక గంటలో తిరిగి రావటం ఎట్లా కుదురుతుంది నాన్న! నేనంటూ కదిలితే ప్రతీ ఇంటికీ వెళ్ళగలిగితే వస్తా. ముందుగా కూలీనాలీ చేసుకునే వాళ్ళింటికి, చెంచుల ఇళ్ళకు, వాళ్ళు వీళ్ళు అనేముంది అందరిళ్ళకూ వెళ్ళగలిగితేనే పని పెట్టుకుంటాను. డబ్బు గల వాళ్ళు కార్లు వేసుకు వచ్చి తీసుకువెళ్లామంటారు. కానీ రావాలని కోరిక బలంగా ఉన్నా రాలేని వాళ్ళు ఎంతమందో? రాగలిగిన వాళ్ళు ఎలాగూ వస్తారు, చూస్తారు" అని విశ్వజనీనతను చాటి చెప్పింది.

అమ్మ దగ్గరకు వచ్చే అనేక మంది ఆశీర్వదించమంటే ఆశీస్సులకు మాటలతో పని లేదంటుంది. ఒకరు అమ్మను ఎప్పటి నుంచీ మీరిటా ఉన్నారని ప్రశ్నించారు. 'శక్తులంటారా చిన్నప్పుడు ఎలా ఉన్నాయో ఇప్పుడూ అలాగే ఉన్నాయి. ఎప్పుడూ ఒకటే' మార్పు తనలో లేదంది. అంతటా ఉన్నదానిలో ఎవరెవరి ఇష్టదైవాన్ని వారు చూస్తారు! గజంలో అంగుళాలున్నాయి కానీ అంగళంలో గజం లేదు. నేను కొలబద్ద అన్నది అదేగా. ఎవరి బద్ద ఎంతమట్టుకో అంతే అన్నది అమ్మ. ఇంతమందిలో నీకే ప్రత్యేకించి ఏం గోచరించిందంటావు" అని అమ్మ అడిగింది. దానికి అతను ఏమీ జవాబు చెప్పలేక ఊరుకున్నారు.

వల్లూరి చలపతిరావుగారి కుటుంబమంతా అమ్మను ఎంతో భక్తితో సేవించుకునేవారు. చలపతిరావుగారి కొడుకు పాండురంగారావన్నయ్య 1961లో అమ్మను దర్శించాడు. అప్పటి నుంచీ తరుచూ అమ్మదగ్గరకు వచ్చేవాడు. ఒకమారు దసరాలకు అమ్మ దగ్గరకు వెళ్ళాలనుకున్నారు. తీరాచుట్టూ వరదనీరుతో జిల్లెళ్ళమూడి ద్వీపమే అయింది. బాపట్లలో శేషగిరిరావన్నయ్య కనిపిస్తే "జిల్లెళ్ళమూడి వెళ్ళటంలేదా?" అని అడిగాడు. "నాలుగురోజుల నుంచీ ఎంతప్రయత్నించినా కుదరలేదు. ఈ రోజు ఎలాగైనా వెళ్ళాలనుకుంటున్నానని" చెప్పాడు. వారిద్దరూ కలిసి మర్రిపూడి గుళ్ళ దగ్గర బస్సు దిగి అక్కడనుంచీ జిల్లెళ్ళమూడికి బయలుదేరారు. అక్కడి వారంతా "మీకేమిబతకాలని లేదా?

ఇంతవరదలో ఎలావెళ్తారని" అన్నారు. కానీ వాళ్ళు మనసు మార్చుకోలేదు. దానితో రెండు సొరకాయబుఱ్ఱలు తెచ్చిఇచ్చారు. (ఇప్పుడు రబ్బరుట్యూబ్‌ను స్విమ్మింగ్ చేయాటానికి ఉపయోగిస్తున్నారు). వాటి సాయంతో కొంతదూరం ప్రయాణించే టప్పటికి వారికోసమే అమ్మ పంపించిందా అన్నట్లుగా జిల్లెళ్ళమూడి తెప్పకనిపించింది. దానిమీద వారు అమ్మ దగ్గరకు చేరారు. దీనితో అమ్మకు గల అవ్యాజానురాగం విదితమవుతుంది.

విజయదశమికి పాండురంగారావన్నయ్య అమ్మను అర్చించుకోవటం అలవాటు. వారి కుటుంబం అంతా కలిసి అమ్మకు పూజచేసుకున్నారు. వాళ్ళు ప్రదక్షణాలు మొదలు పెడితే మిగిలన వారు వూరుకోరు. అమ్మకు ఆరోగ్యం సరిగాలేనందున అమ్మ ఇబ్బందికి గురి అవుతుందని రామకృష్ణ అన్నయ్యవద్దన్నాడు.

అన్నయ్య "నేను ప్రదక్షిణం చేయాల్సిందే అని అమ్మతో అన్నాడు. అమ్మ ఏమీ మాట్లాడకుండా వూరుకుంది. మౌనం అంగీకారమేనని అన్నయ్య వాళ్ళ నాన్న, అమ్మభార్య తమ్ముళ్ళు, చెల్లెళ్ళు అంతా ప్రదక్షిణం చేసుకున్నారు. అందరూ అది చూచి ఆనందించారే కానీ, తామూ చేస్తామని ఎవరూముందుకు రాకపోవటం అమ్మ మహిమే మరి. ఆ తరువాత నుంచి శమీ చీటిలు పంచి అమ్మకు శమీ వృక్షానికి ప్రదక్షిణాలు అందరి చేతా చేయించటం పరిపాటి అయింది.

15 రోజులు శెలవుపెట్టుకొని అభిషేకాల చేసుకోవాలనుకున్నాడు పాండురంగారావన్నయ్య, రాచర్ల అన్నయ్య వచ్చి 40 రోజులు అభిషేకాలు చేసుకోమన్నాడు. మండలంరోజులు అయిన చివరిరోజున అనసూయావ్రతం చేసుకోవాలన్న కోరిక కలిగి రామకృష్ణఅన్నయ్య కథ చదవాలనీ రాచర్ల అన్నయ్య నామాలు చదవాలని కబురు చేసాడు. అమ్మకు వొంట్లో బాగాలేదు ఇటువంటిప్పుడు వ్రతం ఏమిటని రామకృష్ణఅన్నయ్య అన్నాడు. కానీ మనలను కష్టపడనీయదు కదా అమ్మ! బస్తాడు విరజాజిపూలు సంస్థలో వారంతా దండలు కట్టారు. పౌర్ణమినాడు యధావిధిగా వ్రతంపూర్తి అయేటప్పటికి రాత్రి 2గం॥ లు

అయిది. అప్పటివరకూ అనారోగ్యంతో బాధపడ్తున్న అమ్మ పున్నమి వెన్నెల్లో మెరిసిపోతూ" అందరికీ కనువిందు కలిగించింది. ఆ రోజు ఎంతో ఆహ్లాదంగా గడిచింది. అమ్మ దగ్గర వ్రతం చేసుకోవాలని సత్యనారాయణ వ్రత పుస్తకం దొరకలేదనుకుంటుంటే లలితాసహస్రనామాలతో జీవితమహోదధి తరంగాలలోని 5 అధ్యాయాలను చదివి అనసూయవ్రతం చేసుకోండని లక్ష్మీనారాయణ అన్నయ్య అన్నాడు. అమ్మకు 3 మార్లు అనసూయవ్రతం చేసుకున్నాడు. రెండుమార్లు అమ్మను పడుకున్నప్పుడు చేసుకున్నాడు. ఒకమారు ఆశ్లేషా నక్షత్రం, ఏకాదశినాడు వ్రతం చేసుకున్నాడు. "అమ్మకు ఆరోగ్యం సరిగాలేనప్పుడు ఈ పూజలేమిటి? అని నాన్నగారు కేకలేసారు. సరిగా అమ్మ జన్మించిన, నక్షత్రం, తిథి కూడా అవటం విశేషం.

నాన్నగారు ఉండగానే అమ్మను గుళ్ళోకూర్చోబెట్టి 108 కొబ్బరికాయలు కొట్టి రాచర్లఅన్నయ్య పూజ చేసుకున్నాడు. రాచర్ల అన్నయ్య 40 రోజులు దీక్ష తీసుకొని పూజ చేసుకున్నాడు. ఆ సమయంలో అన్ని నదులనీరుతో అమ్మకు అభిషేకం చేయాలనుకున్నాడు. దానికి అన్నినదులు సముద్రంలో కలుస్తాయి. చిన్న నదులు పెద్దనదులలో కలుస్తాయి కాబట్టి 12 పుష్కరిణీ నదులనీరు, మూడు సముద్రాలు కలిసే కన్యాకుమారి దగ్గరి నీళ్ళు తెచ్చి అభిషేకం చేయమన్నారు. కోటినామ పారాయణనాటికి చేసుకోవాలని అనుకున్నాడు.

ఆ విషయాన్ని అమ్మతో చెప్పారు "టైమేమీ ఎక్కువలేదు కదరానాన్నా! అన్నది ఉత్తరానికి ఒకళ్ళనీ దక్షిణానికి ఒక్కళ్ళను పంపించాలనుకున్నారు. కానీ అమ్మ "ఆ రెండువైపులకీ రంగారావును పంపించండి" అన్నది. ఇంతలో రంగారావన్నయ్య వచ్చి నమస్కారం చేసుకున్నాడు. లక్ష్మీనారాయణ అన్నయ్యతో మాట్లాడమంది అమ్మ. ఈ కోరిక ఎవరిది? అని అడిగాడు దైవం తలిస్తేనే తాను తలుస్తాడంటుంది కదా! అమ్మ. మరి సంకల్పం అమ్మదే కదా! పుష్కరణి నదులు ఏవో చూడమని చెప్పింది. వెతికి పుస్తకం దొరకలేదని చెప్పారు. మళ్ళీ వెళ్ళి చూడమంది. వెంటనే రమాదేవి లైబ్రరీలో పుస్తకం దొరికిందని తెచ్చింది.

అందులో పుష్కరిణీనదుల గురించి ఒక శ్లోకం వుంది. దాని ప్రకారం పుష్కరిణీ తీర్థం ఎక్కడ జరుగుతుందో అక్కడే వట్టి తీసుకువచ్చాడు పాండురంగారావన్నయ్య. కోటి నామపారాయణ చేస్తాడుటరా అని పన్నాలవారితో చెప్పింది. కోటి నామపారాయణేనా? ఏదైనా చేస్తారు అని వ్యంగ్యంగా అన్నారు. అది విన్న అమ్మ చూసావుటరా! వాడు అలా అన్నందుకన్నా మనం చేయాలిరా అన్నది. ఆ రకంగా ఇతరుల ద్వారా రెచ్చగొట్టించి పని సానుకూల పరుస్తుంది అమ్మ. అమ్మను అర్పించుకుంటూ జీవితంలో వచ్చే ఒడుదుడుకులూ అమ్మ ప్రసాదమేనని జీవిస్తున్న ధన్యజీవి పాండురంగారావన్నయ్య.

అడవుల దీవి సుశీలక్కయ్య అమ్మను మనసా వాచా కర్మణా నమ్మిన వ్యక్తి. ఆమెకు చిన్నతనంలో భర్తృ వియోగం సంభవించినా అమ్మ అనుగ్రహానికి పాత్రురాలైంది. ఎంతో వినయంగా ఆదరంగా అమ్మ దగ్గరకు వచ్చిన వారందరినీ తన సోదరతుల్యులుగా భావిస్తూ, అమ్మను నిత్యం ఎన్నో సంవత్సరాలు సేవ చేసుకున్న ధన్యజీవి. ఎవరిలో ఏ కొంచెం ప్రతిభ వున్నా వారిని ప్రోత్సాహపరిచేది. ఆమె కుమారుడు అడవుల దీవి మధు అన్నయ్య. తల్లితో పాటూ తాను అమ్మను విశ్వజననిగా ఆరాధించాడు.

కొత్తగా ధాన్యం వచ్చేరోజుల్లో మొదటి కోత ధాన్యం అమ్మకు పంపటం వారి రివాజు. అటుకులు దంపించి బస్తాలకు బస్తాలు అమ్మకు సమర్పించుకోవటం వారి ఆరాధన. తండ్రిని చిన్నతనంలోనే పోగొట్టుకున్న అమ్మ దగ్గరికి వచ్చిన నాటి నుండీ మాతృలాలన, పితృపాలన అన్నీ అమ్మ నుండే అనుగ్రహించబడ్డాయి. జమిందారీ కుటుంబానికి చెందిన వారసత్వం, సంప్రదాయాలను చేధించుకొని అమ్మ పాదాల చెంత వివాహం చేసుకున్నాడు.

అమ్మ జన్మదినోత్సవానికి అడవులదీవి వారి బియ్యమే ముందు ఎసరు వేయటం, మే 5న మొదటిసారిగా అమ్మకు, నాన్నగారికి ఇద్దరికీ కలిపి పూజచేసుకునే ఆచారం వారి నుండే మొదలైంది.

మధు అన్నయ్య గోపాలన్నయ్యతో బియ్యం తెప్పించే భాగ్యం మాకు

కలగచేయవచ్చుకదా! అని అన్నాడు. ఆ విషయం అమ్మకు తెలిసి ఆ అవకాశం నీకే ఇస్తున్నానని మధు అన్నయ్య చేయిపట్టుకుంది. ఆనాటి నుండీ అన్నపూర్ణాలయంకు బియ్యం అడవుల దీవి నుండే వచ్చేవి.

అన్నపూర్ణాలయం నుండీ బియ్యం పంపమని కబురు వచ్చింది. ఆ సమయంలో వారికి డబ్బు ఇబ్బంది ఎక్కువగా వుంది. బియ్యంలేవు ఎలా కొనుగోలు చేయాలా అని ఆలోచిస్తున్నాడు. మనసు పరిపరివిధాల వ్యాకులత నొందింది. మనంతట మనం ఈ సేవను ప్రసాదించమని కోరుకున్నాం. ఈ కష్టాన్నుండీ గట్టెక్కించమని అమ్మనే తలుచుకుంటూ ఆ రాత్రంతా ఆవేదన చెందాడు. ఆ అర్ధరాత్రి జీపుతీసుకుని శ్రీవిశ్వజననీ పరిషత్ కార్యదర్శి దినకర్ వచ్చాడు. ధాన్యం కొరకు వచ్చాడనుకున్నారు. కాని "వాడు ఆర్థికంగా ఎంత ఇబ్బంది పడ్తున్నాడో వాడి సంగతి ఆలోచించకుండా బియ్యం పంపు, బియ్యం పంపమంటే ఎట్లా? వెళ్ళి వాడి సంగతి చూడండి" అని అమ్మ దినకర్‌కి డి.డిలు ఇచ్చి పంపింది. పదివేల డి.డి. 30 వేల డి.డి. తీసుకొని అప్పటికి ఇబ్బందులన్నీ సర్దుకున్నాడు. అమ్మ దగ్గరకు వచ్చి అమ్మ అనుగ్రహానికి కన్నీటితో పాదాభిషేకం చేసుకున్నాడు. దానికి అమ్మ "నీ అవసరం తీరుస్తున్నా నా అవసరం తీర్చుకుంటున్నా" అని నిర్లిప్తంగా తెలియచేసింది.

అమ్మ శరీరం త్యజించే ముందు అమ్మ మంచం పక్కన కూర్చున్న మధు అన్నయ్యతో "ఇంక బియ్యం ఇక్కడకు పంపించవద్దు" అన్నది. మధు అన్నయ్య ఆశ్చర్యపోయి "అదేంటమ్మా! నాలో ఏదన్నాలోపం ఉన్నదా ఏదైనా తప్పు చేశానా? చెప్పమని అర్థించాడు. "అది కాదు నాన్నా! నేనున్నంత కాలం నీ సంగతి గురించి ఆలోచించాను. ఇక్కడెవ్వరూ నా తరువాత ఆ విషయం పట్టించుకోరు అందుకని" అన్నది. అంతే ఆ తర్వాత మధు అన్నయ్య జిల్లెళ్ళమూడికి ధాన్యం పంపించాలనుకున్నా పంపించలేకపోయాడు. ఏదైనా అమ్మ మనకు అనుగ్రహిస్తేనే మనం చేయగలము. ఇప్పటికీ ఈ విషయం చెప్పి మధు అన్నయ్య అమ్మకు సేవ చేసుకునే అదృష్టం అమ్మ ప్రసాదించవలసినదే. ఆ అదృష్టం, అవకాశం

నాకు లేదిప్పుడు అని బాధపడుతుంటాడు. అన్నయ్య భార్య లలిత, పిల్లలు, అంతా అమ్మ మీద ఎనలేని విశ్వాసం కలిగినవారే. అన్నయ్య బాబాయి ప్రసాదు అన్నయ్య వాళ్ళ కుటుంబం కూడా అమ్మ అపార కరుణకు నోచుకున్నవారే. జిల్లెళ్ళమూడిలో అడవుల దీవికే ఒక ప్రత్యేకత వుంది. అమ్మ రెండవ కోడలు వైదేహి పుట్టిల్లు అడవులదీవే.

మన్నవ కృష్ణశర్మగారి కుమారులే మన్నవ భూషణంగారు. అమ్మలోని దైవత్వాన్ని గుర్తించి పలుమారులు అమ్మ దర్శనం చేసుకున్న వ్యక్తి. ఒకమారు అమ్మ లలితా సహస్రనామ పుస్తకం తీసి అందులో త్రిశతిలోని మూడు నామాలు చూపి 'నేనే' అని ఆయనకు తెలియచేసింది. ఆ మూడు నామాలు 1) హానివృద్ధి వివర్జిత. 2) హయ్యంగవీన హృదయ. 3) హరికోపారుణాంశుకాయ.

1) హానివృద్ధి వివర్జిత : జనన, వృద్ధి, నాశన వికారాలు శారీరకమైనవి. ఇట్టివికారాలేమిలేని నిర్వికార స్వరూపిణి అమ్మ.

2) హయ్యంగ వీన హృదయ : నవనీతస దృశ్యమైన అత్యంత కోమల హృదయం గలది అమ్మ.

3) హరికోపారుణాంశుకాయ : 'హరికోప' మంటే ఆరుద్ర కీటకమని అర్థము. హరికోపం అరుణవర్ణంలో భాసిల్లుతూంటుంది. అంశుక శబ్దానికి కిరణాలని అర్థం. అనగా ఆరుద్ర వంటి అరుణ కిరణ ప్రభలతో భాసిల్లు దేవేరి అమ్మ. దీని వల్ల మనకు అమ్మే లలితా పరాభట్టారిక అని అవగతమవుతుంది.

అమ్మా! జ్ఞానానికి ప్రేమకు సంబంధం ఏమిటి? అని అడిగారు. దానికి అమ్మ ప్రత్తికి దారానికి వుంటే సంబంధమే రెండూ ఒకే పదార్థమైనా ప్రత్తిని చూస్తే దారం జ్ఞాపకంరాదు. దారాన్ని చూస్తే ప్రత్తి జ్ఞాపకంరాదు. జ్ఞానం ప్రేమ వేరువేరుగా కనిపిస్తున్నా రెండూ ఒకటే. ఒక వస్తువు గురించి పూర్తిగా తెలియటమే జ్ఞానం ప్రేమ అవుతున్నాయి.

స్వామి విమలా నందలలితా సహస్ర నామాలకు అర్థాని, అంతరార్థాన్ని, ఎంతో అర్థవంతంగా, లాలిత్యంగా శ్రోతల హృదయాలను ఆకట్టుకొన గలిగిన

రీతిలో ప్రవచించకలరు. అందులో "పదద్వయప్రభాజాలా పరాకృత సరోరుహా" అన్ననామాలను వివరిస్తూ జిల్లెళ్ళమూడి అమ్మ పాదాలు అతిసున్నితంగా అతిలాలిత్యంగా, అతిలోక సౌందర్యంతో విరాజిల్లుతాయని వివరించారు.

కోసూరి కరణం గారైన రామకోటేశ్వరరావు గారు అమ్మను సేవించుకునేవారు. వారితో పాటు వారి తమ్ముడి కుమారుడు కట్టమూరి వెంకటేశ్వరరావు 10 సం॥ల వయస్సులో అమ్మను దర్శించాడు. వారు పూజచేసుకోవటానికుపక్రమించగా "భోంచేసి పూజ చేసుకోండి నాన్నా!" అన్నది అమ్మ. ఆ మాట ఆ పది సం॥ల బాలుని బాగా ప్రభావితం చేసి ఏదో తెలియని ఆత్మీయత పునవేసుకుంది.

అతని బావగారికి మతిస్థిమితం లేనందున జిల్లెళ్ళమూడిలో గోలచేస్తున్నాడు. అమ్మ మౌనంగా భరించటమే కాక ఎవరిని ఏమీ అననిచ్చేది కాదు. మంచివారు లోకంలో ఎలాగైనా బ్రతకగలరు. కాన వీరిని తాను భరించకపోతే ఎలా? అని ప్రశ్నించేది. అతను చేస్తున్న గోల చూసి వెంకటేశ్వరరావు "అమ్మా! వీడు పోతే ప్రాబ్లమ్ వుండదు" అన్నాడు. దానికి అమ్మ ఉష్! అని నోటి మీద వేలు వుంచుకొని అతన్ని వారించింది" అమ్మకు ఎవరినీ దూషించటం, భాదించడం అసలు ఇష్టం వుండదు. చెల్లెలు బాధపడ్తోందన్న వ్యధతో ఆమాట అన్నాడు కానీ తరువాత చెల్లెలికి పురిటిలో గుర్రపువాతం కమ్మి మరణించింది. ఆమె భర్తకు పిచ్చి తగ్గి మళ్లీ పెళ్ళి చేసుకొని పిల్లా పాపలతో అమ్మ దయవల్ల హాయిగా వున్నాడు. అందుకే మనవాళ్ళు "పగవున్న బావను తిడితే, భక్తి వున్న అప్పకు తగులుతుందని" అంటారు.

వెంకటేశ్వరరావుతో "పెద్దనాన్నను నీదగ్గర పెట్టుకో" అన్నది అమ్మ. అమ్మ యందు కల నమ్మకం, అమ్మ మాటకు విలువ ఇచ్చే బుద్ధి ఆయనకు వుండటంతో ఆయన మరణించే వరకు తన దగ్గరే వుంచుకున్నారు. అతని మేనళ్ళుళ్ళు ధూళిపాళ మోహన్, శంకరులను, జిల్లెళ్ళమూడి మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీలో చేర్పించారు. వారిని చూడటానికైతే ఏమీ, అమ్మ యందు ఆరాధనా భావంతో

ప్రతినెలా అమ్మ దర్శనం చేసుకునేవాడు. 1986 మీటింగ్‌లో సంస్థ విడిపోయింది. సత్తెనపల్లిలో అతనికి రెండో బాబు పుట్టాడు. ఆ పిల్లాడిని చూడటానికి కూడా వెళ్ళకుండా జిల్లెళ్ళమూడిలో మీటింగ్‌కు వెళ్ళాడు.

సత్తెనపల్లిలో చంటి పిల్లవాడి పరిస్థితి విషమించింది. డాక్టర్లు లాభం లేదు. ఇంటికి తీసుకువెళ్ళమన్నారు. అతని భార్య కాత్యాయని జీవితహోదధి తరంగాలను నిత్యం పారాయణ చేస్తుంది. అమ్మ చిన్నతనంలో పులిస్తరాకులో పిల్లల్ని పార్లిస్తే బతుకుతారన్న సంఘటన గుర్తుకు వచ్చి ఆసుపత్రి దగ్గర్లో ఉన్న హోటల్ దగ్గర వున్న ఆకులు తెప్పించి అందులో అమ్మ కుంకుమ వేసి పిల్లవాడ్ని పార్లించింది.

అంతకు ముందు డాక్టర్లు ఆక్సిజన్ పెట్టటానికి కానీ ఏ టెస్టులు చేయటానికి కూడా వీలులేకుండా కరెంట్ పోయింది. ఈలోగా కరెంట్ రావటంతో తీసుకు వెళ్ళిపోమన్న డాక్టరే ఒక్కమారు ఆక్సిజన్ పెట్టిచూద్దాం అని అన్నారు. దానితో ఆ బాబు తేరుకున్నాడు. ఆ పిల్లవాడు ఆశ్లేష నక్షత్రంలో పుట్టాడు. 11వ రోజు శాంతి చేయించి గుంటూరు తీసుకువెళ్ళాడు. ఆయన మేనత్త చేసిన సంరక్షణ వల్ల ఆ చంటి పిల్లవాడు వొళ్ళు చేసి బాగా తయారయ్యాడు. అప్పటి నుంచీ వారింట్లో పురిటిలో పిల్లలను అమ్మ కుంకుమ తప్పక పెట్టటం ఆనవాయితీ అయింది. పిల్లలకు కాని, పెద్దలకు కాని ఏ అనారోగ్యం సంభవించినా పాలలోనో, నీళ్ళలోనో అమ్మ కుంకుమ కలిపి ఇస్తారు.

మా అమ్మగారు అన్నంరాజు కనకదుర్గాంబగారు తనకు ఎప్పుడు వొంట్లో బాగా లేకపోయినా ఎవరితో చెప్పకుండా కుంకుమ నీళ్ళల్లో వేసుకు తాగటం లేదా నొప్పిగా ఉన్నచోట ఆ కుంకుమ రాయటం చేసేది. అది చూచిన మాకు చాలా ఆశ్చర్యమనిపించేది. ఆ కుంకుమే సర్వరోగ నివారిణిగా పని చేసిందటానికి పై సంఘటనలే తార్కాణం.

వెంకటేశ్వర్లు భార్య కాత్యాయనికి కష్టం, సుఖం, అన్నీ అమ్మే. అమ్మను మించిన దైవం లేదు. రోజూ సుప్రభాతం సంధ్యావందనం చేసుకోవటం. అమ్మ జీవిత చరిత్ర నిత్యపారాయణగా చేయటం ఆమె అలవాటు. ఇంటికి ఎవరు

వచ్చినా వారికి ఆప్యాయంగా వండి కడుపు నిండా పెడితేనే ఆమెకు తృప్తి. "అన్నదాతా సుఖీభవా, అనసూయామాతా జయీభవా ఎందరు రాని ఎప్పుడు రాని ప్రజోపయోగం ప్రేమ ప్రయోగం" అని నదీరా అన్నట్లుగా ఆమెకు వంటింట్లో ఎంతసేపు వుండాల్సి వచ్చినా బాధ అనిపించదు. వచ్చిన వారందరికీ కడుపు నిండా పెట్టటమే ఆమె ధ్యేయం. అందుకే అమ్మ "అందరి ఇళ్ళు జిల్లెళ్ళమూడి కావాలి" అని అన్నది. అసిధారావ్రతంగా అమ్మ సూక్తులను ఆచరిస్తున్న అక్కయ్య అనురాగానికి ఏమి ఇవ్వగలం. పైగా ఎవరిని దర్శించినా అమ్మను చూచినట్లు వుండదని అమ్మను తలుచుకోవటం, ఫోటోను చూచుకోవటమే తనకు ముఖ్యమని, అదే ఆనందమని చెప్పింది.

1966లో తొలి ఏకాదశికి బాపట్ల సముద్ర స్నానానికి వెళ్ళింది. ధూళిపాళ. లక్ష్మీ నరసమ్మ. అక్కడ ఎండకు తట్టుకోలేక పుట్టింటికి వెళ్ళినా ఇంత పేల పిండి తెచ్చుకునేదాన్ని. సముద్రస్నానం అని ఇక్కడకు వచ్చానని అనుకుంది లక్ష్మీనరసమ్మక్కయ్య. ఆమె పెత్తండ్రి కొడుకు రామకోటేశ్వరరావుగారు ఆమెను వాళ్ళ పెద్దబ్బాయి శ్రీనువాసును జిల్లెళ్ళమూడి తీసుకువచ్చారు. అప్పటికి అమ్మ పూరింట్లో వుంది.

దూరంగా కూర్చున్న అక్కయ్యను దగ్గరకు రమ్మని పిలిచి ఆమెకు గుడ్డివాళ్ళైన సిరిగిరి సుబ్బారావన్నయ్యకు, రాధ అన్నయ్యకు దోసిళ్ళతో పేల పిండి పెట్టింది. ఎక్కడో సముద్రం దగ్గర ఆమె అనుకున్నది. ఇక్కడ లభ్యమవ్వటంతో ఆమెకు అమ్మ యందు ఎనలేని గురి, నమ్మకం ఏర్పడింది. పేల పిండి తింటూ ఎంతో ఆనందించింది.

కానీ 16 సం॥ల వాళ్ల బాబుకు పెట్టలేదు. అతను అనారోగ్యంతో బాధ పడ్తున్నాడు అమ్మ ఆ పిల్లవాడ్ని పిలిచి పెట్టలేదు కాబట్టి వాడు బతకడేమో అని దిగులు పడ్డది. ఈలోగా అమ్మ అందర్నీ భోంచేసి రమ్మంది వెళ్ళి వస్తామని చెప్పటానికి వెళ్ళారు. ఆ పిల్లవాడ్ని ఒక్కడ్నే పిలిచి ఒళ్ళు, తలనిమిరి పేల పిండి ఇచ్చింది అమ్మ. దానితో అక్కయ్యను పిల్లవాడు ఎటువంటి ఇబ్బందికీ గురికాడని పూర్తి విశ్వాసం కలిగింది.

మా బాబు రాధాకృష్ణకు 1977లో పెద్ద ప్రమాదం జరిగింది. అత్య అవసరంగా వెంటనే ఆపరేషన్ చేసారు. 2 నెలల తరువాత డాక్టర్లు పరవాలేదన్నా ఏదో తెలియని భీతి వెన్నంటి వుండేది. మా కుటుంబమంతా అమ్మ దర్శనం చేసుకువచ్చాము. అమ్మను వాడి గురించి అడుగుదామనుకొని, అంతా అమ్మే అనుకుంటూ మళ్ళీ అమ్మను ప్రశ్నించటమేమిటి? అని వచ్చేసాము.

ఆ తరువాత మా చెల్లెలు వసంత అమ్మా వాడ్ని చూడలేదమ్మా ఎలా వున్నాడో అన్నది. దానికి అమ్మ "వాడికేమీ వాడికి ఏ వంకాలేదన్నది" ఆ విషయం మా చెల్లెలు ఉత్తరం రాస్తే నాకు అలివిమాలిన సంతోషం కలిగింది. అమ్మ నన్ను తృప్తి పరచటానికి దాని చేత ఆ ప్రశ్న వేయించి, తాను సమాధానం చెప్పిందని నా విశ్వాసం.

ప్రమాదంలో తలకు పెద్ద గాయం తగిలి, తల రెండింతలుగా వాచిపోయి, కళ్ళు రెండూ నెత్తురు ముద్దలుగా, చెవికట్ అయి, పెల్విక్ బోన్ ఫ్రాక్చర్ అయి, యూరిన్ బ్లాడర్ చితికి పోయిన పిల్లవాడు బతుకుతాడని కానీ, బతికినా ఏ అవసరం లేకుండా వుంటాడని ఎవ్వరూ ఊహించని విషయం. అటువంటి పిల్లవాడికి తగ్గి మామూలుగా అవ్వటం అమ్మ యొక్క అవ్యాజకరుణే కారణం. అమ్మ అమోఘవచనకదా!

భాగ్యాదివారాల నోము ఉద్యాపనకు మట్టెలు, మంగళసూత్రాలు చిన్నచిన్నవి దారానికి కట్టి లక్ష్మీనరసమ్మ అక్కయ్య అమ్మకు తీసుకువెళ్ళింది. అదిచూచి అమ్మ తెచ్చావుగా కట్టు అంటూ తన మంగళసూత్రాల గోలుసు పైకి తీసి కట్టించుకుంది. ఆ అక్కయ్య ఎంత అదృష్టవంతురాలో కదా! అమ్మకు మంగళ సూత్రాలు, మట్టెలు కట్టినప్పటి నుంచీ ఆ భరణాలకు, వస్త్రాలకు లోటులేదని అమిత విశ్వాసంతో తన ఆనందాన్ని తెలియ చేసింది. వారంతా అమ్మ అనుంగు బిడ్డలు వారి ఉచ్ఛ్వాసనిశ్వాసాలే అన్నంతగా అమ్మ వారి జీవితాల్లో పెనవేసుకు పోయింది.

అమ్మకు ఊరంతా మంట లేకుండా పొగతో కూరుకుకున్నట్లుగా కల

వచ్చింది. ఆ కలలోనే ఇట్లా కాకూడదు ఇలా వచ్చిందేమిటి? అనిపించింది. ఆ సంగతి వసుంధరక్కయ్యతో చెపితే అమ్మకు కల ఏమిటి? అనుకుంది. ఆ తరువాత రెండు రోజులకే కలరా జాడ్యం వ్యాపించినట్లు తెలిసింది. సాయి సచ్చరిత్రలో షిర్డిబాబా గోధుమలు విసిరించి ఆ పిండిని ఊరి పొలిమేరలో చల్లమన్నారు. ఆ తరువాతే కలరా తగ్గిందని తెలియజేసారు కదా! అదే విధంగా అమ్మ కలరావ్యాధి నుంచి వారందరినీ కాచి రక్షించింది.

హాలులో అమ్మ దగ్గర అందరూ కూర్చుని ఉండగా ఏదిరా మురళీరవళి అన్న పాటను పరిసరాలను మర్చేపోయి అంధ సోదరుడు సిరిగిరి సుబ్బారావు అతి శ్రావ్యంగా పాడాడు. ఊదరా కృష్ణా మరియొకసారి అన్న చరణం పాడుతున్నప్పుడు అక్కడ ఉన్న అందరికీ వేణుగానము వినిపించింది. ఆశ్చర్యానందాలతో అందరూ అమ్మవంక చూచారు. అమ్మకూడా ఏమీ ఎరుగనిదానిలా కొత్తవాళ్ళెవరైనా వచ్చారామో చూచి రండని చెప్పింది. నీకు తెలియకుండా వచ్చే కొత్త వాళ్ళెవరూ లేరమ్మా! అని చంద్రమక్కయ్య అన్నది. అమ్మ మాట ప్రకారం నాలుగు దిక్కులా చూచారు. ఎక్కడా ఎవరూ లేరు. అది ఎక్కడిదో, ఎవరిదో అయితేగా మరొకరుండటానికి 'ఏదిరా మురళీ రవళి' అని పాడగానే మురళీగానాన్ని వినిపించి మరిపించి మురిపించిన శ్రీకృష్ణుని వలె వేణుగానం చేసిన అమ్మ ఎదురుగా ఉన్నవారి పరవశింప చేసి తాను పరవశించి అక్కడున్న వారందరినీ పులకరింపచేసింది. ఆ పాట అయిపోయినా, ఏపని చేసుకుంటున్నా ఆ మురళీగానం వీనులవిందు చేసిందని వసుంధరక్కయ్య చెప్పింది.

సాయంకాలం ఏడు గంటకు జరిగిన సంఘటన. అమ్మ స్నానం చేసి హాలులోకి రాగానే రోజూ వచ్చే పెద్దకుక్క కనిపించక పోవడంతో అది ఎక్కడ ఉందో చూచి రమ్మని అమ్మ సావిత్రికి చెప్పింది. అది మరణ బాధతో లేవలేక పడుకున్నద సావిత్రి చెప్పింది. వెంటనే అమ్మ హుటాహుటీ కుక్క దగ్గరకు బయలుదేరింది. వర్షం, బురద రేగడినేల నలతగా ఉన్న అమ్మని వెళ్ళవద్దని

వేడుకున్నారు. ఆ కుక్కను ఇక్కడకు తీసుకు వస్తామని చెప్పారు. దానిని మీరు ఇక్కడకు తీసుకువచ్చేది నా కోసం గాని, దానికోసం కాదుగా నాన్నా! నాకేం ఫరవాలేదని అమ్మ బయలుదేరింది. మరణకాలము సమీపించి కడసారిగా అమ్మ దర్శనాన్ని కోరుతున్న ఆ కుక్క ప్రార్థన ఎందుకు వ్యర్థమౌతుంది? భగవంతుడు భక్త పరాధీనుడు కదా!

వారంతా వారిస్తున్నా గజేంద్రుని మొరవిన్న శ్రీమహావిష్ణువులా అమ్మ మోకాలి లోతు రేగడి బురదలో, పొడినేల మీద నడిచినట్లు సునాయాసంగా చకా చకా నడుస్తూ దానిని సమీపించింది. గ్లాసులో కొంచెం పాలు, తులసీదళాలు తెప్పించి దాని పక్కన కూర్చుని చేయివేసి నిమర సాగింది. తన ప్రార్థన నాలకించి పరుగు పరుగున వచ్చిన ఆ ఆర్తజన రక్షణి అమృత స్పర్శకు ఆ కుక్కలోని నరనరమూ ఆనందంతో పులకరించింది. అమ్మ పాలు పట్టగానే తులసీదళం కూడా మిగల్చకుండా తాగేసింది.

ఆ కుక్క ఎంత చురుకైందో అంత సాహసి. సామాన్యంగా ఎవరి జోలికీ వెళ్ళేది కాదు. దాని మనస్సు నొప్పిస్తే వాళ్ళ ఇళ్ళల్లో దూరి గొడవ చేసి ఏడిపించేది. మొదట అమ్మ దర్శనార్థం వచ్చేవారిని ఏడవ మైలురాయి దగ్గర్నుంచీ తీసుకువచ్చి మళ్ళీ వెళ్ళేటప్పుడు అంత దాకా దింపి వచ్చేది. అమ్మను ఎంతగానో ప్రేమించేది. దాని చూపులో, నడకలో, నడతలో అమ్మకోసం ఏ క్షణాన్నైనా ఆత్మార్పణ చేయగల త్యాగం, ధైర్యం కనిపిస్తుండేవి. అనేక సంఘటనలలో అమ్మకు తల్లిగా, తోడుగా, మిత్రుడుగా ప్రవర్తించేది. ఇంట్లో పిల్లలకు సుస్తిగా ఉంటే అమ్మ పని చేసుకుంటుంటే వాళ్ళ దగ్గర కూర్చునేది. ఎవరైనా కొత్తవాళ్ళు వస్తే అమ్మ దగ్గరకు వెళ్ళి తాకి సంజ్ఞ చేసి చెప్పేది. కానీ అరవటం కానీ కరవటం కానీ లేవు. ఇటువంటి లక్షణాలతో ప్రత్యేకంగా ఉండేది ఆ కుక్క.

మాటల సందర్భంలో అమ్మ దానిని గురించి "మనిషి మనిషిని ఎంత దూరం ప్రేమించవచ్చో అంతదూరం అది ప్రేమించగలదని" చెప్పింది. దానికి ఏడు సంవత్సరాల వయస్సులో, ఊళ్ళో కుక్కలకు పిచ్చి పట్టిందని వాటి తలల

మీద రాళ్ళతో కొట్టి ఊరి చివర పడేశారు. ఈ కుక్క దీనితో పుట్టిన ఇంకొక కుక్క గాయాలతో నడవలేక నడవలేక అమ్మ దగ్గరకు వచ్చాయి. అప్పుడు అమ్మ మజ్జిగ చిలుకుతోంది. ఆ రెండో కుక్క అమ్మ కాళ్ళ మీద ప్రాణాలు వదిలింది. అమ్మపాదాలు మీద ప్రాణాలు వదలటానికి అది చేసుకున్న పుణ్యమేమిటి? ఈ కుక్క మాత్రం అక్కడ క్రింద పడిన మజ్జిగ చుక్కలు నాకి తేరుకుంది. మజ్జిగ చుక్కలు నాకితే తేరుకునే స్థితి కాదు దానిది. అమ్మ చిందించిన ఆ నలుగు చుక్కలే దాని పాలిట అమృతమై చరితార్థమైన పునర్జీవనాన్ని ప్రసాదించాయి.

అమ్మ శక్తి అనంతమైనది. అమ్మను కవులు కీర్తిస్తున్నారు. కావ్యాలు రాస్తున్నారు. సర్వసృష్టికారిణి అని గాయకులు గానం చేస్తున్నారు. చిత్రకారులు చిత్రిస్తున్నారు. శిల్పకారులు శిల్పాలు చెక్కుతున్నారు. ఇంతమందిని కదిలించ గలిగిన ఏదో అలౌకికత అమ్మలో లేకపోతే ఇది సంభమేనా?

పండితులు, శాస్త్రకారులు, హేతువాదులు అమ్మ పాదాల చెంత అంజలి ఘటిస్తున్నారు. వ్యక్తిని పూజించటం ఏమిటని అడిగిన వారికి ఆమెలోని ప్రేమ, కరుణ, త్యాగం, దాతృత్వం, మంచితనం వీటిని చూచి అరాధిస్తున్నామని చెప్పవచ్చు. ఆమె సాధారణ గృహిణిగా ఉంటూనే అసాధారణతను కనపరస్తున్నది. సూర్యుడు ముందు దివిటీలా, ఆధ్యాత్మిక శక్తి ముందు ఈ మహిమలు అల్పమే, అయిన "సృష్టికంటే మహత్త్యం ఏముంది"? అన్నది. అమ్మ మనకోసమే ఈ లీలలు కొనసాగించింది. ఆమె పలుకు, రూపం ఎంతో మనోజ్ఞమైనవి. ఆమె దర్శనం ఎడారిలో దప్పిక కొన్నవారికి ఒయాసిస్ కనిపించినంత హాయిని, చల్లదనాన్ని కలుగజేస్తుంది.

కాసు రాధాకృష్ణారెడ్డి, వెంకటేశ్వర రెడ్డి ఇద్దరూ అన్నదమ్ములు. వారిద్దరూ పుట్టు గుడ్డివాళ్ళు ఆధ్యాత్మిక చింతన ఉన్నవారు. శ్రీ శ్రీ శ్రీ సత్యసాయి బాబాగారి దర్శనార్థం పుట్టపర్తి వెళ్ళారు. బాబాగారు వారికి అన్ని సదుపాయాలు చేయించి, ఏలోటూ రాకుండా ఎంతో వాత్సల్యంతో చూచారు. అన్నదమ్ములిద్దరూ అమీతుమీ

తేల్చుకునే వరకూ వదలిపెట్టని ధీరులు. బాబాగారు "మీకు చూపుకావాలా?" అని అడిగారు. దానికి వాళ్ళు "ఇచ్చేవాళ్ళు అడిగి ఇస్తారా?" అని మొండిగా అన్నారు. బాబాగారు "జిల్లెళ్ళమూడి అమ్మ రాజరాజేశ్వరి అవతారం" అని అన్నారు. అది విన్న అన్నదమ్ములిద్దరూ "అమ్మ పరమాత్మ ఔనో కాదో తేల్చుకోవాలని" జిల్లెళ్ళమూడికి బయలుదేరారు. ఏడవ మైలు రాయి దగ్గరికి వచ్చేటప్పటికి వర్షం పడటం వలన నేల బురదగా ఉంది. రెండడుగులు వేయగానే కాలుజారి బొక్కబోర్లా ముందుకు పడ్డాడు రాధన్నయ్య. వెంటనే ఆ మట్టి యాలకులు కలిపి చేసిన అరిసెల వాసన వచ్చింది. ఆమట్టిని పెద్ద తిరుపతి లడ్డూ అంత మోతాదులో తీసుకుని తిన్నాడు రాధాకృష్ణారెడ్డి. అది అద్భుతంగానూ, చాలా రుచిగానూ ఉంది. పల్లెటూళ్ళలో "నా జోలికి వస్తే మట్టి కరిపిస్తామని అంటారని మొదట ఏడవ మైలురాయి దగ్గర దిగగానే అమ్మ తనను అట్లా చేసిందని" చెప్పాడు.

మొదట్లో అమ్మను దర్శించటానికి వచ్చిన వాళ్ళకు అమ్మ మట్టినే ప్రసాదంగా ఇచ్చేదని, అది సువాసనలు వెదజల్లుతూ రుచిగా ఉండేదని చరిత్ర వలన మనకు అవగతమవుతోంది. వాళ్ళువచ్చిన రోజు రాత్రి పడుకోవటానికి స్థలం చూపించమని అమ్మ అమ్మమ్మతో చెప్పింది. ఆవరణంతా తిరిగిన ఎక్కడా నచ్చక అనసూయేశ్వరాలయ గర్భగుడిలో పడుకుంటానని రాధన్నయ్య చెప్పాడు. నాన్నగారు గుడిలో ప్రతిష్ఠ అయ్యే వరకు అక్కడే నివాసమేర్పరుచు కున్నాడు.

వీరు అమ్మను కూడా వారి పద్ధతిలో బండపరీక్షలు పెట్టేవారు. వీరి చేత ఆ విధంగా దెబ్బలు తింటూనే అందరికీ దర్శనం ఇస్తుండేది. వారు అమ్మను పెట్టే బాధలకు తాళలేక కొందరు వారిని వెళ్ళగొట్టాలని, బెదిరించాలని అనుకున్నారు. ఆ సంగతి తెలిసిన అమ్మ "వాళ్ళ మీద చెయ్యి పడితే నా మీద పడ్డట్టే, వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను, వాళ్ళను ఏమీ అనవద్దని" ఆపింది.

"ఓంకారానాదం బొడ్డు నుండి తీస్తూ గుద్దితే అవతలి వారు తట్టుకోవాలి. అలా తట్టుకోగలిగిన వారే ప్రణవ స్వరూపులు అంటూ అమ్మను కూడా వారి

పరీక్షలకు గురిచేశాడు రాధ అన్నయ్య. వారికి కోరినంత పెట్టడానికి అమ్మ ఇద్దరికీ అరచేతి మందాన పెద్ద గారెలు చేయించి చెరొక ఐదొందలు పెట్టించింది. అవి కాకా చెరొక బకెట్టు పాయసం తాగి మళ్ళీ మధ్యాహ్నం వారి పద్ధతిలో భోజనం చేశారు. వందమందికి పైగా అమ్మ దర్శనమిస్తున్న సమయంలో వెంకటేశ్వర రెడ్డి "ఒసేయ్ అమ్మా! కాఫీ తెప్పించవే" అని విసురుగా అడిగేవారు. అమ్మ తన సహజ ప్రశాంత వదనంతో కాఫీ తెప్పించి ఇచ్చేది. ఈ విధంగా 40 రోజులు వారు అమ్మ దగ్గర ఉండి వారి ఊరికి వెళ్ళారు.

రెండవసారి రాధన్నయ్య ఒక్కడే వచ్చాడు. మళ్ళీ తన పద్ధతిలో పరీక్షలు మొదలుపెట్టాడు. అమ్మ సీతారాములుగా, రాధాకృష్ణులుగా, శచీపురంధురులుగా, పార్వతీ పరమేశ్వరులుగా దర్శనమిచ్చింది. అమ్మ పురుష రూపంలో దర్శనమిచ్చినపుడు పురుష స్పర్శ, స్త్రీ రూపంలో దర్శనమిచ్చినపుడు స్త్రీ స్పర్శ కలిగేవి. అమ్మ పాదాల నుండి రకరకాల వేద స్వరాలు, పంచాక్షరి, అష్టాక్షరి, గాయత్రి ఇలా ఎన్నో మంత్రాలు వినపడ్డాయి.

అమ్మను కొట్టేటప్పుడు "అమ్మ ఒక ప్రణవ సముద్రంలా తన చేయి ఆ అలలను తాకుతున్నట్లుగా అనుభూతి కలిగింది అని రాధన్నయ్య చెప్పాడు." "ఇన్ని దేవతా స్వరూపాలుగా కనపడినా అమ్మను ఎలా కొట్టగలిగావని" దత్తు అన్నయ్య అడిగాడు. దానికి రాధన్నయ్య "బంగారు కణిక కోసం కొట్టాను, దేవదేవీ రూపాలు కామరూపులు కూడా చూపించగలరు. రావణాసురుడు సాధువు రూపం ధరించాడు. మాయా సీతను సృష్టించాడు. ఇలాంటివి చూసి పడిపోకూడదు. ఈ "సహనం సహజ సహనం" అవునా కాదా, అమ్మ ప్రణవ స్వరూపం అవునా కాదా తేల్చుకోవటానికే" కొట్టానన్నాడు. రాధన్నయ్య భీముడిలా బలిష్టమైన కాయం కలిగినవాడు. ఆ బండచేత్తో ఐదు గంటలు సేపు కీర్తనలు పాడుతూ అమ్మ తొడమీద గట్టిగా తాళం వేసేవాడు. అంతసేపూ నిరామయంగా ఉన్న అమ్మ ఏం నాన్నా! చేతులు నొప్పెడుతున్నాయా?" అంటూ నూనె తెప్పించి అతని చేతులకు రాసింది. దైవత్వం జయించలేనిది మాతృత్వం జయించింది.

అమ్మ యొక్క సహజ సహనం, గుణాతీతమైన, భావాతీతమైన దివ్య మాతృత్వానికి దాసోహమని అమ్మ పాదాల చెంత వాలిపోయాడు. భూమి కూడా కంపిస్తుంది. పర్వతం కూడా బద్దలై లావా కారుతుంది. ఈ కోమలమయిన స్త్రీమూర్తి ఏమిటి? ఈ విధంగా కదలని చెదరని మాతృవాత్సల్యాన్ని కురిపిస్తున్నది అని అమ్మ అఖండ శక్తికి అంజలి ఘటించి జీవితాన్ని అంకితం చేసుకున్నారు.

అమ్మ ఉండగానే హైమాలయం ప్రక్కనే దక్షిణాదిలో మాదిరిగా గుడి కట్టించింది. రాధన్నయ్య అక్కడ అనేక మహిమలను దర్శించాడు. దేవతలు నృత్యగానాలతో, గజ్జెల చప్పుళ్ళతో అమ్మ నామం చేస్తూ కనిపించేవారని ఆయన చెప్పాడు స్వయంగా అమ్మ నామం చేయటం విశేషం.

పుట్టు గుడ్డి అయినటువంటి రాధన్నయ్యకు కొన్ని నెలలు చూపు వచ్చింది. అమ్మ రాధనడిగింది "ఏం నాన్నా! నీకు చూపు కావాలా!" అని. రాధన్నయ్య "ధృతరాష్ట్రునికి కృష్ణుడు కొన్ని క్షణాలు మాత్రమే కళ్ళు ఇచ్చాడు. నువ్వు నాకు దృష్టి కొన్ని నెలలు ఇచ్చావు ఇంక అవసరం లేదు అన్నాడు. మళ్ళీ అంధత్వం వచ్చింది." ఈ విధంగా అమ్మ సాక్షాత్తు పరమాత్మ అని తన అనుభవం ద్వారా తెలుసుకున్నాడు.

అతని నివాసం మార్చమని అమ్మ కబురు పెట్టింది. కానీ అక్కడ నుంచి కదలలేదు. గర్భగుడిలో పెట్టుకున్న దుప్పట్లుపోయాయి. "గుడి ఉంటే మేడలు మిద్దెలతో పని ఏముంది?" అని అమ్మ అంది. లలితాంబక్కయ్య రాధన్నయ్యతో "ఆ చోటు మార్చరాదా, దుప్పట్లు కూడా పోయాయి కదా!" అన్నది. దానికి అన్నయ్య "నా జీతగాడిస్తాడు అంతే కాని నేనిక్కడ నుంచి కదిలేది లేదని ఢంకా మీద దెబ్బ కొట్టి మరీ చెప్పాడు." తరువాత నాలుగవరోజున రాధన్నయ్యను లేపి గర్భగుడిలో నాన్నగారిని సమాధి చేయించి సహస్ర దీపాలు వెలిగించారు. అంత వేడిలో కూడా తనకు హాయిగా నిద్రపట్టిదన్నాడు.

హైమక్క సిద్ధిపొందిననాడు "రాధ చేసే జపం చూసి హైమ లేచి వస్తుందేమో అనుకున్నానని" అమ్మ అంది. అది విని అందరూ ఆశ్చర్యపోయారు. ఆయన చేసే నామానికే అమ్మ తృప్తి చెంది ఆయనకు సిద్ధులను ప్రసాదించిందా

అనిపిస్తుంది. ఆయన మాట్లాడితే అది ఒక భాండాగారమే. ప్రతి పౌర్ణమికి హైమాలయంలో "ఓం హైమ నమో నమో హైమ శ్రీ హైమ జమ హైమ" అన్న నామంతో ఏకాహం జరుగుతుంది. ఈ మధుర నామాన్ని పరమ భక్తులు నామయోగి అయిన శ్రీకాసు రాధాకృష్ణారెడ్డి రూపొందించాడు. అన్నయ్య తన జీవితాన్ని నామాంకితం చేసుకున్న భాగవతోత్తముడు.

వరంగల్ స్టేట్‌బ్యాంక్‌లో అమ్మ రెండవ కుమారుడు బ్రహ్మాండం రవీంద్రనాథ్ దగ్గర అన్నయ్య ఉన్నాడు. అతనికి సుస్తీ చేస్తే డా॥ ఇనజకుమారి బాపట్ల తీసుకువచ్చింది. ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకువెళుతుంటే అమ్మ కనిపించి "ఎవ్వరూ లేరనుకున్నావా? నీకు నేను, నాకు నీవు" అని చెప్పింది. ఆపరేషన్ టేబిల్ మీద వుండగా డా॥ లక్ష్మయ్యగారు "ఆపరేషన్ చేయించుకునే నీవు, చేసే నేను, ఆపైన భగవంతుడు వున్నాడని" అన్నారు. అన్నయ్య నెల రోజులకు పోతాడనగా "నేను నీకు ఏమీ చేయలేక పోతున్నాను. నాలోనే నిన్ను చేర్చుకుంటానని" హామి ఇచ్చింది అమ్మ.

అతని మరణానంతరం అన్నయ్యను జిల్లెళ్ళమూడిలో సమాధి చేసారు. రాధ అన్నయ్య కర్మయోగి, తపస్వి, తన జీవితాన్నంతా అమ్మ నామంతో పునీతం చేసుకోవటమే కాక ఇతరులకు మార్గదర్శి అయ్యాడు. అతని సమాధి మీద గణపతి విగ్రహం పెట్టి ఛత్రం అమర్చటం ఎంతైనా ముదావహం. అన్నయ్య అమ్మతో తాదాత్మ్యం చెందినమౌని, గొప్ప సంగీత విద్వాంసుడైనా తన సంగీతాన్ని సంపాదనకి, పేరు ప్రఖ్యాతులకి కాకుండా అమ్మ నామానికి అంకితం చేసి ఎన్నెన్నో అద్భుతమైన అనుభవాలు పొంది అమ్మ అపార వాత్సల్యం చూరగొని భగవంతుని సహితం దబాయించి విలక్షణమైన రీతిలో అమ్మను సేవించిన ధన్యజీవి రాధ అన్నయ్య.

మన్నవ రామారావు, "సుబ్బారావు అన్నయ్యకు గండం ఉంది కదమ్మా" అన్నాడు. దానికి అమ్మ అప్పుడు మేము ఉండముగా నాన్నా అన్నది. అమ్మ చెప్పిన విధంగానే నాన్నగారు **1981** ఫిబ్రవరిలో, అమ్మ **1985** జూన్‌లో అవతార పరిసమాప్తి గావించి విశ్వాంతర్యామి అయింది. ఆ తరువాతే సుబ్బారావు అన్నయ్య **1990**వ సం॥ డిశెంబరు **20**వ తేదీన దివంగతుడయ్యాడు.

1965లో బామ్మ చరమదశకు వచ్చినపుడు, నాన్నగారు జమాబందీకి బాపట్లలో ఉన్నారు. డాక్టర్‌లు లాభం లేదన్నారు. కానీ అమ్మ నాన్నగారు లేకుండా ఎట్లాపోతుంది? అన్నది. అలాగే నాలుగురోజుల తరువాత నాన్నగారు వచ్చిన రోజునే బామ్మ మరణించింది. ఈ నాలుగు రోజులు బామ్మ ప్రాణాలతో ఉండటం వైద్యులకు ఆశ్చర్యకారణమే అయింది.

సీతాపతి తాతగారు మరణించినట్లు డాక్టర్లు ధృవీకరించారు. కానీ ఆయన పునర్జీవితులయ్యారు. ఆ తరువాత నెల రోజులకు తాతగారు విగతజీవులయ్యారు. యార్లగడ్డ రాఘవయ్యగారి కొడుకు యార్లగడ్డ వెంకన్న మృత్యువుతో పోరాడుతున్నాడు. మహాశివరాత్రి నాడు రుద్రాభిషేకం అయింది. అమ్మ అతనికి తీర్ధ ప్రసాదాలిచ్చింది. అందరినీ వెంటనే భోజనం చేయమంది. భోజనాలయ్యేటప్పటికి అంతిమ శ్వాస వదిలాడు.

కాలవ నిండా నీరు ఉన్నా దాహంగా ఉన్నపుడు తాగటానికి రేవు కావాలి. దైవం సర్వ వ్యాప్తమైన అర్చనకు, ఆరాధనకు ఒకమూర్తి, ఒక ఆలయం అవసరం. ఆ మూర్తి ఆదర్శవంతమై ఉండాలి. ఆ ఆలయం పవిత్రక్షేత్రమై ఉండాలి. కనుకనే అమ్మ తన నివాస స్థలమే పుణ్యక్షేత్రంగా తన గర్భసంజనిత హైమను అర్చనామూర్తి గా మలిచింది. దైవం అమ్మగా మానవరూపం ధరించి అవనిపై అవతరిస్తే, హైమ మానవునిగా జన్మించి దైవానుగ్రహం పొంది, దైవత్వాన్ని అధిరోహించింది.

డి. పాండురంగారావుగారు ఏలూరు నివాసి. ఆయన రామకృష్ణ పరమహంస వివేకానందుల పుస్తకాలు పఠించారు. దానితో వాని ప్రభావం వలన సన్యాస జీవితం పట్ల ఆకర్షితులయ్యారు. ఆయన సహోద్యోగి రేలంగి సూర్యకాంతారావు గారి సలహా మేరకు మెహర్‌బాబాగారికి ఉత్తరం వ్రాశారు. వెంటనే వారి పర్సనల్ సెక్రటరీ ద్వారా "ఈ జన్మకి నీకు సన్యాస ఆశ్రమ యోగం లేదని, గృహస్థుగానే వుంటూ అనేక బాధ్యతలు నిర్వహించవలసియున్నదని, వాటిని నిర్వహిస్తూనే ఆధ్యాత్మిక జీవనం గడపమని" ఆదేశించారు. అప్పట్లో ఆయన భక్తులకు కూడా అరుదుగా లభించే ఉత్తరం ద్వారా ఆయనకు ఆశీస్సులు లభించటం కాంతారావు గారికి చాలా ఆశ్చర్యం కలిగించింది.

అయినప్పటికీ పాండురంగారావు గారిలో వైరాగ్య భావాలు పోలేదు. ఆయన ఏలూరు జిల్లాపరిషత్ ఇంజనీరింగ్ శాఖలో పని చేసేవారు. వారి తల్లి, అన్నయ్య భర్త వియోగంతో వచ్చిన అక్క, ఆమె నలుగురు పిల్లలూ ఆయన మీదే ఆధారపడ్డారు. ఉద్యోగం ద్వారా వచ్చే జీతం రాళ్ళే వేరే ఆస్తి పాస్తులు వారికి లేవు. అది చాలక ప్రయివేటుగా పార్టు టైమ్ జాబ్ చేసేవారు.

1965లో ఈ బాదరబంధీలన్నీ వదిలి ఏదైనా ఆశ్రమానికి వెళ్ళాలన్న తలంపులో కట్టు బట్టలతో మద్రాసు రైలు ఎక్కి విజయవాడ వెళ్ళారు. అక్కడ ఒక లాడ్జిలో 'ప్రజామాత' పక్షపత్రికలో జిల్లెళ్ళమూడి అమ్మ గురించి చదివారు. వెంటనే అమ్మను దర్శించాలన్న కోరిక ఉద్భవించింది.

బాపట్ల మాతృశ్రీ కార్యాలయానికి వెళ్ళి వివరాలు తెలుసుకొని, పెదనందిపాడు బస్సు ఎక్కి 7వ మైలురాయి దగ్గర దిగారు. ఆయనతో పాటు ఖమ్మం జిల్లాకు చెందిన శేషారావు అనే మాష్టరుగారు వచ్చారు. అప్పటికి అమ్మ పూరింట్లో వుండేది. ఊళ్ళోకి వెళ్ళగానే నూతి దగ్గర కాళ్ళు కడుక్కొని, అక్కడ ఒక పెద్దాయన వుంటే జిల్లెళ్ళమూడి అమ్మగారు ఎక్కడ వుంటారని అడిగారు. ఏవూరు నుంచీ వచ్చారని కనుక్కొని అమ్మ వుండే పాక చూపించారు. తరువాత ఆయనే శ్రీనాన్నగారు బ్రహ్మాండం నాగేశ్వరరావుగారని తెలిసింది. అప్పటికి అన్నపూర్ణాలయం నిర్మాణంలో వుంది.

అమ్మను చూడగానే శేషారావుగారికి కట్టలు తెంచుకొని ఉధృతంగా దుఃఖము వచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చారు. పాండురంగారావు గారికి మాత్రం అమ్మ ఎన్నెన్నో జన్మల నుండీ తెలిసిన ఆత్మీయురాలు అనే భావన కలిగింది. ముందుగా భోజనం చేసి రమ్మన్నది. భోజనానంతరం శేషారావుగారు తన సమస్యను అమ్మకు విన్న వించుకున్నారు. ఆయన దేవీ భక్తుడు. అమ్మ "ఆ తల్లిని సేవిస్తున్నావు కదా! భార్యా బిడ్డలను వదిలి ఎందుకు వచ్చావు? అన్నీ ఆమె చూసుకుంటుంది. ఇంటికి వెళ్ళు" అని చెప్పింది. నదులన్నీ సముద్రంలో కలిసినట్లుగా ఏ శక్తిని పూజించినా నాకే చెందుతుందని" అమ్మ తెలియచేసింది.

పాండురంగారావు గారు తన సమస్యను కాగితం మీద వ్రాసి ఇచ్చారు. అందులో ఆయన పూర్తి వివరాలు, సన్యాసాశ్రమం తీసుకోవాలన్న తన కోరికను వెల్లడించారు. ఆ కాగితాన్ని చూసి, ఆయన వంక ఆప్యాయంగా చూసి నవ్వింది అమ్మ. ఆరోజుల్లో అమ్మతో ఆధ్యాత్మిక విషయాలు పలువురు చర్చించేవారు. ఆరెండురోజులు ఆయన జీవితంలో మళ్ళీ రమ్మన్నారావు అని ఆయన విశ్వాసం.

శేషారావుగారు, పాండురంగారావుగారు అమ్మ దగ్గరకు వెళ్ళి సెలవు తీసుకున్నారు. శేషారావుగారు అమ్మ మాట మీద నమ్మకంతో తిరిగి ఇంటికి వెళ్తానని చెప్పారు. అప్పుడు అమ్మ పాండురంగారావుగారి వంక చూచింది. ఆయన కలకత్తాలోని బేలూరు మఠానికి వెళ్తానన్నారు. వారు పాదాభివందనం చేసుకున్నాక అమ్మ కుంకుమ ప్రసాదం వారికి ఇచ్చింది. పాండురంగారావుగారికి **21** సం॥లు శేషారావుగారికి **40** సం॥లు వున్నా పాండురావుగారికి ఆధ్యాత్మిక విషయాల్లో గల అనుభవానికి శేషారావుగారు ఆయన వయస్సుతో నిమిత్తం లేకుండా గౌరవించారు. అనేక అధ్యాత్మిక విషయాలు విపులీకరించి ధైర్యం చెప్పటంతో వారు సంతోషంగా ఇంటికి బయలుదేరారు. పాండురంగారావు గారి ద్వారా అమ్మ ఆయనకు ధైర్యం కలిగించింది.

జిల్లెళ్ళమూడి నుంచీ గుంటూరులో శేషారావుగారిని బస్సు ఎక్కించి, ఆయన విజయవాడ వచ్చారు. ఆయన దగ్గర కలకత్తాకు వెళ్ళటానికి మాత్రమే డబ్బు వుంది. అందుకని ఏమీ తినక పంపు దగ్గర నీళ్ళు తాగి తెల్లవారుజామున కనకదుర్గ ఆలయానికి వెళ్ళారు. ఒక ప్రదక్షణం అయ్యేటప్పటికి ఈయన అన్నగారు, స్నేహితులు కాంతారావుగారు కనిపించారు. వీరి ఆలోచన కలకత్తా వెళ్ళాలని కదా! ఇంట్లో వారికి ఎలా తెలిసిందో, ఎలా వచ్చారో అంతుబట్టలేదు.

శేషారావుగారు గుంటూరులో బస్సు ఎక్కిన తరువాత చిన్నతనంలోనే ఇంతవైరాగ్యం కలిగి ఆయన మీద ఆధారపడ్డ సంసారాన్ని వదిలి సన్యాసుల్లో కలిస్తే, ఆ కుటుంబం ఏమైపోతుందన్న ఆలోచన వచ్చింది. వెంటనే వారి ఇంట్లో వారికి ఈ విషయం తెలియ చేయాలనుకున్నారు. పాండురంగారావుగారి పేరు,

ఆయన ఉద్యోగం చేసే ఆఫీసు పేరు తప్పించి, ఇంటి ఎడ్రసు ఏమీ తెలియదు. అప్పటికి రాత్రి 7 గం॥లు అయింది.

వెంటనే ఏదో అదృశ్యశక్తి నడిపిస్తున్నట్లు ఏలూరు బస్సు ఎక్కారు. బస్సులో ప్రక్కనే కూర్చున్న వ్యక్తి ఎక్కడికి వెళ్ళాలని అడిగారు. శేషారావుగారు "జిల్లాపరిషత్‌లో పనిచేసే పాండురంగారావు గారింటికి నేను ఎలాగైనా ఈ రాత్రికే చేరాలని" చెప్పారు. ఏలూరు వెళ్ళేటప్పటికి పదిగంటలవుతుంది. అడ్రసు తెలీకుండా ఇల్లు ఎలా తెలుసుకోగలం. మా వీధిలో అదే ఆఫీసులో పనిచేసే ఆయన వున్నారు. వారి పేరు తెలియదు. వారింటికి తీసుకు వెళ్తానని చెప్పారు.

సరిగ్గా రాత్రి 10.30 గం॥లకు శేషారావుగారిని వారింటికి తీసుకు వెళ్ళి మీ అబ్బాయితో మాట్లాడాలని వివరాలు చెప్పారు. తీరా చూస్తే అదే పాండురంగారావుగారిల్లు అవటం అమ్మ సంకల్పమని ఆయన నమ్మకం, దైవలీల. తెల్లవారేటప్పటికి విజయవాడ వెళ్ళి మీవాడ్ని పట్టుకోలేకపోతే కలకత్తా వెళ్ళిపోతాడు. మీకు దక్కడని శేషారావుగారు చెప్పారు. అప్పటికే పాండురంగారావుగారి మీద ఆధారపడ్డ కుటుంబం, ఆయన లేకపోతే వీధిన పడుతుందని, ఆ కుటుంబ సంరక్షణ బాధ్యత ఆయనపై ఉండటం వల్లనే ఆయన్ని తిరిగి ఇంటికి చేర్చింది అమ్మ.

ఆయన ఏమయ్యారో తెలియన వారి కుటుంబ సభ్యులు పడ్డ ఆందోళన వినటం వల్ల, అమ్మ సంకల్పం వల్ల మళ్ళీ దూరంగా వెళ్ళాలన్న ఆలోచనే కలగలేదు. అంత శ్రద్ధ తీసుకొని ఇంటికి వెళ్ళి పాండురంగారావుగారి గురించి చెప్పిన శేషారావుగారు ఆ రాత్రే వెళ్ళిపోవడం, మళ్ళీ ఆయన వాళ్ళ వాళ్ళకు దొరికారో లేదో కనీసం. ఉత్తరమైనా వ్రాయకపోవటం చూస్తే వారింటికి వెళ్ళిన శేషారావుగారు అమ్మ సృష్టే అని వారి ప్రగాఢ నమ్మకం.

మన్నవలో రెడ్డి సుబ్బయ్యగా, రెడ్డి అన్నయ్య పంపారని బండి, ఎడ్లు, బండివాడు అన్నీ ఎలా అమ్మ సృష్టించిందో అదే విధంగా ఇదీ అమ్మ సృష్టే. ఆ తరువాత ఆయన అమ్మ దగ్గరకు 5 సార్లు వెళ్ళినా, ఆ విషయం ప్రస్తావనకు

రాలేదు. ఆయన ఎంతటి విపత్కార పరిస్థితులు వచ్చినా అమ్మను తలచిన వెంటనే ఆ సమస్యలు పరిష్కారమయ్యాయి. ఒకమారు కాలికి మేజర్ ఆపరేషన్ జరిగింది. షుగర్ పేషంటే అయినా 9వ రోజు కుట్లు తీసి ఏమందూ అవసరం లేకపోయింది. అమ్మను సర్వస్యశరణాగతి అన్న మనల్ని ఏ బాధలు ఏమీ చేయమని ఆయన అనుభవము, విశ్వాసము.

మంగమ్మ అనే ఆమె జిల్లెళ్ళమూడి అమ్మనునేనే అని ప్రచారం చేసుకుంటున్నది. అమ్మకు ఎదురుగా పూజ చేయించుకోవటానికి సిద్ధమౌతుంటే అమ్మ "దాని మంచికే వచ్చింది. సమయం వచ్చింది. అదీ వచ్చింది. నేను ఒకమాట చెప్తాను. ఇంకే దేవత పేరుతోనైనా వేషాలు వెయ్యి కానీ ఈ పేరుతో వద్దని" అమ్మ చెప్పింది. ఆమెతో, ఆమె అనుచరులతో "ఇంటి పట్టున ఉండి భర్తకు వండి పెట్టుకోక ఏం కర్మ ఇది? నేల మీద నుండి కంటే కొండ మీద నుండి పడితే ఎంత దెబ్బతగులుతుందో ఆలోచించటం లేదు. మీకు జిల్లెళ్ళమూడి అమ్మ అనిపించుకోవటం గొప్ప కావచ్చు. కానీ నాకు జిల్లెళ్ళమూడి కరణం గారి భార్య అని ఉంటుంది. నీవు అలా అనిపించుకోలేవుగా" అని మందలించింది.

"దూరశ్రవణ దర్శనాదులు ఆధ్యాత్మిక శక్తికి అత్పల్పాలు" అని తెలియజేసింది అమ్మ. "ఆచారం అంటే ఆచరించటమేనని, సాధ్యామైనదే సాధన అని " "అమ్మ తెలియజేసింది. అమ్మా! లలితాసహస్రం, గాయత్రి, అభిషేకాలు స్త్రీలు చేయకూడదంటారు. లలితా సహస్రం చేస్తే ఆహుతి కావాలట" అన్న ఒకరితో "అన్నీ చెయ్యోచ్చమ్మా మనస్సునే ఆహుతి చేస్తే ఇంక వేరే ఆహుతి ఎందుకు? అమ్మవారు నెత్తి అణుస్తుందని అంటారు. అవేమీ లేదని అంటాను నేను. ఎక్కడైనా తల్లి నెత్తి అణుస్తుందా!" అని అమ్మ దగ్గర కూర్చుని వాళ్ళ సందేహాన్ని తీర్చింది.

రెచెర్డ్స్ సన్ ఒకమారు అమ్మ దగ్గర కూర్చుని పెద్ద ఇంగ్లీషు పుస్తకాన్ని చదువుతున్నాడు. అంతమటుకు అమ్మకు విసురుతున్న వాళ్ళు కిందకు వెళ్ళారు. ఆ విసనకర్ర తీసుకుని రిచెర్డ్స్ అమ్మకు విసురుతూ" ఇది కూడా భగవత్ సేవలోకే

వస్తుందా" అని మనసులో అనుకున్నాడు. వెంటనే అమ్మ అతను చదువుతున్న పుస్తకంలో ఫలానా పేజీ తీసి అందులోని పేరా చూడమంది. ఆ పేరాలో ఏ సేవ చేసినా భగవంతుని సేవ అనుకుని చేస్తే తప్పకుండా భగవత్ సేవ అవుతుందని రాసి ఉంది.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు భౌతిక శాస్త్రంలో డాక్టరేటు తీసుకున్నారు. అన్నింటినీ నిశితంగా పరిశీలించి కూలంకుషంగా చర్చిస్తే కానీ దేనినీ ఒప్పుకోనటువంటి మనస్తత్వం ఆయనిది. ఆయనకు తెలుగు సాహిత్యం యందు ప్రత్యేకాభిమానం వుంది. నవ్య కవిత్వాన్ని గూర్చి వీరి అభిప్రాయం కవులందరికీ శిరోధార్యం. ఏకాంకిత నాటికల గురించిన పరిశోధన వ్యాసాలు, స్త్రీల పాటల గురించిన ధారవాహిక వ్యాసాలు ప్రసిద్ధమైనవి.

శ్రీపాదవారు రాజమండ్రి ఆర్ట్స్ అండ్ సైన్సు ట్రైనింగ్ కాలేజీలో ఛీఫ్ ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. 10 సం॥లు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఫిజిక్స్ హెడ్‌గా పనిచేసారు. ఆ కాలంలో రీసెర్చి కొరకై ఇంగ్లాండ్, స్కాట్లండ్, రోమ్, హాలెండ్ దేశాలలో పర్యటించారు. ఆంధ్రరాష్ట్ర అవతరణ జరిగిన పిమ్మట ఆంధ్ర ప్రభుత్వ కళాశాలలో ప్రిన్సిపల్‌గా రాజమండ్రి, కాకినాడ, అనంతపురం, నెల్లూరులో పనిచేశారు. పదవీ విరమణానంతరం నర్సాపురం, బాపట్ల కళాశాలలో ప్రిన్సిపల్‌గా పనిచేశారు. హైదరాబాద్‌లో సైన్సు సాంకేతిక పదములకు సరియైన తెలుగు పదములను కూర్చటంలో కొంతకాలం కృషిచేశారు. ఆంధ్ర వారపత్రికలో డాక్టర్ అన్న కలం పేరుతో విజ్ఞాన వీధులు, వైజ్ఞానిక గధాశతి ధారావాహికంగా అనేక వ్యాసాలు వ్రాసారు. మనభూమి - ఆకాశం, విజ్ఞాన వీధులు మొ॥న గ్రంధాలను ప్రచురించారు.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు వారి స్నేహితులైన శ్రీపద్మాజీ ప్రోత్సాహంతో జిల్లెళ్ళమూడికి అమ్మ దర్శనార్థమై విచ్చేశారు. ఇంతమంది దైవమని ఆరాధించే అమ్మ అంటే ఎవరో, ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలంతో వచ్చారు. వారు ఎక్కడా, ఎవరిలోనూ చూడని ప్రశాంతిని అమ్మ వదన

మండలంలో వీక్షించారు. ఆ ప్రశాంతిని గురించి అనేక వ్యాసాల్లో ఉపన్యాసాల్లో ఉద్ఘాటించారు. కానీ అమ్మ తానే దైవంగా పూజలందుకోవటం వారికి అర్థం కాలేదు.

ఆ విషయాన్నే శ్రీ పద్మాజీకి ఉత్తరాసి ముందున్న టేబుల్‌పైకి విసురుతుండగా "ఆ! ఏమిటన్నావు?" అన్న ప్రశ్న వినిపించింది. ఆ కంఠం మృధువుగానే ఉన్నప్పటికీ అత్యంత స్ఫుటంగానే ఉన్నది. ఆ గొంతు తనలోనుండే వినిపించిందో, బయటనుంచో వివరంగా చెప్పలేకపోయారు. వారు ఆశ్చర్యంతో, భయంతో టేబుల్‌పైన చూసే సరికి టేబుల్ క్లాత్‌పై సిరా ఒలికి మరక ఏర్పడింది. కానీ ఇప్పుడు అమ్మ రూపంతో దర్శనమిచ్చింది. భృకుటిలో కుంకుమ ఉన్నది. అది కుంకుమేనా అన్న సందేహంతో ఊదే సరికి గాలికిపోయింది. ఈ విధంగా జిల్లెళ్ళమూడికి వెళ్ళక ముందే అమ్మ వారింట్లో సుప్రతిష్ఠ అయి వారిని జిల్లెళ్ళమూడికి తీసుకు వెళ్ళింది.

1965 ఏప్రియల్ సంచిక కోసం వ్యాసాలను పంపవలసిందిగా శ్రీపాద వారికి ఉత్తరం వచ్చింది. ఒక్కసారి అమ్మను చూచినంత మాత్రానే వ్యాసం రాయటం ఉచితంగా తోచక జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అప్పటికే అమ్మ దినచర్యను సోదరి భవాని గ్రంధస్థం చేస్తుంది. అమ్మ వాటిని చూడమని ఆయనకు సలహా ఇచ్చింది. వారు వాటిని శాస్త్రాలవలె పరిశీలించి, ఉపనిషత్తులవలె అధ్యయనం చేసారు. ఆ అధ్యయనమే వారిలో బ్రహ్మాండమైన పరిణామాన్ని తీసుకువచ్చింది. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన వారి నిశితబుద్ధికి అమ్మ అప్పుడప్పుడు వెలుబుచ్చిన సూక్తులలో, సందేశాలలో, సిద్ధాంతాలలో విలక్షణత, వినూత్నత, విశిష్టత గోచరించాయి. అమ్మ వ్యక్తిత్వము, అమ్మ వాక్యాలు, వారిని ఆకట్టుకున్నాయి. అమ్మ వాక్యాలలో అత్యున్నతమైన అద్వైతము, దాన్ని పొందేందుకు అధునాతనమైన మార్గము కనిపించింది. వారికి దొరకనిది ఏదో దొరుకుతున్నట్లుగా, అందనిదేదో అతి సమీపంకి వచ్చినట్లుగా తోచింది.

అందుకే ఒకచోట "బ్రహ్మము గురించి ఇంద్రునికి ఉమా హైమావతి

చెప్పింది, ఐతరేయమహిదాసుకు దయామయి భూదేవి చెప్పింది. ప్రాయోపవేశము చేసిన ఉపకోశలుడికి అగ్నులు ఉపదేశించారు. నాకు అమ్మ వాక్కులు ఉపదేశించాయి" అని శ్రీపాదవారు ఉద్ఘాటించారు.

అమ్మ వాక్కుల్లోని ప్రత్యేకతే శ్రీపాదవారిని అమ్మకు సన్నిహితున్ని చేసింది. వారు తరుచూ జిల్లెళ్ళమూడి రావటం మొదలు పెట్టారు. అమ్మ వాక్కులను అధ్యయనం చేయటంతో పాటూ అమ్మ జీవితాన్ని కూడా తెలుసుకోవటంతో వారి హృదయంలో అమ్మ మేరుపర్వత శిఖరాగ్రం ఎక్కి కూర్చుంది. అమ్మ జీవితంలోని ప్రతి సంఘటన వారి మనస్సుపై చెరగని ముద్రను వేసింది. అమ్మ పలికే ప్రతి అక్షరమూ వారి పదునైన మేధకు మరింత పదును పెట్టింది. దానితో అమ్మ యెడల వారి పూజ్య భావము, అమ్మ అలౌకిక శక్తి యెడల విశ్వాసము, అమ్మ బోధల యెడల గౌరవము కలిగాయి. అమ్మ మంచితనము చూచి నిలువెల్లా కరిగిపోయారు. ప్రతి జీవి పట్ల అమ్మ చూపే కరుణను, వాత్సల్యాన్ని చూచి పులకించిపోయారు. అమ్మ అద్వైత సిద్ధికి ఆశ్చర్యచకితులయ్యారు. అమ్మకు గల భాషా సౌందర్యానికి, భావనా పటిమకు ముగ్ధులయ్యారు. అమ్మకు గల జ్ఞాపక శక్తికి అబ్బురపడ్డారు. అమ్మను పరిపూర్ణ మానవిగా పరిగణించారు.

ఒకసారి వారు అమ్మతో "అమ్మకి తానే అయి ఉండటానికంటే, లోకంవైపు చూడటానికి ఎక్కువ ఖర్చు అవుతుంది అని అన్నారు. వెంటనే అమ్మ ఈ వ్యాపారంలో లాభనష్టాలు లేవు నాన్నా అన్నది. తానే అయి ఉండటము, లోకం వైపు చూడటము రెండూ ఒకటే అమ్మకు. ఇది సహజ స్థితి. ఈ సర్వసమాన స్థితినే అమ్మ సహజ సమాధి అన్నది. అమ్మకు గల ఈ స్థితే శ్రీపాదవారిని జిల్లెళ్ళమూడికి బంధించింది.

అమ్మను దర్శించిన తరువాత వారు అనేక మహా పురుషులను కలుసుకున్నారు. వారి బోధనలను విన్నారు. అనేక గ్రంధాలను చదివారు. ఉపనిషత్తులనూ చదివారు. అవతార వ్యక్తుల జీవితాలు, బోధలు చదివారు. ఎక్కడా అమ్మలోని పరిపూర్ణత కనిపించలేదు. ఎక్కడా అమ్మ వాక్కుల్లోని

నిండుతనం వినిపించలేదు. అందువలనే వారు పూర్ణచంద్రుని చూడాలంటే మీరు జిల్లెళ్ళమూడి వెళ్ళవలసిందే. మరెక్కడా మీరు చంద్రవంకలను మాత్రమే చూడగలరు అనేవారు.

అమ్మను ఆశ్రయించి ఆధ్యాత్మిక పథంలో మన తప్పటడుగులను సరిద్దిమని, చైతన్యపు భాష నేర్పమని గుండె ధైర్యము ఇవ్వమని, ఆనందపు భుక్తి పెట్టమని, కష్టాలను ఆమె కడుపులో పెట్టుకోమని, పాపకూపంలో పడకుండా ఎత్తుకోమని అమ్మని అడగాలి అని సూచించారు.

పరమేశ్వరుడిని అమ్మగా కొలిచిన రామకృష్ణ పరమహంస వంటి వారు ఉన్నారు కానీ ఆ పరమేశ్వరుడే అమ్మగా వచ్చిందెపుడు, ఇదివరకు? అని ప్రశ్నించారు.

మానవిగా జిల్లెళ్ళమూడి కరణంగారి భార్య అమ్మ. ఆ సంబంధమే లేకుంటే అమ్మ మనకు అంది ఉండకేపోను. కష్టమో, నష్టమో అమ్మ ఆ గిరిలో ఉండబట్టే మనము పుణ్యమహోపుణ్యమహోపుణ్యంతవ దర్శనం'' అని అనుకో గలుగుతున్నాము అన్నారు శ్రీపాదవారు.

ఉపనిషత్తులు, ఆధ్యాత్మిక శాస్త్రములు, జిజ్ఞాసలు చేసి మనము అటూ ఇటూ సర్దుకోవచ్చు. కానీ ప్రతివారూ చేయలేరు ఈ పనిని. అమ్మే దానికి తగినవారు. అమ్మ వాక్యాలు జీవితానికి సంబంధించినవిగాను, జీవితంలోనే పొందటానికి వీలైనవిగాను ఉంటాయి. అమ్మ చేప్పేది దారి కాదు, గమ్యాన్నే చూపిస్తుంది. అమ్మ శాస్త్రాల్లోని మాటలు చెప్పదు. అయితే అమ్మ చెప్పేదంతా శాస్త్రమే అంటారు శ్రీపాదవారు. అమ్మ సన్నిధి అపురూపనిధి. అమ్మ ఐహికానికి, ఆముష్మికానికి వారధి.

ప్రకృతిని ఉపాసించి, ఆరాధించిన భౌతిక శాస్త్రవేత్త. నమ్మిన దానిని నిష్ఠతో కార్యాచరణ చేయగల కార్యవాది. కాలం వ్యర్థబుచ్చక అహరహము కర్మిష్టియై శ్రమించిన ఉత్తముడు. వర్ణవ్యవస్థ లేని సమాజానికై అమ్మ చూపిన బాటను వారు పలు ప్రసంగాలలో శ్లాఘించేవారు. ఆకలిబాధ పట్ల అమ్మకుండే

ఆరాటం, ఆమెలోని సహజమైన మమకారం వారినెంతో ఆకట్టుకున్నాయి. లోకానికే వెలుగులు విరజిమ్మే అమ్మ వాక్యాలను రెండు భాగాలుగా సంకలనము చేశారు. అర్కపురి విశేషాలను క్రోడీకరించారు. ఆయన నమ్మిన దానిని, ఆయనకు తృప్తి కలిగిన మార్గమును పదిమందికి చూపించాలని ఆరాటపడ్డారు. అమ్మతో సంభాషణలను మూడు భాగాలుగా పొందుపరిచారు. "అమ్మ చేప్పేది," "అమ్మను గురించి" "అమ్మ సూచించే కొత్త దారి" మొదలైన గ్రంథాలను ప్రజలకు అందించారు.

శ్రీపాదవారు అమ్మ గురించి ఆంగ్లములో వ్రాసిన పుస్తకంలోని కొన్ని భాగాలను పెద్దల సమక్షంలో అమ్మకు చదివి వినిపించారు. పాశ్చాత్య దేశాలలో ఆంగ్లభ్యాసమొనర్చి నిష్ణాతులైన వారి రచనను వింటున్న అమ్మ ఒకచోట ఆపమని చెప్పి "స్టమక్ ట్రబుల్" అను పదమును తీసివేసి "స్టమక్ డిజార్డర్" అని సరణ చేసింది. పాఠశాలతోనే పరిచయంలేని అమ్మకు ఆంగ్లభాషయందు ఇంతటి పాండిత్యమెలా వచ్చింది? అది శ్రీవాణి గిరిజాస్వరూపిణియగు అమ్మలోని సరస్వతీ స్వభావంగాక మరియేమిటి?

శ్రీపాదవారు, వెంకట్రామిరెడ్డిగారు, మరికొంతమంది పెద్దలు ఆగష్టు 15న అమ్మ చుట్టూ చేరి రాత్రి దాదాపు 3గం.లప్పుడు కబుర్లు చెబుతున్నారు. అవి ఉట్టుట్టి కబుర్లుకావు. వేదాలేమిటి? అవి ఎటువంటివి? మొ॥ విషయాల మీద చర్చిస్తున్నారు. వాదాలకతీతమైన అమ్మకు వేదాలు వినోదంగా ఉన్నాయి. నాలుగు వేదాలు పొయ్యి, చీపురు, కత్తిపీట, రోలు-రోకలి, పంచమ వేద చేట అని సరసంగా వివరించింది. అక్కడ గుమిగూడిన సమావేశమునకు సమమైన ఆవేశము గలదే సమావేశమని చక్కగా వ్యాఖానించింది. ఇంతలో సుప్రభాతం మొదలైంది. అందరూ వెళ్ళిన తరువాత వెంకట్రామిరెడ్డిగారు అమ్మ పాదాల చెంత చేరారు.

అమ్మ ఆయన్ను చూచి "ఏమిటి నాన్నా" అన్నది. "అమ్మా ప్రతి ఉదయం ఉత్తిష్ఠ హేమాతః అని మిమ్మల్ని నిద్రలేపటం అవసరమా? అట్లా లేపకపోతే మీకు మెలుకువరాదా? ఇంతకూ మీరు నిద్రపోతారా?" అని ప్రశ్నించారు. దానికి

అమ్మ "మీరు మేల్కొని, నన్ను లేపుతారు. నేను నిద్రపోతున్నానని మీరు మేల్కొలుపుతారు. మేల్కొలపడం మీకు అవసరం కనక నేను ఆటంకపరచును. నా నిద్ర నాకుంటుందని" నవ్వుతూ సమాధానమిచ్చింది.

శ్రీపాద వారు రాజమండ్రిలో అశువులు బాసినా, వారి మృతదేహం జిల్లెళ్ళమూడికి తీసుకురాబడింది. ముద్దుబిడ్డ మరణానికి అమ్మ ఎంత విలపించిందో వివరించలేము. అమ్మ కార్చిన కన్నీటికి అంతే లేదు. చివరిసారిగా ఆ శరీరాన్ని స్వహస్తాలతో స్నానం చేయించి అలంకరించింది. అంతిమయాత్రకు శరీరం కదులుతుండగా తనువెల్లా వాత్సల్యమై కన్నీటి వాగులతో ఆకళేబరాన్ని ముద్దు పెట్టుకున్న అమ్మను చూస్తే ఏ గుండె అయినా కరుగక తప్పదు.

శ్రీ ప్రభాకర కృష్ణ భగవాన్ అమ్మను దర్శించి అమ్మ సాహిత్యాన్ని మథించారు. అమ్మ సన్నిధిలో ఆయన అనిర్వచనీయమైన ఆత్మానందాన్ని అనుభవించారు. నాస్తికత, అకర్మణ్యత పెరిగిపోతున్న ఆ అణుయుగంలో ఆస్తికులును సరియగు ఆస్తికులుగా, నాస్తికులును కూడా ఆస్తికులుగా మారుస్తూ దైవత్వంతో నిండిన మాతృత్వంతో మన శరీరాన్ని, మనస్సుని, బుద్ధిని పునీతం చేస్తున్న ఈ అవతారమూర్తిని గురించి చెప్పటానికి కానీ, రాయటానికి కానీ తన వల్ల కాదని తెలియచేశారు.

సాంప్రదాయలకు అతీతంగా తన తండ్రికి తానేమీ సేవ చేసుకోలేక పోయానని విలపించే శ్రీమతి గాయత్రికి కర్మాధికారము ప్రసాదించి తనయులు లేక పోయినా తండ్రి చితికి నిప్పు అంటించే అధికారము కూతురికైనా ఉన్నదని అమ్మ క్రియాత్మకంగా చేయించి చూపించింది. శ్రీపాదవారు ఇతరులకు ఆచార్యులైన, అమ్మ పాదాల చెంత నిత్య విద్యార్థి. అమ్మను గురించి అంతా తెలుసుకుని ఇతరులకు వివరించి "నిన్నెరుగుదునని అనుటకు దమ్ములేదు" అన్న పరమ వినయశీలి.

అమ్మ దైవత్వం గురించి విన్నవారికి "ఆమెకు సంసారంతో ఏం పని?" అన్న ప్రశ్న ఉదయిస్తుంది. అందుకే అమ్మ "విన్నవాడు విమర్శిస్తాడు, కన్నవాడు

వివరిస్తాడు, వింటే విమర్శ కానీ కంటే వివరణ" అన్న అమ్మ వాక్యాలు అనుభవ సత్యాలు.

అమ్మ వివాహంకు ముందు శర్మగారు "ఎందుకమ్మా నీకివన్నీ? పెళ్ళితో నీకూ అవసరముందా?" అని అడిగారు. దానికి అమ్మ "పెళ్ళిలో పెద్ద పులి ఉన్నదని భయపడేవారి భయం పోగొట్టటానికి" అన్నది. అన్నింటి కంటే ప్రేమే గొప్పదన్న అమ్మ, ప్రేమ కంటే ధర్మం గొప్పదని దానికణుగుణంగా తన గృహస్థధర్మాన్ని ఆచరించే విధానాన్ని తలుచుకుంటేనే ఆశ్చర్యచకితులవుతాము.

మహాభారతంలో శ్రీకృష్ణుడు రాయబారిగా వెళ్ళేముందు బ్రాహ్మీముహూర్తంలో లేచి అర్ఘ్య, హోమ, జపాలు చేసినట్లు వ్యాసుడు వర్ణించాడు. దేవదేవుడైన శ్రీకృష్ణుడికి కూడా ఇవన్నీ అవసరమా? కృష్ణుడు ధర్మం గురించి మనకు తెలియజెప్పటానికే ఆ విధంగా చేసి ఉంటాడేమో. అమ్మ ప్రతిరోజూ నిద్రలేచి ముఖం కడుక్కొని మంగళసూత్రాలకు కుంకుమ పెట్టి వాటి మీదుగా నీరు పోసి ఆ తీర్థాన్ని మూడుసార్లు కళ్ళకద్దుకొని తీసుకొనేది. పూజలకు వచ్చేముందు నాన్నగారి పాదాలకు నమస్కరించేది. ప్రతి పనికి నాన్నగారి అనుమతి తీసుకునేది. అది చూస్తే చాలా ఆశ్చర్యమనిపిస్తుంది.

స్త్రీకి, పురుషుడికి ఏకపత్నీవ్రతం సంసారంలో పరమార్థ ప్రాప్తి హేతువులని సుచించటానికే అమ్మ అలా చేసేది. అమ్మ వ్యాక్యాలు కూడా ఆ భావాన్నే బలపరిచేవి. ఒకరు "అమ్మా సంసారంలో పడి కొట్టుకుంటున్నామమ్మా. ఇందులో నుంచి బయటపడే మార్గాన్ని తెలియజేయమని" అడిగారు. అందుకు అమ్మ "సంసారమంటే?" అని ప్రశ్నించింది. "భార్యా, పిల్లలు, దారేషణ పుత్రేషణ అంటారు కదమ్మా" అన్నారు. "నేను అట్లా అనుకోను. సంకల్పమే సంసారమంటాను" అన్నది అమ్మ. ఆ ప్రశ్న అడిగిన పండితుడు నిర్ఘాంతపోయాడు. "సంసారంలో తాను ఉండవచ్చు కానీ, తనలో సంసారం ఉండకూడదు" అని అమ్మ చెప్పింది. నీటిలో పడవ వుండాలి కానీ, పడవలో నీరుండకూడదు. పడవలో నీరుంటే మునిగిపోవటమే కదా! సంసార విషయంలో కూడా అంతే కదా! అని అమ్మ మనకు తెలియజెప్పింది.

భగవంతుడు సృష్టి చేసి అందుకు తాను బద్ధుడై తాను రాసిన నాటకంలో తానొక పాత్ర వహించి నాటక ధర్మానికి తలవంచి ఉండటమే సంసారం. అశ్వద్ధామ శరాగతికి ఉత్తర గర్భంలోని శిశువు మృతి చెందింది. నిత్య బ్రహ్మచారి స్పృశిస్తే పరిక్షిత్తు జీవిస్తాడన్నప్పుడు బ్రహ్మచారి అయిన శుక మహర్షి కూడా ముందుకు రాలేదు. శ్రీకృష్ణుడు స్పృశిస్తే పరిక్షిత్ జీవించాడని మహాభారతం ద్వారా విధితమౌతుంది. అమ్మకు ఉన్నట్లు కనిపించే సంసారం (నాన్నగారు, ముగ్గురు పిల్లలు) అమ్మలోని దైవత్వాన్ని సంకుచితం చెయ్యలేవు. అమ్మ సంసారం సర్వ సృష్టిని ఇముడ్చుకుంది. ఆ సంసారం సృష్టి కర్తను ఎంత బంధించగలదో అమ్మనూ అంతే. అమ్మ సృష్టి, స్థితి, లయాలను తనలో ఇముడ్చుకుంది కదా!

ఇద్దరన్నదమ్ములు జిల్లెళ్ళమూడిలో ప్రవేశించారు. పూరిపాకలో మంచం మీద మధ్యవయస్కురాలైన స్త్రీమూర్తి నుదుట రూపాయి కాసులా ఎఱ్ఱని కుంకుమబొట్టు, గుండ్రని కన్నులు, విశాలమైన మాతృమూర్తి చూపుల్లా దయతో భాసిస్తున్నాయి. ఆమె రెండుచేతుల నిండుగా గాజులు, మెడలో గొలుసులు, ముక్కున పాతకాలపు పుణ్యస్త్రీలు ధరించే అడ్డబాస, నత్తు, ముక్కుపుడక చూడగానే ఒక పవిత్రమైన సౌందర్యంతో నింపే మానవత్వంలో నుంచీ తొంగిచూసే దైవత్వం ఒలికించే మాతృరూపం. ఆమెయే "జిల్లెళ్ళమూడి అమ్మ".

మంచం చుట్టూరా ఆతృతగా బిడ్డలంతా పరివేష్టించి వున్నారు. చేతిలో కంచుపాత్ర, గరిటెతో పాయసం అందరికీ పంచబోతోంది. సంధ్య వెలుగు క్రీనీడలో కిరసనాయిలు లాంతరులో పచ్చగా కాంతి పసుపు రాసినట్లు ఆమె రూపం మరింత వింత కాంతుల సోయగాలీనుతున్నాయి, ఆ ఇద్దరన్నదమ్ములు లోపలికి ప్రవేసించారు. అమ్మ తల ఎత్తి చూచి "ఎవరువారు?" అని ప్రశ్నించింది. "ఎవరో తెలియదా అమ్మా!" అన్న వింత ప్రశ్నకు అక్కడ కూర్చున్నవారంతా విభ్రాంతి చకితులయ్యారు, సన్నగా, ఎత్తుగా నిమ్మపండు వంటి ఛాయతో, దొండపండు వంటి చిన్ననోరు, ఏదో మత్తులో, ఆనందంలో తేలిపోతున్నట్లుండే యోగి నేత్రాలు పరకాయించి చూచింది అమ్మ. "ఓ వేదవ్యాసా! వచ్చావా రా లోపలికి" అంటూ ఆపేక్షగా దగ్గరికి తీసుకుంది.

ఆయన జిల్లెళ్ళమూడి రావటం అమ్మను చూడటం అదే మొదటిసారి. అప్పటికి ఆయన హైదారాబాద్ లో జాయింటు కలెక్టరుగా పనిచేస్తున్నారు. ఆయన ఒక కాలేజీ విద్యార్థిలా ఉన్నారు కానీ ఒక ఐ.ఎ.ఎస్. అధికారి అని ఎవ్వరూ ఊహించలేదు. కానీ అమ్మ పసిగట్టి వెంటనే పేరుపెట్టి మరీ పిలిచింది. ఆయనతో వచ్చినతను ఆయన తమ్ముడు భరద్వాజ.

సరిగా అదే సమయానికి గిన్నెలోని పాయసం అందరికీ పంచబోతోంది అమ్మ, రావటం అంటే ఇలాగ రావాలి, సమయానికి, మీరూ వున్నారు ఎందుకూ? అని గిన్నెలోని పాయసం తీసింది. వేదవ్యాస్ అన్నయ్య ముఖంలో ఆమెకు పసిపిల్ల వాని అమాయకత్వంతో పాటు, దైవికమైన తేజస్సు స్ఫురించి వుంటుంది. అన్నయ్యను దగ్గరకు రమ్మని తన చేతిలోని పాయసాన్ని స్వయంగా అతనికి తినిపిస్తూ ఆప్యాయంగా తన ఒడిలోకి తీసుకుంది అమ్మ. వేదవ్యాస్ అన్నయ్య ఎట్టి సంకోచం లేకుండా ఆమెను గట్టిగా కౌగలించుకొని ఒడిలోకి ప్రేమగా వాలిపోయాడు అమ్మ ముద్దలు తినిపిస్తూనే వుంది. అతనూ తింటూనే వున్నాడు తల్లి ముఖంలోకి చూస్తూ, మిగతా వారంతా ఆ ప్రసాదం వారికి మిగలదేమో ననుకున్నారు.

అది గమనించిన అమ్మ మిగిలిన వారికి పాయసం ప్రసాదంగా పంచింది, వెనకనే వున్న భరద్వాజన్నయ్యకు పెట్టింది. అమ్మ ప్రేమగా, వాత్సల్యంగా వేదవ్యాస్ అన్నయ్య ముఖంలోకి చూస్తూ "నేనెలా వున్నానురా! నన్ను చూస్తే నీకేమనిపిస్తోంది? కొత్తగా లేదా"? అని అడిగింది, దానికి అన్నయ్య "సరిగ్గా అమ్మలాగే ఉన్నావు కొత్త ఎందుకు ? నీవు పెడ్తున్నావు, నేను తింటున్నాను. మధ్యన వీళ్ళంతా ఇరుకున పడిపోయారు" అన్నాడు.

"నీకు అమ్మ ఎలా ఉండేదో జ్ఞాపకం వుందా!" అన్నది అమ్మ. "ఎందుకు లేదు? ఇప్పుడు నిన్ను చూస్తున్నంత స్పష్టంగా గుర్తు వున్నది". అన్నాడు వారికి చిన్నతనంలోనే మాతృ వియోగం సంభవించింది. ఆ పట్టు పట్టూ వేదవ్యాసన్నయ్య, భరద్వాజ అన్నయ్య నాలుగు రోజులు జిల్లెళ్ళమూడిలో ఉన్నారు, ఎన్నెన్నో వింత

వింత సంభాషణలు, విచిత్రమైన ప్రశ్నోత్తరాలు, చుట్టూ వున్న వారికి చెరుకురసం తాగినంత తృప్తి వారి సంభాషణలలో దొరికింది.

ఆరోజు సాయంత్రం స్నానం చేసి అమ్మ పాకలో నుంచీ వేదవ్యాస్ భుజం మీద చేయివేసి బయటకు వచ్చింది. ఆ అన్నయ్య స్నానజపధ్యానాదులు పూర్తి చేసుకొని ఆపేక్షగా అమ్మ నడుంచుట్టూ చేయివేసి నడుస్తున్నారు. వున్నట్లుండి "అమ్మా నిన్ను ఎత్తుకోనా?" అని ప్రశ్నించాడు. "అమ్మను మీరు మోయగలరా? ఆమె ఈ విశాల విశ్వానికి మాతృమూర్తి. మీ వల్ల అవుతుందా?" అన్నారు ఎవరో.

మరుక్షణంలో వారు ఎడంచేత్తో అమ్మను చంటి పిల్లను ఎగరేసి చంకన వేసుకున్నట్లుగా వేసుకున్నాడు. అందరూ భయభ్రాంతులై చూస్తున్నారు. 100 గజాల దూరం వరకూ అమ్మను ఎత్తుకు తీసుకు వెళ్ళి భోజనశాల మెట్ల వద్ద అమ్మను క్రిందకుదించారు. అప్పటి వరకూ ఎన్నడూ బిడ్డలతో బయటకు రావటం కానీ చనువుగా వుండటం కాని ఆరోజుల్లో గృహిణిగా వున్న అమ్మ చేసేది కాదు. "డాబా మీద కూర్చుందామా? గాలి ఎంతో బాగుంది. చందమామ ఉదయిస్తున్నాడు" అన్నది. చిన్నబాబుకు జాబిలిని చూపించే తల్లి మాదిరిగా చూపించింది.

వేదవ్యాస్ అన్నయ్య ఆకాశంలో వెలిగే సన్నని చంద్ర వంకను, దానిపైగా ఎర్రగా వెలుగుతున్న కాంతిని ముస్లిం లీగ్ వారి మార్కు మాదిరిగా చంద్రుడు, నక్షత్రంతో కలిసి కనిపిస్తున్నాడు. ఏదో రక్తపాతాన్ని సూచిస్తున్నాడా అన్నట్లుగా వుంది అన్నాడు. సింహాద్రి శాస్త్రికి అందమైన చందమామను అంత భయంకరంగా వ్యాఖ్యానించటం విపరీతంగా తోచింది. "అదేం విపరీత పోలిక? అందంగా వున్న చందమామను ముస్లిం లీగ్ మార్కు అంటారేమిటి? పైగా రక్తపాతం?" అన్నాడు. అవును పైన వెలిగేది అందమైన నక్షత్రం కాదు ఎర్రగా నిప్పు కణికలా వెలిగే అంగారక గ్రహం (కుజుడు) పైగా కార్తీక మాసం, కుజ చంద్రులు కలిసి వున్నారు. "సరిగా అర్ధరాత్రికి నెత్తిపైకి వస్తారు?" అన్నాడు అన్నయ్య.

అమ్మ ఏమీ తెలియనట్లుగా "ఏమిటి దీని ఫలితము, ఏమి జరుగుతుంది?" అని ప్రశ్నించింది. ఎవరో ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తి ఆ రోజు మరణిస్తారు. అంతే కాదు కుజుడు, చంద్రుడికి అంత దగ్గరగా రావడంతో ఘోరంగా హత్య చేయబడతాడు. రక్తపాతం, ప్రపంచం అంతటా విషాదం విలయతాండవం చేస్తుంది. అన్ని దేశాల జండాలు అవనతం చేస్తారు. ఇదీ దాని ఫలితం అన్నారు అన్నయ్య. అయినా ఎవరూ నమ్మలేదు.

అన్నయ్య ఆరోజే హైద్రాబాద్ వెళ్ళాలి. మర్నాడు డ్యూటీలో చేరాలి. అమ్మ "నాన్నా! రేపు ఆఫీసు కదా! రాత్రికి ప్రయాణమా?" అని అడిగింది. "అవునమ్మా! రేపు ఆఫీసులో వుండాలి. కానీ నేను వెళ్ళటం లేదు. రేపు ఆఫీసులకు శెలవు దినం ప్రకటిస్తారని'' చెప్పాడు. పక్కనే ఉన్న అమ్మ పెద్ద కొడుకు సుబ్బారావన్నయ్య, సింహాద్రి శాస్త్రి, భరద్వాజ ఇంకా మరికొందరు ఈ వింత మాటలు విన్నారు.

ప్రళయం లాంటి ఆ మాటలు వినగానే అమ్మ కన్నీరుమున్నీరుగా విలపించింది. కాలి మట్టెలు, చేతి వుంగరాలు ఊడదీసి కింద పోగుపెట్టింది. మర్నాడు ఉదయం కాఫీ తాగుతున్న వేదవ్యాస్ అన్నయ్య దగ్గరకు సుబ్బారావన్నయ్య సుడిగాలిలా ఉరుకుల పరుగులతో వార్తాపత్రిక పట్టుకు వచ్చాడు. అన్నయ్యా! రాత్రి నువ్వు చెప్పినట్లే సరిగ్గా రాత్రి 12గం॥లు దాటాకా **22-11-64** తేది అమెరికా అధ్యక్షుడు కెనడీ దారుణంగా హత్య చేయబడ్డాడు. ప్రపంచం అంతా విషాదమలుముకున్నది. అన్ని దేశాల జాతీయ పతాకాలు అవనతం చేయబడ్డాయి. అన్ని ఆఫీసులకు, విద్యాలయాలకు శెలవు ప్రకటించారు. అన్నయ్య జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధానంలో మరో రోజు వుండిపోయాడు. ఈ సంగతులన్నీ జగన్మాత అయిన అమ్మకు తెలియక కాదు కదా! వేద వ్యాసన్నయ్యకు ఎస్ట్రాలజీలో వున్న గొప్పతనాన్ని అందరికీ తెలియచేయటానికి చేసిన ఎత్తుగడే ఇది. అమ్మ తనకు తెలిసిన విషయమైన తన పిల్లల ద్వారా ప్రకటింపబడేటట్లు చేసి పదిమందీ వారి గొప్పతనానికి అబ్బురపడుతుంటే ఆనందించటం అమ్మ యొక్క లీలా వినోదం.

వేదవ్యాస్ అన్నయ్య గొప్పతనాన్ని మరొకచోట రామకృష్ణ అన్నయ్యకు మృత్యుగండం వుందని తెలియ చెప్పటం ద్వారా నిరూపించింది. వీరి అన్నగారైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు "విశాఖపట్నం వెళ్తున్నానమ్మా! ఆశీర్వదించమ"ని అడిగారు. దానికి అమ్మ "నా ఆశీర్వచనం ఎప్పుడూ మిమ్మల్ని వెన్నంటే వుంటుంది నాన్నా!" అని చెప్పింది.

విశాఖ వెళ్ళనా అని అడిగితే అమ్మ కనక వెళ్ళవద్దంటే దాన్ని అతిక్రమించలేను కాబట్టి వెళ్తున్నానని బొట్టు పెట్టించుకున్నానని తెలియ చేసారు. విశాఖలో వారి పీఠాన్ని స్థాపించి అనేక మందికి జ్ఞానభిక్ష పెట్టిన మహనీయులు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు, దానితో పాటు అమ్మకు మక్కువైన హోమియోపతి వైద్యం పలుశాఖలుగా విస్తరించేట్లు చేసారు. 1979 లో నవంబరు 11న జరిగిన లలితాకోటి నామపారాయణకు ఆయన శిష్యులు పలువురిని జిల్లెళ్ళమూడికి పంపటం గమనార్హం.

ఇటువంటి పుత్రులను గన్న అనంతాచార్యులుగారు ధన్యులు. కృష్ణమాచార్యులుగారు విశాఖలో పీఠాన్ని నెలకొల్పితే వేదవ్యాస్‌గారు గవర్నమెంట్ అధికారిగా వుంటూ కూడా తన ఆధ్యాత్మికోన్నతిని పటిష్ఠ పరుచుకున్నారు. చిన్నతనంలోనే అనంతాచార్యులుగారు పిల్లలకు సంస్కృతము, జ్యోతిష్యము, వేదాలు, మంత్రశాస్త్రం, ఆయుర్వేదం నేర్పించారు. ఒంగోలులో సాయిమాష్టారుగా, ఆచార్య భరద్వాజగా విశ్వవిఖ్యాతి గాంచి, అనేక శిష్యపరంపరను ఏర్పరుచుకొని పిన్నవయస్సులోనే భగవతి సన్నిధికి చేరిన కదంబపుష్పము భరద్వాజన్నయ్య, ఆయనతో నాకు అమ్మ దగ్గర పరిచయం అవటం నా అదృష్టంగా భావిస్తాను.

శ్రీ భరద్వాజ అన్నయ్య ఎక్కిరాల అనంతాచార్యులు గారి కనిష్ఠ పుత్రుడు. భరద్వాజ అన్నగారు ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు, మాష్టర్ ఇ. కె. గా లబ్ధ ప్రతిష్ఠులు, భరద్వాజ అన్నయ్య ఆధ్యాత్మిక సంపన్నుల కుటుంబములో జన్మించారు. ముందు నుంచీ వారికి అవతారమూర్తులన్నా యోగులన్నా తగని ప్రీతి. అదే విధంగా మాతృశ్రీ అనసూయా మహాదేవిసన్నిధిలో కొంతకాలం ఉన్నారు. అప్పుడు వారూ, శ్రీపాద వారు అమ్మతో అనేక అధ్యాత్మిక సంభాషణలను

జరిపారు. ఆ తరువాత ఇంగ్లీషు మాస పత్రికలో భరద్వాజ వ్యాసాలు రాసారు అన్నయ్య.

భరద్వాజ అన్నయ్య చిన్నతనంలోనే మాతృప్రేమ కరువైంది. హైమను చూచినప్పుడు హైమలోని స్వచ్ఛత అన్నయ్యను ఆకట్టుకుంది. హైమకు ఆరోగ్యం సరిగాలేనందున అమ్మ కూడా అన్నయ్యను ఎక్కువ కాలం హైమతో గడపమనేది. ఏ రోజు అన్నయ్య కనిపించకపోయినా ఏదో లోపించినట్లు బాధపడేది హైమ. "వసంతకాలంలోని నిర్మలము, మేఘంనాచ్ఛాదితమూ అయిన సుప్రభాతపుటకాశంలో మాత్రమే హైమయొక్క అమలినము, అపారమైన ప్రేమనూ, చిక్కని ఆపేక్షనూ, ఆమె మనస్సులోని మలయిమారుతపు స్వచ్ఛతను చూడగలం" అని భరద్వాజ అన్నయ్య అన్నారు.

ఒకసారి భరద్వాజ అన్నయ్యతో హైమ "నేను నీకు అమ్మనై, తల్లి తనమూడేళ్ళ బిడ్డకు ఎలాంటి సేవచేస్తుందో అనగా నీళ్ళు పోయడం, అన్నం పెట్టడం, తలదువ్వటం, నిద్రపుచ్చటం మొ॥ పనులన్నీ నేనేచెయ్యాలని వుందని" అన్నది. భరద్వజ అన్నయ్య చాలాకాలం హైమవద్ద పసిబిడ్డమాదిరిగా పెరిగారు.

లోకంలో లుప్తమైపోతున్న ప్రేమతత్వాన్ని పునరుద్ధరించటానికి, గుప్తమై పడివున్న మానవత్వాన్ని జాగృతం చేయటానికి జీవికి జీవికి మధ్య పవిత్ర బంధాన్ని అనురాగాన్ని పెంపొందింపచేయటానికే అమ్మ అవనీస్థలిపై అవతరించింది. ఆ మార్గంలోనే హైమ మనస్సు ఆకృతిధరించింది. మానవిగా పుట్టిన హైమను మాధవిగా రూపొందించింది అమ్మ.

అమ్మ సర్వాలంకార భూషిత. అలంకరణ అందంగా వుండేందుకని మన ఉద్దేశం. బాహ్యాలంకరణ లోపలి ఆధ్యాత్మిక స్థితిననుసరించి వుండటానికి నిర్ణయింపబడినది. శాస్త్రకర్తల చేత విష్ణువు, లక్ష్మీదేవి వారు ధరించిన ఆభరణాలు వాళ్ళు కల్యాణ గుణప్రపూర్ణలు అని వర్ణించబడ్డారు. "కళంకం లేనిదే అలంకారం" అని తెలియజేసింది అమ్మ. అన్ని కళంకాలకు కారణం అహంకారం. కళంకరహితం అంటే అహంకార రహితమని అర్థం. అంతా తానై వుండటం, ఆ

చరమస్థితే అలంకారం. ఒకమారు అమ్మ కిరీటాన్నెవరో దొంగతనం చేసారన్నారు. దానికి అమ్మ నా "కిరీటం ఎవరూ దొంగలించలేదు. అది ఒకరు పెడితే వచ్చింది కాదు. ఒకరు తీస్తే పోయేది కాదు" అన్నది. అమ్మే అన్నీ అయి, అర్థం కానిదై, ఆద్యంతములు లేనిదై, ఆద్యంతములూ తానే అయి, అడ్డులేనిది, ఆధారమైనదీ అయిన అమ్మ అవటమే అలంకారం.

అమ్మలోని సర్వత్వం కిరీటం. సర్వకారిణి అవటమే గాజులు, వుంగరాలు. తన నడకే సృష్టినడకై, సర్వాన్ని తన పాదాలలో ధరించటమే బంగారు మట్టెలు, పట్టాలు. తానే మూడే, ముడులు వేసుకుని త్రిపుటి అయి, త్రిపుర సుందరి అవటమే కేశాలంకరణ. శబ్దరూపిణి అయి, సరస్వతియై, సర్వసృష్టినీ తన వాక్కుగా చేసుకోవటమే ఆమె కంఠాభరణాలు, సృష్టిస్థితి లయలు తన ఉచ్ఛ్వాస్వనిశ్వాస సంధులుగా, తన శ్వాసలో సర్వ కాలాన్ని బంధించింది. కనుకనే ఆకాశంలో వ్రేలాడే బ్రహ్మాండంలా వుంది ఆమె బులాకీ. ఈ ఆభరణాలన్నీ ఏ బిడ్డలు సమర్పించుకోక ముందే వున్నాయి. అమ్మను మొదట్లో దర్శించిన వారు అమ్మ ఎంత నిరాడంబరంగా వున్నదో చెప్తారు. అమ్మ, రాజమ్మగారు కలిసి తీయించుకున్న ఫోటోలో అమ్మ నిరాడంబరత స్పష్టంగా కనిపిస్తుంది. ఎత్తు పల్లాలుగా గడ్డలు, గడ్డలుగా వున్న నేల మీదే అమ్మ కొంగు పరుచుకుని హాయిగా పడుకునేదన్న సంగతి తెలిస్తే చదువుకున్నామని మిడిసిపడే వారికి, అమ్మ అలంకరణ చూచి విడ్డూరంగా భావించే వాళ్ళకు సరియైన సమాధానం లభిస్తుంది.

భరద్వాజన్నయ్య అమ్మతో ఆధ్యాత్మిక పరమైన చర్చలు చేసేవారు. అమ్మ తన దగ్గర వున్నవారితో భరద్వాజ ఎప్పుడు వచ్చినా ఆటంకపరచవద్దని ఆదేశాన్నిచ్చింది. ఒకసారి భరద్వాజ అన్నయ్య అమ్మతో మాట్లాడాలని వెళ్ళారు. ఆ సమయంలో అమ్మ స్నానం చేస్తున్నది. కానీ ఆయనకు ఎట్టి అభ్యంతరం ఎదురవ్వలేదు. స్నానాల గదిలోకి వెళ్ళి అమ్మతో సంభాషించారు. ఈ విషయం తెలిసిన తంగెళ్ళ వెంకటసుబ్బయ్య గారు భరద్వాజ అన్నయ్య ఆచార్య పీఠాన్ని అధిరోహించాక "ఏకాంతంగా బట్టలు లేకుండా స్నానం చేస్తున్న ఒక స్త్రీ వద్దకు

మీరు వెళ్ళినప్పుడు మీ "స్టేట్ ఆఫ్ మైండ్" అంటే మానసిక స్థితికి ఎలా ఫీలయ్యారని?" అడిగారు. దానికి ఆచార్య భరద్వాజ గారు "ఆమె స్త్రీ, నేను పురుషుణ్ణి అన్న భావన లేదు. 2,3 సం॥ల పిల్ల బట్టలు లేకుండా కలసినప్పుడు , బట్టలు లేవే అని సిగ్గు పడదు. చూచే మనము సిగ్గుపడము. అలాగే కామన్‌గానే మాట్లాడి వచ్చాను" అని చెప్పారు. దీనిని బట్టి భరద్వాజ అన్నయ్య దేహభావాన్ని జయించారని అవగతమౌతుంది. కామాన్ని జయించిన వ్యక్తికే అట్టి స్థితి ఉందంటుంది శాస్త్రం. కామాన్ని జయించిన వాడే యోగి. భరద్వాజ అన్నయ్య అమ్మ దగ్గర పసిపిల్లవాడిగా వున్నారు. కానీ ఆ తరువాత ఆచార్య స్థానాన్ని అధిరోహించారు.

గీతలో "ఈశ్వర సర్వభూతానాం హృద్దేశోర్జునతిష్ఠతి" అంటే సకల ప్రాణుల హృదయమునందు ఈశ్వరుడు నివసించుచున్నాడని అర్జునికి కృష్ణుడు చెప్పిన సత్య రహస్యం, భగవంతుని సస్వరూప జ్ఞానాన్ని గురించి ఆచరింపుటకు నోచుకోలేదు. కారణం మనలోవున్న కామక్రోదాదుల వల్ల ఆత్మతల్వానికి దూరంగా వుంటున్నాం. అదే మన అజ్ఞానానికి మూలం. దానినే కృష్ణభగవానుడు "మమమాయాదురత్యయా" నామాయను జయించటం దుర్లభం అని చెప్పాడు. మనకు తరుణోపాయం "శరణం సద్గురు శరణం" అన్నికష్టాలను తొలగించి అభీష్టాల నొసంగి సంసార సాగరమును దాటగల జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

భరద్వాజ అన్నయ్య వ్రాసిన "The Life and teaching of mother" అన్న గ్రంథంలో అమ్మ గురించి బామ్మ చెప్పిన విషయాన్ని వ్రాశారు. "ఒక ముద్ద అన్నం గానీ, కంటి మీద కునుకు గానీ ఎరుగదు అని బామ్మ నిట్టూర్చి, శైశవంలో కూడా ఎవరినీ తనకిది కావాలని అడగలేదు. పసితనంలో పాలకోసం కూడా ఏడ్చి ఎరగదు. సమయం చూసి పాలు పట్టటం అమ్మమ్మ వంతే అయ్యేది. అయినప్పటికీ అమ్మ క్రుశించిపోవడం కానీ, బలహీనమవటం కానీ లేదు" అని తెలియచేసింది.

ఏమి తిన్నా ఇమడని ఒకానొక వ్యాధి తనకు రావడం వల్ల తాను ఆహారం

తీసుకోవటం లేదని తేల్చివేసింది అమ్మ. మహర్షులకు అవతారమూర్తులకు అటువంటి వ్యాధి ఒక వరం లాంటిది కాబోలు. ఏదో ఒకటి పుచ్చుకోమని బలవంతం చేస్తే రోజుకు మూడు, నాలుగు మార్లు ఒక గుక్కెడు కాఫీ మాత్రం తాగేది. ఒకరు అమ్మను "మీరు ఆహారం వదిలేసారట కదా'' అని అడిగారు. దానికి అమ్మ "నేను ఆహారాన్ని వదల లేదు. ఆహారమే నన్ను వదిలేసింది'' అని సమాధానమిచ్చింది. ఆహారం నన్ను వదిలించి అన్న మాటలో ఈ ప్రకృతి సూత్రమే ధ్వనిస్తుంది. సామాన్య మానవుడీ ప్రకృతి సూత్రంలో చిక్కుకుని ఉంటాడు. అమ్మను మాత్రం ఏ ప్రకృతీ బంధించలేదు. "నీకు ఆకలి వేయదా అమ్మా?'' అని అడిగితే "ఈ కలిలో నాకు ఆకలి లేదు'' అని ప్రత్యుత్తరం ఇచ్చింది. సర్వమూ తానైన శక్తికి ఏదీ ప్రత్యేకించి వదిలివేయడం ఉండదు అన్న సత్యాన్ని పునరుద్ఘాటించింది అమ్మ.

అమ్మ తనని దర్శించిన వారందరినీ భోజనాలకు అన్నపూర్ణాలయంకు పంపి తాను లోపలికి వెళ్ళింది. అప్పుడు లోపల అమ్మతో కొద్దిమంది మాత్రమే ఉన్నారు. ఉన్నట్టుండి అమ్మ ఎవరినో సంభోదిస్తూ "అమ్మా! శ్యామలా! నిన్ను ఎవరు చూస్తారు. నీకో చపాతీ చేయించిపెట్టనా?'' అన్నది. తన ప్రక్కనున్న వారితో "చపాతీ చేసి తీసుకురా'' అని చెప్పింది. ఎవరీ అదృష్టవంతురాలు అనుకున్నాడు భరద్వాజ అన్నయ్య అమ్మ ఏమైనా ఆహారం తీసుకుంటే అది తన కోసం కాదనీ ఎవరి కోసమో అట్లా స్వీకరిస్తుందని స్పష్టమయింది.

అమ్మ ప్రక్కవారితో మాట్లాడుతూ, పరధ్యానంగా "మూడు రోజుల నుంచీ చపాతీ చేసి పెట్టమని అడుగుతున్నా సత్యం ఇంతవరకూ చేసి పెట్టలేదు. ధనవంతులైన వారు వారికి కావలసినవి తెప్పించుకుంటారు. బీద వారిని, నన్నే నమ్ముకుని తపస్సు చేసుకునే వారిని నేను చూడకపోతే వారిని ఎవరు ఆదుకుంటారని'' తెలియచేసింది.

"పండరీపురంలో ఒక కొండజాతి దంపతులకో కుమార్తె ఉంది. ఆమె సంసారంలోని కష్టాలు భరించలేక తపస్సు చేసుకునేందుకు అడవుల్లోకి పోయింది.

అరణ్యానికి పోయినట్లు ఆమె పెనిమిటికి తెలిసింది. ఆమెను వెతికి పట్టుకుని క్రూరంగా హింసించాడు. ఆమె గర్భిణి, గృహిణిగా జీవిస్తున్నా ఆమె మనస్సు మాత్రం పవిత్రంగానే వుంది. ఆమె గర్భంలో శిశువు చనిపోయింది. ఆమె మళ్ళీ తపశ్చర్య నారంభించింది. పూర్వపు స్త్రీ కాదామె యిప్పుడు నిరంతర ధ్యానంలో గడుపుతూంటుంది. ఆమె తల్లి తెనాలిలో మాతాతగారింట్లో పనిచేసేది" అని అమ్మ భరద్వాజ అన్నయ్య వాళ్ళకు తెలియజేసింది.

ప్రతి సం॥ ఆగష్టు 19న భరద్వాజ అన్నయ్య అమ్మ దగ్గరకు వచ్చినరోజు గాబట్టి పండుగ చేసుకునేవాడు. **1964**లో ఆ రోజున క్షీరాన్నం చేయించి అమ్మకు నైవేద్యమిచ్చాడు. పెద్ద గెన్నెనిండా పరమాన్నాముంది, పొయ్యిమీద నుంచి ఉన్న పళంగా తెచ్చారు పొగలువస్తూ చాలా వేడిగా వున్నది. సాధారణంగా అమ్మ ఒక చుక్క నోటిలో వేసుకుని మిగిలింది అందరికీ పెట్టమని యిచ్చేసేది. కానీ ఈ సారి మాత్రము అమ్మ ఆ వేడి వేడి పాయసాన్ని తినటమారంభించింది. ఈ సమయంలో అమ్మ ప్రదర్శించే 'పరధ్యానం' మళ్ళీ కనపడింది. ఎంతో త్వరగా ఆ గెన్నెలోని పాయసమంతా ఆరగించింది అమ్మ. బాగా తినగలవాళ్ళక్కూడా ఎక్కువయ్యేంత పాయసమది. అమ్మ తినే సమయంలో అమ్మ దృష్టి మాత్రం తను కూర్చున్న మంచానికి, ఎదురుగా ఉన్న గోడకి మధ్య నిలచివుంది. "కొంచెం తిను, ఇంకొంచెము తినమ్మా" అని ఒక పసిపిల్లకు తినిపించినట్లు మాట్లాడింది. తినటం అంతా పూర్తి అయినాక మన స్ఫురణలోకి వచ్చి "అంతా అయిపోయిందే! నీవేం తింటావు? అని అడిగింది. భరద్వాజ అన్నయ్య చెప్పేలోపుగానే ఖాళీ గిన్నెలో చేయి కడుగుకొని "నువ్వు యిది తీసుకో" అన్నది. అమ్మ పరధ్యానమూ, ఒక్క వ్యక్తీ తినుటకసంభవమైనంత పాయసం స్వీకరించటమూ, అమ్మ పలికిన మాటలూ అంతా ఒక రహస్యాన్ని విశదీకరిస్తున్నట్లే ఉంది.

అమ్మ ఏమైనా తిన్నా, కావాలని కోరినా ఆపదలో ఉన్నవారికో తపస్సు చేసుకునే వారికో అయి ఉంటుంది. "నీకేమి కావలసి వచ్చినా నీవు ఎక్కడైనా కొనుక్కు తినగలవు. ఎక్కడో అరణ్యాలలో ఉన్న వారి కొరకే అడుగుతుంటాను. వారి అవసరాలు ఎవరూ గమనించరని, వారిని నేను చూడకపోతే ఎవరు చూస్తారు" అన్నది అమ్మ.

జిల్లెళ్ళమూడిలో అమ్మ దర్శనమై తిరిగి వచ్చాక అమ్మ స్వరూపం, అమ్మ మాటలు, హావభావాలు సాన్నిధ్యంలో అనుభవించిన మనశ్శాంతి మన మనస్సుపై చెరగని ముద్రవేస్తాయి. పరిస్థితుల ప్రాబల్యం వల్ల తరుచూ అమ్మ దగ్గరకు రాలేకపోతున్నామని బాధతో విచారిస్తున్న బిడ్డతో శరీరం ఎక్కడుంటే ఏంనాన్నా! మనస్సు ఇక్కడ ఉంటే చాలు. "ధ్యాసే ధ్యానం" అన్నది. సాధనా మార్గంలో అప్రయత్నమైన, అసంకల్పితమైన ప్రగతిని అమ్మ సూచిస్తూ "సాధ్యమైనదే సాధన ఆవేదనే ఆరాధన" అని వివరించింది. అమ్మ సాన్నిధ్యంలో అనుభవించిన శాంతి, ఆనందాలకొరకై పడే తీవ్రమైన తపనే ఆవేదన.

ఈ శాంతి, ఆనందాలే ముక్తి స్వభావాన్ని విశదపరుస్తాయని చెప్పారు. "ముముక్షత్వమే మోక్షమన్నది" అమ్మ. అమ్మ సాన్నిధ్యంలో ఉండాలన్న ప్రగాఢ భావమే మనస్సును ఇతర కోర్కెలను అధిగమించేటట్లు చేస్తుంది. వ్యక్తిత్వం వినయశీలమై, స్వీయ అసమగ్రత కళ్ళకు గట్టినట్టుగా శ్రద్ధాళువుగా మారతాడు.

ఏసుక్రీస్తు "ఆత్మస్థైర్యంతో పేదలు అదృష్టవంతులు, వారిది స్వర్గ సామ్రాజ్యమే గనుక విచారించే వాళ్ళు అదృష్టవంతులు ఆదరింపబడతారు కనుక సత్ప్రవర్తనాక్షుదార్తులు అదృష్టవంతులు వారి క్షుద తీరుతుంది కనుక అని" ప్రకటించారు.

అమ్మ ఒకసారి అన్నది "ముక్తి పొందేది కాదు. నిర్ణీతమైన తరుణంలో దైవసంకల్పంచేత అనుగ్రహింపబడుతుంది. ఆ క్షణం వచ్చినప్పుడు ముక్తిని పొందేందుకు కావలసిన అర్హత కూడా దానంతట అదే వస్తుంది. అర్హత అనేది కూడా పొందేది కాదు. ఆ విషయం తెలియని వారికి మానవ ప్రయత్నం వలననే ఇది సాధ్యపడుతున్నదనిపిస్తుంది. 'అన్నీ అందరికీ చెప్పం, కొందరికి కొన్నే తెలుసు, అన్నీ అన్ని వేళల్లో చెప్పం' అన్నది అమ్మ. అమ్మ మాటలు జీవిత సత్యాన్ని కాచి వడకట్టినట్లుంటాయి. ఇవన్నీ అందరికీ నిత్య జీవితాల్లో జరిగేవే. పాలనతో కాక, లాలనతోను, అధికారంతో కాక అనురాగంతోను, శిక్షతో కాక శిక్షణతోను ఈ మానవాళి మనస్తత్వంలో మార్పు తీసుకురావడం కొరకు అమ్మ మానవ రూపం ధరించింది.

జిల్లెళ్ళమూడి ఒక విలాసయాత్రా స్థలం కాదు. ఇది ఒక పుణ్యక్షేత్రం. ఒక అవతారమూర్తి చరణ రజస్సుతో పునీతమైన దివ్య స్థలం. అక్కడకు ఏదో విలాసం కోసం వెళ్ళటం కాక ప్రతి ఒక్కరూ అమ్మను చూచి "నేను అమ్మకోసం ఏం చేయగలుగుతున్నాను?" అన్న ప్రశ్న వారిలో ఉత్పన్నం కావాలి. రాముడిలోని ధర్మదీక్ష, కృష్ణుడిలోని సర్వ సామర్థ్యం, బుద్ధునిలోని కారుణ్యం, క్రీస్తులోని సహనం అన్నీ ప్రేమలో సంగమించి ప్రేమమూర్తి అమ్మగా పృథ్వీస్థలిపై అవతరించింది.

జిల్లెళ్ళమూడికి ఎవరూ వృధాగా వచ్చిపోవటం లేదు. వచ్చే సంకల్పమే కొంత ఫలం, రావటం ఎక్కువ. తరువాత వృధా ఎన్నటికీ కాదు. మంచి చెడు గురించి చర్చిస్తున్న వారితో "తిధులు విధిని మార్చలేవు". "ఎన్నిమార్లు గీత చదివినా మన గీతను బట్టే జరుగుతుంది" అన్నది అమ్మ. ఒకమారు భరద్వాజన్నయ్య "అమ్మా ! కొందరికి బాధాపూరితమైన జీవితాన్ని, మరికొందరికి సుఖప్రదమైన జీవితాన్ని ప్రసాదిస్తావు. నీకు నిజంగా పక్షపాతం ఉందమ్మా" అన్నారు. దానికి అమ్మ "అన్నింటికంటే అవసరం విలువైంది నాన్నా. పూలు మాలగా కావాలనుకుంటున్నాను కనుక దారంతో బిగించక తప్పదు. మాలను ధరించాలనుకున్నాను కనుక బిగిస్తాను" అని తెలియజేసింది. అంటే మనందరం అమ్మ ఒడిలో పుష్పాలమే.

స్వరూపానంద అనే స్వామీజీ అమ్మ దగ్గరకు వచ్చారు. ఆయన ప్రత్యేకించి అమ్మతో ఏం మాట్లాడలేదు. సంభాషణ జరుగుతున్నప్పుడు స్వామీజీ తెలియజేసిన సందేశాన్ని భరద్వాజ అన్నయ్య" ఎవరైనా మా అమ్మాయి పెళ్ళి విషయం చెప్పండి అనీ, వేరేవైనా విషయాలు చెప్పమని వస్తే "అమ్మ నాకు తెలియదంటుంది. "తెలిసి కూడా చెప్పకపోవటం అసత్యం కదా!" అని స్వామీజి అంటున్నారమ్మా! అన్నాడు. "ఏది ఎప్పుడు జరగాలో నిర్ణయించే ఉంది. ఈ మాటలతో పనిలేదు. ఈ చెప్పాల్సిన అవసరమూ నాకు లేదు. ఇది వ్యాపారం. దుకాణంలో సరుకులున్నాయా? అని అడుగుతారు. ఏం లేవంటే ఒకరికి పదుగురు చెప్పుకుని ఇక్కడకు రారు. వాళ్ళు ఇంకో చోటుకి వెళ్ళినా, ఇక్కడకు వచ్చినా ఉన్నది ఒక్కటే." అమ్మ చెప్పిన "ఈ వివరణ చాలా సంతృప్తిని కలిగించిందని" స్వరూపానంద చెప్పారు.

అమ్మ తనకు తలనొప్పిగా ఉందని హైమను గురించిన ప్రతి చిన్న విషయమూ గుర్తుకు వస్తుందిరా అన్నది. దానికి భరద్వాజన్నయ్య "అమ్మ గారికి కూడా బాధ అంటారమ్మా. అమ్మకు బాధేమిటి? అంటాడు ఒకడు. ఎక్కడ ఏమి జరిగిందో వారి బాధ ఇక్కడ అనుభవిస్తుంది అంటాడు ఇంకొకడు. శరీరం ఉంది కధా! మనతో పాటూ అనుభవిస్తుందిలే అంటాడు మరొకడు. ఈ నలుగురి భావాలూ నిజమేనా? అని అడిగారు. "ఒక నిజమే నలుగురికీ నాలుగు విధాలుగా కనపడుతుంది" అన్నది అమ్మ. ఒకటే నాలుగయింది అన్నాడు అన్నయ్య. "మామిడికాయలు తిన్నాము వేడిచేయటం ఒక నిజం, జీర్ణం కాకపోవటం మరొకనిజం" అన్నది. దానికి అన్నయ్య "నీవు బాధపడటం అనేది నిజం, శరీరం ఉంది కనుక నిజం" అమ్మా నీకు బాధలెందు వల్ల కలుగుతాయి? అన్నాడు అన్నయ్య. "మనసు వల్లనే కలుగుతాయి, మనసు వల్లె పోతాయి, నీకు కనపడక పోయినా బాధ అనేది ఉంటుంది" అన్నది అమ్మ. ఆ బాధలు తీసేసుకుంటే పోతాయిగా ఎందుకు బాధపడటం అన్నాడు భరద్వాజ అన్నయ్య. "వద్దనిపిస్తేగా తీసేయాటానికి మీ అందరితో పాటూ అవీ ఉన్నాయి" అన్నది అమ్మ.

"చేతలు చేతుల్లో లేవు మనం చేసే పనులకు మనం కర్తలం కాదని" అంటుంది. మనిషికి అశాంతి లేకపోతే మనసులో అలజడి, అసంతృప్తి వుండవు. అది లేకపోతే విజ్ఞాన తృష్ణ ఉండేది కాదు. "విజ్ఞాన కమలం వికసించటానికి సూర్యకిరణం లాంటిది అశాంతి" అన్నది అమ్మ.

అమ్మ దగ్గర ఎందరో నామకరణం, అన్నప్రాసన, అక్షరాభ్యాసాలు, కేశ ఖండనలు ఎన్నో జరిపిస్తారు. అమ్మ "కేశ ఖండన కాదు, క్లేశ ఖండన" అంటుంది. అమృత గుళికల వంటి వాక్యాలతో అమ్మ అందరినీ సంతృప్తి పరిచేది. 'సతులకై కొన్నాళ్ళు, సుతులకై కొన్నాళ్ళు' అన్న త్యాగరాజ కీర్తన విని "నేనిప్పుడు అదే స్థితిలో ఉన్నాను. ఈ సంతానం కొరకేగా నాకిదంతా" పితృదేవతలకు తద్దినాలు పెట్టాలా ? పెడితే స్వీకరిస్తారా ? అన్న సందేహం ఒకరు వెలువరిస్తే "చచ్చినవానికొరకు కాదది. బ్రతికి ఉన్నవాడు తన ధర్మం మరువకుండా

ఉంటానికి ఈ కర్మకాండలు, తద్దినాలు" అని తెలియజేసింది. మనకెవరైనా సాయంచేస్తే దానికి ఏ విధంగా బదులు తీర్చుకుందామా అని ఆలోచిస్తాం. ఈ శరీరాన్ని మనకిచ్చిన తల్లిదండ్రులను గుర్తు పెట్టుకోవటం కోసమే సంవత్సరానికి ఒకమారు చేసేదే ఈ ఆరాధన.పెట్టింది ముహూర్తం కాదు. "జరిగిందే ముహూర్తం" అని అమ్మ ఉద్ఘాటిస్తుంది. "ఆచరించే వారికి ఏ మతమైనా ఒకటే. ఆచరించని వాడే దానిలో ఏముంది. దీనిలో ఏముందని వెతుకులాటతోనే సరిపోతుంది". అని తెలియచేసింది.

1975 జూలై 17వ తేదీకి ముందు మూడు నెలలగా అమ్మను బాధిస్తున్న రాచకురుపు తీవ్రస్థాయికి చేరుకుంది. అమ్మ ఆ బాధను మౌనంగా భరిస్తున్నప్పటికీ చూచేవాళ్ళకు మాత్రం భరించరానిదైంది. వెంటనే నెల్లూరు డాక్టరు ఎస్.వి.సుబ్బారావుగారికి, నరసాపురం డాక్టరు కేశవరావుగారికి, మదనపల్లి డాక్టరు ఆర్.జానకీదేవి గారికి టెలిఫోను చేసారు, ముగ్గురూ రెక్కలు కట్టుకొని వాలారు, అమ్మను చూచారు. గడ్డ తాటికాయ ప్రమాణంలో బయటకు కనిపిస్తున్నది, ఇక లోపల ఎంత ఉన్నదో అది అమ్మను ఎంత బాధపెడ్తున్నదో! అమ్మ మంచంపై పడుకొని అటు నుండి ఇటు పొర్ల లేకుండా ఉన్నది. కాలంతా బరువెక్కి కదిలించలేని స్థితిలో ఉన్నది.

అటువంటి పరిస్థితులలో కూడా అమ్మ దర్శన కార్యక్రమం నిర్విఘ్నంగా సాగుతూనే ఉన్నది. 19వ తేదీ తొలి ఏకాదశి. దాదాపు 400 మంది యాత్రీకులు వచ్చారు. అమ్మ బయటకు వచ్చి కుర్చీలో కూర్చుని నాలుగు గంటలసేపు దర్శనం ప్రసాదించింది. వచ్చిన డాక్టరు అమ్మలో తరగని తేజఃపుంచాన్ని చూచి ఆనందించారు. అమ్మలోని సహనశక్తికి ఆశ్చర్యచకితులైనారు! అమ్మ ఎంత బాధపడివుంటుందా అని తామూ కన్నీళ్ళు పెట్టుకున్నారు.

తెల్లవారేసరికి గడ్డ పక్వమయింది. ఆపరేషన్ తప్పని సరి అయింది. డాక్టర్లు ముగ్గురూ కలిసి అమ్మను జిల్లెళ్ళమూడి నుండీ ఎక్కడికైనా అన్ని సౌకర్యాలు వున్న ఆసుపత్రికి తరలించడానికి ఏకగ్రీవంగా నిర్ణయించారు. నాన్నగారు చెప్పిన

మీదట అమ్మ నెల్లూరుకు వెళ్ళటానికి ఒప్పుకుంది. అమ్మ ప్రయాణమంటే మూడు అంతస్థులు దిగిరావాలి. కాలు కదిలించలేని అమ్మ అడుగు తీసి అడుగు వేయలేని అమ్మ అన్ని మెట్లు ఎలా దిగుతుంది? ఎందరో బలసంపన్నులైన బిడ్డలు ముందుకు వచ్చి అమ్మను చేతుల మీదదించుతామన్నారు. కుర్చీలో కూర్చో పెట్టుకొని తీసుకువెళతామన్నారు. ఎన్నెన్నో ఉపాయాలాలోచించారు. అమ్మ అన్నింటికీ ససేమిరా అన్నది. అలా తీసుకు వచ్చి తనను కార్లో పడుకోబెడితే చూచిన బిడ్డలు తట్టుకోలేరని చివరకు తానే డాక్టర్లకు ఉపాయం చెప్పింది. అక్కడే గడ్డను ఆపరేషన్ చేస్తే తానే మెట్లు దిగుతానన్నది. మరి గడ్డను ఆపరేషన్ చేయుటమెలా? ఏ డాక్టరూ ఈ పరిస్థితిని ఊహించి అవసరమయిన పరికరాలు తీసుకురాలేదు. అయినప్పటికీ ఒక బ్లేడు స్టెరిలైజ్ చేసి కోసేయమని అమ్మ సలహా చెప్పింది. చివరకు అమ్మ ఇచ్చిన ధైర్యంతో డాక్టరు సుబ్బారావుగారు విద్యుద్దీపమైనా లేని గదిలో కరదీపిక సహాయంతో మత్తు మందు ఇవ్వకుండా (లేదు) ఒక బ్లేడుతో ఆగడ్డను కోసేశారు. ఆ తరువాత ఒక గంట విశ్రాంతి తీసుకొని అమ్మ మెట్లన్ని దిగి - బారులు తీరినిలుచున్న జన సందోహానికి - ధైర్యం చెబుతూ, ఆశీర్వదిస్తూ నెల్లూరు ప్రయాణమైంది.

నది దగ్గరకు వెళ్ళి దాహం తీర్చుకొన వచ్చు కానీ నదే మన దగ్గరకు పనిగట్టుకొని, పరిగెత్తుకొని వచ్చి మనదాహం తీరిస్తే ఎలా వుంటుందీ. రంగురంగుల వలువలు ధరించిన స్త్రీలు, కుతూహలం రేకెత్తించే కళ్ళతో, ఆసక్తితో, ఆపేక్షగా తిలకించే పిల్లలు. అమాయకంగా అర్థం కానట్లు చూచే లంబాడీలు, ఏదో ప్రత్యేకతను గని మైమరచే వృద్ధులు, అన్ని రకాల ప్రజానీకం తీర్థవాహినిలా మార్గం నిండుగా ఉండి అమ్మను దర్శించగానే పులకాంగితులై ప్రణామం చేస్తూ పరవశించారు.

మొదటిసారిగా గౌతమ్ నాన్నగారు అమ్మను దర్శించారు. అమ్మను చూస్తూనే ఆ ముఖంలోని ప్రశాంతతనూ, అమ్మ కన్నులలోని తేజస్సును గమనించి మంత్ర ముగ్ధులవుతూ అమ్మను అలౌకిక వ్యక్తిగా భావించారు. ఆలోచించి చేసుకున్న నిర్ణయం కాదు హేతువాదానికి అందేది కాదు. అందరికీ స్వయంగా

కలిపి అన్నం ముద్దలు నోటి కందించింది అమ్మ. ఆ ఆదరణనూ, ఆ అప్యాయతనూ, ఆ అనురాగాన్ని చూస్తూ ప్రేమ స్వరూపిణిగా అమ్మను భావించారు.

కార్తీక పౌర్ణమికి చీరాల నుండీ జిల్లెళ్ళమూడికి వెళ్ళారు. సుమారు 9గం॥ లకు వాగు దగ్గరకు చేరారు. అమ్మ అప్పటి దాకా ఎవరి కోసమో ఎదరు చూస్తున్నది. వాళ్ళు అక్కడికి చేరగానే "నాన్నా! మీ కోసమే ఎదురు చూస్తున్నానురా?" అన్నది, వారు విభ్రాంతచకితులయ్యారు. ఆ ఎండలో అమ్మ రెండు గంటలు వేచివున్నదంటే ఆశ్చర్యం మరో పక్క విచారం కలిగింది. అమ్మ వాళ్ళ తలలకు నూనెపెట్టి తలారా స్నానం చేయించింది. వీరిని చూచి "మీ బస్సు తప్పిపోయిందని, లారీలో వస్తున్నారని అమ్మ చెప్పింది - నిజమేనా?" అని అక్కడివారు అడిగారు. ఆ విషయం నిజమే అవటంతో వారి శరీరం జలదరించింది. వారి రాక విషయం ముందుగానే వారికి చెప్పటం, అమ్మకు అన్నీ తెలుసునా? అమ్మే జ్ఞాన స్వరూపిణి అవటంతో తెలియక పోవటం ఏముంటుంది? అని అనుకున్నారు.

గౌతమ్, వారి నాన్నగారు పుట్టపర్తి వెళ్ళారు. స్వామితో వారికి ఇంటర్వ్యూ దొరికింది. గౌతమ్ నాన్నగారు స్వామిని "జిల్లెళ్ళమూడి అమ్మపై మీ అభిప్రాయమేమిటి?" అని అడిగారు. దానికి స్వామి "ఆమె సర్వసృష్టి స్థితి, లయకారిణి, ఆదిపరాశక్తి" అని వక్కాణించారు. అప్పటికే అమ్మ యందు విశ్వాసమేర్పడిన వారి భావనకు స్వామి బలం చేకూర్చారు. అతిశయించిన ఆనందంతో వారి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. (1973 మే మాతృశ్రీ సంచికలోని అమ్మదైవమా? అని గౌతమిగారు రాసిన వ్యాస సౌజన్యంతో).

శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్‌లో ప్రఖ్యాత "సంకీర్తన భావన్" కు వ్యవస్థాపకులు. వీరు ఋషి, జితేంద్రియులు తత్త్వవేది, తపస్వి, సాధుమహరాజ్, మంత్ర సిద్ధి పొందిన రాధోపాసకులు, భక్తి జ్ఞాన వైరాగ్యాల త్రివేణీ సంగమం. ముక్తి మార్గాల్లో నామసంకీర్తనకు పెద్దపీట వేసిన మహనీయులు. వీరు మూర్తీభవించిన ఆర్ష ధర్మం "భాగవత కథ" అన్న

108 భాగాల బృహత్ గ్రంథ రచయిత. ఉపనిషత్తులకు, వ్యాఖ్యానాలు, చైతన్య చరితావళి మొ॥న అనేక ఆధ్యాత్మిక గ్రంథారాజాలను లోకానికి అందించిన యశస్వి. వీరి ప్రధాన శిష్యులే శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ.

"హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే"

ఈ కలి సంతరణ నామ మహామంత్రం ఉప నిషత్తుల్లో చెప్పబడినప్పటికీ ఆంధ్రదేశంలో ప్రచారం చేసింది మాత్రం శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ. వీరు ఈ మధుర నామాన్ని తన శ్రావ్యమైన కంఠంతో భక్తి పారవశ్యంతో గానం చేస్తూ దేశంలో వాడ వాడలా, ఊరూరా వ్యాపింపచేసారు. భగవన్నామ సంకీర్తనలో ఆసక్తిలేని వారు కూడా స్వామీజీ సంకీర్తన చేస్తున్నారంటే వచ్చికూర్చోవటం, ఆ సంకీర్తనల్లో పాల్గొనటం పరిపాటి. ప్రస్తుతం ఎన్నో సంకీర్తన సమాజాలు వారి ఆధ్వర్యంలో ఏర్పడి వారి ఆశీర్వచనంతో నడుస్తున్నవే. ఏకాహ, సప్తాహ ప్రక్రియలను బహుళ ప్రచారంలోనికి తీసుకు వచ్చారు. ఆయన పరవశులై చేసే నృత్యం చూసి ఆ భగవంతుడే దిగి వచ్చాడా అనిపించక మానదు. ఇది కేవలం స్వామీజీ యొక్క కంఠమాధుర్యం వలన, సంకీర్తనా నైపుణ్యాం వలనా కాదు. వారిలో పరిపూర్ణత పొందిన భక్తి ప్రభావం వలనా, చైతన్యవంతమైన ఆత్మదీప్తి వలన మాత్రమే.

స్వామీజీ మొట్టమొదట సారిగా అమ్మను 1952లో అప్పికట్లలో చూచారు. ఆనాటి నుండీ అమ్మకు వారిపై వాత్సల్యము వారికి అమ్మపై భక్తి విశ్వాసము. 1954లో సన్యాసాశ్రమం స్వీకరించి అవధూతగా వారు జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మ ఎదురు వెళ్ళి కాళ్ళు కడగటానికి ప్రయత్నించింది. వారు అంగీకరించలేదు. "తప్పు లేదు నాన్నా, బిడ్డ వళ్ళు, కాళ్ళు తల్లి కడగవలసిందే కానీ ఇంకెవరు కడుగుతారు?" అని చెప్పింది. అయినా వారు అమ్మను కడగనీయక సోదరి హైమ చేత కడిగించుకున్నారు. అప్పుడే అమ్మ వారితో "నాన్నా! నీకు ఎప్పుడు అవసరం అనుకుంటే అప్పుడు వచ్చి నా దగ్గర వుండు. ఇక్కడ నీ తల్లి ఉన్నదన్న విషయం మరిచిపోకు" అని చెప్పింది.

ఆమాట ప్రకారమే ఆయన అమ్మను ఎన్నో మార్లు చూచారు. తన మనోవేదనలనెన్నింటినో అమ్మతో చెప్పుకొని ఉపశమనం పొందారు. అమ్మ ఒడిలో పడుకొని పసివాడై పరవశం చెందేవారు. అమ్మ మంచంపై అమ్మ ఒడిలో చనువుగా కూర్చునేవారు, పడుకునేవారు. ఆక్షణాల్లో వారు తమ వయస్సును, స్థితినీ అన్నింటినీ మరచి చిన్నపిల్ల వాని వలే హాయిగా వుండేవారు. అమ్మ అన్నం కలిపిపెడ్తూ, పండ్లు తినిపిస్తూ తానూ ఆనందించేది. అమ్మ అనురాగాన్ని, అనుగ్రహాన్ని పొందిన అదృష్టశాలి.

అమ్మపై అంకురితమైన విశ్వాసం, అపారమైన ఆసక్తి గలవారు. అమ్మను నేటి "సిద్ధపురుషుల"తో పోల్చటం వారికి ఇష్టం వుండేది కాదు. అమ్మ స్థితి, స్థానమూ అసమానమనీ, అత్యున్నతమని వారి అభిప్రాయం. అవధూతేంద్ర స్వామి సన్యాసాశ్రమం స్వీకరించక ముందు వారు శ్రీ శియారఘువరదాస్‌గా సుప్రసిద్ధులు. ఆంధ్రదేశాన్ని 'హరేరామ' నామ సంకీర్తనతో ఉర్రూతలూగించిన నామయోగి. ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, కేరళ అన్ని దక్షిణాది రాష్ట్రాల్లో విరివిగా పర్యటించి నామ సంకీర్తనను అధికంగా ప్రచారం చేసిన నామావతారులు. తాను భక్తి పారవశ్యంలో మునిగిపోయి ప్రజలను ఆనంద రసామృత సాగరంలో ముంచెత్తిన చైతన్య ప్రభువు. సన్యాసాశ్రమం స్వీకరించినప్పటికీ నామ ప్రచారం కొరకై చేసే విస్తృత దేశపర్యటనలో అడ్డుగా నిలచిన దండక మండలాలను పరిత్యజించిన ధీరోదాత్త పరివ్రాజక పుంగవులు. సంకీర్తనమే ఊపిరిగా జీవించిన సంకీర్తనాతత్పరులు. వీరు ఆకృతి దాల్చిన "నామ సంకీర్తనం" అనటం అతిశయోక్తికాదు. భక్తతులసీదాస్ విరచిత "హనుమాన్ చాలీసా" ను గానం చేసి, లక్షలాది మంది చేత చేయించి చోసాస్థూపాలను వందలాది నిర్మించిన పూత చరిత్రుడు.

అమ్మను పారాశక్తిగా వర్ణించి "జయహోమాతా శ్రీ అనసూయా" అన్న అమ్మ నామాన్ని మధురాతి మధురంగా గానం చేసి పరవశించి పోయిన భాగవతోత్తములు వీరు. ప్రభుదత్త బ్రహ్మచారి సాహిత్యానికి రఘువరదాసుగారు సంగీతానికి ప్రతీకలై అమ్మకు ఇరువైపులా ఆసీనులైతే అమ్మ సరస్వతీ దేవియై

శోభిల్లిన ఆ కమనీయ దృశ్యం చిరస్మరణీయం. నేను మీ దగ్గరకు వచ్చినా, మీరు నా దగ్గరకు వచ్చినా ఒకటేనని అమ్మ తెలియచేసింది.

అవధూతేంద్ర స్వామి (శ్రీ రఘువరదాసుగారు) అమ్మ దర్శనానికి వచ్చారు. వారి ఆరోగ్యాన్ని పరామర్శించి మీరు సంకీర్తన చేస్తారా? అని రామకృష్ణన్నయ్య అడిగాడు. వారానందంగా శిరఃకంపనం చేస్తూ అమ్మ వైపు చూచి అనుజ్ఞ అయితే చేయిస్తుందేమో ప్రేరణ అక్కడ నుండి వస్తే చేస్తాను అన్నారు. అమ్మవారికి పండ్లు ఒలిచి తినిపించింది. "అమ్మకు విశ్రాంతి లేదని" రామకృష్ణన్నయ్య అన్నాడు. దానికి స్వామి వారు చిరునవ్వుతో "చండికగదూ!" అన్నారు. అమ్మ అంగీకరిస్తున్నట్లుగా దరహాసవదన అయింది.

రాత్రి 7.30 ని॥లకు అలంకరించిన హంసవాహనంలో వూరేగింపుగా అమ్మను వేదిక వద్దకు తీసుకువచ్చారు. స్వామివారు "అన్నపూర్ణేశంకర ప్రాణ వల్లభేజ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాందేహి పార్వతి అంటూ తాను ప్రారంభించి అందరిచేత అమ్మ నామాన్ని పలికించి, నామం యొక్క విశిష్టతను ఉచ్ఛస్వరంతో వివరించారు. లంబాడీల తండాలు నివసించే ప్రదేశాలను చూచింది.

అవతారమూర్తులు వారి వారి ఇచ్ఛానుసారం జన్మిస్తారు. సామాన్యులవలె కష్టసుఖాలను అనుభవిస్తారు. కానీ కర్మబద్ధులు కారు. ఒక నిర్ణీత పథకం ప్రకారం బృహత్తర కార్యకలాపాలు నిర్వహిస్తారు. ద్వంద్వాతీతాలకు అతీతులై స్థితప్రజ్ఞులై ఉంటారు. అమ్మను "ఏ అవతారమమ్మా" అని అడిగారు. "నేను ఎవరినైతే మీకేమీ? అమ్మనైతే చాలదా" అని నవ్వేసింది.

రూపం ఉన్నా లేక పోయినా శుభమూ, అశుభమూ, జరిగేదే క్షేత్రము. అందరూ తలా ఒకచోట ఉన్నారు. వీళ్ళందరూ ఒకచోట ఉన్నారు. ఎవరెక్కడున్నా అందరి తలపులూ ఒకచోటే ఉన్నాయి. "ధన మూలం మిదమ్ జగత్" తానే లేకపోతే ధనంతో పనేముంది. నేననే నేను, నేనేనని తెలుసుకుంటున్న నేను, తెలుసుకోబడే నేను, తెలుసుకోవటానికి ప్రయత్నించే నేను, నేనైనా నేను" అని అమ్మ వివరించింది.

హిందూ సాంప్రదాయంలో విగ్రహారాధన ఉంది. మిగిలిన మతాలలో

విగ్రహారాధన లేదు అన్నవారితో అమ్మ "విగ్రహం అంటే ఆకృతి, రూపం, జెండా, శిలువ, ఆకాశం. ఏది రూపం కాదు? రూపం కాని వస్తువు తనకు కనిపించటం లేదంది. నిగ్రహం కొరకే విగ్రహారాధన. సృష్టిలో ప్రతిదీ రూపంతో ఉంది. పాపపుణ్యాలపై మీ అభిప్రాయమేమిటని అడిగిన వారితో తన దృష్టిలో పాపం లేదంది. ప్రపంచం, ఈ సృష్టి అంతా దైవస్వరూపమనే అనుకుంటున్నాను అని చెప్పింది. ఎవరెలా నడిచినా ఫరవాలేదా అన్నవారితో ఎవరినీ ఇట్లా నడవమని తాను శాసించలేదంది.

ప్రవక్తలెందరో వచ్చారు. ఒకరు చెప్పింది మరొకరు చెప్పలా. ఒక యుగంలోనే అందరూ రాలేదు. ఎవరికి ఏది అందుబాటులో ఉంటే వారు దానిని తీసుకున్నారు. బైబిలు, ఖురాన్ ఏదీ తక్కువ అనుకోను. మీకేదిష్టమైతే దాన్నే తీసుకోండి. ఆ బాటను సాగండి. ఆచరించటానికి ఏ మతమైతేనేమి, ఏ భావమైతేనేం. మీ తోటివారిని మీలాగా చూచుకో అనే మాటను అందరూ ఆచరించగలరా! అని అడిగింది. అన్ని వేళలు సఫలం కాదు. విఫలమైనప్పుడు యెహోవా రక్షించు అని క్రీస్తును ప్రార్థించు. ప్రహ్లాదునకు తప్పలేదు. మీ హృదయానికి ఏది హత్తుకుంటే దాన్నే చెయ్యండి. విగ్రహారాధన మీరు ఉన్నదనుకున్నా, లేదనుకున్నా అది ఉన్నది. ఇప్పుడు మనం వెలుగులో ఉన్నాం. "చీకటే వెలుతురుకు ఆధారం" అని నిర్వచించింది.

ధర్మాధర్మాలకు, పాపపుణ్యాలకు, నీతి అవినీతులకు ఇదమిద్ధమనే అర్థముందా అని భరద్వాజ్ అన్నయ్య అడిగారు. వాటి గురించి నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా ప్రేమ ఒక్కటే. అదే న్యాయమనుకుంటాను. ఇలా నడిస్తే ధర్మమనో, ఈ విధంగా చేస్తే న్యాయమనో, ఈ విధంగా ఉంటే నీతి అనో ప్రత్యేకార్థం లేదంటారా" అని ప్రశ్నించాడు. "నాకు తెలిసింది ప్రేమ ఒక్కటే అదే ధర్మమనుకుంటాన్నానని" వక్కాణించింది.

"కాలమంటే ఏమిటి? కాల పరిణామమంటే ఏమిటి?" అని అన్నయ్య అడిగారు. "జరిగేదంతా కాలమే, ఉన్నది కాలమే, ఉన్నది జరగటం కాలం. పరిణామమంటే మార్పే గదా! అనుక్షణం పరిణామం జరుగుతూనే ఉందని

చెప్పింది. భూతకాలం, వర్తమానకాలం, భవిష్యత్‌కాలం, జరిగింది, జరుగుతున్నది, జరగబోవునది అన్ని చెప్తారు కదా అన్నారు. కాలం ఒకటే, జరిగే పరిస్థితులు వేరని తెలియజేసింది.

దైవమంటే ఏమిటి? మానవత్వం అంటే ఏమిటి? అన్నారు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు. సృష్టియే దైవం. మానవత్వం అంటూ వేరేలేదు. సృష్టియే దైవమని గుర్తించకపోవటమే మానవత్వం కావచ్చు అంది. మతమంటే ఏమిటి? శాస్త్రమంటే ఏమిటి? కొందరికి కొన్ని మతాలు గొప్పవి, మరికొందరికి శాస్త్రాలు పరమ ప్రమాణం" "సత్యాన్ని సమగ్రంగా బోధపరిచేదేది? అని అన్నయ్య అడిగారు. "అనుభవమే శాస్త్రమని తన అభిప్రాయమని" చెప్పింది. "శాస్త్రం అనుభవాన్నివ్వదు కానీ, అనుభవం శాస్త్రాన్నిస్తుంది". "శాశ్వతంగా నిలవగలిగేది శాస్త్రం, శాసించేది శాస్త్రం. ఈ సృష్టియే శాస్త్రం. ఎవరి అనుభవం వారికి శాస్త్రం అయినపుడు సమన్వయం కుదిరేదెలా, నిజానిజాలు తెలిసేదెలా అన్నారు. "నాకు నిజానిజాలు లేవని శక్తి ఎట్లా నడిపిస్తే మానవుడు అట్లా నడుస్తున్నాడు. ఆ శక్తే మనసిచ్చి నడిపిస్తున్నదని" అమ్మ తెలియజేసింది.

కాలాన్ని గురించి ఇంకొంచెం వివరంగా చెప్పమ్మా అన్నారు. "కాలమంటే జరుగుతున్నది. గడియారం కాలం కాదు. అది గుర్తు తెలియజేయటానికే, తెలిసినా, తెలియక పోయినా జరిగిపోతున్నదని గ్రహించేది కాలమే. కాలమంటే సమయమని కూడా, సమయం ఎప్పుడూ ఉంది. ఏ సమయానికా సమయం ఉంది. కాలం అంటే శక్తి అనీ, సమయం అనీ, పరిణామమనీ, పరిణామం చెందే దానికి ఆధారమైనదనీ, బ్రహ్మ అనీ, చైతన్యమనీ చెప్పింది. సత్యమైన పదార్థము అంతా బ్రహ్మ స్వరూపమనీ సమస్త జగత్తులో శక్తి ఎట్లా నిండి ఉన్నదో కాలం కూడా అట్లాగే నిండి ఉంది. మర్మగర్భితంగా ఉంది. అర్థమౌతూ కాకుండా, తెలుస్తూనే తెలియకుండా ఉండే కాలమే దైవం. కాలం గణేశుడని, వినాయకుడని అన్నారు. నీవు నన్ను అడగటం, నేను నీకు చెప్పటం కాలమే. ఉన్నదీ కాలమే. ఎన్ని రాకాలుగా తీసుకున్నా, చేప్పేది వేరుగా ఒన్నా ఉన్నది ఒక్కటే. భాష మారవచ్చుకానీ భావం మారదు. జగత్తు అన్నా, దైవం అన్నా, బ్రహ్మ అన్నా

ఒకటే అర్థం. ఉన్నది ఒకటే అయినపుడు మరొకటి ఎలా వస్తుంది. కాలం ఎట్లాంటిదో ప్రేమ అటువంటిదే. ప్రేమ ఎటువంటిదో శక్తి అటువంటిది. శక్తికి సృష్టికి తేడా లేదు.

మాటల మార్పులతో అభిప్రాయాలు ఇన్ని రకాలుగా ఉన్నా విషయమొకటే. సృష్టికి ప్రేమకు తేడా లేదని కదూ చెప్పింది? సృష్టి వేరు, శక్తి వేరుకాదు. సృష్టే శక్తి, శక్తేసృష్టి. సృష్టి అంతా ప్రేమమయం. ధర్మాధర్మాలు, పాపపుణ్యాలు, నీతి అవినీతులు అన్నీ ప్రేమలో ఇమిడి ఉన్నాయి. ప్రేమకంటే భిన్నమైనది మరొకటి లేదు. ప్రేమే సర్వం. మానవత్వం, దైవత్వం ప్రేమలో ఇమిడి ఉన్నాయి. తల్లి బిడ్డల్ని పెంచటం ధర్మం. పదిమంది కలిసి కొన్ని కట్టుబాట్లు చేసుకుని ఇట్లా నడుచుకుందాం అనేది ధర్మం. ఏది మంచి ఏది చెడు అని విచక్షణ చేసుకుని, ఉచితమైన విధంగా నడవటం న్యాయం. హితోపదేశాలు ఈ విధంగా ఏర్పడినవే. న్యాయమనేది దొరకదు. జరిగింది న్యాయం అని వివరించింది.

ఎవరు ఏ పనిచేసినా తన కోసమే. అందుకే "తన మూలమిదం జగత్", "ధనమూలం కాదని" అమ్మ వివరించింది. "దైవమే సర్వమనుకుంటే బాధేముందమ్మ" అన్నారు అన్నయ్య "దైవం కంటే చుట్టం ఎవరు. దైవం తప్ప ఆధారం లేదనుకున్నపుడు ఇంకా అంతకన్నా కావలసినదేముంది. ఆధారమే దైవమైనపుడు ఆధారం లేకపోవటం అంటూ ఉండదని" అమ్మ ప్రకటించింది.

శ్రీపాదవారు "అమ్మ దేవుడైతే హైమ ఎందుకు పోయిందని చాలా మంది ప్రశ్నిస్తున్నారని" అమ్మను అడిగారు. ఆ ప్రశ్న అడిగిన వాడికి సమాధానం పక్కనే ఉందిగా. దేవుడు అంటున్నావు కనుక సృష్టి, స్థితి, లయ హేతుభూతులనేగా. హైమ వచ్చిన కారణం అయిపోయింది వెళ్ళిపోయింది. పుట్టటమెంతో పోవటమంతే. రక్షణ అంటే జబ్బు ఉన్నవాడికి తీర్థమిస్తే నయమౌతుందనుకుంటాడు. కోటేశ్వరారావు కొడుకు పోయినపుడు ఇక్కడే కూర్చుని మాట్లాడుతున్నాను. గొడ్లను కాచుకురావటానికి వెళ్ళాడు తిరిగి రాలేదు.

అమ్మకు తన పర అన్న భేదం లేదు. పోయేవాళ్ళందరినీ ఆపలేదుగా.

అమ్మ కూతురు అని ప్రత్యేకత మీ దృష్టిలో ఉండొచ్చు. అప్పుడే గదిలోకి వస్తున్న భరద్వాజన్నయ్య "అసలు అవతారాలే శరీరాలు త్యాగం చెయ్యటం కనపడుతుంది కదా! ఇంకొకరి దాకా ఎందుకు? అన్నాడు. అమ్మ చిరునవ్వు నవ్వి దైవత్వానికి దానికీ సంబంధం లేదన్నది. కోటేశ్వరరావు అన్నయ్యతో "నీ జీవితానికి, అమ్మ దైవత్వానికి సంబంధం లేదు. అమ్మ మీద నాకు ఇంత భక్తి ఉంటే ఈ జబ్బు ఎందుకు వచ్చింది అన్నావనుకో ఆ మాటకి అర్థం లేదు".

"కొన్ని శాస్త్రాల్లో ఆకలే జబ్బు. అన్నమే మందు. శరీరంలో వచ్చే ప్రతీదీ జబ్బే. నవ్వూ జబ్బే, ఏడుపూ జబ్బే, డబ్బాశకూడా జబ్బే. హోమియో వైద్యంలో జబ్బు ఎందుకు పుట్టిందో తెలుసుకుని మందు ఇస్తారు కానీ, జబ్బుకు మందు లేదు. గుణానికే హోమియో మనస్తత్వం మీద పనిచేస్తుంది అని వివరించింది. అమ్మకు హోమియో వైద్యం మీద మక్కువ ఎక్కువ అనిపిస్తుంది.

ఒక అన్నయ్య "భౌతిక విషయాల గురించి కాదు, ఆధ్యాత్మిక విషయాల్లో అసంతృప్తి, అశాంతిగా ఉంటోందనీ, పుస్తక జ్ఞానం వలన అహంకారం తప్ప ఇంకేమీ కలగటం లేదని" వాపోయాడు. "పుస్తకాల్లో చెప్పిన సాధన చేస్తున్నావా", అమ్మ అడిగింది. "దాని వల్ల ప్రయోజనం లేదనీ, ఈ జన్మ వృథా అనిపిస్తుంది. ఏం చేస్తే నాలో ఈ బలహీనత తొలుగుతుంది? మీరే తొలగించగలరని నా విశ్వాసం దానికి అమ్మ "అది తొలగించు కోవాలంటే తొలుగుతుందన్న నమ్మకం నాకు లేదు, నీవు అనుకున్నది జరగపోవటం వల్ల అలా అనిపిస్తుంది అంది అమ్మ. "అనుకున్నది జరగక పోవటమేమిటి ప్రయత్నం చెయ్యాలిగా" అన్నాడు ఆ అన్నయ్య. అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదు. ఎలా జరగాలో ప్రతీదీ అలాగే జరుగుదుంది".

దైవం అంటే విశ్వాసం లేని నాకు ఇది అని చెప్పలేని అశాంతిగా ఉంటోంది ఎందుకమ్మా అన్నారు. "నువ్వు ఎంత పైకి లేదంటున్నా ఇది తీరనప్పుడు నీకు అశాంతిగా ఉన్నట్లనిపిస్తుంది. అందులోనూ నీ మనస్సులో మాట చెప్పకునే ఆత్మీయులు లేకపోతే ఇంకా అశాంతిగా, ఏదో కొరతగా ఉంటుంది కదూ" అని

అమ్మ ప్రశ్నించింది. అవునన్నట్లుగా ఆ అన్నయ్య చిరునవ్వుతో తలవూపాడు. ఏదో ఒక విషయంలో తనకు తెలీకుండానే శాంతిని అనుభవించి ఉంటాడు. దానికి అవరోధం కలిగినప్పుడు ఈ అశాంతి ఏమిటో తెలుస్తుంది.

ఇన్ని మార్లు ఇక్కడకు వచ్చినా నాలో మార్పు ఏంలేదమ్మా నిజాయితీ, డ్యూటీ తప్ప మానవుడికి ధ్యేయం మరొకటి లేదనిపిస్తుంది. ఒక అన్నయ్య అన్నాడు. "నీ బాధ చూస్తే ఎంతో జాలి వేస్తోంది. మేము దైవం అంటే నీవు నిజాయితీ డ్యూటీ అంటున్నావు మాటలు తేడాయో కానీ ఉన్నది ఒక్కటే అన్నది అమ్మ. "వారందరిలా నిన్ను దైవంలా చూడలేకుండా ఉన్నాను. అమ్మ అని తప్ప దేవుడు అనిపించదు" అన్నాడు అన్నయ్య. "అది చాలు నాన్నా అమ్మగానే చూడు. దైవ సంబంధమైన చోట్లకు వెళ్ళావా? అని ప్రశ్నించింది. "దాని యందు ఒక అభిప్రాయమంటూ లేకపోయినా తిరుపతి, శ్రీశైలం, కాళహస్తి వెళ్ళాను. కానీ నాకు ఏమీ అనిపించలేదు. తేడా కూడా కనిపించలేదు అన్నాడు అన్నయ్య. "తేడాలు తేడాలు అంటావు తేడా కనిపించకపోవటం మంచిదే. అన్నింటిలో ఒకటే చూస్తున్నావు" అంది అమ్మ. "అందరికీ ఇచ్చే తన్మయత్వం నాకెందుకు కలిగించవు" అని అడిగాడు. "నేను ఎవరికి ఏం కలిగించాను" అన్నది అమ్మ. నా స్నేహితులు అబద్ధాలు చెప్తారా అన్నారు. అమ్మ అలాగే ఊరుకుని కాసేపు ఆగి "నీలో ఉండి, ఇప్పుడు నీకు గుర్తింపు కలగనివ్వని ఆశక్తే దాని తరుణం వచ్చినపుడు అదే కలిగిస్తుందని" చెప్పింది.

"పూజ చేస్తున్నపుడు పూలు, ఆకులు ఏదో యాంత్రికంగా పెడుతున్నట్లు ఉంటుంది కానీ పూజ చేస్తున్న ఫీలింగ్ రాదు" అని శాస్త్రి అన్నయ్య అమ్మను అడిగాడు. పూలతో పూజ చేస్తుంటే నీ మనస్సు తమాషాగా ఈ పువ్వు మీద ఆ పువ్వు పుడితే బావుంటుందని పెడతావు. దాన్ని చూసి ఆనందిస్తావు. ఒక్కొక్కప్పుడు నీకు తెలీకుండానే కళ్ళనీళ్ళు వస్తుంటాయి. అదంతా ఫీలింగే. అకస్మాత్తుగా గుడిలోకి వెళ్ళటం, చేతులు జోడించటం మార్పే. అదీ ఫీలింగే. ఇదంతా మామూలైంది కనుక, ఇది కాని స్థితి ఏదో ఉందని అది వస్తేనే నిజంగా ఫీలైనట్లు అనుకుంటావు. మనకు ఇవి సహజమైపోయాక అందులో ప్రత్యేకత

ఉన్నా ఆ ప్రత్యేకత కనిపించదు. ఒక్క భక్తిలోనే కాదు మామూలు విషయాలలో కూడా ఫీలింగ్‌ను అనుభవిస్తున్నావు. తీవ్రమైన బాధకో, సంతోషానికో లోనైనప్పుడు నీ చుట్టుప్రక్కల ఏం జరుగుతున్నా నీకు అర్థం కాదు. నీ ఎదుట ఉన్నదాన్ని నీ కళ్ళు చూస్తుంటాయి తప్ప నీ మనస్సు గ్రహించదు. ఏమీ వినపడదు, ఏమీ కనపడదు ఆ ఒక్కటీ తప్పించి" అన్నది అమ్మ.

ఆధ్యాత్మికంగా పొందుతామనే ఈ మానసిక స్థితి మనకు నిత్యకృత్యాల్లో వస్తూనే ఉంటుంది. పూజ చేస్తున్నపుడు మనస్సు ఎందుకు నిలవదంటే అక్కడ ఆవేదన ఏర్పడలేదు. ఆ ఆవేదనే పూజలో కావాలి. ఏం చేసినా, ఏం చెందుతున్నా పెట్టేవి పూలు కావచ్చు కానీ ఈ పూలు కాదు గుర్తుండాల్సింది. ఎక్కడ ఎట్లా పెడితే బాగుంటుందనీ కాదు. ఆ మూర్తి మీద మనస్సు లగ్నం కావాలి. "అది ఎలా వస్తుందని?" శాస్త్రి అన్నయ్య అమ్మను అడిగాడు. "ఇప్పుడు ఉన్న స్థితులు ఎట్లా ఏర్పడ్డాయో అదీ అలాగే వస్తుంది. స్థితి అంటే భక్తి కావచ్చు. బాధ కావచ్చు. భక్తికీ ప్రేమకీ తేడా లేదు. భగవంతుని యందు ఉన్నదాన్ని భక్తి అనీ మనుష్యుల యందు ఉన్నదాన్ని ప్రేమ అనీ అన్నాము. అసలు ఏ విషయం గురించి అయినా తీవ్ర వేదన ఉన్నపుడు నువ్వు అనుకునే ఫీలింగు నీకు తెలీకుండానే వస్తుంది. ఒక వ్యక్తి మీద నీకు తీవ్రమైన కోపం వచ్చిందనుకో నాన్నా! ఆ వ్యక్తి నీకు ఎప్పుడూ గుర్తుంటాడు. వాడిని సాధించటానికి అనేక రకాలుగా ఆలోచిస్తుంటావు. ఆ ఆలోచనల్లో వాడు నీ దగ్గరకు వచ్చి కూర్చునట్టే. నువ్వు ధ్యానం చేస్తేనే వాడు దగ్గరగా వచ్చాడు. దానికి నువ్వు ఏ సాధన చేశావు" అని అమ్మ అడిగింది.

ఈ సంభాషణ వింటున్న గోపాలన్నయ్య "భగవంతుడ్ని పూర్తిగా మనం ద్వేషించినా అంతేనంటావు?" అన్నాడు. "అసలు ద్వేషించే స్థితి రావాలిగా మనకు ఎంత ప్రేమ మిక్కుటమైతే ద్వేషించగలవు?" భగవంతున్ని ద్వేషించటానికి ముందు తగినంత ప్రేమ కలగాలిగా. ప్రేమలేనిచోట అసలు కోపం కూడా రాదు".

"మృత్యుంజయుడంటే చావులేకుండా ఎప్పుడూ శరీరంతో ఉంటాడని కాదు. చావు గురించి ఆలోచన లేనివాడు, భయం లేనివాడు. రాముడు, కృష్ణుడు

వీళ్ళంతా మృత్యుంజయులని శాస్త్రాధారాలతో చెప్పుకుంటున్నాముగా, శరీరాలతో లేనంత మాత్రాన వారు మృత్యుజయులు కారా. నేను పోతుకూచి రవిని మృత్యుంజయుడంటాను. తాను కొన్ని గంటలలో చనిపోతున్నానని తెలిసి కూడా భయపడలేదు. వాళ్ళను చూడాలి, వీళ్ళను చూడాలి, కనీసం నన్ను చూడాలని కూడా వాడు కబురు చేయలేదు. చనిపోయేటప్పుడు కూడా వాడి కళ్ళల్లో నీళ్ళు తిరగలేదు. పడిపోయాక కబురు చేశారు. దగ్గరకు వెళ్ళి తీర్థం వేశాను. నావంక అలా చూసి కళ్ళుమూసాడు" అని అమ్మ చెప్పింది.

అది కూడా అమ్మ కరుణేగా అన్నారు రాఘవయ్యగారు. "ఏది కాదు అమ్మ కరుణ. ఏదో అవసరానికి ఆ మాట ఉపయోగించటమే కానీ ఆ స్థిమితం అక్కడ ఉండి కాదు. ఏది వచ్చినా అమ్మ కరుణే అన్న విశ్వాసం ఉంటే మనం అనుకున్నవి జరగకపోయినా బాధపడటం జరగదు" అని అన్నది.

పని బాగా ఉన్నప్పుడు అమ్మ ప్రసాదాలు చేయించిపెట్టేది. అలా పెద్ద వాళ్ళకే గాక పసిపిల్లలు భగవతీ, ప్రేమకుమార్, బంగారు శాస్త్రిలను పిలిచి పెట్టింది. అది చూచి నవ్విన భరద్వాజన్నయ్యతో అమ్మ పెట్టకుండా ఉంటే, అందరికీ మానుకోవాలి, పెడితే అందిరికీ పెట్టాలి. మొదలు పెట్టాను కనుక అందరికీ సమంగా పెట్టాలి" అన్నది అమ్మ. సమంగా పెట్టడం అంటే? అందరికీ సమానంగా పెట్టడమా? అవతలి వ్యక్తి తినటం బట్టీ పెట్టడమా?" అని భరద్వాజన్నయ్య ప్రశ్నించాడు. "సమంగా అంటే నీకు దోసిలి నిండా పెట్టాను. అదే చిన్న పిల్లలకు గుప్పెడు పెడతాను. ఈ దోసిలి నీకు తృప్తినిస్తే ఆ గుప్పెడే వాడి కడుపు నింపుతుంది. అప్పుడు సమంగా పెట్టడమే కదా! పంచటంలో హెచ్చు తగ్గులుండవచ్చు కానీ పెట్టటం మాత్రం అందరికీ సమానంగానే జరుగుతుంది. ఎవరికి ఎంత కావాలో అలా పెట్టటం సమంగా పెట్టటమే అవుతుంది" అని అమ్మ చెప్పింది.

మన్నవ నుంచి వచ్చిన ఒక అన్నయ్య "నాకు జిల్లెళ్ళమూడిలో ఉండాలని ఉందమ్మా" అన్నాడు. దానికి అమ్మ "నాకేమీ అభ్యంతరం లేదు, ఇంతమంది

తింటుంటే ఒక్కరికి భోజనం లేకుండా పోదు. ఇది ఆస్తిగల సంస్థకాదు. అంతేకాక చందాలివ్వమని ఎవ్వరినీ యాచించేదీలేదు. ఎట్లా వస్తుందో, ఎట్లా పోతుందో మనకనవసరం. ఇది అందరి ఇల్లు, ఇక్కడ ఎవరి ఓపికకు తగినట్లు వారికి పని ఉంటుంది. ఊరికినే ఎవరూ కూర్చోరు. ఉండటానికి ఆశ్రయం కల్పించేది ఆశ్రమమే. కానీ ఇది ఆశ్రమం కాదు. ఇల్లు. అనేక రకాల మనస్తత్వాలు, ప్రవృత్తులు గల వ్యక్తులందరూ కలసి ఉన్న "అందరిల్లు" అందరితో సర్దుకుపోవటమనేది, అందరిలో లోపాలు చూడక మంచే చూడటం అనేది అంత తేలికైన విషయం కాదు. నువ్వు ఇక్కడ ఉండటానికి నాకు అభ్యంతరం లేదు. నీ కిష్టమొచ్చినన్ని రోజులు ఉండు. కానీ నువ్వు కుటుంబీకుడివి. వాళ్ళను వదిలి నీవు ఇక్కడ వంటరిగా ఉంటాననడం భావ్యం కాదు. మీమామయ్యనడిగి ఏదైనా చెయ్యి" అని చెప్పింది అమ్మ. ఎవరినీ వాళ్ళ ఉద్యోగాలు మానమని చెప్పదు. కానీ దినకర్ అన్నయ్య అంజన్‌ల విషయంలో అమ్మే ఉద్యోగం మానెయ్యమందని అనుకున్నారు. కానీ పై సంఘటన వలన లౌకిక విషయాలలో అమ్మకు గల అపారమైన పరిజ్ఞానం మనకు అవగతమవుతుంది.

అలౌకిక సౌందర్యామృతం చిందే మందహాస ముఖారవిందంలో కరుణారసభరితమై మందహాస విలసితమై ఒప్పారే అమ్మ ముఖ కమలాన్ని ఊహించుకుంటే కలిగే ఆనందానికి సాటి ఏముంటుంది? భగవంతుడు సర్వాంతర్యామి. అజ్ఞానాంధరాకంలోపడి దారీ తెన్ను తెలియక పరితపించే మానవాళికి తరుణోపాయం చూపటానికే ప్రవక్తలు, అవతారపురుషులు ఈ లోకంలో ఉద్భవిస్తుంటారు. మనకు నచ్చిన భగవంతుడి విశేష స్వరూపాన్ని తైలధారాపాతంగా ధ్యానించాలి. ధ్యానం హృదయంలో ప్రారంభమై శిరస్సులోని సహస్రారంలో ముగుస్తుంది. దానికి భక్తి ముఖ్యం. భక్తికి సాధ్యం కానిది ఏదీ లేదు. గురువు, ఇష్టదైవం ఒకరే అంటుంది అమ్మ.

ప్రపంచంలో ఆదరణే ఆస్తి. ఆ ఆస్తి ఎవరంటే అమ్మ. వృద్ధి అయ్యేది నిత్యనూతనం అంటే అనుక్షణం కొత్తదనంతో కూడింది" అని ప్రకటించింది

అమ్మ. ఒక అన్నయ్య ప్రాణాయామం గురించి అడిగాడు. యామాన్ని గుర్తించటం నియమం, అవయవాల చేత మనస్సు కట్టబడేది ప్రాణామామం. మనస్సు చేత అవయవాలు కట్టబడేది భక్తి. ఒక్క మాటలో చెప్పాలంటే అమ్మ సౌందర్యం అలౌకికమైన మధుర భక్తి భావనలకు ఆలంబమైనది. ఏక కాలంలో అనేక చోట్ల అనేక మంది కనిపించటం, పంచభూతాలూ అమ్మ దగ్గర తమ ప్రకోపాన్ని కోల్పోవటం వీటి వలన అమ్మ యొక్క దైవత్వం అవగతమౌతుంది.

నెల్లూరుజిల్లా, ఇడవల్లూరు గ్రామంలో వంద ఎకరాలు వ్యవసాయం చేసిన వ్యక్తి రెడ్డెన్నయ్య. చిన్నతనంలోనే అధ్యాత్మిక విషయాల యందు విశేష ఆసక్తి కలిగానవారు. రమణ మహర్షి, అరవింద యోగి, పుటపర్తి సాయిబాబా గారిని దర్శించారు. వారి ఉపన్యాసాలు, ప్రబోధాలు విన్నారు. మొదటగా వాళ్ళవూరి పోస్టుమాష్టరు అమ్మను గురించి తెలియజేసారు.

అమ్మను దర్శించినా ఆయనకు ప్రత్యేకించి ఏమీ అనుభవం కలగలేదు. వాళ్ళ ఊరు వెళ్ళిన తరువాత జిల్లెళ్ళమూడిలో అమ్మ ఏమీ మాట్లాడదు, ఉపన్యాసాలూ ఇవ్వదు. పుట్టపర్తిబాబా గారైతే ఉపన్యాసాలు ఇస్తారు. నామ సంకీర్తనలు చేయిస్తారు. కాబట్టి బాబాగారి దగ్గరకే వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. ఉదయం నిద్రలేచి అద్దంలో ముఖం చూచుకుంటే నుదుటి మీద కుంకుమబొట్టు ఉన్నది. ఆశ్చర్యం! తాను క్రితం రోజు ఏబొట్టూ పెట్టుకోలేదు. ఎప్పుడైతే ఈ అనుభవం అయిందో అమ్మ తనకు బొట్టు పెట్టి పిలిచిందనుకుని పుట్టపర్తి వెళ్ళాలి అనుకున్నవారు జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మ యొక్క దివ్యమాతృ వాత్సల్యానికి పరవశించి అక్కడే ఉండిపోయారు.

అమ్మ సంభాషణలో ఆయనతో "ఉత్తరదేశం నుండి దక్షిణ దేశంకు పదిమంది సాధువులు రైలులో ప్రయాణం చేస్తున్నారు. వారిని టిక్కెట్ కలెక్టర్, టిక్కెట్ లేనందున బాపట్లలో దించేశారు. బాపట్ల స్టేషన్ ఎదురుగా ఉన్న గవర్నమెంట్ హాస్పటల్‌లో నేరేడు చెట్టుక్రింద కూర్చుని తలా ఒక గ్రంథం పఠనం చేస్తున్నారు.

నేను మంచి నీళ్ళు తీసుకువెళ్తూ వీరిని చూచి ఏదైనా ఆహారం పెట్టుకోవాలని పిలిచి రొట్టెలు, కూర చేసి, వారికి పెట్టాను" వారందరూ ఆశ్చర్యంగా, ఆనందంగా నన్ను చూసారు. "నీవు మాకు ఉత్తరదేశంలో ఇట్లాగే పెట్టావు కదా! ఇంతలోనే ఇక్కడికి ఏ విధంగా వచ్చావు?" అన్నారు. అమ్మ అనుభవం ఇస్తుంది కానీ చిక్కదు, దొరకదు.

"ఏమో నాకు తెలీదు, అక్కడ ఎవరు పెట్టారో ఏమో" అన్నది అమ్మ. వారు "కాదమ్మా నువ్వే మాకు పెట్టావు. నువ్వు ఎవరో చెప్పమన్నారు". అమ్మ వారికి మంచి నీళ్ళు పోసి "ఏమో నాకు తెలీదు" అని గబగబా వెళ్ళింది. వారిలో ఒకరు ఈమె మనకు నార్త్‌లో ఆహారం పెట్టిన ఆమె, అడ్రస్ కనుక్కోవాలని అమ్మ వెనకే వెళ్ళారు. అమ్మ కొద్ది దూరం వెళ్ళి మాయమైంది. ఈ విధంగా ఎవరికి ఎటువంటి అనుభవాలిస్తుందో మన పరిధికి అందని విషయాలను రెడ్డిగారికి చెప్పింది అమ్మ.

అమ్మ ఆయనతో "ఏ ఏ క్షేత్రాలు చూసావు నాయనా" అని అడిగింది. కాశీ, రామేశ్వరం, రమణ మహర్షి, సత్య సాయిబాబా. ఈ విధంగా ఆయన దర్శించిన క్షేత్రాలు, మహాత్ముల గురించి చెప్పారు. అప్పుడు అమ్మ పండరీపురం వెళ్ళావా నాయనా అని అడిగింది. ఆ వెళ్ళానమ్మా! అన్నారు ఆయన. వెంటనే అమ్మ ఆయనతో "నిన్ను ఎవరైనా అక్కడ ఏం నాన్నా! అని పలకరించారా?" అని అడిగింది. రెడ్డిగారికి చాలా ఆశ్చర్యం వేసింది. 36 సం॥ల క్రితం 1930లో ఆయన పండరీపురం వెళ్ళారు.

అక్కడ ఎంతోమంది జనంలో వెనక నుండి "ఏం నాన్నా" అని ఒక ముత్తైదువ పలకరించింది. ఆమె మహత్తరమైన దివ్య తేజస్సుతో కూడి ఉన్నది. చూడగానే ఒక అలౌకిక భావంఏర్పడింది. "ఏమ్మా ఇక్కడ ఒంటరిగా ఉన్నావు? నీతో మగవాళ్ళేవరూ రాలేదా?" అని అడిగారు. ఆమె "ఊరులోకి వెళ్ళారు నాన్నా" అంది. "మీది ఏ ఊరు?" అన్నారు రెడ్డిగారు. "విజయవాడ నాన్నా" అని సమాధానం చెప్పింది. రెండడుగులు ముందుకు వేసిన రెడ్డి గారికి ఆమెను

మళ్ళీ చూడాలనిపించి, అడ్రస్ అడుగుదామనీ వెనక్కు తిరిగి చూశారు. ఆమె కనిపించలేదు. ఆమె మాయమైందో, జనంలోకి వెళ్ళిందో రెడ్డిగారికి అర్థం కాలేదు.

ఇది ఎప్పుడో జరిగిన విషయం. వారికి జ్ఞాపకం కూడా లేదు. 1966లో అమ్మను దర్శించారు. తన దగ్గర ఉన్న ఫోటో చూపించి "ఇట్లా ఉన్నది కదా! ఆ వ్యక్తి అని" అమ్మ స్వయంగా గుర్తు చేసింది. అమ్మ సర్వ వ్యాపకత్వం, సర్వజ్ఞత్వం, అపారమైన మాతృవాత్సల్యానికి ముగ్ధులైనారు. "ఏనాడో అమ్మ నన్ను ఎన్నుకున్నారు. ఈనాడు అమ్మకు సేవ చేసే భాగ్యం నాకు ఏర్పడిందని పులకితులై చెప్పారు".

అమ్మ 1923వ సం॥లో అవతరించింది. 1930లో భౌతికంగా చెప్పుకోవాలంటే అప్పుడు అమ్మకి ఏడు సంవత్సరాలు. అమ్మ ఆంధ్రప్రదేశ్ గుంటూరు జిల్లాలో మన్నవ, బాపట్ల, పొన్నూరు, గుంటూరు, తెనాలి మొదలైన ఊళ్ళు పెద్దవాళ్ళతోనే వెళ్ళింది. 1966లో తాను ఏవిధంగా ఉందో అదే విధంగా 1930లో పండరీపురంలో రెడ్డిగారికి దివ్యదర్శనం ఇచ్చింది అమ్మ. దేశ కాలాతీతమైన అమ్మ "గుర్తించే గుర్తు లేకపోతే దేవుడే వచ్చినా గుర్తించలేరు అని తెలియబడటమే కానీ తెలుసుకోవటం లేదని" అన్నది. అదే విధంగా రెడ్డిగారు ఆనాడు గుర్తించకపోకపోయినా 36 సం॥లు తరువాత అమ్మ స్వయంగా తానెవరో తెలియజేసింది.

సుఖాన్ని వెతుక్కోవాలి, ఆనందాన్ని వెతుక్కోనవసరం లేదు. భౌతికమైన పరిధులకు అతీతమైన హృదయానుభూతి మహాత్ముల సన్నిధానంలోనే మనకు లభ్యమవుతుంది. పరుస వేధిని తాకిన ఇనుము బంగారమైనట్లు వారి క్రియల ద్వారా వారి సన్నిధిలో అలౌకికానుభూతిని పొందగలుగుతాము. క్రియలకు అతీతంగా మౌనం నుండీ కూడా పొందుతాము. అమ్మ సంపూర్ణ తత్త్వానుభూతిని మధుర భావాన్ని, దివ్యానుభూతిని కలుగజేస్తుంది. అందుకే అమ్మ "చెప్పేది అనుభావం, తనలో ఉద్భవించేది అనుభవం" అంటుంది. అనుభవజ్ఞాన ప్రపూర్ణ కనుకే అమ్మ వద్ద అట్టి భావనానుభూతి కలుగుతుంది.

ఒకమారు సంస్థలో బియ్యం లేవు. ఎలా జరుగుతుందో అని దిగులు పడుతున్న తరుణంలో రెడ్డి అన్నయ్య పంపిచారని ఒక బండి నిండా బియ్యం బస్తాలు తీసుకువచ్చారు. సంస్థలో అంతా ఎంతో ఆనందించారు. ఆ తరువాత రెడ్డన్నయ్య వచ్చినప్పుడు "అన్నయ్యా! నీవు బియ్యం సమయానికి పంపించావు, లేకపోతే అభాసు అయ్యేది" అన్నారు. దానితో ఆశ్యర్య పోవటం ఆయన వంతయింది. ఆయన వెళ్ళి అమ్మను అడిగారు. "ఏమీ లేదు నాన్నా! పని జరిగిందిగా ఎవరు పంపితే?" అని దాటేసింది. పై సంఘటనవల్ల బళ్ళు, మనుష్యులు, బస్తాలు అన్నీ అమ్మ సృష్టించినవే అని తెలుస్తుంది.

పూర్వం రెడ్డి సుబ్బయ్య జిల్లెళ్ళమూడిలో ఉన్నాడు. అమ్మ మన్నవ వెళ్ళినప్పుడు జనాన్ని కంట్రోల్ చేస్తూ రెడ్డి సుబ్బయ్య కనిపించాడు. అది చూసిన వారు అక్కడా, ఇక్కడా కూడా ఎలా ఉన్నాడని అమ్మనడిగితే "అది అంతేలే" అంటే మాట మార్చేసింది. అమ్మ శక్తి స్వరూపిణి, అమ్మకు చేతకానిది కానీ, చెయ్యలేనిది కానీ లేదు కదా!

రెడ్డి అన్నయ్యతో నెల్లూరు వెళ్ళి మూడువేల అరటికాయలు, ఆరువేల అరటి ఆకులు, రెండువేల నిమ్మకాయలు అమ్మ తీసుకురమ్మంది. "అమ్మా! మా వూళ్ళో అన్ని అరటికాయలు ఉండవు. అది అంతా బీడు భూమే" అని అన్నారు. కాదునాన్నా నీవు తీసుకురా" అంది అమ్మ. ఆయనకు ఏమి చెయ్యాలో బోధపడక వాళ్ళ ఊరు వెళ్ళారు. పూర్వం బీడులా ఉండే భూమి అంతా అరటి చెట్లతో పచ్చగా కనిపించింది. అమ్మ అడిగినట్లుగానే 3 వేల అరటి కాయలు, 6వేల అరటి ఆకులు, 2 వేల నిమ్మకాయలు తీసుకువచ్చారు. తోవలో చెక్‌పోస్టు వద్ద ఇంత సామాను తీసుకు వెళ్ళటానికి తాసిల్దారు సంతకం కావాలన్నారు. దానికి ఆయన కాయలు, ఆకులు పాడైపోతాయి జిల్లెళ్ళమూడి చేర్చాలని అన్నారు. అక్కడ కాపలా వాళ్ళు అదేమీ కుదరదని రెడ్డి అన్నయ్యతో ఘర్షణ పడుతున్నారు. ఇంతలో లోపలి నుండి జిల్లెళ్ళమూడా? అంటూ ఒకరు వచ్చి అమ్మ గురించి చెప్పమన్నారు. కాయలు పాడైపోతాయని బాధపడ్డా మరీ మరీ అడిగారు కనుక

అమ్మ గురించి చెప్పారు. అమ్మ గురించి విన్న వెంటనే ఎటువంటి అభ్యంతరం చెప్పకుండా ఆ లారీని పంపేశారు.

నాన్నగారు, రెడ్డన్నయ్య చాలా స్నేహంగా ఉండేవారు. "మా వూరిలో పూర్వం ఇంత ఫలసాయం లేదు. మరి అమ్మ ఎలా చెప్పగలిగిందో అర్థం కావడం లేదని" నాన్నగారితో అన్నాడు రెడ్డెన్నయ్య. నాన్నగారు ఆ విషయమై అమ్మను ప్రశ్నించారు. దానికి అమ్మ "నాకు అవసరం అనుకున్నప్పుడు చూస్తాను" అని చెప్పింది. ఆ విషయాన్ని నాన్నగారు రెడ్డన్నయ్యకు తెలియజేసారు.

"ఫిజిక్స్ గురించి అమ్మ ఎంత తరచి చూచినా, ఎన్ని పూజలు చేసినా వాడనేవాడు లేడన్నది సత్యం" అని చెప్పింది. "ప్రత్యేకంగానా?" రామకృష్ణన్నయ్య అడిగాడు. "నా మాటలకే కరణీకం చేస్తున్నావురా!" అంది అమ్మ. 'సృష్టేదైవం' అన్నది అమ్మ. కనిపించేదంతా దైవ స్వరూపమే అయినపుడు కళ్ళు మూసుకోవటమెందుకు అంది అమ్మ. త్యాగరాయ కీర్తన చీమలో, దోమలో అని పాడుతుంటే "కాదు నాన్నా చీమగా, దోమగా ఉన్నాడని" వివరించింది. "మంచి మాట చెప్పమ్మా అని అడిగితే ఎల్లప్పుడూ భగవంతుని మరవద్దు" అని చెప్పింది.

భాగ్యమ్మక్కయ్య అమ్మ సిద్ధి పొందే వరకూ అన్నపూర్ణాలయమును పవిత్రమైన ఆలయంగా భావించుకొని సేవించిన వ్యక్తి. అమ్మ దగ్గర అప్పటికే నివాసమేర్పరచుకున్న శేషయ్యగారిని అమ్మ దగ్గరకి తీసుకువెళ్ళామని ఎన్నోమార్లు భాగ్యమ్మక్కయ్య వేడుకుంది. శేషయ్యగారి కుటుంబం బాపట్లలో వుండేవారు. ఆయన తరుచూ వెళ్ళి వస్తుండేవారు.

ముందుగా శూలం పట్టుకొని తెల్లచీర కట్టుకున్న వ్యక్తి కనిపించింది. రైలు కట్ట అవతల వరకూ భాగ్యమక్కయ్యతో నడిచింది. "ఏమిటి? అమ్మ దగ్గరకు వెళ్ళాలన్న నా తపన గ్రహించి అమ్మే ఈ విధంగా తనకు కనిపించిందా!" అని భాగ్యమ్మక్కయ్య అనుకుంది. ఈలోగా తూములూరు నుంచి నరసింహారావు గారు వాళ్ళ అమ్మాయిని తీసుకుని బాపట్ల స్టేషన్‌కు వచ్చారు. అక్కయ్య వారిని పలకరించింది. వారు జిల్లెళ్ళమూడి వెళ్తున్నామని చెప్పారు. ఎన్నో రోజులుగా

అక్కయ్యకు జిల్లెళ్ళమూడి వెళ్ళాలని తపనగా వుంది. దానితో వేరేమీ ఆలోచించకుండా వారితో జిల్లెళ్ళమూడికి ప్రయాణమయింది. అన్నపూర్ణాలయంలో వాడటానికి జాడీతో ఆవకాయ తీసుకువెళ్లున్నారు నరసింహారావుగారు. 7వ మైలు రాయి దగ్గర నుంచి ఆవకాయ జాడీ బుజాన పెట్టుకొని అమ్మ దగ్గరకు వచ్చింది భాగ్యమ్మక్కయ్య.

అమ్మ దర్శనంకు వెళ్ళి పూలు పళ్ళు అమ్మ పాదాల దగ్గర పెట్టి కూర్చున్నారు. అన్నంతిని రమ్మంది. వరలక్ష్మమ్మగారు వడ్డించింది. బాపట్ల వెళ్ళిన తరువాత వెంకాయశర్మగారింట్లో పడుకొని నిద్రపోతుంటే అమ్మ తెల్లచీర కట్టుకుని అద్దంలో కనిపించి అక్కయ్య బొట్టు చెరిపేసింది. ఆ రోజు శుక్రవారం. ఇలా జరిగిందేమని అక్కయ్య వ్యధ చెందింది. సరిగా మళ్ళీ శుక్రవారం అక్కయ్య భర్త మరణించారు.

శేషయ్యగారు "అమ్మ జిల్లెళ్ళమూడి రమ్మంటోంది వస్తావా?" అని అడిగారు. అంతకంటే ముఖ్యమైనది తన జీవితానికి ఇంకేముందనుకొని వెంటనే ఆయనతో జిల్లెళ్ళమూడి వెళ్ళింది. ఆరోజు వుండ్రాళ్ళతద్ది. అమ్మకు నమస్కారం చేసుకున్న తరువాత వంట చేసి నలుగురికీ పెట్టమంది అమ్మ. ఆరోజు నుంచీ అక్కయ్య అన్నపూర్ణాలయంకు అంకితమైంది. అక్కయ్య వచ్చిన తరువాత వసుంధరక్కయ్య వాళ్ళ అమ్మ వెంకాయమ్మగారు, హైమ చనిపోయారు.

2,3 సం॥ల తరువాత అనంత పద్మనాభ చతుర్దశినాడు రావూరి నరసింహమూర్తిగారి అమ్మాయి రమకు జ్వరం వస్తే అమ్మ అమ్మాయి బాధ్యతను అక్కయ్యకు అప్పజెప్పింది. ఆ పిల్ల తల్లి చిన్నప్పుడే చనిపోయింది. పిల్లల పోషణ గురించి, వారిని సాకటం గురించి ఏమీ తెలియని దానికి నాకు అప్పగించావేమిటమ్మా?" అని బాధపడ్డది. హైమక్క వచ్చి ఆ పిల్ల నుదురుతాకి భయం లేదు, తగ్గిపోతుంది. తెల్లవారి పత్యం పెట్టమని అదృశ్యమైనది. తన భయం తీర్చటానికే హైమమ్మ అలా దర్శనమిచ్చిందని పొంగిపోయింది భాగ్యమ్మక్కయ్య.

బామ్మ సంవత్సరీకాలకు వచ్చి ఆ మూడు రోజులూ వంట వడ్డన చేసింది భాగ్యమ్మక్కయ్య. నాన్నగారు డబ్బు ఇవ్వబోతే, నేను డబ్బు కోసం రాలేదని చెప్పింది. మహోదయం నాడు చాలా బస్సులు వస్తున్నాయని ఫోను వచ్చింది. వెంటనే ఎక్కువ వంట చేసారు. కొండ పాటూరి బాల వచ్చింది. అమ్మ రామకృష్ణన్నయ్యతో "భాగ్యమ్మ చుట్టాలు కూడా వచ్చారురా! అని చెప్పింది.

అక్కయ్య అమ్మ దర్శనార్ధం వెళ్ళింది. అమ్మ "వచ్చిన వారికి వంట చేసి ఆదరణగా పెట్టమనీ, నా దగ్గర కూర్చుంటే దర్శనమివ్వను, నీవు అన్నపూర్ణాలయంలో వున్నా నీకు నా దర్శన భాగ్యం కలుగుతుందనీ హామీ ఇచ్చింది. అమ్మ మాటనే వేదవాక్కుగా తీసుకొని అక్కయ్య అన్నపూర్ణాలయంలో వచ్చిన వారందరికీ ఆదరణగా అమ్మ ప్రసాదం పెట్టేది.

అమ్మ ఆరోగ్యం సరిగా లేనప్పుడు నెల్లూరు వెళ్ళి డా॥ శిష్ట్లా సుబ్బారావు గారింట్లో ఉన్నది. నెల్లూరు నుంచి తిరిగి వచ్చినప్పుడు సరాసరి అన్నపర్ణాలయంకు వచ్చి అటుకులు, చింతకాయ పచ్చడి కలిపి అందరికీ పెట్టింది. అది అమృతోపమానంగా వుందని తిన్నవారంతా తెలియచేసారు.

అక్కయ్యను పైకి రమ్మని కబురుపెట్టింది అమ్మ. అక్కయ్యకు భయంతో దడ వచ్చింది. పైకి వెళ్ళగానే వసుంధరక్కయ్యను పిలిచి అక్కయ్యకు మజ్జిగ ఇవ్వమంది అమ్మ. నాన్నగారు పోయినప్పుడు ఆవరణలో అందరికీ మొగవారికి తువ్వాళ్ళు. ఆడవారికి జాకెట్టు గుడ్డలు పెట్టారు. వీరింటి నుంచీ ఎవ్వరూ వెళ్ళకపోతే అక్కయ్యకు కబురుపెట్టి అమ్మ జాకెట్టు గుడ్డ ఇచ్చింది.

ఒకసారి అమ్మ "అన్నపూర్ణాలయంలో పనిచేసే వారందరికీ ఏయే పనులు, ఎవరెవరు చేయాలో తెలుపుతూ భాగ్యమ్మక్కయ్య "అందరి తల్లి" ఆమె చెప్పినట్లు మిగిలిన వారంతా నడుచుకోండి అని చెప్పింది. మరో సందర్భంలో మాట్లాడుతూ అమ్మ "మీ అందరి ఓర్పు నేర్పుతో కూడిన ఓర్పు భాగ్యమ్మది సహజమైన ఓర్పు" అని అమ్మ చేతే పొడిగించుకున్న పుణ్యాత్ముంరాలు భాగ్యమ్మక్కయ్య.

అమ్మ సిద్ధి పొందిన 4 సం॥ల తరువాత అమ్మ ఒక బకెట్టు పట్టుకొని ఆకలి వేస్తోంది అన్నం పెట్టమని భాగ్యమ్మక్కయ్యను అడిగింది. ఏమి వేసి పెట్టనమ్మా? అన్నది. గోంగూర పచ్చడి, కంది పచ్చడి పెట్టమన్నట్లుగా తెల్లవారు ఝామున కల వచ్చింది. మర్నాడు అమ్మకోరిన విధంగా చేసి అమ్మకు నివేదన చేసి అన్నపూర్ణాలయంలో వడ్డించింది. రాగద్వేషాలకు అతీతంగా అన్నపూర్ణాలయంలో సేవచేసుకునేది. అన్నపూర్ణాలయంలో వాళ్ళు ఎలా వుండాలని అమ్మ అనుకునేదో అలా సహజంగా నడిచిన వ్యక్తి భాగ్యమక్కయ్య.

వంటింట్లో గొడవలు పడలేక వెళ్ళిపోతానని అమ్మకు చెప్పటానికి పైకి వెళ్ళేది. ఆరోజు అమ్మ గది తలుపు అసలు తీసే వారే కాదు. దానితో ఇక్కడ వుండవలసిన వాళ్ళమే, ఎక్కడికీ పోలేమని నిర్ణయించుకుంది. పండగలప్పుడు అక్కయ్య తెలవారు ఝామున మెలకువ రాదేమోనని భయపడ్తుంటే అమ్మ ఉదయమే అక్కయ్యను లేపేదని భాగ్యమ్మక్కయ్య ఎంతో ఆనందంగా తెలియచేసింది.

పల్లపట్ల శాస్త్రిగారికి అమ్మ దగ్గరకు రాకముందే కలలో "ఆయన ఆత్మలో నుంచి ఒక చిన్నపిల్ల వెలుపలికి వస్తూ ఒక్కొక్క మెట్టూ ఎక్కుతుంటే ముందు మెట్టు తయారవుతు ఆ పిల్ల ఎదుగుతూ త్రిశూలం చేత పట్టుకుని కిరీటధారిణియై మందార మాల ధరించి పట్టు చీరలో దాదాపు ఐదు అడుగుల ఎత్తున దర్శనమిచ్చింది. ఆ తల్లి ఎక్కడ వుందో అని అన్వేషణ ప్రారంభించారు. హరినాగభూషణం గారింట్లో జిల్లెళ్ళమూడి అమ్మ ఫోటో చూచారు. పశ్చిమంగా వెలుగు కనిపిస్తే ఆ వెలుగు వెంబడి అమ్మ వద్దకు వచ్చారు. అమ్మ విశ్రాంతి తీసుకుంటున్నది. ఆయన భోజనం చేసి, జపం చేసుకుంటుండగా రమ్మని పిలుపువచ్చింది.

అమ్మను చూచినప్పటి నుంచీ కన్నీరు మున్నీరు కాగా హృదయం ఆర్తితో నిండి పోయింది. అమ్మ మెడలో దండవేసి కళ్ళు మూతలు పడగా అమ్మ పాదాలపై ఒరిగిపోయింది. శ్యామలా దండకం స్తోత్రం చేస్తూ అమ్మకు చాలాసేపు విసురుతూ కూర్చున్నారు. అమ్మ "నీకు ఉన్నది" అంటూ ప్రసాదం ఇచ్చింది.

అమ్మ అన్నదాని గురించి ఆలోచిస్తుంటే "నీకు ఏది కావాలంటే అది ఉన్నదని మనసుకు తట్టింది". పైకి వెళ్ళి అమ్మతో "అమ్మను చూడాలని" ఉంది అన్నారు. సరే చూద్దువు గాని కూర్చో" అని అమ్మ లోపలకు వెళ్ళింది. ఒక వెలుగు ఫలకంలో ఈయన స్వప్న దర్శనమే మరల కనిపించింది. ఏనాటి పుణ్యఫలమో అమ్మ సంపూర్ణ అవతార దృశ్యాన్ని చూశానని చెప్పారు. మర్నాడు తెల్లవారు జామున అమ్మను పంచముఖ గాయత్రిగా చూచారు. అమ్మకు నమస్కరించుకోవటానికి వచ్చినపుడు "ఒక్కమారు కనిపిస్తే చాలదా" అని అమ్మ అడిగింది. ఆయనకు నోటమాట పెగిలిరాలేదు.

అమ్మ దర్శనానికి పల్లపట్ల నుండి వచ్చినపుడు "నాన్నా ఇక్కడ ఇల్లు కట్టుకుంటావా?" అని అడిగింది. కొంత పొలం అమ్మి ఇల్లు ఏర్పాటు చేసుకున్నారు. రోజూ ఆరుగంటలు నామం, ఉదయం, సుప్రభాతం, సాయంత్రం సంధ్యావందనం ఎనిమిది సంవత్సరాలు చేశారు. అలా చేయగా చేయగా శుద్ధ స్పటికాకారంగా దోషాలను ప్రక్షాళనం అయినట్లుగా ఆత్మజ్ఞానం కలిగింది.

శాస్త్రిగారి మేనత్త దావా వేసింది. శాస్త్రిగారి నాన్నగారు గుండె నొప్పితో చనిపోయారు. కర్మకాండలు పూర్తయ్యాక గాలివానలో బయల్దేరి పెదనందిపాడు మీదగా బస్సులున్నచోట బస్సులోను, లేనిచోట్ల నడిచి జిల్లెళ్ళమూడి చేరారు. ఇంటికి వచ్చి స్నానం చేసి, జపం చేసుకుని అమ్మ దర్శనం కొరకు వెళ్తూ బాగా వేడిచేసింది అమ్మ పెరుగు వేసి అన్నం పెడితే బాగుంటుందని అనుకున్నారు. అమ్మ దగ్గరకు వెళ్ళగానే అమ్మ విద్యాధరిని పిలిచి ఆయనకు అన్నం పెట్టి పెరుగు వేయమంది. దానితో తెల్లబోవటం ఆయన వంతయింది.

శాస్త్రిగారి మేనత్త రాజీకి వచ్చి ఇరవై ఐదు సంవత్సరాల పంట డబ్బు కట్టమంది. ఈయన హైకోర్టులో అపీలు చేసుకోగా జడ్జిమెంట్ రెండవ లైను అమ్మ సవరించడంలో శాస్త్రిగారు గెలవటం తటస్థించిందని" స్వప్నద్రుశ్వరి ఆయన నమ్మకం. శ్రీమహావిష్ణు రూపం ధరించియున్నది.

హైమ తెల్లని వస్త్రాలు ధరించి పంపు తిప్పి పానకం పోస్తున్నట్లు దర్శనమిచ్చింది. ఆ తరువాత పద్మాసనం వేసుకుని అఖండ జ్యోతిలో

విలీనమైనట్లు శాస్త్రిగారికి కనిపించింది. ఆ రోజే సూర్యనారాయణ గారికి, పూజారి గారికి కూడా హైమ దర్శనమిచ్చిందని చెప్పారు. ఇద్దరము అమ్మ దగ్గర కూర్చున్నారు. అమ్మ హైమ కనిపించిదమ్మా అన్నాడు. ఏం నాన్నా నీకు కనిపించిందా! అని అమ్మ అడిగింది. కనిపించింది అన్నారు.

అమ్మతో ఆయన గుండెల్లో మంటపుడుతోందమ్మా" అని అన్నారు. అమ్మ వచ్చి గుండెల మీద చేతితో తాకింది. గుండెల్లో మంట తగ్గటమే కాక అమ్మ వేళ్ళు తాకిన, ఆనిన చోట కొన్ని మచ్చలు పడ్డాయి. ఇప్పటికీ చెరిగిపోక అలాగే ఉన్నాయి.

హైమనామం చేస్తుంటే హైమక్క గజేంద్రమ్మగా, జయమ్మగా కనిపించింది. ఆయన అమ్మతో "ఏం బోధపడక మేము బాధ పడవలసి వస్తుంది" అని అన్నారు. దానికి అమ్మ "భోదపడేవరకు బాధపడవలసిందే నాన్న" అన్నది. "జిహ్వా చాపల్యానికి, బుద్ధి చాంచల్యానికి కారకులెవరమ్మా" అని అడిగారు. మహా సున్నితంగా "నేను" అని అమ్మ జవాబిచ్చింది.

మూడవ అంతస్తుకు శ్లాబు వేస్తున్నప్పుడు శ్రమదానానికి రమ్మని వసుంధరక్కయ్య వాళ్ళు శాస్త్రిగారిని పిలిచారు. ఆడపిల్లల పాటి తాను అందించలేనా! అని ఆ పనికి నడుంకట్టారు. కొంత సేపటికి కళ్ళుబైర్లు కమ్ముతున్నాయి. అలాగే పట్టుదలగా అక్కడే నిలబడ్డారు. ఆయన చేతులు మాత్రమే కదులుతున్నాయి. ఎదురుగా అమ్మ మోస్తూ కనిపించింది. ఇంతలో సుందరరామి రెడ్డిగారి దగ్గరకు ఒక పిల్లవచ్చి ఏదో చెప్పింది.

వెంటనే రెడ్డి అన్నయ్య శాస్త్రిగారితో "మీరు అందించనవసరం లేదు. పక్కనే కూర్చోమన్నారు" బతుకు జీవుడా అని శాస్త్రిగారు ఇవతలకు వచ్చారు. అమ్మ దర్శనార్థం గంట కొట్టారు. కాళ్ళూ, చేతులు కడుక్కొని అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మ ఏగా దిగా ఆయన వంక చూచింది. నామం చెప్పుకుని పడుకుంటే మాగన్నుగా నిద్రపట్టింది. లేచేటప్పటికి ఆకలివేసింది. తొక్క, గింజ లేనటువంటి సపోటాలు ఆయన నోట్లోపడ్డాయి. అవి తిని మంచి నీళ్ళు తాగి అమ్మ దర్శనానికి

వెళ్ళారు. "ఏం నాన్నా నిండిందా?" అని అమ్మ అడిగింది. "కడుపు నిండిదమ్మా" అన్నారు. అమ్మ మజ్జిగ తాగి వెళ్ళమంది.

సంధ్యా వందనంలో బేధమెరుగని నీ విధానాలు అని పాడటానికి బదులుగా బేధమెరిగిన నీ విధానాలు" అని పాడారు. అంతా నమస్కారం చేసుకుని వెళ్ళారు. ఆయన అమ్మ దగ్గరకు వెళ్ళగానే "ఏమిటి పాడావు నాన్నా బేధమెరిగిన నా విధానాలా" అని అడిగింది. దానితో మూగబోయారు.

జటిలమైన సమస్యలు ఉత్పన్నమైనప్పుడు అమ్మ కనపడి మనకు సరియైన మార్గాన్ని సూచిస్తుంది. సర్వశక్తి సమన్విత అయిన ఒకానొక మహాశక్తియే అమ్మ. సుప్రభాత సమయంలో అమ్మలో నుండి అనేక రూపాలు వెలువడటం దర్శించిన వ్యక్తి. మనం పెట్టుకునే అప్లికేషన్ "నాకు మంచి మార్గం చూపించమ్మా!" అని పెట్టుకోవాలని అప్పుడే అమ్మ మనకు అనువైన మార్గాన్ని సూచిస్తుందని ఆయన ప్రగాఢ విశ్వాసాన్ని తెలియచేసారు. "బాధలతోనే సుబోదయొనర్చేజనని అనసూయ నామచింతన మనసా" అని ఆయన అమ్మ మీద పాటలు కూడా రాసుకున్నారు.

డా॥ ఎస్.వి. సుబ్బారావుగారు నెల్లూరులో పేరు మోసిన వ్యక్తి. అమ్మ యొక్క పరిపూర్ణ అనుగ్రహానికి పాత్రులైనారు. అమ్మ కరుణనూ, సర్వసామర్థ్యాన్నీ స్వయంగా చవిచూచారు. వృత్తి రీత్యా డాక్టరు. ఆయనకున్న సహనం, ఓర్పు లాంటివి తనకూ ఏర్పడాలని డా॥ ఇనజ అమ్మను స్వయంగా వేడుకున్నది. డాక్టరుగా ఆయన వృత్తిలో రాణించటమేకాక బీదసాదలను ఎంతో ప్రేమ, ఆప్యాయతలతో ట్రీట్‌మెంట్ చేసేవారు. జిల్లెళ్ళమూడి వచ్చేవారందరికీ నెల్లూరు డాక్టరు గారిగా ప్రసిద్ధి చెందారు.

ఆయనకు అమ్మ యందు కల విశ్వాసం అంతులేనిది. అమ్మకు కారు అంటే మక్కువ అని తెలిసి కారు ఇస్తానమ్మా! అన్నరు. దానికి అమ్మకారు సరే నాన్నా పిల్లలు భోజనాలకు ఇబ్బంది పడుతున్నారు. అన్నపూర్ణాలయం రేకుల గురించి ఆలోచించమంది. అమ్మకు ఎంతసేపూ బిడ్డల గురించే ఆలోచన కదా!

ఆయన భావనలో అమ్మ అంతా తానేయైనది. అంతులేనిది అమ్మను

గురించి తాను తెలుసుకున్న కొన్ని వైద్యశాస్త్ర అనుభవాలను (24-4-74న) హైదరాబాద్‌లో అమ్మ సమక్షంలో శ్రీ వీరమాచినేని ప్రసాదరావుగారి ఆధ్వర్యంలో అమ్మను గురించిన సెమినార్ జరిగింది. అందులో డా॥ శిష్ట్లా వెంకట సుబ్బారావుగారు చదివారు. అందులోని కొన్ని అంశాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

Amma is a Medical marvel. అమ్మ ఒక అసాధారణ వైద్యప్రవీణ. అంతేకాదు ఒక అసాధారణ రోగి కూడాను. అందుకే అమ్మ "వైద్యోనారాయణో హరిః యే కాదు, రోగి కూడా వైద్యునికి నారాయణ స్వరూపుడే" అన్నది.

అమ్మకు 5సం॥ వయస్సులో మరిడమ్మ గారికి (అమ్మ తాతమ్మ) భరించరాని కాలినొప్పి వచ్చింది. దానికి అమ్మ "జున్ను తినమని చెప్పింది. ఒక్కమారు జున్ను తినేటప్పటికి ఆకాలినొప్పి మటుమాయమయింది" అని అమ్మ డాక్టరు గారితో చెప్పింది. జున్నుతో కాలినొప్పి ఎట్లా తగ్గుతుంది? అని డాక్టరుగారు అడిగారు. ఆమె శరీరంలో లోపించిన పదార్థం దానిలో వుంది. అందుకని తగ్గిందన్నది. 5 సం॥ల పిల్లకు ఏది లోపించిందో తెలియటం అమ్మ భిషగ్వరేశ్వరిగాక మరేమిటి?.

ఏదైనా అసాధారణ విషయం అమ్మ వల్ల జరిగిందని మనం నమ్మినా తాను మాత్రం ఒప్పుకోక తరుణం వచ్చింది కనుక జరిగింది అంటుంది. మాయ తెరలు కప్పటం అమ్మ స్వభావం. దేనికీ తన కర్తృత్వం ఒప్పుకోదు. జిల్లెళ్ళమూడిలో ఒకామె రెండు సం॥లుగా నడుము, కుడికాలు నొప్పితో బాధపడుతుండేది. హోమియో, ఆయుర్వేదం అని మందులు వాడింది. గుణం కనిపించలేదు. తరువాత ఆమె మద్రాసు వెళ్ళి డా॥ రామూర్తిగారి దగ్గరకు వెళ్ళింది. ఆయన ఆపరేషన్ చేయాలని అన్నారు.

డా॥ సుబ్బారావుగారు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అక్కయ్య ఎక్స్రేలు చూపించింది. అమ్మ అన్నయ్యను "ఏం చేయమంటావు?" అని అడిగింది. గుంటూరులో డా॥ యతిరాజులు గారికి చూపించమన్నారు. ఆయన 6నెలలు

అక్కయ్యను బెడ్‌లో వుంచి వైద్యం చేసారు. ఏమీ గుణం కనిపించనందున హైద్రాబాద్ కాని, వైజాగ్ కానీ తీసుకువెళ్ళమన్నారు. గుంటూరులో న్యూరో సర్జెన్‌కు చూపిస్తే వెన్నుపాములో కణితి పెరుగుతోందని, కాళ్ళకు పోవాతపు సూచనలు కనిపిస్తున్నాయని, ఆపరేషన్ చేసినా కాళ్ళు బాగుపడి ఆమె నడవగలదని తనకు నమ్మకం లేదని చెప్పారు. ఈ సమాచారాన్ని నెల్లూరు డాక్టరుగారు, గోపాలన్నయ్య, సుబ్బారావన్నయ్య ఆలోచించి అక్కయ్యను గుంటూరు నుంచి మదనపల్లికి తీసుకువెళ్ళారు. అతిప్రయాసతో ఇద్దరి సాయంతో అక్కయ్య తప్పటడుగులు వేసినట్లుగా నడిచింది. ఆమెను క్రింద గదిలో పడుకోబెట్టి డాక్టరుగారు అమ్మ దగ్గరకు వెళ్ళి అమ్మపాదపద్మములపై వాలి "శరణుశరణు కరుణాకరి శుభకరి" అని శరణువేడారు.

అన్నీ తెలిసిన అమ్మ ఏమీ తెలియనట్లుగా ఏమిటి నాన్నా! అని అడిగింది. అప్పుడు అమ్మ రిషీవాలీ స్కూలుకు వెళ్ళటానికి సన్నద్ధమవుతోంది. అమ్మ అక్కయ్య వున్నగదిలోకి వెళ్ళి 10 ని॥లు వున్నది. మరి అమ్మ ఏమిట్రీట్‌మెంట్ ఇచ్చిందో కాని పేషంటు ఏ ఆధారం లేకుండా చక్కగా నడుస్తూ గది నుంచీ బయటకు వచ్చింది. ఆమె వెనక అమ్మ నవ్వుతూ వచ్చి అక్కయ్యను కూడా తనతో పాటు తీసుకు వెళ్ళింది. ఆ సంఘటన అక్కడున్న యావన్మందినీ ఆశ్చర్యచకితులను చేసింది. ఆ అక్కయ్య ఎవరో కాదు వసుంధరక్కయ్యే. ఇప్పటికీ జిల్లెళ్ళమూడిలో అమ్మను అర్చించుకుంటున్న ధన్యజీవి. ఆ పక్షవాతమేమైందో, ఆట్యూమర్ ఏమయిందో అమ్మకే ఎఱుక. నెల్లూరులో నెత్తురు పరీక్ష చేసినప్పుడు E.S.R. 120 M.M. వున్నది. మదనపల్లి నుంచీ తిరిగి వచ్చి చూస్తే 16 M.M. వున్నది. ప్రసిద్ధి గాంచిన వైద్యుల వల్ల కించిత్తయినా నయంకాని ఈ వ్యాధి క్షణంలో మాయంచేసిన యీ అమ్మ మహాభిషగ్వరేశ్వరి కాదా!

1973 వ సం॥ సెప్టెంబర్‌లో అమ్మ నెల్లూరు వెళ్ళింది. డాక్టరు గారి సన్నిహితుల కుటుంబం వారి ఇంటిలో విడిది చేసిన సమయంలో వారు వుండటం తటస్థించింది. అమ్మ జిల్లెళ్ళమూడికి తిరిగి ప్రయాణమయినప్పుడు ముందురోజు

వారి పిల్లాడికి ఉన్మాదం ఉద్భృతమయినది. అతనికి 1965లో డాక్టరుగారు వైద్యం చేసారు. 3 నెలలకు తగ్గింది. మళ్ళీ 1972లో బొంబాయిలో వుండగా వచ్చింది. అక్కడి డాక్టర్లకు సుమారు 4నెలలు పట్టింది.

అమ్మ వారి ఇంటిలో వుండగా మళ్ళీ వ్యాధి దిరగ బెట్టటంతో అతని ఆత్మ బంధువులను విపరీత ఆలోచనలకు, ఆరోపణలకు కారణమైంది. డాక్టరుగారు నిద్రమాత్ర మింగించాలని ఎంత ప్రయత్నించినా కుదరలేదు. అతన్ని అమ్మ వద్దకు తీసుకువెళ్ళారు. అమ్మ ఆ మాత్రను అతని చేత మింగించింది. కానీ అతను రాత్రంతా నిద్ర పోకగొడవ చేసాడు. అమ్మ బయలుదేరే సమయానికి అతని పరిస్థితిలో మార్పు లేదు. అమ్మతో పాటు డాక్టరుగారికి ప్రయాణం చేయాలని వున్నా అతని పరిస్థితిని బట్టి ఎలా వెళ్ళటమా అన్న సందిగ్ధావస్థలో పడ్డారు. అమ్మకారు ఎక్కుతున్నప్పుడు అమ్మనే అడిగారు. "నువ్వు నాతో వచ్చేయి నాన్నా! వాడికి తగ్గిపోతుందిలే అని అమ్మ అభయం ఇవ్వటం డాక్టరుగారు కనీసం పాదరక్షలు కూడా లేకుండా కారులో ఎక్కటం జరిగింది. ఆరోజు రాత్రి డాక్టరుగారు తిరిగి వచ్చేటప్పటికి అతనికి పూర్తి స్వస్థత చేకూరింది. ఈ విషయాన్ని బొంబాయిలో డాక్టరుకు చెబితే అది అసంభవమని అన్నారు. పై కేసులు అమ్మ స్వయంగా వైద్యం చేసి నివారించినవి.

ప్రమాదకరమైన గుండె జబ్బుకు ఏ మందూ సరిపడని ఒక డాక్టరు గారి భార్యకు నెల్లూరులో అమ్మ పాద తీర్థంతో పూర్తి నివారణ అయింది. అమ్మ తన గుండెల మీద చేయి పెట్టి రాస్తే బాగుండునని కోరుకున్న హార్టు పేషంటుకు అమ్మ అతని దగ్గరకు రాగానే అతని గుండెల మీద చేయి పెట్టి "ఎట్లా వుంది? నాన్నా!" అని అడిగింది. వెంటనే ఏదో కరెంట్ పాసయినట్లుగా అతనికి అనుభూతి కలిగింది. ఆ తరువాత అతను పూర్తిగా కోలుకోవటం E.C.G లో మార్పు రావటం జరిగింది. అమ్మ కుంకుమ నీటిలో కలిపి సేవించిన ఎంతమందికో జబ్బులు నయమై, కోలుకోవటం జరగటం అమ్మ బిడ్డలందరికీ అనుభవైకవేద్యమే.

అమ్మ మహాభిషగ్వరేశ్వరే కాదా! అసాధారణ రోగి కూడా. 1962లో అమ్మకు

అనారోగ్యంగా వుందని ట్రీట్‌మెంట్‌కు మద్రాసులో డా॥వైద్యనాధన్ అనే ప్రముఖ వైద్యుని ఇంటికి తీసుకువెళ్ళారు. ఆయన పూజామందిరంలో నుంచీ హాలులోకి వచ్చి అమ్మ వంక కన్నార్పకుండా చూచి "నీవు దేవతవా? లేక రాజపుత్ర స్త్రీవా? ఎవరమ్మా నీవు" అని ప్రశ్నించారు. 'అమ్మ' ను నాన్నా! అని డాక్టరుగారికి ఆపిల్ పండు ఇచ్చింది అమ్మ. ఆయనకు తన శరీర అనారోగ్యం గురించి అమ్మ వివరించింది. ఆయన అమ్మ పాదపద్మములకు సాష్టాంగ పడి చాలా సేపు తన్మయత్వంలో మునిగిపోయి అంతలోనే తేరుకుని దేవతకు అనారోగ్యం ఏమిటమ్మా! నన్ను తరింపచేయటానికి ఈ విధంగా వచ్చావు నా తపస్సు ఫలించింది. అని పరిపరివిధాల అమ్మను స్తోత్రం చేసారు.

1970 సం॥లో ఒంటి డాక్టరు, పంటి డాక్టరు, కంటి డాక్టరు కావాలని అమ్మ నెల్లూరు డాక్టరుగారికి కబురు చేసింది. ఇద్దరు వంటి డాక్టర్లు, ఒక కంటి డాక్టరు, ఒక పంటి డాక్టరు నలుగురు బయలుదేరి జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మకు పాదాభివందనం చేసి కూర్చున్నారు. అమ్మ తన శారీరక అనారోగ్యం గురించి విపులంగా ఒక అరగంట సేపు సం॥ల వారిగా వారికి వివరించి చెప్పింది. ఆ విపులీకరణతోనే సమస్త వ్యాధులూ సాక్షాత్కరించాయి. అమ్మ మంచి నీరు తప్పించి ఏమీ ఆహారం తీసుకోదు. బలవంతం చేస్తే కొద్దిగా కాఫీ తాగుతుంది. ఏదైనా నైవేద్యం పుట్టినప్పుడు కూడా కొద్దిగా నాలుకకు రాసుకుంటుంది. "ఏదీ తినను, ఏదీ తినకూడదని నియమం గూడా లేదు. "ఈ కలిలో నాకు ఆకలి లేదు" అని చిన్నతనంలోనే చెప్పింది.

అమ్మను పరిక్షించినప్పుడు మూత్రంలో 2% షుగరు వుంది, బి.పి. వుంది ఒకటేమిటి? అనేక వ్యాధి లక్షణాలు గోచరించాయి. ఆహారం లేకుండా జీవించటమే అసంభవం, అందులో షుగరు వ్యాధివున్నప్పుడు ఆహారం తీసుకోకపోతే శీఘ్రగతిని శరీరం క్షీణించి ప్రాణహాని జరగటానికి ఎంతో కాలంపట్టదు. కానీ అమ్మలో అటువంటి లక్షణాలేమీ సూచనప్రాయంగా కూడాలేవు, కారణం అమ్మలో దైవత్వమే కనిపించింది.

డాక్టర్లంతా ఆలోచించి మందుల లిష్టు తయారుచేసి, డాక్టర్ల

హుందాతనంతో ఆ లిష్టును అమ్మకు అందించి పుచ్చుకోమన్నారు. కానీ వాటితో ఏమీ గుణం కనిపించకపోవటంతో డాక్టరుగారు అమ్మకు ఫ్లాజిల్ అనే మాత్రలు ఇచ్చి ముఖ్యంగా చిగుళ్ళువాపులు తగ్గటానికి-దీనితోనే నీ సర్వజబ్బులు తగ్గాలని ప్రార్థిస్తున్నాను అన్నారు. ఆశ్చర్యంగా ఆ మాత్రలు వాడినన్నాళ్ళు అంతరించాయి. మూత్రంలో షుగర్ కూడా లేదు. మధుమేహవ్యాధికి మందు కనిపెట్టానని డాక్టరుగారికి గర్వమతిశయించి అనేక మందికి ఫ్లాజిల్ ఇచ్చారు. కానీ గుణం శూన్యం, ప్రార్థనలతో, మన ఆర్తి ఆవేదనలతో తగ్గే జబ్బులే కాని, మాత్రలతో, మందులతో తగ్గే జబ్బులు కావు కనుక అమ్మ అసాధారణ రోగియే.

డాక్టరుగారు అమ్మ దగ్గరికి వెళ్ళినప్పుడు అమ్మ భరించరాని తలనొప్పితో బాధపడుతోంది. ఒక చెంబులో నిప్పులు పోయించి కాపు కాయించుకుంటూ "ఇన్ని మాత్రలు ఇచ్చారు కానీ బాధతగ్గలేదు" అన్నది. ఆయన అమ్మకు పాదనమస్కారం చేసుకుని బాధ తగ్గటానికి మార్గం చెప్పమని వేడుకున్నారు.

"నీ ఆవేదనతో నా బాధపోతుంది నాన్నా! అన్నది అమ్మ. ఏం చేయాలో పాలుపోక గది బయటకు వచ్చారు. ఆవేదనతో కళ్ళనీళ్ళు కారాయి, హైమాలయంలో ఆవిధంగా ఒక అరగంట కాలం అదుపు చేయలేని ఆవేదన అనుభవించారు. పైకి వెళ్ళి చూస్తే అమ్మ చాలా ఉత్సాహంగా పూజలందుకుంటున్నది.

ఇదే విధంగా అమ్మ చిత్తూరుజిల్లా పర్యటన సందర్భంలో బాధపడుతోంది. "మందులు వేసుకుంటున్నా తగ్గటంలేదు నాన్నా! అన్నది అమ్మ, దానికి డాక్టరుగారు ఇంకో మందు ఇస్తానని దగ్గు మందు తీసుకు వచ్చారు". "దానిలో నల్లమందు కలిస్తే నాకు వద్దునాన్నా!" అన్నది అమ్మ. అది విన్న డాక్టరుగారు షాకు అయ్యారు, ఎందుకంటే ఆ సిరప్‌లో కొద్దిమోతాదు నల్లమందు వుంటుంది. అమ్మకు తగ్గాలంటే ఆవేదనే కదా! కావలసిందని రాత్రి తెల్లవార్లూ ఆవేదన, కళ్ళనీళ్ళతో దిండు తడిసిపోయింది. తెల్లవారే సరికి అమ్మకు దగ్గు, ఆయాసం, జ్వరం తగ్గాయి. అందరూ డాక్టరుగారి మందులు పనిచేసాయని అనుకున్నారు. కానీ డాక్టరుగారి ఆవేదన అనే నివేదనతో అమ్మే ఆరోగ్యాన్ని కుదుటబరుచుకుంది. గుంటూరులో

డా॥ లక్ష్మణరావుగారు రోజుకు 160 యూనిట్లు ఇన్సులిన్ ఇచ్చినప్పుడు (ఆహారం ఏమీ లేకుండా) అమ్మ డయాబిటిక్ కడిషన్‌లో ఏమీ మార్పురాలేదు. భోజనం చేయకపోతే ప్రమాదం కొద్దిగానైనా ఆహారం స్వీకరించమని సలహా ఇచ్చారు.

శ్రీనాన్నగారు "మనం చొక్కాని వంకెకు తగిలించినట్లు ఆ బాధల్ని, జబ్బుల్ని తీసి వంకెకు తగిలిస్తుంది మీ అమ్మగారు" అని అంటారు. ఒక మాటు అమ్మకు గడ్డ ఏర్పడితే అమ్మా తగ్గించుకోమ్మా! అని ప్రార్థిస్తే "గడ్డా బిడ్డే" అని తెలియచేసింది. జగన్మాతవు నీకే జబ్బులేమిటమ్మా అంటే అవి మాత్రం ఎక్కడకు పోతాయి వాటికి ఆధారం కావాలిగా" అన్నది అమ్మ.

అమ్మ డాక్టరుగా డాక్టరుగారికి ఇచ్చిన సలహాలు అమ్మ అనుజ్ఞలు.

1) "నీ వద్దకు వచ్చే రోగులు బాధతో వస్తారు. వారికి ప్రేమతో, ఆదరణతో ట్రిట్‌మెంట్ ఇవ్వు. నీ మందులు ఎంత ముఖ్యమో, నీవు చూపే ప్రేమాదరణలు అంతే ముఖ్యం.

2) నీకు జబ్బు అర్థం కాకపోయినా, ట్రీట్‌మెంట్ నీకు సాధ్యం కాకపోయినా నీ కంటే పెద్దడాక్టరు దగ్గరకు రోగినిపంపించు.

3) డబ్బు కోసం, కీర్తి కోసం రోగులను పీడించకు ప్రేమతో, సిన్సియర్‌గా వైద్యం చేస్తే కీర్తి, డబ్బు వెతుక్కుంటూ అవే నీ వద్దకు వస్తాయి."

అమ్మ సంకల్పం తిరుగులేనిది. తన బిడ్డలను పనిముట్లుగా వాడుకొని కార్యసాధన జరిపిస్తుంది. అమ్మ స్వర్ణోత్సవాల ముందర ఇంజనీరు తాతగారైన సీతారామయ్య గారికి జిల్లెళ్ళమూడిలో బ్రహ్మాండమైన పందిళ్ళు, లక్షల జనం భోజనాలు చేస్తున్నట్లు కల వచ్చింది. ఆ విషయం అమ్మతో చెప్తే ప్లాను వేసి పనులు మొదలు పెట్టి ఒకే పంక్తిలో లక్షమందికి భోజనాలు ఏర్పాట్లు చేయమంది. అది సంభవమని ఎవరికీ తోచలేదు. కానీ ఆస్వర్ణోత్సవాలు ఎంత కన్నుల పండువుగా జరిగాయో, లక్షాముప్పై వేలమంది ఒకే పంక్తిలో ఒకేసారి భోజనాలు చేయటం కళ్ళారాచూసాం. ఇటు జనములు, అటు జనములు, ఎటు చూచాన యోజనములు జన గుణముల భోజనములు, జననికి నీరాజనములుగా జరిగాయి. ఇది అపూర్వం అనూహ్యం పూర్వం ఎన్నడూ జరగనిది.

అమ్మ చెప్పిన సలహాలను తూచాతప్పకుండా ఆచరిస్తూ అందరికీ ఆదర్శప్రాయులైనారు డాక్టర్ సుబ్బారావుగారు. డా॥ ఇనజకుమారి రెండు సం॥లు ఆయన దగ్గర ఎప్రంటిస్‌గా పనిచేసింది. డాక్టరుగారు నిస్వార్థంగా రోగులను చూచే విధానం, వారిని సేద తీర్చే తీరు తప్పక అనుసరణీయమని ఇనజ భావన. ఎప్పుడు ఎవర్ని అవసరమనుకుంటారో వారిని ఏరుకోవటం, వారికి ఉజ్వల భవిష్యత్‌ను ఒసగటం అమ్మ అవతార ప్రత్యేకత.

రైల్వేఉద్యోగి అన్నంరాజు రామకృష్ణ తరువాత కాంట్రాక్టు చేసేవాడు. అన్నయ్య ఒకసారి శ్రీశైలం వెళ్ళాడు అక్కడ కాషాయం కట్టుకుని జటలతో ఉన్న పూర్ణానంద స్వామీజీ, షిర్డిబాబా భక్తులు రమణబాబా తారసిల్లారు. వారిని తన గదిలో ఉండమని అన్నయ్య కోరాడు. పూర్ణానందస్వామి ధ్యానంలో కూర్చుంటే అన్నయ్యకు సాక్షాత్తు శివుని లాగా అనిపించింది.

రెండురోజుల తరువాత స్వామీజీ "నీకు మంత్రం ఉపదేశిస్తాను" అన్నారు. దానికి అన్నయ్య "అసలు మంత్రం అంటే ఏమిటి? ఇది చేయటం వలన ప్రయోజనం ఏమిటి? వీటిపైన నాకు నమ్మకం లేదు" అన్నాడు. దానికి స్వామిజీ "ఏదైనా మననంతో మంత్రం అవుతుంది. బాహ్య పరిస్థితులతో పనిలేకుండా నీలో ఎనలేని శాంతి, స్థిరత్వం, ఆనందం కలుగుతుంది. ఈ మంత్రం లక్ష చేసేటప్పటికి నువ్వు భగవంతుడిని చూస్తావు. మాట్లాడతావు, ఆడతావు, అన్నం తింటావు" అని చెప్పారు.

స్వామీజీ ఒక కుండను తీసుకురమ్మన్నారు. ఆ సమయానికి అది లభ్యమవ్వనందున బాత్‌రూపంలో వాడే చెంబునే తీసుకొని అన్నయ్య నెత్తిన బీజాక్షరాలు చదువుతూ స్నానం చేయించారు. ఆ చెంబుడు నీళ్ళే ఎన్నో బిందెల నీళ్ళు మాదిరిగా గది అంతా పడ్డాయి. అన్నయ్యకు ఉరుకుతున్న జలపాతం దగ్గర స్నానం చేయించిన అనుభూతి కలిగింది. ఆ చెంబునే కలశంగా వాడి అన్నయ్యకు మంత్రోపదేశం చేసి నాలుక మీద బీజాక్షరాలు రాశారు. స్వామీజీ మంత్రోపదేశం ఒక మరువపురాని మహత్తర సన్నివేశమని అన్నయ్య ఆనందపారవస్యంతో తెలియచేశాడు.

అన్నయ్య "మీరు నాకు మంత్రం ఉపదేశిస్తే నిష్ఠ అవసరం కదా! నేను సిగరెట్లు తాగుతాను. ఇంకా అనేక అలవాట్లు ఉన్నాయి" అన్నాడు. అప్పుడు స్వామీజీ "నీ గురువుగా నీ పాపం, మంచి చెడు, సర్వం నేను భరిస్తాను. నీవు నిశ్చింతగా మంత్రం జపం చెయ్యమన్నారు. కారేపల్లి వెళ్ళాక మంత్రానుష్ఠానం నిష్ఠగా ఆచరించాడు. మొదలు పెట్టిన తరువాత ఎంత సేపైనా అలా చేస్తుండేవాడు.

నండూరులోని సాయిబాబా ఆలయాన్ని దర్శించి జిల్లెళ్ళమూడిలో ఉన్న చెల్లెలు సరోజిని చూడటానికి వచ్చినప్పుడు మొట్టమొదటిసారిగా అమ్మను దర్శించటం జరిగింది. ఆ మర్నాడు వారి తల్లి మాసికం అమ్మ అక్కడే పెట్టుకోమంది. అమ్మ చూస్తే జబ్బుతో నీరసంగా ఉంది. ఇష్టం లేకపోయినా అమ్మ మాట కాదనలేక సరే అన్నాడు. హైమాలయంలోకి వెళ్ళి కూర్చుని "ఇక్కడ చింతకాయ పచ్చడి, చారు పెడతారు. మా ఊళ్ళో అయితే బాగా దండిగా తినగలిగిన బ్రాహ్మణులకు గారెలు, బూరెలు, పప్పుకూరలు, పచ్చళ్ళు పెరుగు నేతితో పుష్టిగా భోజనం పెడతాము. ఇక్కడ అమ్మ పాదాలు కూడా తాకనివ్వరు. పూజకు పువ్వులు, దండలు ఏమీ ఉండవని" మనసులో అనుకున్నాడు.

మర్నాడు అన్నయ్య అమ్మ దర్శనానికి వెళ్ళేటప్పటికి ఊహించలేని విధంగా ఉంది. ఆశ్చర్యం! ముందు రోజు మనసులో అనుకున్న వాటినన్నింటినీ సమాధానం వచ్చింది. క్రితం రోజు చూచిన అమ్మకు ఇప్పుడు చూస్తున్న అమ్మకు పోలికే లేదు. దేదీప్యమానంగా ఉజ్జ్వల కాంతిపుంజాలతో మెరిసి పోతూ అమ్మ సాక్షాత్తు రాజరాజేశ్వరియై భాసించింది.

పూజకు పువ్వులు, దండలు సిద్ధంగా ఉన్నాయి. పళ్ళెం నిండా 20 రకాల పదార్థాలతో, పెద్ద పళ్ళెం నిండా అన్నంతో సమృద్ధిగా పెరుగు, నెయ్యిలతో అమ్మకు నివేదన వచ్చింది. అమ్మ అన్నయ్యను "ఏరా నాన్నా! అంటూ దగ్గరకు పిలిచి తన పాదాలను అన్నయ్య ఒడిలో ఉంచింది" నిన్న తను అనుకున్న వాటన్నింటికీ ఈ రోజు విరుద్ధంగా జరిగింది. అన్నయ్యకు ఎనలేని సంతృప్తి కలిగింది. అన్నయ్య

చేత అమ్మ పాదాలకు, చేతులకు, మెడకు గంధం రాయించుకుంది. పళ్ళెంలో అన్ని పదార్థాలను కలిపి ముగ్గురు దిట్టంగా తినేవారి కంటే ఆ రోజు ఎక్కువ తిన్నది. తరువాత సమృద్ధిగా అందరికీ ప్రసాదం పంచింది. తాను ఏమీ చెప్పకుండానే అన్నీ అమర్చిన అమ్మ అనురాగానికి ముగ్ధుడయ్యాడు.

దేవాలయాలే లేని కారేపల్లిలో దేవాలయాలు కట్టించాడు. తాను కట్టించిన వైష్ణవాలయం ముందు కూర్చుని "సర్వ ధర్మాలు పరిత్యజించితే నీ యోగ క్షేమాలను నేనే చూస్తానని అన్నావు. అన్నీ వదిలేసి కూర్చుంటాను. నా బాధ్యతన్నీ నీవు చూస్తావా" అని భగవంతుడిని నిలదీసి ఇంటికి వచ్చాడు. ఆయనకు ఆశ్చర్యం, ఆనందం కలిగే విధంగా "అమ్మ" వచ్చింది, కుర్చీవేయండి అంటూ కుర్చీవేసి అమ్మను కూర్చోబెట్టి పాదాలు కడిగి నీళ్ళు శిరస్సుపై చల్లుకున్నాడు. అమ్మ అదృశ్యమయింది. ఆయన ఇంత చేస్తున్నా ఇంట్లో వాళ్ళకు కనిపించలేదు. కొంతకాలం తరువాత "అమ్మ అర్జెంటుగా రమ్మన్నది" అని ఆయన బావగారు కొమరువోలు గోపాలరావు గారు టెలిగ్రాం పంపారు.

స్వామీజీ చెప్పిన జపం 80 వేలు అయ్యేటప్పటికి అమ్మవద్ద నుండి రమ్మని టెలిగ్రాం వచ్చింది. అమ్మ దర్శనానికి వెళ్ళగానే "ఏం చేస్తున్నావు నాన్నా" అంది "మంత్రజపం చేస్తున్నాను" అన్నాడు అన్నయ్య. "ఇంక ఆపేయ్" అన్నది అమ్మ. ఏటి సూతకం అని వద్దంటున్నావా? అని అడిగాడు. ఇక్కడ అటువంటి పట్టింపులేవు. హైమాలయంలో చేసుకో అంది" అమ్మ. వసుంధరక్కయ్యతో అన్నం తెప్పించి తానే ముద్దలు కలిపి పెట్టింది. అన్నయ్యతో అమ్మ "నువ్వు ఇక్కడకురా నాన్నా" హాయిగా ఉండొచ్చు" అన్నది. అందుకు అన్నయ్య "ఎలాగమ్మా! ఆడపిల్ల పెళ్ళి మగపిల్లల చదువులు చాలా బాధ్యతలు ఉన్నాయిగా" అన్నాడు. "నీకెందుకు నాన్నా! అవన్నీ నేను చూసుకుంటాను. ఇక్కడ ఉండు" అన్నది అమ్మ. అన్నయ్యతో కేరంబోర్డు ఆడింది. చెయ్యి పట్టుకు నడిచింది, అన్నయ్య ఒళ్ళో కాళ్ళు పెట్టింది. అపుడు అన్నయ్యకు శ్రీ శైలంలో స్వామిజీ చెప్పిన సంగతి స్ఫురణకు వచ్చింది.

ఉపదేశమైనమంత్రాన్ని మామూలుగా అయితే అక్షరలక్షలు చేయాలంటారు. కానీ సాక్షాత్తు శివస్వరూపమే అయిన స్వామీజీ ఉపదేశించటంతో 80 వేలు చేసేటప్పటికే రాజరాజేశ్వరి అయిన అమ్మ ఒడిలో బిడ్డమాదిరిగా సంచరించగలిగాడు.

స్వామీజీ చెప్పిన దేవుడు అమ్మే అని అనుకుంటుండగానే అమ్మ "కాషాయి వస్త్రాలు కట్టుకుని, జటాధారిగా ఉంటాడు ఆయనే కదా నీకు ఉపదేశం చేసాడు" అని అడిగింది. ఏమీ చెప్పకుండానే అమ్మ అడగటంతో అన్నయ్య ఆశ్చర్యపోయాడు. మళ్ళీ అమ్మ "నేనే భువనేశ్వరిని, ప్రతి అణువూ నేనే, నీ సర్వ బాధ్యతలూ నాకు వదిలేసి నిశ్చింతగా ఉండు, నీ యోగక్షేమాలు నేను చూసుకుంటాను. నీవు హైమాలయంలో జపం చేసుకో, లేకపోతే నీవు కాంట్రాక్టర్‌వి కనుక ఏడవమైలు రాయి దగ్గర నుండి రోడ్డు వెయ్యి అదీ నా ఆరాధనే" అన్నది. ఈ అనుభవంతో అన్నయ్య జిల్లెళ్ళమూడిలో నివాస మేర్పరచుకున్నాడు.

అన్నంరాజు రామకష్ణన్నయ్య వాళ్ళ నాన్నగారి అబ్దికంకు పినతండ్రి అయిన అన్నంరాజు మాధవరావు గారిని పిలిచారు. బ్రహ్మలు లేరు, మంత్రం లేదు అని అసంతృప్తితో అమ్మ సన్నిధిలో కూర్చున్నారు ఆయన. సరిగ్గా నివేదనలో అమ్మ "ఏరా, గారెలలోకి ఆవపచ్చడి చేయలేదా?" అని అడిగింది. వారి అన్నగారికి ఆవపచ్చడి చాలా ఇష్టం. దానితో ఆశ్చర్య పోవటం మాధవరావుగారి వంతు అయింది. ఎందుకంటే ఆ అడిగే తీరు, గొంతు అంతా వారి అన్నగారిని పోలి ఉండటంతో తన మనసులో ఉన్న శంక తొలిగి ఆయన అమ్మకు సర్వసమర్పణ గావించుకున్నారు.

అన్నయ్య గుంటూరు వెళ్ళి, అనుకోకుండా శ్రీశైలం వెళ్ళి స్వామీజీకి ఈ విషయాలు చెప్పాలని వెళ్ళారు. స్వామీజీ హటకేశ్వరంలో పంచాగ్నుల మధ్య తపస్సు చేస్తున్నారని తెలిసి దర్శించటానికి వెళ్ళారు. స్వామీజీకి అమ్మను గురించి చెప్పి తాను తీసుకు వెళ్ళిన ఇంగ్లీషు మేగజైన్‌కు అమ్మ వాక్యాలు సేకరించి వ్రాసినవి చూపించాడు. ఆ కాగితంలో "సర్వకాల సర్వావస్థల యందు సమాన స్థితే సమాధి

స్థితి" అన్న సూక్తిని చదివి పరవశులై "Certainly she is none other than Bhuvaneswari, we must see her" అని అమ్మను దర్శించటానికి అన్నయ్యతో జిల్లెళ్ళమూడి వచ్చారు. రెండు గంటలకు పైగా అమ్మ, స్వామీజీ మౌనంగా కూర్చుని భావాలు మార్చుకున్నారు. కిందకు వచ్చిన తరువాత అన్నయ్య స్వామీజీని "అమ్మ గురించి మీ ఉద్దేశమేమిటి?" అని అడిగాడు. స్వామీజీ "సంపూర్ణత్వం అంటే అమ్మే. అమ్మ అంటే సంపూర్ణత్వమే" అన్నారు.

"అమ్మ అంటే సంపూర్ణత్వం. అమ్మ అంటే అవతారం కాదని అమ్మ ఏనాడో చాటి చెప్పింది" అది ఈనాడు ఋజువైంది. స్వామీజీ ఎప్పుడూ శివోహం అనేవారు. ఒకమారు అమ్మ దగ్గర అన్నయ్య, స్వామీజీ కూర్చున్నారు. అమ్మ స్వామీజీ నోట్లో అన్నం పెట్టింది. వారికి అమ్మ ఎట్టి మహత్తర అనుభూతి ఇచ్చిందో "The endless Siva atlast found his mother" అని ఆనందపరవశులయ్యారు. తనకు మంత్రోపదేశం చేసిన స్వామీజీ ఈ విధంగా అమ్మ గురించి చెప్పడంతో అన్నయ్యకు అమ్మయందు అచంచల విశ్వాసం ఏర్పడింది.

అన్నయ్య స్నేహితులు దుర్గాప్రసాదరావు గారు అన్నయ్యతో "తెనాలి వాడివి కారేపల్లిలో దేవాలయాలు కట్టించావు. అవన్నీ వదులుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళటం చాలా ఆశ్చర్యంగా ఉందనేవారు" ఆయన అన్నయ్యకు ఉత్తరం రాస్తు అందులో అమ్మ మీద రెండు సీస పద్యాలు రాశారు. తనకు కాలు విరిగిందని అమ్మ కుంకుమ పంపించమని రాశారు. అన్నయ్య ఆ పద్యాలను అమ్మ దగ్గర చదివాడు. ఉత్తరంలో కింద ఉన్న వాక్యాలను కూడా చదవమంది అమ్మ. "నీకు ఎప్పుడు ఏమి అవసరమైనా ఈ మిత్రుడున్నాడని మరువకు" అని అన్నయ్యకు దుర్గాప్రసాదరావు గారు రాశారు.

జిల్లెళ్ళమూడి రోడ్డు కాంట్రాక్టులో 30,40 వేలు నష్టం వచ్చేటట్టుంది. లారీ బాడుగకే చాలా డబ్బువుతోందని అన్నయ్య అమ్మతో "ఎవరిచేతనైన లారీ కొనిపించమ్మా" అని వేడుకున్నాడు. దానికి అమ్మ నువ్వే కొనుక్కో నాన్నా"

అంది. "వద్దమ్మా ! ఇది వరకు లారీ కొని చేతులు కాల్చుకున్నాను. దానితో ఇంకెప్పుడూ లారీ కొనకూడదని నిశ్చయించుకున్నాను" అని అమ్మతో చెప్పాడు. దానికి అమ్మ "కాదు నాన్నా నీవు లారీ కొనుక్కోవాలి" అంది. సరే 20 వేలు ఇవ్వు లారీ కొంటాను అని అమ్మతో అన్నాడు. అందుకు అమ్మ దుర్గా ప్రసాదరావు "నీకు అవసరమయినప్పుడు నేను ఉన్నానని మర్చిపోవద్దని రాశాడు కదా! ఉత్తరం రాసి చూడు" అంది. ఈలోగా దుర్గాప్రసాదరావు గారు, జానకీ దేవి జిల్లెళ్ళమూడి వచ్చారు. లారీ సంగతి చెప్పగానే నోటు కూడా రాయించుకోకుండా పదమూడు వేలు పంపించారు. రామకృష్ణన్నయ్య బాబాయి మాధవరావుగారు ఏడువేల రూపాయలు ఇచ్చారు. సీతారామారావు అనే స్నేహితుడు మదిరలో కనిపించి తనవద్ద ఉన్న రెండు వేలు ఇచ్చాడు. డబ్బు సమకూరిందని అన్నయ్య అమ్మకు ఫోన్ చేశాడు. దానికి అమ్మ "నీ సంకల్పం గొప్పది నాన్నా!" అన్నది. కర్తృత్వం తన మీద వుంచుకోదుకదా!

భగవంతుడు మనచేత పనిచేయించుకోవడమంటే తానే మనకు తోవ చూపించి తన కర్తృత్వం బయటపడనీయకుండా చేయిస్తాడన్నది అన్నయ్య విషయంలో ఋజువైంది. తరువాత ఆ లారీతో పాటూ ఇంకో లారీ, జిల్లెళ్ళమూడికి వ్యాన్ కొని, కొన్నాళ్ళు సర్వీసు చేశాడు. బాపట్లలో లారీలు తిప్పుతున్నప్పుడు అక్కడ ఒకరూమ్ తీసుకుని ఉండేవాడు. పని ఒత్తిడిలో బాగా అలసి హోటల్‌కు వెళ్ళి భోంచేసే ఓపిక లేకపోయింది.

"ఎక్కడ ఉన్నా నా ధ్యాస మీ మీదే" అన్న అమ్మ మాట తలుచుకుని చూద్దాం అన్నం ఎలా పెడుతుంది అని పడుకున్నాడు అన్నయ్య. పడుకున్న కొద్ది సేపటికే పెదనందిపాడు సరుకుతో వెళ్ళిన డ్రైవరు తిరిగి వచ్చి అన్నయ్యను లేపి "అయ్యగారు అన్నం తిన్నారా? లేదా? అంటూ నా దగ్గర చపాతీలు, కూర ఉన్నాయని బలవంతం చేసి అన్నయ్యకు పెట్టాడు." "నీవు తెచ్చుకున్నది నాకు ఎందుకు పెట్టావు అంటూ అన్నయ్య నిలదీసాడు.

"నేను బాపట్ల వస్తూ మీ కోసం జిల్లెళ్ళమూడి వెళ్ళాను. నే వెళ్ళగానే

అమ్మ పైకి పిలిచింది చపాతీలు, కూర చేయించింది. నేను పంపించానని చెప్పకుండా మీకు పెట్టమని" అమ్మ ఆదేశించారు. ఈ విషయం విన్న అన్నయ్యకు ముప్పిరిగొన్న ఆనందంతో కళ్ళు చెమర్చాయి.

శ్రీ నాన్నగారికి స్వామీజీ అంటే ఎనలేని ఆపేక్ష. స్వామీజీని దర్శించటానికి రామకృష్ణన్నయ్యతో శ్రీశైలంలోని స్వామీజీ ఆశ్రమానికి వెళ్ళారు. నాన్నగారిని చూచి స్వామీజీ వారి శిష్యులందరికీ పిలిచి అమ్మకు, నాన్నగారికి ఆభేదమని, అమ్మే నాన్నగారి రూపంలో వచ్చిందని తెలియచేసారు. వారందరి చేత నాన్నగారి పాదాలకు అభిషేకించి, అర్చన చేయించారు. నాన్నగారు ఎంత నిర్లిప్తంగా పట్టనట్లు వున్నా ఆయన గొప్పతనం పూవులోని తావివలే బహిర్గమౌతుండేది.

అన్నయ్యకు అభయమిచ్చినట్లుగానే అతని కూతురు శేషు పెళ్ళి అమ్మ తమ్ముడైన నరసింహారావు మామయ్యకిచ్చి వైభవంగా జరిపించింది. వాళ్ళు పిల్లా పాపలతో హాయిగా ఉన్నారు. ముగ్గురు మగ పిల్లలు వృద్ధిలోకి వచ్చారు. అమ్మ అభయమెసగినట్లుగా జీవిత నౌకను అమ్మ అదృశ్య హస్తంతో నడుపుతోంది. తాను కట్టించిన వైష్ణవాలయంలో అన్నయ్య అనుకున్న మాటలను అనగా "నాయోగ క్షేమాలను నీవు చూస్తావా అన్న దానికి ఏ దేముడ్ని కోరినా తనకే వర్తిస్తాయని సర్వ స్వరూపం తానేనని" అమ్మ తెలియజేసింది.

"సర్వదేవతా స్వరూపం అయిన అమ్మ దర్శనం అన్నయ్య ద్వారా నాకు జరగటం నా అదృష్టంగా భావిస్తాను. విశ్వవందిత అయిన అమ్మ అనురాగ జలధిలో మునకలువేసే అదృష్టాన్ని నాకు కలుగచేసాడు" అన్నయ్య.

స్వామీజీ అమీర్‌పేటలో వున్నారని తెలిసి ఆయన దర్శనం కొరకు తహతహలాడాను. రామకృష్ణన్నయ్య నన్ను స్వామీజీ దగ్గరకు తీసుకువెళ్ళారు. స్వామి వారు స్నానం చేస్తున్నారని, ఎవరికీ దర్శనం ఇవ్వరని, టైమ్ పడుతుందని చెప్పారు. "నేను డిస్ట్రిక్ట్‌గైడు సెక్రటరీని అవ్వటం వలన గవర్నర్‌తో జరిగే మీటింగ్‌కు 9 గం॥లకు హాజరవ్వాలి. ఎలాగైనా ఆయన దర్శనభాగ్యం కలిగించమని అమ్మను మనసారా ప్రార్థించాను. స్వామీజీని దర్శనం

చేసుకోవాలన్న తపన మర్రి వృక్షంలా నాలో పాతుకుపోయింది. ఎటూపాలుపోక అక్కడే ఉన్న ఒక అక్కయ్యతో "మాధవరావు గారి అమ్మాయి కుసుమ వచ్చిందని" చెప్పమని అర్థించాను. అంతమటుకు వీలు అవ్వదని చెప్పినా నా ఆర్తిని గమనించి సరే చెప్పి చూస్తానని" లోపలికి వెళ్ళింది.

ఆమె వెళ్ళి చెప్పగానే కుసుమ వచ్చిందా? ఆమె ఎవరో కాదు "నేను తపస్సు నుండి వచ్చి మొదటిసారిగా గృహస్థు ఇంట ఆతిధ్యం స్వీకరించిన మాధవరావు గారింట్లో 15 రోజులు బస చేసాను వారి అమ్మాయే కుసుమ అని తెలియచేసారు. నిన్ననే ఫోటోలు పాడైపోతున్నాయని రీటేక్ తీయించాము అని దర్శనానికి అనుమతినిచ్చారు." స్వామీజీ ఒంటి నిండా నూనె పట్టించుకొని కౌపీనధారియై వున్నారు. సాధారణంగా ఎవరికీ ఆ విధంగా దర్శనమివ్వరు. కాని అదృష్టవశాన్న స్వామీజీ "నాకు సమయం లేదని తెలుసుకొని ఆరకంగా దర్శనమివ్వటం నా పూర్వజన్మ సుకృతమే. నాకు స్వామీజీ దర్శనం భాగ్యం కలిగిందన్న ఆనందంతో మైమరపు కలిగింది. స్నానాలగదిలో నుండీ ఒంటి నిండా నూనె, నీరు కారుతూ ఆయన దర్శనమిచ్చారన్న భావన నాలో ఉద్విగ్నతను నింపింది.

మేము ఆ సంవత్సరం అమ్మ ఫోటో గ్రీటింగ్ కార్డు వేయించాము. ఆ కార్డును స్వామీజీకి ఇవ్వగానే ఉదయమే అమ్మ నా దగ్గరకు వచ్చిందని సంబరపడ్డారు. స్వామీజీ ఆదేశానుసారం మా అమ్మగారు నాకు "భువనేశ్వరీ మంత్రాన్ని ఉపదేశించారు. మంత్రానుష్ఠానం సరిగా జరగటం లేదని బాధపడ్తూ, బాగా జరిగేలా ఆశీర్వదించవలసినదిగా స్వామీజీని కోరుకున్నాను. నాతలమీద ఆయన చేయి వుంచి దీవించారు. ఆ రోజు నా ఆనందానికి అవధుల్లేవు. సాక్షాత్తు పరమశివుని స్పర్శను అనుభవించాను. జీవితంలో మరుపురాని, మరువలేని రోజు అది, స్వామీజీ హైదరాబాద్‌లో వున్న సమయంలో నేను అక్కడికి వెళ్ళగలగటం ఆయన దివ్యాశిస్సులు నాకు లభ్యమవటం కలలో కూడా వూహించని విషయం.

స్వామీజీ దీవించిన సంగతి మా ఇంటికి ప్రతి శుక్రవారం పూజకు వచ్చే కామేశ్వరమ్మగారితో చెపితే "నీవు ఎంతో అదృష్టవంతురాలివి. గురువు, శిష్యుని తలమీద చేయివుంచటాన్ని హస్తమస్తక సంయోగమంటారు. అది గొప్పయోగం" అని తెలియచేసారు. ఆమె మరిదిగారు స్వామీజీ శిష్యులైన గాయత్రీ బాబాగారు. ఆయన స్వామీజీ తపస్సు నుంచీ వచ్చిన వెంటనే తీసిన ఫోటోను కామేశ్వరమ్మగారికి ఇచ్చారు. దానిని ఆమె నాకు ఇచ్చింది.

స్వామీజీ విశాఖకు వేంచేసినప్పుడు మాగృహాన్ని పావనం చేసారు. ఆయనకు ఆ ఫోటో చూపిస్తే చాలా ఆశ్చర్యపోయారు. "ఈ ఫోటో నీ దగ్గరకు ఎలా వచ్చిందని" అడిగారు. అది స్వామీజీ ఆదేశానుసారమే నా దగ్గరకు వచ్చి నామనస్సును తృప్తి పరచింది. ఆయనతో ఒకపూట మా ఇంట్లో గడపగల్గటం మా అదృష్టంగా భావించాము. మా అమ్మాయి మాధవి ఆయన దర్శనం చేసుకుంది. అప్పుడు స్వామీజీ దానికి బొట్టుపెట్టి పెద్ద దండను, మరొక దండతో పాటు వేశారు. అమ్మ పోసినట్లుగా రెండు చేతులతో పూలను దాని తల మీద పోసారు. అమ్మ పెండ్లి కూతుర్ని చేసినప్పుడు ఆ విధంగా చేసేది. అమ్మ భౌతికంగా లేకపోయినా స్వామీజీ ద్వారా ఆవేడుకను జరిపించి నన్ను బ్రహ్మానందపరచింది.

మా పెద్ద అమ్మాయి అనూరాధ పెండ్లి, అబ్బాయి రాధాకృష్ణ ఒడుగు అమ్మ చేతుల మీదగానే జరిగాయి. చిన్న అమ్మాయికి తోడ పెళ్ళికూతురుని చేస్తూ దానికి కళ్యాణ తిలకం దిద్ది దీనికీ పెళ్ళి కళ వచ్చిందన్నది. అమ్మకు కట్టమని పంపిన తెల్లపట్టుచీరె అనుకోని విధంగా మళ్ళీ నాకు చేరింది. ముందు అది అమ్మకని ఇస్తే ఏమిటి ఇలా అయిందని బాధపడ్డాను. కానీ దాని అంతరార్థం తరువాత కానీ బోధపడలేదు. పెద్ద అమ్మాయి పెండ్లికి పెళ్ళికూతురు చీరె, మధుపర్కం చీర అమ్మే ఇచ్చింది. తాను అనేకమార్లు కట్టుకున్న తెల్లచీరె ఎర్రబార్డర్ చీరెను మా చిన్నమ్మాయి పెండ్లికి నాకు అందేట్లు చేసి నన్ను ఆనంద డోలికలలో వూగించింది అమ్మ.

రామకృష్ణన్నయ్యను మురళీఅన్నయ్య "అమ్మ అంటే ఇష్టమా? స్వామీజీ అంటే ఇష్టమా?" అని అడిగాడు. దానికి అన్నయ్య "ఇద్దరూ ఇష్టమే" అన్నాడు. స్వామీజీ దర్శనార్థం వెళ్ళినప్పుడు ఆ విషయాన్ని స్వామీజీకి అన్నయ్య నివేదించాడు. "అలా ఎందుకన్నావు. నాకు వాళ్ళు రెండుకళ్ళు" అని చెప్పాలి అన్నారు స్వామీజీ. ఆ జవాబుకు అన్నయ్య ఆనందభరితుడయ్యాడు.

స్వామీజీ, రామకృష్ణన్నయ్య అమ్మ దర్శనార్థం వెళ్ళారు. అప్పుడు అమ్మ స్నానానికి వెళ్ళింది. అమ్మ గదిలో ఉండే లాలా మహానుభావులైన స్వామీజీని నిరీక్షించమని చెప్పటానికి చాలా బాధపడ్డాడు. ఆ విషయాన్నే స్వామీజీకి చెప్పాడు. దానికి స్వామీజీ "జన్మజన్మాంతరాల అదృష్టఫలితంగా అమ్మ మనకాలంలో అవతరించింది. అటువంటి అమ్మను దర్శించటానికి ఈ మాత్రం నిరీక్షించలేనా?" అని అన్నారు. స్వామీజీ తపస్సిద్ధి పొందిన అనంతరం రామకృష్ణన్నయ్యతో మొట్టమొదటిసారిగా గృహస్థు ఇంటికి వచ్చారు. ఆయనతో గడిపిన మధురక్షణాలకు అంతేలేదు. ఆరోగ్యం సరిగా లేనందున డాక్టర్లకు చూపించుకోవటానికి హైదరాబాద్ వచ్చినప్పుడు అన్నయ్యా వాళ్ళింటికి వచ్చి వారంరోజులు తమతో గడపటం మహద్భాగ్యంగా భావించాడు.

ఆ తరువాత కొద్ది రోజులకే స్వామీజీ సిద్ధిపొందారు. మందిరం నిర్మించిన విశాఖపట్టణంలో అమ్మ మందిర నిర్మాణం జరిగింది. ఆశీర్వదిస్తున్న అమ్మపాలరాతి విగ్రహాని Ashok Pharmaceuticals, Chenni వారు విగ్రహం ఉత్తరాయణ పుణ్యకాలంలో పౌర్ణమి శుక్రవారం నాడు విశాఖ చేరింది.

స్వామీజీకి విగ్రహం వేంచేసిన విషయాన్ని నివేదించాము. దాని ప్రతిష్ఠ ఎలా చేయాలో మాకేమీ తెలియనందున దానికీ స్వామిజీనే సలహా అడిగాము. అ మందిరం అశోక్‌హౌస్‌లో నైఋతీమూల వచ్చింది. దానికి వేరే కాంపౌండ్ లేదు కాబట్టి జలవాసం ధాన్యావాసం అలాంటివి అవసరం లేదని వారి ఆర్తి ఆవేదనల ఫలితమే అమ్మ విశాఖ చేరింది. వారినే ప్రతిష్ఠ చేసుకోమని ఆదేశించారు. వారి ఆదేశప్రకారమే మార్చి 22న ప్రతిష్ఠ జరిగింది.

1970 సం॥ దసరాల్లో ప్రతి సం॥ కంటే అతి వైభవంగా జరిగాయి. ఆ ఉత్సవాలలో అష్టమి నాటిరేయి జరిగిన పూజ పతాకస్థానందుకుంది. ఆనాడు అమ్మ రక్తవర్ణ దూకులధారిణియై కిరీట సంశోభితయైత్రిశూల చక్రహస్తయై ప్రసాదించిన దర్శనం అపూర్వము, నిరుపమానమూ అయింది. ఆ రాత్రి శ్రీస్వామి పూర్ణానంద సశిష్యులై అమ్మను అర్చించుకున్నారు.

రత్నఖచితమయిన కిరీటం అమ్మ శిరస్సునందు, కరములందు త్రిశూలచక్రముతో అమ్మ దర్శనం ఆహ్లాదకరమే కాదు. దుర్నిరీక్షమూ అయింది. క్షణంలో అమ్మ రూపంలోనే పరిణామం గోచరించింది. నయనద్వయంలో మధ్యాహ్నమార్తాండుని దీప్తి వ్యాప్తమయింది. వదన మండలంలో గులాబీ గుత్తులు విరిశాయి. కరయుగళిలోని త్రిశూలమూ, చక్రమూ వివిధ రీతుల తాండవం చేశాయి. పరివేష్టిత ప్రజా సందోహం భయభ్రాంత చకితమైంది. స్వామీజీ చేత అర్చింపబడిన కలశాన్ని త్రిశూలపు మొనతో అమ్మ చివాలున పైకి ఎత్తింది. ఆ కలశం జలప్రపూర్ణమై ఉన్నా, ఆ కలశాన్ని తలక్రిందులుగా పైకి ఎత్తినా అందులోని ఒక నీటి బిందువూ క్రింద పడకపోవటం ఆత్యాశ్చర్యకరమయినా అప్పటి అమ్మమూర్తీ అమ్మ చేతిలోని త్రిశూలమూ, ఆ త్రిశూలపు చివరన ఊగే కపాలాన్ని పోలిన కలశమును అవలోకించిన ప్రజలు భయకంపితులవుతుండగా అమ్మ ఒక్క మెరుపు మెరిసినట్లు లేచి నిలుచుంది.

సామాన్యంగా వామనమూర్తి వలే పరిఢవిల్లే అమ్మ ఆ క్షణంలో గగన పరిచుంబితగా ప్రవృద్ధమైందా అనిపించింది. అంతదాకా దుర్గవలే దుర్నిరీక్ష అయిన అమ్మ వైకుంఠపురీ నివాసుడైన సాక్షాత్ శ్రీమన్నారాయుణునివలె ప్రత్యక్షమయింది. ఆమూహూర్తంలో ఆ పందిరిలో ఆనందమో, ఆశ్చర్యమో, భయమో ఆ మూడు ముప్పిరిగొన్న భావమో ప్రజలు స్థాణువులే అయ్యారు.

ఆ ఉత్సవాల గురించి, అప్పటి అమ్మ రూపవైభవం గుర్తుకువచ్చి అమ్మలోని మానవతా మాధవత్వాల పసిడి సారధిని స్మరిస్తూ అమ్మతో మాట్లాడుతుండగా శ్రీస్వామీ పూర్ణానంద గదిలోకి వచ్చి ఆశీనులయ్యారు.

వెంటనే దుర్గాప్రసాదరావు గారు అమ్మను గురించిన వారి అభిప్రాయాన్ని ఆర్థించారు. 'అమ్మ' అనటంలోనే "సర్వదేవతలకూ ఆదారమయినదన్న భావం ఉన్నది కదా!" అన్నారు స్వామీజి. "Please Clear whether Amma is Mother or Father" అని అడిగారు ప్రసాదరావుగారు. వెంటనే స్వామిజీ "Mother of Father" అన్నారు. ఆ సమాధానం అక్కడున్న వారందన్నీ సమ్మోహితులను చేసింది. కానీ దుర్గాప్రసాదరావు గారు Father of Mother కూడానా? అని అడిగారు. No Mother of all Mother means origin of every thing అన్నారు స్వామీజీ.

అన్నింటికీ అంతకూ ఆధారభూతమయిన పరబ్రహ్మ అయివుండీ అమ్మ అనే మేలిముసుగు ఎందుకో? మనలను మయామోహితులను చేసేందుకా? "నీవు దైవానివని పరోక్షంగానూ, అపరోక్షంగానూ విశదపరుస్తూ యింకా ఈ అమ్మ "అనే తెర ఎందుకమ్మా!" మనం నిర్భయంగా ఆ ఒడిలో చేరటానికేమో. అమ్మ దైవంగానే కనిపిస్తే మనం దరిచేరగలమా? దైవం అమ్మగా కనిపిస్తున్నాడు కనుకనే మన ఈ ఆటలు, పాటలు అన్నారు ప్రసాదరావుగారు. నిర్ధారణ కోసం అమ్మ వంక చూచారు. సమాధానంగా అమ్మ కన్నుల్లో పెదవులపై దరహాసాలతో కూడిన వాత్సల్య జ్యోత్స్న్యల్య వెల్లివిరుస్తూ కనిపించేవి.

గుంటూరు హిందూ కాలేజీ ఆవరణలో అమ్మ దర్శనం ఏర్పాటు చేయబడింది. నిర్వాహకులు భద్రత కోసం పోలీసువారి సహాయం కోరారు. ఒక ఆధ్యాత్మిక వ్యక్తిని అదీ ఒక స్త్రీని చూడటానికి ఎంత మంది వస్తారులే అని ఇద్దరు, ముగ్గురు పోలీసులను పంపించారు. అమ్మ దర్శన సమయం దగ్గరపడేటప్పటికి కాలేజీ ఆవరణ అంతా నిండిపోయింది. ఎదురుగా ఉన్న రోడ్లపై, చెట్లపై, ఇతర భవనాలపై చివరకు విద్యుత్ స్తంభాలపై అమ్మను చూడాలనే తీవ్రమైన ఆసక్తితో కూర్చున్నారు. భద్రత కోసం వచ్చిన పోలీసు వారికి ఏమీ తోచలేదు. వెంటనే వారి ఆఫీసరుకు కబురు చేశారు. ఆయన వచ్చి జనాన్ని చూసి ఆశ్చర్యచకితులయ్యారు. ఒక ఆధ్యాత్మిక స్త్రీని చూడటానికి ఇంతమంది జనమా? ఏమిటి ఆమెలోని ఈ అత్యద్భుత ఆకర్షణ?

ఆ రోజు ఆయనకు అతి కష్టంపై అమ్మ దర్శనమయింది. ఆయన భార్య ఆ జనాన్ని చూసి భయపడి ఇంటికి వెళ్ళారు. ఆ పోలీసు ఆఫీసరే శ్రీ మరకాని సత్యనారాయణ గారు డిప్యూటి సూపరిండెంట్ ఆఫ్ పోలీస్. పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఎంతో సమర్ధంగా ఉద్యోగం చేసి అందరి ప్రశంసలకు పాత్రలయ్యారు. నిజాయితీకి, ధైర్యనికి మారుపేరుగా నిలిచిన వ్యక్తి. తరువాత ఆ దంపతులు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మను దర్శించి, మాట్లాడి, అమ్మ ప్రేమామృతాన్ని చవిచూసారు. ప్రథమ దర్శనంలోనే అమ్మపై అకుంఠితమైన విశ్వాసం ఏర్పడింది. అందుకనే ఆయన అమ్మ పాదాలే పట్టుకుని "నేను సిన్నర్‌నమ్మా! నన్ను దైవం కూడా క్షాళన చేయలేడు" అని అమితంగా దుఃఖించారు. అమ్మ తన చల్లని ఒడిలోనికి తీసుకుని ఆయనను అనేక విధాల ఓదార్చింది.

లలితాంబక్కయ్యకు తొలి ఏకాదశినాడు నల్లరాతి విగ్రహంలా దర్శనమిచ్చింది అమ్మ. ముందు విష్ణుమూర్తిలా అనిపించినా తరువాత గోవు రావటంతో కృష్ణుడని అనుకుంది. లలితాంబక్కయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అమ్మ "లలితాంబ వాళ్ళింట్లో మామిడి చెట్టు క్రింద చాలా చల్లగా వుంటుందని" అన్నది. దానికి అక్కయ్య చాలా ఆశ్చర్యపోయింది. "అమ్మ తణుకులో మా ఇంటికి ఎప్పుడూ రాలేదు కదా! అని అనుకుంది. తీరా ఇంటికి వెళ్ళాక వాళ్ళ గదిలో గోడకు అమ్మ ఫోటో పెట్టివుంది. ఆ గది మీద మామిడి కొమ్మలు పూర్తిగా ఆక్రమించుకున్నాయి. దానితో అక్కయ్యకు అమ్మ అన్నమాటను అర్థం గోచరమైంది.

ఆయన కందుకూరులో ఉద్యోగం చేసే కాలంలో ఆయనకు ఒక విచిత్రమైన కల వచ్చింది. ఒక నేరస్థుడ్ని, ఆయన చిత్రహింస పెడుతున్నాడు. సరిగ్గా ఆ సమయంలో అమ్మ ఆ దారిన వచ్చి అక్కడున్న అందరినీ ఎంతో లాలనగా పలకరిస్తున్నది కానీ ఆయన వంక తలెత్తి అయినా చూడలేదు. అది ఆయనకు ఎంతో అవమానకరమైంది, బాధనూ కలిగించింది.

అది కేవలం కలే కానీ కల చెదిరిన తరువాత కూడా ఆయనకు ఆ బాధ

తొలగలేదు. వెంటనే తనను క్షమించమని అమ్మకు ఉత్తరం రాశారు. అదే ఆయన జీవితంలో ఒక ముఖ్యమైన పరిణామాన్ని తీసుకువచ్చింది. ఆ తరువాత ఆయన ఎప్పుడూ ఎటువంటి దోషిని కూడా హింసించలేదు. ఇతరులను ఏమాత్రం బాధించినా సహించని అమ్మ తనకు ఆ విధంగా పాఠం చెప్పిందని ఆయన నమ్మకం. ఉద్యోగవిరమణ చేసిన తరువాత జిల్లెళ్ళమూడిలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని ఆశించారు. కానీ అది జరగలేదు.

అమ్మను దర్శించిన ప్రతిసారీ "నాకు టిక్కెట్టిప్పించమ్మా" అని వేడుకోవటమే కాక అమ్మకు సన్నిహితులయిన వారితో " అమ్మకు చెప్పి నాకు టిక్కెట్టిప్పించమని" ప్రాధేయపడేవారు. కాల స్వరూపిణి అయిన అమ్మ ఆయన వేడుకోలును కరుణతో విన్నది. 60 సం॥లయినా నిండకుండానే జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించి విశాఖపట్టణంలో కన్నుమూసారు.

సత్యన్నారాయణ గారి మరణానంతరం అక్కయ్య జిల్లెళ్ళమూడిలోనే స్థిరనివాసం ఏర్పరచుకుంది. జిల్లెళ్ళమూడికి రావటానికి పూర్వం వారి రెండో అమ్మాయిని విశాఖపట్నం మెంటల్ హాస్పిటల్‌లో జాయిన్ చేశారు. టి.బి. వచ్చింది. ఎక్కువకాలం బ్రతకదని చెప్పారు. రమ చాలా బలహీనపడింది. అమ్మ దగ్గరకు తీసుకొచ్చిన కొద్ది రోజులకే టి.బి. తగ్గిపోయింది. మనిషి బాగా కోలుకుంది.

సాధారణంగా ఎక్కడైనా పిచ్చివాళ్ళను రెచ్చగొడతారు. కానీ జిల్లెళ్ళమూడిలో చిన్నపిల్లలతో సహా వారితో సమంగా చూసుకుంటూ వారికి పండో ఫలమో పెడతారు. ఇది చరిత్రలో ఎక్కడా జరిగినట్లు దాఖలాలు లేవు. మరి ఆ స్థల మహత్యమే! జిల్లెళ్ళమూడిలో అందరూ ఆమెను ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో చూస్తూ వారికి కలిగింది పెట్టేవారు.

రమ అన్నయ్య డాక్టర్ జస్వంత్ కుమార్ సైక్రియాటిస్ట్. ఎవరు ఏది పెడితే అది తినే అలవాటును మాన్పించాలని ఒకరోజు ఎవ్వరూ ఏమీ పెట్టకుండా మాడ్చమని చెప్పాడు. దాని ద్వారా ఆమెకున్న అలవాటును మాన్పాలని అతని ఉద్దేశ్యం.

అమ్మ ఎవరు అన్నం తినక పోయినా సహించలేదు. అందుకని "డాక్టరుగా వాడి వైద్యాన్ని వాడ్ని చేసుకోమను, అంతేకానీ ఆహారం పెట్టవద్దంటే ఎలాగ" అని కళ్ళనీళ్ళు జాలువారుతుండగా గద్గద కంఠంతో లలితాంబక్కయ్యతో అమ్మ చెప్పింది. జస్వంత్ అమ్మ దగ్గర ఉండగా రమ నోట్లో అన్నం ముద్దలు పెడుతూ ఒకతను కనిపించాడు. జస్వంత్ వెంటనే పరుగు పరుగున మేడదిగి వెళ్ళి అతని కోసం వెతికాడు. కానీ ఎవ్వరూ కనిపించలేదు. రమ మాత్రం మూతి తుడుచుకుంటోంది. "నీకు అన్నం ఎవరు పెట్టారు?" అని అడిగాడు. "ఒక అబ్బాయి" అన్నది రమ ఎవరు అన్నం తినకపోయినా సహించలేని అమ్మే ఆ రూపంలో వెళ్ళి రమకు అన్నం పెట్టివుంటుంది.

లలితాంబక్కయ్య మనమరాలు అనసూయకి అన్నప్రాసన జిల్లెళ్ళమూడిలో చేయించమని వాళ్ళవాళ్ళంతా అన్నారు. అప్పటికి లలితాంబక్కయ్య వైజాగ్‌లో వుండటంతో జిల్లెళ్ళమూడి వెళ్ళి చాలా నెలలు గడిచిపోయాయి. కానీ అక్కయ్య మాత్రం కావాలనుకుంటే అమ్మే అన్నప్రాసన చేస్తుందన్నది. ఆరోనెల ఆరోరోజు అమ్మ ఫోటోలో నుంచి పాయసం తీసుకువచ్చి అనసూయ నోటికి ముట్టించి లలితాంబక్కయ్య వెనకనుంచి నడిచి వెళ్ళిపోయింది. అమ్మ ఎవరి నమ్మకాన్నీ ఒమ్ముచేయదు కదా!

లలితాంబక్కయ్య చెల్లెలు డాక్టర్ ఇనజకుమారి, తన జీవితాన్ని అమ్మకే అంకితం చేసి తద్వారా ప్రజలకు సేవ చేయాలనుకున్న వ్యక్తి. ఇనజను నెల్లూరు డాక్టరు శిష్ట్లా సుబ్బారావు గారి దగ్గర కొన్ని రోజులుండి శిక్షణ తీసుకోమంది అమ్మ. ఇనజ నెల్లూరులో డాక్టర్‌గారి దగ్గర రెండు సం॥లు వున్నా అమ్మ ఏమీ మాట్లాడలేదు.

ఇనజ అమ్మ దర్శనార్థం నెల్లూరు నుంచి జిల్లెళ్ళమూడి వచ్చింది. "ఎన్నిరోజులని అక్కడ ఉండమంటావు?" అని అమ్మని అడిగింది. "వాడినడిగి చెప్తానంది" అమ్మ. దానికి ఇనజ "నీమధ్య నా మధ్య మరో మనిషి ప్రమేయం ఉండటం నాకిష్టంలేదు. నీవు నన్ను ఏం చేయదలుచుకున్నావు? నిన్నే

నమ్ముకున్నాను" అని అమ్మను గట్టిగా అడిగింది. ఆ తరువాతా అమ్మ ఇనజను వివాహం చేసుకున్నది. ఇనజ "మాతృశ్రీ మెడికల్ సెంటర్"లో డాక్టరుగా వచ్చింది.

ఎన్నెన్నో లాభం లేదనుకుని డాక్టర్లు వదిలేసిన కేసులు కూడా అక్కడ నయమవటం విచిత్రం. గరుడాద్రి, అన్నయ్యవెంకటసుబ్బయ్యను లో M.M.C చేర్చారు. ఆ రాత్రి ఆయన కండిషన్ చూసిన ఇనజ ఉదయం ఆయన్ని అమ్మకు చూపించగలనా అని భయపడింది. అమ్మ ఉదయం అతన్ని చూడటానికి వచ్చినపుడు తాను ఏడ్చి అందరినీ ఏడ్పించింది. నెల్లూరు డాక్టరు గారికి కబురు పంపించింది. ఆయన వచ్చి చూసి సర్జికల్ కేసు అని చెప్పి వెళ్ళిపోయారు. సుబ్బయ్య గారికి ట్యూబర్ కొలోసిస్ అనే మందు వాడమని అమ్మ చెప్పింది. అమ్మ స్పర్శానంతరం బ్రతకడనుకున్న అతను జబ్బునయమై హాయిగా ఉన్నాడు.

శేషయ్యగారి మనవడికి డయేరియా. డాక్టర్లు బ్రతకడని చెప్పారు. అట్టి పరిస్థితుల్లో M.M.Cలో చేర్చారు. అతనికి అమ్మ దయ వలన నయమయింది. వరుఘూమల్లు సీతా చంటి పిల్లవాడికి బాగా లేదని అమ్మ దగ్గరకు తీసుకువచ్చారు. అమ్మను అడుగుదామని వెళ్తుంటే మధ్యలో ఆపేశారు అక్కడి వాళ్ళు. "అమ్మా మల్లు కొడుక్కి బాగా లేదని" చేప్తే అమ్మ అటు తిరిగి పడుకుంది. అంతా గుంటూరు తీసుకువెళ్ళమన్నారు. దానికి మల్లు గుంటూరు వెళ్తే బ్రతుకుతాడా? డాక్టర్లు బ్రతికిస్తారా? అని ఎలా జరిగితే అలా జరుగుతుంది. పాపక్కయ్యా నీవే వైద్యం చెయ్యాలి అన్నాడు. (ఇనుజను అందరూ పాపక్కయ్య అంటారు ఫ్లూరసీకి వాడే మందును తోపింపచేసి ఇనజచేత ఇప్పించింది అమ్మ బ్రతకడనుకున్న పిల్లవాడు బ్రతకటం ఆశ్చర్యమే కదా! వారికి అమ్మయందు కల నమ్మకం వల్ల అమ్మ కరుణాకటాక్షలను పొందగలిగారు. ఇనజ మాతృశ్రీ మెడికల్ సెంటర్లో డాక్టర్గా ఉండి ఎందరెందరికో వైద్యం చేసింది. జిల్లెళ్ళమూడిలోనే కాక అక్కడకు రాలేని వాళ్ళకు తానే స్వయంగా వెళ్ళి వైద్యం చేసేది. ఆ ఊళ్ళోనే కాక ఆ చుట్టుప్రక్కల ఊళ్ళకు కూడాపొలాల గట్ల వెంబడి నడిచి వెళ్ళి పడవలో మూలపాలెం వెళ్ళి వైద్యం చేసేది.

నాన్నగారు సిద్ధిపొందే ముందు ఇనజ అమ్మను చూచి "ఏమిటో పిచ్చితల్లి ఇట్లా ఉందేమిటో!" అని చాలా బాధపడింది. అమ్మ మనవళ్ళను తీసుకుని మెట్లు దిగుతుంటే చాలా జాలి కలిగింది. ఎందుకు తనలో ఇటువంటి భావన వచ్చిందో తనకే అర్ధంకాలేదు. ఫిబ్రవరి **16**వ తారీఖు నాన్నగారికి E.C.G. తీయిస్తే అందులో తేడా వచ్చింది. మర్నాడు గుంటూరు తీసుకువెళ్ళి వైద్యం చేయించాలనుకున్నారు. ఆ అర్ధరాత్రే ఆయన చనిపోయారు

పెద్దగుడిలో ఒక ప్రక్కన **1983** ఫిబ్రవరి **17**న అమ్మ నాన్నగారిని భూస్థాపితం చేయించింది. భూస్థాపితం చేసిన రోజు నాన్నగారి ఆరాధనోత్సవం వైజాగ్ వాళ్ళ ఫంక్షన్ అని చెప్పింది. **1983** నుంచి వైజాగ్ వాళ్ళు తప్పక అక్కడకు వెళ్ళి ఎంతో ఘనంగా ఆ ఉత్సవాన్ని జరుపుతున్నారు. ఆరాధనోత్సవం నాడే ధాన్యాభిషేకం మొదలు పెట్టించింది. ఇది చరిత్రలో కనీ వినీ ఎరుగనటువంటిది.

జొన్నాభట్ల వెంకటరామయ్య గారి కుటుంబానికి ఎన్నో సం॥ల నుంచీ అమ్మ ఆరాధ్య దైవం. ఆయన కొడుకు జొన్నాబట్ల శాస్త్రన్నయ్యకు కూడా తండ్రిలాగనే అమ్మయందు ఎంతో భక్తి, శ్రద్ధలు వున్నాయి. వెంకటరామయ్యగారు పోయినపుడు ఆయన భార్య డాక్టర్ ఇనజకుమారిని పట్టుకుని చాలా ఏడ్చింది. సరోజినక్కయ్య ఈ ఆచారాల గురించి, అమ్మ గురించి చెప్పింది.

అమ్మకు కూడా ఈ ఆచారాలంటే నమ్మకమేమిటని చాలా ఆవేశంగా ఇనజ అమ్మ దగ్గరకు వెళ్ళింది. తీరా అమ్మ ఆచారాలన్నింటినీ సమర్ధిస్తూ మాట్లాడింది. వాటిలోని సైంటిఫిక్ కారణాలను వివరించింది. అది విన్న మీదట ఇనజకు చాలా సంతోషం కలిగింది. అమ్మా నీవు ఇట్లా చేయొద్దని శాసించావు. ఎవరైనా ఇట్లా చెయ్యకపోతే మాకు కీడు కదా! అంటే నువ్వు ఏం చేస్తావు? కీడు ఏమీ లేదని అభయమిస్తావా?" అని అమ్మను అడిగింది. దానికి అమ్మ "ఆ ఇస్తాను తప్పకుండా" అని సమాధానం చెప్పింది. ఆ సమాధానంతో ఇనజ మనస్సు పొంగిపోయింది. మనము అనుక్షణము చస్తూ బ్రతకుతున్నాము. అంటే Catabolism & Metabolism.

శ్రీపాదవారి కూతురు గాయిత్రి మొండితనానికి కష్టం వేసి ఆమెచేత తండ్రి తలకొరివి పెట్టించటానికి అమ్మ ఒప్పుకున్నదని కాత్యాయని చెప్పింది. ఇంకెవ్వరూ లేక వాళ్ళల్లో వాళ్ళు పోట్లాడుకుని శవాన్ని జిల్లెళ్ళమూడి తీసుకువచ్చారు. అందరి శవాల్నీ మోయటానికి రామకృష్ణ అన్నయ్య ఉన్నాడుగా అంది కాత్యాయని. అదే నిజమనుకుంది ఇనజ.

తరువాత శ్రీపాదవారి విల్లు గురించి రాధన్నయ్య ఇనజకు చెప్పాడు. అది విన్న తరువాత కాత్యాయని ఎంత తప్పుగా చెప్పిందో తెలిసింది. ఆ తరువాత అమ్మ "ఇనజకు నెమ్మదిగా ప్రపంచం గురించి అర్ధమౌతుంది. ప్రతివాళ్ళూ చెప్పింది నమ్మకూడదని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటోంది. ఇంకా తెలుస్తుందిలే దానికి" అన్నది.

"ఆత్మహత్య పిరికితనాన్ని సూచిస్తుందా? ధైర్యాన్ని సూచిస్తుందా?" అని రామకృష్ణ అన్నయ్య అమ్మను అడిగాడు. "రెంటినీ, బ్రతుకంటే పిరికితనం, చావటానికి ధైర్యం రెండూ ఉన్నాయని" అమ్మ చెప్పింది.

జీవితంలో మనస్సుకు, బ్రతుకుకు ఎప్పుడూ పోరాటమే. ఆ రెండికీ సమన్వయం ఉండదు. "ప్రపంచం నన్నర్ధం చేసుకోదని బాధ పడుతున్న ఒక ఆమెతో అమ్మ నిన్ను నీవు అర్ధం చేసుకోవటానికి ప్రయత్నించు. ప్రపంచానికి నిన్ను నీవు అర్ధం చేసుకోవలసిన అవసరం లేదు. ముందుగా నీ అంతఃశత్రువులను గెలిస్తే ప్రపంచంలో నీకు శత్రువులే వుండరని" చెప్పింది అమ్మ.

వైజాగ్ వాళ్ళందరం ఊరికి ప్రయాణమై అమ్మ దగ్గర బొట్టు పెట్టించుకుందామని వెళ్ళాము. భవానీ ప్రసాద్ గారి భార్య ఉమాదేవి ఫోటోల మీద అమ్మచేత సంతకం పెట్టించి ఇమ్మని రామకృష్ణ అన్నయ్యకు ఇచ్చింది. అన్నయ్య అమ్మకు ఇచ్చి "వీటికి ప్రాణ ప్రతిష్ట చెయ్యమమ్మా" అన్నాడు. దానికి అమ్మ "ఇప్పుడు వీటికి ప్రాణం లేదంటావా? అన్నది. దానితో అక్కడ వున్న అందరం అవాక్కు అయ్యాము.

"ఒకమారు పరిస్థితులకు తట్టుకోలేక అమ్మ ఫోటోను పిడికిలి బిగించి

కొట్టాను. మామూలుగా కొంచెం వత్తిడి తగిలితేనే అద్దం పగిలిపోతుంది. అటువంటిది అమ్మ ఫోటోను అంతగా కొట్టినా అద్దం ఏమీ అవలేదు. ఆ తరువాత నేనే ఏమిటి ఆలాచేసానని తర్కించుకుని" విలపించాను. ఆతరువాత అమ్మ దగ్గరకు వెళ్ళినప్పుడు అమ్మ గుండె పట్టుకొని కూర్చుంటే సిగ్గుతో నా తలదించుకున్నాను. వెంటనే నాకు ఆ సంఘటన గుర్తుకు వచ్చి విపరీతంగా దుఃఖించాను. సంతోషమొస్తే పూజించటం, కష్టం వస్తే ఆమెనే తిట్టుకోవటం, కొట్టటం అమ్మ బిడ్డలతో అనేకమందికి అలవాటేనని తరువాతే నాకు తెలిసింది.

కేశవవర్మ గారి భార్య శారద అక్కయ్య పరిస్థితులకు తాళలేక చెక్కముక్కను విసిరేసింది. అది సరిగ్గా అమ్మ ఫోటోలో మోకాలుకు తగిలింది. ఆ తరువాత అన్నయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళి "అమ్మ ఏం చేస్తోంది అని అడిగారు. దానికి అక్కడి వాళ్ళ మోకాలు నొప్పిగా వుందని మందు రాయించుకుంటోందని చెప్పారు. ఇంటికి వెళ్ళగానే అక్కయ్యకు ఆ విషయం చెప్పి మందలించారు. అమ్మ ఫోటో ఉన్నా, అమ్మ ఉన్నట్లే అన్న సంగతి పై సంఘటనలు ద్వారా అవగతమౌతుంది.

డా॥ సుబ్బారావు గారి దగ్గరకి ఇనజను అమ్మ వెళ్ళమన్నది. ఇనజ అమ్మతో "నేను గబుక్కున మాటతూలుతాను. అన్నయ్య మనస్సుకి ఎప్పుడైనా కష్టం కలిగిస్తానేమోనని భయంగా ఉందమ్మా" అన్నది. ఆ విషయం అన్నయ్యకే చెప్పి ఎప్పుడైనా ఏమైనా అన్నా నీ చెల్లెలు కాదు నీ కూతురే అనుకొని క్షమించు" అని చెప్పమన్నది అమ్మ. శ్యామ్ అన్నయ్య అన్నట్లుగా "నాకు మాటతూలే స్వభావం వుంది. కనుక ఇక నుంచి మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా మాట్లాడాలి అనుకున్నది ఇనజ.

అమ్మ అపార కరుణతో ఇనజకు "ఏది చేస్తున్నా అమ్మ చేయిస్తుందని అనుకోవే. అలా అనుకొని ధైర్యంగా చెయ్యి అని నూతన సంవత్సరం నాడు గొప్ప వరాన్ని ప్రసాదించింది. జనవరి 1 ఉదయం పడటం కూడా ఒక అనుభవమేలేవే కొందరికి అన్నది అమ్మ. ఆ రాత్రి సర్కారు ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు

వెళ్ళటానికి ఇందిర, ఇనజ, విశాలి బాపట్లలో రవి అన్నయ్య వాళ్ళింటికి వెళ్ళారు. అక్కడ ఇనజ కాలుజారి బోర్లా పడ్డది.

అమ్మ ఇనజకు ఇచ్చిన మాట ప్రతి విషయంలో నిలబెట్టుకుంది. వచ్చిన పేషంట్లందరికీ డాయగ్నస్ చేసి మందులు ఇచ్చింది. అనుమానమున్నవి ఇన్‌వెస్టిగేషన్‌లో తప్పక దొరుకుతాయి కదా! కొన్ని సం॥లుగా అన్నయ్య చూస్తున్నా ఒక పేషెంట్‌కు తగ్గని యూరినరీ ఇన్‌ఫెక్షన్ తగ్గిపోయింది. అది చూసి డా॥ సుబ్బారావు గారు "Really she is behind you" అని అమ్మను ప్రస్తుతించారు.

డాక్టరుగారి కుటుంబం అంతా జిల్లెళ్ళమూడికి వెళ్ళారు. సంక్రాతికి ఒక్కతీ ఉండాలని దిగులు పడుతుంటే ఇందిరా వాళ్ళింటికి రమ్మన్నారు. పండగ మూడు రోజులు ఎంతో సంతోషంగా, హాయిగా గడిపింది. గుండెనొప్పి ఉన్న ఒక అమ్మాయి ఉదయం ఇనజకు చూపించుకొని సాయంత్రం వాళ్ళ అమ్మతో వచ్చింది. 101 జ్వరం ఉన్నా, ఏ మందులు వాడకుండానే ఇనజే ట్రీట్ చేయాలని వచ్చింది. ఇనజ రాసిన ప్రిస్క్రిప్షన్ చూసి డాక్టరుగారు సర్టిఫై చేసారు.

అమ్మ కలలోనికి రావడం విషయం మీద చర్చించుకుంటున్నారు. ఇందిరకు 'అమ్మ' ఎప్పుడూ కలలో కన్పిస్తుంది. ఎంత అదృష్టవంతురాలో అనిపించింది. "నాకు ఎందుకు అమ్మ కలలో కనిపించదో! అమ్మ ఎవరికి తగిన విధంగా వాళ్ళని చూస్తుంది, నాకూ తప్పక కనిపిస్తుంది అన్న ఆశతో జీవితకాలం ఎదురు చూడమన్నా చూస్తాను" అని అనుకుంది ఇనజ "నేను పైకి కనిపించేంత మంచిదాన్ని కాదేమో, నాలో లోపాలేమైనా ఉన్నాయేమో అని ఆత్మ విమర్శ చేసుకుంది".

అమ్మను దర్శనం ఇవ్వమని ఉదయం గట్టిగా కోరుకుంది. తనకు సంతృప్తి కలిగేటట్లుగా అరగంటసేపు అమ్మ ఇనజతో మాట్లాడింది. డా॥ సుబ్బారావు గారి గురించి అమ్మ "వాడు అమృతపు ముద్ద అని చెప్పింది. అమ్మచేత ఆ విధంగా అనిపించుకున్న డా॥ సుబ్బారావుగారు ఎంత అదృష్టవంతులో కదా! అటువంటి అన్నయ్య దగ్గరకు తనను చేర్చినందుకు అమ్మకు కృతజ్ఞతలు తెలియచేసుకుంది ఇనజ.

డాక్టరుగారి భార్య అన్నపూర్ణ అక్కయ్యలో చాలా మార్పు వచ్చింది. పూర్వం తల్లినే గాయపరచేంతగా మాట్లాడేది. కాని అమ్మకు "స్వభావాన్ని కూడా మార్చే శక్తి వున్నదన్న సంగతి ఋజువైందనుకున్నది. ఎప్పుడూ ఎవ్వరినీ కష్టపెట్టకుండా, ఇంకొకరికి అపకారం చేయకుండా, ఒకర్ని చూచి ఈర్ష్య చెందే స్వభావం లేకుండా చేయమని అమ్మను ఇనజ మనసూర్తిగా కోరుకుంది. ఎంత హృదంగమైన భావన.

అన్నయ్య ఇనజతో "అమ్మను పిలవలేదేం?" అని అన్నారు. అమ్మ "నాదేం హృదయం పీఠంలో తిష్ఠ వేసుకుని వుండగా ఇంక ఎక్కడికని పిలవను" అన్నది. ఒక పేషెంట్ "డాక్టరు సుబ్బారావు గారిలా ఇనజ చూస్తుందని చెప్పుకుంటున్నారు" అని చెప్పింది. "అప్పుడే నా గురించి అమ్మ ప్రచారం మొదలుపెట్టింది. నాకు బీదవారంటే దయ అని, డబ్బు మీద ఆశ లేదని చెప్పుకుంటున్నారు. నాకా గుణాలు లేకపోయినా, అమ్మ అంటగట్టింది కాబట్టి ఇంక అలవాటు చేసుకోవాలని" అనుకుంది.

అమ్మా! "నిన్ను కోరేది ఒకటే. ఎప్పుడే అసంతృప్తి నాదరి చేరనీయకు. ఇతరుల అభివృద్ధి చేసి ఏడ్చే మనఃస్థితిని కల్గించకు. చేరదీసినందుకు కృష్ణమూర్తి గారిని, డాక్టరు గారిని బాధపెడ్తానేమో! దయచేసి ఆ పరిస్థితి రానీయకు, కుటుంబంతో వుంటూ డాక్టరుగారిలా ఉండగలగటం అసాధ్యం. బోగి పండుగనాడు అమ్మ పాదల నుండి 2 పైసలబిల్ల పడ్డది. నిజంగా అదిచూసినవారు ఎంతో అదృష్టవంతులనిపించింది. డాక్టరుగారు అమ్మ దగ్గర చాలా ఆనందంగా గడిపి వచ్చారనిపించింది.

డా॥ సుబ్బారావుగారితో "నాకు పెళ్ళి మీద కోరిక ఎప్పుడూ లేదు. చేతినిండా పనివుంటే చాలని" ఇనజ చేత అమ్మ చెప్పించింది. అదే విషయాన్ని అమ్మ ధృవీకరించింది. అందరూ "అమ్మ సర్వాంతర్యామి అంటారు కదా! నేను అన్నం తిన్నదీ, లేనిదీ లాంటి చిన్న విషయాలు అమ్మకు తెలియవచ్చాయా?" అని అనుకుంది. ఇనజ అమ్మకు పూజ చేసికున్న తరువాత వాళ్ళ కన్న మామయ్యగారు

"నువ్వు అన్నం తినలేదమని అడిగారు. అమ్మ కూడా ఏమే అన్నం తిన్నావా?" అని తాను అడగటమే కాక ఆయన చేత కూడా అడిగించింది. కాబట్టి "మనం పలికే ప్రతి పలుకులో, ప్రతి చేతలో అమ్మవుంది. వాటిని పవిత్రంగా వుంచుకునే బాధ్యత అమ్మదే కదా!" అని ఇనజ అనుకుంది.

"1975 ఏప్రియల్ 15వ తారీఖున నాకు అతిమధురమైన రోజు. ఆనందం వెల్లువై పారిన రోజు. ఆ త్రిలోకనాధుడు, ఆ జగన్మోహనుడు, నిర్వికారి, నిర్గుణుడు, జగత్ కళ్యాణ కారుడైన భగవంతుడు నన్ను పరిణయమాడిన రోజు నుదుట కళ్యాణ తిలకం దిద్ది దండ వేసింది. బువ్వంబంతి పెట్టి వేడుక జరిపించమంది. వసుంధర రుక్మిణి, ఢిల్లీ ఉషక్కయ్య, సత్య, నువ్వు రాధవా? అని ప్రశ్నించింది అమ్మ. "రాధలాగా నన్ను అంత విరహవేదనకు గురిచేయకని" ప్రార్థించాను. నేను ఇంక బ్రహ్మాండం ఇనజనట. తను బరువులేని భలేబావ" అని చెప్పింది.

"1975 మే 5వ తేదీ అమ్మ కళ్యాణానికి రమ్మని పిలిచింది. నెల్లూరులో కృష్ణమూర్తి చూసుకుంటాడు. ఆ రోజు పట్టుచీర కట్టుకు రమ్మని" అమ్మ చెప్పింది. అమ్మ కళ్యాణాన్ని కనులారా తిలకించింది. డయాస్ మీద అమ్మ ఒకటే కప్పించింది. ఆ స్టేజి మీద అమ్మను చూసిన ఇనజకు అమ్మ చేత ఆ తాడు కాస్తా కట్టించుకుంటే బాగుండుననిపించింది. కానీ అమ్మ ఇష్టం కదా! మనం అడగటమేమిటని అనిపించింది. అమ్మ స్టేజి మీద అంత చిలిపిగా వుడటం ఇనజ ఎప్పుడూ చూడలేదు.

"మల్లెలు, మొల్లలు, సంపెంగలుండగా నాలాంటి గడ్డిపువ్వును శిరస్సున దాలుస్తుందెందుకో. కానీ ఈ దేముడికి పాపం, పుణ్యం, మంచి, చెడు అన్నీ ఒకటే కదా! అదే విధంగా గడ్డి పూవుని, గులాబీని ఒకేలా చూడటమే ఈ దేముడికి ఇష్టమేమో" అనుకంది ఇనజ. ఏది ఏమైనా సంపెంగ సహవాసంతో సువాసన సంతరించుకున్నట్లు వసుంధరక్కయ్య సహనసౌశీల్యాల్లో వెయ్యోవంతైనా తనకు అలవడాలని అనుకుంది. "ఏనాడు అహంకారపు తెరలు తన కళ్లను కప్పకుండా జీవితపు తుది కొణం వరకూ నేనొక గడ్డిపూవునే అని జ్ఞాపకముండాలని అమ్మను

ప్రార్థించింది. సువాసనా గల సంపెంగను అదిరించడం కన్న ధూళిలో పొర్లాడే గడ్డి పువ్వుకు సంపెంగ సువాసనలంటేటట్లు చూడటం ఈ దేముడి ప్రత్యేకతేమో" అందుకే అవగతముగావు తల్లీ నీ లీలలద్భుతంబులు చూడగా అని పాడుకుంటున్నాము". అమ్మను తలుచుకుని ఏదో ఒకటి గీకిపారేయలనుకున్నాను అని అన్నాడు రామకృష్ణన్నయ్య. అవును "నేను గీకిపారేయమన్నాను అని అమ్మ ధృవీకరించింది. "దైవం తలిస్తేనే తాను తలుస్తాడు" అన్న అమ్మ మాట ఇక్కడ ఋజువైంది.

"ఇష్టమైనప్పుడు దాన్ని నాతో తీసుకువెళ్తానని క్రియారూపంగా తెలియచేసింది" అమ్మ. "నాలాంటి అల్పురాలిని ఈ దేముడు ఎలా దగ్గరకు తీసుకుంటున్నాడని" పదే పదే అనిపిస్తుంది. "నీకు ఎవరూ వండి పెట్టలేనప్పుడు, నీవు వంట చేసుకొని ఆసుపత్రికి వెళ్ళగలవా?" అని అమ్మ ఇనజను అడిగింది. ఆదరణాలయంకు నాంది జరిగింది. ఆదరణ కరువైన వృద్ధులకు ఆదరణ అందించమని అమ్మ ఆ బాధ్యతను డా॥ ఆ చంట కేశవరావుగారి మీద పెట్టింది.

అమ్మ "దేనికైనా తరుణం రావాలి" అంటుంది. "అదేమీ లేకుండా నువ్వు తలుచుకుంటే అవుతాయి" అంటాడు రామకృష్ణన్నయ్య. నాకేం తెలుస్తుంది. ఏది నిజమో! తరుణం వచ్చినప్పుడే అమ్మ అంటుందా! అమ్మ అన్నప్పుడే ఆ తరుణం వస్తుందా?" అని ఇనజ తర్కించుకుంది. మాతృశ్రీ మెడికల్ సెంటర్‌లో ఒక గులాబీ పూసింది. ఆ పూవు వాడి రాలిపోకుండా దానిని ఇనజ అమ్మ పాదాల చెంతకు చేర్చింది.

ఇనజను అమ్మ వివాహం చేసుకున్నదని తెలిసిన ఇనజ అన్నగార్లు ఎవరూ లెటర్ వ్రాయలేదని బాధపడ్తున్నా ఇనజకు అమ్మ బిడ్డల్లో ఒకరి దగ్గర నుండీ శుభాకాంక్షలు తెలుపుతూ ఉత్తరం వచ్చింది. దానికి ఇనజ "ఇకనుంచీ నీ తోడబుట్టిన వారే కాదు మిగిలిన వారందరూ నీ సహోదరులే" అని అమ్మ తెలియ చెప్పిందని" చాలా ఆనందపడింది.

"మానవసేవే మాధవసేవ అనుకోగలను కానీ, మాధవసేవ మానవసేవ

అనుకోలేను. నాకు జన్మరాహిత్యాలు, మోక్షాల మీద నమ్మకం లేదు. నేనే పాపాలు చేశానని? దాని ప్రక్షాళన కోసం దేముడి దయ కావాలని పాకులాడటం. మూడు సం॥ల ఆ పిల్లవాడిని చూపించి మీరు పురుడు పోసిన బిడ్డేనమ్మా అన్నా, ప్రమాదాన్నించి తప్పించారు డాక్టరుగారు అంటూ కృతజ్ఞత వెల్లడి చేస్తున్న పేషంట్‌లని చూస్తే కలిగే ఆనందం, తృప్తి ఈవిడే అమ్మగారి డాక్టరు అంటూ పదిమందీ అంటే కలగదు. నీకు నేను కాకపోతే వందమంది వస్తారు. కానీ పేషంట్లు విషయంలో అలా అనిపించదు. అందుకే ప్రాక్టీసో ప్రాక్టీసో అని మొరపెట్టుకుంటాను. ముఖ్యంగా నీకు ఎక్స్‌పీరియన్స్ కోసమే, నీకు కాన్ఫిడెన్స్ కోసమే అమ్మ జబ్బు పడింది. అంటుంటే మనస్సును ముక్కలు ముక్కలుగా తరుగుతున్నట్లునిపిస్తుంది.

"మూడేళ్ళ నుంచీ నామనస్సు దిగిజారుతూ, ఆలోచనలతో తూట్లు పడుతున్నదే తప్ప, ఏ మాత్రం స్వాంతన లేదు. ఇలా జరగటానికి కారణం మనిద్దరం కాదు, పరిస్థితులే, చేతినిండా పనిలేక ఆవరణలో, నీకు నేను దగ్గరగా తిరగటం వల్ల వచ్చిన నష్టం ఇది. ఇక్కడికి వచ్చిన కొత్తలోనే కొన్ని పరిస్థితుల చూసి, ఎట్టి పరిస్థితులకు లోనైనా సరే ఎవ్వరి గురించీ వెనక మాట్లాడ కూడదని ఒట్టు పెట్టుకున్నాను. దానితో నా ఆలోచనలే నన్ను తినివేస్తున్నాయి. నమ్మింది బయటకు చెప్పటం నాలోని బలహీనత. నువ్వు దేముడివని లోకానికి చెప్తారు వాళ్ళు, నమ్మినట్లు నటిస్తారేమో! అనిపిస్తుంది. కానీ వాళ్ళ వ్యవహారాల్లో మాత్రం నువ్వు సర్వత్రా ఉన్నావన్న భయం కనిపించదు. నాబోటి వాళ్ళకు అలాకాదు. నీవు దేముడివి అనుకుంటే నామనసావాచా కర్మణా దేముడివే. లోకానికి, వ్యవహారాలన్నింటికీ దేముడివే. మనిషివి, మోసగాడవి అనుకుంటే అన్నింటికీ అదే".

"ఈ మనస్తత్వం వల్లనే ఈ మూడేళ్ళ నుంచీ నీతో చెప్పుకొని భారం దించుకోవాలని కూడా నీకు తెలియదా ఏమిటి? అని మనస్సుకు కలిగిన బాధను ఎవ్వరితో చెప్పుకోకూడదు అనుకున్నాను. కానీ నిన్ను ఒక స్నేహితురాలిగా

భావించుకుని నా కష్టాన్ని బయటపెడ్తున్నాను. అనుక్షణం నేను హైమ అక్కని రెండే వరాలు కోరుకుంటున్నాను. నీవు దైహికంగా, మానసికంగా, సుఖంగా హాయిగా వుండాలని, నన్ను త్వరగా తనలో కలుపుకోమని. అదేం ఖర్మమో చెడు జరిగితే నిన్ను అనాలపిస్తుంది. మంచి జరిగితే హైమ దయ అనిపిస్తుంది. ఈ మాటలన్నీ నీవు తీసుకుంటావో?" అదీ మా హైమ దయ మీదే ఆధారపడి వుంది.

ఈ పై విషయాలన్నీ పాపక్కయ్య సొంతంగా రాసుకున్నవే. వాటిని మార్చటం కంటే ఉన్నవి ఉన్నట్లుగా రాస్తే బాగుంటుందని అనిపించి యధాతథంగానే వుంచటం జరిగింది.

ఇనజ దగ్గర పనిచేస్తున్న రామూ, అమ్మ పెద్దకోడలు శేషు తమ్ముడు సత్తిరాజు శేషగిరిరావు గారి పెద్ద అమ్మాయి శారద అతని భార్య. ఒకసారి రామూకు అమ్మ కలలో కనిపించి "నాన్న! నీవు ఇనజ దక్షిణాదికి వెళ్తారా? అని అడిగింది. అక్కడికి ఎందుకమ్మా?" అని అడిగాడు. ఈ విషయాన్నే పాపక్కయ్యను అడిగాడు. పాపక్కయ్య "నేను బెంగుళూర్ ఫ్రీ ఆసుపత్రిలో పనిచేయటానికి ప్రయత్నించాను. నీకు ఎలా తెలిసింది?" అని అడిగింది. అమ్మ తనకు కలలో కనిపించి చెప్పిన విషయాన్ని వివరించాడు. అమ్మతో "నన్ను దూరం చేయద్దని" వేడుకున్నాను. "నీవు ఇక్కడ వుండవు లేవే, దక్షిణాదికి వెళ్తావని " అమ్మ అన్నదని ఇనజ చెప్పింది.

మాతృశ్రీ మెడికల్ సెంటర్‌ను వదిలి బాపట్లలో ఇనజ దక్షిణానే ఇల్లు కట్టుకుంది. రామూ కూడా దక్షిణానే స్థలం కొనుక్కున్నాడు. ఇనజ అక్క లలితాంబక్కయ్య కొడుకు దినకర్ చాలా సం॥లు అమ్మ దగ్గర నిస్వార్థంగా సేవ చేసాడు. దినకర్ ఉద్యోగం వదిలి అమ్మ సేవకు వచ్చినప్పుడు అందరూ అమ్మను చాలా ఆడిపోసుకున్నారు. ఎందుకమ్మా ఇలా మాటలు పడ్తావని అడిగాము. "ఇంతమందికి అన్నం పెడ్తున్న నీవు నాకు పట్టెడు మెతుకులు పెట్టలేవా?" అని ఎంతో ఆర్తిగా వాడు అడిగాడు. దానికి నేను ఏమీ మాట్లాడలేక పోయానని చెప్పింది అమ్మ.

"అమ్మకి చేసే సేవలో, శుశ్రూషలో, ఇతర దైనందిన చర్యలలో, చికిత్సలో సపర్యలలో అత్యంత సున్నితమైన, కోమలమైన మానవ మాతృరాలిగా అమ్మను చూడాలి." అని దినకర్ ఇనజకు చెప్పాడు. అమ్మకు పూజచేసేటప్పుడు భక్తితో, శ్రద్ధతో , గౌరవంతో, అభిమానంతో అత్యంత, అతీతమైన శక్తిగా మన ధృక్పధంలో చూడగలగాలి. ఈ రెండు భావాలను అనుక్షణం సమన్వయించుకుంటూ ముందుకు నడవాలి అని ఇనజకు సలహా రూపంగా తెలియజేసాడు.

డాక్టర్ ఇనజ "అమ్మ సిద్ధి పొందిన అనంతరం బాపట్లలో హైమా నర్సింగ్ హోమ్‌ను నడుపుతోంది. అమ్మ అడుగు జాడల్లో నడుస్తూ జీవితాన్ని అమ్మకే అంకితం చేసిన ధన్యజీవి డా॥ ఇనజకుమారి.

డాక్టరు ఆచంటకేశవరావుగారు నరసాపురం నివాసి. **21-10-1969**న జిల్లెళ్ళమూడి మొదటిసారిగా వెళ్ళారు. ఆయన భార్యకు తరుచూజ్వరం వచ్చేది. ఎంతమంది స్పెషలిష్టులకు చూపించినా, ఎన్ని పరీక్షలు జరిపినా జ్వరం ఎందుకువస్తోందో ఎవ్వరూ గ్రహించలేకపోయారు. ఆ సమయంలో అమలాపురం గ్రామనివాసి అయిన డాక్టరు గారి మేనల్లుడు ఎ.వి.ఆర్. సుబ్రమణ్యం గారు సలహా మేరకు అమ్మ దర్శనం చేసుకున్నారు.

అక్కడికి వెళితే "సదుపాయాలు, సౌకర్యాలు వుంటాయా?" అని వారి మేనలుడ్ని ప్రశ్నించారు డాక్టరుగారు. దానికి ఆయన భోజనం, వసతి అన్నీ ఉచితంగానే ఏర్పాటుచేస్తారని చెప్పారు. అక్కడి వాళ్ళు పెట్టేభోజనం తినగలమో లేదో అనే శంకతో కూరగాయలు తీసుకువెళ్ళారు. మధ్యదోవలో కారు ఆగిపోతే తీసుకువెళ్ళారు. అమ్మ దర్శనం అనంతరం అమ్మ "ఎలా వచ్చారు నాన్నా?" అని అమ్మ అడిగింది. "కారులో వచ్చామని" జవాబిచ్చారు.

వీరేకాక అమ్మ సమక్షంలో అనేకమంది కూర్చుని ఉన్నారు. వారందరిచేతుల్లో పూలు, పళ్ళు, కొబ్బరికాయలు, గాజులు, ఎవరికితోచినవి వారు పట్టుకుకూర్చున్నారు. అప్పుడు డాక్టరుగారి భార్య "అందరూ ఏదో ఒకటి తెచ్చారు. మనమే ఏమీ తీసుకురాలేదని" బాధపడ్డారు. పక్కన ఉన్నవారిని "పూలు మొ॥

అర్చన సామాగ్రి ఎక్కడ దొరుకుతుంది", అని అడిగారు. దానికి వారు ఇక్కడేమీ లభించవు. మేము వచ్చేటప్పుడే తెచ్చుకున్నాము" అని చెప్పారు.

వారిలో ఒకరు ఒక పువ్వు అక్కయ్యకు ఇచ్చి దానిని అక్కయ్య అమ్మకాళ్ళ దగ్గరపెట్టి నమస్కరించింది. అప్పుడు డాక్టరుగారు "అమ్మా! నీవు అభయహస్తం పెట్టు మా ఆవిడ నీకు నమస్కరిస్తున్నప్పుడు ఫోటో తీసుకుంటానని" అడిగారు. దానికి అమ్మ "అభయహస్తం ఎందుకు నేను ఇక్కడే వున్నానుగా!" అన్నది. కెమేరా ఎక్కడో పడిపోయింది. ఎంతవెతికినా దొరకలేదు. ఆ నిముషంలో ఏమి జరిగిందో కూడా ఆయనకు అర్థం కాలేదు.

వెంటనే డాక్టరుగారు అమ్మ కాళ్ళపై పడి చంటిబిడ్డమాదిరి భోరున విలపించారు. కొద్దిసేపటికి మనస్సును అదుపులో పెట్టుకొని "ఏమిటి? నేను ఇక్కడ ఇలా పడివున్నాను అని ఆశ్చర్యపడ్డారు. అమ్మతో "నీవు ఏమైనా మాయచేసావా?" అని అడిగారు. "నేనేమీ చేయలేదని" అమ్మ చెప్పింది.

అక్కయ్య చేతిని తన చేతిలోకి తీసుకొని వ్రేళ్ళను అమ్మ రాస్తోంది. దానికి డాక్టరుగారు "మంత్రం వేస్తున్నావా అమ్మ" అని అడిగారు. నేనేమీ మంత్రం వేయటంలేదు" అన్నది అమ్మ. "నీవు రాజరాజేశ్వరివా?" అని ప్రశ్నించారు. "కాదు నేను అమ్మను" అని తెలియచేసింది అమ్మ. అక్కయ్య "అమ్మకు ఏమీ తీసుకువెళ్ళలేదని బాధపడినా, వారు తీసుకువెళ్ళిన కూరలు అన్నపూర్ణాలయంలో వినియోగించటం జరిగింది.

అప్పటినుంచి అమ్మ యందు అమిత విశ్వాసంతో ప్రతినెలా 21వ తా॥ అమ్మ దర్శనం చేసుకునేవారు. ఒకసారి "అమ్మా! ప్రతినెలా 21వ తేదీన రావాలా? అని అడిగారు. అమ్మ నీవు రానక్కరలేదని" చెప్పింది. దానికి డాక్టరుగారు "నేను అసలు రానక్కరలేదా" లేక 21న రానక్కరలేదా?" అని అడిగారు. "21న రానవసరం లేదు" అని అమ్మ తెలియచేసింది. అమ్మ దర్శనమైన కొద్దిరోజులకే డాక్టరు గారి భార్యకు జ్వరం తగ్గింది. దానితో వారికి ఎనలేని గురి కుదిరింది.

అమ్మకు అనారోగ్యంగా వున్నప్పుడు రామకృష్ణ అన్నయ్యకోరిక మేరకు

డాక్టరుగారు గుంటూరు నుంచీ నిపుణులను పిలిపించి అమ్మకు పరీక్షలు చేసారు. గుంటూరు నుంచీ వచ్చినడాక్టర్లు కారులో అమ్మను గుంటూరు తీసుకువెళ్ళి పరిక్షలు జరిపించారు. అమ్మ జిల్లెళ్ళమూడి వెళ్ళేరోజు డాక్టరుగారితో "నాకు చిన్నమీటింగ్ వుంది. నేను ముందుగా వెళ్తాను నీవు తరువాత రమ్మని" చెప్పింది.

మీటింగ్ అంటే ఏదో కొద్దిమంది వస్తారనుకొని డాక్టరుగారు అమ్మ చెప్పిన సమయానికి కొద్దినిముషాల ముందు సభాస్థలికి కారులో బయలుదేరారు. తీరాచూస్తే రోడ్డంతా జనంతో కిక్కిరిసిపోయి, సూదిమోపసందు లేకుండా వుంది. అమ్మ అక్కడ ఒక డాబామీద నిలబడి బిడ్డలకు దర్శనమిస్తోంది.

ఆ సమయంలో అమ్మ వదనారవిందం అద్భుతకాంతులను వెదజల్లుతున్నది. డాబామీద నుంచే డాక్టరుగారిని భోంచేసి 3 గం॥ లకు రమ్మన్నది అమ్మ. ఆయన అప్పటికి భోంచేయలేదని అమ్మకు ఎలా తెలిసిందని ఆశ్చర్యచకితులయ్యారు. అమ్మకు ఎప్పుడూ బిడ్డల ఆకలిగురించే కదా! ఆలోచన భోజనం చేసి అమ్మ రమ్మన్న సమయానికి వెళ్ళారు.

జిల్లెళ్ళమూడికి కారులో బయలుదేరారు. త్రోవలో ఒక్కోమారు అమ్మ సాధారణంగాను, మరొకసారి అద్భుతకాంతులు విరజిమ్ముతూ కనిపించింది. పొన్నూరులో శ్రీఅధరవరపు శేషగిరి రావు మరణించినందున ఆ కుటుంబాన్ని పరామర్శించింది. ఆ అక్కయ్య పొట్ట మీద కాలివేలితో రాసింది. మరుక్షణమే అమ్మనల్లగా మారిపోయింది. తిరిగివస్తున్నప్పుడు డాక్టరుగారు "అమ్మా! ఆవిడ పొట్టపై కాలితో రాస్తే నీవు అంతనల్లగా ఎందుకు అయిపోయావు?" అని అడిగారు. దానికి అమ్మ "నేను రంగుమారటమేమిటి? ఎప్పుడూ నా రంగు ఇంతేకదరా రామకృష్ణా" అంటూ మాటమార్చింది.

1971 సం॥లో నరసాపురం డా॥ ఆచంట కేశవరావుగారికి "జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ రీసెర్చి సెంటరు. బ్రహ్మాండమైన భవనాలు, గొప్ప ఆసుపత్రి సైన్సు శాఖలన్నింటిలోనూ రీసెర్చి జరుగుతున్నట్లు ప్రపంచంలో కల్లా గొప్ప రీసెర్చి సెంటరుగా రూపొందినట్లుగా "కల వచ్చింది. కేశవరావుగారు వెంటనే ఒక ఇంజనీరును కూడా తీసుకొని వచ్చారు. ఆ సమయంలో డా॥ సుబ్బారావుగారు

కూడా అక్కడే వున్నారు. వారు తమ కలను అమ్మకు నివేదించగా అమ్మ మరునాడే మాతృశ్రీ రీసెర్చి సెంటర్‌కు శంఖు స్థాపన చేసింది. ప్రథమంగా ఉచిత వైద్యశాలా భవనం M.M.C. తరువాత మిగిలిన సైన్సు విభాగాలు ముగ్గురు ప్రముఖ వైద్యులు. డా॥కేశవరావుగారు, డా॥ ప్రసాదరావుగారు (సర్జన్, వైజాగ్) మదనపల్లి వాస్తవ్యురాలు డా॥ జానకీదేవి అక్కడ స్థిరపడి ఆ ఆసుపత్రిలో పనిచేయటానికి అమ్మ అనుజ్ఞను అర్థించారు.

ఈ విధంగా ఎన్నెన్నో మధురస్మృతులను పొందిన డాక్టరుగారి దంపతులు ధన్యజీవులు ప్రతి శ్రీరామనవమికి అమ్మ తలకు నూనె పెట్టేభాగ్యం కలిగిన అదృష్టవంతులు. జీవితం, జీవనం అమ్మ ఇచ్చినవే అని తమ శేషజీవితాన్ని అమ్మసేవలో గడుపుతున్నారు.

82 సం॥ల వయస్సులో కూడా అమ్మ అనుభూతులను నెమరువేసుకుంటూ అమ్మ సూక్తులను స్టికర్లుగా చేయించి అమ్మ బిడ్డలకు పంచుతున్నారు. హైమవ్రతకల్పం ముద్రణకు ఇతోధికంగా సహాయం చేసిన దాతలు శ్రీడాక్టరుగారు. వారు వారి సతీమణి " గోదావరి జిల్లా పర్యటనలో, అమ్మ వారింటవుండి వారితో ఆడి, పాడి, ఆ పావన గోదావరీ నదిమీద అమ్మ ప్రయాణం మరుపురాని మధురఘట్టం. అమ్మ సినిమా చూచిన ప్రతివారికి ఆ దంపతులు పరిచయమే.

1972 సెప్టెంబరు 29వ తేదీ రాత్రి సక్కుబాయి అక్కయ్య అమ్మను కారులో ప్రయాణం చేయమని అర్థించింది. అమ్మ సరే అని లాలా, పార్థులను తన వెంట రమ్మన్నది. బాపట్లలో రవి అన్నయ్యను ఎక్కించుకుంది. కారు రేపల్లె దారి పట్టింది. అమ్మ ఎక్కడికి వెళ్తుందో ఎవరికీ తెలిదు. కానీ అమ్మతో ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. ఆ కబుర్లలో కాలం, దూరం కూడా ఎవరికీ గుర్తురాలేదు.

ఈలోగా భట్టిప్రోలు వచ్చింది. లాలా, పార్థుల సంతోషానికి అవధులు లేవు. అది వారి సొంతవూరు. అమ్మ వారింటికి వస్తోందన్న హర్షాతి రేకాలకు అంతే లేదు. వారు అర్థించకుండానే కారును వారింటికి పోనీయమంది అమ్మ. నిద్రపోతున్న తల్లిదండ్రులను లేపి అమ్మ వచ్చిందని చెప్పారు. వారు విన్నది

కలో, నిజమో అర్థం కాలేదు. కానీ క్షణాల్లో అమ్మవారి ఎదుటికి వచ్చి నిలుచుంది. పూర్ణకుంభాలు, వేదమంత్రాలు, మంగళవాద్యాలు లేదు. అమ్మే సరాసరి లోపలికి వెళ్ళింది.

ఆ అక్కయ్య అమ్మపాదాలను తన ఆనందభాష్పాలతో కడుగుతూ "అమ్మా! ఈ దీనురాలిపై దయ ఉన్నదని నిరూపించటానికి వచ్చావా? ఈరోజు సాయంత్రం నుంచీ అమ్మకు నాపై దయ తప్పిందని బాధపడుతున్నాను. అది కాదని తెలియచేయటానికి నీవే స్వయంగా వచ్చావా? ఎంత కరుణామయివమ్మా!" అని పరవశించింది.

అమ్మ ఇంటి నాలుగుమూలలా చూచి వంట ఇంట్లోకి వెళ్ళింది. అక్కడ జాడీలమూతలు తీసి పచ్చళ్ళను రుచి చూచింది. ఆ అక్కయ్యకు ఏమి చేయాలో తెలీక కొత్త ఇంట్లో తిరుగుతున్నట్లుగా అమ్మ వెనకాలే తిరుగుతోంది. గిన్నె అడుగున మిగిలివున్న అన్నం, మెంతిమజ్జిగా కలిపి ఆకొన్న దానిలా గబగబా తిన్నది అమ్మ. అది చూచిన ఆ అక్కయ్య గుండెలవిసేలా ఏడ్చింది. దానినే అందరికీ ప్రసాదంగా పంచింది అమ్మ.

పేదలపైన అపారమైన ప్రేమ అమ్మకున్నదన్న సంగతి చదివి విస్తుపోతున్న మాకు ప్రత్యక్షం చేస్తున్నావా అమ్మా? అని ఆ అక్కయ్య పరిపరి విధాల రోధించింది. ఆ అదృష్టవంతురాలు శ్రీమతి లక్కరాజు సీతమ్మ. ఆమె భర్త భట్టిప్రోలులో స్కూలు మాష్టారుగా పనిచేసేవారు. వారి పిల్లలే లాలా, పార్థు, మోహన్ మొదలగువారు. ఆమె కొండముది రామకృష్ణన్నయ్య సహోదరులు.

భట్టిప్రోలునుంచీ పెదపులి పట్టులో అనారోగ్యంతో బాధపడ్తున్నా సోదరి జానకికి తన వాత్సల్య వారాశిలో ముంచెత్తి ఆశీర్వదించింది అమ్మ. తిరిగి వచ్చిన తరువాత రామకృష్ణ అన్నయ్య "పిలవకుండానే వాళ్ళ ఇళ్ళకు వెళ్ళావేమమ్మా!" అని అడిగాడు. "వాళ్ళు రమ్మని పిలిచేదేమున్నది. వాళ్ళ బాధే నన్ను పిలిచింది. బాధకంటే వేరే పిలుపు ఏముంది?" అన్నది అమ్మ.

అమ్మ యొక్క అనురాగ జలధిలో మునకలు వేసిన వారికి మరొకటి

కావాలనిపించకపోవటం సహజం కదా! ఆ దంపతులతో కలిసి హైమాలయం గర్భగుడిలో అభిషేకాలు చేసుకునే అదృష్టం నాకు కలిగింది. అభిషేకాలు చేస్తున్నప్పుడు నీళ్ళకు కొదవ లేదు. ఎక్కువ ఎక్కువగా చేయమంది. దానితో ముగ్గురం బిందెలతోనే అభిషేకం చేసాము. తెచ్చి ఇస్తున్న వాళ్ళు ఇస్తున్నట్లే వున్నారు. నూతిలో నీరు అయిపోయిందా అన్నంతగా అభిషేకాలు చేశాము.

చంద్రమౌళి సీతారామయ్యగారు అమ్మ మేనమామ. అమ్మ దగ్గరకు వచ్చినప్పుడు జ్వరం వచ్చింది. అమ్మ వచ్చి ఆయన్ని చూస్తుందని అనుకుంటున్నారు. అమ్మ పింతల్లి హైమావతిగారు. ఆ హైమావతి గారి కొడుకు ప్రత్తిపాటి అప్పారావుగారు. జిల్లెళ్ళమూడిలో అంతా ఆయన్ని అప్పారావు మామయ్య అని, ఆయన భార్యను సరస్వతత్తయ్య అని పిలుస్తారు.

సరస్వతి బందరులో శ్రీ ఉదయ భీమరాజు గారి కుమార్తె. ఆయన కొడుకును బందరు సూరి అంటారు. ఆయన లాయరు. సరస్వతి చెల్లెలు అరుణ అప్పటికి నిండు గర్భిణి. అమ్మ దర్శనం కోసం వచ్చింది. అమ్మ మేనమామగారు పడుకున్న గదిలోనే అరుణకు ఒక మంచం వేసి, చదువుకోవటానికి ఒక పుస్తకం ఇచ్చారు. ఆ పుస్తకంలో దేవతలంతా సభ తీరి విష్ణుమూర్తి రాక ఎదురు చూస్తున్నారు అని చదువుతోంది.

సీతారామయ్య గారి దగ్గర అప్పారావు మామయ్య, సరస్వతి అత్తయ్య, దత్తు అన్నయ్య కూర్చుని వున్నారు. అమ్మ మేనమామను చూడటానికి వస్తుందని అనుకుంటున్నారు. సరిగా అరుణ చదువుతున్న దానిలో మహావిష్ణువు రాక అని చదువుతుండగా అమ్మ వేంచేసింది. దానితో అరుణకు అమ్మే మహావిష్ణువని నిర్ధారణ అయింది.

మే నెలలో రోహిణీ కార్తె ఎండల్లో అరుణ, కూతుర్ని తీసుకొని జిల్లెళ్ళమూడి వెళ్దామనుకున్నది. వడగాల్పులు ఎటువంటి సమయంలో ప్రయాణమేమిటని అరుణ వాళ్ళ రాజుఅన్నయ్య వాళ్ళు వద్దన్నారు. ఎంతో ఆర్తిగా వెళ్దామనుకున్నా అంతా అలా అనటంతో వూరుకుంది. మర్నాడు ప్రొద్దున్న పనిమనిషి రాకపోతే

గిన్నెలు తోముకుంటోంది. ఇంతలో వర్షం మొదలైంది. దేశం చల్లబడ్డది. మనం ఎండ అని కదా! వద్దనుకున్నాం. ఎలాగూ చల్లబడ్డది కాబట్టి గుంటూరులో సరస్వతి అక్కయ్య వాళ్ళింటికి వెళ్ళి మర్నాడు జిల్లెళ్ళమూడి వెళ్దామని నిశ్చయించుకున్నారు.

వీళ్ళు బందర్లో వుంటారు. వీళ్ళు జిల్లెళ్ళమూడి వెళ్ళి వచ్చేవరకూ మబ్బుపట్టి, ఎటువంటి ఇబ్బందీ లేకుండా అమ్మ దర్శనం చేసుకువచ్చారు. "నమ్మిన వారికి నమ్మినంత" అన్న నానుడి ఉంది కదా! వాళ్ళ ఆర్తి తెలిసే అమ్మ ఆరెండు రోజులు మబ్బుపట్టి చల్లగా ఉండేటట్లు చేసింది. వీళ్ళు బందరు తిరిగి వచ్చాక ఎండలు, వడగాల్పులు మామూలే అయినాయి. అమ్మకు ప్రకృతి మీద అధికారం వున్నదనటానికి ఇలాంటివి అమ్మ జీవితకాలంలో, తదనంతరం కూడా కోకొల్లలుగా జరుగుతూనే వున్నాయి. అమ్మ బిడ్డలందరికీ ఇటువంటివి అనుభవైకవేద్యమే!

అమ్మకు 50 సం॥లు నిండిన సందర్భంగా స్వర్ణోత్సవంకు ఏమి చేయమంటావమ్మా! అని అడిగినప్పుడు లక్షమందికి తగ్గకుండా తన సంతానం ఒకే పంక్తిన భోజనం చేయాలని, అందరూ బంతులుదీరి భోజనం చేస్తుండగా వారి కన్నులలో ప్రభాసమానమయ్యే తృప్తినీ, దీప్తినీ తాను తనివి తీరా దర్శించాలని తన కోరికను వెలిబుచ్చింది. ఎంత తియ్యటి కోరిక, ఆ కోరికలో ఎంత మధురమైన మమత. అ మమతే అమ్మలోని ప్రత్యేకత. ఆ అవధులులేని అవ్యాజమైన మమతకే అందరూ ఆకర్షితులమవటమే కాక ఆరాధకులు అయినారు.

అమ్మ కోరిక విన్న అందరికీ ఆశ్చర్యం కలగటమే కాదు ఇది తీరే కోరికేనా అని సందేహం కలిగింది. ఇది జరగదు అనిపించింది. అటువంటి సంఘటన చరిత్రలో ఇంతవరకూ లేదు. లక్షలాది జనం ఒకచోట సమావేశం కావచ్చును గాని లక్ష మంది ఒకే పంక్తిన సర్వవిభేదాలు మరిచి భోజనం చేయటం అన్నది అపూర్వ విషయమే కాదు. మానవ మేధకు అతీతమైన విషయం.

అమ్మ మాట శిరోధార్యం కనుక శ్రీవిశ్వజననీ పరిషత్ పక్షాన నవంబరు 13వ తేదీన పర్యటన ప్రారంభించారు. మరి అందుకు లక్షల రూపాయల ఖర్చు

ఉన్నది కదా! కానీ వారితో పాటే ప్రత్యేకాంధ్రోద్యమమూ ప్రారంభమయింది. ఆ ఉద్యమం ఆగిన తరువాత కొనసాగించవచ్చుననే ఉద్దేశం వాళ్ళ ఉత్సాహంపై చన్నీళ్ళు చిలికింది. కానీ "యీ ఉద్యమం మీతోపాటే సమాంతరంగా నడుస్తోంది. అది సమసిన తరువాత మీ ప్రయత్నాలు సాగిద్దామంటే వ్యవధి చాలదు" అని అమ్మ సూచించింది.

అమ్మ స్వర్ణోత్సవం 1973 ఏప్రియల్ 12న జరపాలని అందరి అభిమతం. దానికి అమ్మ ప్రవచించిన నూతన ఆధ్యాత్మిక సందేశప్రాభవాన్నీ, అధునాతన విప్లవాత్మక సిద్ధాంత వైభవాన్నీ విశృంఖుల పథగాములై వికలు మనస్కులై విశీర్ణల హృదయులై శాంతి దరిద్రులై పరితపించే ప్రజాకోటికి అందించే పవిత్రాశయంతో ఒక బృహత్తర కార్యక్రమం రూపొందించారు.

ఈ కార్యక్రమంలో ఒక అంశంగానే అనేక పట్టణాలలో అమ్మ స్వర్ణోత్సవాలు అతి వైభవంగా జరిగాయి. ఆ ఉత్సవాలలో ప్రసిద్ధులైన పండితులు అమ్మ అనుపమ హృదయాన్నీ, తదపార వైశాల్యాన్నీ అనంతగాంభీర్యాన్నీ, కుసుమ మార్దవాన్నీ, వజ్రకాఠిన్యాన్నీ అర్థం చేసుకున్న వారు, అధ్యయనం చేస్తున్నవారు, పరిశీలిస్తున్నవారు, ఫలితాలు పొందుతున్న వారు, పరీక్షిస్తున్న వారు, పరాజితులవుతున్న వారు, ప్రయోగాలు చేస్తున్నవారు, ప్రయోజనాలు పొందుతున్నవారు అందరూ అమ్మను గురించి, అమ్మలోని అసామాన్య ప్రతిభ గురించీ, అలౌకిక ప్రజ్ఞను గురించీ, అనన్య మహిమల గురించి మాతృత్వ దివ్యసౌరభాలను గురించీ ప్రవచించారు.

పూర్తిగా 5 నెలలు ఆహోరాత్రులూ నిర్విరామంగా పర్యటించారు. అనేక స్థలాల్లో సభలు, సమావేశాలు జరిపారు. పలుతావుల అమ్మ చిత్రప్రదర్శన జరిపారు. 144వ సెక్షనులయినా, కర్ఫ్యూలున్నా, తుపాకీ కాల్పుల్లోనూ మొక్కవోని ధైర్యసాహసాలతో పురోగమించారు. కొన్ని చోట్ల కొందరు మాత్రమే హేళన చేసినా, విమర్శించినా ఎందరెందరో అభినందించారు. ఉత్సాహపరిచారు, చేయుతనిచ్చారు, డబ్బులు వసూలు చేయచ్చు, లక్షమందికి భోజనం పెట్టవచ్చు, కానీ మారుమూలనున్న కుగ్రామానికి లక్షమంది రావచ్చును గానీ, లక్షమందికి

భోజనం పెట్టటం సామాన్య విషయమా! అని మరి కొందరు సంశయం వ్యక్తం చేసారు.

అమ్మ అవతారమే విశేషమైనది, అమ్మ జీవితచరిత్రలో ఏపుట చూచిన అసామాన్య ఘటనలే కనిపిస్తాయి. లక్షమంది అన్నప్పుడల్లా అమ్మ లక్షలనే సవరించింది. అప్పుడు ఆ మాటకు ఎవ్వరూ అంతగా ప్రాధాన్యమివ్వలేదు. కారణం లక్షమంది అయినా వస్తారా అనీ, వచ్చినా ఏర్పాట్లు చేయగలమా! అని సంశయిస్తూ వచ్చారు. స్వర్ణోత్సవానికి ముందురోజు ఎందరికి వంట చేయాలన్న ఆలోచన వచ్చింది, అమ్మ "లక్షకు చేయండి" అన్నది. కార్యకర్తల సంశయాన్ని చూచి అమ్మ, లక్ష మంది మనుషులే వుండాలని ఏముంది? మనుషులు వచ్చినంత మటుకూ పెట్టండి. మిగిలింది పక్షులకో, పశువులకో, జలచరాకో పెట్టండి. వాటికీ పండుగే కదా! అన్నది. ఆ మాట విన్న కార్యకర్తలకు ఆనందంతో, సిగ్గుతో కళ్ళు చెమ్మగిల్లాయి.

సూర్యోదయానికి ముందు నుంచే జనం అసంఖ్యాకంగా మూలమూలల నుంచీ వచ్చారు. పసిపిల్లల్ని చంకెత్తుకున్న తల్లులు, తండ్రుల చిటికిని వేలు పట్టుకొని తప్పటడుగులు వేసే చిన్నారి పాపలు, నడుంవంగి కర్ర ఊతతో త్రోటుపడుతూ నడిచే వయోవృద్ధులు. ఎండనక వాననక మున్నూట అరవై రోజులూ కష్టపడే రైతులు కాయకష్టం చేసి కండ కరిగించే కార్మికులు, రెక్కాడితేకానీ డొక్కాడని బడుగుజీవులు, జీవనం కొరకు ఎక్కడెక్కడో ఉద్యోగస్తులు, విమానంలో తప్ప ప్రయాణం చేయని వ్యాపారస్తులూ, ఎండకన్నెరుగని శ్రీమంతులు, ఎయిర్ కండిషన్ గదులు వదిలిరాని భాగ్యవంతులు, రాజకీయాల్లో మునిగి తేలుతున్న ప్రజాప్రతినిధులు, దేశనాయకులు, సత్యాన్వేషణకు జీవితాలు అంకితం చేసిన జ్ఞానవృద్ధులు సర్వసంగపరిత్యాగం చేసి ఆత్మ సాక్షాత్కారం పొందిన ఆధ్యాత్మికులు. ఒకరేమిటి ఆ బాలగోపాలం, కులమత వర్గలింగ భేదం లేక ఏప్రిల్ 12వ తేదీ తొలిఘడియల నుంచి అమ్మ నివసించే పుణ్యస్థలి జిల్లెళ్ళమూడికి తరలివచ్చారు.

12వ తేదీ ఉదయం 11గంటలకే జనం లక్షకుపైగా వచ్చారు. అప్పటి నుండీ నిమషనిమషానికి జనం బస్సులలోనూ, కార్లలోనూ, ట్రాక్టర్లలోనూ, ఎద్దుల బండీలలో, నడిచి రావటమే కాక నేలయినిందా అన్నట్లు ఎక్కడిక్కడే జనం సముద్రం పొంగినట్లు పొంగుతున్నారు. ఆ జన సందోహాన్ని చూచి ఉన్న బియ్యం చాలవని భయపడి బాపట్ల నుండీ ఒకలారీ బియ్యం తీసుకు రావటానికి అన్ని ప్రయత్నాలూ చేసి అమ్మ వద్దకు వెళ్ళి విన్నవించారు. అప్పుడు అమ్మ చిరునవ్వుతో "జనాన్ని చూచి సరుకులు తెప్పించటం మొదలు పెడితే మీరేం ఉత్సవం చేయగలరు? ఏమీ అవసరం లేదు. నేను స్నానం చేసి బయలుదేరి పందిళ్ళలోకి వస్తాను. మీరు ఆ ప్రయత్నాలు చూడండి, బాపట్ల పోనవసరం లేదు అని ఉద్ఘాటించింది. ధైర్యంగా ఎవరి పనులకై వాళ్ళు వెళ్ళారు.

70 ఎకరాలలో విశాలమైన యాభైపందిళ్ళు, ఒక్కొక్క పందిట్లో 2వేలమంది జనం, ప్రతి 8వేలమందికి ఒక వంటశాల, మొత్తం 13 వంటశాలలు, ఆ వంటశాలలకు కావలసిన వంటసామాగ్రి, వంటచెరకు, వంటసామాను, ఏర్పాటు చేయబడ్డాయి. బెజవాడ, గుంటూరు, తెనాలి, ఈవూరు ఆవూరు నేమిటి అన్ని వూర్ల నుంచీ, ఎన్నో పట్టణాలనుంచీ ఏర్పాటు చేయబడ్డాయి. ఒకే ఒకచెరువు కలిగిన కుగ్రామం జిల్లెళ్ళమూడి. ఆ చెరువు నుంచీ నీటిని మోటార్ ద్వారా నీటిని పంప్‌చేయించారు. ఆ నీటిని క్లోరినేషన్ చేసారు. వంటలు తెల్లవారు ఝుమునుంచే ఆరంభించారు. వంటచేయటం అంతా ఒక ఎత్తు, ఒకే పంక్తిన కూర్చున్న లక్షలమందికి కాలయాపన లేకుండా వడ్డన చేసారు.

లక్షమంది ఒకే పంక్తిన భోజనం చేస్తారంటే యీ అపూర్వదృశ్యాన్ని చూడటానికి మరో లక్షమంది వచ్చారు. ఈ ప్రజావాహినిని అదుపులో ఉంచటానికి ఎంత బలగం, ఎంత బందోబస్తు కావాలి? అన్ని విద్యాలయాలనుండీ 1000 మందికి పైగా బాలభటులు, అనేక పట్టణాల నుండీ స్వచ్ఛంద సేవకులు ఈ మహోత్సవంలో పాల్గొని అమ్మ కృపకు పాత్రులైనారు. పోలీసుసిబ్బంది ఎంతో జాగ్రత్తగాను, కడునేర్పుగాను వ్యవహరించి ఏ ప్రమాదాలు కలుగకుండా తమ బాధ్యతను నిర్వహించి అమ్మ అనుగ్రహానికి పాత్రులైనారు.

మహాప్రజానీకానికి అనేక వసతులు కల్పించారు. వాటి వివరాలు ప్రజలకు అందించాలని విచారణ కార్యాలయాన్ని ఏర్పాటు చేసారు. ఈ మహా సంరంభంలో ఏ క్షణంలోనైనా ఏ అంటువ్యాధి అయినా వ్యాపించే ప్రమాదం కలుగకుండా తాత్కాలిక వైద్యాలయం ఏర్పాటు చేయబడింది.

అమ్మ చల్లని చూపుతో తడిసే ఈ ప్రదేశంలో ఏ అగ్ని ప్రమాదం జరగదని అందరికీ తెలుసు, అయినా ఎవరి బాధ్యత వారిది. అగ్ని మాపకదళం వారు సర్వసన్నద్ధులై ఉన్నారు. ఎన్ని ప్రాంతాల నుండో, ఎంతదూరం నుండో ఉరుకుల, పరుగులతో వస్తున్నారు. అలసట చెందిన కారులు బారులు తీరి సేద తీరుతున్నాయి. స్టేట్ ఆర్.టి.సి. వారు రాష్ట్రంలోని అన్ని మూలల నుండీ జిల్లెళ్ళమూడికి అసంఖ్యాకంగా బస్సులు నడిపి, యాత్రికులకు మహోపకారం చేసి అమ్మ సేవలో పాలు పంచుకున్నారు. క్యాంటినులు, కొబ్బరికాయలు పండ్లూ, పూలు, అమ్మ ఫోటోలు, సాహిత్యం దొరికే విక్రయశాలలు, ఏర్పాటు చేయబడ్డాయి.

అట్టలపై అమ్మ నామాలు
అంతరంగాల్లో నమోవాకాలు.

లక్షమందికి ఒకేసారి వంట చేయాలంటే వంట వాళ్ళు అన్ని జిల్లాల నుండీ వచ్చి మహాయజ్ఞంలో పాలు పంచుకున్నారు. ఆనాటి భారీ ఏర్పాట్లలో పాల సేకరణ ఒకటి. పదివేల లీటర్ల పాలు, వాటిని కాచి తోడుపెట్టి మజ్జిగ చేయాలి. అదేమైనా సామాన్య విషయమా?

"ఉదయమిదే మాతృశ్రీ స్వర్ణోత్సవ మహోదయమిదే
ఇటు జనములు, అటు జనములుట ఎటు చూసిన యోజనములు
జనగణముల భోజనములు జననికి నీరాజనములు
అన్నదాతా సుఖీభవా అనసూయమాతా జయీభవా"

"ఆకలేసి కేకలేసినారెందరొ తొల్లి
ఆకులేసి కేక వేసె ఈ అందరి తల్లి" అంటూ అమరగానాన్ని అందించారు నదీరా బృందం వారు.

పందిళ్ళలో ఒకేపంక్తిన ఆసీనులైన లక్షలమందికి వడ్డన జరిగింది. "జయహో మాతాశ్రీ అనసూయారాజరాజేశ్వరి శ్రీపరాత్పరి అన్న అమ్మనామం అందరినోటా మార్మోగింది. అన్నపూర్ణేశ్వరి అనసూయా మహాదేవికి జై అంటూ జయ జయధ్వానాలు మిన్ను ముట్టాయి. అంతా ప్రసాదం స్వీకరిస్తున్నారు.

కార్యకర్తల ఊహలకు, అంచనాలకూ మించి ప్రజలు లక్షలలో వచ్చారు. అందరూ భక్తితో, ఆసక్తితో, క్రమశిక్షణతో నీడలు పరిచిన తాటాకు పందిళ్ళలో, షామియానాలలో బంతులు దీరికూర్చున్నారు. మొదటి బంతిలోనే లక్షాఏభై వేలమంది అమ్మ ప్రసాదాన్ని స్వీకరించారు. ఎక్కడ ఏ రాశిలో ఎన్నెన్ని పళ్ళాలతో, పళ్ళికలతో అన్నం తీసినా రాసులు తరగక పొవటం చూసిన వాళ్ళు అనేకులు వున్నారు. "అటువంటి సంఘటనలను స్వయంగా వీక్షించిన అదృష్టశాలిని, ఆరోజు వడ్డనలో పాల్గొన్న భాగ్యశాలిని నేను".

కొందరు అమ్మ పై భక్తి, ప్రేమలతో కాకపోయినా ఉత్సవం ఎలా జరుగుతుందో చూద్దామని వచ్చిన వాళ్ళూ వున్నారు. అందులో ఒకరు మట్టిపూడి వాస్తవ్యులు శ్రీ సుందరరామ రాజుగారు, వారు "ఇంతవరకూ అమ్మ మహిమలు, అన్నపురాసి పెరగటం విన్నానే కానీ, నిన్న వాటిని ప్రత్యక్షంగా చూశాను" అని అంటుండగానే వారి శరీరం గగుర్పొడిచింది. వెంటనే నిక్కబొడుచుకున్న రోమాలను చూపిస్తు "నాకు మామూలుగా శరీరం గగుర్పొడవదు. కానీ ఆ విషయం తలుచుకుంటేనే రోమాంచయము కల్గుతుంది" అన్నారు.

అవతారమూర్తి, అనురాగమూర్తి అయిన అమ్మనీల వర్ణపు కంచిపట్టు చీరా ధరించి ముక్కునబులాకీ, రెండు చేతులకూ నిండుగా గాజులు, భ్రుకటిపై ఎఱ్ఱని గుండ్రని పెద్దకుంకుమబొట్టు, సర్వాలంకారశోభిత అయిన అమ్మజీపులో బంతుల మధ్య వచ్చి భక్తిశ్రద్ధలతో ఒక పంక్తిలో భోజనం చేస్తున్న లక్షలమంది కన్నులలోని తృప్తిని చూసిన అమ్మ పున్నమి నాటి చందమామగా భాసించింది. అన్నపూర్ణేశ్వరి అమ్మ విశాలనేత్రాలతో ఆనందజోత్నలు, ఆనందరూపిణి అమ్మ అధరాల మీద చిరుహాసం.

ఈ ఉత్సవంలో అన్ని కులాల వారే కాక, అన్ని మతాలవారు స్వచ్ఛందంగా పాల్గొనటం ముదావహం. క్రైస్తవులు, మహమ్మదీయులు తమ సొంత ఇంట్లో పండుగలాగ శ్రమించారు. ముఖ్యంగా వడ్డన పళ్ళాలతో వారిని చూస్తుంటే సమసమాజకెక్కడో లేదు. జిల్లెళ్ళమూడిలోనే వుందనిపించింది. ఈ ఉత్సవంలో అమ్మ మహిమ అడుగడుగున ద్యోతకమవుతూనే వుంది. అన్ని సమయాల్లో, అన్ని విషయాల్లో తగిన సలహాలను, సూచనలను, ఆదేశాలిస్తూ తానే స్వయంగా మన ద్వారా ఈ ఉత్సవాన్ని జరిపించుకున్నదా! అనిపించింది. అమ్మకు ఎంతసేపూ మన భోజనాల గురించే కదా! తాపత్రయం.

వచ్చిన అందరికీ కాకపోయినా తరుచూ అమ్మ బట్టలు పెడ్తుండేది. వచ్చిన ప్రతివారికి భోజనంతో పాటు బట్టలు పెట్టాలన్న కోరిక వెలిబుచ్చుతుంటే అమ్మ యొక్క విశ్వ మాతృత్వానికి ఆశ్చర్యపోయాము. ఆ మాట అంటున్న అమ్మ వదన మండలంలోని జోత్స్నలను చూస్తూ పరవశులయ్యాము.

ఆనాడు మాగాణి భూముల్లో వేయబడిన అందమయిన విశాలయిన పందిళ్ళల్లో భోజనాలు, బంతుల మధ్యకు అమ్మ జీపులో తిరుగాడు తున్నప్పుడు ఆ ముఖంలోని ఆ ఆనందము, ఆ దీప్తి దర్శించి తన్మయులయిన ప్రజలకు "అమ్మ అన్నపూర్ణయా? ఆనందస్వరూపిణియా"? అన్న విచికిత్స కలిగింది.

గులాబీల గజమాలతో అమ్మను అలంకరించారు. అందరిదృష్టులు అమ్మ మీద అమ్మ దృష్టులు అందరిమీద. అమ్మను స్వర్ణకిరీటంతో అలంకరించారు. అందరిలో అమ్మదైవత్వాన్ని చూసింది. భిన్నత్వంలో ఏకత్వం దర్శించింది. అమ్మలో అందరూ దైవత్వం కాంచారు. ఏకాత్వంలో భిన్నత్వం గోచరించింది. అవతారమూర్తి శ్రీకృష్ణ పరమాత్మగా, ఆరాధ్యదైవం శ్రీరామచంద్రనిగా, ఏసుకీస్తుగా క్రీస్తుని కన్న మేరీమాతగ, మహ్మద్‌ప్రవక్తగా, జగన్మాతగా, రాజరాజేశ్వరిగా, విశాలక్షిగా ఎవరి ఇష్టదైవంగా వరికి, ఎవరుకోరిన విధంగా వారికి ఆరోజు అమ్మ దివ్యదర్శనాన్ని ప్రసాదించింది.

ఎందరు తిన్నాతరగని అనపురాశిని ఏమిచేయమంటావని అమ్మను

అడిగారు. బిడ్డలంటే నాదృష్టిలో జీవరాసులన్నీ కూడా పశువులకు, పక్షులకు పెట్టండి మిగిలింది డ్రైన్‌లో కలపమంది. అంతా 3 లక్షల మంది పెచిలుకే భోజనం చేసారని అనుకుంటుంటే నా దృష్టిలో కోటి జీవరాశికి అందిందని తెలియచేసింది.

అత్యద్భుతం, అపూర్వం అయిన ఈ మహాయోగం జరిగిన తీరును చూచిన ప్రజలు మాత్రం ఇది అమ్మ అనంతశక్తికి నిదర్శనమనుకుంటూ ఆశ్చర్యాన్ని ఆనందాన్ని పొందారు. హైద్రాబాద్ సోదరుల పక్షాన అమ్మకు సావనీర్ సమర్పించబడింది.

అమెరికాలోని జార్జియా రాష్ట్రంలోని, అట్లాంటాకు చెందిన మార్వా అనే యువతి 1000 జనభాగాల కుగ్రామమైన జిల్లెళ్ళమూడి పనిగట్టు మరీ వచ్చింది. అమ్మను చూచి నాలుగురోజులుండి వెళ్ళాలనుకుంది. అమ్మ దగ్గరకు వచ్చి 2 నెలలుపైన వుండి అమ్మను వదలలేక శోకభారంతో టెలిగ్రామ్‌ల మీద టెలిగ్రామ్‌లు అమెరికా నుండి రావటంతో విధిలేక బలవంతాన తిరిగి వెళ్ళింది. అమ్మ ఫోటోను అట్లాంటాలో ఒక విద్యార్థిదగ్గర చూచింది. తాను అక్కడికి వెళ్ళినప్పుడల్లా ఆ ఫోటోను చూచేది. ఒకమారు మార్వాను చూసి అమ్మ నవ్వింది. అనేక హిందూ దేవతల రూపాలతో కన్పించింది. ఇదంతా ఆ ఫోటోద్వారానే అమ్మ దర్శనమిచ్చింది. దానితో అమ్మను దర్శించాలని ఆ సీమ నుండి ఈ సీమకు తరలివచ్చింది. వేష భాషలు మన హిందూ సాంప్రదాయసారంగా మార్చుకుంది. మన తిండికి అలవాటు పడింది అమ్మ సాన్నిధ్యం ఎంతటివారినైనా ఎలా మార్చగలదో మనం ఊహించగలమా?

అమెరికా వెళ్తూ "అమ్మా నేను కొన్ని నెలలు ఉద్యోగం చేసి కొంత డబ్బు సంపాదించి ఆ పైకంతో నీకు కారు పంపమంటే పంపుతానని, లేకపోతే నేను మళ్ళీ వచ్చి నీ దగ్గర కొంతకాలం గడుపుతానని తన కోరికను వెలిబుచ్చింది. కారు రావల్సినపుడు అదే వస్తుంది. నీవు రావటమే నాకు ముఖ్యమని అమ్మ చెప్పింది. అమ్మ యొక్క వాత్సల్యాంభోనిధిలో మునకలు వేసిన మార్వా ఎంత అదృష్టవంతురాలో కదా!

మొసలికంటి తిరుమలరావుగారు ఎమ్.పి.గా ఢిల్లీలో నివసించేవారు. అమ్మ యొక్క నిర్లిప్త హృదయము, ఉదాసీనత, తటస్థ విధానం మొట్టమొదట అర్థం చేసుకోవటం ఎవరికైనా కష్టమే. శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు కూడా ఆ కష్టం నుండీ మినహాయింపుకాలేదు. అమ్మ వ్యక్తికిచ్చే స్వేచ్ఛను, ప్రాధాన్యాన్ని చూసి ఆయన ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొంది అమ్మకు వ్యక్తం చేసుకున్నారు. అందరి భావనలకు, అందరి క్రియలకు ప్రేరణకర్త ఒక్కడే. అందుకే అమ్మ ఎవరేదన్నా సరే అంటుంది. అందుకనే "అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదు" అంటుంది అమ్మ. ఆ వివరణ విని అమ్మ సందేశంలోని కావ్యగుణానికి వారు మురిసిపోయారు.

తనదేమీ లేదని అంతా వాడిదేనని మనసా, వాచా, కర్మణా, నమ్మి వాడికి సర్వార్పణ చేసి తాను ఏమి చేసినా వారి ఆజ్ఞానుసారమేనని భావిస్తూ తాను బాధ్యతా రహితుడు కావడమే నిజమైన స్వాతంత్ర్యం అని అమ్మ ఇచ్చిన అపూర్వమైన నిర్వచనం తిరుమలరావు గారి జీవితంలో కాంతిపుంజాన్ని ప్రసరించింది. వారి హృదయాకాశంలో ధృవతార అయింది.

తిరుమలరావుగారు అమ్మ కాళ్ళు పిసుకుతూ "అమ్మా! నెహ్రూగారు ఉన్నంత వరకు బాగానే జరిగింది. ఇదే విధంగా నా జీవితం వెళ్లిపోవాలని కోరుకున్నారు. ఆ తరువాత ఇందిరాగాంధీ కూడా ఎంతో గౌరవంగా చూచి ఎస్టిమేట్ కమిటీ చైర్మన్‌గా ఆయన్ని నియమించింది. దేశంలోని అనిశ్చిత స్థితికి, కల్లోలిత పరిస్థితులకు వారు అమితంగా బాధపడుతూ తన హృదయ సంక్షోభాన్ని అమ్మకు నివేదించుకొనేవారు. అమ్మ వాగామృత సూచనతో పరితృప్తులై మనశ్శాంతి పొందేవారు.

తరువాత తిరుమలరావుగారిని అమితంగా ఆకర్షించింది - అమ్మ అతిలోక సుందర చరణ సుమపరాగ పరిమళాలతో పరిపూరితమయిన ఆ దివ్య వ్యవస్థ, అందరి నిత్యనివాసులైన సోదరీ సోదరులూ, కులమత వర్గవర్ణ విచక్షణా రహితమై దీపించే వారి సర్వ సౌభ్రాతృత్వ భావమూ, వారి అకలంక స్నేహశీల భాసురమయిన మహితానుబంధమూ, వారి జీవన విధానంలోనూ, వారి అనుక్షణ

కార్యాచరణలోనూ అంతస్స్రోతమైన మహోన్నత వేదాంత సారమూ వారిని పులకితాంగులను చేయటమే కాదు, వారిని దివ్యావేశ భరితులను చేసి వారికి కొత్త లోకాన్ని చూపి, కొత్త పాఠాలను గఱపి, కొత్త రక్తాన్ని ఎక్కించి, వారికి కొత్త జీవితాన్నే ప్రసాదించింది.

అందుకనే వారు అంతదూరం అనగా - డిల్లీ నుండి జిల్లెళ్ళమూడికి తరుచుగా రెక్కలు కట్టుకు వాలేవారు. ఆ సన్నిధిలో వారు అనన్య లభ్యమయిన ఆనందమూ ఆత్మశాంతీ అనుభవించేవారు. కనుకనే వారు జిల్లెళ్ళమూడిలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని కృతనిశ్చయమయినారు. అందుకు ఎన్నో కలలు గన్నారు. అక్కడ జరిగే ఎన్నో కార్యకలాపాలకు తాను ఎన్నోవిధాల చేయూత నివ్వాలని సంభావించారు. అక్కడ నిర్మితమవుతున్న రమణీయ సహస్ర స్తంభమందిరంలో తానూ ఒక స్తంభం కావాలని ఆకాంక్షించారు.

తిరుమలరావు గారు అమ్మను మనఃపూర్తిగా విశ్వసించారు. సహస్ర విధాల అమ్మకు సేవ చేయాలని గాఢ నిశ్చయం చేసుకున్నారు. అందుకనే తుది క్షణాలల్లోనూ, 'అమ్మతప్ప నాకెవరున్నారూ? అంటూ నవంబరు 29న కన్నుమూసి అమ్మలో సంలీనమై శాశ్వత శాంతి పొందారు.

బొప్పిడి రామబ్రహ్మంగారు ఆంధ్రాబ్యాంక్ ఉద్యోగి. మొదటిసారిగా ఏలూరు అప్పారావన్నయ్య అమ్మ దగ్గరకు తీసుకువెళ్ళారు. జిడ్డు ప్రసాదన్నయ్య కటక్‌లో వుండగా రామబ్రహ్మంగారికి అమ్మ గురించి తెలియచేసారు. స్వర్ణోత్సవాల గురించి ప్రచురించిన మాతృశ్రీని చదివారు. రామబ్రహ్మంగారు, జిడ్డు ప్రసాద్ అన్నయ్య అమ్మ దగ్గరకు వెళ్లినపుడు "ఏమిటిరా! రామబ్రహ్మాన్ని ఊదరకొడ్తున్నావని" అమ్మ అడిగింది.

రామబ్రహ్మంగారికి కటక్‌నుంచి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది. ఏలూరులో మాతృశ్రీ అధ్యయన పరిషత్ బాగా పనిచేస్తోందని తెలుసుకొని దానికోసం వెతకటం మొదలుపెట్టారు. సరిగ్గా రైస్‌మిల్లులో అప్పారావన్నయ్య కలిసారు. ఏలూరులో ప్రతి ఆదివారం పూజ, సత్సంగం జరిగేవి. రామబ్రహ్మంగారు వాళ్ళ నాన్నగారి దగ్గర పర్మిషన్ తీసుకొని అమ్మను చూడటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళాలనుకున్నారు.

జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి "నేను జ్ఞానార్థినా, అర్థారిర్థినా, లేక జిజ్ఞాసతో వెళ్తున్నానా?" అని అన్నయ్య తనని తానే ప్రశ్నించుకున్నారు. నా అనుభవంతోనే నేను వెళ్ళాలనుకుంటున్నానని" నిర్ణయించుకున్నారు. అప్పారావన్నయ్యతో కలిసి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అన్నయ్య రామనామం ఎక్కువగా చేసేవారు. "అమ్మ దేవుడు అయితే రాముడిలా ఒక చేత్తో అభయ ముద్రా, ఒక చేత్తో కోదండం పట్టుకున్నట్లు ముద్రలు చూపించాలి. అప్పుడే తనకు నమ్మకం కలుగుతుందని" అనుకున్నారు.

అమ్మ అన్నయ్యకు సరిగా ఆ ముద్రలతోనే దర్శనమిచ్చింది. దానితో ఆయనంతట ఆయనే అమ్మ దగ్గరకు వెళ్ళి పాదాక్రాంతులయ్యి అమ్మకు తాను సర్వసమర్పణ గావించుకున్నారు. ఒకమారు ఏలూరు నుంచీ వస్తుంటే రైల్లో చాలా రష్‌గా వుంది. ఆడవారిని కూర్చోబెట్టి ఆయన ఒక మిలట్రీ ఉద్యోగి కాళ్ళ దగ్గర కూర్చున్నారు. అతను సాలా అన్ని రెండుమార్లు అన్నాడు. 3వ మారు అలా అనేటప్పటికి చాచి లెంపకాయ కొట్టాడు అన్నయ్య. చుట్టూ ఎంతో మంది మిలిట్రీ వాళ్ళు వున్నా ఎవరూ ఆయన్ని ఏమీ అనలేదు. ఆయన్ని ఆపారు. ఆయన అమ్మ దగ్గరకు వచ్చి "అమ్మా! ఉదయం" అని చెప్పబోతుండగా "అనరాని మాటలు అంటుంటే నీవేమి చేస్తావు? చేయవల్సిన పనిని గంధర్వులు చేస్తారని" అమ్మ చెప్పింది. అంటే అమ్మ అన్నయ్యను గంధర్వులతో పోల్చింది.

1976లో లిష్టు వచ్చినా అన్నయ్యకు రావల్సిన ప్రమోషన్ రాలేదు. అన్నయ్య అమ్మను దర్శించుకోవటానికి వెళ్ళారు. ఆయన వెళ్ళిన తరువాత, ముందు తనలో తానుగా అమ్మ "యాధృచ్ఛ లాభ సంతుష్ఠ" అని అనుకుంటూ మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపల్ విఠల రామచంద్రమూర్తిగారిని అర్థం ఏమిటి?" అని అడిగింది. యాధృచ్ఛికంగా జరిగే వాటితో తృప్తిపడమని" చెప్పారు. మర్నాడు ఉదయం ఇంటికి వెళ్తున్నప్పుడు అమ్మ దగ్గర బొట్టు పెట్టించుకోవటానికి అన్నయ్య వెళ్ళారు. మళ్ళీ అమ్మ "యాధృచ్ఛి లాభ సంతుష్ట" అని అన్నది.

ఇంటికి వెళ్ళి భగవద్గీతలో చూస్తే 4వ అధ్యాయంలో 22వ శ్లోకం అది.

ఈలోగా యం.డి. ఫోను చేసి "మీకు ప్రమోషన్ రాకుండా నేనేమీ చేయలేదు. నటరాజన్‌గారు ఆపుచేసారని" చెప్పారు. దానికి అన్నయ్య అమ్మ జరిగినదానితో తృప్తిపడమని చెప్పనే చెప్పింది కదా! అని దాని గురించి ఆలోచించటం మానివేసారు.

రామబ్రహ్మం అన్నయ్య దంపతులు అమ్మ దగ్గరకు వెళ్లి పాదాభివందనం చేసుకున్నారు. అక్కయ్య లేవటానికి ఆలస్యం చేసింది. "నాకు ప్రమోషన్ రావాలని మొక్కావా?" అని హాస్యంగా భార్యను అడిగారు. "అమ్మకు నమస్కరిస్తున్నప్పుడు చేతి వుంగరాన్ని అమ్మ తిప్పింది. ఆజ్ఞ చక్రంలో ఏదో తిప్పుతున్నట్లుగా అనిపించింది" అని అక్కయ్య తెలియచేసింది. క్రిందనున్న సుబ్బారావన్నయ్య "అమ్మ మీ ప్రమోషన్ గురించి ఏమైనా చెప్పిందా?" అని అడిగాడు.

మళ్ళీ ఆదివారం వాళ్ళ సొంత వూరు వెళ్ళారు. వాళ్ల నాన్నగారు "ప్రమోషన్ ఎప్పుడు వస్తుందిరా?" అని అడిగారు. మనకు రావల్సినప్పుడు వస్తుంది". ప్రమోషన్ వస్తే నన్ను భువనేశ్వర్ వేస్తారు. చాలా దూరం కదా? మీరు వుంటారా? అని అన్నారు అన్నయ్య. మేము బాగానే వుంటాము" అని వాళ్ళు అన్నారు. దానికి అన్నయ్య "నెల రోజుల లోపే రావచ్చు" అని చెప్పారు. అలాగే భువనేశ్వర్‌లో రీజనల్ మేనేజర్‌గా వేసారు.

అన్నయ్య మాటలలో "అనురాగాన్ని పంచి, ఆప్యాయతను పెంచి అందరికీ అమ్మగా అనుభూతినిచ్చి మాటలో, చేతలో, ఊహలో భక్తిని, జ్ఞానాన్ని, ఆచరణను అందించి తన రాక ఈ లోకం కోసమేనని చాటి, ముముక్షువులకు, యోగులకు మార్గదర్శియై, జ్ఞానులకు జ్ఞేయమై, ఆదరణకు ఆలవాలమై, అన్నపూర్ణాలయములో ఆరని అఖండ జ్యోతియై, అర్కపురిలో అమ్మగా తన అవతార ధ్యేయాన్ని పరిసమాప్తంగావించి ప్రేమరాశిగా, కరుణామయిగా, మాతృమూర్తిగా వెలిగి ఎందరి హృదయాలనో వెలిగించినవి అమ్మ చరణాలు" అని అంటారు.

కాశీకృష్ణమాచార్యులంతటివారు అమ్మను దర్శించి ముగ్ధులై అమ్మ సాక్షాత్తూ రాజరాజేశ్వరి అన్నారు. కాశీ నుంచీ వచ్చిన ఆత్మానందస్వాములవారు

అమ్మతో సృష్టి - ఆత్మ - జన్మలు పరామార్థిక చింతన, లౌకికం ఈ విషయం మీద చాలాసేపు సంభాషించారు. వారు అడిగిన ప్రశ్నలన్నింటికీ అమ్మ సమాధానం ఇస్తూ "ఇంతకీ విషయం ఒకటే. ఎన్ని తికమకలు పడ్డా సంభాషణ, నడిచేదారులు వేరైనా చివరకు చేరేది, ఆగిపోయేది ఒకేచోటున - ఒకేమాట మీద అంతా ఒకే శక్తిచే నడిపించబడుతోంది. అది నడిపించినట్లు మనం నడుస్తున్నాం" అని అమ్మ విశ్లేషించింది. ఆ స్వాముల వారు వెళ్తూ "ఇది పుణ్యక్షేత్రాలలో కెల్ల గొప్ప క్షేత్రమవుతుందని" ప్రసంశించారు.

రామకృష్ణ అన్నయ్యను సదానంద అని పార్థసారథి అయ్యంగారిని ప్రమాదానంద్ అనిపిలిచేది అమ్మ. పార్ధసారధిగారు తరుచుగా సంస్థని, అందులోని వారిని విమర్శించేవారు. పన్నాల రాధాకృష్ణన్నయ్య రాసిన "అశ్రులహరి" ఆవిష్కరణకు రావాల్సివుంది. అన్నయ్య ఇంకా రాలేదని గోపాలన్నయ్య అమ్మతో చెప్పాడు. దానికి అమ్మ "వాడక్కడ (అప్పికట్లలో) చేస్తూనే వున్నాడు. "అశ్రులహరి" పేరుకు తగ్గపుస్తకం" అని చమత్కరించి వస్తాడులే అన్నది. అలాగే సాయింకాలానికి అన్నయ్య వచ్చాడు. ఇలా అమ్మచతురోక్తులతో, ఛలోక్తులతో అందరినీ పరవశింపచేసేది.

రామలింగేశ్వర అన్నయ్య మొదటిసారిగా మాతృశ్రీలో అమ్మ గురించి చదివి పరవశులై అమ్మ దర్శనార్ధం జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. అప్పటికి అమ్మ చుట్టూ పలుతావుల నుండి వచ్చిన అన్నయ్యలు, అక్కయ్యలు వున్నారు. కొత్తగా వచ్చిన వ్యక్తి అని కాబోలు రామకృష్ణ అన్నయ్య రామలింగేశ్వర అన్నయ్యను ముందుకు వచ్చి కూర్చోమన్నాడు. అమ్మ ముఖం చాలా కాంతివంతంగా ఉన్నది. శరీరచ్ఛాయ రంగులు మారుతున్నది. అమ్మ నుండి చిరుదరహాస చంద్రికలు వెలువడుతున్నాయి. అమ్మకన్నులు అటూ ఇటూ వేగంగా కదుల్తూ అందర్నీ పలుకరిస్తున్నట్లుగా వున్నాయి. నవ్వులో దివ్యత్వం తొణికిస లాడుతున్నది. సందర్శకులు అమ్మ ఉనికిని నిశబ్దంగా ఆస్వాదిస్తున్నారు. అమ్మ కమలాతొనలు వొలిచి గింజలు తీసివారి నోట్లో పెడ్తూంది. అమ్మ మామిడి పండును నాలుగు ప్రక్కలానొక్కి ఇచ్చేది. ఆపండు తింటుంటే ఒకేమారు రసమంతా వచ్చేది అది ఒక మధురానుభూతి.

రక్తమాంసాదులు పంచుకు పుట్టిన బిడ్డలే తల్లి దండ్రులను నిరాకరిస్తున్న ఈ రోజుల్లో అమ్మ వృద్ధులపై ఎంతో వాత్సల్యామృతాన్ని కురిపిస్తున్నది. వారి శిరస్సులపై పూలు చల్లి, వారి ఒడలు నిమిరి, వారి శిరస్సులను స్పృశిస్తూ అమ్మ వారిని ఆరాధిస్తోందా అనిపించేది. అమ్మ దర్శనార్థం వచ్చిన వారిలో అందరికీ అన్నం పెట్టి కొందరికి నూతన వస్త్రాలను బహుకరించేది. వచ్చిన అందరికీ అన్నంతో పాటు, బట్టలు పెట్టాలన్న తన కోరికను వెల్లడించింది. కారులో వచ్చిన వారుంటే వారి కంటే ముందుగా ఆ డ్రైవర్ భోజనం చేసాడో లేదో కనుక్కోమనేది. అట్టి జగన్మాతృత్వం మనకు ఇంక ఎక్కడా కనిపించదు.

మద్రాసు నుంచీ వచ్చిన ఒక అన్నయ్య మంచి పట్టు చీరెను అమ్మకు సమర్పించాడు. రామలింగేశ్వర అన్నయ్య ఒకనూలు చీరె పట్టుకువెళ్లారు. అందుకుని ఆచీరెను ఇవ్వటానికి వెనకాడి, సంచీలో నుంచీ చీరను బయటకు తీయలేదు. ఆయనలోని సంఘర్షణను అమ్మ కనిపెట్టి "బండారులంక" అన్నది. అప్పటికి అన్నయ్య బండారులంక వాడిని, అని ఎవ్వరికీ చెప్పలేదు. ఔను అన్నట్లుగా తల ఊపాడు. అమ్మ తన చేతిలోని పట్టుచీరెను పక్కన పెట్టి అన్నయ్య దగ్గర వున్న సంచీ వంకే చూపుసారించింది. దానితో ధైర్యం పుంజుకొని అమ్మకు ఆ చీరెను సమర్పించాడు.

అది చేతిలోకి తీసుకొని 120 వ నెంబరు చీరె చాలా తేలికగా వుంటుంది. ఏడు గజాల చీరె అన్నది. ఆలివ్‌గ్రీను తనకు చాలా ఇష్టమని చెప్పి, మర్నాడు ఉగాదికి ఆ చీరెకట్టుకుని అన్నయ్యను సంతృప్తి పరిచింది. వ్యాపారస్తులు వారి లెక్కల పుస్తకాలను అమ్మ సంతకానికి ఇచ్చారు. వరంగల్ శేషయ్యలింగం గారి బృందం అమ్మ నామసంకీర్తన చేసారు. అందరికీ అమ్మ వేపపూవు ప్రసాదం పంచింది. ఆ ప్రసాదం లాగానే జీవితంలోని తీపిచేదులను ఆనందంగా అనుభవించమన్నదా అనిపించింది.

అన్నయ్య విజయవాడ నుంచి అన్నపూర్ణాలయంలో వచ్చుడికి ఉపయోగిస్తాయని మినీవాన్‌లో మామిడి కాయలు తీసుకువచ్చాడు. అవి అన్నపూర్ణాలయంలో పెట్టించి, స్నానపానాదులు కావించి, బాగా

పొద్దుపోయినందున అమ్మ దర్శనానికి వెళ్ళలేదు. ఉదయం అమ్మ దర్శనం చేసుకుందామనుకుంటుండగా ఉదయపు పలహారంకు అమ్మపైకి రమ్మన్నారని కబురువచ్చింది. అమ్మ స్వయంగా అన్నయ్యకు ఉప్మా తినిపించింది. తినిపించేది సాక్షాత్తూ రాజరాజేశ్వరి అవటంతో ఎంత తింటున్నాడో, ఎంతసేపు తింటున్నాడో ఆలోచనలేక ఆనంద సాగరంలో మునిగిపోయాడు. దాదాపు 45 ని॥లు అమ్మ చేతి ప్రసాదం స్వీకరించాడు. సరిగా 15 సం॥ల క్రితం శ్రీరామనవమినాడు రాత్రి 9గం॥లకు ఇదే విధంగా తినిపించానని అమ్మ గుర్తు చేసింది. మే 19వ తారీఖు అవటం సరిగా అదే రోజు నేను పంపిన అమ్మ పుస్తకాలు అందటం అమ్మ అనుగ్రహమే కారణమని అన్నయ్య అభిప్రాయం. అమ్మతో గడిపిన మధురక్షణాలను స్మృతిపథంలోకి తెచ్చుకొని వానిని నెమరువేసుకుంటూ అమ్మ జ్ఞాపకాలతో గడుపుతున్న ధన్యజీవి రామలింగేశ్వర అన్నయ్య.

సీతాపతిగారి రెండవ భార్య సంతానం నరసింహారావు మామయ్య ఆయన బిలాస్‌పూర్‌లో రైల్వే ఉద్యోగి. ఆయనకు అన్నంరాజు రామకృష్ణన్నయ్య కూతురు శేషునిచ్చి అమ్మ వైభవంగా మే 5న వివాహం జరిపించింది. ఆ దంపతులకు అమ్మ అంటే ఎనలేని భక్తి ప్రపత్తులు. వారికి ఒక ఆడపిల్ల. ముగ్గురు మగపిల్లలు.

ఒకమారు సెలవులై బాపట్ల నుంచీ బిలాస్‌పూర్ వెళ్తున్నారు. వారబ్బాయి విద్యకు జ్వరం ఎక్కువగా ఉంది. ఆ జ్వరంలో రైలు పడిపోతోంది. అమ్మా, నాన్న చనిపోతున్నారు. రైల్లో అందరం చచ్చిపోతాం అని ఆ 8 సం॥ర పిల్లవాడు కలవరించాడు. పావుగంట సేపు ఏమి చెయ్యాలో తెలీక మధనపడ్డారు. అమ్మ కుంకుమ పెడితే బాగుంటుందని సామానంతా వెతికినా కనపడలేదు. వాళ్ళు వచ్చేటప్పుడు శేషును కొంగుపట్టమని కుంకుమ పొట్లాలు పోసింది అమ్మ. వాటికోసం ఎంతవెతికినా కనిపించలేదు. చివరకు పర్సులో బాగా నలిగిపోయిన కుంకుమ పొట్లాంలో ఒకరికి మాత్రమే సరిపోయే కుంకుమ ఉంది. దానినే బొట్టు పెట్టి ఉత్త కాగితాన్నే వాడి నాలుకకు రాసింది. పాస్‌కు వెళ్ళొచ్చిన తరువాత చెమటలు పట్టి అరగంట సేపు స్పృహ లేనివాడు కళ్ళుతెరిచి "ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అని శేషుని అడిగాడు. వాళ్ళ అక్క నీకు బాగా జ్వరం వచ్చింది,

పిచ్చిగా మాట్లాడావు అందుకే అమ్మ ఏడ్చింది అని చెప్పింది. "జేజత్తయ్య ఉండగా మనకు భయమెందుకమ్మా"? అని వాడు తల్లిని ఓదార్చాడు.

బిలాస్‌పూర్‌లో ఆంధ్రా అసోసియేషన్ వాళ్ళు నరసింహారావు మామయ్య వాళ్ళను శ్రీరామ నవమి కళ్యాణము చేసుకోమన్నారు. శేషు విపరీతమైన నడుంనొప్పితో బాధపడుతోంది. మూడు గంటలు కూర్చోగలనా అని భయపడింది. అన్నింటికీ అమ్మే చూసుకుంటుందన్న ధైర్యంతో చక్కెర పొంగలి చేసి తీసుకువెళ్ళింది. కళ్యాణమయిన తరువాత నివేదన సమయంలో చక్కెరపొంగలిని అమ్మకు ఇంటివద్ద నివేదన చేయలేదని బాధ పడింది. అమ్మనే తలుచుకుని రాములవారికి నివేదన చేసింది. ఆ ప్రసాదాన్ని అందరికీ పెట్టమని మైక్‌లో అనౌన్స్ చేశారు. 15 మందికి పెట్టేటప్పటికి కొద్దిగా ప్రసాదం ఉంది. ఈ కొద్ది ప్రసాదం ఇంతమందికి ఎలా పంచనని అమ్మను తలుచుకుంది. మిగిలిన వారికి పెట్టటానికి గిన్నెలో చెయ్యి పెడితే వేడిగా ఉంది. పొద్దున 10 గం॥లకు చేసిన అరకేజీ ప్రసాదం మధ్యాహ్నం 2.30 గం॥లకు కూడా వేడిగా ఉంది. అందుకని చెంచాతో పెడుతుంటే ఆ కొంచెం ప్రసాదమే పందిట్లో అందరికీ సరిపోయింది. భగవంతుడు భక్త వత్సలుడు కదా! శేషు ప్రార్థనని మన్నించి అమ్మ వేడి వేడి చక్కెరపొంగలిని ప్రసాదించింది. పిల్లలందరూ అభివృద్ధిలోకి వచ్చి సుఖశాంతులతో జీవిస్తున్నారు.

వాళ్ళబ్బాయికి మొదట్నుంచీ అనారోగ్యంతో క్లాసులో మంచి మార్కులు రావటం లేదని శేషు మాటల సందర్భంలో అమ్మకు చెప్పింది. దానికి అమ్మ "వాడిని ఒత్తిడి చేయకు, వాడు అనారోగ్యంతో బాధపడుతున్నాడు, సుతిమెత్తని వాడు, వాడిని కోప్పడకు, వాడు చేయదలుచుకున్నది చేయనీ" అని శేషుతో చెప్పింది. డిగ్రీ అయ్యాక సి.ఎ.లో జాయిన్ చెయ్యటానికి ఎంట్రన్స్ రాయించాలనుకుంది. అనుకోని విధంగా చేతి వేలు ఫ్రాక్చరయింది. మరోసారి ఆస్త్మాతో ఆసుపత్రిలో చేరడంతో అదీ కుదరలేదు. పోనీ ఐ.సి.డబ్ల్యూ చేయించాలనుకుంది. దానికీ వీలు కలగలేదు.

ఆ పిల్లవాడికి తను తక్కువగా ఉన్నానని ఎలాగైనా పైకి రావాలన్న తపన

బయలుదేరింది. ఎవరికీ చెప్పకుండానే వాళ్ళ బావగారి అన్నగారి దగ్గరకు వెళ్ళి నెట్ ఎగ్జామ్ రాయాలనుందని అడిగాడు. ఆయన ఒక పుస్తకం ఇచ్చి, మూడు రోజుల్లో పరీక్ష ఉంది. బాగా చదివి ఎంట్రన్స్ వ్రాయమన్నారు. దానిలో స్కాలర్‌షిప్ కూడా వచ్చింది. డబ్బేమీ కట్టవలసిన అవసరం లేకుండా రెండు సం॥లలో దానిని పూర్తిచేయించి అతనేమిటో నిరూపించింది అమ్మ.

అమ్మ రూపం సుందరమూ, సౌష్టవము అయినదే కాదు మనోరంజకమైనది. అమ్మను దర్శిస్తే మన మనస్సుకు ఆహ్లాదం కలిగేది. అమ్మ మూర్తిలో ఆపాదమస్తకమూ ప్రజ్వరిల్లే దివ్యరోచిస్సులు, నయనయుగళిలో భాసిల్లే కారుణ్య ప్రభలూ, పెదవులపై నిరంతరం లాస్యం చేసే దరహాస రేఖలు, సువర్ణాభరణాల దీప్తిని పరిహసించే దివ్య చరణ రాజీవరామణీయకము, వివిధ వర్ణవిలసిత బహుకంకణ పరిశోభితాలయి, అఖిలజనులకూ అనవరతమూ అభయ ప్రదానం చేసే అతి మృదుకరాల సకల అవయవాలలోనూ జాలువారే సౌందర్యం, ప్రకాశం, విద్యుస్ఫూర్తి ఎవరి హృదయంలోనయినా చెరగని ముద్రనువేస్తాయి. కంచిపట్టు చీరెకట్టుకొని, జడవేసుకొని, పూలుపెట్టుకొని భృకుటిలో పెద్ద బొట్టు పెట్టుకొని అమ్మ వచ్చి కుర్చీలో ఆసీన అయితే కుర్చీలో కూర్చున్నట్లుండదు. అమ్మ సరాసరి మన హృదయ సింహాసనంపైనే సుస్థిరంగా ఆసీన అయినట్లు వుంటుంది. ఆనందంతో ఒక దివ్య ప్రభ మన మనస్సంతా ఆవరించేది.

అమ్మ దర్శనం సర్వార్థ సాధకమయింది. దర్శన మాత్రేణ మన మనస్సులో సందేహాలు నివృత్తి అవుతాయి. మనస్సుకు పరిపూర్ణ శాంతి, హాయిలభించేది. ఇప్పటికి అమ్మ రూపును మన మనస్సు నందు నిల్పుకో గలిగితే ఆ తాదాత్మ్య స్థితిని పొందగలము. దానిలో నుంచే మనకు దివ్య సందేశం అందుతుంది. ఒక్కసారి వీక్షించినా ఆమూర్తి మన హృదయాకాశంలో సుప్రతిష్ఠ అవుతుంది. మనం విస్మరించినా అమ్మ మనను విస్మరించదు. ఎల్ల వేళలా మనల్ని ఆదుకోవటానికి సర్వసన్నద్ధ అయి, మన చేయిపట్టుకొని నడిపిస్తుంది.

ముఖ్యంగా అమ్మ దర్శనంలో, అమ్మ దృష్టి మనపై ప్రసరిస్తుంది. వేల

సంఖ్యలో వున్నా అమ్మ కూడా తన సహస్ర నేత్రాలతో అందరినీ వీక్షిస్తుంది. దానితో ఎవరికి వారికే అమ్మ తనని చూస్తోందన్న భావన ఉదయించేది. అందుకే ఎందరు వచ్చినా అమ్మ స్మృతిలో వారి స్థానం సురక్షితంగానే వుండేది.

అమ్మ దర్శనం మహత్తర ప్రయోజనాత్మకమైనది. కనుకనే అనేక ప్రాంతాల నుండి, అనేకులు అమ్మను తమ తమ పట్టణాలలో సామూహిక దర్శనం ప్రసాదించమని ప్రార్థించేవారు. స్వర్ణోత్సవాల అనంతరం లక్షమంది ఒకే బంతిలో భోజనాలు చేయటం చూచి పరవశించిన అమ్మ కోటి మందిని చూడాలని తన దగ్గరకు రాలేనివారిని తానే వెళ్ళి చూడాలన్న తన కోరికను వెల్లడించింది.

దానితో వాత్సల్య యాత్ర మొదలైంది. ఇంతకాలం అమ్మను చూడటానికి జనసందోహాలు జిల్లెళ్ళమూడి వెళ్ళాయి. ఇప్పుడు అమ్మ తన సంతానాన్ని చూడటానికి బయటకు వచ్చింది. ఒకరు ఆశ్చర్యంతో ఆ విషయాన్ని ప్రశ్నిస్తే "బిడ్డలు తల్లిని చూడటానికి వస్తే ఏముంది? తల్లి బిడ్డలను చూడటానికి వెళితే ఏముంది? ఏదైనా ఒకటే" అని నవ్వేసింది. అమ్మ అందుకే "తనను కన్న వాళ్ళ మీద కంటే తాను కన్న వాళ్ళ మీదనే ప్రేమ ఎక్కువ" అన్నది.

అమ్మ దృష్టిలో సృష్టియే దైవం. దైవమంటే యీ జగత్తుకు భిన్నంగా ఎక్కడో మరొక లోకంలో ప్రత్యేక రూపధారిణియై యీసృష్టి స్థితిలయాల నడుపుతుండే వ్యక్తి కాదు. ఈ సృష్టిలో జడమనేది లేదని సృష్టి అంతా చైతన్యమే అని, యీ సృష్టి అంతా తన సంతానంగానే భావిస్తూ మురిసి పోయేది అమ్మ. భౌతికంగా మనకు దూరమైనా మన మనసుల్లో నిలిచిపోయింది అమ్మ ఏది జరిగినా అది మంచైనా, చెడు అయినా అమ్మ ప్రసాదమే అని స్వీకరించే స్థితికి వచ్చేలా తన బిడ్డలందరికీ అనుభూతులను ప్రసాదించింది.

1973 ఏప్రిల్ 12న స్వర్ణోత్సవం జరిగింది. మే 12వ తేదీన రేపల్లెలో అమ్మ దర్శనం ప్రసాదించింది. ఆ ప్రయాణం ఆకస్మికంగా నిర్ణయమై వ్యవధి అత్యల్పమై, అమ్మ ఆగమనవార్తను తెలియచేయటానికి అవకాశం లేకపోయినా మే 11,12 తేదీల్లో అడవుల దీవి, రేపల్లెలలో దాదాపు 40 వేలమంది అమ్మ దర్శనం చేసుకొని తమ జీవితాలే ధన్యమయినట్లు ఆనందించారు.

తరువాత నెల్లూరు, దర్శనానికి పురస్కరించుకొని ఒంగోలు, సింగరాయకొండ, నెల్లూరు, నిడదలూరు, మందుకూరుపేట, చిలకలూరిపేటలలో 2 లక్షలకు పైగా జనం అమ్మను దర్శించి తరించారు.

సెప్టెంబరు 7వ తేదీ నెల్లూరులో శ్రీరంగనాధస్వామి ఆలయ నిర్వాహణాధికారులు సభక్తి పూర్వకంగా అమ్మను ఆహ్వానించారు. అమ్మ గర్భాలయంలోకి వెళ్ళి రంగనాధుని విగ్రహాన్ని ప్రేమగా నిమిరింది. అది కఠిన శిలగా లేదేమో లేక ఆ ప్రేమాన్విత స్పర్శలో అమ్మ పులకించి పోవటం పక్కవారికి విశదతమౌతూనే వుంది. అమ్మ హృదయోద్భూత తరంగాలు వారిని తాకుతూనే ఉన్నాయి. వాళ్ళతో ఏరకంగా తన ప్రేమను వ్యక్తం చేస్తుందో, ఆ దేవాలయంలోనూ అలాగే చేసింది. ఆ సమయంలో అమ్మ ప్రవర్తనతో ఏ మాత్రమూ అసహజత కానీ, అసాధారణత కానీ స్ఫురించలేదు. అమ్మ దృష్టిలో నరుడు, నారాయణుడు యిద్దరూ సమానమే. జడము, చైతన్యమని రెండు లేవు.

అమ్మ స్పర్శలో ఆరంగనాధునితో ఏమి స్పందన కలిగిందో మనకు తెలియదు కానీ యీ సందర్భంలో ఒక మధుర సన్నివేశం స్మృతికి వచ్చింది. 1958న నవరాత్రి ఉత్సవాల్లో మన్నవలో రాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయానికి వెళ్ళింది. అమ్మ ఆలయద్వారం వద్ద నిలబడగానే అమ్మవారి విగ్రహం చేతి నుండి పువ్వు జారిపడి అమ్మకు స్వాగతం పలికింది. అది చూచి ఆనాడు అమ్మ వారి ఆనందాతిశయాన్ని చూచి మురిసిపోయారు. నేడు రంగనాధుని కన్న అమ్మలోని వాత్సల్యపు పొంగును చూచి పులకించిపోయారు.

నెల్లూరు జిల్లాలో అమ్మ పర్యటించటానికి నెల్లూరు డాక్టరు శ్రీశిష్ట్లా సుబ్బారావుగారు భాధ్యులయినట్లే కృష్ణాజిల్లా పర్యటనకు కారణభూతులైన వ్యక్తులు శ్రీ సోమరాజు ఆంజనేయ పంతులు, శ్రీ జిల్లెపల్లి భాస్కరరావుగార్లు. కృష్ణాజిల్లా పర్యటనకు శ్రీనాన్నగారు, రామకృష్ణ అన్నయ్య, గోపాలన్నయ్య, పన్నాల రాధాకృష్ణశర్మ, అన్నంరాజు రామకృష్ణారావు, హైద్రాబాద్, గుంటూరు, ఏలూరు, అడవుల దీవి సోదరులు మొదలగువారు 70 మందికి పైగా 3 కార్లలోనూ 1 వ్యాన్‌లో బయలుదేరారు.

బాపట్లలో ప్రసవించిన పెద్దకోడలు శేషును, మనుమరాలును చూచి అందరికీ ప్రసాదాలు పంచింది అమ్మ. అప్పికట్లలో రోడ్డు మీద అమ్మ కారును ఆపి వారపోసి కొబ్బరికాయలు కొట్టి హారతి యిచ్చారు. పొన్నూరులో అమ్మ దర్శన మొసగింది. గుంటూరులో 50 వేలమంది అమ్మను దర్శించుకున్నారు. కాజాలో కూడా వెయ్యిమంది రోడ్డుకిరువైపులా బారులు తీరి నిలబడి అమ్మ దర్శనం చేసుకుని హారతి ఇచ్చారు. 8వ తేది విజయవాడలో 50 వేలమంది దర్శనం చేసుకున్నారు.

సాయంకాలం 3-4గం॥ల మధ్య, పత్రికా ప్రతినిధుల సమావేశం జరిగింది. అందులో ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, యు.ఎన్.టి. ఆలిండియా రేడియో విలేఖరులందరూ హాజరై అమ్మను అనేక ప్రశ్నలు అడిగారు. అందులో అమ్మ గురించీ, అమ్మ తత్వాన్ని గురించి, సమాజాన్ని గురించి, మతాన్ని గురించి, దైవాన్ని గురించి పలురకాలైన ప్రశ్నలు ఉన్నాయి. అమ్మ అన్నింటికీ అందరికీ సంతృప్తికరంగా సమాధానాలు ఇచ్చింది.

ఆ సాయంత్రం 7 గం॥లకు బందరు రోడ్డులో గల మున్సిపల్ స్టేడియంలో సామూహిక దర్శనం ఏర్పాటు చేసారు. దాదాపు లక్షమంది వచ్చారు. అమ్మ నామసంకీర్తనలతో ఆ వాతావరణమంతా పునీతమయింది. ఆ వేదిక నుండే నదీరా అండ్ పార్టీ అమ్మను గురించిన పాటలు వినిపించారు. జాగృతి సంపాదకులు శ్రీతుములూరి లక్ష్మీనారాయణగారు అమ్మను గురించి, అమ్మ విశిష్టతత్వాన్ని గురించి వివరించారు.

అమ్మ వేదిక పైకి వచ్చింది. శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారు పరాకులు పలికారు. ప్రజలు జయజయ ధ్వానాలు సలిపారు. అమ్మ వేదికపై నడయాడే దేవతా విగ్రహంవలే అటూ ఇటూ తిరుగుతూ ప్రజలందరినీ ప్రసన్నవదనమై తిలకిస్తుంటే ఆ నయన ప్రసూనాలనుండీ అనుగ్రహ పరిమాళాలు తరంగాలై ప్రసరించి సర్వులనూ, స్పృశించి తన్మయులను చేశాయోమో అరగంటకు పైగా జనమంతా అనిమిషులై అమ్మను అవలోకిస్తూ అపూర్వమైన నిశ్శబ్దాన్ని సృష్టించారు.

లక్షమంది ఉన్న సభలో సూదిపడ్డా చప్పుడు వినిపించేటంత నిశబ్దం చోటు చేసుకుంది. ఆ సభలో వీరమాచినేని ప్రసాదరావుగారు అమ్మ గురించి ప్రసంగించారు. వెంకటేశ్వరస్వామి వారి దేవాలయ ప్రాంగణంలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఉపన్యసించారు.

అమ్మ పిల్లల జైలు చూచింది. అక్కడికి ఆహ్వానించిన శేషాచలంగారు "నేనెందరినో మహర్షులను చూశాను. మీ కంటే ఘనమైన వారిని నేనెక్కడా చూడలేదు. మీ వల్ల నేనెంతో మేలు పొందాను. అది మరచిపోలేను", అని అమ్మను అక్కడి అధికారులకు పరిచయం చేసారు. ఆ జైలు గదులలో **94**మంది **6-12** ఏళ్ళ మధ్యగల పిల్లలు ఒకరి తరువాత ఒకరు వరుసగా కూర్చున్నారు. అమ్మను చూడగానే వారి కన్నులు కన్నీటి వాగులైనాయి. గుడ్ల నీరు నింపుకొని అమ్మ పాదాలపై పూలు జల్లారు. మరికొందరు పిల్లలు బావురుమని వలవల ఏడ్చారు. వారు పోగొట్టుకొన్నదేదో అమ్మలో చూచారు. అమ్మ ఆ పిల్లల కన్నీరు తుడిచి వారిని అక్కున చేర్చుకుంది. ధైర్యం చెప్పింది. వారి ఆలనా పాలనా గురించి కనుక్కుంది. "వీరికి ఆహారం కడుపు నిండాపెడతారా? పండుగలకు ఏదైనా చేయించి పెడతారా? ఏదైనా తినాలంటే వారు అడగలేరేమో" ఏ తల్లి ఇతర బిడ్డల ఆహార విహారాదులను గూర్చి పట్టించుకుంటుంది?

అమ్మ కనులు అశ్రుపూరితాలయ్యాయి. అవి ధారలై పారినవి. ఆ పిల్లల శిరస్సు నిమిరి వారిని వదలలేకపోయింది. బొట్టు పెట్టి ప్రసాదం ఇచ్చింది. తరువాత హరిజన కాలనీ చూచి వారికి అవ్యాజమైన ప్రేమతో ప్రసాదం పెట్టింది. అక్కడ నుంచీ గుడివాడ పొట్టిశ్రీరాములు హైస్కూలులో 50వేలమందికి దర్శన భాగ్యం కలుగచేసింది. దాదాపు ఒక గంటసేపు దర్శనమిచ్చింది. "మంచంలో నుంచీ లేవలేని ఓ వృద్ధుడు అంతిమ కోరిక క్రింద నీ పిల్లలను చూపించమంటావా?" అని అతని హితులు అడిగితే అంతిమ క్షణాల్లో ఉన్నా కూడా అమ్మను చూడాలన్న ఆరాటంతో "జిల్లెళ్ళమూడి అమ్మను చూపించమన్నాడట".

అమ్మ మందపాడులోని హరిజన వాడలో 500 మందికి దర్శనంతో పాటు పులిహోర ప్రసాదాన్ని పంచింది. "అమ్మ రోయి, అందరమ్మ రోయి, అందరికీ అన్నం పెట్టే అమ్మ వచ్చింది రోయి" అని ఎలుగెత్తి చాటారు ఆవాడలోనివారు. అమ్మను చూచిన ప్రతి మనిషికి పండుగ అయింది. ఓ చిన్నారి పాప అమ్మను మరొక పాపకు అదిగో అమ్మ అని చూపిస్తోంది. నీవు ఎప్పుడు చూచావని అడిగితే రాత్రి చూచాను అన్నది. చూడగానే గుర్తించిన ఆ పసి హృదయం ఎంత గొప్పది. ముస్లిం కాలనీ చూచింది. ఎట్టి బేధభావం లేకుండా వేల సంఖ్యలో అమ్మ దర్శనం చేసుకున్నారు.

అక్కడ నుంచీ వెళ్తూ అమ్మ చర్చి వద్ద ఆగింది. వారులోనికి ఆహ్వానించారు. చర్చిలో నిల్చిన అమ్మ క్రైస్తవులకు తమ క్రీస్తునే తలపింపచేసింది. అక్కడ 200 మంది దర్శనం చేసుకుని అమ్మచేతి ప్రసాదాన్ని స్వీకరించారు. అమ్మ గీతాభవనంకు చేరింది. అక్కడ గోవిందుని నామం వీనుల విందుగా సాగుతున్నది. భక్త బృందం వేయి దాటింది. అక్కడ పూర్ణకుంభంతో, వేదప్రవచనాలతో, మంగళహారతులతో స్వాగతం చెప్పారు.

కృష్ణాజిల్లా పర్యటన సందర్భంలో అమ్మ విజయవాడలో వుండగా పత్రికా విలేఖరులు, వార్తాసంస్థల ప్రతినిధులు అమ్మను సందర్శించి వారి సందేహాలను అమ్మకు నివేదించారు. అమ్మ వాటికి తగిన రీతిని సమాధానమిచ్చింది. వారంతా హర్షాన్ని వెలిబుచ్చారు.

ఆ సందేహాల్లో మహిమల గురించి అడిగారు. దానికి ఆ మహిమల ప్రస్తావన రాగానే అమ్మ చాలా నిరాడంబరంగాను, నిసర్గమనోజ్ఞంగానూ తన మధుర స్వభావానికి అనుగుణంగా "మహిమల విషయము నాకు తెలియదు, వాటిని గురించి నేనెన్నడూ ఆలోచించనని" అమ్మ తెలియచేసింది.

సాధారణంగా ఎవరైనా ప్రశ్నించినప్పుడు అమ్మ మాటల ద్వారా కాక, క్రియా రూపంగానూ, ప్రత్యక్షంగా కంటే పరోక్షంగానూ, జవాబు తెలియచేయటం అమ్మ యొక్క విశిష్టత.

గుడివాడలో అమ్మ పేదల కాలనీలనేకం సందర్శించి, ప్రేమతో వారందరినీ

దగ్గరకు తీసుకుని, కరుణతో ప్రసాదం పంచి, ఓపిక లేకపోయినా మండుటెండలో శరీరం స్వేదసిక్తమవుతున్నా ఓర్పుతో వాడవాడకు తిరుగుతూ ఏ ఆడంబరాలు లేకుండా రోడ్డుపైగల చెట్ల నీడన కుర్చీలో కూర్చుని వారి యోగక్షేమాలు విచారించి ప్రసాదం పంచుతూ వారికి ప్రమోదానందాలను కలుగచేసింది.

వాత్సల్య యాత్రకు ముందే ఎందరెందరో తమ ఇంటికి రమ్మని అమ్మను ప్రార్థించారు. "నాన్నా కార్లలో వచ్చి నన్ను తీసుకు వెళ్తామంటున్నారు. నేను బయలుదేరటమంటూ జరిగితే బీదవాడు అమ్మను తీసుకురాలేకపోయానని కానీ, అమ్మ వచ్చింది, అమ్మకు ఏమీ పెట్టుకొకపోతున్నాననిగానీ బాధ పడకూడదు. వాడికి నేనేమైనా తీసుకు వెళ్ళి ఇవ్వాలి, మళ్ళీ వాడు నాకు పెట్టుకోవటానికి కూడా తగిన స్థోమత నేనే కలుగ చేయాలి కదా!'' అన్నది.

అలాగే అమ్మ తనయాత్రలో అనేక హరిజన వాడలు, స్లమ్ ఏరియాలు, బీదవారు అని ఏ తేడా లేకుండా అందరికీ తన దర్శనాన్ని ఒసగి తన సర్వమాతృత్వాన్ని విశద పరచింది. అలాగే అమ్మ పాదస్పర్శతో పునీతమైన ప్రదేశాల్లో మందపాడు ఒకటి. అమ్మ వెంట విజయవాడలో మహిమల గురించి ప్రశ్నించిన వార్తా సంస్థ ప్రతినిధి వున్నారు.

మందపాడు హరిజనవాడలో ఒక కన్య కొన్నాళ్ళుగా మతిభ్రమణంతో బాధపడ్తూ, నిరాహారియై మృత్యుశయ్య చేరింది. ఆమె పక్కనే ఒక ముస్లిం గురువూ, ఒక క్రైస్తవ గురువు చేరి వారి వారి మతానుసారం ఆమె ఆత్మశాంతికై అంతిమ ప్రార్థనలు చేస్తున్నారు. ఆ సమయంలో అమ్మ ఆసమీపంలోకి వెళ్ళింది. ఆమెను అమ్మ దగ్గరకు తీసుకు రావటానికి ప్రయత్నించారు. కానీ గురువులు అందుకు అంగీకరించలేదు.

ఆమె బంధువులు అమ్మను అక్కడకు రమ్మని అర్థించారు. మహాప్రస్థానానికి సన్నద్ధియైయున్న ప్రాణి వద్దకు అమ్మ వచ్చింది. ఆదరం ఆ కన్యకరగ్రహణం చేసి నాడి చూచింది. ప్రేమగా, ఆపేక్షగా ఆమె పాలభాగాన్ని నిమిరింది. ఆకన్య నిర్లిప్తంగా ఒకసారి కనులెత్తి చూచి రెప్పలు దించుకున్నది.

అక్కడ నుంచీ అమ్మ బయలుదేరి వచ్చేసింది. మరునాటి నుంచీ ఆకన్య సుస్థిరమతీ, ఆరోగ్యవతీ అయి అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఈ సంఘటన అమ్మ అతిలోక సామర్థ్యానికి సజీవపతాకయై నిలచింది. ఇది విజయవాడలో పత్రికా విలేఖరులు అడిగిన ప్రశ్నకు అమ్మ ఇచ్చిన అద్భుత సమాధానం కదా!.

వాత్సల్య యాత్రలో భాగంగా అమ్మ మచిలీపట్నం వస్తుందని ఎస్.ఆర్.వై. ప్రసాద్‌గారు ఫోను చేసారు. మాసొంత ఊరిలో, మాఇంట్లో అమ్మను అర్చించుకోవాలని మా బావగారు రాధాకృష్ణగారు, చక్రవర్తిగారు, మా మరిదిగారు ప్రసన్నకుమార్‌గారు, మా ఆడపడుచు భర్త శ్రీనివాసరావుగారు, మా ఆయన స్నేహితులు ప్రసాదరావుగారు దంపతులం పదిమందిమి బందరు వెళ్ళాం.

అమ్మ ఉదయ భీమరాజుగారింట్లో విడిది చేసిందని తెలిసి అమ్మను దర్శించటానికి వెళ్ళాను. మాపిన్న అత్తగారు అమ్మను మన ఇంటికి వేంచేయమని అడగమన్నారు. నేను అమ్మను చూచిన ఆనందంలో ఆ విషయమే మర్చేపోయాను. మా అత్తగారి సంకల్పం బలమైనది కావటంతో అమ్మే మా ఇంటికి వస్తానని అన్నయ్య ద్వారా చెప్పించింది.

ఎస్.ఆర్.వై. గారింటికి ఉదయమే అమ్మ వస్తున్నారంటే అక్కడి ఏర్పాట్లు చూడటానికి వెళ్ళాను. మధ్యాహ్నం మా ఇంటికి వస్తానన్నారు. అమ్మ మా రామకృష్ణ అన్నయ్య కొడుకు సాయితో "కుసుమ అలవిమాలిన దుఃఖాన్ని అనుభవిస్తోందని" అన్నదిట. దానికి సాయి "కుసుమత్తయ్య హాయిగా, సరదాగా వుంటే నీవు అలా అంటావేమిటి?" అని అన్నాడు. సాయంత్రం 4 కార్లల్లో అమ్మతో పాటు రామకృష్ణ అన్నయ్య, అడవుల దీవి సుశీలక్కయ్య,లాలా, పార్థు, సాయమ్మగారు ఇంకా అనేకమంది అన్నయ్యలు, అక్కయ్యలు మా ఇంటికి వచ్చారు. వారందరికీ, కాఫీ, టిఫెన్లు ఏర్పాటు చేశాము.

మా పినమామగారు డా॥ ఎ.ఎన్. రావుగారు, మరిదిగారు డా॥ అశ్వినీకుమార్‌గారు, పినమామగారు శేషగిరిరావుగారు, మాచెల్లి వాళ్ళ ఆయన సుబ్బారావు మాఆడపడుచులు శాంత, కామేశ్వరీ అందరం మొత్తం 30 మందికి

పైగా అమ్మను అర్చించుకున్నాం. అమ్మకు నాన్నగారికి బటలు పెట్టి ఇద్దరినీ పూజించుకోవటం ఆ రోజు మాఅదృష్టంగా భావిస్తున్నాము. అమ్మకు పూజ ఎప్పుడూ చేసుకుంటాం. ఆరోజునాన్నగారు కూడా అందుకు అంగీకరించటం విశేషం. మాకుటుంబ సభ్యులమే దాదాపు 30 మందిమి వుండటంతో కళ్యాణకారిణి అమ్మ కళ్యాణ మహోత్సవంలావుందని కొనియాడింది.

బందరులో గబ్బిట కృష్ణమూర్తిగారని సూర్యోపాసకులున్నారు. మా ఇంటిముందు అన్ని కార్లు వుండటంతో ఏమి జరిగిందోనని కంగారుగా వచ్చారు. జగన్మాత అమ్మను చూడగానే ఆపుకోలేని ఆనందంతో అమ్మను స్తోత్రం చేస్తూ శిరస్సు మీద పూలు వేయనారంభించారు. అన్నయ్య వద్దని చెపితే అమ్మ అన్నయ్యను వారించింది. ఆరోజు ఆయన ఆవేశం చూసిన మా అందరికీ ఆశ్చర్యానందాలు ముప్పిరిగొన్నవి. ఆరోజు మా జీవితాల్లో మరుపురాని రోజు అదే రోజు సాయంత్రం హిందూ కాలేజీ ఆవరణలో అమ్మ సామూహిక దర్శనం ఏర్పాట్లు చేయబడింది. అక్కడికి వెళ్ళినప్పుడు సాయి "నీవు అలవి మాలిన బాధపడ్తున్నావని" అమ్మ చెప్పింది నిజమేనా? అని అడిగాడు, దానితో నా దుః ఖం పదింతలకు పెరిగింది.

సరిగావారంరోజులకు ముందు మా ఇంట్లో నేను దీపారాధన చేసుకొని ఇవతలకు వచ్చాను. తరువాత మహానివేదన పెట్టటానికి వెళ్ళేటప్పటికి అమ్మఫోటో బుజాలదాకా దీపారాధన మీద పడి పైభాగమంతా కాలిపోయింది. దానితో విపరీతమైన దుఃఖంతో అంతు దరిలేకుండా విలపించాను. వెంటనే జిల్లెళ్ళమూడి వెళ్తానని ఈయనతో చెప్పాను. ఇంటి ఓనరు ఇల్లు రినవేట్‌చేయిస్తూ కిటికీలు తీసారు గుమ్మాలు పెట్టించాటానికి అటువంటి పరిస్థితులలో ఎలా వెళ్తావన్నారు. చేసేదేమీ లేక అమ్మనే తలుచుకుంటూ రోజు ఒక యుగంలా గడిపాను.

ఈలోగా నా దుఃఖాన్ని పారాద్రోలటానికా అన్నట్లుగా అమ్మ మచిలీపట్నం వస్తున్నదని కబురు రావటం మేము బయలుదేరి వెళ్ళటం జరిగింది. నన్ను వేదన నుండీ దూరం చేయటానికే ఆ విషయం అమ్మ సాయితో

చెప్పిందనిపించింది. అక్కడ ఫోటోలలో ఒక ఫోటో కొని తెచ్చి నాకు ఇచ్చాడు. తీరాచూద్దును కదా సరిగా కాలిపోయినా ఫోటోయే, నేను ఆ ఫోటో అని సాయికి చెప్పనే లేదు, సాయి ద్వారా నాకు మళ్ళీ దుర్గాష్టమికి త్రిశూలం, చక్రంధరించిన ఫోటోనే అందేటట్లు చేసి నాకు మనశ్శాంతిని ప్రసాధించింది అమ్మ. దాన్ని జాగ్రత్తగా ఫ్రేమ్ కట్టించుకొని పూజలో పెట్టుకొని అర్చించుకుంటున్నాము.

మచిలీపట్నంలో ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ ఉన్నతాధికారులు అమ్మకు పూర్ణకుంభంతో, వేద ప్రవచనాలతో స్వాగతం పలికారు. ఆ కంపెనీ వ్యవస్థాపకులు మా మామగారైన శ్రీ అయ్యగారి రామూర్తి పంతులుగారు, "నేను ఆ పర్యటనలో అమ్మతో వుండటం వల్ల నాకు కూడా మా మామగారు స్థాపించిన కంపెనీ చూసే అదృష్టం కలిగింది. ఆ కంపెనీలో పని చేస్తున్న గఫూర్" "పంతులుగారి తాలూకు వాళ్ళు ఇన్నిరోజులకు ఈ కంపెనీలో అడుగు పెట్టారని" పరమానంద భరితుడయ్యాడు.

మచిలీపట్నం నుంచీ విజయవాడకు రెండు కార్లలో వెళ్తున్నాము. ఒక కారులో అమ్మ, రామకృష్ణన్నయ్య, ఉషా, నేనూ ఉన్నాము. పార్థుడ్రైవ్ చేస్తున్నాడు, మరో కారులో గోపాలన్నయ్య, లాలా మరి కొంతమంది ఉన్నారు. ఆ కారులో వాళ్ళు వినసొంపుగా అమ్మ నామాన్ని గానం చేస్తున్నారు. అది విని మేము అమ్మతో "అమ్మా! మాలో ఎవరికీ కమ్మని కంఠం ఇవ్వలేదమ్మా!" అన్నాను. అందరూ పాటగాళ్ళయితే విని ఆనందించేవారెవరుంటారు? అని మమ్మల్నే ప్రశ్నించింది అమ్మ. విని ఆనందించే శక్తిని ఇచ్చిన అమ్మకు మనసారా నమస్కరించుకున్నాం. కొంత దూరం వెళ్ళిన తరువాత అమ్మకారు ఆపమంది. ఎటు చూచినా పచ్చని పొలాలు, తోటలతో కనువిందు కలిగిస్తున్నాయి. "ఇక్కడ ఎందుకు ఆపమన్నావమ్మా?" అంటే నవ్వి వూరుకుంది, కానీ వెళ్దామని చెప్పలేదు. అమ్మ ఎందుకు ఆపమందో ఎంత ఆలోచించినా మా ఎవ్వరికీ అర్థంకాలేదు.

లాలా, పార్థు, మిగిలిన మొగపిల్లలు అక్కడ తోటల్లో దూరి దొండకాయలు, నిమ్మకాయలు కోసుకువచ్చారు. ఆ నిమ్మకాయలను ఆ చేతులోకి ఈ చేతులోకి ఎగరవేస్తూ ఆడుకుంటున్నది. ఆ ఆటచూచి తీరవలసిందే కానీ వర్ణించ శక్యం కాదు.

ఏదో తెలియని ఆనందంతో మేను పులకరించింది. అమ్మ అలా ఆడుతూనే వుంది కానీ బయలుదేరుదామని అనలేదు. ఈ లోగా ఒకామె అనారోగ్యంగా ఉన్న తన భర్తను నడిపించుకుంటూ ఆ రోడ్డు మీద నుంచీ వస్తోంది. అక్కడ జనసంచారం కూడా లేదు. అమ్మ వారిని దగ్గరకు రమ్మని పిలచి అతని ఒడలు నిమిరి, అంతమటుకూ తాను ఆడుతున్న నిమ్మకాయలను ఆమె చేతిలో పెట్టి "ఇంటికి వెళ్ళిన తరువాత రసం తీసి ఆమె భర్తకు ఇమ్మని అతని ఆరోగ్యానికేమీ ఢోకాలేదని, జబ్బు నిమ్మళిస్తుందని, కులాసాగా వుంటాడని" చెప్పింది అమ్మ.

మేమంతా వీరికోసమా! అమ్మ కార్లు ఆపమందని విస్తుపోయాము, అవ్యాజ కారుణ్యమూర్తి అయిన అమ్మను కొలవటానికి ఏ కొలత సరిపోతుంది? మేము అక్కడ ఆగినప్పుడు అసలు రోడ్డుమీద నరమానవుడు లేడు. అటువంటిది వాళ్ళు వచ్చే వరకూ ఆగి వారి ఆవేదనను దూరం చేసి వారికి కావల్సిన మనోధైర్యాన్ని కలుగచేసింది అమ్మ.

విజయవాడలో రాజగోపాలన్, వారి సతీమణి అమ్మను అర్చించుకున్నారు. విజయవాడలో రిక్షాడ్రైవర్స్ కాలనీకి వెళ్ళింది. అక్కడ నుంచి గుడివాడలో తుమ్మలపల్లి చలపతిరావు గారింట కొంతసేపు గడిపి రుద్రపాకవెళ్ళి విజయవాడకు తిరిగి వచ్చింది. 17వ తారీఖున గుంటూరులో ఏకాపుండరీకాక్షరావు గారింటికి వెళ్ళివారి పూజలందుకున్నది. అనారోగ్యంగా వున్న వసుంధరక్కయ్యను, చుండూరి సీతారామయ్యగారిని చూచింది.

చుండూరి సీతారామయ్యగారు, వారి సతీమణి, వల్లూరి చలపతిరావు దంపతులు, వల్లూరి రంగారావు దంపతులు, సుశీలక్కయ్య నాన్నగారికి అమ్మకు పూజ చేసుకున్నారు. అక్కడ నుంచీ బయలుదేరి రాత్రి 7గం॥ బాపట్లలోని రవి అన్నయ్య ఇంటికి చేరింది. 18వ తేదీ వివిధ ప్రాంతాల నుండి వచ్చిన యాత్రికులు అమ్మ దర్శనం చేసుకొని ప్రసాదాలు స్వీకరించారు.

నవంబరు 3వ తేదీ తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలను సందర్శించే

నిమిత్తం బయలుదేరింది అమ్మ. ఈ మారు పర్యటనలో నాన్నగారు రానందున ముందుగా వారి పాదాలకు ప్రణామం చేసి పయనమయింది అమ్మ. మొదటగా ఏలూరు రైస్‌మిల్లు ఆవరణలో వెయ్యిమంది పైగా రాత్రి 1-30 గం॥లకు దర్శన మిచ్చింది. నాల్గవ తారీఖు నుండీ వేలాది జనానికి అమ్మ దర్శన మొసగింది. ఉదయం 10గం॥లకు సెయింట్ థెరసా మహిళా కళాశాలను అమ్మ చూచింది. శ్రీమదర్, సుపీరియర్, కళాశాలను, లైబ్రరీని అమ్మకు చూపించారు. అమ్మ ప్రిన్సిపాల్‌గారికి చీరె, రెవిక ఇచ్చి ఆశీర్వదించి తనమెడలోని స్కార్ఫ్‌ను తీసి ఆమెకు అలంకరించింది. ప్రిన్సిపల్‌కు అరటిపండు ఒలిచి నోటికి అందించింది. "నీవు తినమన్నవారి ప్రార్థన మన్నించి తాను కొంచెం తిన్నది". కళాశాల వారందరి పక్షాన అమ్మకు క్రీస్తుశిలువ వున్న దంతపు బొమ్మను కానుకగా సమర్పించారు. 13వందల మంది విద్యార్థినులు, 60 మంది ఉపాధ్యాయినులు అమ్మను దర్శించుకున్నారు.

అనంతరం అమ్మను ఉద్దేశించి జోసఫిన్ (ప్రిన్సిపాల్) అమ్మలో దైవత్వం, మానవత్వం స్పష్టంగా కనిపిస్తున్నాయని, ఆడపిల్లలు అమ్మలోని ప్రేమ వాత్సల్యాలను వుణికి వుచ్చుకోవాలని తద్వారా తమ జీవితాలను చక్కదిద్దుకోవాలని ఉద్బోధించారు.

కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు అమ్మలోని విశిష్ట మాతృత్వాన్ని గూర్చి, అమ్మ అవతారలక్షణమైన ప్రేమ గురించి తెలియచేసారు. కార్మికవాడలో ఒక వృద్ధురాలికి అమ్మ ప్రసాదం నోటికి అందించింది. అక్కడ నుండి భీమడోలుకు ప్రయాణమైంది. కొండముది శ్రీరామ చంద్రమూర్తి అమ్మను గూర్చి ప్రసంగిస్తూ అమ్మ అవతారమూర్తి కాదు ఉద్ధరణ వ్యక్తి మనలను ఉద్ధరించటానికి మనలోకి చొచ్చుకుపోయి, మనో పరివర్తన ఎలా కలిగిస్తుందో వివరించారు.

భీమవరం, పాలకొల్లులను సందర్శించింది. పాలకొల్లులో గోపీగారు అమ్మ గురించి "సృష్టి, స్థితి, లయకారిణియై మానవరూపంలో మసలుతున్నది అమ్మ. అమ్మ పరాశక్తి, అన్నపూర్ణ, తాను మరచి తనయుల పొట్టనిమిరే మాతృమూర్తి.

అమ్మను సందర్శిస్తే మనం దైవ సాక్షాత్కారం పొందినట్లు అని, పసిపాప ఏడుపులో కూడా ఓంకారం వినే తల్లి ఈమె" అని చెప్పారు.

పాలకొల్లు నుంచి నరసాపురం డా॥ ఆచంటకేశవరావుగారింటికి వెళ్ళింది. అమ్మ వనదేవతలా మొక్కలకు నీరు పోసింది. డాక్టరుగారి స్టెతస్కోపు తీసుకుంది, డాక్టరుగారు "నన్ను పరీక్ష చేయమ్మా" అని అడిగారు. వెంటనే అమ్మ "నీకు పరీక్ష ఏమిటి? నీకు నేను రావటమే పరీక్ష" అని చమత్కరించింది.

మధ్యాహ్నం 2.30 గం॥లకు అలంకరింపబడిన లాంచీలో అంతర్వేదికి ప్రయాణమైనది, అమ్మతోపాటు మరో లాంచీలో వందమంది వెళ్ళారు. గంటన్నరకాలం గోదావరిలో ప్రయాణించింది అమ్మ. గోదావరి ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది. వెల్లువలై పారింది, పల్లెకారులు అమ్మ వచ్చిందని వారి వారందరినీ పిలుచుకున్నారు. అమ్మ వారందరికీ ప్రసాదాన్ని పంచింది.

11వ తా॥ 2గం॥కు బయలుదేరి గోదావరి దాటి కోనసీమలో అడుగు పెట్టింది. రాజోలు పొలిమేర నుండి టాపులేని కారులో అమ్మ ఆసీనురాలై బిడ్డలెందరికో దర్శనాన్ని ప్రసాదించింది. రాజోలు ఆర్ట్స్ అండ్ సైన్సుకాలేజీ ఆవరణలో వేదిక మీద దర్శనమిచ్చింది అమ్మ. ప్రిన్సిపాల్ శ్రీ అన్నాప్రగడలక్ష్మీ నారాయణగారు అమ్మ తత్త్వాన్ని ప్రజలకు విశదపరిచారు.

రాత్రి 7గం॥కు అమలాపురం జూనియర్ కాలేజీలో అమ్మ వేదిక మీద దర్శనమిచ్చింది. శ్రీపాదవారు అమ్మ తత్త్వాన్ని లక్షమందికి పైగా వున్న సభలో వినిపించారు. తణుకులో మరకాని సత్యనారాయణ గారింటికి అమ్మ వెళ్ళింది. ఆ తరువాత నిడదవోలు మాతృశ్రీ అధ్యయన పరిషత్ వారు అమ్మను ఆహ్వానించారు.

ప్రేమతో నవతకు, మానవతకు బాటలు వేస్తున్నది అమ్మ. అమ్మ అందించే ప్రసాదం మన సమస్త బాధల నివారణకు ఆధారం. మన బాధలను మరవటానికి అది ఒక ఉపకరణం. అమ్మ సందేశం మాటలతో కాదు, చేతలతోనే అమ్మ మనలను ఉన్నత సీమకు నడిపిస్తున్నది. అమ్మ జీవితం దీపకళిక. అక్కడ

విశ్వమానవత ప్రజ్వరిల్లుతున్నది. అమ్మలో శక్తులు, మహిమలూ లేకపోవటం కాదు. అమ్మనే మేము పరిపూర్ణ భగవతీ స్వరూపంగా నమ్ముతాం. అమ్మను మించిన దైవం మరి లేదు. మనవుని మహిమాన్వితునిగా చేయటానికై భూమి మీద అవతరించిన పరాశక్తి అమ్మ.

ఆ పర్యటన ముగించుకొని జిల్లెళ్ళమూడికి చేరేటప్పటికి అనంతపురం నుంచీ రెండు బస్సులతో వచ్చిన జనానికి దర్శనమిచ్చి "అందరినీ భోజనం చేశారా?" అని అడిగింది.

**1974** జరవరి **24** నుండి ఫిబ్రవరి **10**వ తేదీ వరకు చిత్తూరు, కడప జిల్లాల పర్యటన భాగంగా అమ్మను ముందుగా నెల్లూరు డాక్టర్ శిష్టా సుబ్బారావు గారింటికి ఆహ్వానించారు. అమ్మ కారు నుండి ఇంట్లోకి వెళ్ళటానికి పట్టు చీరెలు పరిచారు. అక్కడ నుండి గూడూరు, కాళహస్తి, తిరుపతి వెళ్ళింది. తిరుపతిలో బ్రహ్మాండమైన పూలరథంలో జనవరి **27**న ఊరేగింపు సాగినది. పుత్తూరు, కర్వేటినగర గ్రామమునకు బయలుదేరింది. అచ్చటి నుంచీ చిత్తూరుకు వెళ్ళింది.

అమ్మ చిత్తూరు జిల్లా పర్యటనలో న్యూజిలాండ్ దేశీయుడు శ్రీడంకన్ అమ్మ దగ్గర తాను పొందిన యోగాభ్యాసానుభూతిని తెలియచేసారు. అచటి నుంచీ గుడియాత్తం చేరింది. అమ్మను సూర్యరథంపై ఎక్కించి సుమారు **4** మైళ్ళు వూరేగింపు జరిపారు. నెమలి, నందివాహన నృత్యాలు, భజన పార్టీలు, అమ్మ నామ సంకీర్తన, కోలాటం రథం ముందు దేదీప్యమానంగా పయనించాయి.

పిమ్మట మదనపల్లి వెళ్ళి ఋషీవాలి స్కూలులో పిల్లలందరికీ బిస్కెట్లు పంచింది. జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించలేని వారికోసమే అమ్మ ఈ వాత్సల్యయాత్ర కార్యక్రమాన్ని మొదలు పెట్టింది. ఈ యాత్రలో కోట్లాది మంది అమ్మను దర్శించి పునీతలయ్యారు. కుమారి లెస్సీ ఇంగ్లాండు నివాసి. అమ్మ కొద్దిపాటి ఎడబాటును కూడా సహించలేకపోయేది. ప్రపంచంలోని ఏ స్త్రీ కూడా అమ్మకు సాటికాదు, అమ్మను అనంతవాత్సల్యమూర్తిగా తన ఆరాధ్య దేవతగా లెస్సీవర్ణించింది.

అంబానగర్. జులక్‌పూర్, మిర్యాల మండీ, గౌలిగూడా, కృష్ణనగర్, కమల్‌నగర్, భోలాశంకర్ మీకా, కుష్టురోగుల కాలనీ, కోమటికుంట, నాంపల్లి బజార్ ఘాట్‌లోని ముస్లింకాలనీ, పూర్ బానవాల మొ॥ ఎన్నెన్నో కాలనీలకు వెళ్ళింది.

దాదాపు అన్ని కాలనీలు కూడా ఇరుకు దారులు, రాళ్ళు రప్పలతో దుర్గంధంతో, మురుగునీటితో అసహ్యంగా వుండేవి. చిన్న చిన్న గుడిసెలు గడ్డితో కప్పినవి, రేకులతో కప్పబడినవి, ఇటుకులు పేర్చినవి, గోనెపట్టాలనే ఆధారం చేసుకున్నవి మరికొన్ని, వారి జీవనం అతి స్వల్పమైనది. ఇంకా నిద్ర లేవని వారు, అనారోగ్యంతో మంచం పట్టిన వారు, వృద్ధులు. తైల సంస్కారమే లేని స్త్రీలు, మాసిపోయిన జీర్ణ వస్త్రాలతో ఎందరో నిర్భాగ్యులు, నీరు పట్టుకుంటున్నవారు, బియ్యం కడుగుతున్నవారు, పొయ్యి మీద వున్నా పొయ్యి క్రిందకు లేనివారు ఇలా అనేక మందిని అమ్మ చూచింది. వారి జీవనసరళిని చూచి జలజలా కన్నీరు కార్చింది. బాలెంతలు కొందరు, గర్భవతులు కొందరు వారికి తగిన ఆహారం కానీ, గాలి వచ్చుటకు తగిన సదుపాయాలు లేదు. ప్రతి ఇంటికి వెళ్ళి అందరినీ పలకరించింది. ఆదరమూ, అనురాగం రంగరించి ప్రతివారినీ ప్రసాదం తీసుకోమన్నది. లేవలేని వృద్ధులకు ప్రసాదం నోట్లో పెట్టి తినిపించింది. రోగులను భీతిమనస్కులను తన గుండెలకదుముకొని మహదానందాన్ని ప్రసాదించింది.

అమ్మ పాదచారియై యీ మురికివాడలను చూస్తూ ఐదు, ఆరుమైళ్ళు తిరిగేది. మురికివాడలు చూస్తుండగా వీధిలో ఒక వృద్ధురాలు సెనగకాయలు అమ్ముతున్నది. అందులో నుంచి రెండుకాయలు కాయలు అమ్మ తీసుకుందిం. ఏ వేదనకు ఈ ఫలమో పంచభక్ష్యపాయసాలను నివేదనగా స్వీకరించే పరమేశ్వరుడు అమిత దయార్ద్ర హృదయుడై శుచి శుభ్రతలను కోల్పోయిన ఆకాయలనే తీసుకున్నాడు. ఆ క్షణంలో శబరియే గుర్తుకు వచ్చింది. ఒక ఇంట్లో వంటకాల మీద మూతతీసి కూర ముక్క నోట్లో వేసుకుంది. వేరొక యువతి గోధుమ రొట్టెలు చేస్తుంటే దానిని తీసుకొని అందరికీ తలా కొంచెం పెట్టి తనను దర్శించుకోవటానికి వచ్చిన గుజరాతీ స్త్రీకి ప్రసాదంగా ఇచ్చింది. మనము మిగిలింది మాత్రమే

"ప్రేమమూర్తి పదముల యందు సమస్త ప్రపంచం మోకరించక తప్పదు". అన్న శ్రీరామతీర్థుని ప్రవచనము అమ్మ చేసిన వాత్సల్య యాత్రలో ఋజువైనది. ఏప్రియల్ 12వ తేదీ హైద్రాబాద్ నగరానికి అమ్మ విచ్చేసిన రోజు, ఆరోజు హైద్రాబాద్ విమానాశ్రయం మొత్తం అమ్మరాకకు ఎదురు చూస్తున్నదా! అని అనిపించకమానదు. అమ్మ క్రిందకు దిగటంతో అక్కడ గుమిగూడిన వారంతా పెద్దగా హర్షధ్వానాలు చేశారు. అందులో విద్యావేత్తలు, రాజకీయనాయకులు, ఉన్నతాధికారులు, పుర ప్రముఖులు అంతా వున్నారు. అమ్మ బిడ్డలకు రెండు చేతులూ ఊపుతూ సంతోషాన్ని కలిగించింది. ఒక్కసారిగా అందరి మనస్సులు ప్రఫుల్లమైనాయి.

అమ్మపాదచారియై నెమ్మదిగా, నిదానంగా అందరి ప్రణామములను స్వీకరిస్తూ, కళ్ళతోనే అందరినీ పలకరించింది. అక్కడ చేరిన జనం పుష్పవృష్టి కురిపించారు. అక్కడ నుంచి టి. రాజగోపాలాచారిగారి గృహమునకు వెళ్ళింది. గౌరవ వందనంలాగా బారులు తీరిన మోటారుసైకిళ్ళు, స్కూటర్లు, కార్లు అమ్మను వెన్నంటాయి. మార్గమంతటా ప్రజలు బారులు తీరి ఆనందాతిశయాలతో "జగన్మాత అనసూయాదేవికి జై" అని నినాదాలు చేశారు.

నిజాం కాలేజీ మైదానంలో బ్రహ్మాండమైన వేదిక మీద అమ్మ దర్శనమిచ్చింది. ఆ అలౌకిక మూర్తిని కన్నంతనే వారి జీవనసరళియే మారిపోయినట్లు, జీవితమే చరితార్థమైనట్లు భావించారు. శ్రీ వీరమాచినేని ప్రసాదరావుగారు సమస్తమానవాళికి జ్యోతియైన అమ్మ నవ్య సిద్ధాంత సౌరభాలను వారికి ప్రసారం చేశారు. అమ్మ ధీశక్తిని, అఖండ మేధాశక్తినీ, అమ్మ ప్రజ్ఞాపాటవాలను విపులీకరించారు.

14 సాయంత్రం సికింద్రాబాద్‌లోని మహబూబ్ కాలేజీ ఆవరణలో 70 వేలకు పైగా అమ్మ దర్శనం చేసుకున్నారు. ప్రతిరోజు ఏ కొంచెం విరామం లేకుండా ప్రజలచే తన అనురాగమృతాన్ని పుక్కిటి బంటిగా తాగించింది అమ్మ. మురికి వాడలను, పేదల కాలనీలను చూచింది. గంగానగర్, మీర్‌జుమలా, రంగేళీ షాకిడ్కి, జగజ్జీవనరామ్‌నగర్, బాపూజీనగర్, అశోక్‌నగర్, సంజీవనగర్,

ఇతరులకిస్తాము. ఈ అమ్మ అన్నం వడ్డించుకొని వారి దగ్గరికి తీసుకెళ్ళి ఇంటింటికీ మనిషి మనిషికీ పంచింది. అందరి తల్లి గదా!

జంటనగరాలకు అమ్మ వేంచేసిందని తెలిసిపోయింది. జనానా, ఉస్మానియా, ఫీవర్, క్యాన్సర్, మెంటల్, టి.బి., కళ్ళు, కుష్టు, ప్రకృతి చికిత్సాలయం మొదలగు ఎన్నెన్నో ఆసుపత్రులను అమ్మ చూచింది. నిలోఫర్ ఆసుపత్రిలో గర్భవతులను, బాలింతలను చూచి ఎంతో ఆనందించింది. కొన్ని చోట్ల అమ్మలో ఏమి చూచారో అక్కడి వారంతా ప్రణామం చేసారు.

నీలెండ్ అమ్మను చూడటానికి నెదర్లాండ్స్ నుంచి వచ్చాడు. అతడు ఆకస్మికంగా తీవ్రవ్యాధికి గురైనాడు. హైద్రాబాద్ సెయింట్ థెరిస్సాస్ ఆసుపత్రిలో చేరాడు. అక్కడ చికిత్సలన్నీ విఫలమైనాయి. అతనికి అవసానకాలం సమీపించింది. జిల్లెళ్ళమూడి నుంచీ అమ్మ తీర్థం, ప్రసాదం పంపింది. అతడు పునర్జన్మ పొందాడు. నీలెండ్ బ్రతకటమనేది అతనికి వరప్రసాదం, అక్కడ డాక్టర్లకు అర్థంగాని అద్భుతం. నీలెండ్‌ను చూడటానికే అమ్మ వెళ్ళినా అక్కడి డాక్టర్లు, రోగులు అందరూ కలిసి అమ్మకు స్వాగతం చెప్పారు.

తనకు ప్రాణభిక్ష పెట్టిన అమ్మను చూసిన నీలెండ్ హృదయం కృతజ్ఞతతో, ప్రేమభావంతో నిండిపోయింది. అమ్మను అమాంతం కౌగిలించుకున్నాడు. ఆ దివ్య స్పర్శతో అతడి మనస్సే కరిగిపోయింది. కన్నీటితో అమ్మను తడిపేశాడు. అమ్మ ఆప్యాయతతో అతడికి అరటిపండు వొలిచిపెట్టింది. అతనికి సేవ చేసిన సిస్టర్సు కూడా అమ్మ ప్రేమను పంచుకున్నారు. అమ్మవారికి ప్రసాదం పెట్టింది. అమ్మకు ఆసుపత్రిలోని అన్నిభాగాలను వివరంగా తెలియబర్చారు.

ఫీవర్ ఆసుపత్రిలో ఒక కుర్రవాడి పరిస్థితి విషమించిందని వైద్యులు చెప్పారు. అమ్మ అతన్ని స్పృశించింది. వెంటనే అతను పూర్ణారోగ్యవంతుడై వైద్యులనే ఆశ్చర్యపరిచాడు. ఆ వృత్తాంతాన్ని నలుగురికీ తెలియపరచటానికి ఎగ్జిబిషన్‌గా మరి రెండు రోజులు ఆబాలుని అక్కడే వుంచారు. ఒక ఆసుపత్రిలో ఒక డాక్టరును చాలా మంచివాడు, సమర్థుడు అన్నారు. దానికి అమ్మ "ఆదరణే సమర్థత, ఆదరణ తల్లి లాంటిది" అని తెలియచేసింది. వాత్సల్యభరితమైన అమ్మ చూపులతో రోగుల మనస్సులు స్వస్థత చెందాయి.

పర్వాదుర్గా ప్రసాదరావుగారు అమ్మ దగ్గరకు తరుచూ వస్తుండేవారు. ఆయన అనారోగ్యంతో గాంధీ ఆసుపత్రిలో చేరారు. అమ్మ వారిని చూడటానికి వెళ్ళింది. ఆయన అక్కడే అమ్మను అర్చించుకున్నారు అమ్మవారికి తీర్థం వేసింది. "అమ్మ శక్తి స్వరూపిణి నేను ఈ రోజు ఆమెను చేరుట నిక్కమని" చెప్పారు దుర్గా ప్రసాదరావుగారు, అన్న విధంగానే ఆరోజేవారు పరమపదించారు. ఆ తీర్థం కోసమే ఆయన జీవించాడా? అని అనిపించింది. అమ్మ డాక్టరు వలే వేలాది రోగులనాడి చూచింది డా॥ శివారెడ్డిగారు మరో వైద్యునితో "She is a Devine Lady" అని "ఎందరో ప్రముఖులు హాస్పిటల్‌కు వచ్చినా మీరు రావటం మహాదృష్టం" అని చెప్పారు.

అమ్మ వృద్ధుల శరణాలయానికి, గుడ్డి, మూగ, చెవిటిపాఠశాలలకు వెళ్ళింది. వారి విద్యాసౌకర్యాల గురించి విచారించింది. అమ్మ బిక్షుక శరణాలయాన్ని చూచింది. స్వేచ్ఛకు అలవాటు పడిన ఒక బిక్షకుడు తన్ను విడుదల చేయించమని అమ్మను కోరాడు.

అమ్మ చెఱసాలలోని ఖైదీలను చూచారు, నేరస్తులంతా వరుసగా కూర్చుంటే ప్రతి వరుసలో అమ్మ తిరిగి, వారిపై తన ప్రేమ వృష్టిని కురిపించింది. ఆ చూపులోని ఆర్ద్రత, అనునయం ఆదరణ, అనురాగం వారిని విచలితులను చేసినవి, ముస్లిం ఖైదీలు సైతం అమ్మకు నమస్కరించి సంబరపడ్డారు. అమ్మ దర్శన మాత్రానవారిలో పరివర్తన కలిగింది. వారందరికీ పంచి పెట్టమని ప్రసాదాన్ని అధికారులకు ఇచ్చింది.

19వ తేదీ రాత్రి కుష్టుఆసుపత్రి చూచి వారికి ప్రసాదాన్నిచ్చి రామచంద్రాపురం వెళ్ళింది. అక్కడ పూర్ణాకుంభంతో వేదమంత్రాలతో కోలాటంతో ఘనమైన స్వాగతం ఇచ్చారు. అమ్మను ఊరేగించటానికి ఏనుగును సిద్ధంచేసారు. ఫోర్క్లిఫ్టు మీదగా అమ్మ గజారోహణం చేసింది. అర్చనలు, ఆరాధనలు, క్షీరాభిషేకాలు జరిగాయి. కమ్యూనిటీహాల్, ఫుట్‌బాల్ గ్రౌండ్సులో సామూహిక దర్శనం జరిగింది.

గురుద్వారాలోని సిక్కు ఆలయం, ముస్లింల ప్రార్థనామందిరంలో అమ్మకు కుర్చీవేసి ఆసీనురాలను చేసి నమస్కరించి ప్రసాదాలను స్వీకరించారు. అందరికీ

తల్లి ఆమె. వర్గ, కుల, మత, వైషమ్యాలకు అమ్మ దగ్గరు తావులేదు కదా! బి.హెచ్.ఇ.ఎల్. ఫాక్టరీని చూచింది. సూర్యనారాయణ గారింటి పూజామందిరంలో అమ్మ కొంత తడువు వుంది. మహబూబ్ నగర్ జిల్లాలోని జడ్చర్లకు వెళ్ళి అదే రోజు హైద్రాబాద్ చేరింది.

అక్కడ నుండీ బయలుదేరి నల్గొండ జిల్లాలోని భువనగిరి, కొలను పాకలోని జైనదేవాలయ ప్రాంగణంలో వెయ్యి మందికి పైన దర్శనము కలుగచేసింది. అక్కడ నుండీ సిద్ధిపేటలో దర్శన మొసగి హైద్రాబాద్ చేరింది. 24 మధ్యాహ్నం 12 మందికి ఉపనయనాలను, నలుగురికి అక్షరాభ్యాసాలను, నలుగురికి అన్నప్రాశనలను చేసింది. పన్నాలాల్ సెట్టి గృహావరణలో సాయంకాలం ఐన్‌వాప ఉర్దూ హాలులో సుమారు 5గం॥ పాటు అమ్మను గూర్చిన గోష్ఠి జరిగింది. శ్రీపాద, వీరమాచినేని ప్రసాదరావు, డా॥ యస్.వి.సుబ్బారావు, కె. సుబ్బారావు, పొత్తూరి వెంకటేశ్వరరావు తదితరులు ప్రసంగించారు. అంతసేపు అమ్మ ఓపికగా వున్నది. సంజీవరెడ్డి కాలనీలో సామూహిక దర్శనం ఇచ్చింది. ఆర్.ఎస్.యస్. కార్యలయాన్ని పావనం చేసింది.

30వ తేదీ మౌలాలీ కాలనీలో సామూహిక దర్శనమిచ్చి జూలాజికల్ పార్క్‌ను చూచింది. 1వ తేదీ కిద్వాయిగార్డెన్స్‌లో ఆహ్వాన సంఘ కార్యకర్తలతో గడిపి, 3వ తేదీ బయలుదేరి 12.50ని॥ లకు జిల్లెళ్ళమూడి చేరింది అమ్మ.

ఈ పర్యటనలో నేరస్తులు, వికలాంగులు, అంధులు, అనాధలు, భిక్షకులు, వ్యాధి పీడితులను ఎందరెందరినో అమ్మ అనుగ్రహించటం ప్రత్యేక విశేషం, కన్నతల్లిలా కాపాడ వలసిన ప్రభుత్వ అలక్ష్యం వల్ల దుర్భర జీవితం గడుపుతున్న సమాజ సౌభాగ్యానికి కారకులైన పేదలవాడలను, కార్మిక వాడలను అమ్మ చూడటంతో మరింత ప్రత్యేకత సంతరించుకున్నది. అమ్మ వర ప్రదాయిని, అనుగ్రహ కారిణి, పరమానంద స్వరూపిణి, కనుకనే వారి కామనలకు, భవిష్యత్తుకు, సుఖశాంతులకు, అమ్మ అనుగ్రహించిన యీ తరుణం శుభకరమైనది. అనురాగ మమకారలు కన్నతల్లి కరుణాతరంగం నుండి వడివడిగా సాగి వారిని పరమానంద భరితులను చేసి వారి హృదయాంతరాళములలో చెరగని ముద్ర వేసింది.

1974 మార్చి 9వ తేదీ తెలంగాణాలోని వివిధ ప్రాంతాలకు, తృప్తిని, శాంతిని ప్రసాదించే నిమిత్తం అమ్మ తన పరివారంతో ప్రయాణమైంది. నందిగామలో సంకర వెంకటరమణరావు గారింట విశ్రాంతి తీసుకొని దొర్నకల్ చేరింది. పచ్చనితోరణాలతో చూడ ముచ్చటగా వూరంతా అలంకరించారు. కళావిలసితము, కమనీయమైన మూడు ప్రవేశ ద్వారాలను అమ్మ స్వాగతానికై నిర్మించారు. అమ్మ సూక్తులను రాసిన అట్టలను అమర్చారు. అమ్మ దర్శనంతోనే వారికి ఎనలేని సంతృప్తి కలిగింది.

వరంగల్‌లోని అజాంజాహి మిల్లు ఆవరణలో అమ్మ దర్శనమిచ్చింది. 60వేలమంది అమ్మను దర్శించారు. ప్రశాంతత, దివ్యత్వం, మాతృత్వం ముప్పిరిగొని వారిని మహదానందంలో నింపింది. బి.రామరాజుగారు మాట్లాడుతూ ఓరుగల్లు మండలవాసులకు ఇది అపూర్వ అవకాశం. అమ్మ కరుణామయి, కనుకనే రాలేని అసంఖ్యాక బిడ్డలను చూచే నిమిత్తం అనుగ్రహ ప్రసారం చేసేందుకు మనమధ్యకు వచ్చింది అన్నారు. వీరమాచనేని ప్రసాదరావుగారు "మనందరం మన అమ్మలను ఎరుగుదుమా ఈమె ఉపన్యాసాలు చెప్పక, చేసి చూపిస్తుంది. ఇంతమంది అమ్మ దర్శనాన్ని వాఛించటంలో సాంఘిక ప్రయోజనం నిశ్చయంగా వుంది. మనందరం సమాజ పరివర్తనను కోరుకుంటాం. నవసమాజ నిర్మాణాన్ని వాంఛిస్తాం, కుల మత, వర్గ, వర్ణ, విచక్షణలేని నూతన చైతన్యాన్ని అర్కపురిలో చూస్తాం. అందరికీ సమ్మతమైనదే మతమట. "నీకున్నది తృప్తిగా తిని నలుగురికి ఆదరణగా పెట్టమనటమే అమ్మ సందేశం." పుణ్యా పాపప్రభంజనాల నుండీ కాపాడుతూ మానవాళికి సర్వమూ బ్రహ్మయని ఉద్ఘాటిస్తూ సహనం కన్న వరం లేదని ప్రభోదిస్తూ తప్త హృదయాలకు సుధాచంద్రికలను ప్రసారం చేస్తున్నదీ తల్లి.

వాత్సల్య యాత్రలో భాగంగా అమ్మ మద్రాసు చేరింది. అనంతాకాశ ప్రాంగణంలో ఆనందంతో వూగులాడే పుష్పానికీ, ధరిత్రీమాత గర్భంలో నిక్షిప్తమైన బీజము అదృశ్యరూపంలో వుంటుంది. 24-3-75 న 8-30 ని॥లకు చిల్డ్రన్

గార్డన్ స్కూలులో అసంఖ్యాక నరనారీ జనసందోహానికి అమ్మ ఎత్తైన వేదిక మీద మూర్తీభవించిన అధ్యాత్మికతగా, మహోన్నత తత్వవేత్తగా, అతిలోక మాతృమూర్తిగా, దివ్యమంగళ వాత్సల్యమూర్తిగా దర్శనం ప్రసాదించింది. ప్రజలు నిశబ్దంగా అమ్మ మౌనవాణినే వింటున్నారో, అత్యద్భుత తేజస్సునే కంటున్నారో, అనంతశక్తినే చవిచూస్తున్నారో చెప్పటం కష్టం. అమ్మ అచ్యుతరామ్‌గారి ఇంట విడిది చేసింది.

25వ తేదీ ఉదయం 9గం॥ నుండి 12 గం॥ల వరకు, సాయంకాలం 6గం॥ల నుండి 9 గం॥ల వరకూ లాయిడ్స్ రోడ్డులోని హేమమాలినీ కళ్యాణ మంటపంలో అమ్మ దర్శనం ఇచ్చింది. విశేషమైన ఆ జనం మధ్యలోకి అమ్మ వెళ్ళి నలువైపులా కలయ చూచేది. అమ్మ ఎటు చూస్తే అటు జనం హర్షపులకితులయ్యారు. వారి కన్నులు ఆనందాశ్రువులతో నిండిపోయేవి. వారి అంతరంగాలు సంతోషం తరగింతమయ్యాయి. జనం కూడా మౌనంగానే తమ లక్షలాది విన్నపాలను విన్నవించారు. వారిని అమ్మ తన చూపులతోనే స్వీకరించి చూపులతోనే ఆశీర్వదించేది. ఒక్కసారి అమ్మ చూపుసోకిన జనత పరవశించేది. వారి కన్నులు సజలమయ్యాయి. చేతులు ముకుళించి నమస్కరించారు. వారి మనస్సులు ఎనలేని హాయితో ప్రపూర్ణమయ్యాయి. వారి హృదయాలు రాగరంజితం అయ్యాయి. బారులు తీరిన జనం మధ్యలోకి అమ్మ చొచ్చుకు పోయి ఆమె దయార్ద్రదృక్కులతో వారిని స్పృశిస్తూ, అభయమిస్తూ, అనున ఇస్తూ మందగమనమై అందరి విజ్ఞాపనలను అందుకొని శుభాశీస్సులను అందచేసింది.

ఉదయం వచ్చిన అందరికీ పాదదర్శన భాగ్యం కలిగింది. నిత్యం వాడుకునే అనేక వస్తువులను, ఆభరణాలను, మంగళసూత్రాలను అమ్మను తాకి ఇమ్మని కోరేవారు. ఎవరెట్లా కోరితే అలావారిని తృప్తి పరచేది. దంపతులైన అనేకులకు తనమెడలోని మాలను వేసి వారిని ఒకటిగా చేర్చేది. ఒకే పరిధిలో ఒకరికొకరు తోడునీడగా జీవనం గడపమని అమ్మ ఉపదేశిస్తోందా అన్నట్లుండేది. వారి వారి విద్యలను అమ్మ ఎదుట ప్రదర్శించి తమ జన్మ చరితార్థమయిందనుకున్నారు.

తమిళనాడు భక్తి భావపునీతమైన ప్రాంతం. మార్గమంతా అమ్మ మీద పుష్ప వృష్టి కురిపించేవారు. మంగళ తోరణాలు, మంగళ కలశాలతో దీపమాలికలతో అమ్మకు గృహిణులు స్వాగతం పలికారు. అమ్మను సందర్శించిన వారిలో, కళారాధకులు, ఉన్నతోద్యోగులు, రాజకీయనాయకులు, సాధు సత్పురుషులు, యతులు, జిజ్ఞాసువులు, వైజ్ఞానికులు, విమర్శకులు ఎందరెందరో వున్నారు. 27వ తేదీ పత్రికా విలేఖరుల గోష్టి జరిగింది. విలేఖరులంతా కలసి క్షామ పీడతమైన తమిళనాడుపై వర్షం కురిపించమని వేడుకున్నారు. "మీకు శిష్య కోటి ఉన్నారా?" అని ఒక విలేఖరి అడిగాడు. దానికి అమ్మ "నాకు శిష్యకోటి లేదు? శిశుకోటి మాత్రమే" అని తెలియచేసింది.

మీ సన్నిధికి విదేశీయులెందరో వస్తున్నారు. వారికున్న మతాన్ని వదిలి ప్రత్యేక మతాన్ని అవలంభిస్తున్నారా? అని ఒక విలేఖరి అమ్మను ప్రశ్నించాడు. దానికి అమ్మ వారి మతాన్ని గూర్చికాని, వారి అభిమతాన్ని గూర్చి కాని, నాకాలోచన లేదు. వారికి ఏది తృప్తినిస్తుందో వారికి ఏది ఉపకరిస్తుందో వారికి కావలిసిన వసతి చూపడము, ఆకలి అయినప్పుడు వారికి అన్నం పెట్టడం ఇవే నాకు తెలుసు" అని బదులిచ్చింది. "ప్రేమకు, ఆరాధనకు తేడా వుందా?" అని అడిగారు. దానికి అమ్మ "ప్రేమలో ఆరాధన, ఆరాధనలో ప్రేమ ఉన్నాయి. పిల్లవానిపై చూపేది ప్రేమ విగ్రహం చూపేది ఆరాధన" అని చెప్పింది అమ్మ. తెలిసి తప్పెందుకు చేస్తాము? అన్నాడు ఒక విలేఖరి. "తప్పని తెలిసి, తప్పించుకోలేక తప్పనిసరై తప్పు చేస్తావు. ప్రత్యేకించి వేరే కారణం లేదు. నీవు కారణం కాదు. నీవు చేయడం లేదు. కాలమే కాని నీవు కారణం కాదు. కాలమంటే దైవమే నీకు కర్తృత్వం లేదు. దైవమే కారణము" అని విపులీకరించింది అమ్మ. తమిళనాడు పర్యటించినట్లుగానే భారతావని అంతా మీ పాద స్పర్శతో పునీతం చేయాలని వేడుకున్నారు.

అమ్మ విలేఖరులందరికీ గోరుముద్దలు తినిపించింది. ఆ ప్రసాదం తినిపించే తీరు చూస్తే వారి మనస్సులను క్షాళన మొనరించి జ్ఞానాన్ని ప్రసాదించి, ప్రేమను ప్రసారం చేసి, విశ్వాత్మ కార్యకలాపాలలో వారికి అవకాశం కలిగిస్తున్నదా!

అనిపించింది. 28వ తేదీ జరిగిన సదస్సులో సర్వ శ్రీ యు.యస్. పార్ధసారధి, టి.వెంకటేశ్వర్లు, డా॥యన్. కె. నాయర్, కె.వి.జగన్నాధం, డా॥ శ్రీపాదగోపాలకృష్ణమూర్తి, డా॥ యస్.వి.సుబ్బారావు, డా॥ వి.యస్. శర్మ మొ॥ వారు తమ తమ అనుభవాలను వెల్లడించారు.

అమ్మ వసుధైక కుటుంబం యొక్క ఆదర్శాన్ని వ్యక్తం చేస్తుంది. ప్రతి వ్యక్తి ఆమెకు బిడ్డే, ఇతరుల కష్ట సుఖాలన్నీ ఆమెవే. సర్వాన్నీ ఈశ్వరుడుగానే భావిస్తుంది. అమ్మ అడుగడుగున జ్ఞాన ప్రేమల ద్వారా అందరి హృదయాలను తాకుతుంది. వేదాంతాన్ని సామాజిక జీవనములో ప్రవేశపెట్టి విప్లవ నిర్మాణానికి కొత్త మార్గాలను ప్రవేశపెట్టింది. హృదయాలను జయించేశక్తి శాస్త్రాలలో కాక ప్రేమలో ఉందని అమ్మ నిరూపించింది.

31వ తేది తిరువత్తూరు వెళ్లింది. క్షామ పీడిత ప్రాంతం. అక్కడి జనులు ఆకులు, మట్టి తినటం చూచి వ్యధ చెందింది. ఆ రాత్రి హేమ మాలినీ కళ్యాణమండపంలో విడిది చేసింది. 2వ తేదీ రెంటచింతల పేరయ్య శాస్త్రిగారి తోట చూచి, తోటకూలీలు నివసిస్తున్న పాకలోకి వెళ్ళి, కుతకుత ఉడుకుతున్న అన్నమును గరిటెతో తిప్పి వారిని ఆనందపరిచింది.

ప్రముఖ సంగీత దర్శకుడు యస్. రాజేశ్వరరావు అమ్మను 1935లో దర్శించినట్లు చెప్పారు. పుత్ర నష్టమైన అల్లురామలింగయ్య, వారి భార్యను అమ్మ ఓదార్చింది. "ఆదిశంకరులు వదిలి వేసిన విషయాలను పూర్తి చేసి అమ్మ సంపూర్ణత్వం చేకూర్చింది" అని మాజీ ఛిఫ్ జస్టిస్ డా॥ పి.వి. రాజమన్నార్‌గారు అన్నారు. శ్రీమతి మాలతీ చందూర్ అమ్మలోని పూర్ణమానవత్వానికి ముచ్చటపడుతూ "ఇన్నాళ్ళూ నీవు నాకు తెలియదు, నేను ఇంక నిన్ను వదులుకోలేనని" చెప్పింది. కీర్తిశేషులైన ఎస్.వి. రంగారావుగారి ఇంటికి వెళ్ళింది అమ్మ. సుశీల, జానకి వారి గానంతో అమ్మను పరవశింపచేసారు. 11వ తేదీ శ్రీమతి కె. లక్ష్మీరాజ్యం, ఆంధ్రప్రభ ఎడిటర్ విద్వాన్ విశ్వంగారింట అమ్మకు అర్చన జరిగింది.

మానవశక్తికి ఒక హద్దు ఉంటుంది. అది భగవంతునికి తెలుసు, ప్రకృతిసౌందర్యంతో పాటు మానవ వికృతిని కూడా అనేకచోట్ల చూస్తుంటాం. జగత్తులో ఈ రెంటి మధ్య జరిగే పోరాటమే చలం హృదయంలో కూడా బయలుదేరింది. చలంగారి జీవితంలో జరిగే ప్రతి చిన్న సంఘటనవారి జీవితవీణ తంత్రులను మ్రోగించడం ఆరంభించింది. అమ్మను చూడగానే వారి మదిలో ఏదో మధురభావము ఉత్పన్నమైనది. వారి సాహిత్యం భావ ప్రధానమైనదే కాక మనోరంజకమై సత్సందర్శనానికీ గీటురాయిగా నిలిచింది. సాహిత్యోపాసన చేసిన మహనీయులు గుడిపాటి వెంకట చలం.

చలంగారికి అరిటిపండు తినిపించి ఒడలు నిమిరి నూతన వస్త్రాలను ప్రసాదించింది అమ్మ. అమ్మ తిరిగి వస్తున్న సమయంలో ఆయన "వృద్ధుడను, లేచి తిరగలేని వాడనని అమ్మే నాదగ్గరకు రావటం నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. అమ్మ ఎట్లా వచ్చినా, ఎందుకు వచ్చినా, ప్రత్యేకత సంతరించుకొని తన సందేశాన్ని జగత్తుకు చాటటానికే అవతరించింది". జ్ఞానం, వెలుగు మరుగున పడినప్పుడు ఈ భూమిపై అవరిస్తానన్న గీతాచార్యుని మాట నిజమైంది. అలాంటి వారిని గుర్తించటం కష్టం, గుర్తించలేని నాబోటి మూర్ఖుల సన్నిధికి గుర్తు తెలియు చేయటానికి రావటం మరీ విశేషం. నేనెన్నో సంవత్సరాలు ఈశ్వరాన్వేషణ చేసాను. ఈనాడు ఏడిరా? నీ ఈశ్వరుడు అని ఎవరైనా అడిగితే చెప్పడం సులభం, చూపించటం అంతకంటే సులభ"మంటూ అమ్మకు ప్రణామం చేసారు చలంగారు.

అమ్మ **1975** ఏప్రిల్ **13**వ తేదీన తిరువణ్ణామలైలోని రమణాశ్రమాన్ని సందర్శించింది. శ్రీ రమణుల సమాధి శిల్పకళలకు ఉత్తమమైన నమూనా, రమణాశ్రమ వాసులు అమ్మకు స్వాగతం ఇచ్చేవేళ ఆశ్రమంలోని నెమళ్ళు పురివిప్పి నాట్యం చేసాయి. సాధారణంగా మబ్బు పట్టినప్పుడే నెమళ్ళు నాట్యం చేస్తాయి. అమ్మ సాన్నిధ్యం వాటికీ ఆనందం కలుగచేసి వుంటుంది. ఎందరో సాధకులు అమ్మను దర్శించుకున్నారు. అచ్చట వున్న విదేశీయులందరికీ అమ్మ బొట్టు పెట్టి ప్రసాదం ఇచ్చింది.

అక్కడ నుంచీ కంచి పక్కనే ఉన్న కలవాయ్ గ్రామంలో వేంచేసి వున్న శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామివారికి దర్శనమివ్వడం కొరకు రాత్రి **11.30**

ని॥లకు అమ్మ వెళ్ళింది. మఠంలో వారు పరమాచార్యులవారి దర్శనానికి వచ్చారనుకొని రాత్రి స్వామి దర్శనం ఇవ్వరని ఉదయమే రావలసినదిగా కోరారు. ఆ విషయాన్ని అమ్మకు నివేదించారు. "నేను వచ్చాననిస్వామి వారికి చెప్పమని అమ్మ కబురుచేసింది. అమ్మ ఆమాట అనడమేతడువుగా స్వామి వారు దండక మండలాలతో వచ్చి వాటితో సహా చేతులు శిరస్సు పైకిఎత్తి అమ్మకు దండ ప్రణామం చేసారు. దాదాపు 20 ని॥లసేపు స్వామి వారు అలాగే నిలబడివున్నారు. అమ్మవారిని, వారు అమ్మని అనిముషులై ఒకరినొకరు పరికించుకున్నారు. ఆచూపుల్లో ఏమి సందేశాలు అందాయో వారికే ఎరుక.

అమ్మతో కూడా వెళ్ళినవారు "ఆయన వయోవృద్ధులు వారిని కూర్చోమని చెప్పమన్నారు. దానికి అమ్మ" వాడు ఏ అమ్మవార్ని ఆరాధిస్తున్నాడో ఆమేనని నాకు నమస్కరిస్తున్నాడు అని, నేను ఇక్కడ వున్నంతకాలం వాడు కూర్చోడు వచ్చినపని అయింది మనమే వెళ్దామని స్వామివారికి ఆశీస్సులనిచ్చి అమ్మ తన ముందు యాత్రకుపక్రమించి మద్రాసు చేరింది.

శ్రీ స్వామివారు 1908 సం॥ వారి పదమూడవ ఏట సన్యసించారు. ఆనాటి నుండీ ఆయన మానవ మాత్రులకు నమస్కరించి ఎరుగరు. ఒక్క అమ్మకూ నమస్కరించటంతో అమ్మ అవతారమూర్తి అని అవగతమవుతోంది. ప్రపంచమంతా అపర శివావతారంగా పరిగణించే శ్రీ పరమాచార్యులవారు అమ్మకు చెయ్యెత్తి దండ ప్రమాణం చేసారంటే అమ్మ పరదేవత, జగజ్జనని కాక మరిఎవరు? ఆది శంకరులు తన సౌందర్యలహరి శ్లోకంలో వర్ణించినట్లు

శ్లో॥ భవానిత్వం దాసేమయి వితర దృష్టిం సకరుణాం
ఇతిస్తోతుం వాంఛనేకథయతి భవానిత్వమితియః
తదైవత్వం తస్మైదిశసి నిజసాయుజ్యపదవీం
ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుటమకుట నీరాజితపదామ్॥

ఆ ఆశ్రమం నుండీ అమ్మ మద్రాసుకు వెళ్ళి 14వ తేది కూడా అనేకులకు తన దర్శన భాగ్యం కలుగచేసి అక్కడి నుండీ నెల్లూరు వెళ్ళి ఏప్రిల్ 16వ తేదీ రాత్రికి జిల్లెళ్ళమూడికి చేరింది అమ్మ.